




టితో తృప్తినొందక "నవ్యాంధ్రము" అను పదమును నామకరణముచేసియున్నారని భావించుచున్నాను. ది వ్యక్తి చరిత్ర గాక, నవ్యాంధ్రచరిత్రగా పరిగణింపబడ యున్నది.

నిస్వార్థ సేవాపరాయణులగు శ్రీ పంతులుగారు తమ జీవితకాలమున పనిచే కార్యక్షేత్రము అసాధారణ వైశాల్యము కలిగియున్నది. రాజకీయాం

# తొలిపలుకు

ఆంధ్ర నాయకాగ్రేసరులలో సుప్రసిద్ధులును, నాకు గురుతుల్యులు నగు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారి "నా జీవితకథ - నవ్యాంధ్రము" అను సద్గ్రంథమునకు తొలిపలుకు వ్రాయు భాగ్యము నాకు కల్గినందున, నన్ను నేను ధన్యునిగా భావించుచున్నాను.

ఈ గ్రంథమున శ్రీ పంతులుగారు తమ జీవితకథతోబాటు, ఆయా సందర్భములకు సంబంధించిన ఆంధ్రదేశములోని ప్రజాహితములగు ఇతర ఉద్యమములను, వానితోడి సంబంధముగల మహావ్యక్తులను గురించిన ముఖ్యవిశేషములను కూర్చియున్నారు. ఇందువలన గ్రంథము పెద్దదైనను, ఆధునిక ఆంధ్రదేశమున జరిగిన యెన్నియో మహత్కార్యములు దీనిలో వర్ణింపబడియున్నవి. ఇది మనదేశపు జిజ్ఞాసువులగువారికి గొప్ప ఉపకారముగ పరిణమించుననుట నిశ్చయము. ఇట్టి వివిధ ఉద్యమముల వివరణము ఈ గ్రంథమున రాకుండినచో ఎన్నియో ముఖ్యాంశములు, మహాపురుషుల సేవావిశేషములు, జనుల స్మరణను వదలియుండును. అట్టిది జరుగకుండ వానినన్నింటిని గ్రంథస్థముచేసిన శ్రీ పంతులువారి దూరదృష్టి ప్రశంసనీయము. ఇట్టి మహోద్దేశ్యమును పూనియే వారు ఈ గ్రంథమునకు "నా జీవితకథ" అని పేరిడుటతో తృప్తినొందక 'నా జీవితకథ' అను శబ్దముతోబాటు "నవ్యాంధ్రము" అను పదమును జోడించి విపులముగ నామకరణముచేసియున్నారని భావించుచున్నాను. ఈ విధముగ ఇది వ్యక్తి చరిత్ర గాక, నవ్యాంధ్రచరిత్రగా పరిగణింపబడ దగియున్నది.

నిస్వార్థ సేవాపరాయణులగు శ్రీ పంతులుగారు తమ జీవితకాలమున పూనిన కార్యక్షేత్రము అసాధారణ వైశాల్యము కలిగియున్నది. రాజకీయాం

కోశనము మాత్రమే కాక సంఘ సంస్కారోద్యమము, సారస్వతసేవ, హరిజనోద్ధరణము, విశాలాంధ్రోద్యమము — ఇవియవి యననేల — ఆంధ్ర దేశాభ్యుదయమునకు సంబంధించిన సర్వవిషయములందును త్యాగభావముతో సేవచేసి వీరు కృతకృత్యులైరి. తాము పూనిన కార్యములలో గట్టి పట్టుదలతో నిలువబడి, వచ్చినకష్టములనన్నింటిని ధైర్యముతో నెదుర్కొని శ్రమలను, నష్టములను భరించిన వీరి శీలము ఎంతయు ప్రశంసార్హముగా నున్నది. వీరి జీవితకథ ఆంధ్ర వాచక ప్రపంచమునకు అత్యంత ఉత్తమ మార్గదర్శకమును, గుణపాఠ బోధకమును నైయుండగలదని నా విశ్వాసము. సహజమగు సులభ శైలిలో, విజ్ఞానప్రదముగ రచింపబడిన యీ గ్రంథమును దేశీయులు చదివి, లాభము పొందెదరు గాక!

తొలిపలుకు వ్రాయు గౌరవము నాకొసగిన గ్రంథప్రకాశకులకు కృతజ్ఞుడను.

'ఆంధ్ర కుటీర్'
హనుమాన్ టెక్డి,
హైదరాబాదు.
తే. 14-3-1959.

విధేయుడు,

మాడపాటి హనుమంతరావు.

# ఉపోద్ఘాతము

నా జీవితకథ - నవ్యాంధ్రము అను గ్రంథముయొక్క మొదటి సంపుటమును రచించి ఆంధ్రమహాజనులకు సమర్పించుచున్నాను. నాకిపుడు డెబ్బదియెనిమిదేండ్లు నిండినవి. నా జీవితకాలము ఆంధ్రదేశములో మత సాంఘిక రాజకీయార్థిక విప్లవములు జరిగి నవ్యాంధ్ర మేర్పడిన కాలము. నేను జన్మించకముందు కొన్నిసంవత్సరములకుపూర్వమే కందుకూరి వీరేశలింగంగారు మత సాంఘిక విప్లవమును లేవదీసి నవీనాంధ్రపిత యని పేర్గాంచినారు. వారి పరిచయభాగ్యముకూడ నాకు కలిగినది. నేను పుట్టిన నాలుగేండ్లకు ఇండియన్ నేషనల్ కాంగ్రెసు స్థాపితమైనది. నా విద్యార్థిదశలో గొప్ప భగవద్భక్తుడు మహా సంస్కర్తయగు రఘుపతి వెంకటరత్నంనాయుడుగారి శిష్యత్వము లభించినది. ఆ కాలమునందే సంఘసంస్కర్తలు, వైజ్ఞానికసంపన్నులు, త్యాగధనులునగు ఉన్నవ లక్ష్మీనారాయణ, కొమర్రాజు లక్ష్మణరావుగార్ల స్నేహము కలిగినది. విద్యార్థిదశను ముగియగనే కాంగ్రెసులో చేరి దానియొక్క మహానాయకుడైన బాలగంగాధర తిలకుగారినాయకత్వమున మాతృదేశ స్వతంత్రసంపాదనోద్యమములో పనిచేయసాగితిని. 1919 వ సంవత్సరమునుంచి మహాత్మా గాంధీగారి శిష్యుడనగు మహాభాగ్యము నాకు కలిగెను. విచ్ఛిన్నమైన ఆంధ్రజాతియొక్క ఐక్యతను, పునర్వికాసమును, వ్యక్తిత్వమును పునరుద్ధరించిన ఆంధ్రోద్యమములోను, విశాలాంధ్రోద్యమములోను కొంత సేవచేయు అవకాశము నాకు ఏర్పడెను. దేశస్వతంత్రము, విశాలాంధ్రస్థాపనము స్వయముగచూచి అనుభవించు అదృష్టము నాకు లభించెను. కావున భావితరములవారికి ఆంధ్రదేశములో జరిగిన విప్లవములనుగూర్చియు, వాటిని నడపిన నాయకులనుగూర్చియు, వాటిలో నాకుగల యనుభవములనుగూర్చియు క్లుప్తముగ తెలుపు నుద్దేశ్యముతో నీ గ్రంథమును వ్రాసితిని. ఈ ప్రథమ సంపుటములో నా జీవితపు మొదటి యేబదియేండ్ల యనుభవము లున్నవి. దీనిని గాంధీమహాత్ముని నాయకత్వమున జరిగిన ఉప్పుసత్యాగ్రహమువరకు తీసుకొనివచ్చినాను. ఈశ్వరసేవయే నా జీవితధర్మముగ నెంచి దానిని నిర్వర్తింపు పంథాగానే దేశసేవను ఉడుతాభక్తిని గావించితిని. మతము వేరు, రాజకీయము వేరు అని నమ్మువాడనుగాను. జీవయాత్ర మతధర్మముగనే సాగించవలెను. దీనికంతకు ఆదర్శపురుషుడు మహాత్మా గాంధీ, ఆయన

శ్రీరామునివలెను, బుద్ధభగవానునివలెను, ఏసుక్రీస్తువలెను, మహమ్మదు ప్రవక్తవలె ధర్మసంస్థాపనకొరకు అవతరించిన అవతారమూర్తియని నా మత నమ్మకము. స్వతంత్రసంపాదనము, రాజ్యనిర్వహణము ధర్మసంస్థాపనకొరకే అయ్యున్నవి. మహాత్మాగాంధీయొక్క జీవితము వారిబోధలు మాత్రమే మానవకళ్యాణమునకు సాధనములై యున్నవి.

ఇది ఆంధ్రులకు కొంతవరకైన యుపయోగపడినదని తలచినచో రెండవసంపుటమును వ్రాసి ప్రచురించదలచినాను. అందులో స్వతంత్ర పోరాటవిజయము, విశాలాంధ్రస్థాపనము రాగలవు. నా గ్రంథరచనలో గొప్ప లోప మేమనగా నే నెప్పుడును దినచర్యలను వ్రాసుకొనలేదు. నాజ్ఞాపకము మీదనే ఈ కథ వ్రాసినాను. డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు రచించిన కాంగ్రెసుచరిత్ర అఖిలభారత ఘట్టములను, వాటి తేదీలను జ్ఞాపకముచేసుకొనుటకు మిగుల యుపయోగపడినది. కాని దానిలో ఆంధ్రులు నడపిన యుద్యమములనుగూర్చికాని,చేసిన త్యాగములనుగూర్చి కాని ఎట్టి తబిసీళ్ళు లేవు. కేవలము ఆంధ్రజాతిలోకలిగిన నూతనచైతన్యము, విప్లవములను గూర్చియే నా కథను పరిమితముచేసినాను. అవసరమైనచోట్ల అప్పటి అఖిల భారతకథను ప్రాతిపదికగ మాత్రమే తీసుకొన్నాను. ఈ పుస్తకము నే నను కొనినదానికంటె చాల పెద్దదైనది, నేను వ్రాసినదానిని తగ్గించుటకు ప్రచురణ కర్తలగు ఆదర్శగ్రంథమండలి సంపాదకులు గద్దె లింగయ్యగారు సమ్మతించ లేదు. నేను వ్రాసినదానినంతను వారు ప్రచురించినారు. ప్రూఫులుకూడ నాకు శ్రమ లేకుండ వారే దిద్ది త్వరితముగ ప్రచురించినందుకు నేను మిగుల కృతజ్ఞుడను. రెండవసంపుటము నింతకంటె చిన్నదిగ వ్రాయుటకు ప్రయత్నించెందను. ఈ మహోదయయుగపు ఆంధ్రదేశచరిత్రను సమగ్రముగ తెలుపుటకు నాయకులు తమ తమ అనుభవములనుగూర్చి వ్రాయుట అవసరమని తలచుచున్నాను.

పూజ్య నాయకులైన శ్రీ మాడపాటి హనుమంతరావుపంతులుగారు తమ అమూల్యమైన పీఠికనువ్రాసి ఈ గ్రంథమునకు గౌరవమును చేకూర్చినందుకు కృతజ్ఞతను వెల్లడించుచున్నాను.

నాగార్జున విహార్, హిమాయత్‌నగర్,
హైదరాబాదు.
10-3-59

అయ్యదేవర కాళేశ్వరరావు.

## వి ష య సూ చి క





## చి త్ర ము ల సూ చి క

ప్రభుత్వమువారి పటాలము లా రోడ్డుమీదుగ బోవుచు మా గ్రామములో మకాముచేసేవి. పటాలపువారినిజూచి ప్రజలు, ప్రభుత్వపుటుద్యోగస్థులుకూడ భయపడుచుండేవారు. వారు ప్రజలను కొట్టి దోచుకొందురనియు, స్త్రీలను మానభంగముచేయుదురనియు భయ మపు డుండేది. అందుచే స్త్రీలు గృహములందు దాగుకొనేవారు. పటాలపువారికి ప్రజలయెడల నేమాత్రము సానుభూతి లేకుండెను. ముఖ్యముగా తెల్లసిపాయిలు మన ప్రజలను మాన వుల క్రింద లెక్కకట్టలేదు. మదరాసులో సముద్రతీరమున రాత్రిపడగానే తెల్లసిపాయిలు మన స్త్రీలమీద జగిపిన దౌర్జన్యాలనుగూర్చి చాలకాలము వరకు వినుచుండేవారము.

నందిగామపరగణాకు వాసిరెడ్డి వేంకటాద్రినాయుడుగారికి 1802 వ సంవత్సరములో బ్రిటిష్ప్రభుత్వముచేత జమీందారీ సనదు ఇవ్వబడినది. ఆయన గుంటూరు జిల్లాలోని చింతపల్లిలోను, అమరావతిలోను వుండే వారు. ఆయన నందిగామలో నొక కోటను కట్టించెను. 1810 వ సంవత్సర మున నొక పిండారిదండు ఉత్తరహిందూస్థానమునుండి బయలుదేరి త్రోవ లోని గ్రామములను దోచుకొనుచు నందిగామకు వచ్చెను. వారివద్ద మిగుల వడిగాబోవు గుర్రములుండెను. అది వచ్చుచున్నదని తెలియగనే నందిగామవాసు లందరును ఆ కోటలో చేరిరి. లోపల తలుపులు బిగించబడెను. గాని పిండా రీలు కోటగోడలెక్కి లోనికి దిగి తలుపులు తీసుకొని వచ్చి ప్రజలను దోచు కొనిపోయిరి. మా తాతగారపు డొక ఏడాది వయసుగల పసివాడట. ఆ పిండారీలు ధనవంతమైన జగ్గయ్యపేటను బాగా దోచుకొనిపోయిరి. నంది గామలోని ఆ కోటను వేంకటాద్రినాయుడుగారి వారసులు బాగుచేయించక వదలిపెట్టినందున శిథిలమైపోయినది. నా చిన్నతనములో గోడలు కూలి పోయిన శిథిలములే యుండెను. వాటిలో కంచెలు మొలచెను. అందరును పాయిఖానాగా వాడిరి. పిమ్మట నొక తహసీలుదారు దానినంతను చదరము చేయించి మార్కెటును కట్టించెను. మిగిలిన ఖాళీస్థలములో ఇండ్లు కట్టు కొని ప్రజలు కాపురమున్నారు. మా గ్రామమునకు పదునైదు మైళ్ళదూరము లోనున్న కృష్ణరేవు దాటినయెడల నావల అమరావతి యున్నది. అమరావతి శాలివాహనచక్రవర్తుల క్రింద ఆంధ్రసామ్రాజ్యమునకు రాజధానిగను, అఖండ విజ్ఞానజ్యోతిగా విలసిల్లిన విశ్వవిద్యాలయపు స్థానముగను రెండు

వేలయేండ్ల క్రిందట జగత్ప్రసిద్ధిపడసిన నగరరాజము. అచటి శిథిలములలో దొరకిన శిల్పకళాశకలములు నేటిప్రపంచమున కచ్చెరువు కలుగచేయు చున్నవి. అమరావతికి ధరణికోటయనికూడ పేరుండెను. వేంకటాద్రి నాయుడుగారు ఆంధ్రదేశములో 108 శివాలయములను ప్రతిష్ఠించినాడు. పండితులకు 107 అగ్రహారము లిచ్చినాడు. మా నందిగామలోని రామలింగేశ్వరస్వామివారి దేవాలయ మాయన ప్రతిష్ఠించినదే. దానికి చాలా యీనాము లాయన యిచ్చినాడు. ప్రతిరోజు రాత్రి బ్రాహ్మణులు స్వస్తిచెప్పెదరు. సంగీతపాఠకులు భజనచేసెదరు. వాయిద్రగాండ్రు వాయిద్యములు వాయించెదరు. భోగపు స్త్రీలు కుంభహారతులిచ్చెదరు. స్వామివారి రథోత్సవ మేటేట మాఘపౌర్ణమినాడు చాల వైభవముగ జరుగుచుండెను. ఆ యుత్సవమునకు చుట్టుపట్టుల గ్రామములనుండి వేనకువేలు ప్రజలు వచ్చెడివారు. రాండోళ్లు, సన్నాయి మేళములు, భోగముమేళములు చాలగా పెట్టేవారు. ఆ కాలములో జగ్గయ్యపేట, కొండపల్లి భోగముమేళములకు ప్రసిద్ధిగనుండెను. ఆ దేవాలయములో పెద్ద నందీశ్వరుడు ప్రతిష్ఠింపబడినాడు. అదివర కింతకన్న చాలా గొప్ప నంది యుండేదని, అది భూగర్భితమైనదని కొందరు చెప్పెదరు. మొత్తముమీద నంది గ్రామమను పేరు నందీశ్వరునిబట్టియే వచ్చిన దనుట నిస్సంశయము. వేంకటాద్రినాయుడుగారు మా గ్రామమునకు 18 మైళ్ళ దూరమున నున్న జగ్గయ్యపేటను తన తండ్రిపేర కట్టించిరి. నా బాల్యమున నది ధనవంతులగు వైశ్యులతో కళకళలాడుచు గొప్ప వర్తక స్థానముగ నుండెను. బెజవాడనుండి హైదరాబాదుకు వేరు మార్గముమీదుగా నైజాం రైల్వే పడగానే వర్తకమంతయు క్షీణించి జగ్గయ్యపేట పూర్వస్థితిని గోల్పోయినది. వైశ్యు లా కారణమున ఖమ్మంమెట్టు, వరంగల్లు, మట్టెవాడలకు చేరుకొన్నారు.

మా తాత అయ్యదేవర పురుషోత్తముగారు, నందిగామగ్రామమునకు వాసిరెడ్డివారిలో రెండవ కోవయగు ముక్త్యాల జమీందారుగారి కరణము. నందిగామ గ్రామములో రెండువంతులభాగము వేంకటాద్రినాయుడుగారికిని మూడవవంతు రెండవకోవవారైన ముక్త్యాల జమీందారుగారికిని చెంది యుండెను. వేంకటాద్రినాయుడుగారి మరణానంతరము వారివారసులు తమలో తాము వ్యాజ్యములాడుకొనుచు సర్కారుపేష్కషును చెల్లింపనం

దున నా ఋణమునకుగాను దొంగవేలములో వారియెస్టేటునంతను గుంటూరు జిల్లాకలెక్టరు బ్రిటిషుప్రభుత్వముపేర గొట్టివైచి. ప్రభుత్వపక్షమున స్వాధీన పరచుకొనెను. నందిగామ గ్రామములో రెండువంతులు బ్రిటిషుగవర్న మెంటు కైవసమయ్యెను. దానికి పెద్దవంతు అని పేరు. దానికి కూడ అయ్యదేవరవారే కరణములు. మా తాతగారు ముక్త్యాలరాజాగారికి మిగిలిన మూడవవంతగు "చిన్నవంతు"కు కరణము. అతనిని "పిచ్చయ్య" అనికూడ పిలిచేవారు. మా తండ్రి లక్ష్మయ్యగారు మా తాలూకాలోని మునగాల జమీం దారుగారివద్ద మేనేజరుగా పనిచేసినారు. మునగాల జమీందారుగారి పూర్వీకు లైన రాణీ కీసర లచ్చమ్మారావుగారు పదునెనిమిదవశతాబ్దపు చివరిభాగమున నాంగ్లేయులకును పరాసువారికిని నుత్తరసర్కారులకొరకు జరిగిన యుద్ధ ములో తనసేనలను బ్రిటిషువారిపక్షమున స్వయముగ నడిపి కీసరినదివద్ద పరాసుసైన్యముల నోడించెను. అందులకు బహుమతిగా 1802 వ సంవ త్సరమున, మునగాల పరగణాకు జమీందారీ సనదు నొసంగినపుడు ఆంగ్ల ప్రభుత్వమువారు సాలున కైదువేల రూప్యముల పేష్కషును మాత్రము కట్టియున్నారు. ప్రక్కనున్న ముక్త్యాలజమీందారుగారింతకన్న కొంచెము చిన్న జమీందారీకి ఐదునెనిమిదివేల రూప్యముల పేష్కషు చెల్లించు చున్నారు. మునగాల జమీందారీ మా నందిగామతాలూకాలో భాగమైనను అన్నివైపులను తెలంగాణముచే చుట్టుకొనబడి యున్నది. మునగాల రాజా గారి బంధువులందరు తెలంగాణములోనే యున్నారు. వారికి వరంగల్లు జిల్లాలోని తొర్రూరు, నెల్లికుదురు దేశముఖుదారీలు కూడ గలవు. మా తండ్రిగారు అచటికికూడ నపుడపుడు పోవలసియుండెను.

నాకంటె ముందు నలుగురు మగపిల్లలు మా తల్లితండ్రులకు పుట్టి మరణించినందున విరక్తిచేత నా జన్మనక్షత్రాదికము వ్రాయించుట మానిరి. పిమ్మట పెద్దలు చెప్పినదానినిబట్టి నేను విక్రమనామసంవత్సర పుష్యబహుళ సప్తమివాడు అనగా 1881 వ సంవత్సరము జనవరి 22 వ తేదీ ఉదయ మున సుమారు 5-45 గంటలకు జన్మించినట్లు నిర్ణయింపబడినది. నంది గామలోని సర్కారు ఇంగ్లీషుబడిలో చదివి తొమ్మిదవయేట ప్రైమరీపరీ క్షలో నుత్తీర్ణుడనైతిని. "ఓం నమశ్శివాయ సిద్ధన్నమః" అను నక్షరము లతో దిద్దుటతో నాడు విద్యాభ్యాసము ప్రారంభమయ్యెడిది. అప్పటిలో రాతి

పలకలు, బలపములు వచ్చినవి. తెలుగక్షరములతోపాటే నాంగ్లాక్షరము లను కూడ నేర్పుచువచ్చిరి. ప్రైమరీలోనే సుమతీశతకము, వేమనశత కము, దాశరథీశతకము, భర్తృహరిపద్యములు చదివించిరి. తెలుగుసంవ త్సరములు, మాసములు, తిథులు, నక్షత్రములు, లగ్నములు, అకరన్నకిరీ లెక్కలు మాకు నేర్పిరి. పెద్దబాలశిక్ష చదివించిరి. చక్కని దస్తూరీ కుదురు నట్లు వ్రాయించిరి. సామాన్యమైన వాక్యము లింగ్లీషునుండి తెలుగులోనికి, తెలుగునుండి యాంగ్లములోనికి భాషాంతరీకరించుస్థితివరకు నేర్పిరి. ఆ పై తరగతులు చదువుటకు నేను బెజవాడగాని బందరుగాని పోవలసియుండెను. న న్నంతదూరము పంపుటకు మా తల్లిదండ్రుల కిష్టములేకపోవుటవలన 1894 వ సంవత్సరమువరకు నందిగామలోనే యుంటిని. ఆ కాలములో మా తాతగారు నాచేత కరిణీకపు లెక్కలు వ్రాయించుచుండెడివారు. మా గ్రామ మునకు ఇరువదిమైళ్ళదూరమున నున్న కొండపల్లిలో మునల్మాను కుటుంబ ములు చేతిలో తయారుచేసిన గోధుమరంగు స్వదేశీకాగితములమీదనే యా లెక్కలను వ్రాసితిమి. కొండపల్లి రానుకొనియున్న పర్వతశ్రేణిమీద క్రీ. శ. పదునాలుగవ శతాబ్దమున అనవేమారెడ్డి గొప్ప ఖిల్లాను (కోటను) కట్టించెను. దానికి ముస్తఫాను నగరమనియు, కొండపీటిమీద కట్టబడిన ఖిల్లాకు ముర్తుజాన్ నగరమనియు పేరులుండెను. కొండపల్లి కొండమీద నిర్మింపబడిన వీరభద్రదేవాలయమున కొక అగ్రహారమును అనవేమారెడ్డి యిచ్చినటుల నొక శాసన మచట నున్నది. కొండపల్లి ఖిల్లాను కృష్ణదేవ రాయలవారు జయించిరి. విజయనగరసామ్రాజ్యపతనమునకు పిమ్మట నది గోలుకొండ సుల్తానులక్రిందకు వచ్చినది. అక్కన్న మాదన్నగార లప్పుడు అచటికి వచ్చెడువారు. కొండపల్లి ఖిల్లానుండి భూమిలో అడుగున సొరంగ మార్గమున సైన్యములు గోలుకొండకు పోవుటకు గోలుకొండదర్వాజా యని యుండెను. ఉత్తరసర్కారులతోపాటు కొండపల్లిసర్కారుకూడా ఆంగ్ల ప్రభుత్వమునకు వశమైనపిమ్మట నా దర్వాజా మూసివేయబడినది. కొండపల్లి ఖిల్లా క్రమముగ శిథిలమైనది. పర్వతములమీద నెక్కి దానిని చూచుటకు ఇప్పటికిని యాత్రికులు వచ్చెదరు. నేను పెద్ద వాడనైనపిమ్మట రెండుమూడుసార్లు పర్వతముమీదికి పోయి శిథిల మైన యా ఖిల్లాను చూచి వచ్చితిని. నా చిన్నతనమున ఆ గ్రామము

చేతికాగితముల పరిశ్రమకును, లక్కబొమ్మల పరిశ్రమకును ప్రసిద్ధి కెక్కియుండెను. కరక్కాయ, తుమ్మజిగురు, నూనె కలిపి కాచిన సిరా మా యింటిలోనే తయారుచేసుకొనేవారము. జొన్నచొప్పదంట్లనుగాని, గడ్డ యీకలనుగాని కలములుగా చెక్కి వ్రాసెడివారము. ఆ చేతితో తయారైన కాగితములన్నియు కొలదిసంవత్సరములలో విదేశములనుండి వచ్చిన మిల్లు కాగితము పోటీలో మటుమాయమైనవి. కలములు, పాళీలుకూడ విదేశముల నుండి దిగుమతియైనవి. అప్పటికి మా యింటిలో నిత్తడిసెమ్మెలలో నాముదపుదీపముల నుపయోగించేవారము. మా యింటిలో నాముదపు గింజలతో వంటాముదము తయారుచేసేవారు. శుభకార్యములలో, నుత్సవము లలో, వీధినాటకములలో నాముదపు దివిటీలనే వేసెడువారు. పిమ్మట మైనపువత్తు, లా పిమ్మట కిరసనాయిలుబుడ్లు, కిరసనాయిలులాంతర్లు వచ్చి నవి. తుదకు 1958 లో విద్యుద్దీపములు మా గ్రామమునకే గాక మా యింటికికూడ వచ్చినవి.

మా తల్లి వరలక్ష్మమ్మగారు గొప్ప సాధ్వీమణి. మహాలక్ష్మీదేవి విగ్రహమును ప్రతిదినము పూజచేసెడిది. మహాలక్ష్మమ్మవారి దేవాలయ మును మా పూర్వులు మా యింటిప్రక్కనే ప్రతిష్ఠించినారు. ఆ మహాదేవి కరుణాకటాక్షములవలన నేను పుట్టి బాగుగానున్నానని మా మాతాపితరుల దృఢవిశ్వాసము. లక్ష్మి, కాళి, సరస్వతి అని యామెకు పేర్లు. ఆ కాళియను పేరును బట్టి కాళేశ్వరరావను పేరు నాకు బెట్టినారు. త్రిలింగదేశమునకు పడమర యెల్లగా నున్న కాళేశ్వరము అను దేవాలయము తెలంగాణము లోని కరీంనగరుజిల్లాలో నున్నది. మా యింటి కెవ్వరు వచ్చినను నాదరించి యతిథిసత్కారముచేయుటలో మా తల్లిగారు పేరెన్నికగన్నది. దయార్ద్ర హృదయురాలు. ఆమె పుట్టింటివారగు మాదిరాజువారు తెలంగాణములో ఖానాపు తాలూకా పరిటాలకు దేశముఖు, దేశపాండ్యాలు. పరిటాలలో చాలకాలము వజ్రములను త్రవ్వి తీసి యెగుమతిచేసెడివారు. ఇప్పటి కా పాత గుంట లున్నవి. కొహినూరు వజ్రమిక్కడనే దొరికినదని కొందరు చెప్పెదరు. నా మాతామహులు దాని కారుమైళ్ళదూరమున నందిగామతాలూ కాలో చేరిన జుజ్జూరులో కాపురముండిరి. మా తల్లిగారి పినతాత రాజా మాదిరాజు కృష్ణమంతు బహద్దరుగారు హైదరాబాదు నైజామువద్ద గొప్ప

ఉద్యోగముచేసిరి. ఆమెవైపు బంధువు లందరు వరంగల్లు, ఖమ్మంజిల్లాలలో నున్నారు. కనుక మా తల్లిగారివైపునుండి నేను తెలంగాణావాడను. మా మాతామహ పితామహులకారణముగా నేను జన్మతః విశాలాంధ్ర కంతటికిని సంబంధించినవాడనయితిని. మా పెదమేనమామకొడుకు మాదిరాజు రామకోటేశ్వరరావు 4, 5 సంవత్సరములు నందిగామలో మా యింటిలోనే యుండి, మా యూరిలోని ఉరుదుపాఠశాలలో శ్రద్ధగ చదివి, పిమ్మట ఉరుదులోనే ప్లీడరీ ప్యాసయి, వరంగల్లులో సుప్రసిద్ధ న్యాయవాదిగ నున్నాడు. నిజాము రాష్ట్రి ఆంధ్రోద్యమములో మాడపాటి హనుమంతరావుగారు, కొండావెంకటరంగారెడ్డిగారు, బూరుగుల రామకృష్ణారావుగారలతో పాటు పనిచేసినవాడు. ఆయన ఇద్దరుకొడుకులుకూడ—నొకరు (వరంగల్లు) హనుమకొండలోను, మరియొకరు ఖమ్మంలోను లాయర్లుగ పనిచేయు చున్నారు. ఆయన ఇద్దరుకుమార్తెలను కూడ తెలంగాణములోనే ఇచ్చి వివాహములు చేసినాడు. నేనుకూడ మూడుక్లాసులవరకు ఉరుదుభాషను నందిగామలోని ఉరుదుపాఠశాలలో చదివితిని. నేను సరిగ బడికి పోక అనేక సార్లు త్రోవలో దేవాలయరథంవద్ద నా సహవాసగాండ్రతో ఆడుకొని యింటికి వచ్చేవాడను. బడికిపోయినప్పుడు చురుకుగ చదివేవాడను. మూడు క్లాసులు ప్యాసైనాను. మాకు ఉరుదునేర్పిన మౌల్వీ హుస్సేను సాహెబు గారు బహు యోగ్యుడు. దైవభక్తిపరాయణుడు. వారియందు మాకు చాల గౌరవము ఉండెడిది. నందిగామతాలూకాకు అంటి రెండువైపుల నైజాము రాష్ట్రి మున్నందున మా బంధువులు ఉరుదు చదివి అక్కడే యుద్యోగములు సంపాదించుకొనుటయు, నచటివారితో సంబంధబాంధవ్యములు చేసుకొనుటయు జరుగుచుండెను. నా చెల్లెలిని మా జిల్లాలోని గన్నవరము తాలూకా ఆరుగొలను నండూరివారికిచ్చేవరకూ అదివరకెప్పుడును నందిగామ తాలూకాలోను తెలంగాణాలోను మాత్రమే మా కుటుంబములో బంధుత్వము లుండెను. మాడపాటి హనుమంతరావుపంతులుగారు మా నందిగామతాలూకా పొక్కునూరి వాస్తవ్యులు. మా అయ్యదేవరవారికి బంధువులు. వారు తెలుగు, ఉరుదు, ఇంగ్లీషుభాషలలో పాండిత్యమును సంపాదించి లాయరుపరీక్షయందు తీర్ణులై హైదరాబాదులో ప్రముఖన్యాయవాదిగనుండి, నైజామురాష్ట్రి ఆంధ్రోద్యమమును నడిపి ఆంధ్రపితామహ పద్మభూషణ బిరుదాంకితులై

ఆంధ్రదేశములోని ప్రథమశ్రేణికి చెందిన ప్రసిద్ధ నాయకులైనారు. వారు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసనమండలిలో సభ్యులుగ నెన్నుకొనబడి యా మండలికి అధ్యక్షులుగ ఏకగ్రీవముగ నెన్నుకొనబడినందుకు మా తాలూకా వాసులు మిగుల గర్వపడుచున్నారు. సుప్రసిద్ధ తెలంగాణనాయకులు ఎర్రుపాలెం వాస్తవ్యులు అఖండత్యాగధనులైన కీ. శే. జమలాపురపు కేశవరావు గారు మా అయ్యదేవరవారి అల్లుడు. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారు 2-6-1889 వ తేదీన మా నందిగామతాలూకా పెనుగంచిప్రోలు గ్రామములో తన మాతామహులయింటియందు జన్మించెను. వారి పితృస్థానము గుంటూరుజిల్లా, రేపల్లెతాలూకా కూచినపూడి గ్రామము. ఆయన స్వతంత్రపోరాటములో నొక మహాజ్యోతియై అఖిలభారత కాంగ్రెసుకమిటీకి కార్యదర్శియై 10-6-1928 వ తేదీన నలుబదవయేట. నకాలమృత్యువు వాతబడి పరమపదించినాడు.

(2)

మా తాత పురుషోత్తముగారికి మా గ్రామములో మునేరుకాలువక్రింద నెనిమిదెకరములు పల్లము (తరి) భూమి, 106 ఎకరముల మెట్టభూమి, పల్లగిరిగ్రామములో పదునాలుగు ఎకరముల మెట్టభూమి ఉండెడిది. ఆయన మంచి సమర్థుడని పేరుపొందిన కరణము. మధ్యమతరగతికి చెందిన సంపన్న గృహస్థు, నందిగామలోని మా యిల్లు సామాన్యమైన పెంకుటిల్లే కాని, దానికి మూడువైపుల దొడ్లు కలవు. వాకిటిముందర విశాలమైన ఖాళీ స్థలము, అందులో నొక మర్రిచెట్టు కలవు. ఉత్తరపువైపు దొడ్డి చాల పెద్దది. ఆ దొడ్లో నా చిన్నతనములో చాల పండ్ల చెట్లుండేవి. మా తాత గారు శ్రద్ధగా నీళ్లుపోయించేవాడు. కొన్నివేళల తానే స్వయముగా తోడి చెట్లకు నీళ్ళుపోసేవాడు. ఆయన యింట్లో సీతాఫలపుపండ్లు, మామిడిపండ్లు, అరటిపండ్లు, జామపండ్లు కోసి మాగవేయించేవాడు. వాటిని దొంగతనముగా ఎత్తుకొనిపోయి నేను తినేవాణ్ణి. నా సహవాసగాండ్రకు పంచిపెట్టేవాణ్ణి. అందుకుగాను ఆయన నన్ను తాడుతో స్తంభమునకు కట్టివేసేవాడు. ఒక్కొక్కప్పుడు రూళ్ళకర్రతో నన్ను కొట్టవచ్చినప్పుడు మా అమ్మ

అడ్డముపచ్చి తప్పించేది. ఆయన కోపదారి. వాటిని నేను ఎక్కువగ తింటే నాకు జబ్బుచేయునని ఆయనకు భయము. మా యింటికి వెనుక వైపున గ్రామస్థులందరు మంచినీళ్ళు తెచ్చుకొనే దేవతలబావి ఉన్నది. మా ఉత్తరపువైపుదొడ్లోకూడ మా సొంత మంచినీటిబావి ఉన్నది. మా దొడ్లో పెద్దపెద్ద ప్రశస్తమైన నిమ్మపండ్లు కాచెడివి. అనేక సంవత్సరాలు వైద్యముకొరకు ప్రజలు వచ్చి మమ్మడిగి వాటిని తీసుకొనిపోయెడివారు. మా దొడ్డిలో కొంతభాగము కూరగాయలు వేసెడివారు. కొంతభాగమును దున్నించి గోంగూర, మొక్కజొన్న వేయించెడివారు. మా ఊరికి శివారుగా నున్న అనంతసాగరమునుండికూడ మా తాతగారు కూరగాయలు, మొక్కజొన్నపొత్తులు, వెనగకాయలు, జొన్న ఊచబియ్యము, కొత్తిమీరి, పచ్చి మిరపకాయలు మొహతాదుచేత పట్టించుకొని వచ్చెడివారు. అప్పటికి వేరు వెనగపంట లేదు. ప్రత్తి, జొన్న, కొర్ర, కంది, పెసర, ఉలవ, సజ్జ ప్రధానముగా వేసేవారు. నువ్వులు, ఆముదాలు కూడ పండించేవారు. మా తాలూకా దోసకాయలకు గోంగూరకు చింతకాయలకు ప్రసిద్ధికెక్కినది. మా జీతగాడు మా వాకిటలోనున్న పెద్ద మర్రిచెట్టుమీదికి ఎక్కి ఆకులు కోసెడివాడు. ఒకపుడు మా తాతగారే చెట్టుమీదికెక్కి ఆకులు కోసేవాడు. ఆ యాకులతోనే విస్తళ్ళు కుట్టుకునేవారము. మాకు బర్రెలు, ఆవులు కూడ పాడికుండేవి. మాకు కావలసిన పాలు, పెరుగు, వెన్న, నెయ్యి మా యింటిలో సమృద్ధిగా నుండెడివి. వేరే కొనుక్కోవలసినపనిలేదు. ఏదైన కార్యములయితే అనంతసాగరమునుంచి మా తాతగారు తెప్పించేవాడు. మా పశువులపేడలో పిడకలుచేయగా మిగిలినదాని ఎరువుగా మా పొలాలకు తోలించెడివారు. మా తాలూకాలో పశుసంపద బాగుగా నుండెడిది. మాకు కొంత సొంత వ్యవసాయముండెను. మా పెద్దపాలేరుపేరు మాదిగ కోటాయ. బహు నమ్మకస్తుడు. అప్పుడు నవ్వారుమంచాలు లేవు. నులక మంచాలమీద పరుపులువేసికొని పరుండెడివారము. స్త్రీలు పసిపిల్లలను కూడ దీసికొని నులకమంచపు సవారీలమీద ప్రయాణముచేసెడివారు. నన్ను అపు డపుడు మా అమ్మ తనతోకూడ నులకమంచపుసవారీలో నెక్కించుకొని తన పుట్టింటికి — జొజ్జూరుకు తీసుకొనివెళ్ళేది. లపుడు మేనా సవారీలమీద మా జమీందారుగారు, తాలూకా తహస్సీలుదారుగారు మాత్రము ప్రయాణము

చేసేవారు. మా మేనమామలు గుఱ్ఱాలమీద ప్రయాణముచేసెడివారు. మా తాతగారు ఇరువదిమైళ్ళ లోపుగానున్న ముక్త్యాలకు మొహతాదుచేత తెక్కలిం ద స్తరము పట్టించుకొని నడచివెళ్ళేవారు; నడిచివచ్చెడువారు. శరీరదార్ఢ్య ముతో 75 సంవత్సరములు వారు జీవించినారు. అబద్ధమాడి యెరుగరు. 1893 వ సంవత్సరములో కొంచెము నంజు కనిపించినది. మా నాన్నయు, నేను దగ్గరవుండగానే మా తాతగారు మా యింటిలో 'ఓం నమశ్శివాయ' అనుకొనుచు ననాయాసముగా కాలధర్మముచెందినారు. ఆ రోజు ఏకాదశి. మా నాయనమ్మగారు నే నెరుగకముందే స్వర్గస్థులైనారు. చుట్ట, నశ్యము మా తాతగారికిగాని,మా నాన్నగారికిగాని అలవాటులేదు. నేనుకూడ నా జీవిత ములో చుట్ట, బీడి, సిగరెట్టు, నశ్యము ఎప్పుడు వాడి యెరుగను. ఆ కాలములో మా తాలూకాలో నందరముకూడ .చేతితో వడికిననూలుతో.... చేమగ్గాలమీదనేసిన శుద్ధ ఖద్దరువస్త్రాలే ధరించెడివారము. ప్రత్తిరాటాలు, నూలురాటాలు, నేత. మగ్గాలు ప్రతిగ్రామమున నుండెడివి. బందరునుంచి వచ్చిన నాజూకైన కలంకారీచీరలను స్త్రీలు ధరించెడివారు. జగ్గయ్యపేటలో విశేషముగా పట్టుబట్టలు చేతిమగ్గాలమీద తయారయ్యేవి. మిల్లుబట్టల నెరు గము. నందిగామలో మా వరిపొలములో వడ్లు పండేవి. మా యూరిలో వరిపొలాలుగల కుటుంబములవారము మాత్రమే వరియన్నమును దినెడు వారము. వడ్లు దంపించుకొని దంపుడుబియ్యముతో నన్నము వండుకొను చుంటిమి. అప్పటికి కృష్ణాడెల్టా యెక్కువగా లేదు. నందిగామలో తప్పు మునేరుడెల్టా అసలేలేదు. మా తాలూకా ప్రజలు స్థితిపరులైనను, సామాన్యు లైనను జొన్నన్నము, సజ్జన్నము తినెడువారు. నేను బందరు ఇంగ్లీషు చదువుకొనుటకు వెళ్ళిన తరువాత అక్కడ మిల్లుబట్టలు, మల్లుతానులు కొను టయు, ఫ్యాక్టరీలో తయారైన వరిబియ్యము కొనుటయు అలవాటైనవి. అది నూతన నాగరికతాలక్షణముగా నెంచబడినది.

మా తాతగారి కిద్దరు కొడుకులుండెడివారు. మా పినతండ్రిగారు నే నెరుగకముందే నిస్సంతుగా చనిపోయినారు. ఆయనభార్య పిమ్మట మర ణించినది. మా నాన్నగారొక్కరే ఆయనకు జీవించియుండిన కుమారుడు. మానాన్నగారికి నేనొక్కడనే కొడుకును. నాకు నొక యక్కయు, నొక చెల్లెలున్నారు. మా అక్క కోటమ్మగారు నాకంటె ఐదిసంవత్సరాలు పెద్దది.

నా చెల్లెలు శ్యామలాంబ నాకంటె నైదు సంవత్సరములు చిన్నది. నేను జన్మించిన మూడునెలలకు మా అక్కగారికి వివాహమైనదట. ఆమెను మా యూరిలోనే చామర్తి మల్లికార్జునరావుగారి కిచ్చినారు. ఆయన లింగధారి. శైవమతస్థుడు. మా మేనమామలు నిలువుబొట్టువారు. అనగా వైష్ణవ సాంప్రదాయకులు. మేము శంకరాచార్యులవారి యద్వైతమతమునకుచెందిన స్మార్తనియోగులము. కనుక మాకు శివకేశవభేదములు లేకుండెను. ఇదియే యద్వైతమత విశిష్టత. శంకరాచార్యులవా రుత్తరమున బదరీనాథములోను, పడమర ద్వారకలోను, తూర్పున పూరిజగన్నాధములోను, దక్షిణమున శృంగేరిలోను అద్వైతమతమును స్థాపించి పరమేశ్వరుని ఏపేరుననైనను నారాధించవచ్చునను మతసామరస్యమును సమకూర్చినారు. మా బావగారు (అక్క పెనిమిటి) మా తాలూకాలో పేరుగల వ్యవహారస్థుడు. నేను లాయరుగా నుండగా 1916 వ సంవత్సరములో ఆయన స్వర్గస్థులైనారు. వారికి సంతానము లేదు. ఆయనతమ్ముడగు సుందరశివరావును వారి పెదతల్లి భర్తగారగు తుర్లపాటి సంగయ్యగారికి దత్తతయిచ్చినారు. సంగయ్యగారు మా యూరికి మూడుమైళ్ళదూరముననున్న అడవిరావులపాడగ్రహారీకులు. లింగధారులు, మంచి స్థితిపరులు,సుందరశివరావుగారి పెద్దకుమారుడు వేంకటేశ్వరరావు బారిష్టరు పరీక్ష ప్యాసై బెజవాడలో లాయరుగానుండి, బందరులో పబ్లికు ప్రాసిక్యూటరుగా పనిచేయుచు 1940 లో మరణించినాడు. సుందరశివరావు నేను ఏక కుటుంబమువలెనే పెరిగినాము. ఎల్లపుడు నందిగామలో మా బావగారియింటిలో నుండెడివాడు. మా బావగారిని మా కుటుంబాలకు పెద్దగా చూచుకొనెడివారము. నా చెల్లెలును గన్నవరముతాలూకా ఆరుగొలను మొఖాసాదారు సండూరు వరాహలక్ష్మీనరసింహముగారి తమ్ముడగు సూర్యనారాయణగారి కిచ్చినాము. అది డెల్టాగ్రామము. ఆమె కిద్ద రాడుపిల్లలు, ముగ్గురు మగపిల్లలు గలరు. అందరు మంచి స్థితిలోనే యున్నారు. వారిని గూర్చిన వివరములు ముందు ప్రకరణములో దెలిపెదను.

మా తాతగారు చనిపోయినపిమ్మట మా నాన్నగారుగాని, నేనుగాని కరిణీకముచేయలేదు. చాల సంవత్సరములు గుమస్తాను బెట్టి చేయించినాము. నేను బి. యల్. ప్యాసైన పిమ్మట కరిణీకమునకు రాజీనామానిచ్చినాను. ఆ యుద్యోగము మరియొక కుటుంబమునకు సంక్రమించినది. 1899 లో నా

భార్య కాపురమునకువచ్చినది, అపుడు నా తల్లి, నా భార్య ఇందరును నావద్దకు వచ్చినప్పటినుండి మా నందిగామదొడ్డిలోని పంట్లచెట్లన్నియు నశించిపోయినవి. నిమ్మచెట్లుకూడ క్రమముగా చెడిపోయినవి. ఆ పిమ్మట నెప్పుడును నెయ్యి, పాలు, పెరుగు కొనుటయు, నవి కల్తీగా నున్నవని బాధ పడుటయేగాని సుఖకరమైన, స్వచ్ఛమైన సొంత పశువులపాడి ననుభవించ లేదు. ఆరోగ్యకరమైనట్టియు, నమాయకము నీతివంతమునగు పల్లెటూరిజీవి తమునకు స్వస్తిచెప్పినాము, మిల్లుబియ్యము దినుచు, మల్లుతానులను ధరించుచు మురికికూపాలైన బస్తీలలో కాపురమునకు చేరినాము. తరువాత కొన్నిసంవత్సరాలకు నాకు జబ్బుచేయగా డాక్టర్ల సలహాపైన మరల దంపుడు బియ్యమును తినుట ప్రారంభించినాము.

మా నాన్నగారుకూడ దైవభక్తిగలవారు. రెండుపూటల సంధ్యావందనము చేసికొని ఓం నమశ్శివాయ మంత్రమును జపించుకొనెడువారు. వారు నాకు ఓం నమశ్శివాయ మంత్రము నుపదేశించినారు. 1892 లో నా కుపనయనము చేసినారు. మా రాజాశ్రితులగు యడవల్లి రామలింగావధానులుగారు నాకు గాయత్రిమంత్రము నుపదేశించినారు. నా జీవితములో ఓం నమశ్శివాయ మంత్రమును, గాయత్రీ మంత్రమునుకూడ జపించుట నా కల వాటు. ఆ జపము మనస్సునకు పవిత్రతను, శాంతిని, ధైర్యమును కలిగించుచున్నది. మా నాయనగారు భారత భాగవతములను శ్రావ్యముగా చదివి యర్థముచెప్పెడివారు. ప్రతిసంవత్సరము మునగాలపరగణానుండి కరణా లందరు జమాబందీకొరకు నందిగామ వచ్చినపుడు మా యింటిలోనే బస చేసెడివారు. ప్రతిదినమురాత్రి యా కరణాలలో నెవరో యొకరు గాని, మా నాయనగారు గాని కొన్ని గంటలసేపు భారతముగాని భాగవతముగాని చదువగా నందరు వినుట జరుగుచుండెడిది. నేనుకూడ శ్రద్ధగా వినుచుండే వాడను. అందువలన నా కాంధ్రభారత భాగవతములందు బాల్యమునం దభిరుచి యేర్పడినది. నేను పెద్దవాడనైన పిమ్మట విద్యార్థిదశలో తెలుగుపద్యములు కంఠస్థము చేయుటయు కొంచెము రాగాలాపనముతో పద్యములు చదువుటయు అలవాటైనది. మా నాన్నగారి కాయుర్వేదమునం దెక్కువ యభిమానము. వైద్యచింతామణి, బసవరాజీయము, మాధవనిదానము, వస్తుగుణదీపిక మొదలైన కొన్ని ఆయుర్వేదగ్రంథములు మాయింట నుండె

డివి. నేను పెద్దవాడనైన పిమ్మట వాని నపుడపుడు చదువుచుండెడివాడను. ఆ కాలములో మా యూరి చుట్టుపట్టుల గొప్ప ఆయుర్వేదశాస్త్రపారంగతులైన వైద్యు లుండెడివారు. కంచెకచర్లలో పెన్నా యజ్ఞయ్యశాస్త్రిగారు, గోసవీటిలో కోరుకొండ భట్టరు పెరుమాళ్లయ్యగారు, నరసింహాచార్యులుగారు, నూజవీటిలో మల్లెల ఫకీరయ్యగారు, మా గ్రామములో దివి రత్నమాచార్యులుగారు, చింతలపాడులో చింతలపాటి భగవాన్లుగా రప్పటి ప్రసిద్ధాయుర్వేదవైద్యపండితుల నామములు. అపుడే క్రొత్తగా మా యూరికి ఇంగ్లీషు ఆసుపత్రి వచ్చినది. మొదట డ్రెస్సరు, పిమ్మట అపాతకిరీ ఉండువారు. ఎంతవరకు నిజమో కాని మా అయ్యదేవరవారు ఆచార్య నాగార్జునుని ముఖ్యశిష్యులైన ఆర్యదేవునివంశీయులని చెప్పుకొనుట కలదు. ఆర్యదేవుడు నందిగామతాలూకాలోని జగ్గయ్యపేట, రామిరెడ్డిపల్లె గ్రామములకు వచ్చినట్లు మాత్రము శాసనాలు కలవు. ఆ రెండుగ్రామములు బౌద్ధశిథిలములకు పేరుపొందినవి. ఆ కాలములో పిల్లలము కలసి బలిచెడుగుడు, కోతికొమ్మచ్చు లాడుకొనెడివారము. ఊరిబయట మైదానములలో మేయు గుర్రములను బట్టుకొని మీద నెక్కి సవారిచేసెడివారము. పొలాలకుపోయి రేగుబండ్లు కోసి తెచ్చుకొనెడివారము.

మా యూరి కప్పుడప్పుడు కూచిపూడి భాగవతులువచ్చి, మా యింటి ప్రక్కనేయున్న పెద్దబజారులో ప్రహ్లాద, హరిశ్చంద్ర, ఉషాపరిణయము, భామకలాపము మొదలైన వీధినాటకము లాడుచుండిరి. వేషగాండ్రు మొగముల కరదళము పూసుకొని గిలేటినగలు ధరించివచ్చేవారు. కాగడాలమీద గుగ్గిలముపేసేవారు. తోలుబొమ్మలవాళ్లుకూడ వచ్చి రామాయణము, ఉత్తర గోగ్రహణము మొదలైనవానిని ప్రదర్శించుచుండిరి. కేతిగాడు, జుట్టుపోలిగాడు బంగారక్కల హాస్యము పిల్లల కెంతో ఆనందమును కల్గించెడివి. మా గ్రామములో పీర్లపండుగ సంబరము బాగుగ జరిగేది. పీర్లు బజారుల్లో నూరేగుచున్నపుడు హిందువులుకూడ పప్పుబెల్లములు చదివించి మ్రొక్కుకొనిరి. ముసల్మానులే గాక హిందువులుకూడ పీర్లపండుగలో పెద్దపులివేషములు వేసెడివారు. మిఠాయివర్తకుడగు బొందిలీ బాలాజీసింగను హిందువు పెద్దపులివేషము బాగుగా వేసి బండిమీద నూరేగగా ఆ వేషము చూచినపుడు భయముపుట్టేది. వినాయకచవితి పిల్లలకు ముఖ్యమైన

పండుగ. ఇంటింటికి తిరిగి యన్నిరకాల పత్రి పూలు తెచ్చి మట్టితో వినాయకునిజేసి పూజించెడివారము. పుస్తకములన్నియు వినాయకునిపూజలో పెట్టెడువారము. సాయంత్రము భాగవతములోని సత్రాజిత్తు కథను వినుచుంటిమి. దసరాఉత్సవములు, బతకమ్మపండుగలు బాగుగా జరిగేవి. స్త్రీలు వాయిద్యములతో వెళ్ళి బతకమ్మలను మా యూరి చెరువులో నోలలాడించిరి. వారు కదలిరాగానే మేము నీళ్ళలోకిపోయి యాబతకమ్మలనునీళ్ళలోగలిపివైచి వారివలన మంగళాష్టకము లందుకొనుచుంటిమి. దసరాలో ఆయుధపూజ, స్వామివారు వేటకు బోవుట ముఖ్యముగా నుండెను. ఆ పండుగదినములలో మా యుపాధ్యాయులు మమ్ము వెంటబెట్టుకొని 'అయ్యవారికి చాలు-అయిదువరహాలు, పిల్లవాండ్లకు చాలు పప్పు బెల్లాలు' అని పాటలు పాడించుచు యింటింటికి తీసుకొనిపోయి కానుకలు వసూలుచేసిరి. మాకు బాగా పప్పు బెల్లము పెట్టిరి. అట్లతద్దెకు రెండుచేతులకు రెండుకాళ్ళకు గోరింటాకు స్త్రీలతోపాటు మొగపిల్లలముకూడ పెట్టుకొనెడివారము. బియ్యము మినుము కలిపిచేసిన అట్లను బెల్లము వేసికొని తినెడువారము. తెల్లవారు జామున భోజనముచేసేవాళ్ళము. చెట్లకొమ్మలకుగాని, యింటి దూలములకుగాని మంచి పగ్గాలతో నుయ్యాలలు వేసి ఉయ్యాలలూగినాము. మా యూరిలోని చెన్నకేశవస్వామివారికి నేచేట ముక్కోటి యేకాదశికి పెద్దకొలాదు కట్టి హరికథలు చెప్పించుటయే గాక, కూచిపూడివారినికూడ పిలిపించి దశావతారములు మొదలగు నృత్యములు చేయించువారు.ఆకాలములో కూచిపూడివారి ప్రతిభ చాల హెచ్చుగా నుండెను. విష్ణువు శివుడు కలసి యూరేగ గ్రుద్ది నమ్మకముండెడిది. విష్ణువెక్కువ శివుడెక్కువ యని శైవవైష్ణవులు పరస్పరము వివాదముపడుచుండిరి. నేను బందరులో చదువుకొనుచుండగా హిందూ హైస్కూలులో నొక ఆరాధ్యుడగు తెలుగుపండితు డుండెను. ఆయన ప్రతిదినము విష్ణువుకంటె శివు డెక్కువని తరగతిలో బోధించెడువాడు. ఏ విద్యార్థియయినను పాఠము చదువుకొనిరాక తరగతిలో కాలక్షేపముచేయవలెనన్నపుడు "చూడండి అయ్యవార్లంగారూ, వీడు విష్ణువెక్కువంటున్నా"డని ప్రక్కవిద్యార్థిని జూపించిన "వెధవ, వాడి కేమి తెలుసు" అని యా గంటంతయు శివుడెక్కువయని ఋజువుచేయుటలో ఆయన కాలము గడుపును. అట్టివా రోజులు. సంక్రాంతికి బొమ్మల

పెట్టుకొనుటయు, రేగుబండ్లు, బంతిపూలు, చామంతిపూలు పోసికొనుట జరిగెడిది. రకరకాల సంక్రాంతిముగ్గులు ఇండ్లగుమ్మాలవద్ద పెట్టేవారు. గొబ్బెళ్లు పెట్టేవారు. దీపావళికి పిల్లవాండ్రందరము జముదుకట్టెలు తెచ్చి కాల్చి బొగ్గుతో సూరేకారము,గంధకము కలిపి పూవత్తులుచేసికొని కాల్చెడు వారము. కొన్ని సంవత్సరాలకు పిమ్మట మతాబాలు, కాకరపూవత్తులు, సీమటపాకాయలు, తోటాలుకూడ దుకాణములో అమ్మకమునకు వచ్చినవి.

(3)

నేను చిన్నవాడనుగా నున్నపుడే పిల్లనిచ్చెదమని చాలసంబంధములు వచ్చియుండెను. 1804 వ సంవత్సరములో మా తాలూకాలోని కంచెకచర్ల కరణము పింగళి వీరభద్రయ్యగారిబిడ్డను నా కిచ్చి వివాహముచేసిరి. మా మామగారగు వీరభద్రయ్యగారు మా తాలూకాలోని పెద్ద కరణము. మంచి స్థితిగలవాడు. కళాపూర్ణోదయము రచించిన పింగళి సూరన మహాకవి వారి పూర్వీకులేనట. నా కపుడు పదునాలుగవయేడు. పెళ్ళికూతురు పేరు సుబ్బమ్మ. మావా రామెనామమును దుర్గాంబయని మార్చినారు. ఆమెకు పదవయేడు. కంచెకచర్లవీధులలో మమ్ముద్దరను బల్లకిలో గూర్చొనజేసి యూరేగించినారు. భోగముమేళముకూడ పెట్టినారు. ఆ కాలములో భోగము మేళములు లేని శుభకార్యములు, ఉత్సవములు లేనేలేవు. సన్నాయి, అలు గోజా, తాషామరభా, రాందోలు వాయిద్యాలు వాయించినారు. అప్పటికి బ్యాండుమేళాలు లేవు. అపుడు కట్నములబేరములు లేవు. ఎవరికి తోచినది వారు వధూవరులకు పెట్టుటయే నాటి యాచారము. నా భార్యకు మావారు బంగారు వడ్డెడ, కాసులపేరు, నెత్తికి రాగిడి చంద్రవంక పెట్టినారు. ఆమె తండ్రిగా రామెకు అయిదెకరాల మెట్టభూమియు, నొకయెకరము పల్లపుభూమి పసుపు కుంకుమక్రింద నిచ్చినారు. వారి కామె యొకతే కూతురు. అప్పటికి నాకు జుట్టు జానపాలుండేవి. నన్ను నా భార్యను చెరి యొక బ్రాహ్మణుడు చంకలో నెత్తికొని దండాడించినారు. బుక్కాగులాలు బాగుగా చల్లుకొన్నాము. బంధువులు వారిలోవారు చల్లుకొన్నారు. నా పెళ్ళి అయిదురోజులు జరిగినది.

మా మామగారు నియోగిమత సిద్ధాంతి. శుభాశుభకార్యములకు నియోగిపురోహితులనే పిలువవలెనని యప్పటి కొక యుద్యమ మొంచెను. దీనినే కొందరు పద్ధతినియోగమని కూడ నందురు. అందులో నాయన చేరినవాడు. మా యూరిలో నొక నియోగి తహసీలుదారు మా గ్రామ కరణాలను పిలిపించి నియోగ మతసిద్ధాంతములో చేర్పించినాడు. మా తాత గారు కూడ కొలదికాల మందులో చేరినారు. కాని యచిరకాలములోనే దానిని విడచిపెట్టినారు. మా నాన్నగా రసలు చేరనేలేదు. అయ్యదేవరవారు చాలమంది చేరలేదు. మా నందిగామలో యడవల్లివారు గొప్ప శ్రోత్రియు లగు వైదికులు. ఆ కుటుంబములలో నపు డెనుబదియేండ్లకు పైబడినవారు వేదము చదువుకొని యజ్ఞయాగాది క్రతువులు చేసిన ముగ్గురు వేంకటేశ్వర సోమయాజులు, కామేశ్వర సోమయాజులు, అప్పయ్య సోమయాజులుగా రుండెడివారు. వేదముగాని శాస్త్రముగాని చదువుకొననివా రా కుటుంబమున లేకుండిరి. వారే మా అయ్యదేవరవారికి, రాజాశ్రితులు, గురువులు. వారిని మేము విడిచిపెట్టలేదు. మా యూరిలో నప్పటికి నిప్పటికి వైదిక నియోగి భేదములు లేనేలేవు. కాని ఛాందసులగు వైదికులు తమతోడి స్మార్త బ్రాహ్మణులైన నియోగులకు యజ్ఞయాగాది క్రతువులు చేయుట కధికారము లేదని వాదించి, అట్టి క్రతువులు చేయుటకు నిరాకరించినందులకు నియో గులు తమ గృహములలో పౌరోహిత్యమునుండి వైదికులను తీసివైచి, తమ శాఖవారైన నియోగులచేతనే శుభాశుభకార్యముల పౌరోహిత్యము క్రతు వులు చేయించుకొనుటనుద్యమము నన్నిచోట్ల లేవదీసినారు. ఇదే పద్ధతి నియో గము. ఈ యుద్యమస్థాపకులు నందిరాజు లక్ష్మీనారాయణ దీక్షితులు గారు. వారికిపిమ్మట దీనిని బాగుగా వ్యాపింపచేసినవారు కామరాజుగడ్డ కోటేశ్వ శర్మ, కమపర్తి మార్కండేయ శర్మగారలు. ఇందువలన నియోగి వైదిక కక్షలు కొన్ని పంవత్సరాలవరకు ముఖ్యముగా గుంటూరుజిల్లాలో ప్రబలినవి.

ఇటులనే ఛాందసులును, స్వాభిమానులునగు బ్రాహ్మణులు తమతోడి ద్విజులగు వైశ్యులకు ఉపనయనాధికారము, వేదోక్తముగా కర్మలుచేయించు కొను నధికారము లేదని వాదించి, పౌరాణికముగా మాత్రమే చేయించుట సాగించినందున, వైశ్యులుకూడ బ్రాహ్మణులమీద తిరుగుబాటు చేసినారు.

వైశ్యప్రముఖులైన ఆత్మూరి లక్ష్మీనరసింహసోమయాజులు గారు యజ్ఞము చేసి వైశ్యుల యాత్మగౌరవమును నిలువబెట్టిన నాయకుడని ప్రసిద్ధికెక్కినాడు. నా చిన్నతనములో జగ్గయ్యపేటలో భాగ్యవంతులైన వైశ్యులు తమకు వేదోక్తముగా కర్మలుచేయించుటకు నిరాకరించిన యాయూరి బ్రాహ్మణులను తమ యింటి పౌరోహిత్యము నుండి వెడలగొట్టి కాకినాడనుండి యెక్కువ ద్రవ్యమిచ్చి క్రొత్త బ్రాహ్మణులను రావించుకొని వేదోక్తముగా కర్మలను చేయించుకొన్నారు. అప్పటినుండి వైశ్యులు వేదాధ్యయనముచేయుటయు, వేదోక్తముగా కర్మలుచేసికొనుటను ప్రారంభించినారు. ఇట్టి పిచ్చిపనులు చేసి తమకు తెలిసిన వేదవిజ్ఞానమును తోడి ద్విజులకు గలుగనీక స్వార్థ పరత్వముతో ప్రవర్తించిన బ్రాహ్మణులు నష్టపడినారు. పైగా బ్రాహ్మణ వైశ్య కక్షలు పెక్కుచోట్ల ప్రబలినవి. ఇటీవలనే గుంటూరున కొక మఠాధిపతి వచ్చి వైశ్యులకు వేదోక్తము లేదని చెప్పి వైశ్యులకు వేదోక్తముగా కర్మలు చేయకుండ బ్రాహ్మణుల నాపినందున గుంటూరు వైశ్యులు నాకును మా మిత్రులైన అడ్డేపల్లి గురునాధరామశేషయ్య శ్రేష్ఠి గారికిని కబురు పంపిరి. అపుడు మేము బెజవాడనుండి పర్వతము లక్ష్మీనారాయణగారి సహాయమున నియోగ మతసిద్ధాంతపరులైన బ్రాహ్మణులను బంపినాము. వైశ్యులకు యథావిధిగా వేదోక్తముగా కర్మలు జరుగుచున్నవి. కాని బ్రాహ్మణ వైశ్య కులకక్షలు మాత్రము చాలకాలము సాగుచువచ్చినవి.

పూర్వకాలములో నందకారయుగములో శూద్రులు, స్త్రీలు వేదము చదువగూడదని యపుడుస్వార్థపరులైన బ్రాహ్మణపురుషులు నిషేధించి తమకు లోబడియున్న రాజులచేత నా నిషేధము నమలుజరిపించినారు. ఈ ప్రజా యుగములో నట్టి నిషేధములవలన ప్రయోజనము కలుగజాలదు. ద్విజులలో జేరని కమ్మవారు, రెడ్లు కూడ గుంటూరు, కృష్ణాజిల్లాలలో నుపనయనములు జేసికొని జంధ్యములను ధరించి విశ్వబ్రాహ్మణగురువులవద్ద వేదాధ్యయనముచేయుచు వచ్చినారు. విశ్వబ్రాహ్మణులకు వేదాధ్యయనాధికారము లేదని కొంతకాలము బ్రాహ్మణులు తగవుబెట్టినారు. వారికిగూడ బ్రాహ్మణులయం దసూయ కల్గినది. వేదములు, ఉపనిషత్తులు, ధర్మశాస్త్రములు మానవులందరకోసము పుట్టినవి. అట్టివాని నేకొలది మందియో స్వార్థపరులైన బ్రాహ్మణులు దాచుకొనటానుట వెఱ్ఱిపని.

నిరర్థకమైనది. పంచముల అస్పృశ్యతసంగతి చెప్పనక్కరలేదు. ఈ విధముగా హిందూమతము పతనమగుచున్నందున క్రైస్తవమిషనరీలెంతయు విజృంభించి హిందువులగు హరిజనులను క్రైస్తవులుగ చేయుచువచ్చిరి.

నాకు వివాహమైన మూడునెలల కనగా 1894 జూన్‌నెలలో పితంలు వగు మా పెద్దత్తగారు, ఆమెయొక్క ముగ్గురు మేనల్లుండ్రను చదువునకు బందరు తీసుకొనిపోవుచుండుటచేత నన్నుకూడ చదువున కామెతోకూడ బందరుకు మావారు పంపినారు. నాకు వివాహో విద్యానాశాయ యను సామెత వర్తింపలేదు. నా వివాహమువలననే నాకు విద్య వచ్చినది. అదివరకు కొంతవరకు యింగ్లీషు, లెక్కలు, నందిగామలో తహసీలుదారు తిక్కాని బాలాజీరావు నాయుడుగారి చెల్లెలు రాజాబాయమ్మగారిభర్త యగు మోటుపల్లి రాఘవయ్యనాయుడుగారివద్ద ప్రయివేటు చదువుకొన్నాను. నందిగామలో మా యింటిపక్కయింటిలోనే తహసీలుదారుగా నుండేవారు. శ్రీమతి రాజాబాయమ్మగారు నాకు గురుపత్నియైనది. ఆమె బందరులో గొప్ప సంఘసేవాపరాయణురాలై బృందావన స్త్రీసమాజమునకు కార్యదర్శిగ నెక్కువ సంవత్సరములు సేవచేసి పిమ్మట మరణించినది. నేను ఆ సంవత్సరములో రెండవభాగములో వెళ్ళినప్పటికి నన్ను నోబిల్ కళాశాల లోని ఉపాధ్యాయులు పరీక్షించి మూడవఫారములో చేర్చుకొన్నారు. నోబులు కళాశాల క్రైస్తవ మిషనరీపాఠశాల. అపు డక్కడ బి.ఏ. వరకున్నది. మొదటినెలలోనే క్లాసులో మొదటివాడనైతిని. ఆ ప్రథమస్థానమును బి.ఏ. ప్యాసగునంతవరకు నాక్రమించియుంటిని. అపుడు పరీక్షలు డిసెంబరులో జరుగుచుండెడివి. నందిగామనుండి రెండెడ్లబండిమీద వచ్చి కంచెకచర్లలో నాగి యా రాత్రి బయలుదేరి మరునాటిరోజుదయమున బెజవాడ చేరి యక్కడ పుచ్చావారిసత్రము దగ్గర దిగి వంటచేసికొని భోజనముచేసి, ఆ రాత్రి బయలుదేరి మరునాడుదయమునకు ఉయ్యూరు వచ్చి యా రాత్రి బయలుదేరి మరునటి ఉదయమునకు బందరు వెళ్ళెవారము. ఇది రోడ్డుమీద ప్రయాణము. పడవలున్నకాలములో బెజవాడవరకు బండి మీద వచ్చి అక్కడ పుచ్చావారిసత్రమువద్ద వంటచేసుకొని భోజనముచేసి బెజవాడనుండి రహదారిపడవలో బందరుకాలువమీద మధ్యాహ్నము బయలుదేరి మరునాటి ఉదయమున పదిగంటలకు బందరు చింతగుంటపాలెపురేవులో

దిగి ఒంటెద్దుబండిమీద మా బసకు చేరేవారము. నందిగామనుండి బెజవాడ 72 మైళ్ళదూరము. ఆకాలములో బెజవాడలో గవర్నరుపేట లేదని చెప్పవచ్చును. అపుడు బెజవాడ జనసంఖ్య యిరవైరెండువేలు మాత్ర ముండును. తరువాత 65 ఏళ్ళలో రెండులక్షలవరకు జనసంఖ్య పెరిగినది.

నేను 1897 డిసెంబరులో మెట్రిక్యులేషను, 1899 డిసెంబరులో ఎఫ్.ఏ. ప్యాసయినాను. అపుడు ఎఫ్.ఏ.లో గణితశాస్త్రము (మాథమాటిక్స్) కూడ నిర్బంధ పాఠ్యవిషయము. ఆంగ్లము, గణితశాస్త్రము రెండును నాకు బాగుగా వచ్చినందువలన పరీక్షలన్నిటిలో సులభముగా నుత్తీర్ణుడ నయినాను. ఇంగ్లీషు గణితము, తెలుగు, బైబిలు వీనిలో నాకు ప్రతివత్స రమును బహుమతులు వచ్చెడివి. బైబిలులో పీటరు, కేటరు పరీక్షలు ప్యాసైనాను. కాని నేను కష్టపడి చదివెడువాడనుకాను. బహిరంగసభలన్నిటికి హాజరయ్యెడివాడను. బాగా ప్రొద్దెక్కినతరువాతగాని లేచి యెరుగను. సుప్రసిద్ధ కృష్ణాపత్రికా సంపాదకులు, ఆంధ్రనాయకులైన ముట్నూరి కృష్ణారావుగారు ఇంగ్లీషులో, సంస్కృతములో, తెలుగులో మంచి పాండిత్య ప్రకర్షను సంపాదించినారు. వారికి వేదాంతశాస్త్రము బాగుగావచ్చును. కాని గణితశాస్త్రము రాకపోవుటచే నోబులుకళాశాలలో ఎఫ్.ఏ.లోఆరేండ్లు తప్పి నిరాశచే చదువు మానుకొన్నారు. నాకుకూడ ఆయన యొకసంవత్సరము ఎఫ్. ఏ. లో సహవిద్యార్థి. ఆంధ్ర గ్రంథాలయోద్యమస్థాపకులగు సూరి వేంకట నరసింహశాస్త్రిగారుకూడ ఎఫ్.ఏ.లో నాకు సహవిద్యార్థి. ఆయన ఎఫ్.ఏ. ప్యాసుకాగానే ప్లీడరీప్యాసయి బెజవాడలో ప్లీడరీవృత్తి ప్రారంభించినారు. నాకు గణితశాస్త్రమునందు ప్రత్యేకముగా యధిరుచి యుండెడిది. నూటికి ఎను బదికిపైన మార్కులువచ్చేవి. కాని అప్పటికి నా భార్య కాపురమునకువచ్చుట, నేను మాఅమ్మగారు, నా భార్యకలిసి బందరులో కాపురముండుట, మానాయన గారికి మునగాలరాజాగారి పెద్ద దావాలో బందరులోనే పనిచేయవలసియుం డుటవలన గణితశాస్త్రములో బి.ఏ. చదువుకొనుటకు చెన్నపట్టణము పంపుటకు మా తండ్రిగా రంగీకరింపక బి.ఏ. కూడ బందరు నోబులుకళాశాల లోనే చదువవలసినదని యాజ్ఞాపించుటచే, నేను బందరులోనే బి.ఏ. చదువవలసివచ్చినది. మా నాన్నగారు చెన్నపట్టణమునకు పంపియే యుండిన గణితశాస్త్రములో బి.ఏ. ప్యాసై బహుశః తరువాత బి.ఇ. ప్యాసై యొక

యింజనీరు కావలసినవాడను. కాని భగవంతుడు వేరువనికి నన్ను ద్దేశించి నాడు. అప్పుడు నోబులుకళాశాలలో దేశచరిత్ర, రాజకీయార్థికశాస్త్రములను భాగము మాత్రమే యుండెడిది. దానినే చదివితిని. ఐరోపాఖండచరిత్రలో నవీనయుగమే ఆ సంవత్సరము మేము చదువవలసివచ్చినందున బ్రిటిషు రాజ్యాంగవిధానము, హిందూదేశచరిత్ర, రాజకీయార్థికశాస్త్రములతోపాటు ఫ్రెంచివిప్లవము, అమెరికా స్వతంత్రపోరాటము, మేజినీ, గెరిబాల్డీలు నడపిన యిటలీ స్వతంత్రపోరాటము, అమెరికా రాజ్యాంగవిధానము, నీగ్రోసమస్యలు, బానిసత్వపు రద్దు మొదలగు విషయములను బి.ఏ.లో చదివితిని. రమేశచంద్రదత్తుయొక్క భారతదేశపు ప్రాచీననాగరికత, భారతదేశఆర్థిక చరిత్ర, దాదాబాయి నౌరోజీ వ్రాసిన బ్రిటిషుప్రభుత్వములో భారతదేశదారిద్ర్యమను గ్రంథములనుకూడ వేరుగా చదివితిని. అనేక శతాబ్దము లత్యంత వైభవమనుభవించి విదేశీయులదాస్యములోను,దారిద్ర్యములోను క్రుంగియున్న నా మాతృదేశము అమెరికావలె స్వతంత్ర రిపబ్లికు కావలెనను న్యుద్దేశపూరితమైనభావములు నా కోమలమైనమనస్సులో గట్టిగా కల్గినవనుట యతిశయోక్తి కాదు. రమేశచంద్రదత్తుగారి భారతదేశ ప్రాచీననాగరికత యను గ్రంథమపుడు క్రొత్తగా వచ్చినది. "అందులోని సంగతులన్నియు దేశాభిమానముతో వ్రాయబడిన అతిశయోక్తులు; వాస్తవములు కావు. వానిని నమ్మవల" దని మా చరిత్రాధ్యాపకులగు ఆంగ్లేయ మిషనరీ రెవరెండు పెన్‌గారు మాతో చెప్పియుండిరి. మే మాయనమాట లంగీకరింపలేదు. తర్వాతికాలములో నెవరైనను భారతదేశ ప్రాచీనవైభవమును నాగరికతను గురించి శంకింపగలరా? అప్పటి కాంగ్లాధ్యాపకులు, వారినను సరించినవారు మన దేశములోని విద్యార్థులకు, హిందూమహాయుగమంతయు నంధకార అనాగరిక కాలమనియు, మహమ్మదీయ మహాయుగములో, హిందువులమీద మునల్మానులు క్రౌర్యములు జరిపిన కాలమనియు, నాగరికత, శాంతి, సంపదలు ప్రారంభమైనది బ్రిటిషుపాలనములోనే యనియు బోధించుచుండిరి. అప్పటి చరిత్రగ్రంథము లటులనే వ్రాయబడియుండెను. మనదేశములో విదేశీ క్రైస్తవ మిషనరీలు విద్యాసంస్థలను, వైద్యాలయములను స్థాపించి వాని సాంఘికసేవ చేసినను, వారు ఆంగ్ల సామ్రాజ్యవాదులకు ఏజంట్లుగనే పనిచేసిరి. వారు సృష్టించిన స్వదేశ క్రైస్తవసంఘములో

కూడ ఆంగ్లపాలనమునందు, ఆంగ్లనాగరికతయందు గాఢానురాగములనే దృఢముగ నెలకొల్పుచుండిరి. చైనా, తురుష్కము మొదలగు ప్రాచ్య దేశములన్నిటిలో కూడ వీరు పాశ్చాత్య సామ్రాజ్యవాదులప్రతినిధులుగనే కృషిసలిపిరి. ఇండియా, చైనాలలోని స్వదేశక్రైస్తవులు వీరిబోధనలనుండి తప్పించుకొని జాతీయస్వతంత్రమును కోరుటకు చాల సంవత్సరములు పట్టెను.

నేను 1901 వ సంవత్సరము డిసెంబరులో నా మిత్రులైన తుమ్మల పల్లి బలరామయ్యగారికి అతిథిగా మదరాసులోని క్రిష్టియనుకాలేజి మొదటి విద్యార్థివసతిగృహములో నుంటిని. బి.ఏ. పరీక్షకు మదరాసు రాజధాని కంతటి కొక్కకేంద్రమే నా డుండేది.ఆ క్రిందటిసంవత్సరమే బెజవాడనుండి సరాసరి చెన్నపట్టణము బీచిస్టేషనునకు రైలు వేయబడినది. తరువాత చాలసంవత్సరాలకు మద్రాసులో సెంట్రలుస్టేషను విస్తరింపబడినది. బందరు-బెజవాడ రైలు 1906 వ సంవత్సరమువరకు పడలేదు. బి.ఏ. ప్యాసయిన తరువాత రెండు సంవత్సరములు నోబులు కళాశాల ప్రధానా చార్యులైన రెవరెండు క్లార్కుగారికోరికమీద నా కళాశాలలో ఆచార్యునిగా పనిచేసితిని. ఏ నెలజీత మా నెల మా నాయనగారిచేతిలో నుంచెడువాడను. ఆయన యపరిమితానందభరితులయ్యేడివారు. అపుడు మునగాలమేనేజరుగా మా నాయనగారికి నెల కేబదిరూప్యముల జీతము. నాకు కూడ నెల కంతే జీతము. 1903 వ సంవత్సరాంతమున మా తండ్రిగారు బందరులోనే స్వర్గస్థులైరి. 1904 వ సంవత్సర ప్రారంభములో కుటుంబముతోకూడ నేను చెన్నపట్టణమునకు పోయి లా కళాశాలలో ప్రవేశించి, 1904, 1905 సంవత్సరములలో నచ్చట చదివి, బి.యల్. ప్యాసయితిని. కీర్తిశేషులైన అల్లాడి కృష్ణస్వామి అయ్యర్ (అడ్వకేట్ జనరల్) రిటైర్డు హైకోర్టు జడ్జి పాకాల వేంకటరమణారావునాయుడు, డాక్టరు లక్కరాజు సుబ్బారావు, చావలి రామ సోమయాజులుగార్లు నాకు లాకాలేజీలో యఫ్.యల్., బి.యల్. క్లాసులలో సహవిద్యార్థులు.

ఆ కాలములో బందరులో నందరకంటె పెద్ద లాయరు పురాణము వేంకటప్పయ్యగారు. మునగాలరాజాగారి ఎస్టేటుదావాలో ఆయన మునగాల రాజాగారివకీలు. ఆయనదగ్గరకు మా నాన్నగారు తరచు వెళ్ళవలసియుండె

డిది. నేను వకీలుపరీక్ష ప్యాసయి పురాణము వేంకటప్పయ్యగారంతవకీలు కావలెనని మా నాన్నగారికోరిక. కాని యా కోరిక నెరవేరకముందే మా నాన్నగారు చనిపోయినారు. స్వతంత్రవ్యక్తిగా నుండుననియే నేను లా చదివి ప్యాసయితిని. నేను బి.యల్. ప్యాసుకాగానే మునగాలరాజాగారిస్నేహితు డగు బందరు కలెక్టరువద్ద హుజూరు శిరస్తాదారుగా నున్న పంచిత నాగేశ్వర రావుగారు నాకు రెవెన్యూడిపార్టుమెంటులో రెవెన్యూ ఇనస్పెక్టరుపని నొసంగెదననియు, రెండుసంవత్సరాలలో మేజస్ట్రేటునుగా చేయుదుమనియు చెప్పినారు. విదేశ గవర్నమెంటుక్రింద ఉద్యోగము చేయను, అని చెప్పు దానిని నిరాకరించినాను. నేను లాయరువృత్తిలో చేరిన మూడుసంవత్సర ములకు మునగాలదావాలో పనిచేసి, హైకోర్టుజడ్జీ అయిన కృష్ణస్వామి అయ్యరుగారిని మాడపాటి వేంకటేశ్వరరావుగారితో కలసి చూడబోయితిని. వారు ప్రసంగవశమున నాకు డిస్ట్రిక్టు మునసబుపని యిత్తుననియు, అందుల కంగీకరింపవలసినదనియు చెప్పినారు. నేను బ్రిటిషు గవర్నమెంటుక్రింద నౌకరీ చేయనని చెప్పితిని.

1906 వ సంవత్సరము జూన్‌నెలలో బెజవాడలో లాయరుగా చేరి తిని. పురాణము వేంకటప్పయ్యగారంత గొప్ప లాయరు నయినాను. కాని మా నాన్నగారు చూడలేదు. 1921 వ సంవత్సరము మార్చి 21 వ తేదీన మహాత్మా గాంధీగారి యాదేశానుసారము లాయరువృత్తిని త్యజించినాను. మరల నా వృత్తిలో నెన్నడును ప్రవేశింపలేదు.

# 2 విద్యార్థిత్వము - ఆచార్యత్వము

## (1)

బందరు నోబులు కళాశాలలోని విద్యార్థిత్వము - రఘుపతి వేంకటరత్నము నాయుడువారి శిష్యత్వము - మునగాల రాజా నాయని వేంకట రంగారావు - కొమర్రాజు లక్ష్మణరావు - క్రైస్తవమత తీవ్రవ్యాప్తి - హిందూమతములోని సంస్కరణోద్యమములు - కందుకూరి వీరేశలింగము పంతులు - రాజా రామమోహనరాయలు - వివేకానంద స్వామి - నా జీవితముపైన వారి ప్రభావము - రేవరెండు ఎడ్డి - వేంకటరత్నము నాయుడుగారిని వెడలగొట్టుట - జాతీయ క్రైస్తవులు - వైజ్ఞానికవిషయములు - బి. ఏ. లో చరిత్ర చదువుట - స్వాతంత్ర్యేచ్ఛ - నా ఆచార్యత్వము - ఉన్నవ లక్ష్మీనారాయణ - సిటిజన్ ఆఫ్ ఇండియా గ్రంథము - విద్యార్థులలో క్రమశిక్షణ - సత్ప్రవర్తనము - భండారు అచ్చమాంబగారి రాక - బృందావన స్త్రీసమాజ స్థాపనము - ఆంధ్రదేశములో స్త్రీ సమాజములు - కృష్ణాపత్రికా జననము - బిపిన్‌చంద్రపాలు రాక - మామీద గారెల కేసు - తైలపక్వ శాస్త్రులుగారు - వితంతూద్వాహము - నందిగామలో బాలికాపాఠశాల - లా కాలేజిలో చదువు - అంతర్వర్ణ భోజనములు - హరిజనులకు రాత్రి పాఠశాల - బంగాళా విభజన వ్యతిరేకోద్యమము - మద్రాసు సముద్రతీరములో

విద్యార్థుల గొప్పసభ - స్వదేశ్యావలంబనము - కాంగ్రెసులో జేరితిని - బళ్ళారి కృష్ణమాచార్యులవారి నాటకసంఘము - పండిత గోపాలాచార్యులు వారి ఆయుర్వేదము.

బందరుకు 1894 జూన్‌లో వెళ్ళినపుడు సర్కిల్లిపేటలో తాడేపల్లి కుటుంబయ్యగారింటిలో కాపురమున్నాము. 1895 చివరవరకు అక్కడనే యున్నాము. మాలో మా అత్తగారి మేనల్లుడగు మేడుకొండూరు హనుమంతరావు పెద్దగా నుండెను. ఆయ నపుడు ఎఫ్. ఏ. చదువు చుండెను. ఆదర్శప్రాయుడైన విద్యార్థి. పరీక్షలో నుత్తీర్ణుడై యుపాధ్యాయవృత్తిలో చేరి రెండు సంవత్సరములకే అకాలమరణమువాత పడెను. 1896 సంవత్సరములో మా బావగారు తనతమ్ముడు మహాబలేశ్వరరావునుకూడ బందరు చదువుటకు బంపినందువలన నతనితోగలసి బుట్టయ్యపేటలో లక్కరాజు శేషమ్మగారింటిలో గాపురమున్నాము. మా బావగారి తల్లి పార్వతమ్మగారు మాకు వంటచేసిపెట్టెడిది. మరుసటిసంవత్సరము వారు రాలేదు కనుక 1897 మొదటిభాగములో బచ్చుపేటలో అవ్వగారి పూటకూటియింటిలో భోజనముచేయుచు నా క్లాసులో సహవిద్యార్థి అయిన బుద్ధిరాజు పావకేశ్వరరావుతో గలసి గదితీసికొని యుంటిని. అక్కడనే భోగరాజు పట్టాభిసీతారామయ్య మరియొకగదిలో నున్నాడు. ఆయనపుడు నోబులుకళాశాలలో ఎఫ్.ఏ సీనియరులో విద్యార్థిగా నున్నాడు. ఆయన పశ్చిమగోదావరిజిల్లా గుండుగొలను కరణముగారి పుత్రుడు. 1895 వరకు ఏలూరులో చదివి మెట్రిక్యులేషను ప్యాసై 1896, 1897 సంవత్సరములలో బందరులో నోబులుకళాశాలలో ఎఫ్.ఏ. చదివి, యుత్తీర్ణుడైనాడు. పిమ్మట చెన్నపట్టణము పోయి క్రిస్టియను కళాశాలలో ప్రకృతిశాస్త్రముతో బి. ఏ. ప్యాసై చెన్నపట్టణములోని వైద్యకళాశాలలో యం.బి.సి.యం. చదివి కృతార్థుడై 1906 సంవత్సరములో బందరులో వైద్యవృత్తిలో చేరినాడు. సమర్థుడైన వైద్యుడని, కుశాగ్రబుద్ధియని పేరుపొందినాడు. 1906 మొదలు కాంగ్రెసులోచేరి గొప్ప నాయకుడైనాడు. ఆయన నాకన్న రెండు నెలలు వయసులో పెద్దవాడు. బందరులో అవ్వగారి హోటలువద్ద నెల కారు రూపాయలు లిచ్చెడువారము. మూడుపూటల పెరుగు, నెయ్యి వేసి బాగుగా

భోజనము పెట్టెడిది. అప్పటికి కత్తీనెయ్యి, డాల్డాలు లేవు. 1897 లో రెండవభాగములో బ్రాహ్మణవిద్యార్థుల కొరకు నోబులు కళాశాలాధికారులు బుట్టయ్యపేటలో హవులాకు విద్యార్థులవసతిగృహమును తెరచినందున నేను, నా సహవిద్యార్థి బుద్ధిరాజు పావకేశ్వరరావు అందులో జేరినాము. పట్టాభిసీతారామయ్య, అవ్వగారి హోటలులోనే యున్నాడు. దేశిరాజు పెదబాపయ్యనెడు మరియొకవిద్యార్థి బందరు నోబులుకళాశాలలో మెట్రిక్యులేషనులో యఫ్.ఏ. లో కూడ నాకు సహవిద్యార్థిగనుండెను. అతడు రెండుపూటల సంధ్యావందనముచేయుచు పూర్వాచారపరాయణుడై హిందూమతదాలసమాజములో ముఖ్యసభ్యుడై శైవభక్తి కలిగియుండెను. యఫ్.ఏ.లో కృతార్థుడు కాగానే యతడు చెన్నపట్టణముపెళ్ళి క్రైస్తవకళాశాలలో జేరి రెండు బి.ఏ. లు ప్యాసైనాడు. అచట కందుకూరి వీరేశలింగముపంతులుగారి బోధలక్రిందికి వచ్చి బ్రహ్మసమాజములో నగ్రస్థానము వహించినాడు. రాజమహేంద్రవరములోని ప్రభుత్వకళాశాలలో నాచార్యుడుగానుండి అనుష్ఠానిక బ్రహ్మసామాజికుడై వీరేశలింగముగారి కంటె ముందే కులభ్రష్టుపై తిరుగుబాటుగావించి యజ్ఞోపవీతమును దీసివేసినాడు. కులములోనుండి వెలిపడినాడు. పూర్వాచారపరాయణులైన ఆయనమామగారు ఆయనభార్య నాతనివద్దకు కాపురముచేయుటకు బంప నిరాకరింపగా నైష్ఠికబ్రహ్మచారిగా అతి పవిత్రజీవితమును గడిపి సంఘసంస్కర్తలకు మార్గదర్శకుడై 26 వ యేటనే 1908 వ సంవత్సరములో క్షయరోగమువలన దివంగతుడయ్యెను.

మరియొక సుప్రసిద్ధ నోబులు కళాశాలవిద్యార్థి కోపల్లె హనుమంతరావు 1896 లోనే ఎఫ్.ఏ. ప్యాసై మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో వృక్షశాస్త్రములో బి.ఏ., యం.ఏ. లలో కృతార్థుడై రెండు సంవత్సరములు కూసూరులో గవర్నమెంటు వృక్షశాస్త్ర నిపుణుడుగా బనిచేసి దానిని విడచి, మద్రాసు లా కాలేజిలో చదివి బి.యల్. ప్యాసై 1904 వ సంవత్సరములో యం.ఏ.బి.యల్. గా బందరులో లాయరువృత్తిలో జేరెను. కాని ఆయన 1907 లో సూరతు కాంగ్రెసుకు వెళ్ళిరాగానే జాతీయకళాశాల నొకదానిని బందరులో స్థాపింపవలెనను సంకల్పముతో 1908 వ సంవత్సరములోనే

ప్లీడరీవృత్తిని త్యజించెను. తరువాత జాతీయ [illegible] భోగరాజు పట్టాభిసీతారామయ్య, ముట్నూరు కృష్ణారావు, [illegible] నారాయణరావు, పెడింటి హనుమంతరావు మొదలగువారి సహాయముతో ద్రవ్యమును ప్రోగుచేసి భూములు సంపాదించి 1910 వ సంవత్సరములో ఆంధ్ర జాతీయకళాశాలను స్థాపింపగల్గెను. దాని ప్రారంభోత్సవము [illegible] వేంకటప్పయ్య పంతులుగారిచే జేయించిరి ఆ ఉత్సవములో నేనుకూడ పాల్గొంటిని. నేనుకూడ దాని జనరల్ కమిటీలో చాలకాలము సభ్యుడిగా పనిచేసితిని. నేను 1116 రూపాయలను చందాగా నిచ్చితిని. 1922 లో కోపల్లె హనుమంతరావు అకాలమరణము నొందెను. అప్పటివరకు ఆయనే దానికి ప్రధానాచార్యులుగా నుండి చక్కగా నడిపించెను. జాతీయమహాసభ్య కాంగ్రెసు నడిపిన స్వతంత్రోద్యమములో ప్రధానభాగముగ [illegible] హిందూదేశములో పెక్కుచోట్ల పెక్కు జాతీయకళాశాలలు స్థాపింపబడినవి. ఆంధ్రదేశములో రాజమహేంద్రవరములో గూడ 1908 లో చిలకమర్తి లక్ష్మీనరసింహము, గంటి లక్ష్మన్న, గున్నేశ్వరరావుగార్లు మొదలైన నాయకులు జాతీయపాఠశాల ప్రారంభముచేసినపుడు నేను [illegible] యొక ప్రసంగము గావించితిని. దేశస్వాతంత్ర్య సంపాదనకొరకు లాయర్లు తమ వృత్తులను విడచిపెట్టి బయటకు రావలసినదని మహాత్మా గాంధీ పిలుచుటకు పదమూడు సంవత్సరములకుముందే కోపల్లె హనుమంతరావు తన ప్లీడరీ వృత్తిని త్యజించి తన జీవితమును దేశసేవకర్పించి దేశాభిమానులైన లాయర్లందర కాదర్శపురుషు డయ్యెను.

1899 ఏప్రియలు వరకు నేను హవలాకు హాస్టలులో నుంటిని. ఆ సంవత్సరము జూన్ నెలలో మా అమ్మను, నా భార్యను, నా చెల్లెలిని నందిగామనుండి బందరు తీసికొనివచ్చి బుట్టయ్యపేట హాస్టలు ప్రక్కనే యున్న దంటు పున్నమ్మగారి యింటిలో గాపురముపెట్టినాము. బుద్ధిరాజు పావకేశ్వరరావుకూడ హాస్టలుప్రక్కనే మరియొక యింటిలో గాపురముండెను. 1901 డిసెంబరులో నేను బి.ఏ. పూర్తిచేయునంతవరకు నా యింటియందే యుంటిమి. అప్పటితో బి.ఏ. ప్యాసయి నోబులు కళాశాలలో విద్యార్థిదశ ముగించితిని.

మా నాన్నగారు ఆకాలమునందు మునగాల రాజాగారి పెద్ద దావాలో పనిచేయుటకు బందరులో తరచుగా నుండవలసివచ్చెడిది.

నా కుటుంబమును బందరు తీసికొనివచ్చుటకు పూర్వము పూటకూటి యింటిలో భోజనముచేయుచు మునగాల రాజాగారి బంగళాలో నుండెడి వారు. మా కుటుంబము వచ్చినతరువాత మాతో గలసియుండి వారి బంగళాకు వెళ్ళివచ్చుచుండువారు. నందిగామతాలూకాలోని మునగాలపరగణా జమీందారిణి నాయని అచ్చమ్మారావుగారివద్ద మా నాయనగారు ఉద్యోగముచేయుచుండగా ఆమె 1892 సంవత్సరములో మరణించినది. ఆమెకు దత్తపుత్రులైన నాయని వేంకటరంగారావుగారు అప్పటికి 14 సంవత్సరాలయీడుగల మైనరుగానున్నందున నందిగామ తహసీలుదారువద్ద కొంత రెవెన్యూవిచారణను జరిపి, ఆయనపక్షమున గవర్నమెంటు "కోర్టాఫ్‌వార్డ్సు"వారు మునగాల పరగణాను స్వాధీనపరచుకొని, ఆయనను నోబులుకళాశాలలో విద్యార్థిగా జేర్చి బచ్చుపేటలోని యొక బంగళాలో కాపురమేర్పరచిరి. ఆయనయొక్క దత్తత చెల్లనని వాదించుచు అచ్చమ్మారావుగారి తండ్రివారసులగు కీసర వారు రెవెన్యూలో ఓడిపోయి, ఏలూరు సబుకోర్టులో రెండు సివిలుదావాలు దాఖలుచేసిరి. అవి 1894 లో బందరు జిల్లాకోర్టుకు ట్రాన్సుఫరు చేయబడి అక్కడ 1914 వరకు నిలువలోనుండెను. మా నాన్నగారు ఆ దావాలలో వేంకటరంగారావుగారిపక్షమున పనిచేయుటకు ప్రత్యేకముగా నేర్పాటుచేయబడిరి. ఆయన తెలుగులో లా గ్రంథములను చదివెడువారు. లాయరుకున్న తెలివితేటలుండెడివి. ఉభయపక్షముల ముఖ్యసాక్షులు వరంగల్లు, నల్లగొండ జిల్లాలలోని రెడ్డిదేశముఖులు తదితరులు నైయున్నందున వారిని కమీషన్లమీద విచారణచేయించుటకు మా తండ్రిగారు అక్కడకు బోవుచు, మిగిలినకాలములో బందరులోని మునగాల రాజాగారి బంగళాలో నుండెడువారు. 1900 వ సంవత్సరము రెండవభాగములో వేంకటరంగారావుగారికి ఎస్టేటు ఒప్పగింత చేయబడినందున ఆయన మునగాలపరగణా ముఖ్యస్థానమైన నడిగూడెము లోని వారికోటలోనికి కాపురమునకు వెళ్ళిరి. 1894 లో నేను బందరులో చదువుకొనుటకు ప్రవేశించినప్పటినుండియు 1900 సంవత్సరమువరకుతరచు సాయంత్రపువేళలందును,అప్పుడప్పుడుశలవులలో పగటివేళలందునుమునగాల

రాజాగారిబంగళాకు వెళ్ళి ఆయనతోడను, అక్కడ చేపపంపిన యితర విద్యార్థిమిత్రులతోడను కాలముగడపుచుంటిని.

ఆ విద్యార్థులలో పింగళి పురుషోత్తము, పింగళి లక్ష్మీనారాయణ, పిన్నలి కుటుంబరావు, కొండిపర్తి వీరభద్రాచారిగార్లు ముఖ్యులు 1898 వ సంవత్సరములో నాగపురములో బి.ఏ. చదువుచుండిన విద్యార్థియగు కొప్రరాజు లక్ష్మణరావుగారు బందరునకు మునగాల రాజాగారివద్దకు వచ్చెను. ఆయనకూడ మా అందరతో చేరెను. నాకు, రాజాగారి కతి ముఖ్యమిత్రు డయ్యెను. ఆయనతండ్రి వేంకటప్పయ్యగారు నందిగామతాలూకా పెనుగంచి ప్రోలు కాపురస్థుడు. మా బావ చామర్తి మల్లిఖార్జునరావుగారికి కొంచెము దూరబంధువు. వేంకటప్పయ్యగారు నాయని లచ్చమ్మారావుగారివద్ద మునగాల ఎస్టేటుకు మేనేజరుగానుండెను. లచ్చమ్మారావుగారిభర్త వేంకటరామయ్య గారు చనిపోయినంతనే లచ్చమ్మారావుగారు వేంకటప్పయ్యగారిని మేనేజరుపదనిలోనుండి తీసివేసినది. ఆయన కుటుంబముతో పెనుగంచి ప్రోలు వచ్చి కొలదికాలములోనే మరణించెను. ఆయనభార్య గంగమ్మ గారు తన పిల్లలనిద్దరను, అనగా కూతు రచ్చమాంబను, కొడుకు లక్ష్మణరావును వెంటబెట్టుకొని ఆమె సోదరుడైన భండారు మాధవ రావుగారి వద్దకు మధ్యవరగణాలలోని నాగపూరునకు పోయినది. ఆయన యక్కడ పబ్లికువర్క్సు డిపార్టుమెంటులో ఇంజనీయ రుగా నుండెను. ఆయన కాపురస్థలముకూడ నందిగామ తాలూకాలోని కంచెల గ్రామము. కొలదికాలములో నాయనభార్య నిస్సంతుగా చనిపోయి నందువలన మేనగోడలైన అచ్చమాంబను పెండ్లియాడెను. లక్ష్మణరావాయన వద్దనేయుండి చదువుకొని, నాగపురములోని మారిసు కళాశాలలో బి.ఏ. విద్యార్థిగా యుండగా 1898 లో మునగాల రాజాను చూచుటకు బందరు వచ్చెను. లక్ష్మణరావుగారికి తల్లిసలహాప్రకారము బి.ఏ. ప్యాసుకాగానే మరల మునగాల రాజాగారివద్ద దివానుగా పనిచేయవలెనను కోరికయుండెను. ఆయన 1898, 1899, 1900 సంవత్సరాలలో నెలలకొలది బందరులో రాజాగారివద్దనే యుండెడివాడు. మా బావగారు, బెజవాడ తాలూకా కంకి పాడు కరణము కొమ్మూరు మల్లికార్జునరావుగారి కూతురగు కోటమాంబను

లక్ష్మణరావుగారి కిప్పించి వివాహము చేయించెను. కానూరు మల్లికార్జున రావుగారు మా బావగారికి చెల్లెలిపెనిమిటి. కోటమాంబ మా బావగారి చెల్లెలి కూతురు. మా బావగారితోపాటు కొమర్రాజు లక్ష్మణరావుగారు, కానూరు మల్లికార్జునరావుగారు కూడ లింగధారులే. 1900.వ సంవత్సరాంతమున మునగాల రాజాగారికి మునగాలఎస్టేటు ఒప్పగింపబడినవెంటనే కొమర్రాజు లక్ష్మణరావుగారిని దివానుగను, మా నాయనగారిని మేనేజరుగాను రాజాగారు నియమించిరి. లక్ష్మణరావుగారు పిమ్మట రెండుమూడు సంవత్సరాలలో కలకత్తా విశ్వవిద్యాలయమునుండి ఎం. ఏ. కూడ ప్యాసయ్యెను.

(2)

నోబులుకళాశాల ఇంగ్లండులోని చర్చిమిషను సొసైటీవారి యాజమాన్యమున నడుపబడుచున్న కళాశాల. రెవరెండు నోబులుగారిచే 1850 ప్రాంతమున ప్రారంభింపబడినది. మంచి యోగ్యులైన క్రైస్తవ మిషనరీలను, ఇంగ్లండునుండి అధ్యాపకులుగా బంపుచుండిరి. క్రైస్తవమత బోధకు, నైపత్కృత్తికి, సత్ప్రవర్తనమునకు ప్రాముఖ్యమీయబడినది. నేను జదువుకొనుచున్నకాలములో రెవరెండుక్లార్కుగారు ప్రధానాచార్యులుగా నుండిరి. ఆయన నైతిక క్రమశిక్షణను బాగుగా బాటించియుండెను. రెవరెండు పెన్నుగారు చరిత్రనుబోధించు నధ్యాపకులుగా నుండిరి.క్లార్కుగారింగ్లాండు పోయినపుడు వీరు ప్రధానాచార్యులుగా బనిచేయుచుండిరి. కొన్నిసంవత్సరములు రెవరెండు ఎన్నిస్ ఇంగ్లీషు అధ్యాపకులుగాను, రెవరెండు రాబర్ట్సుగారు బి.ఏ.లో రాజకీయశాస్త్రాధ్యాపకులుగా బనిచేసిరి. వీరందరు సమర్థులు, యోగ్యులు. వారును, వారి సతీమణులును విద్యార్థులను మిగుల నాదరముతో జూచిరి. హిందువులగు విద్యార్థులు వారియందు భక్తిగౌరవములతో ప్రవర్తించిరి. స్వదేశ క్రైస్తవోపాధ్యాయులును, క్రైస్తవేతరోపాధ్యాయులును చాలమంది అపు డుండెడివారు. వారందరు యోగ్యులే. ఆ కళాశాలలో ప్రత్యుదయము ప్రారంభమున పెద్దహాలులో విద్యార్థులందరను ప్రోగుచేసి ప్రధానాచార్యులుగాని, మఱియొక తెల్ల అధ్యాపకులుగాని క్రైస్తవపద్ధతిని ప్రార్థనజరిపి క్రైస్తవవేదమైన బైబిలులోని

యేదో కొంతభాగమును చదివి దానికి వ్యాఖ్యానముచేయుచు నుపన్యసించు చుండువారు. బైబిలు అన్నితరగతులలోను బి.ఏ.వరకుకూడ పఠనీయపాఠ్య గ్రంథముగా నుండెను. బైబిలుయొక్క పీఠిక, వేరుపరీక్షలలో ఉత్తీర్ణులైన వారికి బహుమతులిచ్చెడువారు. నే నట్లు పర్యాయము బహుమానములు పొందు కొన్నాను. ఒకవిధమైన నైతిక - ఆధ్యాత్మికవాతావరణము నోబులుకళా శాలలో వ్యాపించియుండెను. నాకు ఏసుక్రీస్తుప్రభువుయొక్క ఆదర్శజీవి తమునందును, ప్రేమతత్త్వమునం దత్యంతభక్తిగౌరవములేర్పడినవి. క్రైస్తవేత రోపాధ్యాయులలో మా కాలములో చెన్నాప్రగడ భానుమూర్తి, వేపనాటి రామకృష్ణారావు, దుగ్గిరాల రామమూర్తి, వల్లమూడి బ్రహ్మయ్య, దాసు కొలను త్రివిక్రమరామారావుగార్లు ముఖ్యులు.

అందరకన్న నెక్కువ ప్రాముఖ్యతవహించిన ఆచార్యులు, నవ్యాంధ్ర దేశములో మహాజ్యోతివలె ప్రకాశించినవారు, నోబులుకళాశాలలోని విద్యా ర్థులలోనేగాక ఆంధ్రదేశమందంతటను నూతన మత సాంఘిక నైతికవిప్లవ మును నెలకొల్పినవారు రఘుపతి వేంకటరత్నమునాయుడుగారు. వారు 1894 మొదలు 1899 వ సంవత్సరమువరకు నోబులు కళాశాలలో నాచార్య పీఠమలంకరించియుండిరి. ఆయన యింగ్లీషుభాషలో చాల గొప్పపండితుడు. అనర్గళధారావాహినిగా నుపన్యాసమిచ్చెడువాడు. విద్యార్థులను కన్నబిడ్డల వలె నాదరించినవాడు. పవిత్రజీవితమునకు - దైవభక్తికి ప్రత్యేకముగా పేరుగన్నవాడు. ఋషితుల్యుడైన ఆచార్యుడు. ఎఫ్.ఏ., బి.ఏ. క్లాసులకు ఇంగ్లీషు బోధించెడువాడు. మదరాసురాజధాని మొత్తముమీద షేక్స్పియరు నాటకములను, ఇంగ్లీషుకవిత్వమును బోధించుటకు మద్రాసు క్రైస్తవకళా శాల ప్రధానాచార్యులగు రెవరెండు డాక్టరు మిల్లరుగారు కడు సమర్థు లనియు, దరువాత రఘుపతి వేంకటరత్నమునాయుడుగారే సమర్థులను నభి ప్రాయముండెడిది. ఆ కాలములో కోపల్లె హనుమంతరావు, ముట్నూరి కృష్ణారావు, భోగరాజు పట్టాభిసీతారామయ్య, మక్కపాటి సుబ్బారాయుడు గారు మున్నగు ప్రముఖులెందరో వారివద్ద జదువుకొన్నవారే. 1897 వ సంవత్సరములో మెట్రిక్యులేషనులోను, 1898, 1899 సంవత్సరాలలో ఎఫ్.ఏ.లోను, ఆయనవద్ద ఇంగ్లీషు నభ్యసించిన అదృష్టము నా కబ్బినది.

వర్డ్స్‌వర్త్, ఎమర్సన్, కార్లైల్, షెల్లీ, బైరన్ ఆయనవద్ద జదువుకొన్నాను. ఆయన క్లాసుపాఠములు చెప్పుచుండగనే సైనసేవను, మానవసేవను బోధించి యుత్తమసాహిత్యములలోనికి మమ్ములను దీసికొనిపోయెడివాడు. ఆయనయందు రెవరెండు క్లార్కుగారికి యితర తెల్లమిషనరీలకు మిక్కిలి గౌరవముండెడిది. ఆయన యిరువదియేడవయేట భార్యావియోగమును పొందెను. పునర్వివాహము చేసికొనగూడదని అతని సిద్ధాంతము. ఏకపత్నీవ్రతము నావిధముగా నాతడనుష్ఠించి అతిపవిత్రమైన బ్రహ్మచర్యవ్రత మనుష్ఠించెను. అచంచలమైన యేకేశ్వరోపాసకుడు. చుట్ట, బీడి, మద్యమును బోలిన యే చిన్నదుర్గుణములుకూడ నాతనికి లేకుండెను. మాంసాహారమును విసర్జించెను. నైష్ఠికశాకాహారిగా నుండెను. కోడిగ్రుడ్లనుకూడ దినకుండెను. రాజా రామమోహనరాయలు, మహర్షి దేవేంద్రనాథటాగూరు, కేశవచంద్రసేన్‌గార్లు నడిపిన బ్రహ్మసమాజమునకు ఆంధ్రదేశములో ప్రధాననాయకుడుగా నుండెను. కులభేదములను త్యజించి, పంచముల అంటుదోషమును పారద్రోలి, విగ్రహారాధనను మాని, ఏకేశ్వరోపాసనము మానసికముగా గావించి పవిత్రమైన జీవితమును గడపుచు, మానవసేవ చేయుట, మానవసమానత్వమును, సోదరత్వమును, ప్రేమను స్థాపించుట, స్త్రీల అభ్యున్నతికి పాటుపడుట బ్రహ్మసమాజబోధలు. ఉపనిషత్తులే దీనికి పునాదిగా నుండెను. ఆ సిద్ధాంతముల ననుష్ఠించుటలో వేంకటరత్నము నాయుడుగా రాదర్శమూర్తి. వానినే ఆయన ప్రజలందరకు బోధించెను. మాలమాదిగవిద్యార్థులను, విద్యార్థినులను తనయింటిలో బెట్టుకొనెను. ఇద్దరు హరిజనవిద్యార్థినులకు నుత్తమవిద్యనిప్పించి, వారినిద్దరి నాయనశిష్యరత్నములైన బ్రాహ్మణవిద్యావంతులకు వివాహమొనర్చెను. వారిలో పెద్దఅమ్మాయి సగుణ మహాలక్ష్మమ్మ బి.ఏ.,యల్.టి. ప్యాసై స్కూళ్ళయిన్‌స్పెక్ట్రసుగా పనిచేసినది. ఆమెను కంభంపాటి రామశాస్త్రియను బి.ఏ.,బి.యిడి. ప్యాసైన బ్రాహ్మణకులస్థుడైన విద్యాధికుడు వివాహమాడినాడు. ఆయన మక్కపాటి సుబ్బారాయుడుగారి మేనల్లుడు. ఆయనకూడ జిల్లావిద్యాశాఖలో పనిచేయుచున్నాడు. రెండవఅమ్మాయి విమల యల్.యం.పి.లో కృతార్థురాలైనది. ఆమెను సత్తిరాజు శేషగిరిరావు అను బి.ఏ.,బి.యల్, ప్యాసైన బ్రాహ్మ

ఋడు వివాహమాడెను. నాయుడుగారి శిష్యుడైన సబ్బా సింబంత మను హరిజనవిద్యార్థి బి.ఏ. ప్యాసయి గవర్నమెంటు ఆఫ్ ఇండియాలో గొప్ప యుద్యోగములో నున్నాడు. ఆయన నాయుడుగారు పెంచిన లోకనాయకమ్మ అను బ్రాహ్మణేతరవిద్యార్థినిని పెండ్లియాడినాడు. వేంకటరత్నము నాయుడుగారు అతి నిరాడంబరజీవులు. ఆయన అపస్మృహాయుక్తులు, అపంచలమైన, అకల్మషమైన జీవితము, ఉత్కృష్టమైనబోధలు. ఆయనయొక్క ప్రేమతత్త్వము చాలమంది విద్యార్థుల నాకర్షించినవనుటలో నతిశయోక్తి లేదు. బందరులో ఆయనను పూజ్యభావముతో జూడనివాడు లేడు. ఆయన బచ్చుపేటలో గాపురముండెడువారు. కాలేజీకి నడచివెళ్ళి నడచియే వచ్చెడు వారు. ఆయనతోగూడ విద్యార్థులము వెళ్ళెడువారము. నాతో మిగుల సంతోషముగా మాట్లాడుచు, పరిహాసములాడుచు ఋజువుగా ప్రేమతో జూచెడువారు. ఆయన రోడ్డుమీద వచ్చుచున్నారనగా దూరమున బోవువారు నోటనున్న చుట్టలను పారవైచి వినమ్రులై నడచెడువారు. నామీద ఆయనకు జాల దయయుండెను. కాని వారు నేను కష్టపడి చదువననియు సోమరి నననియు పరిహసించెడువారు. ఆయన యొకరోజున మెట్రిక్యులేషను క్లాసులో బాఠముచెప్పుచు నొకకథ చెప్పినారు. ఒక ఉపాధ్యాయుడు క్లాసులో అందరకంటె నెక్కువసోమరిపోతుగానున్న విద్యార్థి కొక తోలుపతాకమును బహుమతియిచ్చెదనని చెప్పి, అట్టి సోమరిపోతెవరో లేచి నిలువబడు మన్నాడు. చాలమంది నేను నేనని లేచి నిలువబడిరి. ఒకమూల నొక విద్యార్థి కూర్చొని తనప్రక్కవిద్యార్థితో నా పతాకమునుదెచ్చి తనజేబులో బెట్టుమని చెప్పుచుండగా నా యుపాధ్యాయుడు విని యితడే నిజమైన సోమరిపోతని యా పతాకమును ఆతనివద్దకు దీసికొనిపోయి యిచ్చెనట. అట్టి సోమరి పోతువు నీవేనా? అని నన్ను వేళాకోళముచేసినారు. నేను కొంతవరకు సోమరివాడనేగాని అంత కాదని చెప్పగా నందరును నవ్విరి.

వేమూరి రామకృష్ణారావుగారు బందరు చింతగుంటపాలెము వాస్తవ్యులు. నోబులు కళాశాలలో బి.ఏ. క్లాసు తెరచినపుడు మొదటి బ్యాచి విద్యార్థి. ఆయన వేంకటరత్నము నాయుడుగారికి ప్రథమ శిష్యుడైనాడు. ఆయనకు యిరువదవయేటనే భార్యావియోగము సంప్రాప్తించెను. మరల

వివాహము చేసికొన నిరాకరించి వేంకటరత్నమునాయుడుగారి అడుగుజాడలలోనే నడచి, యతిపవిత్రమైన దైవభక్తిపూరిత జీవితమును నడపినాడు. ఆంధ్రదేశములోని బ్రహ్మసమాజమునకు బట్టుగొమ్మగా నుండెను. ఆయన యం.ఏ. ప్యాసయి డాక్టరేటు బిరుదమునుగూడ బొందెను. హైస్కూలు క్లాసులలోను, ఎఫ్.ఏ. లో నాయనదగ్గర జదువుకొనుభాగ్యము నాకు కల్గినది. ముగ్గిరాల రామమూర్తిగారు కూడ బహుయోగ్యులు. బ్రహ్మసమాజమునందు భక్తిగలవారు. చెన్నాప్రగడ భానుమూర్తిగారు నాకు గణితమును బోధించెడువారు. చాల మంచివారు. ఏ పద్యమునైన నొక్కసారి చదివి మరల అప్పజెప్పెడువారు. నే నాయనవద్ద 5, 6 ఫారములలో జదువుకొన్నాను. నన్నొకసారి తెలుగుపద్యము నొకమాటు చదివి యప్పగించగలవా ? అని అడిగినారు. ఒకసారి మీరు బిగ్గరగా జదివి యప్పగించిన, దానిని విని నేను వెంటనే యప్పగించగలనంటిని. క్లాసులో కొన్ని పద్యములు ఆయన యొకసారి చదివి యప్పగించుటయు, నే నావెంటనే అప్పగించుటయు జరిగినది. ఆయన తెనుగులో బాగుగ కవిత్వము చెప్పగలరు. దేశాభిమానపూరితములైన పద్యములను వ్రాసియుండెను. ఆయన కొంత కాలమునకు నోబులు కళాశాలను వదలి గవర్నమెంటు ఉద్యోగములో బ్రవేశించి గవర్నమెంటు (ద్విభాషి) ట్రాన్స్లేటరయినాడు. వడ్లమూడి బ్రహ్మయ్యగారు నాకు మెట్రిక్యులేషనులోని ప్రిలిమనరీ పరీక్షలో ఆల్జిబ్రాలో నేబదికి నేబదిమార్కులు, ఇంగ్లీషు తెలుగు తర్జుమాలోగూడ ముప్పదియైదింటికి ముప్పదియైదు మార్కు లిచ్చినారు. ఆయనకు నామీద జాల ప్రేమ. ఆయన భగవద్గీతకూడ జదివినాడు. కొన్ని సంవత్సరములకు నోబులు కళాశాలను విడచిపెట్టి గవర్నమెంటు ఉద్యోగములో బ్రవేశించి డిప్యూటీ కలెక్టరుగా బెజవాడలో బనిచేసినాడు. నేను లాయరుగానున్న యా కాలములో నపుడపుడు నన్ను గలసి భగవద్గీతావిషయములో చర్చలను చేసెడువాడు. 1922 వ సంవత్సరములో నన్ను సహాయ నిరాకరణోద్యమములో పోలీసువారరెస్టుచేసి కేసుపెట్టినపుడు బ్రహ్మయ్య పంతులుగారే మొదటి తరగతి మేజిస్ట్రేటుగా నొక సంవత్సరము శిక్షవేసి తమ చేతిమీదుగనే రాజమహేంద్రవరము జైలునకు నన్ను బంపినాడు. ఆ రోజులలో పందరు రాజకీయ

హై దీలకు సి. క్లాసే యిచ్చెడువారు. నా ప్రవర్తన చాల మంచిదనియు, నా యారోగ్యము సున్నితమైనదనియు నాకు నేయి, మజ్జిగ మొదలగు సదుపాయములు చేయవలసినదనియు ఆయన తన రహస్యపు రిపోర్టులో వ్రాసినట్లు తెలిసినది. కొనుకొలను త్రివిక్రమరామారావుగారు ఆచార్యపదవిని బరిత్యజించిన పిమ్మట సన్న్యాసమును స్వీకరించి గొప్ప హిందూమతప్రచారకులై తిరునల్వేలి జిల్లాలోని కుర్తాళము పీఠమున కధిపతియయ్యెను. ఆయన యీ మధ్యనే పరమపదించినాడు.

నేను నోబులు కళాశాలలో జదువుకొన్న కాలములో నాకంటె పైక్లాసులలో నిద్దరు క్రైస్తవ యువతులు ఓరుగంటి పరరామకృష్ణయ్య గారి కుమార్తెలు కమల, రత్నమనెడువారు ఎఫ్.ఏ., బి.ఏ.లు చదివి ప్యాసైనారు. తరువాత ఎం.ఏ. కూడ ప్యాసయిరి. ఇద్దరు మిగుల సుందరమైన యువతులు. వివాహయోగ్యమైన ప్రవర్తనగలవారు. వెంకటరత్నమునాయుడు గారి శిష్యురాండ్రై, వారియందు విశేషభక్తిని గలిగియుండిరి. పెద్దకుమార్తె కమల వేమూరి రామకృష్ణారావుగారితోపాటు బి.ఏ. లో సహవిద్యార్థినియై యింగ్లీషులో గొప్ప ప్రవీణురాలుగా నుండెను. ఇద్దరిలో నెవరి కెక్కువ మార్కులు వేయవలెనో నాయుడుగారికి దోచకుండెడిది. ఆమె మద్రాసులో ప్రొఫెసరుగానున్న సత్యనాథముగారిని పెండ్లియాడెను. ఇండియన్ లేడీస్ మాగజైన్ (భారతమహిళా పత్రిక) అను పత్రికను చాల సంవత్సరములు ఇంగ్లీషులో సమర్థతతో నడిపినది. వారి కుమారుడు సత్యనాథముగా రిపుడు మద్రాసు గవర్నమెంటు చీఫ్ సెక్రటరీగానున్నారు. రెండవ కుమార్తె రత్నము మధురలోని బారిష్టరైన హెన్స్‌మన్‌గారిని పెండ్లాడినది. ఆయన మరణించిన పిమ్మట బెంగుళూరులోని వాణీవిలాస స్త్రీల కళాశాలకు ప్రధానాచార్యురాలుగా పనిచేసినది. ఆయిద్దరికంటె నిక విద్యార్థిను లాకాలమున నోబులు కళాశాలలో లేకుండిరి. స్త్రీవిద్య యప్పటి కెక్కువ వృద్ధిలోలేదు.

(3)

నేను నోబులు కళాశాలలో చేరకముందే కొన్ని సంవత్సరముల క్రిందట నా కళాశాలలో జదువుకొన్న 12 మంది బ్రాహ్మణ యువకులు

సుమారుగా ఒకేకాలములో క్రైస్తవమతమును స్వీకరించినారు. వారిలో ధన్వాడ అనంతము, ఓరుగంటి శివరామకృష్ణమ్మ, చేపేంద్ర వేంకటచలము, దర్భా రామశాస్త్రి, చోడి సీనయ్య, సముద్రయ్య, మల్లాది వేంకటరత్నము, ప్రభల రామచంద్రయ్య యనువారు గలరు. వీరందరు విద్యాధికులై పేరు ప్రతిష్ఠ లార్జించి గొప్పగొప్ప యుద్యోగములను జేసిరి. వారి సంతతివారు కూడ విద్యాధికులై రి. మంచి స్థానముల నాక్రమించిరి. ఆ కాలములో క్రైస్తవ మిషనరీలకు ఆంగ్లేయ ప్రభుత్వములో మంచి పలుకుబడి యుండెను. ముఖ్యముగా తెల్లయుద్యోగస్థులు క్రైస్తవమతమునకు ప్రోత్సాహమిచ్చుచుండిరి. హిందువులందరను కాలక్రమేణ క్రైస్తవులనుగా జేయుటకే తా నింగ్లీషుభాషను హిందూదేశములో ప్రవేశపెట్టుచున్నానని తన సోదరికి మెకాలేప్రభువు వ్రాసియుండెను. హిందూ సంఘములో ప్రబలి యున్న మూఢవిశ్వాసములవలనను, హిందూ పండితులు తమయొక్క విజ్ఞానమును ప్రజలకు వ్యాపింపజేయకుండుటవలనను, హిందూధర్మము కంటెను కుల మతాచారములకు ఎక్కువ ప్రాముఖ్య మొసంగుటవలనను పండితులకును నాంగ్లవిద్యాధికులకును నెట్టి సానుభూతి లేకుండెను. ఆ కాలములో పై వర్ణములకుజెందిన విద్యాధికు లాంధ్రదేశమందేగాక, బంగాళమునందు నితరప్రాంతములయందుగూడ క్రైస్తవమతమును స్వీకరించుట జరుగుచుండెను. మేఘనాథవధకావ్యమును రచించిన సుప్రసిద్ధ బెంగాలీ కవీశ్వరులగు మైకేల్ మధుసూదనదత్తు ఆవిధముగా క్రైస్తవమతమును స్వీకరించినవాడే. నా చిన్నతనములో తెల్ల మిషనరీలు, స్వదేశీక్రైస్తవులు మా నందిగామనుబోలిన పల్లెటూళ్ళకుగూడ వచ్చి బజార్లలో నిలువబడి పిడేళ్ళువాయించుచు క్రైస్తవకీర్తనలను పాడుచు గుమికూడిన ప్రజలకు క్రైస్తవమతమును బోధించుచుండిరి. రాముడు, కృష్ణుడు మొదలైన హిందూదేవతలను మిగుల జెడ్డగా నపహసించిరి. హిందూమతము కేవలము మౌఢ్యమైనమతమని బోధించిరి. ప్రజలను భ్రమింపజేసిరి. గుంటూరు జిల్లాలోని కొన్నిగ్రామములలో రెడ్లు, కమ్మవారుకూడ క్రైస్తవమతమును స్వీకరించిరి. హిందూమతములో మాల మాదిగలను మానవస్వత్వములు లేకుండజేసి దూరముగా నుంచు నాచారపిశాచము మిగుల దృఢముగా బట్టి

యున్నందున నీ క్రైస్తవ మతబోధకులు తేలికగా మాల మాదిగల గూడెములవెంట గూడెములను క్రైస్తవమతములోనికి చేర్చుకొనసాగినారు. అటుల క్రైస్తవమతము స్వీకరించినవారికి విద్య ఇతర ద్రవ్య సహాయములను గలుగజేసిరి. ఆంధ్రదేశములో కొన్ని లక్షలమంది మాలమాదిగలు క్రైస్తవమతములో జేరిరి. బందరులోని యానందపేట యిట్టి క్రైస్తవుల కొక ఉనికిపట్టయినది. గుంటూరులోగూడ క్రైస్తవసంఘము గొప్పగా ప్రబలినది. మా నందిగామకు సమీపముననున్న రాఘవపురముకూడ క్రైస్తవ సంఘమున కాలవాలముగా నుండెను. ఇంగ్లీషువిద్య నిచ్చుటతోపాటు క్రైస్తవ మతబోధచేయుటకు బెజవాడలోను గుంటూరులోను - ఏలూరులోను హైస్కూళ్ళను స్థాపించి నడిపిరి. డాక్టర్ కుగ్లర్ అను అమెరికను వైద్యురాలు గుంటూరులో గొప్ప ఆసుపత్రిని స్థాపించి ఆంధ్రస్త్రీలకు విశేష వైద్యసహాయము చేసినను. రోగులకును, వారి బంధువులకును ప్రతిదినము క్రైస్తవమతబోధ చేయుటవలన వారిలో గొందరు క్రైస్తవులైరి.

ఇటుల క్రైస్తవమతము విజృంభించినకాలది. హిందువులలో గొప్ప సంచలనము కలిగెను. హిందూమతములోని మూఢవిశ్వాసములను చెడ్డ ఆచారములను పారద్రోలి హిందూ వేదాంతముయొక్క ప్రాశస్త్యమును, ఉత్కృష్టతను వెల్లడించుటకు గొప్ప మతసంస్కరణోద్యమములు బయలుదేరినవి. సంస్కరణవాదులను హిందూ పూర్వాచారపరాయణులు గూడ ప్రతిఘటించిరి. వెలివేసిరి. సంస్కరణవాదులు క్రైస్తవులనేగాక పూర్వాచారపరాయణులనుగూడ ధిక్కరింపవలసివచ్చెను. ఒకవైపు క్రైస్తవ మిషనరీలతోను, రెండవవైపు పూర్వాచారపరాయణులతోను పోరు పోరాడవలసివచ్చెను. రాజా రామమోహనరాయలు స్థాపించిన బ్రహ్మసమాజము, స్వామీ దయానందసరస్వతి స్థాపించిన ఆర్యసమాజము, మేడం బ్లావెట్స్కీ, కల్నల్ అల్కాటుగార్లు స్థాపించిన దివ్యజ్ఞానసమాజము, తిరిగి అద్వైత వేదాంతమునకు ప్రపంచములో గొప్పస్థానము ప్రతిష్ఠించిన రామకృష్ణ పరమహంస, స్వామీ వివేకానందులవారి వేదాంతోద్యమము వీనిలో ముఖ్యమైనవి. ఆంధ్రదేశములోగూడ నేను విద్యార్థిగానున్నకాలములో ఈ యుద్యమములన్నియు పనిచేసినవి. విద్యాధికులలోను విద్యార్థులలోను వైజ్ఞానిక

సంచలనము కలుగజేసినవి. రాజమహేంద్రవరములో కందుకూరి వీరేశ లింగముపంతులుగారు ప్రప్రథమమున పూర్వాచారపరాయణులమీద తిరుగుబాటు లేవదీసి మత సంఘసంస్కరణోద్యమమును తీవ్రముగా సాగించినాడు. పూర్వాచారపరాయణులుపెట్టిన బాధలను సహించినాడు. వితంతు వివాహములను చేయించినాడు. స్త్రీల అభ్యున్నతికై పాటుపడినాడు. 'వివేకవర్ధని' వారపత్రికను నడపినాడు. బ్రహ్మసమాజమును నెలకొల్పి నాడు. తేలికైన ఆంధ్రగద్యమును సృష్టించి ప్రజలభాషలో వ్రాసినాడు. మతసంఘసంస్కరణములు, ప్రహసనములు, ఆంధ్రకవులచరిత్ర, ప్రకృతి శాస్త్రములు, అప్పటి కాంగ్రెసురాజకీయములు, ఆంగ్ల సంస్కృతనాటకముల భాషాంతరీకరణములు, స్వతంత్రనాటకములు నవలలు, స్త్రీలకు సామాన్య జనులకు ప్రత్యేకవ్యాసములు మొదలగునవి యనేకవిషయములమీద బలు గ్రంథములు వ్రాసినాడు. ఆయన వ్రాసిన గ్రంథములు పదిసంపుటము లయ్యెను. ఫ్రెంచివిప్లవకారుడైన వాల్టేరు అనేకసంపుటములను వ్రాసినట్లే యీతడును ఆంధ్రవిప్లవకారుడై సంపుటముల కొలది గ్రంథములను వ్రాసి యున్నాడు. సర్వాంధ్రపితయని యీయనను పిలచుట సమంజసముగనే యున్నది. 1897 వ సంవత్సరములో నీయన ప్రెసిడెన్సీకాలేజీలో పండితుడుగా మద్రాసుకు వెళ్ళిపోయినాడు.

పిమ్మట ఆంధ్రదేశమున బందరుపట్టణమే యిట్టి భావవిప్లవమునకు మతసంస్కరణోద్యమములకు ప్రధానమైన కేంద్రముగా నుండెను. మా విద్యార్థులలోగూడ నీ సమస్యలు, చర్చలు, ఆలోచనలు, ఆదర్శములు ప్రవేశింప మొదలిడెను. మునగాల రాజాగారి బంగళాలో గలియుచుండిన విద్యార్థిమిత్రులమందరము నీ విషయములనే చర్చించుచుంటిమి. కొమర్రాజు లక్ష్మణరావుగారుకూడ నాగపూరులో జరుగుచున్న వైజ్ఞానికసంఘసంస్కరణ పోరాటములో తీవ్రముగా పాల్గొని బందరుకువచ్చి మా యందరకును గొప్ప ఉత్సాహము కలుగజేసెను. బాలగంగాధరతిలక్ మహాశయుడు రాజకీయ ధీరోదాత్తుడైనను, పూర్వాచారపరాయణులకు నాయకత్వమువహించెను. గోపాలకృష్ణగోఖలే రాజకీయములలో మితవాదియైనను, సంఘసంస్కరణవాదులకు నాయకుడుగా నుండెను. ఆయన మహాదేవ గోవిందరానడేగారి

అనుచరుడు. తిలకుమహాశయుడు మహారాష్ట్రభాషలో గొప్పరచయిత. కామరాజు లక్ష్మణరావుగారు రాజకీయభావములయందును. మహారాష్ట్రలో వ్యాసములు వ్రాయుటలోను తిలకుగారిశిష్యులు. సంఘసంస్కరణోద్యమములలో గోఖలేగారి శిష్యుడు. లక్ష్మణరావు తన అక్కగారైన భండారు అచ్చమాంబగారిని విదుషీమణిగ గావించి అబలా సచ్చరిత్రరత్నమాల యను గ్రంథము నామెచేత వ్రాయించెను. లక్ష్మణరావుగారి ప్రోత్సాహమువలన ఆయన రెండవ మేనమామ-ఖర్గపురములో రైల్వేఉద్యోగిగా నుండిన భండారు చందసాణిగారు వితంతూద్వాహమును చేసికొనిరి. లక్ష్మణరావుగారింగ్లీషు, సంస్కృతము, తెలుగు, మహారాష్ట్రములలో మంచివిద్వాంసులు. గుజరాతీ, బెంగాలీ, హిందీ భాషలనుగూడ బాగుగ నేర్చుకొనెను. మహారాష్ట్రభాషలోనిపత్రికలకు మంచి వ్యాసములు వ్రాయుచు ఆ దేశములో ప్రతిభావంతుడైన రచయితగా ప్రఖ్యాతి గాంచియుండిరి. ఈవిధముగాహిందూదేశములో మతసంస్కరణోద్యమములు వ్యాపించుచుండగా ఇంగ్లాండులో 'ఇంగర్‌సాల్' 'చార్లెసుబ్రాడ్లా'గార్లు నాస్తికత్వమునకు, నిరీశ్వరవాదమునకు ప్రధానాచార్యులుగానుండిరి. వారిగ్రంథములు కూడ భారతీయవిద్యార్థులు చదువుచుండిరి. ఇంతేగాక హెర్బర్టుస్పెన్సరను గొప్ప గ్రంథకర్త (agnosticism) "దేవుడున్నాడో లేడో తెలిసికొనుట యెవరికిని సాధ్యముకాదు, కనుక నా విషయమునుగూర్చి యాలోచింపవలదు. ఆధ్యాత్మికవిశ్వాసమును కలిగియుండవలదు" అని వ్రాయుచుండెను. లక్ష్మణరావుగారు - ఈ (agnosticism) దేవుడున్నాడని నమ్మవలసినపనిలేదు. ఉన్నాడో లేదో మనకెందుకను స్పెన్సరుగారి సిద్ధాంతముల నంగీకరించినవాడు. కాని ఆయన యతిపవిత్రమైన ప్రవర్తనగలవాడు. చుట్ట, బీడి, నస్యముకూడ నెరుగడు. నిరాడంబరజీవి. గొప్ప దేశాభిమాని. ఆంధ్రభాషకు అఖండసేవచేసిన అశేష శేముషీధురీణుడు. అమెరికాలోని చార్లెసు వాయిసీగారి (Theism) ఆస్తికత్వము అను గ్రంథము (Unitarian Christianity) క్రైస్తవులలో నేత్రిత్వమును ఖండించుచు నీశ్వరుని యేకత్వమును బోధించుపక్షమున జేరినది. అట్టివారి గ్రంథములు హిందూదేశములోని బ్రహ్మసామాజికులచే జదువబడినవి.

నేను 1896 వ సంవత్సరములో అయిదవఫారము చదువుచుండగా

బ్రహ్మసమాజములో చేరి వేంకటరత్నము నాయుడుగారి శిష్యుడనైతిని. ప్రతి వారము జరుగు బ్రహ్మసమాజప్రార్థనలలో పాల్గొంటిని. వేంకటరత్నం నాయుడు, రామకృష్ణారావు, రామమూర్తిగార్లవంటిపోలిన పెద్దలేగాక,ముట్నూరి కృష్ణారావు, బుద్ధిరాజు వీరభద్రేశ్వరరావు, పిల్లారిసెట్టి సీతారామయ్య మొదలగు విద్యార్థులుకూడ పాల్గొనిరి. ఆ సమాజమువారు రచించిన ఈశ్వరప్రార్థన కీర్తనలను నేనుకూడ పాడితిని. వానిలో చాలకీర్తనలు నాకు నోటికివచ్చును. వడ్డాది సుబ్బారాయుడుగారు రచించిన భక్తిచింతామణి యను పుస్తకముగూడ చదివితిని. నేను బందరులో విద్యార్థిగను, అధ్యాపకునిగ నున్నంతకాలము బ్రహ్మసమాజ ప్రార్థనలలో పాల్గొంటిని రాజా రామమోహనరాయలవారి గ్రంథములను చదివితిని. అప్పుడప్పుడు వారి వర్థంత్యుత్సవములలో నుపన్యసించితిని.

రామమోహనరాయలుగారు నవీనభారతవర్షములో మత సాంఘికరాజకీయ వైజ్ఞానిక ప్రపథమసంస్కర్త. ఆయన ముఖ్యమైన ఉపనిషత్తుల నన్నిటిని బెంగాలీలోనికి తర్జుమాచేసెను. ఇస్లాము, క్రైస్తవమతము, బౌద్ధమతము, పారశీకమతములనుగూడ చదివి వాని మూలసత్యముల నన్నిటిని బ్రశంసించుచు వ్రాసెను. అన్ని మతగ్రంథములను - ఆయా మతాచార్యులను సమానముగా గౌరవింపవలెనని వ్రాసెను. ఆయన సంస్కృతము, ఇంగ్లీషు, బెంగాలీ, అరబ్బీ, హీబ్రు, పారసీ, పాళీభాషలను బాగుగా నభ్యసించెను. ఆ కాలములో కాళికాదేవికి నరబలు లిచ్చుచుండిరి. తల్లులు గంగానదికి మ్రొక్కుకొని తమపిల్లలను పసుపు, కుంకుమ, రవికగుడ్డ, కొబ్బరికాయలతోగూడ గంగలో బడవైచిరి. భర్త చనిపోయిన తరువాత వితంతువైన భార్య నీడ్చుకొనిపోయి భర్తశవముతోపాటు కాల్చివైచిరి. ఇట్టి మూఢహిందూమతముపై ఆయన తిరుగుబాటు గావించెను. కాళికాపూజ, విగ్రహారాధనలను బహుదేవతార్చనమును ఖండించెను. ఉపనిషత్తులలోని భక్తి జ్ఞాన వైరాగ్యములను బోధించెను. మానవులందరు సమానులని, కులభేదములు పోవలెనని బోధించెను. స్త్రీల యున్నతికొరకు పాటుపడెను. స్త్రీల పాఠశాలను స్థాపించెను. ఆంగ్లభాషద్వారా నూతన ప్రపంచ విజ్ఞానము కావలెనని కోరెను. తేలికైన బెంగాలీగద్యమును సృష్టించెను, పత్రికాస్వాతంత్ర్యము

ష్ఠకై పోరాడెను. ఆయనను పూర్వాచారపరాయణులు వెలివేసిరి. ఆయన గవర్నరు జనరలగు విలియం బెంటింకు ప్రభువునకు సచ్చజెప్పి సహగమనమును, నరబలులను, గంగలో పిల్లలను పడవేయుటను నిషేధించుశాసనమును చేయించెను. ఈవిధముగా శాసనము చేయుటవలన హిందూమతముతో బ్రిటిషు ప్రభుత్వమువారు అక్రమముగా జోక్యము కలుగజేసికొనుచున్నారని, యా శాసనమును రద్దుపరచవలసినదని పూర్వాచారపరాయణులగువారు వేనకువేలు దస్కతులుచేయించి యొక గొప్ప మహజరును లండనులోని బ్రిటిషు పార్లమెంటుకు పంపగా, దాని నెదిరించుటకు రామమోహనరాయలవారు లండను వెళ్ళిరి. జయమును పొందిరి. బెంటింకు ప్రభువు చేసిన శాసనము ఖాయపరచబడెను. పార్లమెంటువారు ఇండియా పరిపాలననుగూర్చి 1832 వ సంవత్సరములో జరిపిన విచారణలో ఆయన సాక్ష్యమిచ్చెను. బ్రిటిషువారి ఆర్థికనీతివలన ఇండియాలోని పరిశ్రమలు నశించి యీదేశము దరిద్రవంతమైనదనియు, పెద్దయుద్యోగములు భారతీయులకిచ్చి, శాసనసభలను స్థాపించి, పరిపాలనలో భారతీయులను భాగస్వాములుగా చేసి, భారతదేశమునకు స్వపరిపాలనమివ్వవలెననియు ఆయన సాక్ష్యములో చెప్పి మనదేశమునకు గొప్పసేవచేసెను. అటుపిమ్మట ఇంగ్లాండులోని బ్రిష్టలు నగరమును జూడబోయి అక్కడనే 1833 సంవత్సరము సెప్టెంబరు 27 వ తేదీన పరమపదించెను. ఆయనసమాధి భారతీయులకేగాక మానవసమానత్వమును సోదరత్వమును స్వాతంత్ర్యమును బోధించువారందరకు పుణ్యక్షేత్రము. ఆయన నవీన భరతవర్షముయొక్క స్థాపకుడు (**Founder of Modern India**)అని పేరుపొందెను. 1856 వ సంవత్సరములో ఈశ్వరచంద్రవిద్యాసాగరులు గవర్నరుజనరలుచేత హిందూవితంతువులు, పునర్వివాహము చేసికొనవచ్చునని శాసనముచేయించెను. ఆయనరామమోహనరాయలవారిశిష్యుడు.

నేను దయానందసరస్వతీస్వామివారి సత్యార్థప్రకాశికను కూడ తరువాతికాలములో చదివితిని. వారు స్థాపించిన ఆర్యసమాజము వేదములోని (సంహిత) మంత్రభాగమునకు వారుచేసిన భాష్యాంతరీకరణము మీద నాధారపడియున్నది. దయానందులవారుకూడ ఋషిపత్నులు విగ్రహారాధన, కులభేదములు ఖండించబడెను. వేదములలో చెప్పు

బడినటుల అగ్నిహోమముచేయుటవలన బరమాత్మారాధన జరుపవలెనని విధింపబడినది. బాల్యవివాహములు నిషేధింపబడినవి. వితంతూద్వాహము, రజస్వలానంతరవివాహము మొదలగు సంస్కరణము లమలుజరుపబడెను. అస్పృశ్యత నిషేధింపబడినది. ఇస్లాము, క్రైస్తవమతములలోనుండి (ఆర్య సమాజములో) హిందూసమాజములో స్త్రీ పురుషులను జేర్చుకొనుటకు నిరంతరకృషి జరిపినందున నితరమతములయందు శాంతమైన స్నేహసంబంధముల కభ్యంతరము కలిగెను. ఆర్యసమాజమునకు ఇస్లామునకు గొప్ప కలహము లేర్పడి కొన్నిహత్యలుకూడ జరిగెను. హరిద్వారమునందు ఆర్య సమాజమువారు స్థాపించిన గురుకులాశ్రమము చాల ప్రసిద్ధికెక్కినది. నేను విద్యార్థిగానున్నప్పుడు ఆదిపూడి సోమనాథరావుగారు బందరు వచ్చి ఆర్య సమాజమునుగూర్చి యుపన్యాసములనిచ్చుచుండిరి. ఆయన వితంతూద్వాహము చేసికొనెను. కులభేదములను పాటించలేదు. హృద్యముగా రామమోహనరాయ్. శ్రీరామ, దయాకరవిజయము, హరిశ్చంద్ర మొదలైన హరికథలను జెప్పుచుండెను. మాతో హపలాకు హాస్టలులో నివసించి భోజనముచేయుచుండెను. మేము వారి యుపన్యాసములకు హరికథలకుకూడ వెళ్ళెడువారము.

1896 లో నేను విద్యార్థిగా వేంకటరత్నమునాయుడుగారివద్దకు బోయి మతమునుగూర్చి చెప్పుడని కోరితిని. ఆయన నాకొక కథ జెప్పెను. దేవేంద్ర నాథ టాగూరుగారు (రవీంద్రనాథ టాగూరు తండ్రి) కలకత్తాలో గొప్ప విద్వాంసుడు. గొప్ప జమీందారు. ఆయనకు భగవద్భక్తి లేదు. ప్రపంచ సుఖములలో కాలము గడపెను. ఆయనకు సమీపబంధువు మరణించినపుడు చాల దుఃఖముతో నటునిటు తిరుగుచుండెను. అపు డాకస్మికముగా నొక సంస్కృతకాగిత మాయనవద్దకు గొట్టుకొనివచ్చినది. దానిని తన ఆస్థాన పండితునితో జదివించెను. అది కఠోపనిషత్తులోని యొక కాగితము. దానిని జదువగా "జీవాత్మ మరణించదు. అది శాశ్వతమైనది. ఈ జీవితయాత్ర యొక్క ఆయుఃపరిమితి పూర్తియైనవెంటనే యీ శరీరమును విడచి మరియొక జన్మమెత్తును. శరీరమునకే మరణము కలదు" అని యందులో జెప్పబడియుండెను. అందుమీద నాయన కఠోపనిషత్తు శ్రద్ధగా జదివెను.

ఆత్మశాంతిని బొందెను. పిమ్మట ముఖ్యోపనిషత్తు లన్నింటిని పఠించెను. బ్రహ్మసమాజములో జేరెను. రామమోహనరాయలుకు పిమ్మట ప్రసిద్ధుడై మహర్షి అని పేరుపొంది బ్రహ్మసమాజమునకు నాయకుడయ్యెను. అని ఆయన నాకు చెప్పె ఈశ్వరుడు రూపములేనివాడై మనచుట్టు నున్నాడు. మనలో నున్నాడు. ఆయనను ప్రార్థింపవలెను. పవిత్రతను పొందవలెను. ఆయన సౌఖ్యముల నిచ్చును. వ్యభిచారము,అసత్యము-ఇవి ఈశ్వరునికి వ్యతిరేకమైనవి. స్త్రీలను తల్లులవలె జూడవలెను. యోగ్యప్రవర్తన కలిగియుండవలెను. అని ఆయన నాకు బోధించెను. అంతటితో నేను బ్రహ్మసమాజములో జేరితిని. పిమ్మట ఆయన విద్యార్థులతో స్థాపించిన (social purity association) సమాజ పారిశుద్ధ్య సంఘటనకు నన్నొక కార్యదర్శిగా నియమించెను. ఈ సంఘమునకు దైవచింతన, నైతికప్రవర్తన. స్త్రీలయెడ సోదరీ భావము, అస్పృశ్యతను పాటింపకుండుట,చుట్టలు.బీడీలు వగైరా నిషేధము, భోగము మేళములనిషేధము, ఆదర్శాచరణధర్మములు. కల్లు, సారా. బ్రాందీ త్రాగుట మొదలైన చెడ్డ అలవాట్లానాటివిద్యార్థులలో లేనేలేవు. కనుక దానిని గూర్చి చెప్పనవసరము లేకపోయినది, ఈ సంఘము విద్యార్థులలో వ్యాపింప జేయబడినది. ఒకవిధమైన నైతికవాతావరణము. వ్యక్తిత్వము సృష్టింపబడినవి. సెలవులలో వెళ్లినపుడు మా యూరిలో నీ సంఘపక్షమున ఉపన్యాసముల నిచ్చితిని. రాజా రామమోహనరాయలవారు, మహర్షి దేవేంద్రనాథ టాగూరుగార్లు బ్రహ్మసమాజమును ఉపనిషన్మతముగా వ్యాపింపజేసినను. అటుపిమ్మట నాయకత్వమువహించిన కేశవచంద్రసేనుగారు దీనిని సర్వమత సారమని, ప్రపంచముయొక్క నూతన మతమని విస్తరింపజేసిరి. కాని సీతానాథతత్వభూషణ్ (Hindu Theism) హిందూ ఏకేశ్వరోపాసనమతముగా నుండవలెనని వ్రాసిరి. నాకు హిందూ ఏకేశ్వరోపాసన సిద్ధాంతమే యెక్కువ బాగుగా కనపడినది. నేను సీతానాథతత్వభూషణ్ గారి గ్రంథము అనువా రింగ్లీషులోనికి తర్జుమాచేసిన కఠోపనిషత్తును చదివినాను అంతే గాక స్వామీ వివేకానందులవారి గ్రంథములు. ఉపన్యాసములుకూడ స న్నాకర్షించినవి. నేను వానినిగూడ జదివితిని. బందరులోని హిందూమత బాల సమాజములోగూడ సభ్యుడనైతిని.

వివేకానందస్వాములవారు 1893 లో అమెరికాలోని చికాగోనగరమున ప్రపంచములోని సర్వమతసమ్మేళనము జరిగినప్పుడు హిందూమతముయొక్క ప్రతినిధిగా వెళ్లి అదివరకు క్రైస్తవమతబోధకులు నీచముగా వర్ణించుచున్నహిందూమతముయొక్క ఉత్కృష్టతను నిరూపించి భారతజాతియొక్క ప్రతిష్ఠను, ఆత్మగౌరవమును కాపాడెను. అదివరకు హిందూమతమనగా మూఢవిశ్వాసముల ప్రోగని హీనముగా జూడనారంభించిన భారతీయ విద్యాధికులలోను విద్యార్థులలోను, నిజమైన హిందూధర్మమునందు భక్తివిశ్వాసములు పునరుద్ధరింపబడెను. చికాగోమహాసభలో ఆయన యిచ్చిన **Hinduism as a religion** (హిందూమతము ఒక గొప్పమతము), **The Ideal of Universal religion** (ప్రపంచమతముయొక్క ఆదర్శము) అను రెండు ఉపన్యాసములవలన ప్రాచీనభరతవర్షముయొక్క మతధర్మములు ప్రపంచమునకెల్ల నుత్కృష్టమైనవి, సహేతుకమైనవి, ప్రకృతిశాస్త్రములకనుగుణ్యముగ నున్నవను నొక జాతీయగర్వము విద్యాధికులలోను, విద్యార్థులలోను పాదుకొల్పబడినది. రామకృష్ణపరమహంసగారి జీవితము - బోధలుకూడ చదివితిని. బ్రహ్మసమాజనాయకుడగు ప్రతాపచంద్ర ముజుందారుగారు శ్రీ రామకృష్ణపరమహంసగారిని చదువురాని గోచిపెట్టుకొనెడు అనాగరికుడైన మనిషియని, మతముపేరున మోసముచేయుచున్నాడని కొందరు క్రైస్తవమిషనరీలు వ్రాసిన వ్రాతలను ఖండించుచు, భరతవర్షములో జన్మించిన మహాఋషి యని యాధ్యాత్మికమహాపురుషుడని వ్రాసెను. ఆ చిన్నపుస్తకము చదివి ప్రథమమున శ్రీ రామకృష్ణపరమహంసవైపునకు ఆకర్షింపబడితిని. కేశవచంద్రసేనుగారు సర్వమతసారమును బోధించెనే గాని, రామకృష్ణపరమహంస దానిని పూర్తిగా నాచరించిచూపెను, అని మరియొక ఆధ్యాత్మికవేత్త వ్రాసినారు. శ్రీ రామకృష్ణులవారిజీవితము, బోధలు చదివినపిమ్మట నాకు విగ్రహారాధనయందు వ్యతిరేకభావము పోయినది. అది సవ్యముగానుపయోగించినచో మానసికారాధనకు మెట్టుగానుపయోగించునవెడు విశ్వాసము నాకు కలిగినది. రామకృష్ణులవారు కాళీపూజను చేసిరి. కాని వారికన్న భగవదారాధకుడు లేడు. ఇంతేగాక ఆయన సర్వమతములను సమానముగా నాదరించిరి. వానిలోని సత్యములను, ఆరాధనాపద్ధతు

లను అనుష్ఠించిరి. నవీన భారతవర్షములో జన్మించిన మహర్షి యీతడు. సర్వమతసామరస్యమును ప్రతిష్ఠించిన హిందూమత పునరుద్ధారకుడు.

వివేకానందస్వాములవారు కొలంబో మొదలు అల్మోరావరకు నిచ్చిన యుపన్యాసములు, 'నవీన భారతవర్షము' అను వ్యాసము, జ్ఞానయోగము, భక్తియోగము, కర్మయోగము అను గ్రంథములను చదివి విశేషలాభమును బొందితిని. వివేకానందులవారు అస్పృశ్యత నతి తీవ్రముగా ఖండించి హిందూవేదాంతమును రాజకీయములకును, ఆర్థిక సాంఘికవిషయములకును వర్తింపజేయవలెననియు, భారతీయులకు మాతృదేశారాధనమే ఏబదిసంవత్సరములవరకు ప్రధాన మతధర్మముగా నుండవలెననియు, కులభేదములను, అస్పృశ్యతను వదలిపెట్టి భారతీయులందరు సమానులని సోదరులని విశ్వసించి ప్రేమించవలెననియు వ్రాసెను.

"మన ప్రార్థనలలో ప్రతి దినము భగవంతుడు మన అందరియొక్క తండ్రియని అంగీకరించుచు మన జీవితముయొక్క ప్రవర్తనములో ప్రతి మానవుని మన సోదరుడుగ భావించనిచో నేమి లాభము? భారతదేశమా! నీ వ్యక్తిత్వమును కోల్పోయి ఇతరులను నీచముగా అనుకరించుటవలనను ఇతరులమీద ఆధారపడుటవలనను, మరల నాగరికతయొక్కయు, స్వాతంత్రముయొక్కయు ఉన్నతశిఖరములను ఎక్కలేవు. ఓ భారతీయుడా! నీ స్త్రీత్వముయొక్క ఆదర్శములు సీత, సావిత్రి, దమయంతులైయున్నారని మరువకుము. నీవు పూజసేయు భగవంతుడు అష్టయిశ్వర్యము లుండియు వాటినన్నిటిని త్యజించి బూడిదపూసికొనిన త్యాగులలోనెల్ల త్యాగియు, ఉమానాథుడునగు పరమశివుడని మరచిపోకుము. నీ వివాహము, నీ ధనము, నీ ప్రాణము, నీయొక్క యింద్రియలోలత్వమును తృప్తిపరచుటకొరకు, నీ స్వంత సుఖముకొరకు కాదని మరచిపోకుము. పరమాత్మయొక్క యజ్ఞ వాటికయందు ఒక సమిధగా త్యాగముచేయుటకే నీవు పుట్టినావని మరచి పోకుము. తక్కువజాతులని యెంచబడువారు, అజ్ఞానులైనవారు, పేదవారు నిరక్షరకుక్షులు, చెప్పులు కుట్టువారు, పాకీవారు, నీయొక్క రక్తములో రక్తము, నీ మాంసములో మాంసము, నీకు సోదరులు నని మరచిపోకుము.

ధీరుడా! ధైర్యము నవలంబింపుము. నీవు భారతీయుడవని గర్వపడుము. నేను భారతీయుడను, ప్రతి భారతీయుడు నా సోదరుడు అని గర్వముతో ప్రకటించుము. అజ్ఞానుడైన భారతీయుడు, పేదవాడైన భారతీయుడు, చింపిరి గుడ్డలలోనున్న భారతీయుడు, బ్రాహ్మణ భారతీయుడు, పంచముడగు భారతీయుడు నా సోదరుడు అని చెప్పుము" అని శ్రీ స్వామి వివేకానందుల వారు (Modern India) నవీన భారతవర్షమను వ్యాసములో ఉద్బోధన చేసియున్నారు.

భగవద్గీత, బమ్మెర పోతన రచించిన భాగవతము నాకు జీవితములో ప్రధాన ఆధ్యాత్మిక గ్రంథములయ్యెను. నేను 1944 లో నుపనిషత్పాఠము లను రచించిన పిమ్మట ప్రతి దినము ఉపనిషత్తులను కూడ చదువుకొను చున్నాను. ఆ మంత్రములలో చాలవరకు నాకు కంఠస్తముగ వచ్చును. ఇవి నా కాత్మశాంతిని కలుగజేయుచున్నవి. రాజా రామమోహనరాయలు, స్వామీ వివేకానందులు ఉభయులు మహాత్మా గాంధీయొక్క నాయకత్వము క్రింద నేర్పడిన సంపూర్ణ జాతీయతత్వమునకు (Full Nationalism) చక్కని పునాదులు వేసిరి. 1906 నుండి నేను కాంగ్రెసులో లోకమాన్య బాలగంగాధరతిలకుగారి శిష్యుడనైనను వారి మత సంఘభావములు నాకు తృప్తిని కలుగజేయలేదు. 1919 లో మహాత్మా గాంధీ కాంగ్రెసుకు భారతజాతికి నాయకుడుగా పూర్తియైన సర్వతోముఖమైన జాతీయతత్వముతోను ఆధ్యాత్మిక యుత్కృష్టతతోను సర్వమత సహనముతోను బయలుదేరగానే నేను వారియెడ సంపూర్ణవిశ్వాసము గలవాడనై వారికి శిష్యుడనైతిని.

మునగాల రాజా నాయని వేంకటరంగారావుగారు మిక్కిలి సత్ప్రవర్తనగలవారు. గొప్ప దేశాభిమాని. ఆంధ్రభాషాభిమాని. సర్వ సత్కార్యములకు సహాయము చేయుచుండెడివారు. బందరు జాతీయకళాశాలకు ఎనిమిది వేలరూప్యములు విరాళముగా నిచ్చిరి. ఇంగ్లీషుప్రభుత్వమనగా భయపడు జమీందారు కాడు. గుంటూరులోని శారదానికేతనమునకు ఎనుబదివేలరూప్యముల విలువగలస్థలము నిచ్చెను. విజ్ఞానచంద్రికామండలి స్థాపకులలో నొకరు. కాని లక్ష్మణరావుగారు చెన్నపట్టణములో నున్నకాలములోను,

వారు మరణించినపిమ్మటను నితర సలహాదార్ల సహాయముతో ఎస్టేటు రైతులవిషయములో కాఠిన్యముతో నిరంకుశముగా ప్రవర్తించెను. తెలంగాణములోని దేశముఖులపద్ధతులనే యవలంబించెను. రైతులందరు తిరుగబడినారు. తుద కత్యధికసంఖ్యాకులు కమ్యూనిస్టుపార్టీలో చేరినారు. మునగాలపరగణా ఆంధ్రప్రదేశమునకెల్ల కమ్యూనిస్టుప్రాంతమని పేరుతెచ్చుకొన్నది. లక్ష్మణరావుగారికి రాజాగారి నిరంకుశత్వ మేమాత్రమును గిట్టక బాధపడుచుండువారు. మునగాల రాజాగారు మొదటినుండి వివేకానందస్వామివారి బోధలయందు నమ్మకముగలవారు. తరువాత లక్ష్మణరావుగారితో గలసి వివేకానందస్వామివారిని దర్శించివచ్చిరి. నాకు వివేకానందులవారిని దర్శించుభాగ్యము కలుగలేదు.

పింగళి లక్ష్మీనారాయణ. కొండిపర్తి వీరభద్రాచార్యులుకూడ వారి క్లాసులోనే చదువు విద్యార్థులై యట్టి భావములనే కలిగియుండిరి. లక్ష్మణరావుగారు మతవిషయమున తటస్థవాదిగా నుండెడువారు. ప్రతిదిన మనేక చర్చలు మేము జరుపుచుండెడువారము. అందరము సంఘసంస్కరణవాదులమే. నేను మునగాలరాజాగారికంటె హైక్లాసులో జదువుచుంటిని. 1906 నుండి పింగళి లక్ష్మీనారాయణగారు బెజవాడ (విజయవాడ)లో నేను, సూరి వేంకటనరసింహశాస్త్రి, పెద్దిభొట్ల వీరయ్య మొదలగువారితోడను కాంగ్రెసు, సంఘసంస్కరణవాదుల బృందములో జేరెను. క్రొత్తరకపు చేతిమగ్గముల కార్ఖానాను నెలకొల్పెను. పిమ్మట గాడిచర్ల హరిసర్వోత్తమరావు, బోడి నారాయణరావుగార్లుకూడ మాతో జేరిరి. 1908 లో స్వరాజ్యరాజద్రోహకేసులో ముద్దాయిగా జేర్పబడినంతనే పింగళి లక్ష్మీనారాయణ అరెస్టు తప్పించుకొని పుదుచ్చేరికి బోయి, 1912 లో ప్రభుత్వమువారు కొందరు రాజకీయఖైదీలను క్షమించినపుడు మరల కృష్ణాజిల్లాకు వచ్చెను. 1920 లో సన్యసించెను. స్వామీ నారాయణానందసరస్వతి యనుపేరును ధరించెను. 1930 నుండి కాంగ్రెసు సత్యాగ్రహములో చేరి పెక్కుసార్లు జైళ్ళకు బోయెను. కొంతకాలము కర్నూలులో హరిజనవిద్యార్థి వసతిగృహమును నడిపెను. ఇప్పుడు కర్నూలులోనే యున్నాడు.

కొండిపర్తి వీరభద్రాచార్యులుగారు ఎఫ్.ఏ. ట్రైనింగులో కృతార్థులై కొంతకాలము నందిగామలో మా కమిటీ లోయర్ సెకండరీ పాఠశాలకు ప్రధానాచార్యులై యుండిరి. నే నా కమిటీకి అధ్యక్షుడను. విద్యార్థులకు సత్ప్రవర్తన, దైవభక్తి కలుగజేయుటలో నాత డాదర్శప్రాయుడు. పిమ్మట తురిమెళ్ళ హైస్కూలులో నధ్యాపకుడుగానుండి సన్యసించి తత్త్వానందస్వామి యనునామము వహించెను. కొన్నిసార్లు స్వాతంత్ర్యసమరసందర్భమున జైలుకు వెళ్ళినారు. మంచి వేదాంత పత్రికను నడిపినారు. ఇటీవలనే పరమపదించినారు.

దివ్యజ్ఞాన సమాజమువా రన్ని మతగ్రంథములయొక్క సాముదాయిక గ్రంథాలయమును మద్రాసులోని అడయారులో స్థాపించిరి. అన్ని ప్రాచీన మతములయందు గౌరవమును పునరుద్ధరించుటకు కృషిసలిపిరి. వారి ప్రతినిధులు వచ్చి బందరులో ఉపన్యసించుచుండిరి. రష్యాదేశపు స్త్రీయగు మేడం బ్లావెట్స్కీగారికి నాంగ్లేయులగు కల్నలు అల్కాటుగారికి ఋషులు ప్రత్యక్షమై యిచ్చినట్లు చెప్పబడిన రహస్యసిద్ధాంతముమీద (Secret doctrine) దివ్యజ్ఞానసమాజము నిర్మింపబడినది. కాని 1914 లో నాయకురాలైన అనిబిసెంటమ్మ హోంరూలు ఉద్యమమును స్థాపించువరకును దివ్యజ్ఞానసామాజికులు కాంగ్రెసుకు, సంఘసంస్కరణకును బూర్తి వ్యతిరేకులుగా నుండిరి. పూర్వాచారపరాయణత్వము గల హిందూమతమునే బోధించుచుండిరి. ఆమెయొక్క నాయకత్వముక్రిందనే మానవసమానత్వము సర్వమానవ సౌభ్రాతృత్వము బోధించబడినది. ఏది యెట్లున్నను నేనెప్పుడును దివ్యజ్ఞానసమాజములో చేరలేదు. ఈ ఉద్యమములే గాక శివశంకరపాండ్యా, సుందరరామయ్య మొదలగువారు పూర్వాచారపరాయణత్వమును ప్రబోధము గావించుచు సంస్కరణవాదులను ఖండించుచుండిరి. మొత్తముమీద బ్రహ్మసమాజము ఉత్తరసర్కార్లలోను, ఆర్యసమాజము హైదరాబాదులోను, దివ్యజ్ఞానసమాజము రాయలసీమలోను కొంతకాలమువరకు ప్రాబల్యము వహించెను. రాయలసీమలోని రంగనాథమొదలియారు, పార్థసారధి అయ్యంగారు, హర్తి శివరావుగార్లు దివ్యజ్ఞానసమాజములో ముఖ్యులు. బాజీ కృష్ణారావు, న్యాయమూర్తి కేశవరావు, శ్యాంరావు, కొత్తూరు సీతయ్య

గుప్త, పండిత నరేంద్రజీ, పండిత గణపతిరావు. వారేల్లవారు హైదరాబాదులోని ప్రముఖ ఆర్యసామాజికులు. ఏప్పుడట అన్నియును గాంధీ తత్త్వముచే సంస్కరింపబడిన హిందూమతములో లీనమైపోయినవి. మహాత్మా గాంధీ ఉపనిషన్మూర్తి. కులభేదములను పాటింపని సనాతన హిందువునని ఆయన చెప్పెను.

(4)

1898 నవంబరులో రెవరెండు జి.ఏ. ఎడ్డియను గొప్ప తెల్ల క్రైస్తవ మిషనరీ బందరు వచ్చినాడు. 1864 లో గొప్ప యుప్పెన (తుపాను) వచ్చి బందరులో కొంతభాగము కొట్టుకొనిపోయినది. వేలకొలది ప్రజలు మరణించినారు. అప్పటినుంచి దాదాపుగా ప్రతిసంవత్సర మా నెలలో తుపాను గాలి వీచి బందరులోనున్నవారికి భయాందోళనము గావించును. అట్లనే ఆ సంవత్సరముకూడ ఆ నెలలో నొకరాత్రి తుపానుగాలి వీచి నట్టు కొన్నది. రెవరెండు ఎడ్డిగారు ఆ మరునాడు మా నోబులుకళాశాలకు వచ్చి పెద్దహాలులో ప్రార్థన జరిపి గొప్ప యుపన్యాస మిచ్చెను. ఆ క్రిందటిరాత్రి తా నేసుక్రీస్తుద్వారా భగవంతుని ప్రార్థించి, తుపాను రాకుండ గాపాడితినని చెప్పెను. ఉపన్యాసము విన్నారుకదా ! ఏసుక్రీస్తు నందు విశ్వాసముగలవారెంతమందియున్నారో వారిని చేతులెత్తుడని కోరెను. నేను, బసవరాజు, జగన్నాథరావు అను ముగ్గురువిద్యార్థులము మాత్రము చేతులెత్తితిమి. నే నెప్పుడు క్రైస్తవమతములో చేరదలచినవాడను మాత్రము కాను. కాని మా తండ్రిగారికి కొలదికాలమువరకా భయముండెడిది. నే నా భయమును దీర్చితిని. తక్కిన యిద్దరు విద్యార్థులు కొంతకాలము క్రైస్తవ మతమును స్వీకరింతుమని చెప్పుచు కొన్నిలాభములనుగూడ బొందిరి. తుదకు క్రైస్తవమతమును స్వీకరింపకుండానే కళాశాలను వదలిపోయి తెల్లక్రైస్త వోపాధ్యాయుల కాశాభంగము కలిగించిరి. ఏసుక్రీస్తును, క్రైస్తవమతమును ఖండించుచున్నానని పింగళి లక్ష్మీనారాయణ చేతులెత్తెను. తరువాత రెవ రెండు ఎడ్డీగారు రెవరెండు క్లార్కును, వేంకటరత్నమునాయుడుగారిని పిలి

పించి వేంకటరత్నమునాయుడుగారు బ్రహ్మసమాజబోధలుసేయును విద్యార్థులలో గొప్పపలుకుబడిని కలిగియున్నారనియు. అందువలన విద్యార్థులెవరు క్రైస్తవమతములోచేరుటలేదనియు,ఆయనను వెంటనే నోబులుకళాశాలనుండి పంపివేయవలసినదని గట్టిగా చెప్పెను. ఆయనబోధలు పంచదారపూసిన విషతుల్యములని చెప్పెను. అందుమీద 1899 లో వేంకటరత్నమునాయుడుగారు నోబులుకళాశాలను విడచివెళ్ళిరి.అప్పటినుండి పిల్లైసంతవరకు క్రైస్తవులనే ఉపాధ్యాయులనుగా నియమింపసాగిరి. అంతేకాదు. పిమ్మట గొన్ని సంవత్సరములనుండి ఆంగ్లేయ చర్చిమిషనుసొసైటీవారు విద్యాప్రతిష్ఠాపనలను చాలవరకు తగ్గించినారు. తమ ధనమును క్రైస్తవమతబోధకే వెచ్చించుచున్నారు. నోబులుకళాశాలను హైస్కూలుగా జేసినారు. బెజవాడలోను, ఏలూరులోను వున్న తమ హైస్కూళ్ళను మ్యునిసిపాలిటీల కిచ్చివేసినారు.

ఈవిధముగా ప్రారంభమున విదేశీయమిషనరీలు ముఖ్యముగా నాంగ్లేయమిషనరీలు హిందూదేశములో తమమీదనే ఆధారపడినట్టియు, బ్రిటిషుప్రభుత్వమునకు సర్వదా భక్తిగలిగియుండునట్టియు, గొప్ప క్రైస్తవ సంఘమును బ్రిటిషు ఉద్యోగస్థుల సహాయములో స్థాపింపవలెనని ప్రయత్నము సలిపిరనుట చరిత్రప్రసిద్ధము. ఇట్టిదే చైనాలోగూడ జరిగినది. కాని గాంధీగారి జాతీయోద్యమము ప్రజ్వరిల్లినకాలది క్రైస్తవులలో నున్నతవిద్య వ్యాపించినకొలది భారతదేశ క్రైస్తవులలో దేశాభిమానము, జాతీయతత్వము ప్రబలినవి. వారుగూడ తమ మాతృదేశమునకు స్వాతంత్ర్యము కావలెనని కోరుచు, అట్టి స్వతంత్రసంపాదనప్రయత్నములో దమ పాత్రను జక్కగా నిర్వర్తించిరి. తక్కినసంఘములతో అనగా హిందువులతో ముసల్మానులతో, సిక్కులతో గలసిమెలసియుండి యాత్మగౌరవము కలిగినట్టియు స్వతంత్రయుతమైనట్టి పౌరసత్వము గల్గియుండుటకే నిశ్చయించిరి. ఇట్టి జాతీయ క్రైస్తవోద్యమమున కన్నిరాష్ట్రములలో విద్యాధికులైన క్రైస్తవులు నాయకత్వమును వహించియున్నారు. ఆంధ్రదేశములో డాక్టరు ధన్వాడ రామచంద్రరావు ఎమ్.ఏ.ఎమ్.డి, పుదుకోట్టట ప్రధానన్యాయమూర్తిగా జేసిన చంచయ్య, డోర్నకలు బిషప్ అజరయ్య మొదలైనవారు జాతీయ క్రైస్తవనాయకులుగా నుండిరి. హిందూసంఘములోగూడ పూర్వా

చారపరాయణత్వము నశించి, సంఘసంస్కారణోద్యమము. గాంధీతత్త్వము వ్యాపించినకొలది హరిజనులను, క్రైస్తవులను హీనులుగానుంచుపద్ధతి పోయి, తమతో సమానముగాను, సోదరులగాను జూచు అలవాటేర్పడినది. హరిజనసేవాసంఘములస్థాపన, హరిజనులకు శాసనసభలలో ప్రత్యేక ప్రాతినిధ్యము, ఆర్థికలాభములకొరకు హరిజను లన్యమతములను స్వీకరించు ఆవశ్యకతను జాలవరకు తగ్గించినది. భారతీయ క్రైస్తవులమీద నాంగ్లేయమిషనరీల ప్రభావము పూర్తిగా తగ్గిపోయినది. ఆంగ్లేయప్రభుత్వము పోయినచో క్రైస్తవమతమునకు, క్రైస్తవదేవాలయములకు నపకారము కలుగునని యాంగ్లేయులు వ్యాపింపజేసిన భీతి పూర్తిగా పోయినది. హిందువులనందరను క్రైస్తవులుగా చేసికొనవలెనను తలంపు క్రైస్తవులలోను, క్రైస్తవులనందరను హిందూమతములోనికి మరల జేర్చుకొనవలెనను కోరిక, హిందువులలోను మృగ్యమైనవి. స్వతంత్రభారత రాజ్యాంగ విధానములో నన్నిమతములకు సమానమైనహక్కు, బాధ్యతలు సమకూర్చబడినవి. మతస్వేచ్ఛ, మతసామరస్యము మతసహనము, మతములమధ్య సోదరత్వము బాగుగా స్థాపింపబడినవి. కనుక 19 వ శతాబ్దములో నున్న హిందూ క్రైస్తవసంఘర్షణలుకాని,స్పర్ధలుకాని అసూయలుగాని యిప్పుడేమియును లేవు. క్రైస్తవపాఠశాలలు, కళాశాలలు తమ మతవ్యాపకమునకు గాక విద్యావ్యాపకమునకే మానవసేవాధర్మముగ బాగుగ పనిచేయుచున్నవి. ఇతర మతస్థులు వానికి దమపిల్లల నెట్టిసంకోచములేకుండ సంతోషముతో బంపుచున్నారు. ఇటులనే ఇరువదవశతాబ్దములో చైనాదేశములో కూడ జరిగినది. చైనాదేశీయ క్రైస్తవుడైన డాక్టరు సన్యటుసేను చైనా జాతీయ స్వతంత్రవిప్లవమును నడిపినాడు. చైనాదేశీయులందరిచే అవతారమూర్తియని పూజింపబడుచున్నాడు.

వేంకటరత్నమునాయుడుగారు తరువాత కొంతకాలము సికిందరాబాదులోని మహబూబుకాలేజియనుపేరుగల హైస్కూలులో ప్రధానాచార్యత్వమును వహించి, తరువాత కాకినాడలోని పిఠాపురము మహారాజాగారి కళాశాలకు కొన్నిసంవత్సరములు ప్రధానాచార్యులుగానుండి, యుద్యోగమునుండి విరమించిరి. కొన్నిసంవత్సరములు మద్రాసు విశ్వవిద్యాలయమునకు

ఉపాధ్యాయులుగాగూడ బనిచేసిరి. పిఠాపురము మహారాజా రావు సూర్యారావు గారు, వారి దివాను మొక్కపాటి సుబ్బారాయుడుగారు, అసిస్టెంటు దివాను కోటా వెంకటసుబ్బారావుగారు వెంకటరత్నమునాయుడుగారికి ప్రధానశిష్యులుగా నుండిరి. రఘుపతివారిద్దరును నోబులు కళాశాలలో నాయుడుగారివద్ద విద్యనభ్యసించినవారే. వెంకటరత్నమునాయుడుగారి ప్రోత్సాహముమీద కాకినాడలో అనాథశరణాలయమును పిఠాపురము మహారాజాగారు స్థాపించిరి. స్త్రీలకు, హరిజనులకు విద్యావిషయమున గొప్ప ప్రోత్సాహమిచ్చియుండిరి. ఏ క్లాసులోను జీతములు పుచ్చుకొనుట మానిరి. కొంతమంది విద్యాధికులకు విద్యార్థివేతనములిచ్చి విదేశములకు బంపిరి. కాకినాడ బ్రహ్మసమాజమునకు కేంద్రమయ్యెను. డాక్టరు వేమూరి రామకృష్ణారావు గారుకూడ కొంతకాలము కాకినాడలోని రాజాగారి కాలేజీకి ప్రధానాచార్యులుగా నుండిరి. కాని వీరేశలింగముపంతులుగారు గాని, వేంకటరత్నము నాయుడుగారు కాని 1905నుండి ప్రజ్వరిల్లిన భారతజాతీయోద్యమమున కెట్టి దోహదమును గావింపలేదు. వారిలో సర్వమానవసమానత్వమే కలదు కాని, జాతీయతత్త్వము లేకుండెను. భారతజాతికి స్వాతంత్ర్యము కావలెనను ఆవేదన వారిచిత్తములో లేకుండెను. వేంకటరత్నమునాయుడుగారికి మొదట దివాన్‌బహద్దరు బిరుదమును బ్రిటిషుప్రభుత్వమువా రిచ్చినపు డా బిరుదము నంగీకరించుటవలన ఆయనయొక్క గొప్పతనమునకు లోపమేవచ్చెనని నే నాయనకు వ్రాసియుంటిని. పిమ్మట 'సర్' అను బిరుదముకూడ నొసంగబడినది. పిఠాపురమురాజాగారు, జాతీయోద్యమమునకు ఎట్టి సహాయము చేసియుండలేదు. మహాత్మాగాంధీ భారతజాతీయనాయకత్వము వహించువరకును, తీవ్ర రాజకీయవాదులలో అనేకమంది సంఘ మత సంస్కరణలకు వ్యతిరేకులుగను, తీవ్ర మత సంఘసంస్కరణవాదులలో చాలమంది బ్రిటిషు ప్రభుత్వమునందు విశ్వాసముగల మితవాదులుగా నుండిరి. జాతీయస్వాతంత్ర్యములేని సంఘ మతసంస్కరణము నిరర్థకము. అది బాగుగ సాగునది కాదు. భారతజాతి యొకేవృక్షము. దాని యన్నిశాఖలు రసవంతములై, సమానముగా వృద్ధిచెంది, తలిరుజొంపములతోడను, పుష్పగుచ్ఛములతోడను, పండ్లగుత్తులతోడను కలకలలాడవలెను. కొన్నిశాఖ లెండి, కొన్ని

శాఖలు మాత్రము పచ్చిగానుండిన మాత్రమున లాభములేదు. అటులనే జాతి కేవలము రాజకీయముగనే కాక ఆర్థికముగాను, ఆధ్యాత్మికముగాను, సాంఘికముగనుకూడ సమానముగా అభివృద్ధిచెందవలెను. ఇదియే గాంధీ మహాత్ముని జాతీయతత్వము.

1900 సంవత్సరములో మునగాల రాజాగారికి ఎస్టేటు అప్పగింపబడుటచే ఆయన, లక్ష్మణరావుగారు, మా నాయనగారు మునగాలకు వెళ్ళిపోయిరి.

(4)

కాలేజిలో విద్యార్థిగానున్నపుడు, ఉపాధ్యాయునిగానున్నపుడు కూడ నేను సాయంత్రంవేళ టెన్నిసు ఆడుచుండెడువాడను. విద్యార్థిదశలో (Debating society) చర్చాసంఘములో బాగుగ పాల్గొనెడివాడను. కొంతకాల మా సంఘమునకు కార్యదర్శిగకూడ నుంటిని. కాలేజి సాంవత్సరికసభలలోను, చర్చాసంఘపు సాంవత్సరిక, విద్యార్థివసతిగృహ సాంవత్సరికసభలలోను నాటకములను వేసెడువారము. నేనుకూడ నాటకములలో పాత్రలను ధరించెడువాడను. పోర్షియా, అంటనీ, సర్ మొదలైన యింగ్లీషు పాత్రలను, హరిశ్చంద్ర మొదలగు తెలుగు పాత్రలను వేసియుంటిని. అపుడపుడు కీర్తనల నల్లి పాడుటయు గలదు. రెవరెండు క్లార్కుగారింగ్లాండు పోయినపుడు జరిగిన వీడ్కోలు సందర్భములో నేను రెండు కీర్తనలను రచించితిని. రెవరెండు పెన్నుగారు నన్నుగూర్చి (Poet of the F.A. Classes will sing songs) ఎఫ్.ఏ. క్లాసుల కవీశ్వరుడిపుడు కీర్తనలు పాడునని పేర్కొనెను. హిందూ నాటకసమాజములో ప్రధాన పురుషపాత్ర ధరించు రాజగోపాలముగారు ఫిడేలు వాయించగానే నేను కీర్తనలను శ్రావ్యముగాపాడితిని. నాకు సంగీతము కొంచెముగనే వచ్చినను నా కంఠస్వర మపుడు చక్కగా నుండెను. 1900 సంవత్సరములో నోబిలు కళాశాల స్వర్ణోత్సవము జరిగినపుడు కాలేజి చరిత్రను తెలుపు కీర్తనమునంభాషణరూపముగా నేను,మల్లాదినరసింహమనువిద్యార్థి పాడితిమి. నేను బందరు చదువునకు వెళ్ళకముందే తిరుపతి వేంకటేశ్వర కవులు వచ్చి

శతావధానము గావించి విద్యాధికులందర నాశ్చర్యమగ్నులజేసి వెళ్ళినారు. వారి యఖండాంధ్రభాషాసేవనుగూర్చి ముందుముందు చెప్పెదను. నేను బందరుసకు వెళ్ళగనే ఆదిభట్ల నారాయణదాసుగారు వచ్చి తమ హరికథల వలన ప్రజలను ముగ్ధులనుచేసినారు. ఆయన గొప్ప హరికథకుడే గాక వివిధభాషావేత్తయైన గొప్ప పండితుడు, గ్రంథకర్త. ఆయన రచించిన "ఉమరుఖయ్యాము" అను మహాకవి కృతులు భాషాంతరీకరించిన గ్రంథములను నాకు బహూకరించిరి. పిమ్మట కొలదిరోజులకు బుట్టయ్య పేట నాటకశాలలో గుంటూరు మొదటి నాటకసమాజమువారు 'సారంగధర' నాటకమాడిరి. హరిప్రసాదరావు సారంగధరపాత్రను, కోవల్లె హనుమంత రావు చిత్రాంగిపాత్ర నద్భుతముగ నభినయించుట నేను చూచితిని. అదియే నేను మొదట చూచిన క్రొత్తపద్ధతి తెరలనాటకము. దీనితో వీథినాటకముల కాలము పోయినది.

బందరులో మూడు నాటకశాల లేర్పడి పనిచేయసాగెను. రామానాయుడుపేట హిందూనాటకసమాజమువారు వేయు నాటకములను నేను తోడివిద్యార్థులతో వెళ్ళి తరచు చూచివచ్చెదువాడను. అది మా హాస్టలుకు సమీపమున నున్నది. రాజగోపాలముగారు ప్రధానపురుషవేషము చక్కగా వేసెడువారు. బాగుగా సంగీతము పాడెదువారు. పంగనామాల నరసింహము. ఎమ్. నరసింగరావుగార్లు స్త్రీ వేషములను బాగుగ వేసెడివారు. వీరు నాకు చాల మిత్రులుగానుండిరి. నన్ను తమనాటకసమాజములో జేర్చుకొన ప్రయత్నించిరి. కాని వేంకటరత్నమునాయుడుగారి భయమువలన నే నందు జేరుటను తప్పించుకొన్నాను. బుట్టయ్యపేట నాటకశాలలో పీష్వా నారాయణరావు వధలో సుమేర్‌సింగు వేషమును, శివాజీవేషమును తామని లక్ష్మణస్వామిగారు వేసినపుడెల్ల ప్రజలు విరుచుకొనిపడెదువారు. మేముకూడ వెళ్ళెదువారము. గొడుగుపేట నాటకకంపెనీ మాకు చాలదూరము. ఎప్పుడైనను వెళ్ళి చూచెదువాడను. నాగలింగము, వేంకట్రామయ్య, మాగంటి సుబ్బారావు ప్రధానపాత్రలు వహించెదువారు. రామానాయుడుపేట నాటకసమాజమువారు పాడిన కీర్తనలను కొన్నిటిని నేర్చుకొని నేను హాస్టలులో పాడుకొనుచుండెడివాడను. మా హాస్టలు దొడ్డిలోనున్న చెట్లను, కంచెలను, కూపములను

వర్ణించుచు నేనొక హాస్యకీర్తనను రచింపగా నా సహాధ్యాయుడుగారు తెనరెండు పెన్నుగారుకూడ నాచేత టీపార్టీలలో దానిని పాడించెడివారు. అప్పుడప్పుడు మా ఆంగ్లేయోపాధ్యాయుల బంగళాలో టీపార్టీలు చేయుచుండేవారు. వానికి వెళ్ళెడువారము. నేను బి.ఏ. చదువుచుండగా నా సహవిద్యార్థియైన గొట్టిపాటి కాశిదాసుగారింటికి పాతగుంటూరుకు పోయి మూడుదినములుంటిని. అప్పుడు సురభికంపెనీవారు 'హరిశ్చంద్ర' నాటకము ప్రదర్శింపగా చూచితిని. ఆ కంపెనీలో పాత్రలు ధరించినవారిలో స్త్రీలే అధికసంఖ్యాకులై యుండిరి. కొంతమంది స్త్రీలు పురుషవేషములు ధరించిరి. గాటమ్మగారను స్త్రీ హరిశ్చంద్రను లోని "చంద్రమతి"పాత్ర నద్భుతముగా నటించెను.

ప్రతిసంవత్సరము కార్తీకపౌర్ణమికి బందరునుండి మూడుమైళ్ళ దూరము నడచివెళ్ళి సముద్రస్నానమొనర్చెదువారము. వేలమంది స్త్రీ పురుషులు, బాల బాలికలు స్నానమునకై వచ్చెదువారు. పల్లెటూళ్ళనుండి బండ్లు కట్టుకొని ప్రజలు వచ్చెదువారు. బందరు శివగంగలోని మహాశివరాత్రిని అమ్మవారి యుత్సవము చాల గొప్పది. చల్లపల్లి రాజాగారు ఏనుగుఅంబారీ మీద నెక్కి శివగంగనుండి చిలకలపూడివరకు ఊరేగెడువారు. బందరు నవాబువంశీయులు ఇనుగుదురులో నుండిరి. వారి యార్థికస్థితి పూర్తిగా క్షీణించినను వారు బందరులో పీర్ల పండుగలు ప్రతిసంవత్సరము అత్యుత్సవముగా జరిపించెడువారు. బందరుకు తూర్పున నుత్తరమునసున్న యుప్పుటేరులలో మొగలిరేకులు, జీడిమామిడిపండ్లు, మల్లెపూవులు చాల దొరకెడివి. 'స్మైడి' అను వైశ్యుడు తయారుచేసిన పకోడీలు, బెల్లపులడ్లు బందరులో ప్రసిద్ధి కెక్కెను. బందరు పుణుకులకు, తేగలకు, తాటిముంజలకుగూడ పేరు పడ్డది. విరివిగా జహంగీరు, ఇమామపసందు మామిడిపండ్లు శ్రేష్ఠమైనవి లభించెడివి. చక్రకేళిపండ్లు నరసాపురమునుండి బండ్లలో సముద్రతీర మార్గమున బందరుకు వచ్చెడివి. ఆనాటికి బందరుకు రైలులేదు.

1899 లో ఎఫ్.ఏ. ప్యాసుకాగానే 1900-1901 సంవత్సరాలలో నోబులుకళాశాలలోని చరిత్ర, రాజకీయ, ఆర్థికశాస్త్రములను దీసికొని బి.ఏ. చదివి ప్యాసయినాను. ఎందులకు బందరులోనే బి.ఏ. చదువవలసివచ్చినదో బి.ఏ. విద్యార్థిగా నేయే క్లాసుగ్రంథములు నితరగ్రంథములు చదివితినో

వెనుకటి అధ్యాయమునందే చెప్పియుంటిని. రాజకీయశాస్త్రము, హిందూ దేశచరిత్ర నాకు మిగిలినవానికంటె యెక్కువ మక్కువ గలిగించెడివి. ఇంగ్లాండులోను, ఇండియాలోను జన పదిసంవత్సరాల ఆచార్యత్వపు అనుభవములో తనక్రింద రాజకీయశాస్త్రము నభ్యసించిన మిగుల సమర్థులైన విద్యార్థులలో నే నొకడనని . మా రాజకీయశాస్త్రాచార్యులగు రెవరెండు రాబర్ట్సుగారు నాకు యోగ్యతాపత్రమిచ్చినారు. బి.ఏ. ప్యాసుకాగానే యందరకన్న మిన్నగా ప్యాసయిన ప్రథమవిద్యార్థికి (College good conduct medal) కళాశాల సత్ప్రవర్తనపతక మిచ్చెడు సంప్రదాయముండెడిది. నేను ప్రథమవిద్యార్థిగనే యుంటిని గాని. నా ప్రధానాచార్యులగు రెవరెండు క్లార్కుగారు నా కా పతకము నిచ్చుట కాక్షేపించిరి. నా కన్నియు మంచిలక్షణములే యున్నవనియు. విద్యార్థికుండవలసిన ముఖ్యలక్షణ మనగా శ్రద్ధగా కష్టపడి చదువుటయను లక్షణము నాకు లేనందున మనకళాశాలకు,విశ్వవిద్యాలయములో దేవలసిన ప్రతిష్ఠను తెచ్చియుండలేదనియు రెండవవానిగా వచ్చిన విస్సయ్య కా పతకమీయవలెనని వాదించినారు. కాని మిగిలినయందరాచార్యులు నా పక్షమున గట్టిగా వాదింపగా నా కా మంచిప్రవర్తన పతకము లభించినది. విద్యార్థిదశలో నాకు ఆంగ్లభాషా గ్రంథములకంటె ఆంధ్రసాహిత్యగ్రంథములందే ఎక్కువ యభిరుచి కలిగినది. నాకు ఎఫ్.ఏ. లోను, బి.ఏ. లోను తెలుగు పాఠ్యగ్రంథములుగానుండిన వేణీసంహారము, భర్తృహరి, భాగవతము, భారతము, మనుచరిత్ర మొదలగు గ్రంథములలోని పద్యములను కంఠస్థముగావించుకొని కొంచెము సంగీతసరళిలో జదువుకొనెడు. అభ్యాసమలవడినది. బి.ఏ. లో వసుచరిత్ర మాత్ర మెటులనో కష్టముతో జదివితిని. పిమ్మట నా జీవితములో ఎపుడు నాంగ్ల కవిత్వమునుగాని, ఆంగ్ల నవలలను గాని ప్రత్యేకముగా చదివియుండలేదు. ఆంగ్లములో రచింపబడిన చారిత్రక, రాజకీయ,ఆర్థికశాస్త్రగ్రంథములు, మతగ్రంథములు చదువుటయే నాకలవాటు. తీరికైనపు డాంధ్రకావ్యములలో ముఖ్యమైనవాని నేదోవిధముగా జదివి గ్రాహ్యముచేసికొంటిని. పాండిత్యము దేనిలోను సంపాదించియుండలేదు. నేను లక్షలకొలది పామరులకు ప్రతినిధినేగాని కొలదిమంది పండితుల

స్థానమును పొందియుండలేదు. బమ్మెర పోతన విరచిత భాగవతము లోని చాలపద్యములు, భర్తృహరి సుభాషితములోని కొన్ని పద్యములు నాకు కంఠస్థముగావచ్చును. జైళ్ళలోనున్నపుడు సాయంత్రపు ప్రార్థనాసమయము లలో నేను నా తోడివారికి జదివి వినిపించెడువాడను. సంగీతమునందు, నాటకకళయందుగూడ నా కభిరుచియుండెనని పైన చెప్పియున్నాను.

నేను విజయవాడలో 'లాయరుగా' నుండగా సుమారునాల్గు సంవత్స రాలు 'స్టారుథియేట'రను నాటక సమాజమును నే సభ్యునిగానుంచి నడిపి తిని. కొంతకాలమునకు నాటకములలో పాత్రలు చక్కగా ధరించు యువ కులకు జీవనోపాధి కల్గించు సమస్య బాధించినందువలన నది నడుపగా సాగుట లేదని యెంచి,యా సమాజమును రద్దుపరచినాము.సుబ్బారావను పిల్లవాడు స్త్రీ పాత్రను చాల ఆకర్షణీయముగా వేసెడువాడు. కాని యతనికి జీవనోపాధిని కుదర్చలేకపోయితిమి. నా వద్దనే ప్లీడరుగుమాస్తాగాపెట్టుకొని పోషింపవలసి వచ్చినది. ఆ పనికికూడ అతడు పనిరాలేదు. ఇటులనే యింక కొందరను గూడ జీవనోపాధివిషయములో చిక్కేర్పడుటవలన యీ సమాజమును మూసివేయవలసివచ్చినది. ఆంధ్రదేశములో 'సురభికంపెనీ'లో తప్ప మిగి లిన నాటకసమాజములలో అప్పటికి స్త్రీలు స్త్రీలపాత్రలను ధరించెడివారు కారు. పురుషులే స్త్రీపాత్రలను ధరించెడివారు. మైలవరము నాటకసమాజ ములో ఉప్పులూరు సంజీవరావుగారు సావిత్రిపాత్రను, తెనాలివారగు (ఇపుడు పద్మశ్రీ)స్థానము నరసింహారావుగారు చిత్రాంగి, సత్యభామ, కన్యాశుల్కము లోని వేశ్య మధురవాణి పాత్రలను ధరించినపు డెట్లు జనసమూహ మాకర్షింపబడినదో సుప్రసిద్ధ విషయమే. ఆదిపూడి సోమనాథరావుగారు సంగీత మెక్కువబాగుగా రాకుండినను, ఆదర్శములను ఉత్కృష్టభావములను బోధించుచు హృదయాకర్షకములైన హరికథలను జెప్పెడువారు. కోటా శ్రీరామశాస్త్రిగారు వితంతూద్వాహముచేసికొన్నారు. కాంగ్రెసుభక్తులైనారు. వందేమాతరము కీర్తన ప్రతి సభలోను ఉద్రేకపూరితముగ పాడెడువారు. బుద్ధజీవితమును హరికథగా హృద్యముగా జెప్పెడువారు. నాకుగూడ లాయరు గాను, కాంగ్రెసు కార్యకర్తగా నుండగా బుద్ధజీవితమును హరికథగా చెప్ప వలెనని అభిలాషకలిగి తిరుపతి వేంకటకవులు వ్రాసిన బుద్ధచరిత్రలో కొన్ని

పద్యములను, దాసు నారాయణరావుగారు, దాసు శ్రీరాములుగారు రచించిన బుద్ధనాటకమును పఠించినాను. నేను బెజవాడలో లాయరుగా ప్రవేశించిన కొలదికాలమునకే పాటిపల్లి రామకృష్ణయ్యగారు బెజవాడలో నివాసమేర్పరచుకొన్నారు. వారిని నేను సర్వవిధముల ప్రోత్సహించినాను. కొంతకాలమునకు ఆయనఖ్యాతి ఆంధ్రదేశమందేగాక భారతదేశములోని చాలభాగములందుకూడ వ్యాపించినదని నేను వ్రాయనక్కరలేదు. ఆయన నా కతిముఖ్య స్నేహితులు. నాకు ఫిడేలును, గాత్రమును నేర్ప నారంభించిరి. కాని నాకు కొన్నిరోజులకు చాల జబ్బుచేసినది. హృదయము బలహీనమైనది. దానితో సంగీతము నేర్చుకొనవలెనను యత్నమును విరమించితిని. లోకమాన్య బాలగంగాధరతిలకుగారు భారతాది పురాణములను ప్రజలకు చదివి విన్పించి, రాజకీయోద్రేకమును కలుగజేసెడువారని లక్ష్మణరావుగారు చెప్పుచుండిరి. నే నటులనే హరికథలరూపముగా జేయుట కుద్దేశించితిని గాని నా కోరిక నెరవేరలేదు.

(5)

1902-1903 సంవత్సరాలలో నోబులు కళాశాలలో అధ్యాపకునిగా పని చేసితినని వెనుకటి అధ్యాయములో చెప్పియుంటిని. నేను విద్యార్థిగానున్న కాలములో అధ్యాపకునిగానున్న కాలములోను వేసంగిశలవులలో నందిగామవెళ్లినపుడు గుంటూరు వెళ్ళి, ఉన్నవ లక్ష్మీనారాయణగారు ఆయన సతీమణి లక్ష్మీబాయమ్మగార్లను దర్శించెడువాడను. లక్ష్మీనారాయణగారు ఎఫ్.ఏ.ప్యాసుకాగానే గుంటూరులో రెండవగ్రేడు న్యాయవాదవృత్తిని స్వీకరించినారు. అనేకవితంతూద్వాహములను చేయించినారు. బ్రహ్మసమాజమును నెలకొల్పినారు. పూర్వాచార హిందూసంఘమువారు ఆయనను ఆయనభార్యను బహిష్కరించినారు. నేను వారి బ్రహ్మసమాజములో బాల్గొని వితంతూద్వాహములలో భుజించెడువాడను. ఆయన నాకంటె నాలుగేండ్లు పెద్దవాడు. వీరేశలింగముగారి తర్వాత ఆంధ్రదేశములో గొప్పసంస్కర్త ఆయనయే. ఆయన 1909 లో ఇంగ్లాండునకుబోయి డబ్లిన్‌లో బారిస్టరు ప్యాసైవచ్చినాడు. కాని ప్లీడరు పని చేయక సంఘసంస్కర్తగానే పనిచేసి గాంధీగారి స్వాతంత్ర్యసంగ్రా

మములో ఆయన, ఆయన సతీమణి వెలివేయబడుటకు కొంగాపవష ననుభవించినారు. శారదానికేతనమను స్త్రీల జాతీయకళాశాలను గుంటూరులో స్థాపించి ఆతనిభార్య మరణించినంతవరకు, ఆమెని ప్రిన్సిపాలు బాధ్యతచేసినంత వర కనేకవత్సరాలు పేరుప్రతిష్ఠలతో నడపినారు. హరిజనుల ఆడుపిల్లలకు, క్రైస్తవులయాడుపిల్లల కందులో ప్రవేశముండెను. ఆయన గొప్ప పండితుడుకూడ. ఆయన రచించిన 'మాలపల్లి' యను సుప్రసిద్ధమైన నవల సంఘవిప్లవమును కలుగజేయుచున్నదని తలచి బ్రిటిషుప్రభుత్వమువారు దానిని నిషేధించిరి. నేను 1926 లో మద్రాసు శాసనసభకు కాంగ్రెసు సభ్యునిగా ఎన్నుకొనబడినపుడు దానిలో 1,2 పేజీలను తీసివేయించి దాని మీది నిషేధమును తొలగింపజేసినాను. 1937 లో కాంగ్రెసుప్రభుత్వ మేర్పడగనే యా రెండుపేజీలమీద నిషేధముగూడ పోయినది. సర్వతోముఖమైన తీవ్రకృషిని దేశముకొరకు సల్పుటలో సర్వంత త్యాగము గావించిన యాంధ్రమహానాయకు డాయన. రాబోవు తరాలవారి కాదర్శప్రాయుడు. గుంటూరులో కొండా వెంకటప్పయ్య, భావనాచార్యులు, పసుపులేటి వేంకటకృష్ణమ్మనాయుడుగారు మొదలగుపెద్దలు సంఘసంస్కరణములో వారితో సానుభూతిచూపినను పూర్వాచారపరాయణులకు భయపడి ఆయనతో భోజనముచేసెడువారు కారు. అనేక సంవత్సరాలాయన బహు తీవ్రమైనవెలిలో నుండెను. 1906 వ సంవత్సరములో మేము కొందరము బెజవాడలో రాజకీయ సంఘసంస్కరణబృందముగా చేరి లక్ష్మీనారాయణగారిని పిలచి భోజనముచేసి వెలితీర్చితిమి. కొంతకాలమాయనకు గుంటూరులో వెలి బెజవాడలో వెలిలేకుండుట జరిగెను. గాంధీగారి స్వాతంత్ర్యోద్యమము విజృంభించినపిమ్మట నందరయొక్క యన్ని బహిష్కృతు లదృశ్యమైనవి. కులమతభేదములు లేక అందరితోను హరిజనులతోకూడ కలసి యందరము భోజనముచేసినాము. మానవసమానత్వము దృఢముగా స్థాపింపబడినది. మాలో చాలమంది కులభేదచిహ్నాములైన జందెములు తీసివేసితిమి. మహాత్మా గాంధీగారి పిలుపు ననుసరించి స్త్రీలు వేనకువేలు ముందుకువచ్చి స్వాతంత్ర్యోద్యమములో పాల్గొని కారా

గారశిక్ష లనుభవించిరి. అంతటితో స్త్రీలకు పురుషులతోబాటు సమానమైన రాజకీయ మత సాంఘి కార్థిక హక్కులు కలిగినవి.

నే నధ్యాపకుడనిగా నున్న కాలములో కళాశాలాచార్యులు వేరుగను హైస్కూలు ఉపాధ్యాయులు వేరుగను లేరు. కనుక ఎఫ్.ఏ. జూనియరులో గ్రీసుచరిత్రను, మెట్రిక్యులేషనులో హిందూదేశచరిత్రను, ఇంగ్లీషు తెలుగు భాషాంతరీకరణమును, 4,5 ఫారములలో నాంగ్లమును, చరిత్రను, గణితమును బోధించుపనిని నాకిచ్చిరి. అయిదవఫారములో "సిటిజన్ ఆఫ్ ఇండియా" (ఇండియాదేశపుపౌరుడు) అను గ్రంథము నేను బోధింపవలసి వచ్చెను. ఆ పుస్తకము ప్రత్యేకముగా బ్రిటిషుప్రభుత్వమువలన హిందూ దేశమునకు కలిగిన మేళ్ళనుగూర్చి బోధించుటకు వ్రాయబడినది. నేను నా క్లాసులో అందులో వ్రాయబడిన సంగతులకు కేవలము వ్యతిరేకముగా బ్రిటిషుప్రభుత్వమువలన భారతదేశమునకు గల్గుచున్న అరిష్టములనుగూర్చియే బోధించితిని. ఆ సంవత్సరపరీక్షలో నేను చేసిన బోధనలప్రకారము విద్యార్థులందరు వ్రాసిరి. ఆ రెండుసంవత్సరాలు నేను బచ్చుపేటలో కుటుంబముతో కాపురముంటిని. విద్యార్థుల కుపాధ్యాయులమీద గొప్ప భక్తి, విద్యార్థులమీద నుపాధ్యాయులకు జాల ప్రేమ యుండిన కాలమది, క్రమశిక్షణయందు ప్రత్యేకశ్రద్ధ చూపబడుచున్న కాలమది. ముఖ్యముగా ఇంగ్లీషుభాషను దేశచరిత్రనుబోధించుచున్నకాలములో, దైవభక్తి, దేశభక్తి, అన్నిమతములయందు సమానగౌరవమును, మానవసమానత్వమును, యోగ్య ప్రవర్తనమునుగూర్చి బోధించెడువాడను. మా గురువరేణ్యులగు వేంకట రత్నమునాయుడుగారి అడుగుజాడలలో నడచుటకు బ్రయత్నించితిని. తోడి ఉపాధ్యాయులలోను విద్యార్థులలోను సమర్థుడనని, మంచివాడనని పేరు పొందితినని గర్వముతో జెప్పగలను. కానుకొలను త్రివిక్రమరామారావు గారుకూడ నా సహోపాధ్యాయులుగా నుండిరి. ఆయన గొప్ప ఆదర్శజీవి

విద్యార్థులు నా దగ్గరకు జాల చనవుగా వచ్చెడువారు. పాఠములు తెలియనివారు కొందరు మా యింటికివచ్చి పాఠములు నేర్చుకొనిరి. నే నెవరి వద్దను డబ్బుపుచ్చుకొనకుండగనే చెప్పువాడను. హైస్కూలు క్లాసులలో నొక యాంగ్లేయయువతి, ముగ్గు రాంగ్ల బాలురు విద్యార్థులుగా నుండిరి.

అప్పు డంతకంటె విద్యార్థినులు మా కళాశాలలోనే లేరు. ఆ యాంగ్లయువకులలో ఎలియట్ అను విద్యార్థి యింగ్లీషులో మొదటివాడుగా నుండెను. కాని లెక్కలలో సరిగా లేడు. మాయింటికివచ్చి నావద్ద లెక్కలు నేర్చుకొనెడువాడు. నావద్ద జదువుకొన్న విద్యార్థులలో గొప్పగొప్ప యుద్యోగస్థులుగను, లాయర్లుగను పైకివచ్చినవారు గలరు. నేను విద్యార్థులలో జనవుగానున్నను వారికి సహాయముచేసినను క్లాసులలో మాత్రము క్రమశిక్షణను నిరాఘాటముగా నమలుజరిపెడువాడను. ఆ దినములలో వేమూరి రామకృష్ణారావుగారు బాగుగ క్రమశిక్షణ నమలుజరుపుటలో పేర్గాంచిన ఉపాధ్యాయులు. ఆరవఫారమువరకును విద్యార్థులను క్రమముగా తప్పినచో బెంచీమీద నిలువబెట్టెడువారు. అంతకంటె చిన్నఫారములలో జదువు విద్యార్థుల అరచేతులమీద బెత్తముతో గొట్టెడువారు. నేను బెత్తముతో కొట్టకపోయినను, అపుడపుడు క్లాసులలో బెంచీలమీద నిలువబెట్టెడువాడను. 'ధైర్యం' అను హరిజన క్రైస్తవవిద్యార్థి బంగరు రాజుపిల్లుడు ఆరవ ఫారములో మొదటివాడుగా నుండెను. అతడు టెన్నిసాటలో గట్టివాడు. నేను విద్యార్థిగా నున్నపుడు మేమిద్దరము టెన్నిసాడుకొనెడువారము. నే నయిదవ ఫారమునకు లెక్కలు చెప్పుటకు వెళ్ళగానే మిగిలినవారితోపా టాతనిని కూడ ఇంటిదగ్గర లెక్కలు చేసికొనివచ్చితివా? యని ప్రశ్నించితిని. (బాను) రాజాగారు తీసికొనిరాలేదని వెంకెతనముగా జవాబుచెప్పెను. దానిమీద వెంటనే రాజాగారికి కొంచెము గౌరవము జరుగవలెనని, బెంచీమీద కెక్కి నిలువబడుడని చెప్పితిని. అత డట్లు చేసెను. పదినిమిషములు బెంచీమీద నిలువబడిన తరువాత ఇకముందు క్లాసులో సరిగా ప్రవర్తింపవలసినదని మందలించి క్రిందికి దిగి కూర్చొనుమంటిని. ఆత డారవఫారములోగూడ నా క్రింది విద్యార్థిగా నుండెను, తర్వాత చాల వినయముగా ప్రవర్తించెడువాడు. పిమ్మట నాతడు బి.ఏ. ప్యాసయి రైలువేలో పెద్దయుద్యోగమును చేసెను. ఆ క్లాసులోను పై క్లాసులోను నా వద్ద చదువుచున్న జేమ్సు, రాజరత్నము అను ఇద్దరు క్రైస్తవ విద్యార్థులు బహు వినయవిధేయతలతో నుండిరి. వారు తరువాత జిల్లాకలెక్టరుపని చేసినారు. నన్ను వచ్చి చూచిపోయేవారు. కాశీ పట్నము నరసింహమూర్తి యను విద్యార్థి బందరులోనే పేరుగన్న లాయ

డయ్యెను. నా కిప్పటికి ముఖ్య మిత్రులు. కొందరు విద్యార్థు లమాయకులుగా నుండిరి. ఒకవిద్యార్థి నాతో మూడవఫారములో సహవిద్యార్థిగానుండెను. నేను బి.ఏ. ప్యాసై ఉపాధ్యాయునిగా వచ్చునప్పటికి నత డైదవ ఫారములోనికి వచ్చియుండెను. బందరులో నున్నావు కదా! నీవు సముద్రమును జూచితివా? యని యాతనిని ప్రశ్నించితిని. తాను సముద్రమున కెప్పుడును పోలేదని జవాబుచెప్పెను. కొండను చూడలేదనెను.

ఒకరోజున నే నైదవఫారములో ఇంగ్లీషుచెప్పుచుండగా 'ఉడు' అను నొక ఆంగ్లేయవిద్యార్థి తనస్థానమునుండి లేచిపోయి రెండవబెంచీ మీద కూర్చున్న నరసింహారావను హైందవవిద్యార్థిని తన బూటుకాలితో తన్నివచ్చి తన స్థలములో గూర్చుండెను. అదివరకే యతడు తోడివిద్యార్థులను బూటుకాలితో దన్నుచుండెనని వినియుంటిని. అపుడు దానిని నేను చూచితిని. "ఉడ్డు! ఎందు కట్టి తప్పుచేసితివి? అది తప్పుకాదా?" అని యంటిని. "నన్నాతడు వెక్కిరించినాడు. అందువలన నేను బూటుకాలితో తన్నినమాట నిజమే" అనెను. "నిన్నాతడు వెక్కిరించినట్లయిన నాతో జెప్పిన నే నాతనిని దండించియుండెడివాడను. బూటుకాలితో నాతనిని తన్నినావు కావున నీవు వెంటనే క్షమాపణకోరి, యిట్టిపొరపాటు లెప్పుడు చేయనని విచారము తెలుపు" మంటిని. అందుల కాతడు "నే నేమియు తప్పుచేయలేదు. నేను క్షమాపణకోరను. నన్ను వెక్కిరించిన నే నటులనే చేయుదును. నే నాడుదానినా మీతో ఫిర్యాదుచేసుకొనడానికి?" అని అన్నాడు. ఆమీదట "ఉడ్డు! నీవు బెంచీమీద నిలువబడు"మంటిని. "నేను బెంచీమీద నిలువబడ"ననెను. నే నపుడు బంట్రోతును పిలచి యొక బెత్తమును తెప్పించి "నిన్నిపుడు డజను దెబ్బలు కొట్టెదను. కావున వెంటనే బెంచీమీద నిలువబడుము. నిలువబడినచో నిన్ను కొట్టక విడిచెద" నంటిని. కొంచె మాలోచించుకొని నేను కొట్టితీరెదనని తెలిసికొని బెంచీమీద కెక్కినాడు. పదునైదు నిమిషములు బెంచీమీద నిలువబెట్టినాను. ఇక నీవిధముగా ప్రవర్తింపనని క్షమాపణకోరుమనగా నతడు క్షమాపణకోరి యికమీద నెవరైన తన్నేమైన యన్నచో నాతో జెప్పెదనని చెప్పియుండెను. అటుతర్వాత నాతడు బెంచీమీదనుండి దిగి తనస్థానములో కూర్చొనుట కనుమతినిచ్చి

నాను. అత డింగ్లాండునుండి క్రొత్తగా వచ్చిన పోడ్డు ఆఫీసరుగాని పనచారుడు. తర్వాత అతనిని మా యింటికి దీసికొనిపోయి కుశలప్రశ్న లడిగి తోడి హైందవవిద్యార్థులతో ప్రవర్తింపవలసిన పద్ధతిని బోధించితిని. అప్పటి నుండి అతడు బహు జాగ్రత్తగా నుండుటయేగాక నాకు చాల ముఖ్యస్నేహితు డయ్యెను. ఆ నరసింహారావు తరువాత తన జీవితకాలమునందే డిప్యూటీకలెక్ట రయ్యెను. ఇటుల నయమునను, భయమునను క్రమశిక్షణ జరిపేవాడను. నేను ఉపాధ్యాయవృత్తిని మిగుల గౌరవప్రదమైనదిగను, పవిత్రమైనదిగను ఎంచినమాట వాస్తవమే. కాని దేశస్వాతంత్ర్యము కొరకు రాజకీయములలో పాల్గొనవలెనని నాకు దృఢమైనకోరిక యుండెను. ఒక మిషనరీ కళాశాలలో ఉపాధ్యాయుడుగా ఉండడమువల్ల అట్టిఅవకాశముండదని నాకు తెలుసును. నేను పెద్దలాయరును కావలెనని మా నాయనగారికి చాల కోరికయుండెను. ఈ కారణములచే 1904 వ సంవత్సరములో మద్రాసు లా కళాశాలలో విద్యార్థిగా చేరితిని.

(6)

1902 వ సంవత్సరములో కొమర్రాజు లక్ష్మణరావుగారి అక్కగారైన బండారు అచ్చమాంబగారు ఆమెభర్తతోకూడ బందరుకు మా ఇంటికి వచ్చి 4, 5 రోజు లుండిరి. అప్పటికి బందరులో కృష్ణాజిల్లా సంఘసంస్కరణ పక్షమున కొండా వేంకటప్పయ్య, దాసు నారాయణరావుగారలు కృష్ణా పత్రికను స్థాపించినారు. ఆ పత్రికలో అవుటపల్లి నారాయణరావుగారు ఉపసంపాదకుడుగా నుండిరి. ఆయన నాకు గొప్ప స్నేహితుడు. ఆయనతో సంప్రదించి బందరుకు అచ్చమాంబగారు వచ్చిన అవకాశమును తీసుకొని యొక స్త్రీ సమాజమును స్థాపింపవలయునని తలచి ఒక ఆహ్వానమును పంపగా బందరులోని లాయర్లు, ఉపాధ్యాయులు మొదలైనవారంతా తమ తమ స్త్రీలను ఆ సభకు పంపినారు. అప్పటికే అచ్చమాంబగారు "అబలా సచ్చరిత్ర రత్నమాల"అను గ్రంథమును రచించి ఆంధ్రదేశములో ఖ్యాతిని పొందియుండెను. సభ బుట్టయ్యపేట ఆడపిల్లల పాఠశాలలో బహు జయ ప్రదముగా జరిగినది. శివరామకృష్ణమ్మగారి రెండవ కూతురగు శ్రీమతి రత్నం ఎం.ఏ. ప్యాసైయున్నది. ఆమె దానికి అధ్యక్షత వహించినది.

అచ్చమాంబగారు స్త్రీల అభివృద్ధి, స్వాతంత్ర్యము, విద్య మొదలగు విషయములను గురించి చక్కని ఉపన్యాసమునిచ్చినది. బృందావన స్త్రీ సమాజమనుపేర నొక స్త్రీసమాజము స్థాపించబడినది. అదియే ఆంధ్రదేశములో ప్రథమముగా స్థాపించబడిన స్త్రీసమాజము. దానికి అనేక సంవత్సరములు శ్రీమతి మోటుపల్లి రాజాబాయమ్మగారు కార్యదర్శినిగా పనిచేసినది. నేటికిని ఆ సమాజము నిలచియున్నదనియే నా విశ్వాసము. దాని యాజమాన్యమున నొక బాలికాపాఠశాలను స్థాపించినారు. కొంతకాలమునకు అది స్త్రీల హైస్కూలు అయినది. దానిని ఇటీవల ప్రభుత్వము తీసుకొన్నది. అచ్చమాంబగారితో పాటు మరికొందరు నారీమణులుకూడ గ్రంథకర్త్రులుగా అప్పటికి ప్రఖ్యాతిని పొందియున్నారు. వీరేశలింగం పంతులుగారి శిష్యురాలైన కొటికలపూడి సీతమ్మగారు, గుండు అచ్చమాంబగారు, పులుగుర్తి లక్ష్మీనరసమాంబగారు మొదలైనవారు పేరుపొందిన కవయిత్రులుగా నుండిరి. బండారు అచ్చమాంబగారు, ఆమె భర్త బందరునుండి పోయి ఆంధ్రదేశములోని కొన్ని ముఖ్యపట్టణములను దర్శించి, యక్కడ స్త్రీసమాజములను స్థాపించిరి. కాకినాడలో విద్యార్థినీ సమాజము స్థాపింపబడినది. రాజమహేంద్రవరములోను, బెజవాడలోను, గుంటూరులోను, విశాఖపట్టణములోను, అనంతపురములోను గూడ స్త్రీసమాజములను స్థాపించిరి. అవి స్త్రీ సమాజపురోజులు. అందువలన స్త్రీలలో జాల చైతన్యము, విద్యాభిలాష, వ్యక్తిత్వములు కలిగినవి.

నేను విద్యార్థిగాను, ఉపాధ్యాయునిగా నున్న కాలములో బందరులో లాయర్లు కొందరు సంఘసంస్కరణపరాయణులుగాను, కొందరు వ్యతిరేకులుగను ఉండిరి. వేమూరి సుబ్బారావు, సిడింబి హనుమంతరావు, కొండా వేంకటప్పయ్య, వల్లూరి సూర్యనారాయణరావు, పెద్దిభొట్ల వీరయ్య, వడ్లమన్నాటి నరసింహము మొదలైనవారు సంఘసంస్కరణవాదులు. పురాణము వేంకటప్పయ్యగారు, వారిసోదరులు, జంధ్యాల గౌరీనాథశాస్త్రిగారు మొదలైనవారు పూర్వాచారపరాయణులు. బందరులో బ్రాహ్మణసంఘమునకు పురాణము వేంకటప్పయ్యగారితండ్రి సుబ్రహ్మణ్యావధానులుగారు సభాపతిగా నుండెను. సిడింబి హనుమంతరావు, కొండా వేంకటప్పయ్యగార్లు

కలసి ఉమ్మడిగా లాయరువృత్తిని నిర్వర్తించియుండిరి. 1902 వ సంవత్సరములో కృష్ణాపత్రిక బందరులో నెలకొల్పబడినదని చెప్పియున్నాను. అప్పటినుండి నేటివరకు సర్వవిధములైన రాజకీయ - మత సాంఘిక సంస్కరణలను, అభివృద్ధికరమైనభావములను బలపరచుచు, లలితకళలకుగూడ మంచి ప్రోత్సాహము కలుగజేయుచు గొప్ప భాషాసేవచేయుచు ప్రఖ్యాతిగలదైన వారపత్రికగా నిలచియున్నది. అప్పటినుంచి యిప్పటివరకు నిలచియున్న వారపత్రిక లాంధ్రదేశములో శేవనియే చెప్పవచ్చును. కృష్ణాపత్రిక సహాయసంపాదకులైన అవుటపల్లి నారాయణరావుగారు గొప్ప పండితులు. నేను బందరులోనున్నకాలములో నన్ను ప్రోత్సహించి యప్పుడప్పుడు తెలుగులో రాజకీయ సాంఘిక చారిత్రకవిషయములమీద కృష్ణాపత్రికలో నాచే వ్యాసములను వ్రాయించెడువారు. నేను పత్రికలకు తెనుగులో వ్రాయుట నప్పుడే నేర్చుకొంటిని. కొలదికాలములో సంపాదకులలో ఒకరైయున్న వారు నారాయణరావుగా రకాలమరణమందినారు. 1904 వ సంవత్సరమునాటికి కృష్ణానదికి దక్షిణముగానున్న భాగమునంతను ప్రభుత్వమువారు ప్రత్యేక గుంటూరుమండలముగా జేసిరి. అందులో నెల్లూరుజిల్లానుండి ఒంగోలుతాలూకానుగూడ గలిపిరి. ఈ నూతనమండలమునకు గుంటూరులో కలెక్టరాఫీసు, జిల్లాకోర్టు లేర్పడుటవలన గుంటూరుజిల్లా వాస్తవ్యులైన కొండా వేంకటప్పయ్యపంతులుగారు బందరువిడచి 1905 సంవత్సరము ఆగస్టునెలనుండి గుంటూరు పోయి అచటి కోర్టులలో లాయరువృత్తిని కొనసాగించిరి. కృష్ణాపత్రికను ముట్నూరి కృష్ణారావుగారి కప్పగింతచేసి పోయిరి. ముట్నూరి కృష్ణారావుగారా పత్రికను వారు జీవించియున్నంతవరకు నతితేజోవంతముగా నడిపి పత్రికాధిపతిగా, భాషాసేవకుడుగా, కళోపాసకుడుగా, దేశాభిమానిగా ఆంధ్రదేశములో గొప్పస్థాన మాక్రమించెను. 1903 వ సంవత్సరములో కొండా వేంకటప్పయ్యపంతులుగారు బందరులో లాయరుగా వుండగానే కలకత్తా నుండి బ్రహ్మసమాజపక్షమున సుప్రసిద్ధవక్తయగు బిపిన్‌చంద్రపాల్‌గారు బందరుకు వచ్చి హిందూప్రస్థానత్రయముమీదను, పురాణము లెట్టుల వేదాంతతత్త్వమును ప్రజలలో వ్యాపింపజేసినవో మున్నగు హిందూమత ధర్మములనుగూర్చి మహోపన్యాసమిచ్చెను. బందరులోని సంఘసంస్క-

రణవాదులైన ప్రముఖు లాయనను సత్కరించి, ఆయన కొక యల్పాహార విందును పృష్ఠస్థలములో గావించిరి. ఆయనతో గలసి శర్కరపొంగలిని, గారెలను, ఆవడలను. భుజించి కాఫీత్రాగిరి. బిపిన్‌చంద్రపాల్‌గారు శూద్రులు. ఆయన బంగళా విడచిపోయినపిమ్మట శూద్రులైనవారితో గలసి శర్కరపొంగలి, గారెలు. ఆవడలు భుజించి కాఫీత్రాగినందున ఏల సంఘ బహిష్కారము చేయకూడదో సంజాయిషీ చెప్పవలయునని యప్పు డల్పాహార విందులో పాల్గొనినవారందరకు బందరు బ్రాహ్మణసభాపతియైన పురాణము వేంకటప్పయ్య పంతులుగారి తండ్రి శ్రీముఖములను బంపిరి. దాని ప్రకారము ఘొజ్జిల్లిపేటలో నాగేశ్వరస్వామి దేవాలయములో సంఘసంస్కరణవాదులు, బ్రాహ్మణసభాపతివారికి మద్దతుచేయు పూర్వాచారపరాయణ ప్రముఖులు సమావేశమైరి. నేనుగూడ సంఘసంస్కరణవాదులకు మద్దతుగానుండుటకు కొంతమంది విద్యార్థులనుగూడ దీసికొని సభకువెళ్ళితిని. సంఘసంస్కరణ వాదులపక్షమున వేమూరి సుబ్బారావు పంతులుగారు సంజాయిషీచెప్పిరి. తాము హిందూసంఘములోని పెద్దలను ధిక్కరింపఁబూనుకొనలేదనియు, కాలము మారుచున్నందున క్రొత్తక్రొత్తమార్పులు హిందూసంఘములో దీసికొనివచ్చుట యవసరముగనున్నదనియు, లేనిచో హిందూసంఘము క్రుళ్ళిపోవుననియు, తాము బిపిన్‌చంద్రపాలుగారితో గలసి శర్కరపొంగలి, గారెలు, ఆవడలు తినుట, కాఫీత్రాగుట ఒక గొప్పలోపము కానేరదనియు, నింతమాత్రముచేత తమ యందరమీద నెట్టి చర్యతీసికొనుట సమంజసముకాదని వాదించిరి. సనాతన హిందూమతాచారములను సంఘసంస్కరణములను పేరున బాడు చేయుచున్నారనియు, పెద్దలైన సుబ్బారావుపంతులుగారివంటివా రట్లు చేసినచో హిందూమతమునకు ముప్పుకలుగుననియు నందువలన నీ సమావేశము జరిపితిమనియు పురాణము వేంకటప్పయ్య, జంధ్యాల గౌరీనాథశాస్త్రిలుగార్లు చెప్పిరి. ఇంతలో నోబులు కళాశాలలో బండితులుగానుండిన నరసింహశాస్త్రి గారు లేచి యాజ్ఞవల్క్యస్మృతిలోని కొన్ని శ్లోకములను చదివి తైలముతో వండినయెడల శూద్రులు తయారుచేసిన భక్ష్యములనుకూడ బ్రాహ్మణులు భుజింపవచ్చునని చెప్పిరి. అందువలన పూర్వాచారపరాయణుల వాదము

యాజ్ఞవల్క్యస్మృతికి వ్యతిరేకమని ఋజువయ్యెను. సభచాలించి యెక్కడివా రక్కడకు వెళ్ళిపోతిమి. కాని చాలకాలమువరకు నరసింహశాస్త్రులుగారికి తైలపక్వశాస్త్రులుగారని బందరులో పేరువచ్చినది.

అటుపిమ్మట కొన్నినెలలకు సంఘసంస్కరణవాదులకును పూర్వాచారపరాయణులకును వితంతూద్వాహములు, విదేశగమనములను రెండు విషయములపై బహిరంగసభలలో చర్చలు జరిగెను. సంఘసంస్కరణవాదులపక్షమున యోగీ శ్రీనివాసశాస్త్రిగారు స్మృతులనుండి ప్రమాణములను చూపుచు నీ రెండును హిందూశాస్త్రసమ్మతములని వాదనగావించిరి. ఆ చర్చ నాలుగైదురోజులు జరిగినది. యోగీ శ్రీనివాసశాస్త్రిగారు రాబర్ట్సన్ పేటలో బసచేసిరి. వారిబసకు వెళ్ళి కొంతకాలము వారితో గడపుచు ప్రమాణగ్రంథములనుగూడ దీసికొని వారితోగూడ నుపన్యాసవేదికలపైన నితర సంఘసంస్కరణ ప్రముఖులతోబాటు నేనుగూడ నాసీనుడనై యుంటిని. 1903 వ సంవత్సరము చివరభాగములో సంఘసంస్కరణ ప్రముఖులందరు కలసి యొక అదర్శప్రాయమైన వితంతూద్వాహమును జరుపుటకు ప్రయత్నముగావించిరి. అపుడు బి. ఏ. చదువుచున్న చోడవరపు జగన్నాధరావను విద్యార్థి తాను వితంతువును బెండ్లాడుదునని ముందుకు వచ్చెను. ఈ విషయములో నేనుగూడ శ్రద్ధగా బనిచేసితిని. పెద్దలలో వేమూరి సుబ్బారావుగారు, కొండా వేంకటప్పయ్యగారు, వల్లూరి సూర్య నారాయణరావుగా రెక్కువ యుత్సాహముతో యీపనికి బూనుకొనిరి. ఒక బ్రాహ్మణ వితంతువగు స్త్రీ, కొంచెముగా జదుపుకొన్నది వివాహమాడుటకు దొరకెను. ఆ సంవత్సరము నవంబరాఖరున మా తండ్రిగారు బందరులోనే పరమపదించిరి. డిసెంబరులో కర్మలు పూర్తిచేసి క్రిష్టమసురాగానే నేను నాకుటుంబముతోగూడ బందరువిడచి నందిగామ వెళ్లితిని. 1904 వ సంవత్సరారంభమున కుటుంబముతోగూడ మద్రాసువెళ్లి లాకాలేజిలో ప్రవేశించితిని. మరల బందరు రాలేదు. నేను మద్రాసువెళ్ళినతర్వాత 1904 వ

సంవత్సరప్రారంభములో చాలవైభవముగా జగన్నాధరావుయొక్క వివాహము (వితంతూద్వాహము) జరిగెనని తెలిసికొంటిని. కాని సంఘసంస్కరణవాదులగు పెద్దలలో చాలమంది వితంతూద్వాహములో పాల్గొని చందన తాంబూలాది సత్కారములనుమాత్రమే పొందిరనియు, భోజనముచేయ లేదని తెలిసినది. వారందరు సంఘములో గొప్ప పలుకుబడికలిగినవారగుటచే బ్రాహ్మణాచారపరాయణులు వారిమీద వెట్టి చర్యతీసికొనుటకు భయపడియూరకొనిరి. ఒక వేదమైనను అధ్యయనముచేయని బ్రాహ్మణులు తమ కుమారులకు వేదాధ్యయనము చేయించక ధనాశతో నాంగ్లవిద్యను చెప్పించి, లాయర్లుగను, ప్రభుత్వోద్యోగులుగను చేసినతరువాత పూర్వాచారపరాయణుల మని హిందూసంఘములో చెప్పుకొను జన్మహక్కునే గోల్పోయినారు.

విక్టోరియారాణి మరణించినపిమ్మట ఆమెస్మారకచిహ్నమును నందిగామలో నేర్పాటుచేయుట కొక బహిరంగసభ జరుగుటయు, ఆసందర్భములో మూడువేలరూప్యములు వసూలగుటయుగూడ నయ్యెను. నాలుగువందల రూప్యములుపెట్టి నందిగామ మార్కెట్టుయొక్క మధ్యభాగములో రాణిగారి స్తంభమును గట్టించితిమి. మిగిలిన ద్రవ్యముతో 1903 వ సంవత్సరములో విక్టోరియా మెమోరియలు బాలికాపాఠశాలను నందిగామలో నెలకొల్పుటకు నిశ్చయించితిమి. దానిని సక్రమముగా నడపుట కొక కమిటీని నియమించితిమి. దానికి నందిగామతాలూకా తహశీల్దారు వాడపల్లి పట్టాభిరామయ్యపంతులుగా రధ్యక్షులుగను,నేను కార్యదర్శిగను ఎన్నుకొనబడి పనిచేసితిమి, అదివరకు మా యూరిలో స్థాపింపబడిన ప్రత్తినుండి దూదిని తయారుచేయు ఫ్యాక్టరీవారు కొంత, మునగాల, ముక్త్యాలరాజాగార్లు-కొంత, నేను కొంత సంవత్సరవిరాళము లిచ్చునట్లేర్పాటుచేసితిమి. మరికొందరి సహాయము గూడ బొందితిమి. ప్రభుత్వమువారు గ్రాంటుకూడ నిచ్చిరి. పట్టాభిరామయ్యగారు మా తాలూకానుండి బదిలీఅయినపిమ్మట చామర్తి మల్లికార్జునరావుగారి నధ్యక్షులగా నెన్నుకొంటిమి. నేను కార్యదర్శిగా పనిచేసితిని. నే

నపుడు బెజవాడలో లాయరుగానుండి నందిగామకు వచ్చుచు బోవుచు నుండెడువాడను. మఱిగ్గు రుపాధ్యాయులతో ఆ పాఠశాల సాగెను. 60,70 మంది బాలికలు చదువుకొనసాగిరి. 4 క్లాసులవరకు బెట్టబడినవి. కొన్ని కొన్ని సంవత్సరాలలో డబ్బు చాలనపుడు మునగాల రాజాగారు, నేను సగా విరాళములను హెచ్చించియుంటిమి. 1913 వర కా పాఠశాలను సాగించి, యిపుడు నా యధ్యక్షతక్రింద నందిగామలో స్థాపింపబడిన పంచమ జాతి సెకండరీ పాఠశాల కమిటీ కా బాలికాపాఠశాలను అప్పగించితిమి. దానిక్రిందనే యా బాలికాపాఠశాల కొన్ని సంవత్సరములు నడచినపిమ్మట, ఆ సెకండరీ పాఠశాలను, బాలికా పాఠశాలనుగూడ జిల్లాబోర్డున కప్పగించితిమి. అవి రెండును నేటికిని చక్కగా సాగుచున్నవి.

## (7)

1904, 1905 సంవత్సరాలలో నేను మద్రాసు లా కాలేజిలో విద్యార్థిగా నుంటిని. జార్జిటవునులో ఆర్మీనియనువీధికి అనుకొనియున్న కచ్చాలేశ్వరాగ్రహారములో నా కుటుంబముతోగూడ గాపురముంటిని. నా మిత్రుడైన దేశిరాజు పెదబాపయ్యను మద్రాసులో గలసితిని. అతడు త్వరలో రాజమహేంద్రవరమునకు వెళ్ళెను. కందుకూరి వీరేశలింగముపంతులు గారియొక్క పరిచయముగూడ నాకు మద్రాసులో గలిగెను. అదివరకు వారి పేరు వినుటయేగాని వారిని జూచియుండలేదు. వారు మద్రాసులో వరశువాకములో నుండిరి. అక్కడి కపుడపుడు పోయి దర్శనముచేసెడువాడను. అప్పటికి వారు ప్రెసిడెన్సీకాలేజి తెలుగు ప్రధానోపాధ్యాయపదవినుండి చాలించుకొనిరి. లింగిచెట్టివీధిలో నొక భవనములో వారు బ్రహ్మసమాజ ప్రార్థనలను జరుపుచుండెడువారు. నేను తరచుగా వానికి వెళ్ళుచుండెడివాడను. క్రిష్టియను కళాశాలకంటియున్న కైథనన్‌హాలు బ్రాహ్మణేతరవిద్యార్థి వసతి గృహములో నా మిత్రుడైన రామశాస్త్రిలునాయు డుండెడువాడు అపుడపుడా విద్యార్థివసతిగృహమునకు వెళ్ళుచుంటిని. దానికి వార్డెనుగానుండిన ఓ. కందస్వామిచెట్టిగారు నాకు స్నేహితులైరి. ఆయన క్రైస్తవకళాశాలలో ఆచార్యుడు, పేర్గన్న మత, సంఘసంస్కర్త. రెండుసారులు మత సాంఘికవిషయ

ములమీద న న్నుపన్యాసమిమ్మని కోరగా నేనుపన్యాసముల నిచ్చితిని. నేను చెన్నపట్టణము వెళ్ళునంతవరకు మూడుపూటలు భోజనముచేయుట అలవాటు. ఫలహారముచేయుట, కాఫీత్రాగుట యలవాటులేదు. మా తెల్ల క్రైస్తవమిషనరీ ఉపాధ్యాయులు టీపార్టీలిచ్చినపుడుమాత్రము టీగాని కాఫీగాని తీసికొనెడువాడను. చెన్నపట్టణము వెళ్ళినతరువాత ప్రతిదినము మధ్యాహ్నము లాకాలేజి కెదురుగానున్న వై. యమ్. సి. ఏ. (క్రైస్తవ యువజనసంఘపు) కాఫీహోటలునకు పోయి కేకులు, బిస్కట్లు తిని,కాఫీత్రాగెడువాడను.పిమ్మట గొప్పలాయరై దానిని వదలి పుదుచ్చేరిలోని అరవిందఘోషు ఆశ్రమములో జేరిన దొరైస్వామి అయ్యరపుడు ఎమ్. ఏ. క్లాసులో జదువుచు నాకు స్నేహితుడైనాడు. ఆయన యంతర్వర్ణభోజనముల నేర్పాటుచేసి యపుడపుడు నన్నుగూడ వానికి దీసికొనిపోయెడువాడు. గొప్ప సంస్కర్త. 1904 వ సంవత్సరములో మునగాల ఎస్టేటు పెద్దదావాలు రెంటిని కృష్ణా జిల్లాజడ్జి లా పాయింట్లమీద కొట్టివేయగా, నవతలిపార్టీవారు మద్రాసుహైకోర్టులో అప్పీలును దాఖలుచేసినారు. మునగాలరాజాగారి దివానుగానున్న కొమర్రాజు లక్ష్మణరావుగారు మునగాల రాజాగారిపక్షమున హైకోర్టులాయర్ల చేత బనిచేయించుటకుగాను 1905 సంవత్సరారంభములో కుటుంబముతో గూడ వచ్చి చెన్నపట్టణములోని కచ్చాలేశ్వరాగ్రహారములోనే నాకు మూడు నాలుగిండ్ల యవతల గాపురమేర్పరచుకొనెను. లా కళాశాలలో ఎఫ్.ఎల్.లో విద్యార్థిగా జేరెను. మా యిద్దరకు మైత్రి యెక్కువయినది. ఆయనతల్లి గంగమ్మగారు గొప్ప వేదాంతి. మా అమ్మకు, నా భార్యకు వేదాంతము చెప్పుచుండెడిది. ఆమె చివరరోజులలో కాశీలోనే నివసించి యచ్చటనే పరమపదించినది. నేను, లక్ష్మణరావుగారుకూడ యస్. శ్రీనివాసయ్యంగారి యధ్యక్షతను నడుపబడుచున్న దక్షిణహిందూదేశ సంఘసంస్కరణ సంఘములో సభ్యులుగా జేరితిమి. రాత్రులందు మాలమాదిగలకు చదువుచెప్పు పాఠశాలలో ఉపాధ్యాయులుగా పనిచేయుట కైచ్ఛికసేవకులుగా జేరితిమి.

అపుడు సంఘసంస్కరణముమీద మద్రాసులోగూడ గొప్పగొప్పసభలుజరుగు చుండెను. ఒకసారి గోపాలకృష్ణ గోఖలేగారు మద్రాసువచ్చి గొప్పఉపన్యాస మిచ్చి వెళ్ళిరి. ప్రొఫెసరు లక్ష్మీనరసు, డాక్టరు సి.బి. రామారావు. ఓ. కంద స్వామిచెట్టి సంఘసంస్కరణనాయకులు. కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు ఎమ్. ఎల్. ప్యాసయిరి. కాని అంతటితో బి.యల్. ప్యాసుకాకుండగనే విడచి పెట్టిరి. అపుడు గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు మద్రాసులో ఎమ్.ఏ. చదువుచుండిరి. గొల్లపూడి సీతారామశాస్త్రిగారు ఎఫ్.ఏ. విద్యార్థిగానుండిరి. భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు వైద్యకళాశాలలో ఎమ్.బి.సి యమ్. చదువుచుండిరి. మా రైతు నందిగామశివారు అనంతసాగరమువాస్తవ్యుడు తాటి శివలింగమను నాతనికి గాలుతీసివేయవలసిన జబ్బువచ్చుటవలన మద్రాసులోని జనరలు ఆసుపత్రికి దీసికొనివెళ్ళి పట్టాభిసీతారామయ్యగారికి జూపించగా ఆయనసహాయముతో శివలింగమునకు శస్త్రచికిత్స జరిగి, కాలుదీసివేసి కొయ్యకాలునిచ్చిరి. నేను ప్రతిదినము జనరలాసుపత్రికి శివలింగమునకు భోజనము దీసికొనివెళ్ళెడువాడను. ఆచంట లక్ష్మీపతిగారి నప్పటి కెరుగను. లక్ష్మణరావుగారు వీరేశలింగముపంతులుగారి కత్యంతభక్తులు. వ్యుఖ్యాను చరులు. వారి సంఘసంస్కరణదీక్షయు, తేలికయైన యాంధ్రభాషలో నాంధ్రప్రజలకొరకు కనేకమైన గ్రంథములను వ్రాయుటయు లక్ష్మణరావు గారికి ప్రీతికరముగా నుండెను. లక్ష్మణరావుగారిద్వారా నేనుగూడ వీరేశ లింగముపంతులుగారికి మిక్కిలి సన్నిహితుడనైతిని.

1905 వ సంవత్సరము భారతదేశచరిత్రలో జాల ముఖ్యమైనది. జాతీయతత్త్వము, దేశాభిమానము, విశేషముగా విజృంభించుచున్న బెంగాలీ జాతిని ఇండియా గవర్నరుజనరలు కర్జన్ప్రభువు రెండు భాగములుగా విచ్ఛిన్నముచేసినందున బంగాళీలలోని యన్నివర్గములవారిలోను నత్యంత క్రోధావేశములు కలిగి బెంగాలు దేశవిభజనము రద్దుపరచుకొనుటకు జరిపిన తీవ్రాందోళనములోనుండియే భారతీయజాతీయమహోద్యమ మవతరించినది. ఆ యుద్యమములో బెంగాలీ విద్యార్థులుగూడ నాయకులతో జేరిరి. స్వదేశ వ్రతమును గైకొనిరి. దేశములో వ్యాప్తిలోనున్న యాంగ్లవస్త్రములను

బహిష్కరించుటకు నిశ్చయించిరి. స్వదేశపత్రములను, స్వదేశవస్తువుల నింటింటికిని తిరిగి అమ్మిరి. భారతదేశమునకు స్వాతంత్ర్యము కావలెనను ఆవేదన పెద్దలలోను, విద్యార్థులలోగూడ ప్రబలెను. మద్రాసులోని కొందరు విద్యార్థులము బెంగాలీ విద్యార్థుల సభిసంబంధించుటకు, వారిమార్గము ననుసరించుటకు నొక గొప్ప విద్యార్థులసభచేయవలెనని తలంచితిమి. మైనంపాటి నరసింహము, రామశాస్త్రిలు నాయుడు, నేనును సంప్రదించి యట్టి సభ చేయుటకు నిశ్చయించితిమి. నాతో లక్ష్మణరావు, హరిసర్వోత్తమరావు, గొల్లపూడి సీతారామశాస్త్రి, చక్రయ్యశెట్టి మొదలైన విద్యార్థులుకూడ చేరిరి. చక్రయ్యశెట్టి నాతోకూడ బి.యల్.లో చదువుచుండెను. క్రైస్తవుడు. తరువాత కొన్నాళ్ళ కాతడు కార్మికనాయకు డయ్యెను. చెన్నపట్టణములోని విద్యార్థులందరియొక్క మహాసభను సముద్రతీరమున 1905 వ సంవత్సరము సెప్టెంబరు నెలలో జరుపుటకు ఏర్పాటుచేసికొంటిమి. కాని మాకు రాజకీయవేత్తలలో నెవరైన అధ్యక్షుడుగా నుండుటకు గావలెనని తలంచితిమి. మా సభ కధ్యక్షతవహింపవలసినదని యపుడు మద్రాసులో రాజకీయనాయకులుగానున్న బియ్యా నరసింహేశ్వరశర్మ, గోవిందరాఘవయ్యరు, డాక్టర్ నాయర్, జి. ఎ. నటేశన్‌గార్ల నడిగితిమి. కాని వారెవ్వరు నొప్పుకొనలేదు. విద్యార్థుల కీ సంగతి యెందులకని మమ్ములను హేళనచేసిరి. అందు మీద మేము స్వదేశమిత్రన్ పత్రికాసంపాదకులు రాజకీయనాయకులైన జి. సుబ్రహ్మణ్యఅయ్యరుగారివద్దకు వెళ్ళి యడుగగా వారు సంతోషముతో అంగీకరించిరి. జి. సుబ్రహ్మణ్యఅయ్యరుగారు గొప్పదేశాభిమాని. చాలసంవత్సరములాతడు హిందూపత్రికకు సంపాదకుడుగానుండెను. తనకూతురుకు వితంతూద్వాహము చేసినందువలన సంఘములోనుండి వెలివడెను. అపుడు స్వదేశమిత్రన్ అను తమిళపత్రికను నడుపుచుండెను. ఆయనవద్ద సహాయసంపాదకుడు, ముందుకాలములో తమిళజాతీయకవీశ్వరుడని ప్రఖ్యాతినొందనున్న సుబ్రహ్మణ్యభారతి పనిచేయుచుండెను. సుబ్రహ్మణ్యభారతి అత్యంతోత్సాహముగల యువకుడు. మాపక్షమున సుబ్రహ్మణ్యఅయ్యరుగారితో చెప్పి, మా మహాసభ కధ్యక్షతవహించున ట్లాయనచేత ఒప్పించెను. సముద్రతీరమున

విద్యార్థులయొక్క గొప్ప బహిరంగసభ జరిగెను. 5,6 వేలమంది విద్యార్థులా సభకు హాజరైరి. జి. సుబ్రహ్మణ్య అయ్యరుగారు అధ్యక్షతవహించిరి. సుబ్రహ్మణ్యభారతి తమిళములో నొక దేశాభిమానపూరితమైన యుద్రేకమైన గీతమును పాడెను. గొల్లపూడి సీతారామశాస్త్రి ఇంగ్లీషులో నొక దేశభక్తిని ప్రబోధించు కవితనల్లి హృద్యముగా జదివెను. నేను, దొరైసామి అయ్యంగారు, చక్కరయ్యచెట్టి, హరిసర్వోత్తమరావు, మైసంపాటి నరసింహము సభలో ప్రసంగించితిమి. మా యందర యుపన్యాసము లింగ్లీషులోనే యుండెను. బంగాళీ యువజనుల కష్టసంపదలు ననుభవించుచు తీర్మానము చేసితిమి. స్వదేశీవ్రతమును బూనితిమి. స్వదేశపత్రికలను. స్వదేశ వస్తువులను ప్రోత్సహించుటకు తీర్మానించితిమి. దేశస్వాతంత్ర్యమును వాంఛించితిమి. కర్జన్ప్రభువు గావించిన బంగాళా విభజనమును, తీవ్రముగా ఖండించితిమి. సుబ్రహ్మణ్య అయ్యరుగారి ఉపన్యాసము మిగుల గంభీరముగను, భావోద్రేకముగను వుండెను. దీపావళిపండుగ కొలదిరోజులలో వచ్చుచున్నది. కనుక దీపావళి జాతీయనిధియను పేర స్వదేశీఉద్యమమును ప్రోత్సహించుటకు, నింటింటికి దిరిగి విద్యార్థుల మొక నిధిని వసూలు చేయవలెనను తీర్మానముచేయబడెను. ఆప్రకారమే జాతీయనిధిని వసూలు చేసితిమి. నేను (మింట్ స్ట్రీట్ ను) టంకసాలవీధిని దీసికొంటిని. లక్ష్మణరావుగారు పగడాలవారివీధిని తీసికొనిరి. ఇటులనే ఇతర విద్యార్థులుగూడ నితర వీధులను బంచుకొనిరి. మహాలయామావాస్య మొదలుకొని దీపావళి వరకు స్వదేశీదీక్షను బోధించుచున్న చిన్నచిన్న కరపత్రముల నింటింటికి బంచిపెట్టి డబ్బాలలో ప్రతి గృహమునుండి ద్రవ్యమును ప్రోగుచేసితిమి. దీపావళి పండుగనాడు ఆ డబ్బాల నన్నిటిని మహాజనసభ హాలులో తెరచి వచ్చిన డబ్బును, సుబ్రహ్మణ్య అయ్యరుగారి సమక్షమున లెక్కపెట్టితిమి. సుమారు ఏబదిరెండువేల రూప్యములు వచ్చినవి. న్యాపతి సుబ్బారావు పంతులు, సయ్యద్ మహమూద్ అను నిద్దరు కాంగ్రెసు నాయకులను జాతీయ నిధికి, ధర్మకర్తలుగా నెన్నుకొంటిమి. ఆ ద్రవ్యముతో స్వదేశీ వస్తువిక్రయ శాల నొకదానిని మద్రాసులో స్థాపించితిమి. కాని యీవిధముగా దిరుగుట

వలన నాకు జ్వరము వచ్చెను. బి.యస్. పరీక్ష సమీపించిన కొలది జదువుటకు అశక్తుడనైతిని. పరీక్షలో ప్యాసగుదునో లేదో యని భయపడితిని. కాని దైవానుగ్రహమువలన ఉత్తీర్ణుడనయితిని.

నేను 1905 లోనే జాతీయకాంగ్రెసులో సభ్యునిగా జేరితిని. అప్పటినుండి నేటివరకు సట్టి సభ్యునిగానే యుంటిని. నే నప్పటినుండి దీక్షగా స్వదేశీవస్త్రములనే ధరించితిని. కాని యప్పటికి స్వదేశీవస్త్రము లనగా మన దేశీయులచే నడుపబడుచున్న మిల్లులలో తయారయ్యెడి వస్త్రములనియే యర్థము. 1921 లో మహాత్మాగాంధీగారి నాయకత్వముక్రింద జేతితో వడకిన నూలుతో చేమగ్గములమీద నేయబడిన ఖద్దరునే కాంగ్రెసువాదులు ధరింపవలెనని తీర్మానముచేయబడినది. అప్పటినుండియు నేను ఖద్దరునే ధరించుచున్నాను. 1905 వ సంవత్సరము సెప్టెంబరునెలలోనే లక్ష్మణరావు, హరిసర్వోత్తమరావు, నేను కచ్చాలేశ్వరాగ్రహారములోని మా యింటిలోనే సమావేశమై యాంధ్రులకు నవీన విజ్ఞానమును కల్గించుటకుగాను, విజ్ఞానచంద్రికా మండలిని స్థాపించుటకు నిశ్చయించినాము. దానిని గురించి రాబోవు అధ్యాయములందు జెప్పెదను. 1905 సంవత్సరాంతమున నేను మద్రాసును వదలిపెట్టి కుటుంబముతోకూడ నందిగామ వచ్చితిని. లక్ష్మణరావుగారు మద్రాసులోనే వుండెను. ఆయనయొక్క జీవితకాలములో ఎక్కువభాగము మద్రాసులోనే గడపెను. తుదకు మద్రాసులోనే 1923 లో మరణించెను. నాకు దేశస్వాతంత్ర్య మన్నిటికన్న నెక్కువ యావశ్యకమని నమ్మకము కలిగెను. కాంగ్రెసుసంస్థ యొక్కచే దేశస్వాతంత్ర్యోద్యమమును నడుపగలిగినది. కనుక కాంగ్రెసుద్వారా స్వతంత్రసంపాదనకై తీవ్రమైన కృషి నలుపవలెనను దృఢనిశ్చయముతో మద్రాసునుండి వచ్చితిని.

నేను మద్రాసులో వున్నకాలములో బళ్లారి కృష్ణమాచారిగారు, సుప్రసిద్ధాంధ్ర నాటకములను రచించుటయేగాక, బళ్లారిలో సరసవినోదినీసభను స్థాపించి తెలనాటకములను వేయుచు, చెన్నపట్టణములోకూడ కొన్నినాటకములను ప్రదర్శించెను. నేను వానికి వెళ్ళి చూచెడువాడను. సంబంధ మొదలి

యారుగారి సుగుణవిలాససభవారు కూడ చెన్నపట్టణములో మంచి నాటకములను ప్రదర్శించిరి. వానినిగూడ కొన్నిటిని జూచితిని. నేను చెన్నపట్టణములోనున్న కాలములో నాయుర్వేదాచార్య పండిత గోపాలాచారిగారితో నాకు పరిచయమయ్యెను. అపుడపుడు నాకు, నా కుటుంబమునకు కావలసిన ఆయుర్వేదౌషధములు పుచ్చుకొని స్వస్థతపొందుచుంటిని. లక్ష్మణరావు గారితో గలసి యపుడపుడు హైకోర్టు జడ్జి శంకరన్‌నాయర్‌గారిని దర్శించితిని. ఆయన అదివరకు మునగాలరాజాగారి లాయరుగానుండి అపుడు హైకోర్టున్యాయాధిపతిగా నుండెను. ఆయనకూడ గొప్ప సంస్కర్త. ఆయన యొక్క, యస్. శ్రీనివాసయ్యంగారియొక్క పరిచయము నాకు బాగుగా కల్గినది. అప్పటికి మద్రాసులో ఆంధ్రలాయర్లు అయిదారుగురుకంటె యెక్కువగా లేరు. వారుకూడ స్వతంత్రముగా వృత్తిని సాగించెడువారు గాక, అరవ లాయర్లక్రింద జూనియర్లుగా పనిచేయుచుండిరి. సుప్రసిద్ధ తమిళలాయర్ల ప్రభ ముఖ్యముగా ఆంధ్రదేశములోని జమీందార్లమీద యెక్కువగనుండెను. అప్పటి ఆంధ్రలాయర్లలో ఒకరైన వేపా రామేశముగారు పిమ్మట కొలది సంవత్సరములకు హైకోర్టున్యాయాధిపతియైరి. ఆంధ్రులలో ప్రథమ హైకోర్టు జడ్జి వారే. హైకోర్టుజడ్జిగా వీరు సమర్థులని పేరెన్నికగాంచిరి.

# 3 వందేమాతరం - హోంరూలు - గ్రంథాలయోద్యమము

నూజవీడు సభలు - జపానువిజయము-మన దేశములో ఉత్సాహము - నేను బెజవాడలో లాయరుగ చేరితిని - డివిజనలు కాంగ్రెసుకమిటీ - బారిస్టరు టంగుటూరి ప్రకాశం గారు - పూర్వాచారపరాయణులతో పోట్లాటలు - పంచముల పాఠశాల స్థాపన - వి. వి. గిరి - 1905 కాంగ్రెసు - జాతీయవాదులు - మితవాదులు - 1906 కలకత్తా కాంగ్రెసు స్వరాజ్యతీర్మానము - వందేమాతరం - బిపిన్‌చంద్రపాల్ ఆంధ్రదేశసంచారము - కాకినాడ రైటింగు కేసులు - నంది గామసభలు - సంఘసంస్కరణ కల్లోలములు - భోగపుకులపు సంస్కరణము - తెనుగు స్వరాజ్యపత్రిక - సర్కార్ అను అరాజకవాది ఆగమనము - కుదీరాంబోసు - అరవింద ఘోషు - హరిసర్వోత్తమరావు కేసు - లోకమాన్య తిలకు కేసు - కతేసరంబాలంబు - కోటప్పకొండ అల్లరులు-మద్రాసు కాంగ్రెసు - ఢిల్లీదర్బారు - బంగాళావిభజన రద్దు - ప్రథమ భాషాప్రయుక్తరాష్ట్రస్థాపనము - హోంరూలుఉద్యమము - అనిబిసెంటమ్మ ప్రభృతుల నిర్బంధము-శాసనోల్లంఘనప్రయత్నము - మాంటగ్యూ - బొంబాయి అఖిలభారత కాంగ్రెసు కమిటీ - రాష్ట్రములలో ద్వంద్వప్రభుత్వము-రౌలటుకమిటీ - బొంబాయి ప్రత్యేకకాంగ్రెసు - ఢిల్లీకాంగ్రెసు - రామ

మోహన గ్రంథాలయము – ఆంధ్రగ్రంథాలయ[illegible]సభ – మహాత్ముని ప్రసక్తి జన్మదిన[illegible] – [illegible] – కృష్ణవరదబాఘిసేటలకు సహాయము.

(1)

1906 వ సంవత్సరము వేసంగిలో కృష్ణాజిల్లా కాంగ్రెసుమహాసభ నూజవీడులో జరిగినది. అప్పటికింకను నూతనముగా ఏర్పడిన గుంటూరు జిల్లా కాంగ్రెసునాయకులు విడిగా గుంటూరుజిల్లా కాంగ్రెసుమహాసభను స్థాపించుకొనలేదు. తమపరి మూడు సంవత్సరాలవరకు వారు నూతో ఎవరో లేదు. బందరునుంచియు గుంటూరునుంచియు కాంగ్రెసునాయకులందరు నూజవీడు మహాసభకు వచ్చిరి. మూడపాటి వెంకటేశ్వరరావు పంతులుగారు ఆహ్వానసంఘాధ్యక్షులుగా నుండిరి. శ్రీ బయ్యా నరసింహేశ్వరశర్మగారు మహాసభకు అధ్యక్షతవహించిరి. అప్పటికి వారు చెన్నపట్టణములో లాయరుగానుండి ఆంధ్ర కాంగ్రెసువాదులలో ప్రముఖులుగా నుండిరి. బంగాళా విభజనమును ఖండించుచు స్వదేశీయుద్యమమును ప్రోత్సహించుచు తీర్మానములు చేయబడెను. రాజకీయమహాసభలు కాగానే సంఘసంస్కరణ మహాసభకూడ జరిగెను. వట్టి తీర్మానములతోనే అది ముగిసెను. మరుసటి సంవత్సరము జరిగే కృష్ణాజిల్లా రాజకీయ సంఘసంస్కరణ మహాసభలు నా స్వగ్రామమైన నందిగామలో జరుగవలెనని నే నాహ్వానించితిని. నా ఆహ్వానమంగీకరించబడెను. వెంకటేశ్వరరావుగారు మహాసభలు ముగియగానే వచ్చిన నాయకులందరిని ఉయ్యూరు జమీందారు రాజా రంగయ్యప్పారావు బహద్దరుగారి కోటకు తీసుకొనిపోయి వారికి పరిచయముచేయించెను. దీనికి పిమ్మటనే నేను బెజవాడలో లాయరుగా ప్రవేశించినది. అదివరకే మదరాసునుంచివచ్చి నందిగామలోను గుంటూరులోను ఉంటిని. నేను బి.యల్. ప్యాసయినట్లుమాత్రము తెలిసినది.

ఇరువదవ శతాబ్దముయొక్క మానవచరిత్ర, ఆశియాఖండములోని ప్రతిదేశముకూడ యూరపియను సామ్రాజ్యములమీద తిరుగుబాటుగావించి

స్వతంత్రమును పొందుటయేయని చరిత్రకారులు వ్రాసియున్నారు. అటుల యూరపులో గొప్ప సామ్రాజ్యమైన రష్యాతో యుద్ధముచేసి ఆశియాఖండ దేశమైన జపాను 1904-05 సంవత్సరములో జయముపొంది ప్రథమమున స్వతంత్రమును సంపాదించుకున్నది. నవీనపద్ధతులమీద అతి త్వరితముగ వృద్ధిచెందసాగినది. దీనితో ఇండియాలోను ఇతర ముఖ్యమైన ఆశియా దేశములలోను గొప్ప యుత్సాహము, దేశాభిమానము, తాముకూడ స్వతంత్రమును పొందగలుగుదుమను ఆత్మవిశ్వాసము పొంగి పొరలినవి. ఆంధ్రదేశములోకూడ నూతన రాజకీయచైతన్యము కలిగినది. ఆదిపూడి సోమనాథరావుగారు జపానుచరిత్రను తెనుగులో వ్రాసి మునగాలరాజాగారి కంకితమిచ్చి వారి ధనసహాయముతో ముద్రింపించి ప్రచురించెను. మునగాల రాజాగారు తమ ప్రథమకుమారునికి జపాను సైన్యాధిపతియగు 'టోగో' పేరును, ద్వితీయకుమారునికి జపాను నావికాధిపతియగు 'నోగి' పేరును పెట్టిరి. వారికి రామకృష్ణారెడ్డి, గోపాలకృష్ణారెడ్డి అను పేర్లున్నను టోగో, నోగి అనియే నేటికిని అందరును పిలచుచున్నారు. రామకృష్ణారెడ్డిగారు యం.ఏ. ప్యాసుఅయినారు.గోపాలకృష్ణారెడ్డిగారు ఇంగ్లాండు పోయి చదువు కొని బి.యస్.సి.లో కృతార్థులై వచ్చినారు. బందరు కాపురస్థులగు శ్రీరాం వీరబ్రహ్మంగారను సుప్రసిద్ధకవి "జపానీయము"అను చక్కని నాటకమును వ్రాసి ప్రచురించినాడు.

నేను 1906వ సంవత్సరం జూన్ నెలలో బెజవాడలో లాయరుగా ప్రవేశించితిని. అప్పటినుంచి జాతీయజండాలలో స్వదేశీకీర్తనలతో ఊరేగింపులు, బహిరంగసభలు ప్రారంభించితిమి. పెద్దిభొట్ల వీరయ్య, సూరి వెంకట నరసింహశాస్త్రి, చింతక్రింద నారాయణమూర్తి, దాసు మధుసూధనరావు మొదలగు లాయర్లు, విద్యార్థులు మాతో చేరిరి. పింగళి లక్ష్మీనారాయణ బెజవాడకు కాపురమునకు వచ్చి మునగాలరాజాగారి సహాయముచే నొక నూతనరకపు చేమగ్గములకార్ఖానాను తెరచెను. ఆ రకపు చేమగ్గములు త్వరలో కృష్ణాజిల్లా అంతట వ్యాపించెను. మా అయిదుతాలూకాలకు సంబంధించిన డివిజనలుకాంగ్రెసుకమిటీని బెజవాడలో మేమందరము కలిసి స్థాపించితిమి. దానికి పెద్దిభొట్ల వీరయ్యగా రధ్యక్షులు; నేను కార్యదర్శిని. బజారు

లలో బహిరంగసభలుచేయుచు స్వదేశాభిమానమును బోధించుచుంటిమి. కాంగ్రెసును గురించి చెప్పుచుంటిమి. ప్రజలు పోలీసులభయముచేత చాలా మంది వచ్చేవారుకారు. చుట్టుపట్టులగ్రామములకు కూడ పోయి బహిరంగ సభలు జరిపేవారము. కాంగ్రెసులో సభ్యులను చేర్చేవారము. సంవత్స రమునకు ఒకరూపాయి చందా యని నిర్ణయించితిమి. అపుడు కృష్ణాజిల్లా కాంగ్రెసుకమిటీ బందరులోను, మదరాసు రాష్ట్రకాంగ్రెసుకమిటీ మదరాసు లోను ఉండెను.

ఇటుల జరుగుచుండగా 1906వ సంవత్సరములో బ్రహ్మసమాజబోధ కులగు బాబు హేమచంద్ర సర్కారుగారు కలకత్తానుండి బెజవాడవచ్చి మా యింటిలో నా అతిథిగానుండి, బ్రహ్మసమాజముమీద రెండు ఉపన్యాసముల నిచ్చి వెళ్ళిపోయిరి. అదివరకే రాయసం వెంకటశివుడుగారు బెజవాడలో క్రైస్తవమిషను హైస్కూలులో ఉపాధ్యాయుడుగానున్నకాలములో ఒక ప్రార్థనాసమాజమును స్థాపించియుండిరి. నేను బెజవాడకు వెళ్ళునప్పటికి పాటిబండ సుబ్రహ్మణ్యం, శంకర వెంకట్రామయ్యగార్లు దానికి ప్రధాన సభ్యులుగా నుండిరి. అటుపిమ్మట సుబ్రహ్మణ్యంగారు అయిదువందల రూప్యములనిచ్చి రామమోహనలైబ్రరీయొక్క ఆవరణలో కొంత స్థల మును సంపాదించి ఆ ప్రార్థనాసమాజమున కొక మందిరమును కట్టించిరి. దాని ధర్మకర్తలలో నిప్పటికిని నే నొకడను. పాటిబండ సుబ్రహ్మణ్యం గారు బెజవాడ సబు మేజస్ట్రీటుకోర్టులో గుమాస్తాగా పనిచేయుచుండెను. చేయుచున్నది చిన్నయుద్యోగమేయైనను దైవభక్తివల్లను సత్ప్రవర్తన వల్లను ప్రజలమన్ననలను పొందినవాడు. గుంటూరు వెళ్ళి ఉన్నవ లక్ష్మి నారాయణగారు జరుపుచున్న వితంతూద్వాహములలో పాల్గొని భోజనము చేయుచువచ్చినందున నాలుగుసంవత్సరాలనుండి బెజవాడ పూర్వాచారపరా యణులచేత వెలివేయబడియుండెను. 1906 వ సంవత్సరములోనే శ్రీ టంగు టూరి ప్రకాశంపంతులుగారు ఇంగ్లాండునుంచి బారిష్టరుగా నుత్తీర్ణులై వచ్చి మద్రాసులో లాయరుగా పనిచేయుటకు నివాసమేర్పరచుకొని ఆంధ్రదేశము లోని కొన్నిపట్టణములను దర్శించుచు బెజవాడ వచ్చి మా యింటిలోనే దిగిరి. అప్పటికే దాసు మాధవరావుగారు ప్రథమభార్య మరణించినందున

బర్మాలోని యొక విజస్త్రీలయిన బ్రాహ్మణయువతిని పెండ్లియాడిరి. ఆయన బెజవాడవచ్చి తనతమ్ముడగు దాసు మధుసూదనరావుగారింట్లో మకాంచేసెను. ఒకరోజున పెద్దిభొట్ల వీరయ్యగారింట్లోను, ఒకరోజున మాయింట్లోను, ఒకరోజున దాసు మధుసూదనరావుగారింట్లోను ప్రకాశంపంతులుగారికి, దాసు మాధవరావుగారికి విందులు చేసితిమి. వాటిలో ప్రతిదానికి పాటిబండ సుబ్రహ్మణ్యంగారినికూడ పిలచితిమి. వారు పెద్దిభొట్ల వీరయ్యగారిబంధువులు. లాయర్లలో చిన్నకోట కోదండరామయ్యగారుకూడ మాతో భుజించిరి. పింగళి లక్ష్మీనారాయణగారుకూడ మా విందులకు వచ్చెను. పూర్వాచారపరాయణులను లెక్కచేయక సంఘసంస్కరణమును సాగించుటకు నిశ్చయించుకొంటిమి. సూరి వెంకట నరసింహశాస్త్రిగారు మాతో సానుభూతి కలవారైనను మా విందులలో పాల్గొనుటకు ధైర్యముచాలక రాలేదు. మేమెవరిమైనను మామూలుకాలములో భోజనమునకు పిలచినచో వచ్చి మా యిండ్లలో భోజనముచేసేవాడు. బెజవాడకోర్టులు పూర్వాచారపరాయణులైన ప్లీడర్లతో నిండియుండెను. వారిలో తాడంకి వెంకటనర్సయ్య, పాటిబండ వెంకటరమణయ్య, తుమ్మలపల్లి వెంకటరమణయ్య, శ్రీపతి గోపయ్య, అబ్బూరి శ్రీరంగశాయి, ముద్దా సుబ్బయ్యగార్లు ముఖ్యులు. తాడంకి వెంకట నర్సయ్యగారు మ్యునిసిపలు ఛైర్మనుగాకూడ నుండిరి. తాడంకి వెంకట నర్సయ్య, తుర్లపాటి శేషాచలపతిరావుగార్లు దివ్యజ్ఞానసమాజనాయకులు. అప్పటికి దివ్యజ్ఞానసంఘము సంఘసంస్కరణకు కాంగ్రెసుకుకూడ చాల వ్యతిరేకముగా నుండెను. నేను, పింగళి లక్ష్మీనారాయణగారు తరచుగా మాల మాదిగగూడెములకు వెళ్ళి వారిండ్లలోకూర్చొని కలసిమెలసి వచ్చేవాళ్లము కూడాను. నా స్వంతఖర్చుమీద ఒక పాఠశాలను మాలమాదిగపిల్లలకొరకు స్థాపించితిని. ఇదంతయుకూడ బెజవాడ పూర్వాచారపరాయణులకు చాల అయిష్టముగనుండి వారందరొక సభచేసి పెద్దిభొట్ల వీరయ్య, దాసు మధుసూదనరావు, చిన్నకోట కోదండరామయ్య, పింగళి లక్ష్మీనారాయణ, పాటిబండ సుబ్రహ్మణ్యంగార్లను, నన్ను వెలివేసినట్లు తీర్మానించిరి. ఇంతలో పింగళి లక్ష్మీనారాయణగారితల్లి తద్దినము వచ్చెను. తద్దినము పెట్టించుటకు వచ్చెడి బ్రాహ్మణులను రాకుండా దివ్యజ్ఞానసమాజనాయకులైన వెంకట

నర్సయ్య, శేషాచలపతిరావుగార్లు వెదిరించి పంపివేసిరి. బ్రాహ్మణులు చొరవ నందున లక్ష్మీనారాయణగారు పీటలను భోక్తలుగా చేసి వడ్డించిపెట్టెను. పూర్వాచారపరాయణులు వేసినవెలిని మేము లక్ష్యపెట్టలేదు. అది మమ్ములను బాధించలేదు. మేము నలుగురము పలుకుబడిపెరుగుచున్న లాయర్లము. మా బంధువులు, స్నేహితులు మా యిండ్లకు ధారాళముగా వచ్చి భుజించు చుండిరి. మేము వారియిండ్లకు పోయి భోజనముచేయుచుంటిమి. బెజవాడ బస్తీలో మా యిండ్లలోని కార్యములు, వ్రతములు చేయించుటకు తగినంత మంది బ్రాహ్మణులు దొరికిరి. కొంచెం డబ్బు ఎక్కువగానిచ్చి తెచ్చుకుం టిమి. కామరాజు లక్ష్మణరావుగారు అప్పుడప్పుడు మద్రాసునుంచి బెజవాడ వచ్చి మా యింటిలో నుండిరి. పూర్వాచారపరాయణ నాయకులు సంఘ సంస్కరణమును ఖండించుచు సభలుచేయగా సంఘసంస్కరణపక్షమున మేము సభలు జరిపితిమి. లక్ష్మణరావుగారుకూడ మా సభలలో పాల్గొని మా పక్షమున యుపన్యసించిరి. క్రొత్తగాచేరే లాయర్లు, ఉపాధ్యాయులు, విద్యా ర్థులు మా సభలకు హాజరగుచుండిరి. మేము పూర్వాచారపరాయణులగు లాయర్లను, నాయకులను వెలివేసితిమని ప్రకటించితిమి. ఇటులనే ప్రకాశం పంతులుగారు దర్శించిన రాజమహేంద్రవరములోను బరంపురములోనుకూడ ఆయనను సత్కరించిన సంఘసంస్కరణవాదులకును పూర్వాచారపరాయణు లకును తగవులేర్పడి కొలదికాలములో సంస్కరణవాదులే జయమొందిరి. బరంపురములో సంస్కరణవాదులకు వరహాగిరి జోగయ్యపంతులుగారు నాయకులుగనుండిరి. వారికుమారుడైన వి.వి. గిరి గారిని ఇంగ్లాండుకుపంపి బారిష్టరు ప్యాసుచేయించిరి. గిరిగారు ఆంధ్రదేశములోని రాజకీయ,సాంఘిక, కార్మిక ఉద్యమములకు నాయకత్వమువహించి, పెక్కుసార్లు కారాగారములకు పోయి, మంత్రిపదవుల నలంకరించి యిపుడు ఉత్తరప్రదేశ్‌లో గవర్నరుగా ఉన్నారు.

(2)

1905వ సంవత్సరము డిశంబరునెలలో కాశీనగరమునందు భారత దేశీయ కాంగ్రెసుమహాసభ జరిగినది. గోపాలకృష్ణగోఖలే మహాశయులు

అధ్యక్షతవహించిరి. బంగాళావిభజనము తీవ్రముగా ఖండించబడెను. బంగాళ రాష్ట్రమును తూర్పుబంగాళమని పశ్చిమబంగాళమని విభజించుటయేగాక తూర్పుబంగాళములో అస్సామును, పశ్చిమబంగాళములో బీహారును చేర్చిరి. దీనిని కాంగ్రెసు ఖండించినది. దానిలో రెండు ప్రధానాంశము లిమిడి యున్నవి. ఒకటి. ఒకేభాష మాటలాడువారిని రెండురాష్ట్రములుగా విభజించ కూడదు. అనగా ఒకేభాషకు ఒకేరాష్ట్ర ముండవలెను. రెండవది వివిధ భాషలను మాటలాడువారిని ఒకేరాష్ట్రముక్రింద చేర్చకూడదు. ఈ రెండు సిద్ధాంతములు భాషాప్రయుక్తరాష్ట్రనిర్మాణమునకు మూల సూత్రములు. బనారసు కాంగ్రెసుమహాసభ. తర్వాత కాంగ్రెసుమహాసభలు ఈ సూత్రములను పదేపదే అంగీకరించుచు బంగాళారాష్ట్రవిభజనను తీవ్రముగా ఖండించినవి. బ్రిటిష్ప్రభుత్వము బంగాళావిభజనకు వ్యతిరేకముగా చెలరేగిన ఆందోళనమును అణచుటకే ప్రయత్నించినది. ఢక్కానవాబు సలిముల్లాను తమ పక్షమున చేర్చుకొని బంగాళావిభజనము ముసల్మానులకు లాభదాయకమని ఆయనచేత ప్రకటింపచేసిరి. ఆయన సహాయమున హిందూ ముస్లిం కలహములను లేవదీసిరి.

బ్రిటిష్ప్రభుత్వమును ఎంత ప్రార్థించినను, తీర్మానములుచేసినను రాయబారములు పోయినను, ఖండనతీర్మానములుచేసినను, రవ్వంతయైన దేశాభివృద్ధికి తోడ్పడదనియు విదేశప్రభుత్వము దేశమును దోచుకొనుటకు వచ్చినదేగాని దేశమును బాగుచేయుటకు రాలేదనియు విదేశప్రభుత్వమును పారద్రోలి స్వరాజ్యమును స్థాపించుకొనుటకే దేశముయొక్క సర్వశక్తులను వినియోగించవలెననియు గాఢమైనభావము ముఖ్యముగా యువజనులందరిలోను దేశములోని అన్నిభాగములలోను వ్యాపించినది. కాంగ్రెసులో నిట్టి తీర్మానముచేయించి కాంగ్రెసుకు నూతనస్వరూపమివ్వవలెనని గట్టికోరిక ప్రబలెను. దీనికి బాలగంగాధరతిలక్, లాలా లజపతిరాయి, బిపిన్ చంద్ర పాల్, అరవిందఘోషు మొదలగువారు నాయకత్వమును వహించిరి. వీరికి జాతీయవాదులనిపేరు. బెజవాడలోని మేమందరము ఈ పక్షమునకు చెందినవారమే. 1906 వ సంవత్సరము డిశంబరులో కాంగ్రెసుమహాసభ కలకత్తాలో జరుగనున్నది. ఆ మహాసభలో స్వరాజ్యతీర్మానము చేయించవలెనని జాతీయ

వాదు లాందోళనచేయసాగిరి. దీనికి పెద్దలైన సురేంద్రనాథబెనర్జీ, ఫిరోజిషా మెహతా, గోపాలకృష్ణ గోఖ్లే ,మదనమోహనమాలవ్యా, న్యాపతి సుబ్బారావు, మోచర్ల రామచంద్రరావుగార్లు మొదలగువారు వ్యతిరేకులై స్వరాజ్య తీర్మానము చేయుటవల్ల బ్రిటిషుప్రభుత్వమున కాగ్రహమువచ్చి శాసనవిధానములను అమలుజరుపుననియు, బ్రిటిషువారిని నమ్ముకొని వారిసాయమున ప్రజారాజ్యహక్కులను సంపాదించుటయే యుక్తమనియు వాదింపసాగిరి. వీరికి మితవాదబృందమని పేరు. కాంగ్రెసులో రెండు చీలికలేర్పడి కాంగ్రెసు విచ్ఛిన్నమగునటుల కనపడినది. కలకత్తా కాంగ్రెసుకు ఎవరిని అధ్యక్షులుగా చేయవలెననుసమస్య ఉదయించెను. అందరు కాంగ్రెసునాయకులకన్న వృద్ధులు కాంగ్రెసుమహాసభస్థాపకులలో నొకరునగు దాదాభాయి నౌరోజీ గారిని అందరు కలసి ఏకగ్రీవముగా ఎన్నుకొనిరి.లండనునుంచి కలకత్తాకు వచ్చి కాంగ్రెసుకు అధ్యక్షతవహించవలెనని కోరిరి. ఆయన వచ్చెను. ‘దాదాభాయి మాకు స్వరాజ్యమిమ్ము’ అని వ్రాయబడిన పెద్దపెద్ద అట్టలను కలకత్తానగరమందంతటను ప్రతిగోడమీద జాతీయవాదులు అంటించిరి. తుదకు దాదాభాయినౌరోజీగారు కాంగ్రెసు అధ్యక్షపీఠమునుండి స్వరాజ్యము కొరకు గొప్ప ఆందోళనచేసి స్వరాజ్యమును సంపాదించవలెననుఆదేశమునే యిచ్చెను.కాంగ్రెసుమహాసభలో స్వరాజ్యసంపాదనమే కాంగ్రెసుయొక్క ఉద్దేశ్యమనియు, జాతీయవిద్య, స్వదేశీ,బ్రిటిషువస్తు బహిష్కారము స్వరాజ్య సంపాదనకు సాధనములనియు తీర్మానములు చేయబడెను. ఆత్మగౌరవమును ప్రతిష్ఠించి, ఆత్మవిశ్వాసమును పెంపొందచేసికొని స్వయంసహాయంతో భారతజాతి స్వరాజ్యసంపాదనకుపూనుకోవలెనని నిశ్చయించబడెను.మునగాల రాజాగారు, లక్ష్మణరావు,హరిసర్వోత్తమరావుగార్లు కలకత్తా కాంగ్రెసుకు వెళ్ళి జాతీయవాదు లేర్పరచిన విడిదిలోనే దిగిరి. ఇది భారతజాతియొక్కచరిత్రలో మహత్తరమైన ఘట్టము.

ఆకాలము ఆశియాఖండమంతలో దేశస్వతంత్రపోరాటములు ప్రారంభమైనకాలము. 1904వ సంవత్సరమున చైనాలో డాక్టరు సన్యటు సేను స్వతంత్రపోరాటవిప్లవమును ప్రారంభించెను. 1906 వ సంవత్సరమున పర్షియా జాతీయనాయకులు తమ ‘షా’ను ఎదిరించి ప్రజాప్రతినిధిసభను

(మజ్లిసును) స్థాపించుకొనిరి. బ్రిటిషువారిచే 1882 లో ఆక్రమింపబడిన ఈజిప్టుదేశములోకూడ జాఘ్లుల్, ముస్తఫా కమాల్ మొదలగు దేశాభిమానులు తమదేశమును బ్రిటనునుండి స్వతంత్రముగా చేసికొనవలెనను యుద్యమమును సాగించుచుండిరి. తురుష్కదేశములో అదివరకు కొంతకాలమునుండి జాతీయ స్వతంత్రసంపాదనకొరకు తురుష్కయౌవనకక్షి (Young Turkish Party) యెప్పటి నిరంకుశ సుల్తాను పెట్టిన అనేక నిర్బంధ విధానములకు లోనై 1908 లో గొప్ప తిరుగుబాటును లేవదీసి సుల్తాను అబ్దుల్ హమీదును తొలగించి ప్రజాప్రతినిధిసభను స్థాపించుకొనిరి. ఇటుల ఆశియాఖండమంతటిలోను ప్రచండ స్వతంత్రవాతావరణము చెలరేగెను.

కలకత్తాకాంగ్రెసులో స్వరాజ్యతీర్మానమును ఆమోదించుటతోపాటు వందేమాతరం అను గీతమును జాతీయకీర్తనగా గానముచేసిరి. తూర్పు ఇండియాకంపెనీవారిమీద బంగాళములోని యొక సన్యాసిదళము తిరుగుబాటు గావించిన కథను సుప్రసిద్ధ బంగాళీ నవలారచనాధురంధరుడగు బంకించంద్ర ఛటర్జీగారు ఆనందమఠమను నవలవ్రాసి దానిలో భారతదేశమును మాతగా (మాతృదేశముగా) స్తుతముగావించిన దేశాభిమానము నుప్పొంగింపచేయు కీర్తనను వ్రాసినాడు. ఆ కీర్తనను కలకత్తాకాంగ్రెసు జరిగినప్పటినుండియు భారతజాతికి కుల ప్రాంతీయ భేదములు లేక జాతీయకీర్తనగా ప్రతిబహిరంగ సభాప్రారంభమునను కాంగ్రెసువాదులు పాడుచున్నారు. ఆంధ్రదేశములో జరిగిన రాజకీయసభలన్నిటిలో ఈ కీర్తన పాడబడెను. కవుతా శ్రీరామ శాస్త్రిగారీ కీర్తనను మనోహరముగ పాడుచుండిరి. 'వందేమాతరం' అను నినాదము దేశములోని విద్యార్థులలోను, యువజనులలోను, సామాన్యజనుల లోను కార్చిచ్చువలె వ్యాపించెను. దేశస్వతంత్రముకొరకు ప్రారంభింపబడిన ఆ మహోద్యమమునకు వందేమాతరోద్యమమని పేరువచ్చెను.

కలకత్తాకాంగ్రెసులో తీర్మానింపబడిన 'స్వరాజ్య' మనగ బ్రిటిషు వారితో నెట్టి సంబంధములేని-అమెరికాసంపాదించుకున్నదానివంటి సంపూర్ణ స్వతంత్రమా, లేక కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికాలు అనుభవించుచున్న డొమినియన్ ప్రతిపత్తియా, అనగా బ్రిటిషుచక్రవర్తిక్రింద సంపూర్ణ స్వపరిపాలనమా? యను మీమాంస కాంగ్రెసునాయకులలో బయలుదేరినది.

స్వరాజ్యమనగా బ్రిటిషుప్రభుత్వమునకుగాని, చక్రవర్తికిగాని యెట్టి సంబంధములేని సంపూర్ణస్వతంత్రమేననియు, దానిని సాధించుటకు భారతజాతి తీవ్రకృషి జరుపవలెననియు ఉపన్యాసముల నిచ్చుచు 1907 వ సంవత్సరము ఫిబ్రవరినెలలో బిపిన్‌చంద్రపాల్ దేశములోని ప్రధానపట్టణములను సందర్శించెను. ఆయన కాకినాడలో గంభీరోపన్యాసమిచ్చి యువజనులలో భావోద్రేకము కలిగించి రాజమహేంద్రవరము వచ్చెను. రాజమహేంద్రవరములోని యుపన్యాసఫలితముగా అచటి ఆర్ట్సుకళాశాలలోని గాడిచర్ల రామచంద్రరావు మొదలగు విద్యార్థులు. ఇటులనే ట్రైనింగు కళాశాలలోని గాడిచర్ల హరిసర్వోత్తమరావు మొదలైన విద్యార్థులు వందేమాతరం అను అక్షరములు వ్రాయబడిన బిళ్ళలు ధరించి క్లాసులలోనికి రాగా ప్రధానాచార్యులగు మార్కు హంటరు వారినందరిని ఆ బిళ్ళలు తీసివేయుమని కోరెను. వారు తీసివేయుటకు నిరాకరించినందున ఆ విద్యార్థులనందరిని కళాశాల నుండి వెడలగొట్టెను. గాడిచర్ల హరిసర్వోత్తమరావు అటుల వెళ్ళగొట్టబడినవాడై బిపిన్‌చంద్రపాల్‌గారితోకూడ బెజవాడవచ్చెను. బిపిన్‌చంద్రపాల్‌గారికి బెజవాడలో సన్మానముచేయుటకు మునగాలరాజాగారు అధ్యక్షులుగను, నేను కార్యదర్శిగను ఒక ఆహ్వానసంఘముగానేర్పడితిమి. బెజవాడలో ఏలూరు రోడ్డుమీద నున్న చల్లపల్లిరాజాగారిబంగళాలో మునగాలరాజాగారపుడు తాత్కాలికనివాస మేర్పరచుకొనిరి. మునగాలరాజాగారు రాజమహేంద్రవరమునకు వెళ్ళి బిపిన్‌చంద్రపాల్‌గారిని బెజవాడకు వెంటబెట్టుకొనివచ్చి తమ బసలోనే ఆతిథ్యమిచ్చిరి. వారితో కలసి 'స్వదేశమిత్రన్' ఉపసంపాదకులగు సుబ్రహ్మణ్యభారతిగారు కూడ రాజమహేంద్రవరమునుండి వచ్చిరి. వారిని చెన్నపట్టణము తీసుకొనిపోవుటకు ఆయన వచ్చిరి. బెజవాడలోని వెంకటేశ్వరరావు పురమందిరము ఆవరణలో బిపిన్‌చంద్రపాలుగారు రెండు గంభీరోపన్యాసములనిచ్చి బందరు వెళ్ళిరి. హరిసర్వోత్తమరావుగారు ట్రైనింగు కళాశాలనుంచి వెళ్ళగొట్టబడగానే బెజవాడవచ్చి మా కాంగ్రెసు సంఘసంస్కరణబృందములో చేరెను. కాని బందరులో స్థాపనాయత్నములు జరుగుచున్న జాతీయకళాశాలకు ద్రవ్యము వసూలుచేయుచుండెను. బందరులో డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్య, ముట్నూరి కృష్ణారావు,

కోపల్లె హనుమంతరావుగార్లు బిపిన్‌చంద్రపాలుగారి కాతిథ్యమిచ్చి బహిరంగ సభను గావింపజేసిరి. అక్కడనుంచి బిపిన్‌చంద్రపాలుగారు మద్రాసు వెళ్ళి అచటి సముద్రతీరమున గొప్పఉపన్యాసములనిచ్చి కలకత్తాకు వెళ్లిపోయిరి. బిపిన్‌చంద్రపాలుగారిని రాజద్రోహనేరముక్రింద శిక్షించుటకు మద్రాసుప్రభుత్వమువారు అప్పటి అడ్వొకేటు జనరలగు భాష్యంఅయ్యంగారి అభిప్రాయమడుగగా ఉపన్యాసము ఉద్రేకపూరితముగనున్నవి.కాని రాజద్రోహనేరము లేదని అభిప్రాయమునిచ్చెను. ఆయనయుపన్యాసముల కధ్యక్షతవహించుట కప్పటి మద్రాసులోని కాంగ్రెసునాయకులు ముందుకు రాలేదు. కాని మద్రాసు బీచిలో జరిగిన మొదటిసభకు బారిష్టరు టంగుటూరు ప్రకాశం గారు ధైర్యముతో అధ్యక్షతవహించిరి.

బిపిన్‌చంద్రపాలుగారి ఆంధ్రదేశసంచారము ముగిసినపిమ్మట కాకినాడలో నౌకాసాయంత్రము జిల్లా వైద్యాధికారిగానున్న డాక్టరు కెంపు అను ఆంగ్లేయుడు వచ్చుచుండగా కోపల్లె కృష్ణారావు అను విద్యార్థి "వందేమాతరం, వందేమాతరం" అని కేకలువేసెను. ఆ యాంగ్లేయుడు కోపోద్దీపితుడై ఆ విద్యార్థిని పట్టుకొని కొరడాతో బాగుగా దెబ్బలుకొట్టెను. కాకినాడ పురజనుల కాగ్రహముకలిగి కొందరు గుంపులుగాచేరి కెంపుగారిని ముట్టడించుటకు బయలుదేరిరి. ఆయన యూరపియనుక్లబ్బులో దాగుకొనెను. ఆగ్రహపూరితులైన జనులు ఆ క్లబ్బుమీదపడి కొంత సామానును పాడుచేసి వెళ్ళిపోయిరి. యూరపియనుసంఘమునకు జరిగిన యీ అవమానమును ఆంగ్లేయప్రభుత్వము భరింపలేకపోయెను. వెంటనే ఇరువదిమందిని అరెస్టుచేసి, క్రిమినల్‌కేసు దాఖలుచేసి యూరపియను మేజిస్ట్రేటైన మెక్ఫర్లెండు గారివద్ద విచారణకుపెట్టగా వారిలో అరిపిరాల లక్ష్మీనరసింహారావు బి.ఏ. గారికి, చినపేరయ్య. పెదపేరయ్యగార్లకు రెండేండ్లు కఠినశైదును, జుల్మానాను, దారు వెంకటరమణయ్య. రామన్న. అచ్చన్న. రత్తయ్య మొదలగు వారికి పదునెనిమిదినెలల కఠినవరకము, జుల్మానా విధించబడెను. కాకినాడ పురజనులఖర్చుమీద కొంతకాలము శిక్షార్థపు పోలీసుదళము యూరపియను క్లబ్బువద్ద నుంచబడెను. క్లబ్బుసామానుల నష్టముక్రింద రు. 398-13-8 లు కూడ పట్టణవాసులు చెల్లించవలెనని జిల్లా మేజిస్ట్రేటుగారు తీర్పునిచ్చిరి.

కాని విద్యార్థియగు కృష్ణారావు తనను అక్రమముగా కొట్టినందుకు డాక్టరు కెంపుమీద తెచ్చిన నష్టపరిహారపుదావాలో ఆంధ్రుడగు జిల్లామునసబు రు. 300 ల నష్టపరిహారమును డాక్టరు కెంపునుండి ఆ విద్యార్థి కిప్పించెను. జిల్లా సెషన్సుజడ్జి పార్థసారథి అయ్యంగారివద్ద అప్పీలు దాఖలుచేయగా ముద్దాయిలలో అరిపిరాల లక్ష్మీనరసింహారావుగారు మొదలగు ముగ్గురు మాత్రము నిర్దోషులని విడుదలచేయబడిరి. ఇది ఆంధ్రదేశములోని ప్రథమ రాజకీయ క్రిమినలుకేసు. కేసు స్వల్పమైనదేయైనను, యూరపియనులమీద ఎన్నటికి తిరుగబడకుండ భారతీయులకు గుణపాఠము నేర్పవలెనని అట్టి దారుణమైన శిక్షలువేసిరి. ఆకాలములో వీరేశలింగంపంతులుగారికి కుడి భుజముగా పనిచేసిన మహాకవి సుప్రసిద్ధ నవలారచయిత జాతీయవాదియగు చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు రచించిన హృద్యములగు పద్యములలో కొన్ని ప్రజలందరిలో బాగుగ వ్యాపించి, ప్రతివారిచేత పాడబడుచువచ్చినవి. అవి యేవనగా—

1. భరతవర్షంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పిదుకుచున్నారు మూతులుబిగియగట్టి.

2. నూతియొడ్డున కూర్చుండి త్రాగ నీరు
తెచ్చుకొనలేక నోరెండి చచ్చునట్లు
సిరులుగలదేశమందు వసించుచుండి
హిందువులు చచ్చుచుందురు కరువుచేత.

3. పాత దొంగలగుంపు బందువర్గము మాకు
వచ్చిజొన్నలకూడు పాయసంబు
బిలుకొలు సంకెళ్లు బిరుదుటందెలు మాకు
చురికి యెండెడి టోపి భోమధికంబు....

కిటికీనేలలు రత్నకంబళులు మాకు
ధీరులమగాని మేము ఖయిదీలుగాము
గౌరవమెగాని మాకు లాఘవము లేదు.

(౨)

1907 సంవత్సరము వేసంగిలో కృష్ణాజిల్లా కాంగ్రెసుమహాసభ నందిగామలో గొప్ప రాజకీయవాతావరణముతో జరిగినది. రాజకీయ సాంఘిక మహాసభలకు రెంటింటికి ఆహ్వానసంఘాధ్యక్షులు మునగాలరాజా నాయని వెంకటరంగారావుగారే. రాజకీయసభ ఆహ్వానసంఘమునకు నేను, సాంఘిక సభ ఆహ్వానసంఘమునకు కొమర్రాజు లక్ష్మణరావుగారు ప్రధాన కార్యదర్శులము. మా బావగారగు చేమర్తి మల్లికార్జునరావుగారు కోశాధికారిగా నుండిరి. మా యింటియెదుటనున్న పెద్దమర్రిచెట్టుఛాయక్రింద సభాసదులందరును కూర్చొనిరి. మా యింటివసారాలోని పెద్ద అరుగుమీద సభావేదిక అమర్చబడెను. మా పెద్దదొడ్డిలో నాకమూల పంటలు తయారుచేయించి మిగతాస్థలములో వరుసలుకట్టి చతుర్వర్ణములవారికి విడివిడిగా భోజనము చేయుట కేర్పాటుచేసితిమి. వితంతూద్వాహములు చేసుకున్నవారికి భోజనములు ఆ ప్రక్కనేయున్న సత్రములో నేర్పాటుచేసితిమి. మా యిల్లు భోజన సామానులు. సభాసామానులు పెట్టుకొనుటకు వినియోగింపబడెను. రాజకీయమహాసభ రెండురోజులు. సాంఘికమహాసభ యొకరోజు జరుపబడెను. కృష్ణా, గుంటూరుజిల్లాలనుండి ప్రముఖ రాజకీయవేత్తలందరు వచ్చిరి. పైగా మాడపాటి హనుమంతరావు, ఆదిరాజు వీరభద్రరావు, రావిచెట్టు రంగారావు, బాజీ కృష్ణారావు (హైదరాబాదునుండి), డాక్టరు లక్ష్మిపతి, ఆదిపూడి సోమనాధరావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావుగార్లుకూడ వచ్చిరి. ఆ సభలకు క్రిందటిరోజునే బ్రిటిషువారు లాలా లజపతిరాయిగారిని, అజిత్‌సింగుగారిని అరెస్టుచేసి ఎచటికో ప్రవాసమువంపినటుల తెలిసి అపు డచటనున్న వారమందరము ఆ ప్రవాసమునకు పంపుటనుగూర్చి తీవ్రముగా ఖండించుచు ఉపన్యసించి, తీర్మానముగావించితిమి. రాజకీయమహాసభకు వల్లూరు సూర్యనారాయణరావుగారు అధ్యక్షతవహించిరి. ఆయనమీద కక్షతో జిల్లాలో

డెప్యూటీ మేజస్ట్రీటుగానున్న పండిత నాగేశ్వరరావుగారొక క్రిమినలు కేసును పెట్టియుండిరి. సభలు జరుగుచుండగా సూర్యనారాయణరావుగారిని అరెస్టుచేతురేమోయని భయముతోనుంటిమిగాని అట్టిదేమియు జరుగలేదు. కౌతా శ్రీరామశాస్త్రిగారు వందేమాతరంపాడుటతో సభ ప్రారంభమయ్యెను. ఆహ్వానసంఘాధ్యక్షులగు నాయని వెంకటరంగారావుగారు జమీందార్లయ్యును నిర్భయముగా తమ యుపన్యాసములో స్వరాజ్యము, స్వదేశీ ప్రోత్సాహము, బ్రిటిషువస్తుబహిష్కారము, జాతీయవిద్య చతుర్విధములని చెప్పిరి. ఇందు వలన ఆయనగౌరవము ఆంధ్రదేశములో హెచ్చెను. కలకత్తా కాంగ్రెసు తీర్మానములన్నియు పునరుద్ఘాటించుచుతీర్మానములుచేయబడెను. లాలాలజపతి రాయి, అజిత్‌సింగుగార్ల ప్రవాసమును ఖండించుచు తీర్మానముచేయబడెను. ఏవోకొన్ని మితవాదసవరణలు పెట్టుటకుప్రయత్నించి విఫలులైనందున పురాణం వెంకటప్పయ్యపంతులుగారు, మరి యిద్దరు ముగ్గురు పెద్దలు సభ పూర్తి అయ్యేవరకు ఉండకుండా ముందుగానే వెడలిపోయిరి. ప్రతినిధులనందరిని నందిగామకు మధిరస్టేషనునుంచి రెండెడ్లబండ్లమీద రప్పించడము, మరల రెండెడ్లబండ్లమీద మధిరస్టేషనుకు పంపడముతప్ప వేరు మార్గము లేకుండెను; అటులనే చేసితిమి. మోటారుకారులు, బస్సులు లేని కాలమది.

సాంఘికమహాసభకు కొండా వెంకటప్పయ్యగారు అధ్యక్షులు. ఉదయమున తమ అధ్యక్షోపన్యాసము ముగియగనే భోజనముచేసి బండికట్టించుకొని మధిరకు వెళ్ళిరి. ఆరాత్రి రైలునందుకొని, గుంటూరు వెళ్లిరి. మధ్యాహ్నం సభలో వట్టి తీర్మానములతో తృప్తిచెందక కొంత కార్యాచరణముకూడ చేయదలచినామని నేను ప్రకటించినాను. నేను, అపటిపల్లి నారాయణరావు, బోడి నారాయణరావుగార్లు కలసి ఆ సభకు వచ్చి దూరముగా కూర్చొనియున్న మా యూరి పంచములను చేతితో తీసుకునివచ్చి ఆ సభలోపల కూర్చోబెట్టినాము. సభలో కొంత గుసగుసలు జరిగి, సభాసదులు కొంచె మటూ నిటూ దూరముగా సర్దుకొనిరి. వితంతూద్వాహము, రజస్వలానంతరవివాహము, సముద్రయానము, భోగముమేళములనిషేధము, అస్పృశ్యతానివారణము, అంతశ్శాఖావివాహములు మొదలగు తీర్మానములు చేసితిమి. సభ ముగియులోపలనే ఆరాత్రి వితంతూద్వాహము చేసుకున్న

వారందరితోకలసి సహపంక్తిభోజనములను ఆదొడ్డిలో నేర్పాటుచేయు
చున్నాననియు అందులో చేరదలచినవారు నాతోకలసి భుజించవలయు
ననియు, ఇష్టములేనివారికి ఇంటిలోపలనే భోజనము లేర్పాటుచేయుచున్నాను
గాన వారు లోపలనే భోజనముచేయవచ్చుననియు నేను ప్రకటనచేసితిని.
ఆప్రకారమే భోజనము లేర్పాటుచేసితిని. ఆరాత్రి, ఆ దొడ్డిలో ఆదిపూడి
సోమనాథరావు, ఉన్నవ లక్ష్మీనారాయణ దంపతులు, సంజీవరావుదంప
తులు, దేవగుప్త శేషాచలరావుదంపతులు, కసుతా శ్రీరామశాస్త్రి మొదలగు
వితంతూద్వాహనపరులతోపాటు నేను, భోగరాజు పట్టాభిసీతారామయ్య,
ముట్నూరి కృష్ణారావు, కోపల్లె హనుమంతరావు, గాడిచర్ల హరిసర్వోత్తమ
రావు, అవటపల్లి నారాయణరావు, పింగళి లక్ష్మీనారాయణ, బోడి నారాయణ
రావు, కొమర్రాజు లక్ష్మణరావు, డాక్టరు లక్ష్మీపతి మొదలగువారము కలసి
భోజనముచేసినాము. తక్కినవారంతా ఇంటిలోపలనే భోజనముచేసిరి.
పెద్దిభొట్ల వీరయ్యగారు పూటకూళ్ళయింటిలో భోజనముచేసిరి. వేమవరపు
రామదాసుగారు వారి అత్తవారింట్లోను, వల్లూరి సూర్యనారాయణరావుగారు
వారివిడిదిలోను భోజనముచేసిరి. దీనితో వంటబ్రాహ్మణులలో కలవరము
బయలుదేరి, వారు మా కందరకు భోజనములుపెట్టి వారుమాత్రము భోజ
నముచేయకుండా వెళ్ళిపోయిరి. మరునాడు ఉదయమునుండియు వచ్చిన
అతిథులందరిని బండ్లలో పంపినాము. మునగాలరాజాగారు, లక్ష్మణరావు
గారు నడిగూడెము వెళ్ళిపోయిరి.

ఆ యూరివాడను నే నొక్కడనే మిగిలినాను. మామూలు పల్లెటూరుగనుక
ఊరంతయు ఆందోళనతో నిండియున్నది. నాకుటుంబము బెజవాడలోనే యున్నది.
నందిగామకువచ్చినప్పుడు మా బావ చేమర్తి మల్లిఖార్జునరావుగారింట్లో వుంటూ
యుండేవాడను. ఆయనకేమైనను ఇబ్బందికలుగునేమోనను భీతితో ఆమరునాడు
రెండుపూటలు సభలభోజనశాలలోనే భోజనముచేసితిని. ఆ దినము యథా
ప్రకారము వంటబ్రాహ్మణులు వచ్చి వంటచేసివెళ్లిరి. రెండవనాడు బండి
మీద మధిరకుపోయి బెజవాడ చేరుదామని అనుకొనుచుండగా మా అక్క
గారు వచ్చి తమయింటికి భోజనమునకు రమ్మని మా బావగారు కబురుచేసి
నారని చెప్పినది. మా యూరివారైన తుర్లపాటి వీరభద్రరావుగారు మీ

వాడికి కొంచెము తులసితీర్థము యిప్పించండి అది చాలును అని మా బావ గారికి కబురుపంపినట్లున్నూ, అందుమీద ఆయనకు చాలా ఆగ్రహము వచ్చి 'మావాడికి యీ వూరిలో ప్రాయశ్చిత్తము చేయించవలెనసేవారు న్నారా, గర్భస్రావములను కలుపుకుంటూ న్యాయమైన సంస్కరణలను కావలెననేవారిని వెలివేస్తామని ఎవరంటారో చూతాము' అని ఆయన అన్నట్లున్నూ మా అక్కగారు చెప్పినది. అందుమీద మా అక్కగారింటికి భోజనమునకు వెళ్లినాను. మా బావగారు మామూలుగా భోజనమునకు రాకపోయినావా ? మన నెవరు ఏమిచేయగలరు ? అని నాతో అని, నన్ను తనసరసను కూర్చోబెట్టుకొని భోజనముచేసినారు. మా తాలూకాలోని బంధువు లెవరో ఆ పూట మాతోగూడ భోజనముచేసినారు. నేను నాలు గైదురోజులు నందిగామలో మా అక్కగారింట్లో వుండి పిమ్మట బెజవాడ వెళ్లినాను. మా బావగారియొక్క, మా కుటుంబముయొక్క పలుకుబడి మా నందిగామతాలూకాలో గొప్పదిగా నున్నందున ఏ గందరగోళములేకుండా అంతయు శాంతముగా ముగిసినది.

ఇది జరిగినపిమ్మట వారమురోజులకు ఒక ఫోర్జరీకేసులో నే నొక వైపున, రెండవవైపున పెద్దిభొట్ల వీరయ్యగారు వకీళ్ళముగా నందిగామ తాలూకా తహసీలుదారు, మేజస్ట్రేటువద్దకు ముచ్చింతాల గ్రామమునకు వెళ్లి నాము. ఆ గ్రామములో కరణంయిల్లు తప్ప వేరే బ్రాహ్మణయిల్లు లేదు. ఆయన భయపడి గ్రామమువిడిచి వెళ్ళిపోయినాడు. భోజనంపెట్టేవారు లేక పోయినారు. తహసీలుదారుబసలో వారితోకలసి పెద్దిభొట్ల వీరయ్యగారు భోజనముచేసి, నాకు భోజనము బయట వసారాలో పెట్టినారు. ఆ ప్రకారం బయట భోజనముచేసి, ఆ కేసు ముగించుకుని బెజవాడ వెళ్లినాను. మా బావగారు నేను మా తాలూకాలో మా కుటుంబమర్యాదను భంగపరచినా నవియు, తగిన గౌరవకరమైన భోజనపు ఏర్పాట్లు చేసుకొనకుండా ఒక పల్లెటూరుకుపోయి ఆకస్మికముగా అవమానమును పొందుట నా అవివేకము వల్లనే జరిగినదనియు, ఒకవంటవాణ్ణి తీసుకొనియైనపోవలసియుండెను, లేదా నే నాయూరికి రానని నా కక్షిదారుతో చెప్పవలసియుండెననియు నాకు చాలా నిష్ఠూరముగా వ్రాసినారు. నా కక్షిదారుడు నా కొక దూరపుబంధువగు

బ్రాహ్మణుడు. అతనిని మా బావగారు నందిగామ వెళ్ళినపుడు నానా చీవాట్లు పెట్టినారు. అంతేగాక ఆ యూరికి క్షణం మా నందిగామ గ్రామమునకు పోగా సాయంత్రమువరకు ఏ పూటకూళ్ల యింట్లోను భోజనము లేకుండాచేసి క్షమాపణకోరించుకొని సాయంత్రము భోజనముపెట్టుటకు అనుమతినిచ్చినారు. ఈ సంగతి తాలూకాయంతయు వ్యాపించినది. మరల మా తాలూకాలో కేసులమీద వెళ్ళుటకు పోయినను నాకు ఎట్టి సంకోచములేక ప్రతి చోట ఆతిథ్యము లభించెను.

బెజవాడలో పూర్వాచారపరాయణులు మామీదపెట్టిన వెలితగాదాలు కూడా మమ్ము ఏ విధముగను బాధించలేదు. పూర్వాచారపరాయణులగు పెద్దలకుమారులు మాతో భోజనముచేయుచువచ్చినారు. ఇంతలో 1908 వ సంవత్సరమునుండి ఆంధ్రదేశములోని మధ్యమతరగతి కుటుంబాలనుంచి చాలామంది యువకులు ఇంగ్లాండుకు విద్యాభ్యాసమునకై పోవడం, వారిలో కొంతమంది యింట్లో చెప్పకుండా పారిపోవడం, ఆపైన తలిదండ్రులు వారికి డబ్బుపంపడంకూడ జరుగుచువచ్చినది. మా బావగారితమ్ముడగు సుందరశివరావుగారికుమారుడు వెంకటేశ్వరరావు నాతోను, నా భార్యతోను మాత్రము రహస్యంగా చెప్పి తండ్రితో చెప్పకుండ ఇంగ్లాండు పారిపోయినాడు. పిమ్మట నా సలహామీద తండ్రి సొమ్ము పంపినాడు. బారిష్టరు చదివినాడు. డబ్బుచేసి మధ్యలో ఒకసారి బెజవాడ, నందిగామ వచ్చినపుడు ఎట్టి ప్రాయశ్చిత్తము లేకుండా అతనితండ్రి, పెత్తండ్రి, నేను, లక్ష్మణరావుగారు, మా యితరబంధువులంతా అతనిని ఆదరించి కలుపుకున్నాము. మరల వెళ్ళి బారిష్టరు ప్యాసై 1918 లో తిరిగివచ్చినాడు. అటుల ఇంగ్లాండుకు పారిపోయినవారిలో బెజవాడ పూర్వాచారపరాయణనాయకులలో ముఖ్యుడగు శ్రీపతి గోపయ్యగారిఅల్లుడగు వెలగపూడి కృష్ణమూర్తి కలడు. శ్రీపతి గోపయ్యగారికి ఒకే కుమార్తె యుండెను. ఇతరసంతానము లేదు. ఆయన తనఅల్లుడు తనతో చెప్పకుండా ఇంగ్లాండుకు పోయినందుకు కోర్టులో లాయర్ల గదిలో దుఃఖమును వెలిబుచ్చగనే "మేమంతా యున్నాము. మీ అల్లుని కేమియున్ని ఇబ్బందికలుగనీయ"మని చెప్పి ఆయనను ఓదార్చినాము. ఆ వెలగపూడి కృష్ణమూర్తిఅన్నగారైన సుబ్బారావుగారు మాకు ముఖ్యులు.

బాపట్లలో ప్రముఖ న్యాయవాది, సంస్కరణవాది, నడింపల్లి వెంకటలక్ష్మీ నరసింహారావు, త్రిపురనేని రామస్వామి, మోతే నారాయణరావుగార్లుకూడా ఆ కాలముననే ఇంగ్లాండుకు వెళ్ళినారు. ఉన్నవ లక్ష్మీనారాయణగారుకూడ ఆ తరుణములోనే ఐర్లాండుకుపోయి - బారిష్టరు ప్యాసై వచ్చినారు. మా బెజవాడ పూర్వాచారపరాయణులు ఏమియు చేయజాలక క్రమముగా వెలి ప్రయత్నములను మానుకున్నారు. 1908వ సంవత్సరాంతమునకు తగాదాలన్ని సమసిపోయి మా సంఘసంస్కర్తల కెట్టి ఆటంకములు లేకుండాపోయినవి. మేమెవరితో భోజనముచేసినను మమ్ములను నడుగువాడు లేడైరి. మా యింటికి పండితులు, స్వాములవార్లు, పూర్వాచారపరాయణులగు బంధువులు, మిత్రులు వచ్చి నాతో భోజనముచేయుచుండిరి. గాని వారు వచ్చినరోజునే సంస్కర్తలుగాని ఇతరమతములవారు, కులములవారుగాని మా యింటికి వచ్చినచో వారితో మా పెద్దహాలులో నేను కూర్చొని భోజనముచేసేవాణ్ణి. పండితులు మొదలగు పూర్వాచారపరాయణులకు నా భార్య లోపల చిన్నహాలులో భోజనములేర్పాటుచేసేది. ఈవిధముగా భావస్వతంత్రముగలిగి ప్రవర్తించుటలో అభ్యంతరములు లేకుండెను.

ఆంధ్రదేశములో వ్యాపించిన సంఘసంస్కరణోద్యమఫలితముగా భోగముమేళములను పెట్టుకునే ఆచారము తగ్గిపోయినది. వేశ్యలు, కళావంతులు, దేవదాసీలు, భోగంవాళ్లు, సానివాళ్ళు, వారకాంతలు మొదలగు పేర్లతో నొక కులము ఆంధ్రదేశములో చాలకాలమునుంచి ప్రబలియుండెను. ఆ కులపుస్త్రీలు అవివాహితలుగానుండి నృత్య సంగీతములను బాగుగా నభ్యసించి, చక్కగా శృంగారించుకొని, దేవాలయములలోను, ఉత్సవములలోను, వివాహాది శుభకార్యములలోను నాట్యమాడుచుండిరి. కాని వ్యభిచారమునే తమ ప్రధానవృత్తిగా నవలంబించి జీవనోపాధిని గావించుచుండిరి. భాగ్యవంతులైనవారికి ఉంపుడుకత్తెలగు అదృష్టముపట్టినవారు కొంత ధన సంపాదనచేయుచుండిరి. విటులను ఆకర్షించజాలని కన్యలకు మాత్రమే వివాహముచేయుచు, పురుషులు తమ తల్లులకు, పినతల్లులకు, అక్కచెల్లెండ్రకు విటకాండ్రను సమకూర్చు నీచవృత్తిలో నుండిరి. ఇటుల నొక కులమువారు తమ జీవనోపాధికి వ్యభిచారమునే వృత్తిగా నవలంబించి

హైందవసంఘములోని యువకులను వ్యభిచారమునకు ఆకర్షించుటయే పనిగా పెట్టుకొనుట చాలా హేయమైనదని సంఘసంస్కర్తలము తలచి యా వృత్తిలోనుండి ఆ కులమును తప్పించి తక్కిన అన్నికులములతోపాటు అందరుఆడపిల్లలకు వివాహములుచేయించుటకును, భోగముమేళములు నిషేధించుటకును, బాలబాలికలకు విద్యచెప్పించి వారిలో నీతిని ఆత్మగౌరవమును పెంపొందచేయుటకును పూనుకొంటిమి. అతిత్వరితముగ నా కులములోనిపురుషులకు ఆత్మగౌరవము కలిగెను. ఆ కులములో విద్యావంతులు, విద్యార్థికు ఉదయించిరి. తమ ఆడుబిడ్డలకు వివాహములను చేయసాగిరి. ఇటుల బందరు, బెజవాడ, ఏలూరు, గుంటూరు, నర్సాపురం, కాకినాడ, రాజమహేంద్రవరము మొదలగునన్నిచోట్ల జరిగెను. అచిరకాలములోనే ఆ కులమునుంచి గొప్ప లాయర్లు, ప్రభుత్వోద్యోగులు, వైద్యశిఖామణులు, ఉపాధ్యాయులు ప్రబలిరి. ఆంధ్రదేశమునకు వన్నెతెచ్చిన విదుషీమణులు కూడ ఆ కులమునుంచి యుత్పన్నమైరి. వారందరును తమకులములను పూర్తిగ సంస్కరించుకొనిరి. డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డి, బి.ఏ.,యం.బి. సి.యం., దివానుబహద్దరు బండి శ్రీహరిరావునాయుడు, కె. సుబ్రహ్మణ్యం నాయుడు, గోపీనాధరావు, శ్యాంరావు, చదలవాడ చక్రధరరావు మొదలైన వారు ఆ కులములోపుట్టి ఆంధ్రదేశములో గొప్పస్థానములను ఆక్రమించిన ప్రముఖులు. ఈ సంస్కరణమునకు తోడ్పడిన చట్టములనుగూడ మద్రాసు శాసనసభలో నెటుల గావించితిమో ముందుముందు తెలిపెదను.

(4)

బిపిన్ చంద్రపాలుగారు బెజవాడ వచ్చినదినమునే తిరుపతికాపురస్తులగు శ్రీనివాసాచార్యులుగారు అదివరకు బెజవాడనుండి నడుపుచున్న శ్రీ వెంకటేశ పత్రిక యను నొక వారపత్రికను స్వరాజ్యపత్రికగా మార్చిరి. కాని కొద్దివారములలోనే అది ఆగిపోయినది. 1907 వ సంవత్సరపు ఆఖరు భాగములో నదివరకే బెజవాడలో నివాసమేర్పరచుకొనిన గాడిచర్ల హరి సర్వోత్తమరావు, పింగళి లక్ష్మీనారాయణ, బోడి నారాయణరావుగార్లు ఒక ముద్రాక్షరశాల యజమానులగు కాశీనాధుని వీరమల్లయ్యగారితో ఒడంబడిక

కరార్నామాను వ్రాసికొని ఆ స్వరాజ్య తెనుగువారపత్రికను ఆచార్యులుగారి వద్దనుంచి తీసికొని దానిని బెజవాడనుండి నడపసాగిరి. అది త్వరితముగనే వృద్ధిచెందినది. దానిలో నేనుకూడ దాదాపు ప్రతివారము వ్యాసములు వ్రాయు చుంటిని. దానికి గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు సంపాదకుడుగను, బోడి నారాయణరావుగారు ముద్రాపకుడుగను, ప్రచురణకర్తగను ఉండిరి. నేను ముఖ్యముగా ఆంగ్లదేశచరిత్రనుండి వేల్సు, స్కాట్లండు, ఐర్లెండు దేశీయులు స్వతంత్రముకొరకు ఇంగ్లాండుతోజరిపిన పోరాటములనుగూర్చి వ్యాసములు వ్రాయుచుంటిని. కొంత ధనసహాయమునుగూడ చేసితిని.

1908 ప్రారంభమున సర్కార్ అను పేరుగల నౌక బంగాళీ యువకుడు కలకత్తానుండి బెజవాడలో మాయింటికి వచ్చి దిగెను. అతని కాతిథ్యమిచ్చి నేను కోర్టుకుపోయి, సాయంత్రము యింటికి వచ్చితిని. ఈ లోపుగా హరిసర్వోత్తమరావు, పింగళి లక్ష్మీనారాయణ, బోడి నారాయణ రావు, కాశీనాధుని వీరమల్లయ్య గార్లు, మా యింటిపక్కనే కాపురమున్న కలపటపు సుబ్బారావు అను మిత్రుడు, అతనితో తప్పేళ్ళన్నీ మాటలాడిరి. నే నింటికివచ్చేసరికే సూరి వెంకటనరసింహశాస్త్రి, పెద్దిభొట్ల వీరయ్యగార్లు కూడ వచ్చి ఆయనతో మాట్లాడుచుండిరి. ఇంతలో నేను వచ్చితిని. బంగా ళములోని యువకులు బ్రిటిషుప్రభుత్వముపై సాయుధవిప్లవమును లేవదీయు టకు ప్రయత్నించుచున్నారనియు, బాంబులను తయారుచేయుట, నదులమీది వంతెనలను బద్దలుకొట్టుట మొదలగు కార్యములను ప్రారంభింపబోవు చున్నారనియు, ఆంగ్లేయులను, ప్రభుత్వోద్యోగులను హత్యగావించనిది ఆంగ్లేయులు దేశమునుండి లేచిపోరనియు, ఆంధ్ర కాంగ్రెసుయువకులు గూడ తమతో చేరవలెనని కోరుటకు విప్లవకమిటీవారు తన్ను పంపిరనియు తెలిపెను. కొన్ని పటములు, బాంబులుచేయువిధానములు మాకు చూపెను. ఆయనతో ఆ మధ్యాహ్నము మాటలాడిన మా మిత్రులు నేను వచ్చినదాకా ఏమియు చెప్పలేమని చెప్పినారట. అన్ని తప్పేళ్ళు తెలుసుకొనినపిమ్మట నా అభిప్రాయమును అడుగగా, ఆ భయానకవిప్లవములో నేను చేరజాలననినీ, బిపిన్‌చంద్రపాలుగారు బోధించివెళ్ళిన సాత్వికనిరోధములోనైతే (**Passive Resistance**) నేను చేరుటకు సిద్ధముగానున్నాననిన్ని నిశ్చితముగా చెప్పి

నాను. తక్కిన మిత్రులు కూడ నాతో ఏకీభవించినారు. ఆ బంగాళీయువకుడు అంతటితో బందరువెళ్ళి ముట్నూరు కృష్ణారావుగారిని. గుంటూరువెళ్ళి ఉన్నవ లక్ష్మీనారాయణ గారిని, రాజమహేంద్రవరము వెళ్ళి గున్నేశ్వరరావు గారిని చూచి మాట్లాడి వెళ్ళినట్లున్నూ, వారు సానుభూతిచూపిననూ ఆ విప్లవోద్యమములో చేరుటకు ముందుకురాలేదనిన్నీ ఆయనకూడ ఆంధ్రదేశమునందు పెట్టుకున్న ఆశలను విడిచి, మరల కలకత్తాకు వెళ్ళినటులున్నూ తెలిసినది. కాని మాతో కలిసిమెలిసి అన్ని సంగతులూ విన్న కలపటపు సుబ్బారావు ఆ యావత్తుకథను బెజవాడ రహస్యశాఖ డెప్యూటీ పోలీసు సూపరింటెండెంటు పిలిపించి అడుగగా చెప్పినటుల తెలిసినది. ఈ సంగతులన్నీ పోలీసువారికి తెలిసేలోపుగనే ఆ బంగాళీ యువకుడు కలకత్తా చేరినాడు. మేము విప్లవములో చేరజాలమని చెప్పినసంగతి కూడ పోలీసువారికి తెలిసియుండక పూనదు. గాని, బెజవాడలోను, గుంటూరులోను, బందరులోను, రాజమహేంద్రవరములోను విప్లవకమిటీలు ఏర్పడినట్లే తమ దినచర్యపుస్తకములలో నెక్కించుకొని పైకి రిపోర్టులు పంపి, మమ్మె అందరిని అతి అనుమానముతో వెంబడించసాగిరి. నేను విప్లవములో చేరనని చెప్పినది అసలు విప్లవమునకు వ్యతిరేకభావముండి కాదు. తమ ప్రాణములను దేశస్వతంత్రమునకు బలియివ్వదలచిన యువకులయందత్యంత గౌరవమే యుండెను. కాని ప్రజలలో రాజకీయపరిజ్ఞానము కలుగచేయకుండానే విప్లవమును నడిపినను అది జయప్రదముగా సాగనేరదనిన్నీ, ఇతరులను ఊరకనే హత్యలుచేయుటవలన ప్రజలకు హత్యచేయువారియందు వ్యతిరేకభావము కలుగునేమోననుసందేహమే కలదనిన్ని, వృధాగా పోలీసువారి క్రూరహింసలకును యావజ్జీవమైదులకును మరణశిక్షలకును మాత్రమే లోబడవలసివచ్చునేమోననిన్ని, 'సాత్వికనిరోధము' 'శాసనోల్లంఘనము' జరిపినచో అందులో చేరుటకు సిద్ధముగానున్నాననిన్ని, ప్రస్తుత సాంఘిక రాజకీయస్థితిలో బాంబులనువేసి మనుష్యులనుచంపువిధానము మంచిది కాదేమోననిన్ని నేను చెప్పితిని. ప్రపంచచరిత్రలో సాత్విక నిరోధమునుగూర్చి చదివియుంటిని.

తరువాత రెండుసంవత్సరములకు బెజవాడలో గెలెటీగారు సభ

కలెక్టరుగా నుండగా గవర్నరుగారి కార్యనిర్వాహకసభ్యులుగా నున్న శివ స్వామిఅయ్యరుగారు మద్రాసునుండి బెజవాడ వచ్చిరి. టౌనుహాలులో వారికి మునిసిపలు చైరుమనుగారిచ్చిన సన్మానమునకు నేనుకూడ వెళ్ళితిని. ఎవరో కొందరు నేను బాంబులను తయారుచేసేకమిటీలో నున్నానని, నేను అల్లరి చేయుటకే వచ్చుచున్నానని, న న్నాసభకు రానివ్వవద్దని తన కర్జీ పంపినా రనిన్నీ, తాను దానిని నమ్మలేదనిన్నీ గెలెటీగారు నాతో చెప్పిరి. ఆయనకు నేను కాంగ్రెసువాదినని తెలుసును. నామీద చాల గౌరవముండెను. "మ్యుని సిపలుకౌన్సిలుకు నామినేషన్ చేయించెదను ఒప్పుకుంటారా" యని నన్నొక సారి అడిగినాడు. నేను అంగీకరించను అని చెప్పినాను. ఆయనకు ఆంధ్ర వాఙ్మయమునందు అభిరుచి యుండెను. అందువల్ల కొమఱ్ఱాజు లక్ష్మణ రావుగారియందుకూడ చాల గౌరవముండెను. అపుడు తాడంకి వెంకటసుబ్బ య్యగారు మ్యునిసిపలుచైరుమనుగా నుండిరి. వారు, మ్యునిసిపలు కంట్రా క్టరగు గురుమహంతి అప్పలస్వామిగారు కలసి ఎన్నికలుజరుపుచుండగా ఎల్లేపద్ది జానకిరామయ్య, చల్లపల్లి హనుమాన్లు, కపుతా పూర్ణానందం, మానక్జీ మొదలగువారు వ్యతిరేకపార్టీగా నేర్పడగా మేము వెంకటసుబ్బయ్య గారివ్యతిరేకులకు మద్దతుచేసినందుకు నామీదను, పెద్దిభొట్ల వీరయ్య, సూరి నరసింహశాస్త్రిగారిమీదను చైరుమనుపార్టీవారు బాంబుకథల అర్జీని సబు కలెక్టరుగారికి పెట్టినటుల తెలిసినది. నేనుకూడ సన్మానసభలో శివ స్వామిఅయ్యరుగారిని కలసితిని. ఆయన నన్ను గౌరవించెను. అదివరకే ఆయనతో లాయరుగా పరిచయముగలదు.

1907 వ సంవత్సరము డిశంబరునెలలో సూరతులో కాంగ్రెసుమహా సభ జరిగెను. అది నాగపూరులోజరుగవలసియుండగా ఫిరోజిషా మెహతా, సురేంద్రనాథబెనర్జీ మొదలగు మితవాదనాయకులు తమకు సంపూర్ణవలుకు బడిగల సూరతుకు మార్పించుకొనిరి. కలకత్తా కాంగ్రెసులో చేయబడిన స్వరాజ్యము మొదలగు తీర్మానములను సూరతులో మార్పించి కాంగ్రెసును పాతపద్ధతికే తీసుకొనిపోవలయునని వారియత్నము. అది జాతీయవాదులకు దుస్సహముగ నుండెను. అధ్యక్షుడుగ డాక్టరు రాసవిహారిఘోష్‌ను ప్రతి పాదించగనే బాలగంగాధరతిలకు అడ్డుతగిలెను. మితవాదులకు జాతీయ

వాదులకు కలహములు చెలరేగి, సూరతుకాంగ్రెసు విచ్ఛిన్నమయ్యేను. ఎక్కడివారక్కడ లేచిపోయిరి. బెజవాడనుండి పెద్దిభొట్ల వీరయ్య, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, బందరునుంచి కొనపల్లె హనుమంతరావు ఆ కాంగ్రెసుకు పోయి జాతీయవాదులతోనే చేరిరి. అఖిలభారతజాతీయవాదులకమిటీలో పెద్దిభొట్ల వీరయ్యగారిని సభ్యునిగ వేసుకొనిరి. 1908 ప్రారంభములో మిత వాదనాయకులు అలహాబాదులో నొక కన్వెన్షనును జరిపి కలకత్తా కాంగ్రెసు తీర్మానములను తిరగదోడి, క్రమక్రమముగా అంచెలవారీగా బ్రిటిషు సామ్రాజ్య అంతర్భాగముగ స్వపరిపాలనను పొందుటయే కాంగ్రెసుయొక్క లక్ష్యమని తీర్మానించిరి. కాంగ్రెసుమహాసభను 1908 డిసెంబరునెలలో మద్రాసులో డాక్టరు రాసబిహారీఘోషుగారి అధ్యక్షతనే జరుపుటకు నిశ్చయించిరి. కాంగ్రెసు కొక అంగవిధానమునుకూడ నిర్మాణముగావించిరి. జాతీయవాదులు తమ ప్రత్యేకసమావేశమును నాగపూరులో జరుపుటకు నిశ్చయించిరి. ఇంతటినుంచి బ్రిటిషుప్రభుత్వమువారు మితవాదులను ప్రోత్సహించి, జాతీయవాదులను నిర్బంధవిధానములచే అణచివేయు రాజనీతిని దృఢముగా నవలంబించిరి.

1908 వ సంవత్సరం ఏప్రిలు 30 వ తేదీన బంగాళములోని ముజఫర్‌పూరువద్ద యిద్దరు ఆంగ్లస్త్రీలమీద రెండుబాంబులు వేయబడగా వారిద్దరు మృతిచెందిరి. 18 సంవత్సరములవయసుగల కుదీరామ్ బోసు అను యువకుని పట్టుకొని బ్రిటిషుప్రభుత్వమువారు ఉరిదీసిరి. అతను భగవద్గీతను చేతపట్టుకొని ఉరిస్తంభమునెక్కెను. దేశస్వాతంత్ర్యముకొరకు మరణించుచున్నానని చెప్పెను. అతనిపటములు బంగాళములో విరివిగా పంచిపెట్టబడెను. భారతదేశస్వాతంత్ర్యపోరాటములో ప్రాణములర్పించిన ప్రథమ యువకు డతడు. ఆ వెంటనే యుగంధర్‌పత్రికాసంపాదకుడగు ఉపేంద్రదత్తును రాజద్రోహముక్రింద పట్టుకొని 5 సంవత్సరముల శిక్షవేసిరి. అతడు వివేకానందస్వాములవారి కనిష్ఠతమ్ముడు. అతనితల్లి కోర్టువద్దకు వచ్చి తన కుమారుడు దేశముకొరకు త్యాగముచేయుచున్నందుకు చాలా సంతోషమును వెలిబుచ్చినది. అయిదువందలమంది బంగాళీస్త్రీలు ఆమెగారియింటికివచ్చి అట్టికుమారుని కనినందుకు ఆమెను అభినందించిరి. అటుపిమ్మట కొలది

రోజులకే కలకత్తాలోని మనిక్తుల్లా తోటలోని యొక పెద్దగృహములో బాంబులు తయారుచేయుచున్న కర్మాగారమును పోలీసువారు పట్టుకొనిరి. దానికి అరవిందఘోషుతమ్ముడగు బారీంద్రఘోషు నాయకుడుగా నుండెను. బారీంద్రఘోషును, ఇతరయువకులను పోలీసువారు పట్టుకొని కేసులుపెట్టి వారికి దీర్ఘ శిక్షలువిధించిరి. మేడమీద అరవిందఘోషు నివసించుచున్నందున ఆయననుకూడ పట్టుకొని కేసుపెట్టిరి. ఆయనపక్షమున చిత్తరంజనదాసు గారు గొప్ప వాదననునడిపి కేసునుంచి అరవిందఘోషును విడుదలచేయించిరి. ఆరునెలలవిచారణకాలములో అరవిందఘోషు జైలులోనుండెను. ఆకాలమునందంతటను ఆయన భక్తిపరవశులై యుండి శ్రీకృష్ణునిదర్శనముచేసిరి. ఆ కేసుతోనే చిత్తరంజనదాసుగారికి గొప్ప పేరు ప్రతిష్ఠలు కలిగినవి. పిమ్మట కొలదికాలమునకే అరవిందఘోషుగారు కలకత్తాను వదలి మద్రాసుకు దక్షిణముగానున్న పుదుచ్చేరిలో నొక గొప్పయాశ్రమమును స్థాపించుకొని యావజ్జీవము సుప్రసిద్ధమైన ఆధ్యాత్మికగ్రంథములు వ్రాయుచు యోగాభ్యాసనిమగ్నులై యుండి, కొన్నిసంవత్సరములకు పరమపదించిరి.

(5)

1908 వ సంవత్సరము వేసంగిలో తెనాలిలో సమిష్టి కృష్ణాజిల్లా కాంగ్రెసు మహాసభ జరిగినపుడు వాతావరణము మిగులయుద్రేకపూరితముగా నుండెను. ప్రతినిధుల సంఖ్యలో మూడవవంతు రహస్యపుపోలీసు లుండిరి. కలకత్తా కాంగ్రెసు తీర్మానములే ఆమోదింపబడెను. మితవాదుల దృక్పథమును ఆ మహాసభ అంగీకరించలేదు ఆ సంవత్సరము జూలై నెలలో మద్రాసు రాష్ట్రములోని తిరునల్వేలిజిల్లాలో కొందరు అరవయువకులు జిల్లా మేజస్ట్రేటుగానున్న "ఆషు" అను ఆంగ్లేయుని తుపాలతో కాల్చి చంపిరి. రాజద్రోహముక్రింద చిదంబరంపిళ్ళేను పట్టుకొని బ్రిటిషుప్రభుత్వము యావజ్జీవశిక్ష విధించెను. అపుడు గుమికూడిన ప్రజలమీద తుపాకులుకాల్చి ఇద్దరు భారతీయులను ఒక ఆంగ్లేయయుద్యోగి చంపెను. బెజవాడనుంచి వెలువడుచుండిన స్వరాజ్యపత్రికలో దాని సంపాదకుడగు గాడిచర్ల హరిసర్వోత్తమ

రావుగారు "అతే అలే ఫిరంగి క్రూరవ్యాఘ్రమమా, ఇద్దరు భారతీయులను పొట్టనుపెట్టుకొంటివిగదా" మొదలైన మాటలతో ఉద్రేకముగా నొక వ్యాసమును వ్రాసి నెల్లూరునుండి పంపెను. ఆ వ్యాసము బెజవాడలో నా వద్దకు తెచ్చి చూపించబడగా నేను దానిని రాజద్రోహముక్రిందికి వచ్చు తీవ్రమైనమాటలను తీసివేయుటకు దిద్ది పంపితిని. కాని ముద్రాపకులగు బోడి నారాయణరావుగారు నా కొట్టివేతలను తీసివేసి అసలు వ్యాసమునే ప్రచురించెను. అందుమీద 1908 వ సంవత్సరము జూలై 18 వ తేదీన గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారిని రాజద్రోహనేరము క్రింద బందరులో అరెస్టుచేసి బెజవాడ సబుజైలుకు తీసికొనివచ్చిరి. హరిసర్వోత్తమరావుగారిసతీమణి, ఆయన పినతల్లి సుబ్బమ్మగారు, శ్రీధర నరసింహులుగారు మొదలగు బంధువులు బెజవాడలో నా యింటికి వచ్చి విచారణకాలములో నా అతిథులుగా నుండిరి. బందరులో డాక్టరు పట్టాభి సీతారామయ్యగారిగృహమును, బెజవాడలో నా యింటిని, కూరి వెంకటనరసింహశాస్త్రిగారియింటిని పోలీసులు సోదాచేసిరి. నా యిళ్ళలో నేరమునకు సంబంధించిన కాగితములేవియు దొరకలేదు. నేను స్వరాజ్యపత్రికకు అప్పుడప్పుడు వ్రాయుచుండిన వ్యాసములను ప్రాసిక్యూషనువారు అతి జాగ్రత్తగా చదివి వీలైతే నామీదకూడ రాజద్రోహనేరమును మోపవలెనని యత్నించిరి. కాని ఆ వ్యాసములు శిక్షార్హమైనవిగా కనపడునటువంటివి విడదీసిపెట్టి యీయలేకపోయిరి. బెజవాడ సబుడివిజనలుమేజిస్ట్రేటుకోర్టులో కొన్నినెలలు హరిసర్వోత్తమరావుగారికేసు విచారణజరిగినది. సంపాదకులైన హరిసర్వోత్తమరావుగారితోపాటు ముద్రాపకులును, ప్రకటనకర్తలు నైన బోడి నారాయణరావుగారినికూడ అరెస్టుచేసి రాజద్రోహనేరమును పెట్టిరి. వారిద్దరితోపాటు స్వరాజ్యపత్రికానిర్వహణమునకు కాశీనాథుని వీరమల్లయ్యగారు, పింగళి లక్ష్మీనారాయణగారలుకూడ నొక కంపెనీగా చేరి భాగస్వాములకరారునామాను వ్రాసుకొన్నారని ఇదివరకే చెప్పియున్నాను. వీరిలో కాశీనాథుని వీరమల్లయ్యగారిని ప్రభుత్వమువారు అప్రూవరుగా, అనగా కేసును ఒప్పుకొని జరిగినసంగతులను కోర్టులో సాక్ష్యమిచ్చువారినిగా తీసుకొనిరి. ఆయనమీద కేసుపెట్టలేదు. నాలుగవవారైన పింగళి లక్ష్మీనారాయణగారిమీద రాజద్రోహపు కేసుపెట్టుటకు విశ్వ

యించిరి. ఆ సంగతి ఆయనకు తెలిసి పోలీసువారు ఆయనను అరెస్టు చేయుటకు రాకముందే బెజవాడనుండి నా వద్ద అపసవ్యమైన సొమ్ము తీసు కొని మారువేషముతో పుదుచ్చేరికి పారిపోయెను. అప్పుడు మద్రాసునుంచి ఈవిధముగానే వచ్చిన సుబ్రహ్మణ్యభారతి, సుబ్రహ్మణ్యము మొదలగు దేశాభిమానులతో కలసి 1912 వ సంవత్సరముపరకు పుదుచ్చేరిలోనే నివ సించుచుండెను. అది ఫ్రెంచివారిప్రాంతము కనుక అక్కడికి పోయి బ్రిటిషువారు రాజద్రోహనేరస్థులను పట్టుకొని తీసుకొనివచ్చుటకు వీలు లేదు. అందువల్ల ఈ నాయకులు అచట స్వేచ్ఛగా నివసించుచుండిరి. 1911 వ సంవత్సరము డిశెంబరునెలలో పంచమజార్జి చక్రవర్తిగారు పట్టాభిషేకకారణముగా ఢిల్లీకివచ్చి అచట జరిగిన దర్బారులో అదివరకు గవర్నరుజనరలు కర్జన్‌ప్రభువుచే గావించబడిన బంగాళావిభజనమును రద్దు చేయుచు ప్రకటన గావించెను. ఆ సమయముననే రాజకీయఖైదీలలో కొంద రికి ప్రభుత్వమువారు క్షమాపణ నిచ్చినందున వారి నేరములు రద్దుపరచ బడెను. పింగళి లక్ష్మీనారాయణగారిమీద నిలవయున్న రాజద్రోహనేరము రద్దుఅయినది. ఆయన పుదుచ్చేరినుండి 1912 సంవత్సరము డిశంబరు నెలలో మరల బెజవాడ వచ్చి తన కుటుంబముతో చేరెను.

హరిసర్వోత్తమరావు, బోడి నారాయణరావుగారలమీద మోపబడిన రాజద్రోహకేసు విజయవాడ సబుడివిజనలుమేజిస్ట్రేటుగారిపల్ల విచారించ బడి కృష్ణాజిల్లా సెషన్సుకోర్టుకు పంపబడెను. హరిసర్వోత్తమ రావుగారిపక్షమున విజయవాడలో చింతకింద సూర్యనారాయణమూర్తిగారును బందరు జిల్లా సెషన్సుకోర్టులో జె. డి. శామ్యూలు, రామాచార్యులుగార్లు లాయర్లుగా పనిచేసిరి. గవర్నమెంటుపక్షమున ప్రత్యేక న్యాయవాదిగా కళ్లి నారాయణరావుగారు మద్రాసునుంచి వచ్చి వాదించెను. సెషన్సుకోర్టులో మున గాలరాజాగారు హరిసర్వోత్తమరావుగారిపక్షమున సాక్ష్యమిచ్చెను. విచారణ పూర్తిఅయినపిమ్మట జిల్లా సెషన్స్‌జడ్జి క్రెస్టాస్పుగారు బోడి నారాయణరావు గారికి తొమ్మిదినెలల కారాగారవాసమును, హరిసర్వోత్తమరావుగారికి ఆరు నెలల విడిఖైదును విధించెను. హరిసర్వోత్తమరావుగారు వ్రాసిన వ్యాస ములో రాజద్రోహ మంతగా లేదని, ఉద్రేకపూరితముగామాత్ర మున్నదని

తనతీర్పులో వ్రాసెను. అందుమీద బ్రిటిషుప్రభుత్వమువారు మద్రాసు హైకోర్టులో అప్పీలు దాఖలుచేయగా హైకోర్టు న్యాయమూర్తి బెన్సన్‌గారు హరిసర్వోత్తమరావుగారిశిక్షను ఆరునెలలనుంచి మూడుసంవత్సరముల కఠినపైదుగా హెచ్చుచేసిరి. బోడి నారాయణరావుగారి 9 నెలలఖైదును ఖాయపరచిరి. క్రైస్తవుడగు పాస్సీకుడగు ఐ. సి. యస్. హరిసర్వోత్తమ రావుగారికి తగినశిక్ష నివ్వనందున ఆయనను జిల్లాజడ్జిపదవినుండి సబుకలెక్టరుపదవికి తగ్గించి నర్సారావుపేటకు బదలాయించిరి. హరిసర్వోత్తమరావుగారు మూడుసంవత్సరముల కఠినఖైదును అనుభవించిరి. పుడు రాజకీయఖైదీలకు ప్రత్యేకసౌకర్యములు లేవు. తక్కినఖైదీలవలెనే తలకు మురికిటోపి, కాళ్ళకు ఇనుపకడియములు తగిలించడం, మట్టలాగులు తొడగడం, గొంగట్లో పడుకోవడము, నెయ్యి, మజ్జిగ లేకుండా పప్పుపులుసుతో మట్టిచిప్పలో అన్నపుముద్ద తినడము, మట్టిముంతతో నీరు త్రాగడము, పిండివిసరడము మొదలైన ఖైదుపనులు చేయడము అంతా తక్కిన మామూలుఖైదీలతోపాటే జరిగినది. కాకినాడ కెంపు అల్లరికేసులో శిక్షితులైన రాజకీయఖైదీలుకూడ నిట్టి కష్టములకే లోబచ్చబడిరి. హరిసర్వోత్తమరావుగారు విడుదలఅయి వచ్చిన పిమ్మట ఆయనభార్యకు కొంతకాలము పిచ్చెత్తినది కూడాను. ఆయనకు ఒక్కతే కూతురు కలదు. ఆమె సంగీతములో ఎమ్.ఏ. ప్యాసైనది. ఆమెభర్తకూడా సంగీతములో ప్యాసైనవాడే. వారుభయులు ఉద్యోగముచేసుకొని జీవించుచున్నారు. హరిసర్వోత్తమరావుగారి సతీమణి కొన్నిసంవత్సరాలక్రిందట మరణించినది.

హరిసర్వోత్తమరావుగారిని బందరులో అరెస్టుచేసినదినముననే లోకమాన్య బాలగంగాధరతిలకుగారిని పూనాలో అరెస్టుచేసిరి. బొంబాయి హైకోర్టుజడ్జియెదుట కేసు పదిరోజులు విచారణజరిగెను. ఆయన బాంబు ఉత్పత్తియగుటకు కారణము బ్రిటిషుప్రభుత్వముయొక్క నిర్బంధవిధానమే ననియు దుష్పరిపాలనయేననియు తన దినపత్రికయైన కేసరిలో మహారాష్ట్రి భాషలో వ్యాసము వ్రాసినందున రాజద్రోహనేరముక్రింద ఆయనను పట్టుకొనిరి. ఆయనను విచారించిన పారశీకుడగు హైకోర్టుజడ్జి అదివరకు ఆయనమీద బ్రిటిషుప్రభుత్వమువారు పెట్టిన యొక క్రిమినలుకేసులో తిలకు

గ్గా పక్షమున వాదనచేసిన న్యాయవాదియై యుండెను. కాని ఆయన యిపుడు బ్రిటిషుప్రభుత్వమువారిచే హైకోర్టుజడ్జిగా నియమింపబడి యింకను ఆ ఉద్యోగము ఖాయముకానిస్థితిలో నుండెను. పదిరోజులు విచారణ జరిగిన పిమ్మట ఆరుసంవత్సరములకారాగారశిక్షను తిలకుగారికి విధించెను. రాత్రి ప్రొద్దుపోయి తీర్పుచెప్పి ఎవరికీ తెలియకుండా అవెంటనే సిద్ధముగానుంచ బడిన యొక పొగయోడలో తిలకుగారిని తీసుకొనిపోయి బర్మారాజధానిగ్గైన మాండలే నగరములోని యొకకోటలో ఆరుసంవత్సరములు పై దీగానుంచిరి. వ్యాకి సహవాసముకాని. వారితో మాట్లాడేవారు కాని ఎవరూలేరు. ఆయనకు జైలులో అతిమూత్రవ్యాధి కలిగెను. ఆయన జైలులోవుండగానే పూనాలో ఆయనధర్మపత్ని మరణించినది. అయినప్పటికిని బ్రిటిషుప్రభుత్వము వారు ఆయనను విడుదలచేయలేదు. ఆయన జైలులో మహారాష్ట్రభాషలో భగవద్గీతకు జగత్ప్రసిద్ధమైన 'గొప్పభాష్యమును వ్రాసినాడు. అది అన్ని భాషలలోనికి తర్జుమాఅయినది. తెనుగులోనికి తెనాలి వాస్తవ్యులగు శ్రీ నోరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు దానిని భాషాంతరీకరించిరి. దానిని నేను తెనుగులో చదివినాను. అది గొప్ప యుద్గ్రంథము. శంకరాచార్యులవారు జ్ఞాన మార్గముననే మోక్షము లభించునని వ్రాసియుండగా లోకమాన్య బాలగంగా ధరతిలకుగారు కర్మయోగమువల్లనే, విధ్యుక్తధర్మమును నిష్కామబుద్ధితో భగవత్ప్రీత్యర్థము ఫలమును కోరకుండా ఆచరించినయెడల మోక్షము లభించుటయే భగవద్గీతయొక్కసారాంశమని వ్యాఖ్యానము వ్రాసిరి. ఆ వ్యాఖ్యానమే, ఆ అర్థమే ఇపుడు లోకమంతయు అంగీకరించుచున్నది. బాలగంగాధరతిలకుగారు 1914 వ సంవత్సరము మాండలేకోటనుంచి విడుదలై పూనాకు విచ్చేసిరి. అంతటితో యావద్భారతదేశానికి ఆయనయే యేకైక నాయకుడయ్యెను. "స్వరాజ్యము నా జన్మహక్కు, దానిని తీసుకొని తీరుతాను" అని మొట్టమొదట నిర్భయముగాను సుస్పష్టముగాను ప్రకటించిన భారతీయనాయకుడు ఆయనయే.

(6)

బెజవాడలోని స్వరాజ్యపత్రికతోపాటు ఇంతకన్న నెక్కుడు తీవ్రముగా బందరులోని కృష్ణాపత్రిక, నవయుగ అను రెండు వారపత్రికలు

వ్రాయుచుండెను. ఇవి హింసావిధానమునుకూడ సమర్థించెను. ఈ రెండు పత్రికలమీద కూడ జప్తువారంట్లు వచ్చెను. నవయుగపత్రిక సంపాదకులైన చిల్లరిగ శ్రీనివాసరావుగారు ఒక సంవత్సరమువరకు వారంటుకు అందక ఎక్కడకో పోయిరి. కృష్ణాపత్రికకు ముట్నూరి కృష్ణారావుగారు సంపాదకులైనను అది కృష్ణాజిల్లా కాంగ్రెసుకమిటీయొక్క యాజమాన్యమున నడుపబడుచుండిన పత్రిక. ఆ కమిటీకి అపుడు అధ్యక్షులుగానున్న శిడింబి హనుమంతరావుపంతులుగారు గవర్నమెంటు పబ్లికు ప్రోసిక్యూటరుగా నియమింపబడిరి. అందువల్ల వారు కృష్ణాజిల్లా మేజిస్ట్రేటుగారితో మాట్లాడి కృష్ణాపత్రికనుండి ముట్నూరి కృష్ణారావుగారిని తొలగించి, మరియొక సంపాదకుని నియమించెదమనియు పత్రికను జాగ్రత్తగా నడిపెదమనియు వాగ్దానముచేసి కృష్ణాపత్రికమీద వారంటును రద్దుచేయించిరి. అటులనే నవయుగపత్రికను పూర్తిగా నాపివైచితిమని వ్రాయించి పుచ్చుకొని చిల్లరిగ శ్రీనివాసరావుగారిమీద జారీచేయబడిన వారంటునుకూడ రద్దుపరపించిరి. మూడుసంవత్సరములకాలము కృష్ణాపత్రికకు ముట్నూరు కృష్ణారావుగారు సంపాదకులుగానుండి పత్రికను నిర్వహించిరి. డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు దానినిర్వహణలో సహాయముచేయుచుండిరి. మూడు సంవత్సరములైనపిదప కృష్ణాపత్రికమీద యాజమాన్యమును కృష్ణాజిల్లా కాంగ్రెసుకమిటీవారు వదలుకొని యావత్తు హక్కుబాధ్యతలను సంపూర్ణముగా ముట్నూరి కృష్ణారావుగారికి వదలివేసిరి. అప్పటినుంచి ముట్నూరి కృష్ణారావుగారు మరణించేవరకు కృష్ణాపత్రికకు సంపాదకులుగా నుండి దానిని మిగుల తేజోవంతముగా నడిపిరి. గాంధియుద్యమము బలపరచిరి. 1930 లోను 1932 లోను స్వతంత్రపోరాటములో జైలుకువచ్చిరి. ఇటీవల స్వర్గస్థులైరి.

1909 వ సంవత్సరములో బెజవాడలో సబుకలెక్టరుఆఫీసుహాలులో జిల్లాకలెక్టరు కోలురిడ్జి యొక దర్బారుజరిపి బిరుదముల ప్రదానమును చేసెను. మా లాయర్లలో చేరిన తాడంకి వెంకటనరసయ్యా, యం. రాజారాంరావుగార్లకు బిరుదులొసంగబడునని ఆహ్వానము వచ్చినందున లాయర్లలో చాలమందిమి ఆ సభకు వెళ్ళినాము. తాడంకి వెంకటనరసయ్యగారికి

రావుబహద్దరు బిరుదును ప్రసాదించుచు ఆయన బెజవాడ మ్యునిసిపలు చైరుమనుగ చాల పనిచేసినాడనియు, అంతేగాక బెజవాడలో కొందరు బ్రిటిషుప్రభుత్వమును పడగొట్టి ఒక రిపబ్లికును స్థాపించవలెనని ప్రయత్నములు చేయగా వాటిని ఆయన ప్రతిఘటించి బ్రిటిషుప్రభుత్వమునకు చాల సహాయముచేసినాడనియు, అందువలన ఆయనకు ప్రభుత్వమువారు రావు బహద్దరుబిరుదమును ప్రసాదించుచున్నారనియు చెప్పి, ఆ బిరుదమును ప్రసాదించెను. రాజారాంరావుగారికి రావుసాహెబు బిరుదమును ప్రసాదించుచు ఆయనకూడ బెజవాడలోని కొందరు దుండగీడులు బ్రిటిషు ప్రభుత్వమును పారద్రోలి రిపబ్లికును స్థాపించుటకు చేసిన కుట్రలను కనుక్కొని ఎప్పటికప్పుడు ప్రభుత్వయుద్యోగస్తులకు తెలుపుచు ప్రభుత్వమునకు గొప్పసేవచేసినందున ఆ బిరుదమొసంగబడినదని చెప్పెను. బ్రిటిషు సామ్రాజ్యవాదియగు ఆ ఉద్యోగస్తుడు అంత పొగరుబోతుతనముతో చెప్పిన మాటలను శాంతముగా విని యింటికి వచ్చినాము.

1908 లో తెనాలివద్ద కఠేవరములో నొక బాంబు ప్రేల్చబడెను. ఎవరికిని దెబ్బలు తగులలేదు. దానిని కోటంరాజు రాజేశ్వరరావు తయారు చేసి ప్రేల్చినాడని పోలీసువారు అనుమానపడి ఆయనను, మరోయిద్దరిని అరెస్టుచేసి కొంతకాలము జైలులోఉంచిరి. పిమ్మట సాక్ష్యములేనందున విడుదలచేసిరి.

1909 సంవత్సరం ఫిబ్రవరిలో నరసారావుపేటతాలూకా కోటప్ప కొండవద్ద జరిగిన శివరాత్రియుత్సవమునకు అదివరకే ఏటేట జరిగినటులే వేలకువేలప్రజలు పోగైరి. వారిలో చాలమంది మంచి మంచి ఎద్దులను బాగుగా నలంకరించి ప్రభలుకట్టుకొని వచ్చిరి. అటులనే చిన్నప్పరెడ్డియను రెడ్డినాయకుడు అతనిమిత్రులు మంచిఎద్దులతో గొప్పప్రభలను కట్టుకొని వచ్చినారు. పోలీసు హెడ్డుకానిస్టేబిలు ఇతర కానిస్టేబిలులు లాఆర్డరు అను పేరుతో ప్రభలుకట్టితెచ్చినవారిమీద అనవసరముగ దౌర్జన్యముచేయుచు త్రోవలు సరిగానుండవలెనని మనుష్యులను, ఎడ్లను బెత్తములతో కొట్ట సాగిరి. ఈవిధముగనే చిన్నప్పరెడ్డిమీద దౌర్జన్యముచేసి అతనిఎద్దులను కొట్టగా అవి బెదరి స్వాధీనముతప్పేస్థితిలోకి రాసాగినవి. అందుమీద

పోలీసులు తుపాకులుకాల్చి చిన్నప్పరెడ్డిఎడ్లను చంపినారు. అపుడు చిన్నప్ప రెడ్డి, అతనిమిత్రులు పోలీసులమీద గొప్ప తిరుగబాటుచేసినారు. పోలీసులు ప్రజలమీద కాల్చినారు. కొందరు హతులైనారు. ప్రజలందరు చిన్నప్ప రెడ్డితో చేరినారు. స్త్రీలుకూడ ఇనుపకడ్డీలతో పోలీసులమీదికి పోయినారు. పోలీసు హెడ్డుకానిస్టేబిలును, ఇంకా కొంతమంది కానిస్టేబిల్సును పట్టుకొని మంటలలోవేసి హత్యగావించినారు. తక్కిన పోలీసువారు, మేజస్ట్రేటు, ఉద్యోగస్థులు పారిపోయినారు. ఆసమయములో "వందేమాతరం" "బ్రిటిషు గవర్నమెంటును పారత్రోలండి, స్వరాజ్యము కావాలి" అనే నినాదాలు నలు దిశల మారుమ్రోగినవి. అల్లర్లు ముదరగానే ఎక్కడివారక్కడ వెళ్ళిపోయి నారు. చిన్నప్పరెడ్డి గొప్ప ధీరుడైనాడు. తరువాత ఆయనను, ఇంకా కొంత మందిని అరెస్టుచేసి ఉరితీసినారు. మరికొందరికి దీర్ఘశిక్షలు వేసినారు. అపుడు కెరషాస్పు సబుకలెక్టరుగ నుండెను. రాజీనామానిచ్చి వెళ్ళిపోయి నాడు. కొందరు వుద్యోగస్థులను పిరికితనముక్రింద తమపనిని సకాలములో సక్రమముగా నెరవేర్పనందుకు క్రింది ఉద్యోగములలోనికి వేసినారు. ఇది కూడ స్వరాజ్యోద్యమమునకు తోడ్పడినది. చిన్నప్పరెడ్డిని మహాధీరుడని పొగడుచు ఉద్రేకమైన కీర్తనలు కట్టబడినవి. ఇప్పటికీ ఆవైపుల ప్రజలచే పాడబడుచున్నవి.

1908 వ సంవత్సరము డిశెంబరులో మద్రాసునగరమున డాక్టర్ రసవిహారిఘోషుగారిఅధ్యక్షతను కాంగ్రెసుమహాసభ, సూరతుకాంగ్రెసు విచ్ఛిన్నమైనతరువాత అలహాబాదు కన్వెన్షనులో మితవాదులేర్పరచిన అంగ విధానప్రకారమే జరిగెను. మాకందరికీ అసంతృప్తికరముగానున్నను గత్యం తరములేక దానికి వెళ్ళితిమి. 1909 వ సంవత్సరములో బ్రిటిషుప్రభుత్వము వారు ప్రసాదించబోవుచున్న మింటో మార్లే సంస్కరణములకు సంతోష మునువెల్లడించుచు సురేంద్రనాథబెనర్జీ మొదలగునాయకులు గంభీరోపన్యాస ములుచేసిరి. ఆ సంస్కరణముల ప్రకారము రాష్ట్రశాసనసభలలో కొంత భాగముగా మాత్రము మ్యునిసిపలుసభ్యుల, జిల్లాబోర్డుసభ్యులవల్ల ఎన్ను కొనబడెడి ప్రజాప్రతినిధు లుందురు. మద్రాసు, బొంబాయి, పశ్చిమబంగాళం అను మూడురాష్ట్రప్రభుత్వాలలో ఎగ్జిక్యూటివ్‌కౌన్సిలర్లుగా ఒకొక్కక్క

భారతీయుని తీసుకొనెనరు. పిమ్మట బీహారురాష్ట్రము ప్రత్యేకించబడిన తరువాత దానికికూడ నొక భారతీయుడు ఎక్జిక్యూటివ్ కౌన్సిలరుగా నియమింపబడినాడు. కేంద్రప్రభుత్వములో నొక భారతీయుడు' ఇంగ్లాండులోని ఇండియామంత్రియొక్క కౌన్సిలులో ఇద్దరుభారతీయులు సభ్యులుగా నుండిరు. ఇంతమాత్రమునకే బ్రిటిషుప్రభుత్వపులలుపులు భారతీయులకు చెయబడినవనుల అప్పటి కాంగ్రెసునాయకులు హర్షమును వెలిబుచ్చిరి. ఆ కాంగ్రెసు నా కేమిన్ని రుచించలేదు. లోకమాన్య బాలగంగాధరతిలకుగారు బైటికివచ్చి 1916 వ సంవత్సరపు లక్నోకాంగ్రెసులో పాల్గొనేవరకు కాంగ్రెసుమహాసభలో ప్రాణమే లేకుండెను. ఆకాలములో ఆకారణముచేత నేను కాంగ్రెసు మహాసభలకు చాలవరకు పోవుట మానివేసితిని. 1911 వ సంవత్సరములో నూతనముగా రాజ్యమునకువచ్చిన పంచమ జార్జిచక్రవర్తియొక్క పట్టాభిషేకదర్బారు ఢిల్లీ లో జరిగినపుడు నేను దానికి వెళ్ళితిని ఆ దర్బారు ముగిసినపిమ్మట చక్రవర్తిగారు లేచి బంగాళావిభజనమును రద్దుపరచినామనియు, బంగాళీమాటలాడు బంగాళమును, హిందీమాటలాడు బీహారును, అస్సామీస్ మాటలాడు అస్సామును నిర్మాణము చేయుచున్నామనియు కేంద్రప్రభుత్వముయొక్కరాజధానిని కలకత్తానుంచి ఢిల్లీకి మార్చితిమనియు హర్షధ్వానములమధ్య ప్రకటించిరి. అపుడు హార్డింజ్‌ప్రభువు రాజప్రతినిధిగానుండెను. ఆయనమీద ఒక బాంబు వేసిరి. కాని అదిగురితప్పి ఆయన బ్రతికెను. 1911 డిశంబరులో కలకత్తాలో బిపిన్ నారాయణధారుగారి అధ్యక్షతక్రింద జరిగిన కాంగ్రెసుకుకూడ హాజరైతిని. కలకత్తాలో బ్రహ్మసమాజమువారేర్పాటుచేసిన సర్వవర్ణభోజనమునకు వెళ్ళి భుజించితిని. సాధారణ బ్రహ్మసమాజమందిరమునకు ప్రక్కసందులో వరుసగా కాపురమున్న మహానాయకులగు మాడరన్‌రివ్యూ పత్రికాధిపతి రామానందచటర్జీ, శశిపాదబెనర్జీ, సీతానాథ తత్వభూషణ్‌గార్ల దర్శనముచేసి అనేకవిషయములు చర్చించితిని. బ్రహ్మసమాజ ప్రార్థనలో పాల్గొంటిని. అపుడు కలకత్తాలో విద్యార్థులుగానున్న బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం, దంటు సుబ్బావధాని, ఎర్రమిల్లి జగన్నశాస్త్రి, నోరి వెంకటేశ్వర్లు, ఘంటసాల శీతారామశర్మ మొదలగు ఆంధ్రయువకులు నన్నుకలసిరి. వారందరు తీవ్రవాదులుగానుండిరి. పోలీసువారు మమ్ములనందరినీ

వెంబడించుచునేయుండిరి. 1914వ సంవత్సరము డిశంబరులో భూపేంద్రనాథ బాసుగారి అధ్యక్షతక్రింద మద్రాసులో జరిగిన కాంగ్రెసుకుహాజరైతిని. 1917వ సంవత్సరమునుండి, నేను ఆంధ్రప్రదేశ్ శాసనసభస్పీకరైన పిమ్మట 1958 లో నేను మానుకొనేవరకు, అఖిలభారత కాంగ్రెసుకమిటీకి సభ్యుడుగా విడువకుండా ఎన్నుకొనబడితిని. 1918 నుండి ఎప్పుడో తప్ప సాధారణముగా కాంగ్రెసుమహాసభలన్నిటికి హాజరగుచుంటిని. 1906 మొదలు 1920 వరకు బెజవాడ డివిజనలు కాంగ్రెసుకమిటీకి కొంతకాలము కార్యదర్శిగాను, కొంతకాలము అధ్యక్షుడుగాను చురుకుగా పనిచేసితిని. హరిసర్వోత్తమరావుగారు జైలునుంచి విడుదలైవచ్చిన 1911 నుండి మద్రాసులో నివసించుచుండిరి. కొంతకాలము కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారిచే నడుపబడుచుండిన ఆంధ్రదినపత్రికలో సంపాదకులుగ నియమింపబడిరి. పింగళి లక్ష్మీనారాయణ, బోడి నారాయణరావుగార్లుకూడ బెజవాడ విడచివెళ్ళిరి.

అనిబిసెంటమ్మగారు 1914 వ సంవత్సరమున ప్రపంచ దివ్యజ్ఞాన సమాజమునకు అధ్యక్షురాలై తీవ్ర సంఘసంస్కరణములను బోధించెను. ఆమె కాంగ్రెసుమహాసభకు అనుకూలముగా నుండెను. దానితో మా బెజవాడలోని టాడంకి వెంకట నరసయ్య, తుర్లపాటి శేషాచలపతిరావు గార్లు మొదలైన దివ్యజ్ఞానసామాజికులు కాంగ్రెసులో చేరి తీవ్ర సంఘసంస్కర్తలైరి. కొంతకాలము టాడంకి వెంకటనరసయ్యగారిని బెజవాడ డివిజనలు కాంగ్రెసుకమిటీకి అధ్యక్షుడుగా ఎన్నుకొని నేను కార్యదర్శిగా పనిచేసితిని. చుట్టుపట్టు గ్రామములకు పోయి కాంగ్రెసుసంఘములను స్థాపించుచుంటిమి. మా డివిజనలు కాంగ్రెసుకమిటీ బలమైనసంస్థగా నుండెను. మేము హరిజనులనుకూడ కాంగ్రెసులో సభ్యులుగా చేర్చుకుంటిమి. గున్నవరపూడి కాపురస్తుడు బి.ఏ. వరకు చదువుకున్న యొక హరిజన క్రైస్తవుడు మా వర్కింగు కమిటీలో నుండెను. ఉప్పులూరు సుబ్బారావుగారిని జీతమిచ్చి సంచారకార్యదర్శిగా నియమించితిమి. ఆయన శ్రద్ధగా పనిచేసెను. 1915 మొదలు 1918 వరకు నేను విజయవాడ మ్యునిసిపలుకౌన్సిలుకు సభ్యుడుగా ఎన్నుకొనబడి పనిచేసితిని. అపుడు దినవహి హనుమంతరావుగారు చైర్మను. 1918 వ

సంవత్సరమునకు పిమ్మట వచ్చిన మ్యునిసిపలు ఎన్నికలలో మరల పాల్గొన కుండా వదలివేసితిని.

(7)

1916 వ సంవత్సరములో అనిబిసెంటమ్మగారు అఖిలభారత హోంరూలులీగును స్థాపించినది. బ్రిటిషు సామ్రాజ్యములో నంతర్భాగముగ ఇండియాదేశమునకు డొమినియనుప్రతిపత్తి కలుగచేయుటయే దాని యుద్దేశ్యము. దానికి భాషాప్రయుక్తరాష్ట్రములుగా శాఖలేర్పరచి ఆంధ్రశాఖను నెలకొల్పినది. ఆంధ్రశాఖకు హరిసర్వోత్తమరావుగారు జనరలుకార్యదర్శిగా నుండి ఆంధ్రదేశమంతయు సంచారముచేసిరి. బెజవాడలోని మా దివ్యజ్ఞాన సమాజనాయకులు. ఇతర కాంగ్రెసువాదులము అందరమూ కలసి హోంరూలులీగులో పనిచేసితిమి. అనిబిసెంటమ్మగారు ఒకసారి విజయవాడ వచ్చి రామమోహనగ్రంథాలయములో నొక గొప్ప యుపన్యాసమిచ్చి వెళ్ళినది. అపుడే గుంటూరుకూడ వెళ్ళి కొండా వెంకటప్పయ్యగారిఇంట బసచేసి యుపన్యాసమిచ్చినది. అంతకుముందే లోకమాన్య బాలగంగాధరతిలకుగారు మహారాష్ట్ర హోంరూలులీగును స్థాపించియుండిరి. దానిలో వారికి ప్రియమిత్రులగు జోసెఫ్ బాప్టిస్టాగారు ప్రముఖపాత్రవహించిరి. అలహాబాదులో సుప్రసిద్ధ లాయరగు మోతీలాల్ నెహ్రూగారు అనిబిసెంటమ్మగారి అఖిల భారత హోంరూలులీగులోనే పనిచేసిరి. ఆమె నడుపుచుండిన ఆంగ్లేయ దిన పత్రిక 'న్యూ ఇండియా', వారపత్రిక 'కామన్ వీల్' తీవ్రముగా వ్రాయుచుండెను. ఆమె ఉపన్యాసములు చాల తీవ్రముగానుండెను. హిందూదేశమంతట స్వరాజ్యవాంఛ అధికమయ్యెను. ఆమె జాతీయవాదులకు, మితవాదులకు రాజీ కుదిర్చి కాంగ్రెసులో ఐక్యతను కలుగచేసెను. 1916 వ సంవత్సరము డిశంబరులో కాంగ్రెసుమహాసభ, దానితోపాటు ముస్లింలీగు లక్నోలో సమావేశమైనవి. దానికి లోకమాన్య బాలగంగాధరతిలకుగారు కూడ హాజరైరి. శాసనసభలలో ముస్లిములకు ప్రత్యేకప్రాతినిధ్యము అంగీకరించబడినది. కాంగ్రెసు-లీగు సంస్కరణముల ప్రణాలిక నొకదానిని కాంగ్రెసుమహాసభయును, ముస్లిములీగు మహాసభయును ఏకగ్రీవముగా

అంగీకరించినవి. ఆ కాంగ్రెసు-లీగు సంస్కరణములే కావలెనని యావద్భారతదేశముయొక్క అన్ని రాష్ట్రములలోను జనసామాన్యముచేత మహజరులమీద దస్కతులుచేయించసాగితిమి. ఆంధ్రదేశములో హోంరూలులీగు చాల బలముగా నుండెను. రాయలసీమలో రంగనాధమొదలియారు, గుత్తి కేశవపిళ్ళె, శివశంకరం పిళ్లె, హత్తి శివరావు, హత్తి శంకరరావు, దొరస్వామి అయ్యంగార్, పార్థసారథి అయ్యంగార్, రాజా రామారాయణంగారు, బొల్లిన మునిసామి నాయుడు, మద్రాసులో కాశీనాధుని నాగేశ్వరరావు, గద్దె రంగయ్య నాయుడు, నెల్లూరులో ఆమంచర్ల కృష్ణారావు, ఉత్తర సర్కారులలో కొండా వెంకటప్పయ్య, ఉన్నవ లక్ష్మీనారాయణ, భోగరాజు పట్టాభి సీతారామయ్య, గొల్లపూడి సీతారామశాస్త్రి, ముట్నూరు కృష్ణారావు, బెజవాడలో మేము, మోచర్ల రామచంద్రరావు, కూర్మా వెంకటరెడ్డి నాయుడు, న్యాపతి సుబ్బారావు, చిలకమర్తి లక్ష్మీనరసింహం, బులుసు సాంబమూర్తి, భూపతిరాజు వెంకటపతిరాజు, చింతలపాటి నరసింహరాజు, పూసపాటి వెంకటపతిరాజు, ఏ. పి. పాత్రో మొదలైన కాంగ్రెసునాయకు లెల్లరము హోంరూలులీగులో చేరి పనిచేసినాము.

అనిబిసెంటమ్మగారియొక్క పలుకుబడి తమప్రభుత్వమునకే మిగుల అపాయకరమని బ్రిటిషుప్రభుత్వమువారు భావించిరి. ఆమెపత్రికలమీద అనేకసార్లు ధరావతులు విధించి వాటిని స్వాధీనపర్చుకొని మొత్తముమీద ఇరవై వేలరూపాయలను ఆమెవద్దనుండి ప్రభుత్వమువారు వసూలుచేసిరి. తుదకు 1917 సంవత్సరము జూన్ 16 వ తేదీన అనిబిసెంటమ్మను, ఆమెకు కుడిభుజముగా పనిచేయుచున్న అరండేల్, వాడియాగారలను అరెస్టుచేసి ఉదకమండలములోని వారిగృహమునందే నిర్బంధవాసములో నుంచిరి. 1917 వ సంవత్సరము ఆగస్టు 20 వ తేదీన భారతదేశమునకు బాధ్యతాయుతప్రభుత్వము నిచ్చుటయే బ్రిటిషువారి ఆశయమనియు, దాని మొదటి ముఖ్యమెట్టును వెంటనే యివ్వదలచినామనియు ఇండియామంత్రి మాంటేగ్యుగారు లండనులోని పార్లమెంటులో ప్రకటించిరి. మొదటి మెట్టుగా ఏ సంస్కరణముల నివ్వవలయుననువిషయమై విచారించుటకు 1917 వ సంవత్సరము ఆఖరుభాగములో మాంటేగ్యుగారు హిందూదేశమం

తటను సంచారముచేయునట్లు నిర్ణయించబడెను. కాని అనిబిసెంటమ్మ, అరండేలు, వాడియాగార్లను ప్రభుత్వమువారు విడచిపెట్టనందున వారివిడుదలకై గొప్ప ఆందోళనసాగించితిమి. వారిని త్వరలో విడుదలచేయనిచో సాత్త్వికనిరోధమును అవలంబించనలెనను ఆలోచన వివిధ రాష్ట్రకాంగ్రెసు కమిటీలయెదుట చర్చించబడెను. మద్రాసు రాష్ట్రకాంగ్రెసు కమిటీలో సాత్త్వికనిరోధము నవలంబించవలెననియే ఆగస్టు 14 వ తేదీన తీర్మానముచేసితిమి. మద్రాసులో సాత్త్వికనిరోధప్రతిజ్ఞాపత్రికొకటి తయారు చేయబడి వివిధప్రాంతములకు దస్కతులనిమిత్తము పంపబడెను. మద్రాసు హైకోర్టుజడ్జిగానుండి ఉపకారవేతనము పొందిన ఎస్. సుబ్రహ్మణ్యఅయ్యరుగారు ఆ సాత్త్వికనిరోధకపత్రములో దస్కత్తుపెట్టిన ప్రథములు. ఆయన అదివరకే బిసెంటు, అరండేలు, వాడియాగార్ల నిర్బంధమునకు అసమ్మతిసూచకముగా తన సర్ బిరుదమును విసర్జించియుండెను. ఆయన దివ్యజ్ఞానసమాజములో ప్రముఖనాయకుడు. ఆయన అమెరికా అధ్యక్షుడైన ప్రెసిడెంటు విల్సనుకు, హిందూదేశములోని ప్రజలు బ్రిటిషుప్రభుత్వము క్రింద పడుచున్న యిక్కట్టులనుగూర్చి తీవ్రముగా నొకలేఖను వ్రాసి పంపెను. దానిమీద ఆయనతోపాటు ఆంధ్రనాయకులైన కొండా వెంకటప్పయ్య, కాశీనాధుని నాగేశ్వరరావుగార్లుకూడ దస్కతులుచేసి పంపిరి. ఆయనతరువాత హిందూపత్రికాధిపతులైన కస్తూరి రంగయ్యంగారుకూడ ఆ సాత్త్వికనిరోధకపత్రముమీద దస్కతుపెట్టిరి. పత్రమును అనిబిసెంటమ్మగారిశిష్యులగు శ్రీరామ్, శివకామమ్మగార్లు విజయవాడ తీసుకొని వచ్చిరి. తక్కిన మా మిత్రులందరునూ దానిమీద దస్కతులుచేయలేదు. కాని తాడంకి వెంకటనరసయ్యగారును, నేనును దానిమీద దస్కతులుచేసి సాత్త్వికనిరోధమును సాగించుటకు సిద్ధముగానున్నామని బహిరంగసభలో ప్రకటించితిమి. ఇంకా అనేకచోట్ల అనేకమంది దస్కతులుపెట్టిరి. తుదకు 1917 వ సంవత్సరము సెప్టెంబరు 16 వ తేదీన సాత్త్వికనిరోధము ప్రారంభించకముందే అనిబిసెంటమ్మ, అరండేలు, వాడియాగారలు నిర్బంధప్రవాసమునుంచి విడుదలచేయబడిరి.

ఆ పిమ్మట 1917 వ సంవత్సరము డిశెంబరులో కలకత్తాలో జరిగిన కాంగ్రెసుకు అనిబిసెంటమ్మగారిని అధ్యక్షురాలుగా ఎన్నుకొనిరి. ఆ కాంగ్రెసు మహాసభలోనే అఖిలభారత కాంగ్రెసుకమిటీసభ్యులుగా వెళ్ళిన డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారి ప్రతిపాదనమీద లోకమాన్య బాలగంగాధర తిలకుగారి సహాయమువల్ల మద్రాసురాష్ట్రములోని ఆంధ్ర ప్రాంతములకు ఒక ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీ నేర్పాటుచేసుకొను హక్కు ప్రసాదించబడెను. 1918వ సంవత్సరమునుండిఆంధ్రరాష్ట్రకాంగ్రెసు కమిటీ ప్రత్యేకముగా ఏర్పడి పనిచేయుచుండెను. దీనివల్ల ఆంధ్ర రాష్ట్ర సంపాదనాయత్నములో నొక పెద్ద మెట్టునెక్కితిమి. 1917వ సంవత్సరము ఆఖరునెలలో మాంటేగ్యు చెమ్సుఫర్డు గార్లు భారతదేశములోని ముఖ్యపట్టణములను దర్శించిరి. అఖిలభారత కాంగ్రెసు, అఖిలభారత ముస్లిం లీగు, అఖిలభారత హోంరూలులీగు, ఆంధ్రమహాసభ, మద్రాసు బ్రాహ్మణేతరసంఘము, జాతీయ బ్రాహ్మణేతరసంఘము, ఆదిఆంధ్రమహాసభ మొదలైన సంస్థలవారందరును వారికి తమతమ నివేదికలను అందచేసి చర్చలు జరిపిరి. కాంగ్రెసు-లీగు సంస్కరణములు కావలెనని కోరుచు దేశములోని అన్నిరాష్ట్రములనుండియు కొన్ని లక్షలమంది ప్రజలచేత దస్కతులుచేయబడిన మహజర్లు వారికి సమర్పింపబడెను. మా డివిజనలు కాంగ్రెసుకమిటీ పక్షమున మా అయిదుతాలూకాలలో పదివేలమందిచేత దస్కతులుచేయించి పంపితిమి.

(8)

1918 వ సంవత్సరారంభములో మొదటి ప్రపంచయుద్ధము తీవ్రరూపము దాల్చినపుడు జర్మనులు తురుష్కము, పారశీకము, ఆఫ్ఘనిస్థానములగుండ ఇండియామీద దండెత్తుదురని గొప్పభయము ఆంగ్లేయప్రభుత్వమునకు కలిగినందున, ఇండియాలోని రాజప్రతినిధియైన చెమ్సుఫర్డ్ ప్రభువు, ఇండియాప్రభువులును ప్రజలును బ్రిటిషుప్రభుత్వమునకు ఎక్కువగ తోడ్పడవలెనని యొక విన్నపమును పంపెను. దానినిగూర్చి ఆలోచించి తీర్మానించుటకు బొంబాయిలో అఖిలభారత కాంగ్రెసుకమిటీ అనిబిసెంటమ్మగారి

అధ్యక్షతక్రింద సమావేశమైనది. మహాత్మా గాంధి, లోకమాన్య బాలగంగాధరతిలకుగారలు కూడ ఆ సభకు వచ్చేసిరి. ఆంధ్రరాష్ట్రమునుంచి కొండా వెంకటప్పయ్యగారు, ఓరుగంటి వెంకటసుబ్బయ్యగారు, నేను మాత్రము అఖిలభారత కాంగ్రెసుకమిటీసభ్యులముగా వెళ్ళితిమి. ఆ సభలో ఎట్టి షరతులు లేకుండ బ్రిటిషువారికి ఇండియాప్రజలందరు తోడ్పడవలెనని యొక తీర్మానమును సి.పి. రామస్వామిఅయ్యరుగారు ప్రతిపాదించినారు. మితవాదియగు గోవిందరాఘవయ్యరుగారు దానిని బలపరచినారు. కాని లోకమాన్య బాలగంగాధరతిలకుగారు యుద్ధము జయప్రదముగా ముగియగనే హిందూదేశమునకు స్వరాజ్యమిచ్చెదమని బ్రిటిషువారు వాగ్దత్తముచేసినచో మాత్రమే బ్రిటిషుప్రభుత్వమునకు ఈ యుద్ధములో హిందూదేశప్రజలు, ప్రభువులు సహాయముచేయవలెననియు, అటుల వాగ్దత్తముచేయనిచో సహాయముచేయనక్కరలేదనియు నొక సవరణ నుపపాదించిరి. ఆ సవరణను చిత్తరంజన్‌దాసుగారు బలపరచిరి. మహాత్మా గాంధిగారు బ్రిటిషువారు ఆపత్తులోనున్నసమయములో ఎట్టిషరతులు లేకుండ సహాయముచేసితీరవలెనని గట్టిగా వాదించిరి. న్యాపతి సుబ్బారావుపంతులు, జి.ఎ. నటేశన్ మొదలైన మితవాదులుకూడ అటులనే చెప్పిరి. మేము కొందరము తిలకుగారిసవరణను బలపరచితిమి. ఓట్లు తీసుకొనబడగా అసలుతీర్మానముకంటె తిలకుగారిసవరణకు నాలుగు ఓట్లు ఎక్కువవచ్చెను. ఆంధ్రదేశమునుంచి వెళ్ళిన ముగ్గురుప్రతినిధులు—కొండా వెంకటప్పయ్య, ఓరుగంటి వెంకటసుబ్బయ్యగార్లును, నేనును తిలకుగారిపక్షముననే ఓటుచేసితిమి. కాని యిట్టి అత్యంత ప్రాముఖ్యమైనసమస్యమీద అఖిలభారత కాంగ్రెసు కమిటీలో నాలుగుఓట్లతో మాత్రమే తాను గెలుచుటవల్ల ప్రయోజనమేమియు నుండదనియు, తాను తనసవరణ నుపసంహరించుకుంటున్నాననియు, ఇష్టమువచ్చినవారు సహాయముచేయవచ్చుననియు తిలకుమహాశయుడు చెప్పి తనసవరణ నుపసంహరించుకొనెను. అసలు తీర్మానమే ఎట్టి వ్యతిరేకతలేకుండ మంజూరుచేయబడినది. తిలకుగారును, వారితోపాటు సవరణకనుకూలముగ సమ్మతులనిచ్చినవారమును తటస్థముగ యూరకుంటిమి. అంతటితో ఆ సభ ముగిసెను. అమరునాడుదయమున

కొండా వెంకటప్పయ్యపంతులుగారు, ఓరుగంటి వెంకటసుబ్బయ్యగారు, నేను కలసి సర్దారుగృహములో బసచేసియున్న లోకమాన్య బాలగంగాధర తిలకుగారి దర్శనముచేసితిమి. వారు మమ్ముల నెంతో దయతో ఆదరించెను. ప్రత్యేకాంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీనిర్మాణతీర్మానమునకు కలకత్తాకాంగ్రెసులో మద్దతునిచ్చి ఆ తీర్మానమును గెలిపించి, ఆంధ్రులకు ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రకాంగ్రెసుకమిటీని ప్రసాదించినందుకు తిలకుమహాశయునికి ఆంధ్రుల పక్షమున కృతజ్ఞత తెలిపితిమి. అచిరకాలములో ప్రత్యేక ఆంధ్రరాష్ట్రము కూడ ఏర్పాటుజరుగుటకు తిలకుమహాశయుని యాశీర్వచనమును, సహాయమును అభ్యర్థించితిమి. వారు తమకు ఆంధ్రులపట్ల చాల సానుభూతి యున్నదనియు, ఆంధ్రులు, మహారాష్ట్రులు, కన్నడులు ఒకప్పుడు ఒకేజాతి వారనియు, ఆంధ్రరాష్ట్రనిర్మాణవిషయములో తాను శక్తివంచనలేకుండ సహాయముచేసెదననియు, కాని అది యంతయు మనకు స్వరాజ్యమురానం దున బ్రిటిషువారిచేతిలోనే యున్నదనియు సెలవిచ్చిరి. అప్పటికే వారికి దేహములో కొంత అస్వస్థతగనుండెను. వారివద్ద సెలవుతీసుకొని మేము ముగ్గురము ఆంధ్రదేశమునకు వచ్చితిమి.

1918 వ సంవత్సరము జూన్‌లో ఏ ఏ సంస్కరణములను ప్రసాదించుటకు తాము యోచించుచున్నారో ఆ రిపోర్టును మాంటేగ్యు, చెమ్సుఫర్డ్ గారలు ప్రకటించిరి. అందులో భారతకేంద్రప్రభుత్వములో భారతీయుల కెట్టి యధికారము నొసంగకుండగనే రాష్ట్రములలోమాత్రము కొన్నిశాఖలను ప్రజలచే ఎన్నుకొనబడిన శాసనసభకు బాధ్యతవహించెడి మంత్రులకు వశముచేసెదమనియు, మిగిలినశాఖలను కొన్నిసంవత్సరములవరకు ఆంగ్లేయప్రభుత్వప్రతినిధులగు ఎగ్జిక్యూటివుకౌన్సిలరులచేతిలోనే యుంచెద మనియు, పదిసంవత్సరములపిమ్మట సంస్కరణలను వృద్ధిచేయువిషయము లలో విచారణచేసి యిప్పుడిప్పటోయెడు సంస్కరణములను బాగుగ ప్రజా నిధులు పాలించినారని ఋజువైనచో రాష్ట్రములలోని మిగతాశాఖలనుకూడ మంత్రులవశముచేయుటకు యోచించెదమనియు అందులో వ్రాసిరి. అది వరకు కలకత్తాకాంగ్రెసుఅధ్యక్షురాలుగా అనిబిసెంటమ్మగారు తన యధ్యక్షోప న్యాసములో బ్రిటిషుకామన్వెల్తులో నొకభాగముగా భారతదేశమునకు

డొమినియను ప్రతిపత్తి—(సంపూర్ణస్వపరిపాలన)ను 1923 వ సంవత్సరము లోపలనే—ఆఖరుకు 1928 వ సంవత్సరములోపలనైనను స్థాపించునట్లు బ్రిటిషుపార్లమెంటులో ఒకబిల్లును 1918 సంవత్సరములోనే ప్రవేశపెట్టవలె నని బ్రిటిషుప్రభుత్వమును కోరెను. అందువల్ల మాంటేగ్యు, చెమ్సుఫర్డ్ గార్ల రిపోర్టు బయటపడగానే అందులో సూచించబడిన సంస్కరణలప్రాతిపదిక బ్రిటిషువారు యివ్వదగినవి కాని, భారతీయులు పుచ్చుకొనదగినవి కాని కావని ప్రకటనచేసెను. 1918 వ సంవత్సరము ఆగస్టు 29 వ తేదీన ప్రత్యేక కాంగ్రెసుమహాసభ బొంబాయిలో హసను ఇమాంగారిఅధ్యక్షతను జరిగినది. ఈయనసోదరుడైన . ఆలీ ఇమాంగారు కొంతకాలము హైదరాబాదు నైజాంగారివద్ద దివానుగా పనిచేసి, ఆకాలములోనే కార్యనిర్వాహక శాఖనుండి న్యాయవిచారణశాఖను విడదీసెను. బొంబాయి ప్రత్యేక కాంగ్రెసు మహాసభకు ఆంధ్రదేశమునుండి జాతీయవాదులమైన కొండా వెంకటప్పయ్య, పట్టాభిసీతారామయ్యగార్లు, నేను వెళ్ళి విషయనిర్ణయకసభలో పాల్గొంటిమి. న్యాపతి సుబ్బారావు, మోచర్ల రామచంద్రరావు, జి. ఏ. నటేశన్‌గార్లు మొదలైన మితవాదనాయకులు మాంటుఫర్డ్‌రిపోర్టును అంగీకరించవలెనని వాదించిరి. ఆ సంస్కరణములు అసంతృప్తికరముగను, ఆశాభంగకరముగను వున్నందున తిరస్కరించవలెనని జాతీయవాదులము చెప్పితిమి. అవి కొన్నివిషయములలో బాధ్యతాయుతప్రభుత్వమును స్థాపించుటకు యత్నించినను మొత్తముమీద ఆశాభంగకరముగను అసంతృప్తికరముగను వున్నవి గాన భారతకేంద్రప్రభుత్వములోకూడ దేశరక్షణ, విదేశవ్యవహారములు, సంస్థానాధీశులతో సంబంధములు అను మూడుశాఖలు మాత్రము 15 సంవత్సరములకాలము బ్రిటిషుప్రభుత్వపుచేతిలో నుంచుకొని, మిగతశాఖలన్నియు శాసనసభకు బాధ్యతవహించెడి మంత్రులకు వెంటనే వప్పగింతచేయవలెననియు, రాష్ట్రములలో న్యాయశాఖ, పోలీసుశాఖలను ఆరుసంవత్సరములవరకు మాత్రము బ్రిటిషుప్రభుత్వముక్రింద నుంచుకొనవచ్చుననియు, మిగతశాఖలన్నియు వెంటనే మంత్రులవశముచేయవలెననియు నొక రాజీతీర్మానము ఏకగ్రీవముగా మంజూరుచేయబడెను. రౌలటుకమిటీ ఏర్పాటు తీవ్రముగా ఖండించబడెను.

పిమ్మట 1918 సంవత్సరము డిశంబరులో పండిత మదనమోహన మాలవ్యాగారి అధ్యక్షతను జరిగిన కాంగ్రెసుమహాసభలో రౌలటుకమిటీ యేర్పాటు ఏకగ్రీవముగ ఖండింపబడినది. కాని సంస్కరణములవిషయములో జాతీయవాదులకును, మితవాదులకును అభిప్రాయభేదములు ఎక్కువైనవి. బొంబాయి కాంగ్రెసుతీర్మానములో ఆశాభంగకరముగను అసంతృప్తికరముగను వున్నవనుమాటలను తీసివేయవలెనని మితవాదులు కోరగా అత్యధికసంఖ్యాకులు ఒప్పుకొనలేదు. రాష్ట్రములలో ఆరుసంవత్సరముల వరకు న్యాయ పోలీసుశాఖలు బ్రిటిషుప్రభుత్వముక్రింద వుండవచ్చునను మాటలను తీసివేసి అన్నిశాఖలను వెంటనే మంత్రులవశముచేయవలెనను సవరణను జాతీయవాదులు పెట్టగా, మితవాదులు దీనిని ప్రతిఘటించినను ఆ సవరణ అత్యధికసంఖ్యాకులచే ఆమోదించబడినది. కాంగ్రెసు మితవాదుల చేతులలోనుంచి పోయినట్లుల స్పష్టపడినది. అపుడు తిలకుగారు సర్ వాలంటైన్ షిరాలుమీద దాఖలుచేసిన మాననష్టపుదావాలో పనిచేయుచు ఇంగ్లాండులో నుండిరి. అయినను జాతీయవాదులు తేలికగా కాంగ్రెసులో నెగ్గిరి.

(9)

హోంరూలు ఉద్యమకాలములో ఆంధ్రదేశప్రజలలో విజ్ఞానమునే గాక రాజకీయచైతన్యమునుకూడ పెంపొందింపచేయుటలో ఆంధ్ర గ్రంథాలయోద్యమము మిగుల తోడ్పడినది. గ్రంథాలయోద్యమము 1914వ సం॥లో సూరి వెంకటనరసింహశాస్త్రి, అయ్యంకి వెంకటరమణయ్యగారల యాజమాన్యముక్రింద ప్రారంభింపబడినది. వారిద్దరు ఆ ఉద్యమమునకు ప్రాణములని చెప్పతగిన వారు. 1919 వ సంవత్సరములో మహాత్మా గాంధీగారి సత్యాగ్రహోద్యమములో చేరువరకు నేనుకూడ ఆ ఉద్యమమునకు ఎక్కువగా తోడ్పడితిని. దాని కేంద్రస్థానము బెజవాడ గవర్నరుపేటలోని రామమోహన ఉచిత గ్రంథాలయము. దాని చరిత్ర, అభివృద్ధి గ్రంథాలయోద్యమ చరిత్రలో ప్రధానస్థానమాక్రమించుచున్నది. కనుక దానిచరిత్ర క్లుప్తముగా నిచట చెప్పుట యావశ్యకము.

రామమోహన ఉచిత గ్రంథాలయమును 1911 వ సం॥లోనే కొందరు మిత్రులము కలసి స్థాపించినాము. సూరి వెంకటనరసింహశాస్త్రిగారిని అధ్యక్షుడుగను, అయ్యంకి వెంకటరమణయ్యగారిని కార్యదర్శిగను ఎన్నుకున్నాము. నేను, శంకర వెంకట్రామయ్య, గోపరాజు బ్రహ్మానందం, పాటిబండ్ల సుబ్రహ్మణ్యం మొదలైనవారము కార్యనిర్వాహకవర్గముగా నేర్పడితిమి. దానిని కొంతకాలము అరండల్ సత్రమునకు సమీపమున యొక కొట్టులో సాగిచింతిమి. 8-5-13 వ తేదీన దానిని రిజిస్టరుచేయించితిమి. 10-4-13 వ తేదీన బెజవాడ మ్యునిసిపాలిటీవారు గవర్నరుపేటలోని తమస్థలమును బహిరంగవేలమునకు పెట్టగా మావద్ద ధనమేమీ లేకపోయినను 2 వేల 191 చతురపుగజములస్థలమును 3 వేల 324 రూపాయలకు గ్రంథాలయముపేర కొట్టివేయించుకొంటిమి. వెంటనే మూడవవంతు క్రయధనము మునిసిపాలిటీకి కట్టవలసియున్నందున బెజవాడలో ప్రముఖ న్యాయవాది యగు బొడ్డపాటి వెంకటప్పయ్యగారివద్ద నేను ప్రామిసరీనోటు వ్రాసి ఆరువందలరూపాయలు అప్పుతీసుకొనివచ్చి యివ్వగ దానిని, చందాలవల్ల వసూలయిన మిగతసొమ్మును కలిపి మునిసిపాలిటీకి కట్టితిమి. మిగత క్రయధనమును మునిసిపాలిటీకి చెల్లించుటకును, ఇతర చిల్లరఖర్చులకును సొమ్ము కావలసివచ్చినది. అందుకుగాను నావద్ద కక్షిదారుగానున్న దూపగుంట వెంకటపిచ్చయ్య అను షాహుకారువద్ద నేను ప్రామిసరీనోటు వ్రాసి 2,500 ల రూప్యములను అప్పుతెచ్చి గ్రంథాలయకమిటీవారి కిచ్చితిని. దానితో మునిసిపలుస్థలము గ్రంథాలయముపేర విక్రయదస్తావేజు పుట్టి గ్రంథాలయమునకు స్వాధీనమైనది.

ఆ సంవత్సరమే నవంబరులో గవర్నరుపేటలోని యొకేవార్డుకు మునిసిపలుసభ్యత్వముకొరకై అభ్యర్థులముగా బొడ్డపాటి వెంకటప్పయ్యగారు నేను నామినేషన్లు దాఖలుచేసితిమి. అపుడు ఎన్నికలు రాజకీయపార్టీల పక్షమున జరుగుటలేదు. వ్యక్తిపరముగానే నామినేషనులు దాఖలుచేసి ఎన్నికలప్రచారము సాగించితిమి. నాకే జయము తథ్యముగ కనపడినది. కాని గ్రంథాలయపు ఋణము తీరవలసియున్నది. బొడ్డపాటి వెంకటప్పయ్యగారు కూడ సమర్థులు, మంచివారు, నాకంటె ఎక్కువ శ్రద్ధగా మునిసిపలుకౌన్సి

లరువిధులను నిర్వహించెదరు. నాకు బహువ్యాపకమున్నది. ఆయన బస్తీ లోనిపనులు శ్రద్ధగాను, బాగుగాను చెయ్యగలరని తలచి నేను సూరి వెంకటనరసింహశాస్త్రిగారితోను, అయ్యంకి వెంకటరమణయ్యగారితోను సంప్రతించి వెంకటప్పయ్యగారు గ్రంథాలయమునకు అయిదువందలరూప్య ముల నిచ్చినట్లయిన, నేను నా మునిసిపలుకౌన్సిలుఅభ్యర్థిత్వమును వదలు కొందునని వెంకటరమణయ్యగారిద్వారా కబురంపితిని. వారు సంతోషముగ అయిదువందలరూప్యములను నేను వారికి వ్రాసియిచ్చిన ప్రామిసరీనోటు క్రింద జమకట్టుటకంగీకరించిరి. వెంకటప్పయ్యగారికి మిగిలిన అసలు నూరు రూప్యములబాకీని గ్రంథాలయపు నా చందాక్రింద నేనే వారికిచ్చి ఆ నోటును రద్దుచేయించి తీసుకొంటిని. వారు వడ్డీని వదలుకొనిరి. నేను నా అభ్యర్థిత్వ మును వదులుకొంటిని. ఆయన పోటీలేకుండా మునిసిపలుకౌన్సిలుసభ్యులుగా ఎన్నుకొనబడిరి. తదనంతరము కొన్నినెలలకు వెంట్రప్రగడ ఎస్టేటుదివా నుగానున్న వారిబావ రామమూర్తిగారు లౌక వ్యవహారములో చిక్కుకొనెను. అవతలిపార్టీవారు నాకు కక్షిదారులుగా నుండిరి. నేను ఉభయపక్షములమధ్య రాజీచేసి తనను చిక్కులలోనుంచి తప్పించవలెనని రామమూర్తిగారును, వెంట్రప్రగడరాజాగారిబంధువులును నావద్దకు వచ్చి బతిమిలాడిరి. రామ మూర్తిగారు వెయ్యినూటపదహారురూపాయలు రామమోహనగ్రంథాల యమున కిచ్చినట్లయిన నా పార్టీతో చెప్పి ఎటులనో యొప్పించి రాజీచేసి రామమూర్తిగారి కెట్టి యిబ్బందిలేకుండ చేసెదనని చెప్పితిని. వారు రు. 1,116 లు రామమోహనగ్రంథాలయాధ్యక్షుల కిచ్చిరి. అందుమీద నేను ఆ వ్యవహారమును రాజీపరచి రామమూర్తిగారిని చిక్కులలోనుంచి తప్పించి తిని. ఇది కాక మేమందరము చందాలనిచ్చియు వసూలుచేసియు సొమ్ము భర్తీచేసి స్థలముయొక్క క్రయధనమునకుగాను దూపగుంట వెంకటపిచ్చయ్యగారివద్ద తెచ్చిన ఋణమునంతను తీర్చివేసినాము. మేము ఆయనకుకూడ వడ్డీ చెల్లించలేదు. ఆ వడ్డీ మొత్తమును గ్రంథాలయమునకు ఆయనచందాక్రింద జమకట్టుకుంటామని నేను చెప్పగ ఆయన నా మాటను త్రోసివేయక ఒప్పుకున్నాడు. అసలుసొమ్ము చెల్లించి ఆ నోటును రద్దుపర్చు కున్నాము. ఆ వడ్డీని ఆయన చెల్లించినచందాయని జమకట్టుకున్నాము.

ఆ సంవత్సరముననే తిరువూరుజమీందారగు రాజా వెల్లంకి చినవెంకట రామారావుబహద్దూరుగారు ఆ స్థలములో గ్రంథాలయభవనమును తమ స్వంత ఖర్చుమీద కట్టించియిచ్చెదమని వాగ్దానముచేసిరి. వారు బొడ్డపాటి వెంకటప్పయ్యగారి కక్షిదారు. అది వెంకటప్పయ్యగారిప్రోత్సాహమువలన జరిగినది. 1—9—1913 తేదీన మద్రాసుగవర్నరుగారి కార్యనిర్వాహకసభ్యులగు శ్రీ పి. ఎస్. శివస్వామిఅయ్యరుగారిచేత గ్రంథాలయభవనమునకు పునాదిరాతిని వేయించితిమి. తిరువూరుజమీందారుగారు రెండువేల నూరు రూపాయలు విరాళమునివ్వగా భవననిర్మాణము ప్రారంభింపబడి సాగుతూ వచ్చినది. ఆ సమయములో దురదృష్టవశాత్తు ఆ జమీందారుగారు పిన్న వయస్సులోనే దివికేగుట తటస్థించినది. వారు దయచేసిన సొమ్ముగాక ఇంకను అయిదువేలరూపాయలవరకు భవననిర్మాణముకొరకు కావలసియుండెను. ఒక వెయ్యిరూపాయలు వెంటనే విరాళములవల్ల వసూలుచేసితిమి. మిగతా నాలుగువేలరూప్యములను నేను, సూరి వెంకటనరసింహశాస్త్రిగారు, అయ్యంకి వెంకటరమణయ్యగారు కలసి ప్రామిసరీనోటు వ్రాసి బొడ్డపాటి వెంకటప్పయ్యగారివద్ద ఋణముతెచ్చి ఖర్చుపెట్టి గ్రంథాలయభవనమును పూర్తిచేయించితిమి. కొలదికాలములోనే చందాలను వసూలుచేసి ఆ ఋణమును తీర్చినాము. వెంకటప్పయ్యగారు మరల వడ్డీ తీసివేసిరి. 1914 వ సంవత్సరము ఆఖరుకు గ్రంథాలయ భవననిర్మాణము చాలవరకు పూర్తియైనది. ఆ స్థితిలో గ్రంథాలయమును నూతనభవనములోనికి మార్చినాము. దాని నిర్మాణము పూర్తియైన తదుపరి నూతనభవనప్రవేశమహోత్సవమును వరంగల్లుకు సమీపముననున్న వడ్డేపల్లి దేశముఖులును, నా కక్షిదారులును, నాకు మిత్రులునగు పింగళి వెంకటరామరెడ్డిగారిఅధ్యక్షతక్రింద 13—1—1916వ తేదీన చాల వైభవముగా జరిపినాము. వారుకూడ అయిదువందలరూప్యముల విరాళము నిచ్చిరి. ఆ మహోత్సవసందర్భములోనే రాయప్రోలు సుబ్బారావుగారు తాము రచించిన ఆంధ్రాభిమానపూరితమైన పద్యములను శ్రావ్యముగా పాడి సభికులందరిని ఆనందింపచేసినారు. అప్పటినుంచి ఆ గ్రంథాలయమునకు సూరి వెంకటనరసింహశాస్త్రిగారు అధ్యక్షులుగను, అయ్యంకి వెంకటరమణయ్యగారు కార్యదర్శిగను, గోపరాజు బ్రహ్మానందంగారు సహాయ

కార్యదర్శిగను, నేను, దంటు సుబ్బావధాని, బొడ్డపాటి వెంకటప్పయ్య మొదలైనవారము కార్యనిర్వాహకవర్గసభ్యులుగాను 1919 వ సంవత్సరముఆఖరు వరకు పనిచేసితిమి. రామమోహనగ్రంథాలయవార్షికోత్సవములు వైభవముగ జరిగెను. మోచర్ల రామచంద్రరావు, కొండా వెంకటప్పయ్య, ఖయ్యా నరసింహేశ్వరశర్మగార్లు మొదలగు పేరుగన్న ప్రముఖులు వచ్చి అధ్యక్షతవహించిరి.

1917 వ సంవత్సరములో జరిగిన వార్షికోత్సవసభలో బెజవాడ కాపురస్థులు, ధనికులు నగు కౌతా సూర్యనారాయణరావుగారు గ్రంథాలయము మీద రెండవయంతస్థునంతను తాము కట్టించియిచ్చెదమని వాగ్దానమొనరించిరి. వారు నాకు ముఖ్యస్నేహితులే కాక, వారివ్యవహారములన్నిటిలోను నేను వారికి వకీలుగా నుంటిని. తమతల్లిగారిపేర కొంత దానధర్మముచేయవలెనని వారు నాతో చెప్పగా రామమోహనగ్రంథాలయముమీద మేడను కట్టించి యివ్వవలసినదని నేను వారికి సలహానిచ్చితిని. నా మాటమీద వారు అటుల వాగ్దానముచేసిరి. ఏడువేలరూప్యములవరకు ఖర్చుపెట్టి వారు మేడలో చాలభాగము కట్టించిరి. కాని ఆ మేడకు వారిపేరుపెట్టువిషయములో శంకర వెంకట్రామయ్యగారు, మరి కొందరుసభ్యులు గ్రంథాలయ సర్వసభ్య సమావేశములో తగవులుపెట్టుటయే గాక, వారిపేరు పెట్టకూడదని శంకర వెంకట్రామయ్యగారు కోర్టులో దావావేసిరి. మొదటి రెండుకోర్టులలో వారే గెలిచిరి. హైకోర్టులో సూర్యనారాయణరావుగారే గెలిచిరి, గాని సూర్యనారాయణరావుగారు మిగిలినసొమ్ము యివ్వడం మానివేసిరి. నేను వారిపేరు పెట్టుటయే న్యాయమని చెప్పినవాడను. ఇంక కొంతసొమ్మును గ్రంథాలయసంఘమువారే ఖర్చుపెట్టి మేడను పూర్తిచేసిరి. సూర్యనారాయణరావుగారిపేరులతో వ్రాయబడిన బోర్డులు ఇప్పటికిని అలాగే ఉన్నవి. కాని సూర్యనారాయణరావుగారిధర్మమువల్ల కట్టబడిన మేడ మాత్రము ప్రజలందరు వినియోగించుకొని సభలుచేయుచున్నారు. సూర్యనారాయణరావుగారి దాతృత్వము మిగుల ప్రశంసనీయము.

1914 వ సంవత్సరములో ఆంధ్రప్రజలలో జ్ఞానాభివృద్ధిని, రాజకీయ సాంఘికచైతన్యమును కలుగచేయునుద్దేశ్యముతో ఆంధ్రదేశ గ్రంథాలయో

ద్యమమును స్థాపించుటకు నిశ్చయించితిమి. అప్పటికే ఆంధ్రభాషలో నవీన విజ్ఞానము నిచ్చుటకు విజ్ఞానచంద్రికామండలి స్థాపింపబడి బహుచక్కగా పనిచేయుచుండెను. చారిత్రకగ్రంథములును, ప్రకృతిశాస్త్రగ్రంథములును, చరిత్రాత్మకనవలలును వెలువడుచుండెను. ఇంకా కొన్ని గ్రంథమండలులు కూడ పనిచేయుచుండెను. విజ్ఞానచంద్రికాపరిషత్తుక్రింద పల్లెటూళ్లలోని స్త్రీ పురుషులలో నవీన ఆంధ్రగ్రంథముల విజ్ఞానమును వ్యాపింపచేయుటకై పరీక్షలనుకూడ పెట్టితిమి, బహుమతుల నిచ్చితిమి. 1914 వ సంవత్సరము వేసంగిలో రెండవ ఆంధ్రమహాసభ సమావేశము బెజవాడలో జరుగనున్నది. ఆ కాలముననే ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ ప్రథమసమావేశము బెజవాడలో జరుపుటకు నిశ్చయించితిమి. కంచుకూరి వీరేశలింగంపంతులుగారి కుడిభుజము, సుప్రసిద్ధ కవి, నవలారచయిత, జాతీయనాయకుడునైన చిలకమర్తి లక్ష్మీనరసింహంగారిని అధ్యక్షుడుగా ఎన్నుకొంటిమి. బెజవాడలో ద్వితీయ ఆంధ్రమహాసభతోపాటు ప్రథమాంధ్రగ్రంథాలయమహాసభకూడ ఉత్సాహముగ జరిగెను, గాని నా కపుడు చాల జబ్బుచేసి వైద్యచికిత్సకొరకు మద్రాసుకు, అప్పటినుండి నీలగిరికి పోవలసివచ్చినది. నేను బెజవాడలో ఆ శుభసమయమున లేను. ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమభారమునంతను సూరి నరసింహము, అయ్యంకి వెంకటరమణయ్యగారలు తమమీద పెట్టుకొనిరి. దానిని వారిద్దరు జీవితపరమావధిగా చేసుకొనిరి. అప్పటినుంచి ఆంధ్ర గ్రంథాలయమహాసభలు, జిల్లామహాసభలు, తాలూకామహాసభలుకూడ ఏటేట ఆంధ్రదేశములో జరుగుచూవచ్చినవి. అనేక వందల గ్రంథాలయములు, పఠనమందిరములు ఆంధ్రదేశమంతట స్థాపింపబడినవి. ప్రతి చోటను యువకులు ఉత్సాహముతో పనిచేసినారు. నేను, దంటు సుబ్బావధానిగారుకూడ ప్రథమమునుంచి 1919 వ సంవత్సరమువరకు గ్రంథాలయోద్యమమునకు చాల తోడ్పడితిమి. అనేకచోట్లకు బెజవాడ నుంచి మా నలుగురిని కాని, వీలువెంట మాలో ఎవరినో ఇద్దరిని కాని గ్రంథాలయకార్యకర్తలు తీసుకొనివెళ్ళి గ్రంథాలయములను తెరపించుటయో, వార్షికోత్సవములు కాని, సభలుకాని జరిపించుటయో గావించిరి. నేను అధ్యక్షుడుగనుండుట గాని, ప్రారంభోత్సవముచేయుట కాని, ఉపన్యసిం

చుట కాని చాల చోట్ల జరిగెను. ఆకాలములో హోంరూలు ఉద్యమము తీవ్రముగ సాగుచుండెను. అందులో నేను బెజవాడలో ప్రధానపాత్ర వహించియుంటిని. నేను గ్రంథాలయములసందర్భంలో వెళ్ళినచోట్లనెల్ల హోంరూలుఉద్యమమును, స్వరాజ్యసంపాదనాప్రయత్నమును బలపరచి ఉపన్యసించితిని. స్వరాజ్యోద్యమమును వ్యాపింపచేయుటకు నే నా అవ కాశమును తప్పకుండా వినియోగించితిని.

బాగుగా జ్ఞాపకమున్న కొన్ని ఉదాహరణము లిచ్చుచున్నాను. పశ్చిమ గోదావరిజిల్లా భీమవరములోని టౌనుహాలులో నన్నయభట్టారక గ్రంథాలయ మునకు నాచేత ప్రారంభోత్సవము చేయించిరి. అక్కడ ప్లీడరుగానున్న ములుకుట్ల సుబ్బారాయుడుగారు అధ్యక్షతవహించిరి. ఆత్మకూరి గోవిందా చార్యులుగా రుపన్యసించిరి. కుముదవల్లిలోని వీరేశలింగం గ్రంథాలయం వార్షికోత్సవమున కధ్యక్షతవహించితిని. భీమవరములోని మరియొక గ్రంథా లయముకూడ నాచేతనే తెరిపించిరి. నెల్లూరుజిల్లాలోని పొట్లపూడిలో పొణ కావారిసంస్థానము మిగుల ప్రసిద్ధికెక్కినది. విదుషీమణి యగు శ్రీమతి పొణకా కనకమ్మగారు గ్రంథాలయఉద్యమమునందును, హోంరూలుఉద్యమ మునందును మిగుల శ్రద్ధాభక్తుల కలిగియుండెను. నన్ను, సూరి వెంకట నరసింహశాస్త్రిగారిని, అయ్యంకి వెంకటరమణయ్యగారిని, దంటు సుబ్బావధాని గారిని తీసుకొనివెళ్ళి గ్రంథాలయవార్షికోత్సవమును కడు వైభవముగా జరి పించినది. మేమందరము ఉపన్యాసముల నిచ్చినాము. వారు మాకు చేసిన సత్కారము మరువరానిది. ఆమె తన జీవితమును దేశసేవకు అంకితముచేసిన సాధ్వి. కాంగ్రెసుఉద్యమములో ధీరత్వముతో పాల్గొని పెక్కుసార్లు కారా గృహములకు జని, యిపుడు నెల్లూరులోని కస్తూరిబా స్త్రీల యున్నతపాఠ శాలను మిగుల ప్రశస్తముగ నిర్వహించుచున్నది. ఒకసారి మేము — నేను, సూరి వెంకటనరసింహశాస్త్రి, అయ్యంకి వెంకటరమణయ్య, దంటు సుబ్బా వధాని....నలుగురము భీమవరముతాలూకాలో కాలువమీద పడవలో సంచా రముచేసి కొన్నిగ్రామములను దర్శించి గ్రంథాలయములు లేనిచోట్ల గ్రంథాలయములు స్థాపించియు, గ్రంథాలయములున్నచోట్ల వాటిని దర్శించి సభలుజరిపి కార్యకర్తలను ప్రోత్సహించియు గొప్ప సంచలనము కలుగ

జేసినాము. మేమపుడు దర్శించిన గొల్లలకోడేరు, యండగండి, గరగపర్రు, పిప్పర, చిన్న కాకినాడ మొదలైన గ్రామములు ఇప్పటికిని నాకు జ్ఞాపక మున్నవి. పిప్పరలో మంగిపూడి వెంకటశర్మగారు మాకు బాగా స్నేహితు లైరి. వారు మంచికవీశ్వరులు, దేశాభిమానులు. సంఘసంస్కర్త. చిన్న కాకినాడ వెళ్ళినపుడు అచటి గ్రామమునసబు రాజుగారు పాముమంత్రములో ప్రసిద్ధిచెందియుండిరి. పాములు కరచినవారలందరును వారిమంత్రమువల్ల ఆరోగ్యమును పొందిరి. ఒకసారి గుంటూరుజిల్లాలోని కొన్ని గ్రంథాలయ ములను దర్శించితిమి. కుప్పా శ్రీరామశర్మగారు తమ గ్రామమైన అనంత వరముకు మమ్ములను తీసుకొనివెళ్ళి గ్రంథాలయవార్షికోత్సవమును జరిపిరి. అది వేసంగి. అక్కడినుంచి ఆ మరునాడు సాయంత్రము చల్లనివేళ కృష్ణా నదిలోని ఇసుకలో మేము చాలమంది మిత్రులము నడచి అవతలి ఒడ్డున నున్న కృష్ణాజిల్లాలోని దివితాలూకాకు చేరిన ప్రయాణం నాకు జ్ఞాపకము వచ్చుచున్నది. త్రోవలో మిత్రులగు శరణు రామస్వామి చౌదరిగారు తమ గ్రామమైన అమృతలూరుకు తీసుకొనివెళ్లి అచటిగ్రంథాలయమును, అన్ని వర్ణములకు విద్యనిచ్చుచున్న సంస్కృతపాఠశాలను చూపిరి. శరణు రామ స్వామిచౌదరిగారు మంచి గ్రంథకర్త, సుప్రసిద్ధ కాంగ్రెసువాది. 1915 మొదలు 1919 వరకు గ్రంథాలయోద్యమము ఆంధ్రదేశములో తీవ్రముగా పనిచేసినది. రాజకీయచైతన్యమును, దేశాభిమానమును దేశసేవాభిలాషను గ్రామములలో బాగుగా పెంపొందచేసినది. సూరి వెంకటనరశింహ శాస్త్రిగారు మంచి పండితుడు, విజ్ఞుడు. దంటు సుబ్బావధానిగారు మంచి వైద్యుడే గాక హృద్యమైన పద్యములను రచించి శ్రావ్యముగ పాడేవారు. నేను ఎక్కువగా రాజకీయచైతన్యము కలుగజేయుటకు ప్రయత్నించేవాడను. వెంకటరమ ణయ్యగారు గ్రంథాలయనిర్మాణమునుగురించి శ్రద్ధవహించేవారు.

రామమోహనగ్రంథాలయములో స్త్రీలశాఖ, పిల్లలశాఖకూడ ఏర్ప డ్డవి. గ్రంథములను స్త్రీలకొరకు యిండ్లకు పంపునట్లుకూడ ఏర్పాటు చేసినాము. రామమోహనగ్రంథాలయముక్రింద ఒక హరిజనపాఠశాలను స్థాపించినాము. దాని సాంవత్సరికోత్సవములు 1916 వ సంవత్సరమునుంచి రామమోహనగ్రంథాలయములోనే జరుపబడుచువచ్చినవి. పల్లెటూళ్ళలోని

గ్రంథాలయములు నిర్వర్తించిన కార్యక్రమములు (1) స్త్రీలకొరకు ఇండ్లకు గ్రంథములుపంపుట. (2) హరిజనుల విద్యావ్యాపకమునకై రాత్రిపాఠశాలలు పెట్టుట. (3) జాతీయపండుగలను జరుపుట. ఈ మూడును ముఖ్యకార్యక్రమముగా ప్రకటించినాము. శ్రీరామనవమి, శ్రీకృష్ణజయంతి, దసరాతోపాటు మహమ్మదుప్రవక్తయొక్క జన్మదినము కూడ జాతీయపండుగలలో చేర్చినాము. మహమ్మదుప్రవక్తయొక్క జన్మదినోత్సవముచేయుట వల్ల హిందూముస్లిము ఐక్యత దృఢపడినది. మహమ్మదీయులు మాతో హిందువులపండుగలలో కూడ కలసివచ్చేవారు. నేను ప్రత్యేకముగ మహమ్మదుప్రవక్తజీవితమును చదివినాను. వారి జన్మదినోత్సవము చేసినపుడు నన్ను తీసుకొనిపోయేవారు. బెజవాడ, బందరు, ఏలూరు, గుంటూరు మొదలైనపట్టణములలో నేను మహమ్మద్రప్రవక్త జన్మదినోత్సవసందర్భములో ఉపన్యాసముల నిచ్చుచుంటిని. కొంతమంది సుప్రసిద్ధులైన మహమ్మదీయనాయకులు కూడ ఆ ఉత్సవములలో పాల్గొనుచుండిరి. పిఠాపురము కాపురస్థులగు కీర్తిశేషులైన ఉమర్ ఆలీషా సాహెబుగారు తెలుగులో గొప్ప కవీశ్వరులు. వారు తరచుగ మాతో కలియుచుండిరి. రామమోహనగ్రంథాలయవార్షికోత్సవములలో అప్పుడప్పుడు వారు పాల్గొని మనోజ్ఞములైన వారిపద్యములను చదువుచుండిరి. నేను ఇంగ్లీషులో ఖురానును కూడ చదివినాను. లాహోరులోని విశ్వవిద్యాలయములో ఆచార్యులగు ప్రొఫెసరు మహమ్మదాలీగారు ఇంగ్లీషులోకి భాషాంతరీకరించిన ఖురానును ఇరవై యొక్క రూప్యములు పెట్టి తెప్పించి చదివినాను. దానిని కొన్నాళ్ళకు మిత్రులెవరో ఎరువుతీసుకొని మరల యివ్వలేదు. ఇప్పటికిని ఖురానులోనుంచి ఎత్తి వ్రాయబడిన రత్నములను మంత్రములసంపుటి ఇంగ్లీషుది, కాశింఖాన్ గారు ఖురానుకు చేసిన తెనుగుతర్జుమా నావద్ద ఉన్నవి. నేను వాటిని చదువుచుందును.

ఒకరిని చూచి ఒకరు ఉత్సాహవంతులైన పల్లెటూళ్ల యువకులు గ్రంథాలయములను తమంత తామే స్థాపించుకొని బెజవాడనుంచి కాని, యితరచోట్లనుంచి కాని పెద్దలను తీసుకొనివెళ్ళి బహిరంగసభలు చేసుకొనేవారు. బెజవాడలో రామమోహన ఉచిత గ్రంథాలయము గాక దుర్గా

మల్లేశ్వరగ్రంధాలయము, కోడి రామమూర్తి గ్రంధాలయము, ముస్లిమ్ యువజనగ్రంధాలయము, రామచంద్రగ్రంధాలయము, వెలిదండ్ల హనుమంతరాయగ్రంధాలయము, డాక్టర్ అన్సారీగ్రంధాలయములు స్థాపింపబడి నేటికిని విజ్ఞానాభివృద్ధికి తోడ్పడుచున్నవి. వీటిలో రామచంద్రగ్రంధాలయము గాంధీపార్కులోను, డాక్టర్ అన్సారీగ్రంధాలయము అన్సారీపార్కులోను బెజవాడ మునిసిపాలిటీవారిచే స్థాపింపబడి నిర్వహించబడుచున్నవి. హిందూదేశములోకెల్ల బరోడా సంస్థానాధీశ్వరుల యాజమాన్యమున సాగింపబడుచున్న బరోడా గ్రంధాలయోద్యమము ప్రధమస్థానము వహించినది. కాని అది సంస్థానాధీశ్వరులయొక్క పోషణక్రిందను, ప్రోత్సాహమువల్లను పూర్తియైన ధనసహాయమును పొందుచు అభివృద్ధిచెందినది. అటులగాక ఆంధ్రదేశములోని గ్రంధాలయోద్యమము ప్రభుత్వముయొక్క కాని, ప్రభువులయొక్క గాని, జమీందారులయొక్కగాని ఎట్టి సహాయము లేకుండగనే కేవలము దేశాభిమానులును, విజ్ఞానవ్యాపకమునందు దీక్షగలవారుసునగు నాయకులచేతను, యువజనులచేతను నడుపబడుచు భారతదేశములో రెండవ స్థానమును వహించినది. కొలదిసంవత్సరములకు పిమ్మట సూరి వెంకట నరసింహశాస్త్రిగారును, అయ్యంకి వెంకటరమణయ్యగారును ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమును అఖిలభారత గ్రంథాలయోద్యమముగా విస్తరిల్ల చేసినారు. 1944 లో అఖిలాంధ్ర - విశాలాంధ్ర - గ్రంథాలయమహాసభ సింగరేణిలో బూర్గుల రామకృష్ణారావుగారి అధ్యక్షతక్రింద జరిగెను. ఆంధ్ర దేశ గ్రంధాలయోద్యమమునకు ఇపుడు గాడిచర్ల హరిసర్వోత్తమరావు, పాతూరి నాగభూషణంగారు ముఖ్యులుగ నున్నారు. పటమటలోని హరిసర్వోత్తమభవనములో కేంద్రకార్యస్థాన మున్నది.

1916 సంవత్సరము నవంబరు 1 వ తేదీన కృష్ణానదికి పాతూరు వద్ద పెద్ద గండిపడినది. కృష్ణవరద అనేక గ్రామములను నీళ్ళమయము చేసినది. లెక్కలేనన్ని ఇండ్లు కూలిపోయినవి. మనుష్యులు కొట్టుకొని పోయినారు. పశువులు నశించినవి. ఆస్తినష్టమునకు మేరలేదు. బెజవాడలో రామమోహనగ్రంధాలయమును నిర్వహించుచుండిన మిత్రులము ఈ స్థితి చూచి వరదబాధితులైన గ్రామములవారికి చేతనైన సహాయముచేయవలెనని

సంకల్పించితిమి. అయ్యంకి వెంకటరమణయ్య, కావలి శంకరరావు, దంటు సుబ్బావధాని, సోరి వెంకటేశ్వర్లు, గోపేటి లక్ష్మీనారాయణ, సీతం రాజు వెంకట్రామయ్యగార్లు ఆయాగ్రామములకు స్వయముగ స్వచ్ఛందసేవ కులను వెంటగొనిపోయి అచటి మనుష్యులకు, పశువులకు ఆహారపదార్థ ములు, యిండ్లు కట్టుకొనుటకు వలయు కర్రలు, వెదుళ్లు, తాటాకులు మొద లైనవాటిని పంచియిచ్చుటకు తయారై వచ్చిరి. బెజవాడ హిందూహైస్కూలు నుండి చాలమంది విద్యార్థులు ఇంక నితరయువకులు స్వచ్ఛందసేవకులుగ చేరిరి. వారినందరిని జట్టులు జట్టులుగ విభజించి, వివిధ సేవాశిబిరములకు పై నాయకులు తమవెంట గొనిపోయిరి. ఆంధ్రపత్రికాధిపతులు ప్రతిరోజు వరదలవల్ల కలిగిన యిక్కట్టులనుగూర్చి, స్వచ్ఛందసేవకులు గావించుచున్న సహాయమునుగూర్చి పత్రికలో వ్రాయుటకుకర్రా నరసింహంగారను ప్రత్యేక విలేఖరినిపంపగ ఆయన దానినంతను ఆంధ్రపత్రికలో వర్ణనచేయుచుండెను. వరదబాధితులసేవచేయుటకు బందరు జాతీయకళాశాలనుండియు, ఇతరగ్రా మములనుండియు కూడ పలువురు ఐచ్ఛికసేవకులు వచ్చిరి. వారినికూడ వరదప్రాంతములకు పై నాయకులవద్దకు పంపితిమి. కీర్తిశేషులైన ప్రముఖ వకీలు సి. రాజగోపాలాచార్యులుగారును, నేనును ముఖ్యముగ వసూళ్ళపనికి పూనుకుంటిమి. ఇతరమిత్రులుకూడ మాతో వచ్చిరి. బెజవాడలో పదిన్నర బియ్యపుబస్తాలు, ఆరు తవుడుబస్తాలు సుమారు రెండువేలరూప్యములు నగదు వసూలైనవి. ఉయ్యూరురాజాగారు మూడువందల రూప్యములను మా కొసంగినారు. ఆంధ్రపత్రికద్వారా వసూళ్లుచేసి 1,800 రూపాయలను కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు మాకు పంపినారు. ఇంకను సుమారు 450 రూపాయలు ఇతరగ్రామములనుండి వచ్చినవి. మొత్తము రు. 4,553—2—0 ల నగదు మాకు వసూలైనది. బెజవాడలోని మిత్రులము కలసి సేవకసంఘముగా ఏర్పడినాము. ఈ మొత్తముతో కావలసిన సామా నులను కొని, పైన చెప్పబడిన నాయకులద్వారాను వారిక్రింద పనిచేసిన ఐచ్ఛికసేవకులద్వారాను పంచిపెట్టించినాము. ఆ లెక్కలను ప్రచురించి నాము. పైన చెప్పబడిన నాయకులు, వారితోపనిచేసినసేవకులు చేసినసేవ అతి శ్లాఘనీయమైనది. నీళ్ళలో, బురదలో, ముళ్ళలో నడిచి బాధి

తులవద్దకు చేరి వారికి తగుసహాయము చేసినారు. తరచుగ వారు ఉప వాసములు చేయవలసివచ్చినది. కొన్నిసమయములలో పైనుండి జోరున వర్షముకురియుచునే యుండెను. సీతానగరము, త్రిలోచనపురము, రేవేంద్ర పాడు, ఇబ్రహీంపట్టణము, వెల్లటూరులలో సహాయకశిబిరములు తెరచి ఆ చుట్టుపట్ల గ్రామములకుపోయి పంచిపెట్టి వచ్చుచుండిరి. నాయకులు, సేవ కులు బహు ఉత్సాహముతో పనిచేసినారు. ఎప్పటికప్పుడు రామమోహన గ్రంథాలయములోని మా సేవకసంఘపు కార్యస్థానమునకు వారు చేసినపనిని గూర్చి, ప్రజలయిబ్బందులనుగూర్చి నివేదికలు పంపుచుండిరి. ఈవిధముగ వారు పన్నెండుదినములు గుంటూరు, కృష్ణాజిల్లాలలో కృష్ణవరదలవల్ల బాధి తులైన గ్రామీణులకు సహాయముచేసి బెజవాడకు తిరిగి వచ్చేసరికి, కైక లూరుతాలూకాలో కొల్లేటివరదలువచ్చి అక్కడి గ్రామములకు చాలా నష్టము కలిగినదని తెలియుటతోడనే ఈ ఐచ్ఛికసేవకులలో చాలమందిని వెంటపెట్టుకొని అయ్యంకి వెంకటరమణయ్య, నోరి వెంకటేశ్వర్లుగారలు ఆ ప్రాంతములకు పోయి అనేక యిబ్బందులకు లోనై పదిదినములు అపార మైన సహాయముచేసి తిరిగివచ్చినారు. అపుడు వారే గ్రామములను దర్శించి ఎట్టి సహాయముచేసిరో ఒక రిపోర్టును మేము సేవకసంఘముపక్ష మున ప్రకటించియున్నాము. ఆంధ్రపత్రిక ప్రత్యేకవిలేఖరికూడ వ్యాసము లను వ్రాసెను.

# 4 విజ్ఞానచంద్రికామండలి - నేను రచించిన గ్రంథములు - చరిత్ర, శాస్త్రముల తెలుగు అకాడమి

విజ్ఞానచంద్రికా ప్రారంభము - హైదరాబాదులో కార్యస్థానము - మొదటిపుస్తకము అబ్రహాంలింకను చరిత్ర - ఆంధ్రులకు విజ్ఞాపనము - అనంతర గ్రంథములు - మదరాసుకు కార్యస్థానపు మార్పు - స్వతంత్ర చరిత్రాత్మక నవలలు - మిగత గ్రంథములు - ఇతర గ్రంథమాలలు - విజ్ఞానచంద్రికా పరిషత్తు - లక్ష్మణరావుగారు విజ్ఞానసర్వస్వమును ప్రారంభించుట - మూడుసంపుటములు వెలువడుట - ఆయన అకాల మరణము - వీరేశలింగంగారిమరణము - నేను కడలూరు జైలులో ఫ్రెంచి, అమెరికావిప్లవములు వ్రాయుట - కార్యస్థానము బెజవాడకు మారుట - మరికొన్ని గ్రంథములు - రాయవేలూరుజైలులో తురుష్క ప్రజాస్వామికమురచన - రాజకీయవిజ్ఞానప్రచురణములు - చైనాజాతీయోద్యమము - డెమొక్రసీ కాలములో ఉపనిషత్సారములు - వినోబా భావే - బాపు యొక్క హుకుము - ఎస్సెంబ్లీ ఎన్నికలలో కమ్యూనిస్టులతో పోరాటము - బాపునుండి లేఖ - ఈజిప్టుచరిత్ర - జీవితకాలమంతయు విద్యార్థిత్వము - ఆంధ్రసాహిత్యాభివృద్ధి - చరిత్ర, శాస్త్రముల తెలుగు అకాడమి.

(1)

విజ్ఞానచంద్రికామండలి స్థాపననుగూర్చి దానిస్థాపకులలో నొకరును, త్యాగధనులు నగు గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు. లక్ష్మణరాయవర్ధంతి సంచికలో "అన్నయ్య కొమర్రాజు లక్ష్మణరావు" అను శీర్షికలో వ్రాసిన కొన్నిమాటలతో ప్రారంభించెదను. ఇందులో అప్పటి ముఖ్యవిషయము లింకా కొన్ని యున్నవికూడాను. ఆయన ఈవిధముగా వ్రాసినారు :

"అవి వందేమాతరం ఆరంభదినాలు. స్వదేశీయుద్యమము మొలకెత్తుచున్నది. నా మిత్రుడు శ్యాంజీ రామారావు బళ్లారిజిల్లా యువకుడు. గాజుపరిశ్రమ నేర్చుకోడానికి జపాను వెళ్ళ నిశ్చయించినాడు. రెండుపందల చిల్లర ఎక్కడో సంపాదించినాడు. టిక్కెట్టు కొన్నాడు. మరి రెండువందలు చేతబుచ్చుకొని ప్రయాణమయినాడు. నేను వెళ్ళిపోతున్నాను. మిగిలింది నీబోటి మిత్రులభారం అన్నాడు....నేను ఎం.ఏ. కు క్రిస్టియన్ · కాలేజీలో చదువనారంభించియున్నాను. నాడు సముద్రయానంచేయడం అంటే, చేసేవారికి తోడ్పడంఅంటే ముఖ్యంగా రాయలసీమలో సంఘబహిష్కారమే. ఈ ఎదుర్కోలే నాబోటివాని యువకహృదయాన్ని రెచ్చగొట్టింది. నా మిత్రునికి ద్రవ్యసహాయం వెళ్ళేటట్టు శ్రమచేయడం విధి అని తోచింది. ఆ దినాలలో మద్రాసులో సి.బి. రామారావని యొక సద్గృహస్థు ఉండేవాడు. ఆయన డాక్టరు, సంఘసంస్కారి .సంఘసంస్కారోద్యమానికి పట్టుకొమ్మ. అతనియింటిలో సంస్కారసంఘం చేపతుండేది. నేను నా మిత్రునికార్యం మనసులో కలవాణ్ని....సి. బి. రామారావుగారి సంఘసంస్కారసంఘ పరిచయం వెతకికొని వెళ్ళినాను. అక్కడ లక్ష్మణరావుగారి మొదటి పరిచయం....బళ్ళారివారే కోలాచలం వెంకటరావని యొక సుప్రసిద్ధ న్యాయవాది. ఆయన విదేశాలన్నీ చుట్టివచ్చి మద్రాసుకు చేరినాడు. రాయలసీమవిద్యార్థు లాయనకు సన్మానపత్రము సమర్పింపదలచినారు. ఆ పత్రము వ్రాయను చదువను నా కనుజ్ఞ యిచ్చినారు. ఆ యుత్సవానికి వచ్చినవారికి నా మిత్రునిమాట శృతపరచినాను. 'పీడెవడో మనగుంపులోవాడేరా' అనుకున్నారు లక్ష్మణరావు, కాశేశ్వరరావులు....సభ అవుతూనే మేము ముగ్గు

రము చేరుకున్నాం. ప్రపంచాన్ని మరచ్మతుచేసేమాటలు మాట్లాడినాం.... కాశేశ్వరరావుగారు బి.యల్. చదువుతున్నారు. లక్ష్మణరావుగారు అప్పటికే మునగాలదివానని నా జ్ఞాపకం. అయినా వారూ ఎఫ్.యల్. కు చదువు తున్నారు. కాశేశ్వరరావుగారి కచ్చాలేశ్వరఅగ్రహారంబసలో మేము సమా వేశమయినాము. చదువంటే ఆ దినాలలో రాయలసీమలో అతి ప్రియమైన సరుకు. నేను నాలుగవఫారములో చదువుకొనుచున్నపుడు క్లాసులో తొమ్మండుగురము. ఆదినాలలో బి.ఏ. పరీక్షలో మూడుభాగాలు ఒకేసంవత్స రం ప్యాసుకావడానికి నాకు తెలిసినంతవరకు నేనే మొదటివాణ్ని. అట్టి స్థితిలో ఆ సీమలో ఫెర్గుసన్‌కాలేజీవంటి సంస్థ ఉత్తమవిద్య ఉచితంగా నేర్పడానికి పెట్టవలెనని మేము కొందరుమిత్రులం ఆలోచించేవారం. కీ.శే. జి. రామేశ్వరరావు, శ్రీ దేశపాండ్య సుబ్బారావు, శ్రీ హట్టీ శంకర్రావు నేనూ అందులోనివారం, కాబట్టి చదువులమాట నా మెదడునిండా ఉంది. శ్రీ లక్ష్మణరావు మహారాష్ట్రదేశంతో వుండి మరాటీభాషలో పండితుడయి, అపట వాఙ్మయాభివృద్ధికి తోడ్పడి వచ్చినవాడుగా ఉత్సాహముతో వుప్పొం గుతుండేవాడు. కాశేశ్వరరావు శ్రీ వీరేశలింగంగారిసంస్కారోద్యమంలో బాగా విశ్వాసంకలవాడు. కాబట్టి మా మాటలన్నీ దేశవికాసోద్యమంమీదికి మరలినవి. శ్రీ లక్ష్మణరావు 100 పేజీల పత్రిక ఆరంభించి విజ్ఞానప్రచారం చెయ్యవలెనన్నాడు. అచ్చు, కాగితం, చిత్రాలు వస్తురేటువి కావలెనన్నాడు. నేను పుస్తకరూపంగా వెలువరిద్దాం అన్నా. విమర్శించుకొన్నాం. ఆరంభంలో పుస్తకాలు వేయడమే మేలనుకొన్నాం. మా ఉద్యమానికి పే రేమిపెట్టాం అన్నాం. ఎన్ని పేర్లో ఆలోచించినాం. "విజ్ఞానచంద్రిక" అనేది స్థిరపరచి నాం. ఈ మాటలు మాట్లాడుతూనే సహాయకులను నిర్ణయించుకొన్నాం. మునగాలజమీందారు, రావిచెట్టు రంగారావు. 1905 వ సెప్టెంబరులోనే లక్ష్మణరావు అరటావుకాగితం అప్పీలు అచ్చువేయించినాడు. ప్రపంచంమీద విసరివేసినాం ...

తరువాత నేను నా మిత్రులు రామారావు పనిని పురస్కరించుకొని మొదటిదఫా సర్కారుజిల్లాలకు ప్రయాణంచేసినాం. బెజవాడలో హరినారా యణగారింట్లో బసచేసినా. నాయనా ! ఏమి చెప్పను ఆ దుర్గాంబకొండ

వేడిగాల్పులు! అందులో వాడుతూ, జమీందారు రంగారావుదర్శనార్థం గవర్నరుపేటకు పోయినా. మొలకు ధోవతి, దేహంమీద కొంచెము పల్చటి సాదా చొక్కా. వడ్రింగులచేత పనిచేయిస్తూ ఒకదూలంమీద కూర్చున్నాడీ పురుషుడు, చెప్పినారు, వీరే మునగాల జమీందారుగారని. ఇందుకే కావలెను, లక్ష్మణరా వీయనవద్ద దివాన్‌గిరీ చేసేది; ఇందుకే కావలెను వీరిద్దరికీ పొత్తుకుదిరింది అని అనుకున్నా.

ఆ రెండవదినమే రెండెడ్లబండ్లలో నీటి తాబేటికాయ వ్రేలాడ వేసుకొని జమీందారుగారు తోడురాగా బందరుకు ప్రయాణం. అప్పుడు రైళ్ళు లేవు. పడవలు కట్టివేసినారు. దారిలో పుయ్యూరురహదారిబంగళాలో బస. నా స్వంతవంట. రాజుగారు కోరి రావుగారి చారు రుచిచూడడం.... రాజాగారు, లక్ష్మణరావు, కాశేశ్వరరావు ఇతర సర్కారుసోదరులు చూపిన నాటి యభిమానంచేత రాయలసీమలో కూడా శ్యాంజీ రామారావుపరంగా అభిమానం పెరిగింది. అతనికి సహాయం వెళ్ళింది....1906 వ సంవత్సరం కొంతదూరం సాగినతరువాత గాని విజ్ఞానచంద్రిక రూపుదాల్చలేదు."

(2)

1906 వ సంవత్సరం వేసంగిలో మద్రాసులోని మునగాలరాజాగారు నివసించుచున్నబంగళాలో మునగాలరాజాగారగు నాయని వెంకటరంగారావుగారు, కొమర్రాజు లక్ష్మణరావుగారు, గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, రావిచెట్టు రంగారావుగారు, నేను సమావేశమైనాము. మరల విజ్ఞాన చంద్రికా మండలి స్థాపనవిషయమై చర్చించి ఆఖరు తీర్మానము గావించి కార్యక్రమమునకు పూనుకున్నాము. అప్పటికే మహారాష్ట్రి, బంగాళీ, హిందీ భాషలలో ఎటుల నవీన వాఙ్మయమును సృష్టించుటకు ఎంత గొప్ప కృషి జరుగుచున్నదో లక్ష్మణరావుగారు మాకు వివరించిరి. "స్వరాజ్యముకొరకు ఆంధ్రదేశములోను, యావద్భారతములోనుకూడ గాఢవాంఛ ప్రబలియున్నది. కుల మతభేదములు లేక యుక్తవయస్సువచ్చిన ప్రతిపురుషునికిని, స్త్రీకిని ఓటు కలిగిన స్వరాజ్యమే మన గమ్యస్థానము. భారతదేశములో అరుకోట్ల జనసంఖ్య గల పంచముల అస్పృశ్యత రూపుమాపనిది స్వరాజ్యము రానే

రదు; వచ్చినను నిలువనేరదు. కనుక అస్పృశ్యతానివారణకు గట్టి కృషి చేయవలసియున్నది. స్త్రీలయొక్క విద్య, అభ్యున్నతి, హక్కులకొరకు కూడ బాగుగ కృషిసలుపవలసియున్నది. నవీనప్రపంచములో భారతదేశము ఒక స్వతంత్ర ప్రజారాజ్యముగా నిర్మాణమగుటకు యావద్భారతప్రజలకు, ఆంధ్రప్రజలకు నవీనప్రపంచములో అత్యంతముగ వృద్ధియైన ప్రకృతిశాస్త్ర, చారిత్రక, రాజకీయార్థికవిజ్ఞానము నిచ్చుట యావశ్యకము" అని తర్కించితిమి. "ఆంధ్రభాషలో కవిత్వవాఙ్మయము, ప్రబంధసముదాయము గొప్పగానున్నవి. అవి ఆధ్యాత్మిక, నైతికవిషయములకు ఉపయోగమే కాని, ఆంధ్రజాతిని నవీనపద్ధతులమీద ఐహికముగ నడపించుట కుపయుక్తముకావు. పురాణయుగమునుంచి ప్రకృతిశాస్త్ర రాజకీయ ఆర్థిక యుగమునకు మన ప్రజలను తీసుకొనిపోవలసి యున్నది" అని తలచితిమి. కవిత్వమును విడచిపెట్టి వీరేశలింగంపంతులుగారు సృష్టించిన తేలికయగు తెనుగుగద్యములో రాజకీయార్థికశాస్త్రములు, ప్రకృతిశాస్త్రములు, వ్యవసాయిక పారిశ్రామిక విషయములు, దేశచరిత్రలు, మహాపురుషులజీవితములు, చరిత్రాత్మకనవలలు, ఇతరభాషలనుండి యుద్గ్రంథములభాషాంతరీకరణములు ప్రచురించుటకు నిర్ణయించితిమి. వీనిని ప్రచురించు గ్రంథమండలికి విజ్ఞానచంద్రికామండలి యను పేరును ఖాయపర్చితిమి.

ప్రతిసంవత్సరము నాలుగుగ్రంథములను ప్రచురించవలెననియు, చందాదారులను చేర్చవలయుననియు, చందాదారులకు నూరుపేజీలకు పోస్టేజిగాక నాలుగుఅణాల చొప్పున ధరలకు పుస్తకములను విక్రయించవలెననియు, ప్రతి పుస్తకమును చందాదారులకు వి. పి. పోస్టులో పంపించి సొమ్ము రాబట్టుకోవలెననియు తీర్మానించితిమి. చందాదారులు కానివారికి పోస్టుఖర్చుగాక నూరుపేజీలకు ఆరుఅణాల చొప్పున పుస్తకములను విక్రయించుటకుకూడ నిశ్చయించితిమి. విజ్ఞానచంద్రికామండలికి మేము ఐదుగురము మేనేజింగుకమిటీగాను, మాలో లక్ష్మణరావుగారు సంపాదకులుగాను, నేను, హరిసర్వోత్తమరావుగారు కార్యదర్శులముగాను ఏర్పడితిమి. సభ్యులెవరును ఎట్టి ప్రతిఫలమును తీసికొనకుండ నవీన జాతీయవిజ్ఞానోద్యమములో కృషిసలుపుటకు దృఢనిశ్చయమును తెలిపితిమి. మా సభ్యులలో

నైనను, ఇతరులైనను గ్రంథకర్తలుగా గ్రంథములను వ్రాయుటకు ప్రతిఫలము కోరినచో వారికి నిర్ణీతమైన ప్రతిఫలమిచ్చుటకు తీర్మానించితిమి. మాలో నేను, లక్ష్మణరావుగారు, మేము వ్రాసిన గ్రంథములకు ప్రతిఫలము పుచ్చుకొనలేదు. ఇంకను కొంతమంది పుచ్చుకొనలేదు. హరిసర్వోత్తమ రావుగారు పేదరికమును స్వీకరించిన త్యాగపురుషులై నందున వారు రచించిన రెండు గ్రంథములకు ప్రతిఫలమిచ్చితిమి. ఏ గ్రంథము మూడువందల పేజీలకు మించి యుండకూడదు. వీరేశలింగంపంతులుగారి, చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి, లక్ష్మణరావుగారి తెలుగుశైలియే మాకు ఆదర్శవంతమైనది. ఎవరైనను దానికంటె కొంచెము భేదముగా వ్రాసినను మాకు అభ్యంతరములేదు. గ్రామ్యమను పేర ప్రజలకర్థముకాకుండ వ్రాయుట మాత్రము మేము ఒప్పుకొనము. పూర్తి గ్రాంథికమే కావలయునని మాకు పట్టుదల లేదు. తెలుగుప్రజలకు హృద్యముగానుండునట్లు వ్రాయుటయే మాకు కావలసినది. వ్రాయబడిన గ్రంథములన్నియు లక్ష్మణరావుగారివద్దకు పంపవలెను. ఆయన అపుడు చెన్నపట్టణములో చింతాద్రిపేటలోని సుంకు వారిఅగ్రహారములో కాపురముండిరి. ఆయన ఆ పుస్తకములను చూచి సరియైన భాషాసవరణలుచేసి మద్రాసులోనే అచ్చువేయించి హైదరాబాదులోని రెసిడెన్సీబజారులో కాపురమున్న రావిచెట్టు రంగారావుగారికి పంపవలెను. రంగారావుగారు నైజాంరాజ్యములో నొక మునసబుదారు. వారు హైదరాబాదు నుంచియే చందాదారులకు వి. పి. పోస్టులో పంపి సొమ్ము వసూలుచేయవలయును. మా మండలియొక్క కార్యస్థానము హైదరాబాదులోనే నెలకొల్పితిమి. కార్యస్థానపు ప్రారంభఖర్చులకుగాను మునగాలరాజాగారు రెండువేల రూప్యములను విరాళముగానిచ్చిరి. అదివరకే 1901 వ సంవత్సరములో రావిచెట్టు రంగారావుగారు, మునగాలరాజాగారు, లక్ష్మణరావుగారు, ఆదిపూడి సోమనాథరావుగారు, పండిత మైలవరపు నరసింహశాస్త్రిగారు మొదలగు వారు కలసి హైదరాబాదులోని రెసిడెన్సీ బజారులోని రావిచెట్టు రంగారావు గారితాలూకు గృహములో కృష్ణదేవరాయాంధ్రభాషానిలయమను గ్రంథాలయమును స్థాపించియుండిరి. దానికి కొలదిసంవత్సరములలోనే స్వంత భవన మేర్పడి బాగుగా వృద్ధియై మిగుల పేరుప్రతిష్ఠలతో విలసిల్లుచున్నది.

అది యావదాంధ్రదేశములో మొదటస్థాపించబడిన గ్రంథాలయములలో నొకటి. దానివలనను విజ్ఞానచంద్రికామండలియొక్క కార్యస్థానము హైదరాబాదులో స్థాపింపబడుటవలనను, వైజ్ఞానికముగా విశాలాంధ్రస్థాపన జరిగినదని చెప్పనొప్పును. విజ్ఞానచంద్రికామండలి కార్యస్థానములో రావిచెట్టు రంగారావుగారికి ఆదిరాజు వీరభద్రరావుగారు సహాయకులుగా పనిచేసిరి. ఇది విజ్ఞానచంద్రికామండలి స్థాపనకథ.

ప్రథమగ్రంథము హరిసర్వోత్తమరావుగారు వ్రాయవలయునని నిశ్చయించితిమి. అతి పేదరికములోనుంచి స్వయంకృషివల్ల గొప్ప విద్యావంతుడై, రాజకీయదురంధరుడై, దేశనాయకుడై, అమెరికా రిపబ్లిక్ అధ్యక్షుడై, మానవబానిసత్వమును రద్దుపరచుశాసనమును గావించి, ఆ రాత్రే నాటకశాలకేతెంచినసమయమున బానిసత్వవ్యాపారసంఘదూతలచే హత్యగావింపబడి మానవస్వాతంత్ర్యముకొరకు ప్రాణములర్పించిన మహాపురుషుడగు అబ్రహాంలింకను జీవితచరిత్రను హరిసర్వోత్తమరావుగారు ప్రథమకుసుమముగా తెనుగులోనికి భాషాంతరీకరణముచేయుట యుక్తమని తలచితిమి. ఆ మరునాడు లక్ష్మణరావుగారు, హరిసర్వోత్తమరావుగారు, నేను కలసి మద్రాసులో మౌంటురోడ్డులోని హిగిన్‌బాదమ్సు కంపెనీనుంచి ఇంగ్లీషులో థేయర్సు రచించిన అబ్రహాంలింకను జీవితచరిత్ర నొకదానిని కొని హరిసర్వోత్తమరావుగారి కిచ్చి దానిని తెనుగులోనికి తర్జుమా చేయవలెనని చెప్పితిమి. దానిని వారు చక్కని తెనుగులో భాషాంతరీకరించిరి. దానిని మా గ్రంథమండలి మొకటిపుస్తకముగా హైదరాబాదునుంచి ప్రకటించితిమి. విఘ్నేశ్వరపూజగా అబ్రహాంలింకను జీవితాదర్శమును ఆంధ్రయువజనులకు మే మిచ్చినాము.

ఆ గ్రంథమును ప్రచురించుచు మేము ఐదుగురము దస్కతుచేసి సకలాంధ్రజనులకు యొక విజ్ఞాపనమును చేసియున్నాము. అందులో ఈ క్రింది భావములను వెలిబుచ్చియున్నాము :

"జనసామాన్యము, ముఖ్యముగా స్త్రీలు విజ్ఞానము గలవారైననే కాని దేశము నాగరికదేశముగా ఎంచబడుటకు వీలులేదు....సర్వజనులకు జ్ఞానాభివృద్ధి కలుగవలెనన్నచో వారివారి దేశభాషలమూలముననే కలుగవలెను.

ప్రస్తుతము మనవారు శాస్త్రములన్నియు నింగ్లీషులో చదువుకొనుచున్నందు వల్ల నెక్కుడు కాలము, పరిశ్రమయు, నెక్కుడు దనమును వ్యయమగు చున్నవి. కావున ప్రవేశపరీక్షకు క్రింది తరగతులలో చదువు పిల్లలకైనను సమస్తవిద్యలను దేశభాషలలో నేర్పి యింగ్లీషుభాష మాత్రము ద్వితీయ భాష (Second language)గా బోధించినయెడల ప్రస్తుతము ప్రవేశ పరీక్షకు పోవు విద్యార్థులకు కలుగు జ్ఞానమంతయు ప్రస్తుతము పట్టుచున్న కాలములో సగముకాలములోనే గడింపవచ్చును. ఇందుకు ప్రకృతిశాస్త్రాది వివిధవిద్యలు జనులకు బోధించుటకు ఆ భాషలలో అన్నివిషయములను గురించిన గ్రంథములను నిర్మింపవలసియున్నది....భాషాభివృద్ధికి గద్య గ్రంధంబు లత్యావశ్యకమని మొట్టమొదట కనిపెట్టినది చిన్నయసూరి. తెలుగున గద్యగ్రంథముల కాతడు నన్నయభట్టు. ఇట్లు చిన్నయసూరిచే ప్రారంభింపబడిన వచన కావ్య పద్ధతిని మిగుల ప్రబలముగచేసి విద్వాంసులకును, జనసామాన్యమునకు, స్త్రీలకును గావలయు గ్రంధరాజంబు లనేకంబులు నిర్మించి, గ్రంథ సంఖ్యాబాహుళ్యంబుచేతను సకలజనాదరణీయంబును సకల జనానుకరణీయంబును నగు శైలిని నిర్మించుటచేతను గద్యతిక్కన యని చెప్పుటకు నర్హులు రావు బహద్దూరు కందుకూరి వీరేశలింగంపంతులుగారు. వీరుగాక యనేకులు పూర్వతరమువారు, మనతరమువారు తమ గద్యగ్రంథములచే తెనుగు బాస నలంకరించిరి. వారిలో శ్రీ పరవస్తు రంగాచార్యులు గారును, కొక్కొండ వెంకటరత్నముపంతులుగారును, శతఘంటం వెంకట రంగశాస్త్రిగారును, పూండ్ల రామకృష్ణయ్య పంతులుగారును, వేదము వేంకట రాయశాస్త్రిగారును, శేషగిరిశాస్త్రిగారును, పొనప్పాకం శ్రీనివాసాచార్యులు, బి.ఏ.,బి.ఎల్. గారును, నాటకములకు నూతన మార్గమును చూపినందుకు ధర్మవరం కృష్ణమాచార్యులుగారు, నవలలు వ్రాయుటలో చిలకమర్తి లక్ష్మీనరసింహంగారును, స్త్రీలకుపయుక్తమగు గ్రంథములను వ్రాయుట యందు కీర్తిశేషురాలైన బండారు అచ్చమాంబగారును, శ్రీమతి కొటికలపూడి సీతమ్మగారును భాషాభివృద్ధికై మిక్కిలి పాటుపడియున్నారు. వీరు కాక పూర్వమొకప్పు డుండిన పురుషార్థప్రదాయిని, ఆంధ్రభాషాసంజీవని, మందారమంజరి, చింతామణి, శ్రీ వైజయంతి మొదలైన మాసపత్రిక

లును, ప్రస్తుతమున్న సరస్వతి, మంజువాణి, మనోరమ, సువర్ణరేఖ, సావిత్రి, హిందూసుందరి, జనానాపత్రిక మొదలైన మాసపత్రికలును, ఆంధ్రప్రకాశిక, శశిరేఖ, కృష్ణాపత్రిక, ఆర్యమతబోధిని, సత్యవాది, రవి, దేశాభిమాని మొదలైన వారపత్రికలును తెనుగునం దొకవిధమైన ఉపయోగ కరమైన వాఙ్మయమును పుట్టించినవి, పుట్టించుచున్నవి. కావున నేతద్గ్రంథ కర్తలందరును మనకు వంద్యులు. కాని తెనుగుబాస యొక నాగరికబాస యనిపించుకొనుటకు మనము చేయవలసిన ప్రయత్నములో నిపుడు జరిగి యున్న ప్రయత్న మొక సహస్రాంశమైనను కాదని మనము తెలుసు కొనవలయును. ఇండియా, ఇంగ్లండు, గ్రీస్, రోమ్, అమెరికా, ఫ్రాన్సు మొదలైన దేశముల చరిత్రలు మనభాషయందు లేవు. హిందూదేశచరిత్ర మనుపేరిట నొకటి రెండు చిన్న పొత్తములు కలవు. కాని అవి చరిత్ర యనునామమున కంతగా తగినవికావు. ప్రకృతిశాస్త్రములన్ననో తెలుగులో బొత్తిగా లేవు. పదార్థవిజ్ఞానశాస్త్రము, రసాయనశాస్త్రము, వృక్షశాస్త్రము, పశుశాస్త్రము, జీవశాస్త్రము లేక చేతనశాస్త్రము, భూగర్భశాస్త్రము మొదలైన ముఖ్యశాస్త్రములనుగురించి యొక చిన్న పుస్తకమైనను మన తెలుగు భాషలో లేదు. ఇంకను ప్రకృతిశాస్త్రము లనేకములున్నవి. కాని వానిలో ముఖ్యమైనవానినే పేర్కొంటిమి. ఈ శాస్త్రిలలో నొక్కొక్కదానిపై నింగ్లీషులో వందలకొలది గ్రంథంబులు వ్రాయబడియున్నవి. అంకగణి తము, బీజగణితము. రేఖాగణితము, క్షేత్రగణితము, త్రికోణమితి మొద లైన గ్రంధములనుగురించి ప్రత్యేకమైన గ్రంథం బొకటియు తెనుగులో లేనేలేదు. ఇంగ్లీషుకధలతో పోల్పదగు నవలలు కూడ తెనుగులో లేవు. ఉన్నవానిలో చిలకమర్తి లక్ష్మీనరసింహంగారిచే రచించబడిన కథ లుత్తమ ములు. జ్ఞానవిషయము లసంఖ్యములు. ఏ విషయమునుగురించి విచారించి నను మనభాషలో తగిన గ్రంధములు లేవు. ఇట్లు తలచి 'యుడుత భక్తి' చందంబున మా యల్పశక్తికొలది యాంధ్ర మాతృభాషాసేవచేయ ప్రయ త్నింపవలయునలెడి యిచ్ఛ గలవారమై విజ్ఞానచంద్రికామండలి యను పేరిట నొక భాషాభివృద్ధిసంఘము నేర్పరచినారము. పద్యకావ్యములు, నాటక ములు, భాషావిషయిక చర్చలు, వాఙ్మయవిషయికచర్చలు భాషాభివృద్ధికి

అత్యంత యావశ్యకంబులైనను ఈ విషయికగ్రంథములు మేము ప్రస్తుతము వ్రాయను, వ్రాయించను తలచుకొనలేదు. (1) దేశచరిత్ర, (2) మహాపురుషులజీవితములు, (3) ప్రకృతి లేక భౌతికశాస్త్రములు, రాజకీయ ఆర్థిక శాస్త్రములు, ఇంగ్లీషులోని సర్వోపయోగకరంబులైన గ్రంథముల యొక్క భాషాంతరీకరణములను మాత్రమే ప్రచురించదలచినాము. కొందరు మిత్రుల సూచననునుసరించి చరిత్రానుసారమగు కల్పితకథలను (చరిత్రాత్మక నవలలను) ప్రచురించుటకు కూడ నియకొంటిమి. మా కార్యక్రమమునకు మే మీ ఎల్లలేర్పరచుకొన్నాము.

* * * * *

తెనుగుసీమలోని జమీందారులును, ఇతర లక్ష్మీపుత్రులును యిట్టి కార్యము నవలంబించినవారికి ధనరూపకమైనచేయూత నొసగి సహాయము చేయవలయునని కోరుచున్నాము. ఇక విద్యాధికులు మాకును, మావలె గ్రంథములుప్రచురింప నితరులకును మూడుతెరంగుల సహాయమొనర్ప వలెను. గ్రంథములు వ్రాయుటయు, నితరులు వ్రాసిన గ్రంథములు కొనుటయు, నా గ్రంథములలోనివిషయములను జనసామాన్యమునకు తెలుపుటయు — ఇది ఇంగ్లీషునేర్చినవారు మాకు చేయవలసిన త్రివిధ సహాయము. ఏ శాస్త్రము ఎవరు అభ్యసించిరో యా శాస్త్రము వారిచేతనే వ్రాయించ నిశ్చయించితిమి; గాన నెవరి యభిమానశాస్త్రంబున వారిభావంబులు వ్రాసి మా గ్రంథములలో కూర్చుదురని కోరుచున్నాము.

ప్రకృతిశాస్త్రములు వ్రాయునపుడు ఆ యా శాస్త్రంబులలోని పారిభాషికపదములు దేశభాషలలో లేనందున గ్రంథకర్తలు త్రొక్కులాడ వలసివచ్చినది. ఇందుకు కాశీలోని నాగరీప్రచారిణీ సంఘమువారు విద్వాంసులసంఘము నేర్పరచి భౌతికశాస్త్రములలోని పారిభాషిక పదములను నిర్ణయించియున్నారు. ఈ పరిభాష సంస్కృతపదభూయిష్ఠమైనందున నీ పరిభాషనే గ్రహించుటకు మేము నిశ్చయించితిమి. మన పదములు నాగరిప్రచారిణీ పదములకు విరుద్ధములు గాని యెడల రెండును పర్యాయములుగా వాడుకొనవచ్చును. 'ఆక్సిజన్' అను వాయువును

'ఆమ్లజన్' యనిరి. మనవారు 'ప్రాణవాయు' వనిరి. వీనిని పర్యాయ పదము లనవచ్చును. ఈ నిబంధనానుసారముగా మా గ్రంథములలోని ప్రకృతిశాస్త్రములు వ్రాయబడును.

(౩)

మా మండలినుండి వెలువడిన రెండవపుస్తకము లక్ష్మణరావుగారిచే వ్రాయబడిన హిందూమహాయుగము; ఆయన భారతదేశచరిత్రను హిందూ, మహమ్మదీయ, మహారాష్ట్ర, బ్రిటిషుమహాయుగములుగా విభజించి, ప్రతి యుగమున కొక ప్రత్యేకపుస్తకమును వ్రాయవలెనని సంకల్పించి, ప్రథమమున హిందూమహాయుగమును వ్రాసెను. మా మూడవపుస్తకము డాక్టర్ ఆచంట లక్ష్మీపతిగారిచే వ్రాయబడిన జీవశాస్త్రము (Biology). నాలుగవ గ్రంథము వేలాల సుబ్బారావుగారిచే వ్రాయబడిన రాణీ సంయుక్త, మిగుల దేశాభిమానపూరితమైన చరిత్రాత్మకనవల. ఈ నాలుగుపుస్తకములను హైదరాబాదునుంచి ప్రచురించితిమి.//చందాదారులు బాగుగా హెచ్చుచుండిరి. 1907 వ సంవత్సరము జూలైలో మా మండలి కార్యదర్శులలో నొకరగు హరిసర్వోత్తమరావుగారిని రాజద్రోహనేరముక్రింద బ్రిటిషుప్రభుత్వమువారు పట్టుకొని బెజవాడలో విచారణ ప్రారంభించిరి. అప్పటినుంచి నైజాముప్రభుత్వపు రహస్య పోలీసుశాఖవారు హైదరాబాదులో నున్న మా విజ్ఞానచంద్రికామండలి కార్యస్థానముమీదను. దాని మేనేజిమెంటుచేయుచున్న రావిచెట్టు రంగారావుగారిమీదను ఎక్కువ నిఘావేసినందున నెక్కుడు స్వతంత్రముగా మండలియొక్క గ్రంథములను ప్రచురణచేయుటకై మండలికార్యస్థానమును హైదరాబాదునుంచి మద్రాసు తీసికొనివచ్చితిమి.// హరిసర్వోత్తమరావుగారిని కమిటీసభ్యత్వమునుంచి తీసివైచి, ఆయనస్థానే డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారిని మా మండలి కమిటీసభ్యులుగా చేసితిమి. ఆచంట లక్ష్మీపతిగారు నివసించుచున్న చింతాద్రిపేటలోని పెద్దభవనములోని యొక భాగములో మా మండలి కార్యస్థానము లక్ష్మీపతిగారి క్రిందనే యుంచితిమి. ఆదిరాజు వీరభద్రరావుగారు మద్రాసులోనేయుండి లక్ష్మీపతిగారికి సహాయము చేసిరి. కావున మా ఐదవపుస్తకము మహమ్మదీయ మహాయుగము 1908 వ సంవత్సరము ఆఖరుభాగములో మద్రాసునుంచి వెలువడినది.

దానిని లక్ష్మణరావుగారు వ్రాసినారు. లక్ష్మణరావుగారు మహారాష్ట్రయుగ మును వ్రాయుటకు తగిన సాధన సామగ్రిని సమకూర్చుకొనుచుండిరి. శివాజీచరిత్రము, హైందవచక్రవర్తులు అను రెండుగ్రంథములను వారు వ్రాసి మండలిపక్షమునగాక స్వతంత్రముగా ప్రకటించిరి. వారు వ్రాసిన లక్ష్మణరాయవ్యాసావళిని వారు చనిపోయినపిమ్మట 31 వ కుసుమముగా మండలిపక్షముననే ప్రచురించితిమి. మహారాష్ట్రమహాయుగము వ్రాయకుండగనే వారు మరణించిరి. బ్రిటిషుమహాయుగము కూడ మండలిపక్షమున ఎవరును వ్రాయలేదు. కాని 1933వ సంవత్సరములో 'ఆంగ్ల రాజ్యస్థాపన' మను ఉద్గ్రంథమునకు మానికొండ సత్యనారాయణశాస్త్రిగారు చేసిన ఆంధ్రానువాదమును మా మండలిలో ప్రకటించినాము. 1925 సం॥లో వేలూరి సత్యనారాయణగారు రచించిన "ఫాహియాను భారతవర్షయాత్ర"ను, "బౌద్ధమహాయుగము"ను మా మండలిపక్షమున ప్రచురించినాము.

మా మండలిపక్షమున వెలువడిన ఆరవగ్రంథము మంత్రిప్రగడ సాంబశివరావుగారిచే వ్రాయబడిన పదార్థ విజ్ఞానశాస్త్రము (Physics) ఏడవగ్రంథము వేమూరి విశ్వనాథశర్మగారిచే వ్రాయబడిన రసాయనశాస్త్రము (Chemistry) అయియుండెను. చిలుకూరి వీరభద్రరావుగారు మా మండలి లోని 8, 18 కుసుమములగు ఆంధ్రులచరిత్రయొక్క ఒకటి, రెండు భాగ ములు వ్రాసిరి. మా మండలియొక్క 4 వ గ్రంథము వేలాల సుబ్బారావు గారు వ్రాసిన రాణీసంయుక్త, 9 వ గ్రంథము భోగరాజు నారాయణ మూర్తిగారు రచించిన విమలాదేవి. 26వ గ్రంథము కేతవరపు వెంకటశాస్త్రి గారిచే రచించబడిన రాయచూరుయుద్ధము, 27వ గ్రంథము దుగ్గిరాల రాఘవచంద్రయ్యగారిచే వ్రాయబడిన విజయనగరసామ్రాజ్యము, 28వ గ్రంథము ఏ. వి. నరసింహంపంతులుగారిచే వ్రాయబడిన పాతాళభైరవి, 37వ గ్రంథము భోగరాజు నారాయణమూర్తిగారు రచించిన అల్లాహో అక్బరు అను చరిత్రాత్మకనవలలు తెనుగులో స్వతంత్రముగా వ్రాయబడినవై యున్నవి. వాటిని వ్రాసినవారికందరికి బహుమతులనిచ్చినాము. స్వతంత్ర తెలుగునవలలనే ప్రోత్సహించినాము, కాని ఇతరభాషలనుండి నవలలను తెనుగులోకి అనువాదముచేయించుటను మేము తలపెట్టలేదు. రావుబహదూర్ కందుకూరి వీరేశలింగం పంతులుగారు తమ స్వీయచరిత్రను రెండుభాగము

లుగా వ్రాసి మాకు దయచేసి మా యుద్యమమును ప్రోత్సహించినారు. వాటిని మేమే 15, 28వ కుసుమములుగా ప్రచురించినాము. అటులనే కట్టమంచి రామలింగారెడ్డిగారు కూడ అర్థశాస్త్రమును రెండుభాగములుగా వ్రాసి మాకిచ్చి మమ్ము ప్రోత్సహించినారు. వాటిని 21, 26 కుసుమములుగా ప్రచురించినాము. వారి అర్థశాస్త్రమునకు పీఠికను నేను వ్రాసినాను. మా 17వ కుసుమము ఢిల్లీదర్బారు హరిసర్వోత్తమరావుగారిచే వ్రాయబడినది. 10, 11, 12, 13, 14, 15, 20, 23, 24, 30 కుసుమములు కూడ ప్రకృతిశాస్త్ర గ్రంధములు. మొత్తము 13 ప్రకృతిశాస్త్రములను ప్రచురించినాము. వాటిని నిపుణులైనవారు వ్రాసి యివ్వగా మేము వాటిని ప్రచురించినాము. 19, 22 కుసుమములు ఇద్దరు మహాపురుషులజీవితములు. ఇటుల 1916 వ సంవత్సరమువరకు మా మండలి చురుకుగా పనిచేసెను. అప్పటికి ముప్పదిగ్రంధములను ప్రచురించితిమి. అపుడు యుద్ధమువచ్చి కాగితము చాలా ప్రియమైనందునను, కాగితము దొరకుటకూడ దుర్లభమైనందునను మండలిపని చురుకుగా సాగలేదు.

అదివరకే పోలవరం రాజా శ్రీ కొచ్చర్లకోట వెంకట కృష్ణారావుగారు సరస్వతీగ్రంధమాలను స్థాపించి సాహిత్య వాఙ్మయగ్రంధములను ప్రచురించియుండిరి. మా మండలి స్థాపనమైనతరువాత బందరులో ఆంధ్రభాషాభివర్ధిని స్థాపింపబడి ఆరు స్వతంత్రగ్రంథములను ప్రచురించినది. ఆరు బంగాళీనవలల తర్జుమాలు ప్రకటించినది. బరంపురంలో వేగుచుక్క గ్రంధమాల కొన్ని మంచి పుస్తకములను అచ్చువేసి ఆగిపోయినది. రాజమహేంద్రవరము నుంచి ఆంధ్రప్రచారిణీగ్రంధమాల చాలవరకు బంగాళము మొదలగు నితరభాషలనుంచి నవలలను తెనుగులోని కనువదించినవి ప్రచురించియు, కొన్నినవలలను స్వతంత్రముగా తెనుగులో వ్రాయించియు భాషాసేవచేసినది. చెలికాని లచ్చారావుగారి ఇతిహాసపరిశోధకమండలి కొన్ని యుద్గ్రంధములను ప్రచురించినది. కొంతకాలమునకు శ్రీ శనివారపు సుబ్బారావుగారు ఒక గ్రంధమండలిని, ముదిగంటి జగ్గన్నశాస్త్రి గారు తణుకులో వల్లెటూరి గ్రంథమండలిని స్థాపించి కొన్ని ప్రశస్తమైన పుస్తకములను ప్రచురించియున్నారు. ఇట్లే ఆకాలములో మరి కొన్ని గ్రంథమాలలు కూడా స్థాపింపబడి కొంత పనిచేసినవి.

1912 వ సంవత్సరము మేము విజ్ఞానచంద్రికాపరిషత్తు అనుపేర వైజ్ఞానిక, చారిత్రక, శాస్త్రీయగ్రంథములలో పరీక్షలను ఏర్పాటుచేసినాము. మా మండలినుండి వెలువడినట్టి కాని, యితరులు వ్రాసినట్టి కాని గ్రంథములలో యుక్తమైనవానిని పఠనీయగ్రంథములుగా నిర్ణయించి మా పరీక్షలను జరిపితిమి. గుంటూరు, బందరు, బెజవాడ, నరసాపురము, రాజమహేంద్రవరము, కాకినాడ, హైదరాబాదు మొదలైన ప్రదేశములలో పరీక్షాకేంద్రములను నెలకొల్పితిమి. చాలమంది యువతులు, యువకులు ఉత్సాహపూరితులై మేమునిర్ణయించినగ్రంథములను చదివి పరీక్షలకు హాజరైరి;పరీక్షలలో జయమొందిరి. పరీక్షలలో జయమొందినవారికి రు 116 ల బహుమానములను, బంగారు, వెండిపతకములను, యోగ్యతాపత్రములను ఇచ్చితిమి. ఆ పరీక్షలలో ఉత్తీర్ణులైనవారిలో పిమ్మట దేశములో ప్రాముఖ్యమునొందినవారు కూడ గలరు. పిమ్మట కవీశ్వరురాలై భాషాపోషకురాలై ప్రసిద్ధిగన్న శ్రీమతి కాంచనపల్లి కనకమాంబగారు మాపరీక్షలో ప్రథమశ్రేణిలో కృతార్థురాలై రు 116 ల బహుమతిని పొందియుండెను. రావు బహదూరు కందుకూరి వీరేశలింగం పంతులుగారు, కట్టమంచి రామలింగారెడ్డిగారు, వనప్పాకం శ్రీనివాసాచార్యులుగారు మొదలైన మహామహులు పరీక్షాధికారులుగా నుండుటకు సమ్మతించి మా కెంతయో తోడ్పడిరి. ఈవిధముగా కొన్నిసంవత్సరములు తెనుగుభాషలో ప్రచురించబడిన నవీన విజ్ఞానమును ప్రజలలో వ్యాపింపజేయుటకు కూడ మేము కృషిసలిపితిమి.

1915 వ సంవత్సరమునుంచీ లక్ష్మణరావుగారికి ఆంధ్రభాషలో విజ్ఞానసర్వస్వము వ్రాయవలెనను కోరిక కూడ కలిగెను. కమిటీలో మమ్మును కొందరిని కూడ వేసికొనిరి. కాని దానిభారమంతయు వారే మోసిరి. డాక్టర్ కేట్కర్ అను నొక మహారాష్ట్ర విద్వాంసుడు చెన్నపట్టణములో లక్ష్మణరావుగారియింటిలో కొన్నిరోజులు, బెజవాడ వచ్చి మా యింటిలో కొన్నిరోజులు కాలముగడిపెను. ఆయన మహారాష్ట్రభాషలో విజ్ఞానసర్వస్వమును ప్రచురించుటకు ప్రయత్నముచేయుచుండెను. తర్వాత అచిరకాలములో గొప్ప మహారాష్ట్ర విజ్ఞానసర్వస్వమును ప్రచురించెను కూడాను. ఆయనయొక్క యుదాహరణము లక్ష్మణరావుగారిని ఆపనికి పూనుకొను

టకు ప్రోత్సహించెను. లక్ష్మణరావుగారికాలములో విశేషభాగము విజ్ఞాన సర్వస్వమును వ్రాయుటలోనే గడచెను. చారిత్రకపరిశోధనలకై అనేక శాసనములు చదువవలసివచ్చెను. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు శాసనములు చదువుటలోను, వ్యాసములు వ్రాయుటలోను, విజ్ఞానసర్వస్వ ప్రచురణకార్యక్రమములోను లక్ష్మణరావుగారికి సహాయకులుగా పనిచేసిరి. లక్ష్మణరావుగారు తరుచుగా ఉబ్బసంవల్ల బాధపడుతుండేవాడు. విజ్ఞానసర్వస్వ రచనపనివలన ఆయనఆరోగ్యము చెడిపోయినది. దానిని ఆయన లక్ష్యపెట్టక ఆ పనిలోనే నిమగ్నులై యుండెను. "అ" అను అక్షరముతో మూడుసంపు టములను లక్ష్మణరావుగారు ప్రచురించిరి. ఆంధ్రవిజ్ఞానసర్వస్వముయొక్క స్థాపనగౌరవమంతయు లక్ష్మణరావుగారిదే. అందులో వివిధవిషయములపైన వారు స్వయముగా రచించిన వ్యాసములు 35. ఈ 35 వ్యాసములపరిమితి పదకొండువందలపుటలయినవి. ఈ వ్యాసములలో భాషావిషయకవ్యాసములు 11, ధర్మశాస్త్రవిషయకములు 9, చారిత్రకవిషయకములు 7, ప్రకృతిశాస్త్రి విషయకములు 2, గణితవిషయకములు 2. గాడిచర్ల హరిసర్వోత్తమరావు, వేమూరి విశ్వనాథశర్మగార్లుకూడ కొన్నివ్యాసములు వ్రాసిరి. లక్ష్మణరావు గారు 1923 వ సంవత్సరము జూలై నెల 13 వ తేదీన చన్నపట్టణములో ఎగ్మూరులోని వేదవిలాసములో ఆకస్మికముగా అకాలమృత్యువు వాత పడిరి. వారి కప్పుడు 46 సంవత్సరముల వయసు మాత్రమే యుండెను. ఆయన మహాపురుషుడు, అతి పవిత్ర వర్తనుడు. మా హరిసర్వోత్తమ రావు వ్రాసినట్లు మాకు అన్నయ, మాకు సారధి, సచివుడు, సఖుడు, గురుడు మమ్ముల విడనాడి చనిలెను. దుఃఖసముద్రములో ముంచి దివి కేగెను. ఆయన అకాలమరణమువలన ఆంధ్రదేశమునకు, ఆంధ్రభాషకు తీరనికొరత కలిగినది. ఆ వేదవిలాసమునందే 1919 సంవత్సరమున వీరేశ లింగంపంతులుగారు మరణించియుండిరి. లక్ష్మణరావుగారు వారిని తమ యింటికి తీసుకొనివచ్చి ఆఖరు సేవ చేయుచుండగా వారు మరణించిరి. లక్ష్మణరావుగారికి వీరేశలింగంగారు గురుతుల్యులు. వీరేశలింగంపంతులు గారు (ట్రస్టుగా) ధర్మముగా వదలిపోయిన వితంతుశరణాలయము, వీరేశ లింగంహైస్కూలు, టౌనుహాలు మొదలగు సంస్థల నన్నిటిని నిర్వహణము

చేయుటకు ఏర్పడిన రాజమహేంద్రవరములోని హితకారిణీ సమాజములో నన్నొక సభ్యునిగ నియమించినందున నేను కొన్నిసంవత్సరములు దానిలో సభ్యుడుగ నుంటిని.

(4)

నాకు బెజవాడలోనున్న పనిచే తీరికలేక 1921 వరకు నేను గ్రంథ రచనకు పూనుకొనలేదు. 1922 వ సంవత్సరము ఫిబ్రవరిలో బ్రిటిష్ప్రభుత్వమువారు పన్నులనిరాకరణముక్రింద నన్ను అరెస్టుచేసి ఒక సంవత్సరము ఖైదులోనుంచిరి. రెండునెలలు రాజమహేంద్రవరముజైలులో వుంచి, పిమ్మట కడలూరుజైలుకు పంపిరి. నేను జైలులోనున్నకాలములో లోకమాన్య బాలగంగాధరతిలకుగారి యుదాహరణముననుసరించి తెలుగులో నేవేని గ్రంథములను వ్రాసిన విజ్ఞానచంద్రికామండలిపక్షమున ప్రచురించవలెనను దృఢసంకల్పముండెను. స్వరాజ్యముకొరకు పోరాడుచున్నాము గనుక స్వరాజ్య స్వరూప స్వభావములు తెలియుటకు ఫ్రెంచివిప్లవమును, ఆ సిద్ధాంతములను ప్రథమమున అమలుజరిపి ఇంగ్లాండుతో పోరాడి స్వతంత్రమును సంపాదించుకొని రాజులు, ప్రభువులు లేని సంపూర్ణ ప్రజాస్వామ్యమును స్థాపించుకున్న అమెరికా సంయుక్తరాష్ట్రములచరిత్ర వ్రాయనుద్దేశించితిని. జాతీయతత్వము, ప్రజారాజ్యము, మానవసమానత్వము, సోదరత్వము, స్వతంత్రము ఫ్రెంచివిప్లవముయొక్క మూలసిద్ధాంతములు. ఈ సిద్ధాంతములను ప్రజలలో వ్యాపింపచేయుట కెన్నియో గ్రంథములు వ్రాయబడినవి. ఎంతయో వాఙ్మయము పుట్టినది. రూసో మొదలైనవా రెన్నియో త్యాగములుచేసినారు. ఈ విప్లవఫలితముగ రాజరికము, ప్రభుపరంపర, జమీందారీవిధానము రద్దయి, తలకొకఓటు కలిగిన ప్రజారాజ్య మేర్పడినది. మతస్వేచ్ఛ కలిగినది. గాని హింసావిధానప్రయోగమే సాధనమైనందున పొందబడిన ఫలితములు నిలకడగ నుండలేదు. ఫ్రెంచిరాజకీయనాయకులు సామ్రాజ్యతత్వమవలంబించుటవలనకూడ ఆసిద్ధాంతములు విఫలమైనవి. నేను జైలుకు తీసుకొనిపోయిన పుస్తకములను, నాతోపాటు జైలులోపెట్టబడిన మిత్రులవద్దనున్నపుస్తకములను చదివి, ఇంకను కొన్నిపుస్తకములు కావలె

నని లక్ష్మణరావుగారికి కబురంపితిని. ఆయన 1922 వ సంవత్సరముఆగస్టు నెలలో కడలూరుజైలుకు వచ్చి అధికారులఅనుమతిని పొంది నన్ను చూచెను. **'American war of Independence'** అమెరికా స్వతంత్ర యుద్ధము అను ఇంగ్లీషుగ్రంథమును, ఫ్రెంచి విద్యామంత్రి 'డ్యూరే' ఫ్రెంచిభాషలో రచించి ఆంగ్లములోనికి భాషాంతరీకరించబడిన ఫ్రెంచి చరిత్రయొక్క రెండుసంపుటములను ఆయన తీసుకొనివచ్చి యిచ్చెను. వాటిని పరీక్షించి జైలు సూపరెంటెండెంటు వాటిలో అమెరికా స్వతంత్ర యుద్ధమను గ్రంథమును చదువుకొనుటకు నాకిచ్చుటకు వీలులేదని ఆక్షేపించెను. గాని అది బ్రిటిషువారిమీద ఇండియా చేయుచున్న తిరుగుబాటుతో నెట్టి సంబంధము లేనిదనియు వట్టి చరిత్రగ్రంథమనియు నేను చెప్పగా, నా మాటనమ్మకముమీద ఆయన ఆ రెండుగ్రంథములను చదువుకొనుటకు నాకిచ్చెను. నేను కడలూరుజైలు ఆవరణములో నా గదికెదురుగనున్న వేప చెట్టుక్రింద కూర్చొని ఫ్రెంచివిప్లవమును, అమెరికా సంయుక్తరాష్ట్రము లను వ్రాసితిని. ఆ సమీపముననున్న పనసచెట్లు, పోకచెట్లు, చూత నారికేళ వృక్షములు మిగుల మనోహరముగా నున్నవి. పగలు ఆవరణములో తిరుగ వచ్చును. సాయంత్రం ఆరుగంటలు కాగానే ఎవరిగదిలో వారిని పెట్టి తాళమువేసిరి; గనుక ఉదయపుపూటనే గ్రంధములుచదువుచు వ్రాయుచుంటిని. ఆజైలులో ఆచెట్లమధ్య మానవస్వతంత్రోద్యమములనుగూర్చివ్రాయుచుండిన కాలమే నా జీతములోకెల్ల మహదానందముగానున్న కాలము. ఆ చెట్లుకూడ నావలెనె పరమాత్మయొక్కబిడ్డలు, నా కనుంగు సోదరులై ప్రేమాస్పదముగా నుండెను. ఆవిదముగ వాటి సహవాసము ననుభవించితిని. అది యొక ఋషి వాటికగా నాకు కనుపడెను. ఫ్రెంచివిప్లవమని పేరు పెట్టినచో అప్పటి ప్రభుత్వమువారు దానిని నిషేధింతురేమోననుతలంపుతో ఫ్రెంచి స్వాతంత్ర్యవిజయమని నామకరణముచేసితిని. కడలూరుజైలులోనున్న పదినెలలలో ఏడునెలల కాలము నాకు సన్ననిజ్వరము వచ్చుచుండెను. ప్రతిరోజు జైలులోని ఆసుపత్రికి పోయి సీసాతో మందు తెచ్చుకొనుచుంటిని. దైవానుగ్రహమువలన ఆఖరు మూడునెలలు జ్వరము లేనందున వ్రాతపని బాగుగా సాగెను....

1923 వ సంవత్సరము ఫిబ్రవరి నెలలో నన్ను కారాగృహమునుంచి

విడుదలచేసిరి. కడలూరునుంచి రైలులో మద్రాసులోని ఎగ్మూరుస్టేషనులో దిగితిని. లక్ష్మణరావుగారును, నాతో అదివరకు జైలులో సహవాసియై దీగానుండి నాకంటెముందే విడుదలైన నా మిత్రులగు కర్ణాటకసవాబుగారును, నన్ను ఎగ్మూరుస్టేషనులో కలిసి సన్మానించిరి. నేను లక్ష్మణరావుగారియింట దిగి మూడురోజులు మద్రాసులోనే యుంటిని ఆరాత్రి కర్ణాటకసవాబుగారు తమ యింటికి విందుకు పిలువగా నేను వెళ్ళితిని. వారిమిత్రులు కొందరుకూడా వచ్చిరి. విందారగించితిమి. లక్ష్మణరావుగారుమాత్రము ఆ విందుకు రాలేదు. నేను లక్ష్మణరావుగారియింట నున్నపుడు, నేను జైలులోవ్రాసిన రెండు గ్రంథములను వారికి చూపించితిని. వారు వానిలోనిభాగములను చదివి బాగున్నవని చెప్పిరి. తరువాత నేను బెజవాడకు వెళ్ళితిని. ఇంకా కొన్ని పుస్తకములనుకూడ చదివి ముందుగా ఫ్రెంచి స్వాతంత్ర్యవిజయము మొదటి భాగము, 250 పేజీలుగలదానిని అచ్చువేయుటకు సిద్ధపరచితిని. 1923 వ సంవత్సరము డిసెంబరులో కాకినాడలో కాంగ్రెసుమహాసభ మౌలానా మహమ్మదాలీగారి అధ్యక్షతను జరుగనున్నది. దానికంటెముందుగనే నా ఫ్రెంచి స్వాతంత్ర్యవిజయమును ప్రచురించుటకు నిశ్చయించితిని. నేను దానిని ప్రచురించుటకు యత్నించుచుండగనే 13-7-23 తేదీన ఆకస్మికముగా లక్ష్మణరావుగారు మరణించిరను పిడుగువంటి వార్త నాకు బెజవాడలో చేరినది. మా కుటుంబము దుఃఖించినాము. నేను చెన్నపట్టణము వెళ్ళి వారి కుటుంబమును పరామర్శచేసి వచ్చితిని. ఆ సంవత్సరము నవంబరునెలలో ఫ్రెంచి స్వాతంత్ర్యవిజయమును బెజవాడలోనే అచ్చొత్తించి విజ్ఞానచంద్రికా మండలిపక్షమున ప్రచురించితిని. ఆ సంవత్సరముననే లక్ష్మణరాయవ్యాసావళిని కూడ డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారు విజ్ఞానచంద్రికామండలి కుసుమముగా ప్రచురించి, రెంటిని విజ్ఞానచంద్రికామండలి పక్షమున ప్రకటించుచున్నామని మద్రాసునుంచి మేనేజరుగా ప్రకటించిరి. నేను నా ఫ్రెంచి స్వాతంత్ర్యవిజయమును కీర్తిశేషులైన లక్ష్మణరావుగారికి అంకితమిచ్చితిని.

పిమ్మట. కొంత కొంత చేర్చి "అమెరికా సంయుక్తరాష్ట్రములు" అను గ్రంథమునుకూడ విజ్ఞానచంద్రికామండలిపక్షమున నేను 1925 వ సంవత్సరమున ప్రచురించితిని. అది మూడువందలపేజీల గ్రంథము. ఆ

గ్రంథములో పదమూడు అమెరికా సంయుక్తరాష్ట్రముల నిర్మాణము, అమెరికా స్వతంత్రపోరాటము, అమెరికా రాజ్యాంగవిధానము, ప్రాథమిక హక్కులు, బానిసత్వపురద్దు, నీగ్రోసమస్యలు, విదేశాంగరాజనీతి, ఫిలిప్పైనులస్వతంత్రోద్యమము, అమెరికాయొక్క ఆర్థికాభివృద్ధి మొదలైన విషయములను వ్రాసితిని. ఆ గ్రంథమునకు డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్య గారు చక్కని పీఠిక వ్రాసిరి.

1912 వ సంవత్సరములో విజ్ఞానచంద్రికామండలిని రిజిష్టరుచేసితిమి. రావిచెట్టు రంగారావుగారు మరణించిరి. మునగాలరాజాగారు సభ్యులుగా మానుకొని బయటనుండి సహాయముచేసెదమనిరి. హరిసర్వోత్తమరావు గారు మరల సభ్యులు కాలేదు. కావున కొమర్రాజు లక్ష్మణరావుగారు, డాక్టరు ఆచంట లక్ష్మీపతి, గూడూరు రామచంద్రరావు, వేమూరి విశ్వనాథశర్మ, తాడినాడ వెంకట్రామయ్యగార్లు, నేను సభ్యులముగను, బయ్యా నరసింహేశ్వర శర్మగారు అధ్యక్షులుగను కమిటీని పునర్నిర్మాణముచేసితిమి. 1916 నుండి ఈ కమిటీ గ్రంథప్రచురణ చేయలేదు. 1923 లో లక్ష్మణరావు గారు మరణించిరి. గావున 1924 సంవత్సరములో గ్రంథమండలిని బెజవాడకు తీసుకొనివెళ్ళి మా యింటిలో కార్యస్థానమేర్పరచి కమిటీని మరల పునర్నిర్మాణముచేయుంచితిమి. డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారు అధ్యక్షులుగను, అయ్యంకి వెంకటరమణయ్యగారు కార్యదర్శిగను, నేను మేనేజరుగను, గూడూరు రామచంద్రరావు, దిగవల్లి వెంకటశివరావు, జయంతిపురముడాజాగారగు వాశిరెడ్డి దుర్గాసదాశివేశ్వర ప్రసాదుగార్లు సభ్యులుగను గావించితిమి. ఈవిధముగా నేప్పడి 1934 సంవత్సరమువరకు పదకొండు మంచి గ్రంథములను విజ్ఞానచంద్రికామండలిపక్షమున ప్రచురించుటయే గాక విజ్ఞానచంద్రికామండలికి అనుబంధముగ రాజకీయ విజ్ఞానప్రచురణములను అయిదుపుస్తకములను కూడ ప్రచురించితిమి. మండలికార్యస్థానము విజయవాడకు తెచ్చినపిమ్మట ప్రచురించబడిన మొదటిపుస్తకము నేను వ్రాసిన అమెరికా సంయుక్తరాష్ట్రములు. కాగితపుధర, అచ్చుఖర్చులు పెరిగినందున వెనుకటివలె నూరుపేజీలకు నాలుగణాలచొప్పున ఇచ్చుటకు వీలు లేకపోయినది. వీలయినంత చవుకగా, లాభముపొందునుద్దేశ్యము లేకుండ

ధర నిర్ణయించితిమి. 1916 నుండి చందాదారులు మృగ్యమైరి. గనుక చందాదారులు చేరినను చేరకున్నను మామూలుగానే కావలసినవారికి గ్రంథముల నమ్మితిమి.

నేను 1923 వ సంవత్సరము ఫిబ్రవరినెలలో కడలూరుజైలునుంచి విడుదలై వచ్చిన కొలదిరోజులలో బెజవాడలోని మా మేడమీదనే ఆంధ్ర రాష్ట్రకాంగ్రెసు వర్కింగుకమిటీవారు కొండా వేంకటప్పయ్యగారి అధ్యక్షత క్రింద సమావేశమై, అదివరకు ప్రధానకార్యదర్శిగానున్న గొల్లపూడి సీతా రామశాస్త్రిగారు ఖద్దరుసంస్థను నడుపుటకై రాష్ట్రకాంగ్రెసు కార్యదర్శిత్వ మును మానుకొన నిశ్చయించినందున, ప్రధానకార్యదర్శిగా ఉండవలెనని నన్ను కోరగా నే నా పదవిని స్వీకరించితిని. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీ కార్యస్థానము గుంటూరునుంచి బెజవాడకు మార్చి దానిని మా యింటిలోనే యుంచిరి. బెజవాడలో 1922 లో ఒక భవనమును కొని దానికి ఆంధ్ర రత్నభవనమను పేరుపెట్టి అందులో గృహప్రవేశముచేయువరకు ఆంధ్ర రాష్ట్రకాంగ్రెసు ఆఫీసు మా యింటిలోనే యుండెను. దానికి నేను అద్దె పుచ్చుకొనలేదు. నేను ప్రధానకార్యదర్శిగా నుంటిని. వర్కింగుకమిటీ మీటింగులు మా యింట్లో జరుగుచుండెను. వచ్చిన నాయకులలో చాలవరకు నా కతిథులుగా నుండిరి. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సర్వసభ్య సమావేశములు మాత్రము సాధారణముగా బెజవాడలో అరండలుసత్రములో జరిగెను. భాగ వతుల సుబ్బరామయ్యగారు దానికి మేనేజరుగా నుండెను. వేలూరి సత్య నారాయణ, బి.ఏ.,బి.ఎల్. గారు మాతోకూడ కడలూరుజైలులో నున్న మిత్రులు. 1924 నుంచి ఆయనను ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీకి సహాయ కార్యదర్శిగా నావద్ద పనిచేయుటకు జీతముమీద నియమించిరి. ఆయన విజ్ఞాన సంపన్నుడు; దేశాభిమాని; గ్రంథములు వ్రాయవలెనను కోరిక కల వాడు; ఆయన మాయింటిలో నావద్ద పనిచేయుచున్నకాలములోనే కొన్ని గ్రంథములను చదివి బౌద్ధమహాయుగము, 'ఫాహియాను భారతవర్షయాత్ర' అను రెండు శ్రేష్ఠమైన గ్రంథములను మిగుల మనోహరముగా వ్రాసి యివ్వగా వాటిని 34, 35 కుసుమములుగా విజ్ఞానచంద్రికామండలిపక్షమున ప్రచురించితిమి.

బాగుగా పైకివచ్చుచున్న లాయరు, ఆంధ్రభాషాసేవ చేయవలెనని గొప్ప కుతూహలము గలవాడు, మేధాసంపన్నుడు, చక్కనిశైలిలో వ్రాయు సమర్థుడు, మా మండలిసభ్యుడునైన దిగవల్లి వేంకటశివరావుగారిని దక్షిణాఫ్రికాచరిత్రను వ్రాయ ప్రోత్సహించితిని. వారు బోయరుయుద్ధము, డొమినియనుప్రతిపత్తితో దక్షిణాఫ్రికాసమితి, భారతీయులఇక్కట్లు, గాంధీమహాత్ముని సత్యాగ్రహోద్యమము మొదలైనవాటిని బహు రమ్యముగా రచించిరి. దానిని 1925 లో 36వ కుసుమముగా మా మండలిపక్షమున ప్రచురించితిమి. పిమ్మట హిందూ ముసల్మాను ఐక్యతను బోధించు ఒక చరిత్రాత్మకనవలను చక్కగా వ్రాసినవారికి అయిదువందల రూపాయల బహుమతి యిత్తుమని మా మండలిపక్షమున ప్రకటించితిమి. కొన్ని నవలలు మా కార్యస్థానమునకు వచ్చినవి. వాటినన్నిటిని పరీక్షించి చూచి భోగరాజు నారాయణమూర్తిగారు వ్రాసిన "అల్లా హో అక్బర్" అను నవలను ఉత్తమమైన నవలగా నెంచి అయిదువందలరూపాయల బహుమతిని వారికిచ్చి, దానిని విజ్ఞానచంద్రికామండలియొక్క 37 వ కుసుమముగా ప్రచురించితిమి.

1930 వ సంవత్సరము ఏప్రిలునెలలో ఉప్పుసత్యాగ్రహములో నన్ను మరల ఒక సంవత్సరము జైలుకు పంపిరి. కొద్దికాలము తిరుచినాపల్లి జైలులోను, ఎక్కువకాలము రాయవేలూరు జైలులోను గడిపితిని. 1931 వ సంవత్సరము మార్చినెలలో గాంధీ-ఇర్వినుఒడంబడిక జరిగినందున మమ్ములనందరిని ఆనెలలోనే, అనగ 11 నెలలకే జైలునుంచి విడిచి పెట్టిరి. నేను జైలుకు పోకముందు ఆశియాఖండములోని స్వతంత్రపోరాటములనుగురించి చదువుచుంటిని. నాకు అన్నిటికన్న తురుష్కదేశముయొక్క స్వతంత్రపోరాటము ముస్తఫా కెమాల్ పాషా నాయకత్వముక్రింద సంపూర్ణముగాను, జయప్రదముగాను జరిగినదని తోచినది. అంతేకాక నిరంకుశసుల్తానును త్రోసివేసి సంపూర్ణ ప్రజారాజ్యమును,ఖిలాపతును తీసివేసి పూర్తియైన మతస్వేచ్ఛను స్థాపించిరి. స్త్రీలయొక్క పరదాను తొలగించి వారికి సంపూర్ణస్వతంత్రమును, రాజకీయహక్కులను, మానసికవికాసమును కలుగచేసిరి. బహుభార్యాత్వమును నిషేధించిరి. ఆశియాఖండములోని ఇరాను,(పర్షియా)ఆఫ్ఘనిస్తానము,సోవియటు రష్యా, అజ్జరు బజ్జన్ దేశముల

ప్రభుత్వములతోను,ఇండియా,ఈజిప్టు జాతీయవాదులలోను పరస్పరసహాయక ఒడంబడికలను ముస్తఫాకెమాల్ పాషాగావించి ఆసియా ఉత్తరఆఫ్రికాలఐక్య తను నెలకొల్పెను.1946లో పండితజవహర్ లాల్ నెహ్రూ జరిపిన బాండుంగు (ఆసియా ఆఫ్రికాఖండముల దేశముల) సమావేశముయొక్క యుద్దేశము లను ఆయన ఆకాలమందే నెరవేర్చెను. అపుడు ఆఫ్ఘనిస్థానమును అమా నుల్లా రాజు పాలించుచుండెను. ఆయన, ఆయనభార్య రాణి సౌర్యాదేవి జాతీయవాదులు. సాంఘికవిషయములలో మిగుల యభివృద్ధికరమైనభావ ములు గలవారు. ఆమె పర్దాను విసర్జించి భర్తతోకూడ యూరపులో సంచా రముచేసినది. ఆయన ఇండియా, ఈజిప్టు, టర్కీ జాతీయవాదులకు మద్ద తుగా నున్నందున బ్రిటిషుసామ్రాజ్యవాదులు ఆఫ్ఘనిస్తానములో కొన్నిజాతుల తిరుగుబాటులను లేవదీసి ఆయనను రాజ్యభ్రష్టునిగావింపచేసి బచ్చా సాకో అను నీళ్ళకావళ్ళ మోసుకునేవాణ్ణి సింహాసనమెక్కించిరి. కొద్దికాలమునకు బచ్చాసాకోను తీసివేయించి మరియొకరిని తమకనుకూలముగానున్నవారిని సింహాసనమెక్కించిరి. అందువల్ల నేను 1930 వ సంవత్సరము జైలుకు వెళ్ళేముందు తురుష్క స్వతంత్రపోరాటమును గురించి కొన్ని పుస్తకములను చదువనారంభించి, వాటిని నాతోకూడ జైలుకు తీసుకొని పోతిని. జైలులో ఆ స్వతంత్రపోరాటకథను చాలవరకు వ్రాసితిని. జైలు నుంచి వచ్చినతరువాత మరికొన్ని గ్రంథములను చదివి ఆ గ్రంథమును పూర్తిచేసితిని. దానికి—"**Turkish Republic**" "తురుష్క ప్రజా స్వామిక"మని పేరిడితిని. ఇది 550 పేజీల గ్రంథము. 1933 వ సంవ త్సరములో దీనినికూడ విజ్ఞానచంద్రికామండలిపక్షమున 39 వ కుసుమ ముగా ప్రచురించితిమి. ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగా నున్న నా మిత్రులు కట్టమంచి రామలింగారెడ్డిగారు నా గ్రంథమునకు ఉజ్జ్వలమైన పీఠికను ఇంగ్లీషులో వ్రాసిరి. దానిని తెనుగులోనికి నా మిత్రులగు దిగవల్లి వెంకటశివరావుగారు చక్కగా అనువదించిరి.

అదివరకే 1930 వ సంవత్సరములో నేను జైలులోనున్నకాలము లోనే స్వతంత్రపోరాటములో అనేకసార్లు కారాగృహవాసముచేసినవారును సుప్రసిద్ధ గ్రంథకర్తలు నగు నూనికొండ సత్యనారాయణశాస్త్రిగారు లోక

మాన్య బాలగంగాధరతిలకుగారు రచించిన (The arctic home of the Vedas) పై దికనిర్ణయము గ్రంథమును తెనుగులోకి తర్జుమాచేసి యిచ్చినందున మా మండలివారు దానిని 38 వ కుసుమముగా ప్రచురించి యుండిరి.

పిమ్మట 40 వ గ్రంథముగా దిగవల్లి వెంకటశివరావుగారు వ్రాసిన (1933) 'అధినివేశస్వరాజ్యము'ను, 41వ గ్రంథముగా మానికొండ సత్యనారాయణశాస్త్రిగారు రచించిన (1934) 'ఆంగ్ల రాజ్య స్థాపనము'ను, 42, 43 గ్రంథములుగా సుప్రసిద్ధ దేశభక్తులగు ఆత్మకూరి గోవిందాచార్యులుగారు రచించిన 'భారతదేశము-ఆర్థికచరిత్ర' అను గ్రంథముయొక్క రెండుసంపుటములను (1934) మా మండలిపక్షమున ప్రచురించితిమి.

(5)

ఈ పై గ్రంథములనే గాక మా మండలి కనుబంధముగా రావిచెట్టు రంగారావుగారి జీవితమును ఆదిరాజు వీరభద్రరావుగారు వ్రాసినది ప్రచురించబడియుండెను. అంతేగాక పిమ్మట రాజకీయ విజ్ఞానప్రచురణములను నూరు పేజీలకు మించని అయిదు చిన్న పుస్తకములను కూడ ప్రచురించితిమి.

వాటిలో—1. ఆంగ్ల రాజ్యాంగము, 2. భారతదేశ స్థితిగతులు తెలుపు అంకెలు అనువాటిని (1933) దిగవల్లి వెంకటశివరావుగారు వ్రాసిరి. 3. చైనా యువజనోద్యమమును (1931) నేను వ్రాసితిని. 4. భారతదేశపు రైతు అనుదానిని (1935) వాశిరెడ్డి దుర్గాసదాశివేశ్వరప్రసాదుగారు వ్రాసిరి. వీరు ఆంధ్రములోను, పాళీభాషలోను మంచి పండితులు. ఆదివరకే పాళీ భాషనుండి ధమ్మపదమను సుప్రసిద్ధ బౌద్ధగ్రంథమును తెనుగులోనికి అనువాదముచేసియుండిరి. 5. రాష్ట్రీయస్వపరిపాలనమును (1935) దిగవల్లి వెంకటశివరావుగారు వ్రాసిరి.

ఇది విజ్ఞానచంద్రికామండలి చేసినపని. 1934 లో అయ్యంకి వెంకటరమణయ్యగారితో మాకు భేదాభిప్రాయములు కలిగి మండలికార్యస్థానమును జయంతిపురము పంపినాము. అక్కడినుంచి 3, 4, 5 రాజకీయ

ప్రచురణములను మాత్రము ప్రచురించినాము. అంతటిలో పని ఆగిపోయి నది. కాని పిమ్మట కూడ నేను మూడు గ్రంథములు వ్రాసి స్వతంత్రముగా ప్రచురించినాను. దిగవల్లి వెంకటశివరావుగారు బహుళ గ్రంథకర్త. పిమ్మట అనేక గ్రంథములు వ్రాసినారు. ఇంకను వ్రాయుచున్నారు ఆయన ఆంధ్ర భాషాసేవకూడ తన జీవితధర్మముగా పెట్టుకున్నారు.

నేను 1930 వ సంవత్సరములో జైలులోనున్నకాలములో మా పశ్చిమకృష్ణాజిల్లా కాంగ్రెసుకమిటీ తరఫున దిగవల్లి వెంకటశివరావుగారు రాజకీయప్రచారపుస్తకము లను పేరులో (1) సత్యాగ్రహచరిత్ర, (2) నిర్భాగ్య భారతము, (3) దరిద్రనారాయణీయము, (4) సత్యాగ్రహ బోధిని, (5) విదేశవస్త్ర బహిష్కరణ, (6) బ్రిటిషువస్తు బహిష్కరణ, (7) స్వాంచ జన్యము అను జాతీయగీతముల సంపుటి, (8) బార్డోలీ సత్యాగ్రహవిజయము అను చిన్న పుస్తకములను రచియించగా మా జిల్లా కాంగ్రెసుకమిటీవారు ప్రచురించిరి. వీటితోపాటు చెఱుకుపల్లి వెంకటప్పయ్యగారు రచించిన (1) ఉప్పుసత్యాగ్రహము, (2) త్రాగుడుమానుట అను చిన్న పుస్తకము లను కూడ మా జిల్లా కాంగ్రెసుకమిటీవారు ప్రచురించిరి. వాటిని పశ్చిమ గోదావరిజిల్లా కాంగ్రెసుకమిటీవారును, తూర్పుగోదావరిజిల్లా కాంగ్రెసు కమిటీవారును పునర్ముద్రితము చేసిరి. ఈ మూడుజిల్లాలలో ఈ పది పుస్త కములును విరివిగా అచ్చువేసి పంచిపెట్టబడెను. వేలకువేలప్రతులు ప్రజ లకు అందెను. అందుమీద దిగవల్లి వెంకటశివరావుగారిమీద బెజవాడ సబు డివిజనలుమేజిస్ట్రేటుకోర్టులో రాజద్రోహనేరము చేసినాడని ప్రభుత్వము వారు కేసుపెట్టిరి. కాని గవర్నమెంటుయొక్క అంగీకారపు ఉత్తరువును పొందకుండానే ఆ కేసుపెట్టినారనుకారణముతో మేజిస్ట్రేటుగారు ఆ కేసును కొట్టివేసిరి. మరల ప్రభుత్వమువారి ఉత్తరువుతో రెండవకేసును దిగవల్లి వెంకటశివరావుగారిమీద పోలీసువారు దాఖలుచేసిరి. ఇంతలో గాంధీ— ఇర్విను ఒడంబడిక జరిగినందున రాజకీయనేరస్థులనందరిని విడుదలచేయు టయేకాక రాజకీయకేసులనన్నిటిని ఉపసంహరించుకొనిరి. వాటితోపాటు దిగవల్లి వెంకటశివరావుగారిమీద పెట్టబడిన క్రిమినలుకేసుకూడ ఉపసంహ రించుకొనబడెను. ఇంతలో మేమందరము జైలులోనుంచి విడుదలై వచ్చి

తిమి. 1932 వ సంవత్సరము జనవరిలో మరల నన్ను, నా మిత్రులైన కాకు మాను లక్ష్మయ్య, బొట్టిగడ్డ మధుసూదనరావు, మాకల వీరరాఘవయ్యగార లను పన్నులనిరాకరణమును బోధించుచున్నామను కేసుపెట్టి ఒక సంవత్స రము జైలుకు పంపినారు. ఆ కేసులో దిగవల్లి వెంకటశివరావుగారు వ్రాసి నట్టియు, పైన చెప్పినట్టియు చిన్న పుస్తకములనన్నిటిని మాకు వ్యతిరేక ముగా పోలీసువారు ఫిర్యాదిసాక్ష్యములో దాఖలుచేసినారు. వాటన్నిటికి బాధ్యత మా నలుగురిదేనని ప్రభుత్వపక్షమున వాదింపబడినది. దిగవల్లి వెంకటశివరావుగారు వ్రాసిన పుస్తకములనన్నిటిని ప్రభుత్వమువారు నిషే ధించుచు ప్రభుత్వగెజెటులో ప్రకటనచేసినారు. మామీద పెట్టిన కేసులో మే మెట్టి వాదన చేయలేము. క్రాసుపరీక్ష చేయలేదు. సాక్షులను పెట్టలేదు. మేజిస్ట్రేటుగారు నన్ను మొదటిముద్దాయిగా, నామీద వచ్చినకేసుకు 'మీరు ఏమి చెప్పుతారు' అని నన్నడిగినారు. "మీరు మమ్ములను జైలుకు పంప దలచినారు. మేము జైలుకు పోదలచినాము. అందువల్ల వేరే సంగతులు చెప్పడము అనవసరము; మీ కోర్టుయొక్క కాలము నేను వృధాపరచదలచ లేదు" అని చెప్పితిని. నాతోకూడ నుండిన తక్కిన ముగ్గురు ముద్దాయిలు కూడ అటులనే చెప్పిరి. మమ్ములనందరిని వెంటనే రాజమహేంద్రవరము జైలుకు పంపిరి. రాజమహేంద్రవరము జైలులో కొద్దికాలమున్నపిమ్మట రాయవెల్లూరుజైలులో మిగతకాలమంతయు నుంచిరి.

నేను జైలులోకి తీసుకొనివెళ్ళినట్టియు, తర్వాత జైలుకు తెప్పించు కొనినట్టియు ఇంగ్లీషుగ్రంథముల తోడ్పాటుతో రాయవేలూరుజైలులో చైనా జాతీయోద్యమము అను గ్రంథమును చాలభాగము వ్రాసి 1933 లో జైలు నుంచి విడుదలై బయటకువచ్చినతరువాత మరికొన్ని గ్రంథములనుకూడ చూచి పూర్తిచేసితిని. దానిని అప్పటికి కొద్దికాలముక్రిందనే నా మిత్రులగు చాలాంత్రపు సత్యనారాయణగారు కాకినాడలో స్థాపించిన జాతీయగ్రంథమాల పక్షమున రెండుసంపుటములుగా ప్రచురించినారు. 1935 సంవత్సరములో కాంగ్రెసుమహాసభాధ్యక్షులైన బాబు రాజేంద్రప్రసాదుగారు కాంగ్రెసుస్వర్ణో త్సవసందర్భములో బెజవాడ వచ్చి మా యింటిలో బసచేసినపుడు వారికి ఆ గ్రంథముయొక్క రెండుభాగములను అంకిత మిచ్చితిని. వారు దయతో

అంగీకరించిరి. అందులో ప్రపంచములోకెల్ల పెద్దదయిన చైనాదేశపు చరిత్రను ప్రాచీనకాలమునుండి క్రీ. శ. 1935 సంవత్సరము వరకు వ్రాసితిని. నాపుస్తకములలో నేవియు ఏ గ్రంథములకును తర్జుమాలు కావు. చాలగ్రంథములను చదివి నా యిచ్చవచ్చినటుల విషయనిర్ణయమును చేసికొని వ్రాసినాను.

నేను మరల 1940 — 41 సంవత్సరములో డిటెన్యూగా (నిర్బంధవాసిగా) రాయవేలూరుజైలులో వుంచబడినపుడు ఉపనిషత్తులమీద చిన్న గ్రంథమును వ్రాయుటకు దశోపనిషత్తులయొక్కయు, ఏకాదశోపనిషత్తైన శ్వేతాశ్వతరోపనిషత్తుయొక్కయు వివిధ తర్జుమాలను తెప్పించి జాగ్రత్తగా చదివితిని. శ్రీ రామానుజాచార్యులవారు ఈ దశోపనిషత్తులమీదనే ఆధారపర్చి తమ మహాభాష్యమును వ్రాసినారు. శ్రీ శంకరాచార్యులవారు ఈ దశోపనిషత్తులమీదను శ్వేతాశ్వతర, నృసింహతాపినోపనిషత్తు అను మరిరెండు ఉపనిషత్తులమీదనుఆధారపడి తమ సుప్రసిద్ధ భాష్యము వ్రాసినారు. వారిద్దరు ఆధ్యాత్మిక వైజ్ఞానిక అంతరిక్షములో మహాజ్యోతులై ప్రకాశించుచున్నారు. బైబిలు, ఖురాను చిన్నపుస్తకములు, వాటిని ప్రమాణగ్రంథములుగా చదువుకొనుటకు ప్రచురించి ప్రతి పిల్లవాని కిచ్చుచున్నారు. వేలసంవత్సరములనుంచి వృద్ధిచెంది భారతదేశమును మహోన్నతస్థితిలోనికితెచ్చిన భారతీయ ఆధ్యాత్మికనాగరికతకు పునాదిగ్రంథములైన ఉపనిషత్తులను ఛేదించజాలని మహారణ్యమని వదలిపెట్టి వాటిసిద్ధాంతములను బోధించిన ఇతిహాస పురాణముల చదువుటతో తృప్తిచెందుట సరికాదని ఉపనిషత్తులసిద్ధాంతములను స్థూలముగా వ్రాయుట విద్యార్థులకు, సామాన్యజనులకు ఉపయోగమేమోనని తలచి నేను పామరులకు ప్రతినిధిగా పామరులకు తెలియునట్లుగా ఈ చిన్న గ్రంథమును వ్రాయసమకట్టితిని. మనతోపాటు స్వతంత్రముకొరకు బ్రిటిషు ప్రభుత్వముతో పోరాడుచున్న ఈజిప్టుదేశీయులచరిత్రమును ప్రాచీనకాలమునుండి అనగా పిరమిడ్లను నిర్మించిన ఫారోరాజులకాలమునుండి వ్రాయుటకు కూడ ప్రారంభించితిని. డిటిన్యూగా ఇంకా కొంతకాల ముంచెదరేమోనని తలచితినిగాని యొకసంవత్సరము పూర్తికాగానే నన్నుకూడ విడుదలచేసిరి. బయటికివచ్చినతరువాత వీటిని పూర్తిచేయుటకు తీరిక లేకుండెను.

పిమ్మట 1942 సంవత్సరము ఆగష్టు ఎనిమిదవతేదీ రాత్రి అఖిల భారత కాంగ్రెసుకమిటీవారు బొంబాయిలో సమావేశమై క్విట్ ఇండియా (బ్రిటిషువారు ఇండియానువదలి వెళ్ళవలెను) అను తీర్మానముచేయగానే ఆ మరుసటియుదయమే అదివఱకే దగ్గు, జ్వరముతో బాధపడుతూ నందిగామలో మందుపుచ్చుకొనుచు విశ్రాంతిలోనున్న నన్నుఅరెస్టుచేసి డిటెన్యూగా రాయవేలూరు జైలులోను, అమరావతిజైలులోను వుంచిరి. అక్కడ జ్వరము, దగ్గు ఎక్కువై ఏబదిపౌండ్లతూకముతగ్గి బ్రతుకుట సందేహమని తోచినందున మరల రాయవేలూరుజైలుకు తీసికొనివచ్చి జబ్బు ఎక్కువైనందున 103 డిగ్రీల జ్వరముతోనున్నస్థితిలో 1943 సంవత్సరము జులై నెలలో విడుదలచేసిరి. మద్రాసువచ్చి డాక్టరు లక్ష్మీపతిగారివద్ద మందుతీసుకొని, కొన్నిరోజులకు విజయవాడ వచ్చితిని. పిమ్మట నందిగామలోనే కుటుంబముతో నుంటిని. జైలులోనున్నకాలములో జబ్బుగానుండినను ఓపికయున్నపుడెల్ల ఈ రెండుపుస్తకములను వ్రాయుచువచ్చితిని. ఈజిప్టు చరిత్ర 1922 వరకు వ్రాసి జైలుఅధికారులు తీసుకుంటారేమో నను భయముతో విడుదలైన ఒక మిత్రునిచేతికిచ్చి రహస్యముగా మా యింటికి బెజవాడకు పంపితిని. రెండవపర్యాయము రాయవేలూరు జైలుకు తీసుకొనిరాబడినపుడు ఆచార్య వినోబా భావేగారితో కలసియుండు భాగ్యము నాకు కలిగినది. ఆయనకు 15 భాషలు వచ్చును. ఈ ఏకాదశోపనిషత్తులు కంఠతః వచ్చును. నాచే రచింపబడి నేను జైలుకుతీసుకొనివెళ్ళిన తురుష్కప్రజాస్వామికము, చైనా జాతీయోద్యమములద్వారా నావద్దనే తెనుగు నేర్చుకొనవలెనని ఆయన అభిలాష. ఆ రెండుపుస్తకములను ఆయన మొదలుపెట్టెను. నేను ఆయనకు పాఠముచెప్పుటకు శక్తిచాలనంత దగ్గు, జ్వరముతో బాధపడుచుంటిని. అక్కడ డిటెన్యూగానున్న బెజవాడ గోపాలరెడ్డిగారు నా ఆరోగ్యమునుగూర్చి చాల శ్రద్ధతీసుకొనుచుండెను. నా మిత్రులును, తెనుగుభాషలో పండితులు నగు కడప కాంగ్రెసునాయకులైన రామసుబ్బారెడ్డి బి.ఏ. బి.ఎల్. గారిని నా పుస్తకములద్వారా తెనుగు నేర్పుటకు ఆచార్య వినోబాభావేగారికి వప్పగింతచేసితిని. ఆచార్యులవారికి తెనుగు బాగా వచ్చినది. నే నపుడు జీవింతునో లేదో యని నా మిత్రులకు సందేహ

ముగానున్నస్థితిలోనుంటిని. రామసుబ్బారెడ్డిగారు బాగుగా ఆరోగ్యవంతులుగా నుండిరి. కాని ఈశ్వరేచ్ఛ! నేను విడుదలైనతరువాత క్రిందపడి మీదపడి 1946 వరకు ఆరోగ్యమును కోలుకొంటిని. కాని నా శోకసంవత్సరముననే దివంగతులైరి. 1946 సంవత్సరము జనవరినెల ప్రారంభమున గాంధీగారు మద్రాసునుండి సేవాగ్రామమునకు ప్రయాణముచేయుచు త్రోవలో బెజవాడకు ఊరిబైట ప్రత్యేకరైలులో ఆగినపుడు, వేలజనము మూగినను నేను చాల జబ్బుగానుండి వారిదర్శనమునకు వెళ్ళలేకపోయినందున మిక్కిలి దుఃఖముతో ఒకలేఖను వచ్చిరాని ఉరుదులో నా ఆవేదనను తెలుపుతూ గాంధీగారికి వ్రాసుకొంటిని. దానికి జవాబుగా గాంధీగారి కార్యదర్శి ప్యారీలాలుగారు ఉర్దులో నైజాంరైలువేమీదనున్న మధిరస్టేషనునుంచి నా కొక కార్డు వ్రాసెను. అందులో "మీ రెందుకు తరచుగా జబ్బుపడుతారు? బాపు యొక్క హుకుమైనది. ఇంతటినుంచి జబ్బుపడకూడదు. 'బాపూ కా హుకుం హై, ఆప్ బీమార్ నహీ పడ్నా' భయపడకండి" అని వ్రాసినాడు. ఆ ఉత్తరము నాకుచేరిన 1946 జనవరి 6 వ తేదీ ఉదయమునుంచి జ్వరము జారినది. ఉష్ణోగ్రత మామూలుకు వచ్చినది. మందు గుణమిచ్చినది. మరల కొన్నిసంవత్సరములవరకు జబ్బుపడలేదు. 1946 ఫిబ్రవరినెలలో జరిగిన శాసనసభాఎన్నికలలో విజయవాడ మచిలీపట్టణం నియోజకవర్గమునకు నేను కాంగ్రెసుపక్షపు అభ్యర్థిని. నాకొరకేగాక ఇంకా అనేకమంది కాంగ్రెసు అభ్యర్థులకొరకుకూడ తీవ్రముగా పనిచేయగలశక్తి నాకు కలిగినది. కమ్యూనిస్టు అభ్యర్థులు మమ్మలనందరిని ఎదుర్కొన్నారు. మేమంతా గెలిచినాము. ఇదంతా అవతారపురుషుడైన బాపుయొక్క ఆశీర్వచనముగాక మరియేమి? కాని దేశముయొక్క దురదృష్టవశాత్తు నేను విడుదలయిన సంవత్సరమునకు నా పూజ్య మిత్రులైన రామసుబ్బారెడ్డిగారు అకాలమరణమువాతపడి స్వర్గస్థులైరి. కమ్యూనిస్టుపార్టీపక్షమున ఆ ఎన్నికలలో ఆంధ్రజిల్లాలలో 27 మంది అభ్యర్థులను నిలబెట్టిరి. వారి మహా నాయకుడైన పి.సి.జోషీగారు బొంబాయినుండి ఆంధ్రకు వచ్చి గొప్ప సభలుగావించి యుపన్యాసముల నిచ్చిరి. వారికి జవాబుచెప్పుటకు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసువర్కింగుకమిటీ వారు ప్రత్యేకముగ నన్ను నియోగించిరి. వారిసభ కాగానే రెండవరోజున

గాని, మూడవరోజున గాని ఆ యూరిలోనే నా సభ జరిగెను. రెండుసభలకు కూడ జనము వేలకువేలుగ వచ్చిరి. ఈవిధముగ వా రాంధ్రదేశములో ఉపన్యసించినచోట్లనెల్ల జరిగెను. కమ్యూనిజమును ఎదురించుచు గొప్ప ఉపన్యాసములనిచ్చు శక్తి బాపుఆశీర్వచనమువలన నాకు కలిగెను. అఖిల భారత కాంగ్రెసునాయకులు కూడ వచ్చి తెలుగుజిల్లాలలో ప్రచారముచేసి నారు. శ్రీమతి సరోజినీదేవిగారు కృష్ణా, పశ్చిమగోదావరి జిల్లాలకు వచ్చి గొప్ప యుపన్యాసములనిచ్చి వెళ్ళినది. ఆమెతో నేనుకూడ నుంటిని. ఆమెకు నామీద చాలా దయ. ఆమె బెజవాడమీదుగా ప్రయాణముచేసేటపుడు నాకు వ్రాసేది. ఆమెకు పులిహోర చాలా యిష్టము. అది తెమ్మని చెప్పేది. పండ్లు, పులిహోర తీసుకొని రైలుస్టేషనుకు వెళ్ళి ఆమెనుదర్శించి ఇచ్చే వాడను. ఒకసారి హైదరాబాదులో వారియింట్లోనే ఆమెదర్శనముచేసినాను. మగ్దూం మొహిద్దీన్ అను యువకుణ్ని నాకు చూపి ఇతను మంచి కవీశ్వరుడు అని నాకు చెప్పినది. ఆయన ఇపుడు ఆంధ్రప్రదేశ్ లెజిస్లేటివ్‌కౌన్సిలు సభ్యుడుగా నున్నాడు. ఆమెభర్త మేజరు గోవిందరాజులు నాయుడుగారి దర్శనము కూడా చేసినాను. ఆ ఎన్నికలలో 27 మంది కమ్యూనిస్టు అభ్య ర్థులలో 26 మంది ఓడిపోయి ఒక్క కార్మికపక్షముపు అభ్యర్థియైన పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు మాత్రము గెలిచిరి. దీనివలన కార్మికులలో ఆ కక్షివారిబలము పెరిగెనని కనబడినది. నే నీ సంగతి బాపుకు వ్రాసితిని. 1946 మొదలు 1956 వరకు సాగిన మద్రాసుఎసెంబ్లీలో తెనుగుజిల్లాల నుండి పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు, అరవజిల్లాలనుండి నంబియారుగారు ఇద్దరు మాత్రమే వచ్చినను ఎసెంబ్లీలో ఎడతెగకుండ మాట్లాడుతూ కాంగ్రెసుమంత్రివర్గమును తంటాలుపెట్టుచుండేవారు.

ఆచార్య వినోబాభావేగారు న న్నొక యుదయమున రాయవేలూరు జైలులో "కాశేశ్వరరావుజీ, మీరు ఉపనిషత్తులనుగురించి యొక గ్రంథ మును వ్రాయుచున్నారని తెలిసినది. మీరు ఏరుకున్న ఉపనిషన్మంత్రము లను నాకు చూపించగలరా?" యని యడిగెను. "ఇంకా వాటిని గ్రంథ ముగా ప్రచురించవలెనో, లేదో నిశ్చయించుకోలేదు; కాని కొన్ని యుప నిషన్మంత్రములను కొన్నికొన్ని భావములక్రింద ఏరి నా నోటుబుక్కులలో

నా స్వలాభముకొరకే, నేను వల్లించుటకొరకే వ్రాసుకున్నాను" అని చెప్పి వాటినన్నిటిని వారికి చదివి వినిపించి,నేను వ్రాసిన ఇంగ్లీషు తెనుగు అర్థము లనుకూడ వారికి వివరించితిని. ఒకటి రెండుచోట్ల మాత్రము నా అర్థము లను వారు సవరించిరి. మిగిలిన వాటి అర్థములన్నిటితోను వారు ఏకీభ వించిరి. ఇంకను నాలుగైదు మంత్రములను మాత్రము చేర్చవలసినదని వారు సెలవివ్వగా వాటినికూడ ఇంగ్లీషు, తెలుగుఅర్థములతో నా నోటు బుక్కులో చేర్చితిని. ఉపనిషత్పాఠము లని ఆ గ్రంథమునకు పేరుపెట్టితిని. మొదటిపాఠము సత్యాన్వేషణము. రెండవపాఠము సృష్టిక్రమము, మూడవ పాఠము పరమాత్మ, నాలుగవపాఠము జీవాత్మ, ఐదవపాఠము పరమాత్మను పొందు మార్గములు, ఆరవపాఠము మానవధర్మములు. వీటన్నిటిని ఈవిధ ముగ విభజించుటను కూడ వారంగీకరించిరి. వారు ఒక చిన్న ఉపోద్ఘాత మునుకూడ హిందీలో వ్రాసి యిచ్చిరి తరువాత కొద్దిరోజులకే నేను విడు దలగుట, మద్రాసులో లక్ష్మీపతిగారియింటివద్ద కొన్ని రోజులుండి మందు పుచ్చుకొని బెజవాడ వెళ్ళుట, అక్కడినుంచి నందిగామలో కుటుంబముతో కూడ నివాసమేర్పరచుకొనుట జరిగెను. నందిగామలో మా యింటికి "శాంతికుటీర" మని పేరుపెట్టితిని (Peace Cottage). ఇది చైనా స్వతంత్రవిప్లవనాయకుడగు డాక్టరు సన్యటుసేను తాను తలదాచుకున్న చిన్నయింటికి పెట్టుకున్న పేరు. దానినే మా యింటికి పెట్టితిని. అది గాక ఉపనిషత్తులు చదువుటవలన నాకు మనశ్శాంతి కలిగిన గృహము. ఈ కార ణముచేతకూడ దానికి శాంతికుటీరమని నామకరణముచేసితిని. ఆ యింటి ముందున్న వసారాలో వటవృక్షచ్ఛాయను కూర్చొని నాకు ఆరోగ్యము కుదు రినకొద్దీ మరల ఉపనిషత్పాఠములవ్రాత నారంభించితిని. మంత్రములను వాని యర్థములను సరిజూచితిని. పుస్తకమునకు మొదట నొక యుపోద్ఘాతమును 32 పేజీలు గలదానిని వ్రాసినాను. అందులో వేదకాలనిర్ణయము చేసి హిందూనాగరికతను, పాశ్చాత్య కమ్యూనిస్టునాగరికతలను పోల్చి చూపితిని. ఉపనిషద్బోధలను క్లుప్తముగ వ్రాసితిని. ఆఖరున ఒక అనుబంధము స్త్రీల స్థితినిగూర్చియు, రెండవ యనుబంధము వర్ణభేదములనుగూర్చియు వ్రాసి తిని. ఈ రెండు అనుబంధములను బృహదారణ్యకోపనిషత్తు మీద నాధార

పర్చితిని. 1944 వ సంవత్సరప్రారంభమున ఆ పుస్తకము పూర్తియై బెజవాడకు ముద్రణమునకుగాను పంపబడి త్వరలోనే ముద్రితమయ్యెను. చేకాగితములమీద ముద్రించి ఖద్దరుగుడ్డ అట్ట వేయించితిని.

(6)

మహాత్మాగాంధీగారిని 1944 వ సంవత్సరము మే నెలలో అనారోగ్యకారణముచేత ఆగాఖాన్‌మందిరమునుండి విడుదలచేయగా వారు తమ ధర్మపత్ని కస్తూర్బా గాంధీని,తమ కార్యదర్శి మహాదేవదేశాయిని కోల్పోయి ఒంటరిగా బైటికివచ్చి పంచాగ్నియను ప్రదేశములో కొంతకాల ముండిరి. వారికి అపుడు రక్తపుపోటు చాల అధికముగాకూడనుండెను. నేను పంచాగ్నికి వెళ్ళి మహాత్మాగాంధీగారిని దర్శించుపాటి ఆరోగ్యములేనివాడనుగా నుంటిని. అప్పటికి బెజవాడలోను, నందిగామలోను నా చుట్టుపట్లను కమ్యూనిస్టుల ప్రాబల్యము అధికమైనందున ఆవిషయమై ఒకలేఖవ్రాసి, గాంధీగారి సబర్మతీఆశ్రమములో కొంతకాలము తరిబీతుపొంది,గుడివాడతాలూకాలో గాంధీ ఆశ్రమమును స్థాపించి నిర్మాణకార్యక్రమము సాగించుచున్న ఎర్నేని సుబ్రహ్మణ్యంగారిని పంచాగ్నికి పంపితిని. వారు రెండుసార్లు పంచాగ్నికి వెళ్ళి వచ్చినట్లు జ్ఞాపకము. రెండవసారి నా యుపనిషత్పాఠములపుస్తకమును మహాత్మాగాంధీగారికి వారిద్వారా సమర్పించుకొంటిని. ఆయన చూచి "ఇది తెలుగుపుస్తకము; దీనిని మొదటినుంచి చివరవరకు హిందీలోనికి తర్జుమా చేయించి పంపినయెడల నేను చదువుతాను" అని వారితో కబురంపినందున, నేను నా యుపనిషత్పాఠములను బెజవాడలోని ఆంధ్రరాష్ట్రహిందీప్రచార సంఘముయొక్క ప్రముఖులయిన ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య, రాయప్రోలు సీతారామాంజనేయశాస్త్రిగారలచేత హిందీలోనికి భాషాంతరీకరణము చేయించి మహాత్మాగాంధీగారికి పంపితిని.

ఇంతేగాక ఉపనిషత్తులనుండి మహాత్మాగాంధీగారి సిద్ధాంతముల కనువైన మంత్రములను దేవనాగరిలోవ్రాసి ఇంగ్లీషులోనికి తర్జుమాచేసి యొక దీర్ఘమైన ఉత్తరముతో మహాత్మాగాంధీగారికి పంచాగ్నికి పోస్టుద్వారా పంపితిని. అందులో ఛాందోగ్యోపనిషత్తులోని మహిదాసుడనెడి ఋషిపుంగవుని

కథను వ్రాసితిని. ఆయన తన జీవితాదర్శమైన మానవసేవ చేయుచుండగా రోగము, మృత్యువు దగ్గరకువచ్చెను. "ఈ లోకములో నాపని పూర్తికాలేదు. నాపని పూర్తియగువరకు మీరిద్దరు నావద్దకు రాకూడదు." అని ఆయన రోగముతోను మృత్యువుతోను చెప్పెను. 116 సంవత్సరములు జీవించెను. ఆయన పని పూర్తి అయినందున ఆయన నపుడు మృత్యువు గొనిపోయెను. నేను మహాత్మాగాంధీగారికి వ్రాసిన యుత్తరములో "మీరుకూడ అటువంటి ఋషిపుంగవులే. తాము అవతారమెత్తినపని పూర్తిఅయ్యేవరకు రోగముకాని, మృత్యువుకాని మీవద్దకు రానేరవు. మహిదాసునివలెనే మీరుకూడ 116 యేండ్లు జీవించగలరు" అని వ్రాసినాను. అపుడు మహాత్మాగాంధీగారివద్ద సరోజినీదేవిగారు ఉపచారమునకుండి ఉత్తరములను వేటిని మహాత్మాగాంధీ గారిని చూడనివ్వకుండ ఆపివేసేదని అందరు చెప్పుకొనేవారు. నాఉత్తరము మహాత్మాగాంధీగారు స్వయముగా చదువుకొనుటకు చేరుతుందని నేను నమ్మలేదు. కాని ఆ ఉత్తరమును సరోజినీదేవిగారు మహాత్మాగాంధీగారికి చూపించినది. ఆయన దానిని సొంతముగ చదివినారు. నా కొక కార్డుమీద "ప్రియమైన కాళేశ్వరరావు, నీవువ్రాసిన ఉత్తరము అందినది. ఋషులు నాకంటె ఎక్కువ ఆధ్యాత్మికసంపన్నత గలవారు. నన్ను నే నిప్పుడున్న విధముగానే యుండనిమ్ము. భారతదేశముయొక్కయు, తద్వారా మానవకోటి యొక్కయు కళ్యాణముకొరకు శ్రమపడుచున్న సేవకుడను. "బాపు"

"Dear Kaleswara Rao,

Your letter. Rishis are made of stermer stuff. Let me remain what I am-a struggling servant of India and through her of Humanity.

Yours,
Bapu."

అని గాంధీగారివద్దనుంచి వారి స్వదస్తూరిలో నా కొక కార్డు వచ్చెను. నేను ధన్యుడనైతిని. పిమ్మట పంచాగ్నినుండి ఆయన పూనానగరములోని లేడీ థాకర్సీగారి బంగళాలో కొన్నినెలలుండి తరువాత సేవాగ్రామము చేరినారు. నేను సెప్టెంబరులో ఒకసారి, నవంబరులో ఒకసారి సేవాగ్రామమునకువెళ్లి ప్రతిదఫా ఒకవారమురోజులు గాంధీగారియాశ్రమములో గడపినాను. వారితో అనేక సంగతులనుగురించి మాట్లాడినాను. అందులో ముఖ్యముగా అప్పటికి

ఆంధ్రదేశములో వృద్ధిచెందిన కమ్యూనిస్టుపెడసనుగురించి మాట్లాడినాను. అది యంతయు రెండవసంపుటములో వ్రాసెదను. నేను మొదటిదఫా వారిదర్శనముచేయుటకు వెళ్ళిన రెండురోజులకుముందే సుప్రసిద్ధ గ్రంథకర్తయగు లూయీ ఫిషర్ మహాత్మాజీవద్ద వారంమురోజులు గడపి వెళ్ళెను. లూయీ ఫిషరుగారి కిచ్చిన తడికెలగది, నులకమంచమే నా కిచ్చిరి. ఆయన "One week with Gandhi" గాంధిగారితో ఒకవారము అను సుప్రసిద్ధగ్రంథమును వ్రాసెను. ఆకాలమున నింకను నా యుపనిషత్పాఠములను చదువలేదని, చదువుతామని గాంధీగారు సెలవిచ్చినారు. రెండవదఫా నేను వారిదర్శనమునకు వెళ్ళినపుడు వాటిని తాము సొంతముగా చదివినానని, బాగాఉన్నదని వారు సెలవిచ్చినారు. ఇది రెండవముద్రణము, ఈ కూర్పు ప్రతులన్నియు అయిపోయినవి. అదివరకే ఆ పుస్తకము డాక్టరు లక్ష్మీపతి గారు రచించిన ఆయుర్వేదవిజ్ఞానసర్వస్వములో ప్రచురించిరి. అది మొదటి ముద్రణము. మూడవకూర్పు మహాత్మాగాంధీగారు బ్రతికియుండగనే వ్రాసి వారి యంగీకారముతో వారికి కృతినివ్వవలెనని తలచితిని. కాని యింతవరకు మరల దానిని ప్రచురించనేలేదు.

ఈజిప్టును గూర్చి పాతకాలమునకు సంబంధించిన చాల పుస్తకములను, నవీన ఈజిప్టుకథను చదివి ఈజిప్టుచరిత్రమును 1936 వరకు వ్రాసితిని. దానిని బెజవాడలోని యొక ప్రచురణకర్తకు అచ్చువేయవలయునని, ఇంకా కొంత వ్రాయవలసినది వ్రాసియిచ్చెదనని వప్పగించితిని. వారు నాతో చెప్పకుండగనే 1919 వ సంవత్సరములో ఈజిప్టుకు వచ్చిన మిల్నర్ కమిషనువరకే ఆఖరుప్రూఫులు నాకు పంపకుండానే లెక్కపెట్టలేనన్ని తప్పులతో ముద్రించినారు. వారికి నాకుగూడ గౌరవముగా లేదు. మిగిలిన వ్రాతభాగములు వారివద్ద పోయినవో లేక నావద్దనే పోయినవో చెప్పలేను. గ్లాడుస్టన్ మహాశయుడు చాలవత్సరము లాంగ్లేయ ప్రధానమంత్రిగా నుండెను. 125 సంవత్సరములు జీవించెను. తన యావజ్జీవము విద్యార్థిగా నుండు ఆశయమును పెట్టుకొనెను. అటులనే నా యావజ్జీవితము విద్యార్థిగా నుండుటయే నా జీవితాశయము. ఉపయుక్తములైన గ్రంథములను చదువు

చుండుటయు, నాకు చేతనైనంతవరకు నా మాతృభాషయైన తెలుగుభాషాసేవ చేయుటయు నా దృఢాభిలాష.

నేను ద్వితీయ అధ్యాయములో తిరుపతి వేంకటేశ్వరకవులను గూర్చి వ్రాసియున్నాను. వారు మహాపండితులు; గొప్ప కవులు. అప్పటి నుంచి నేటివరకు కూడ ఆంధ్రదేశములో ఎందరో మహాకవులు అనేక యుత్కృష్టమైన కావ్యములను రచించి ఆంధ్రవాఙ్మయమునకు వన్నె తెచ్చినారు. వారి పేరులను ఇచట వ్రాయ ప్రయత్నించదలచుకోలేదు. ఆంధ్ర కవిత్వ వాఙ్మయము భరతవర్షములోని ఏ ఇతర వాఙ్మయమునకు తీసిపోదు. ఆంధ్రసాహిత్యమును ప్రోత్సహించి, ఉత్తమ సాహిత్యగ్రంథ ములను రచియింపచేయుటకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు డాక్టర్ గోపాలరెడ్డిగారి అధ్యక్షతక్రింద ఆంధ్ర సాహిత్యఎకాడమీని స్థాపించి యున్నారు. గోపాలరెడ్డిగారుకూడ మంచి పండితులు. రవీంద్రవాఙ్మయ మును చక్కనిశైలిలో ఆంధ్రభాషలోనికి భాషాంతరీకరించి యున్నారు. ఆంధ్రదేశములో ఇటులనే సంగీతము, నృత్యము కూడ అభివృద్ధి చెందు చున్నవి. నాటకకళకు సినిమావల్ల కొంత దెబ్బ తగిలినది. దాని పునరుద్ధర ణకు కృషి జరుగుచున్నది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజుగారి అధ్యక్షతక్రింద సంగీత, నాటక, నృత్య ఎకాడమీని స్థాపించుట ముదావహము. రామకృష్ణరాజుగారు సంగీత, సాహిత్యముల యందు గొప్ప అభిరుచిగలవారు, పండితులు. ఇవన్నియు జరుగుచున్నవి కాని, ఆంధ్రభాషలోకి గాంధీవాఙ్మయము తర్జుమాచేయబడియుండలేదు. అతి స్వల్పముగా మాత్రమే ఉన్నది. గాంధీవాఙ్మయమే మన దేశము యొక్క అభివృద్ధికి అత్యవసరమైయున్నది. ఉదులాభక్తిని ఆ పని నిర్వర్తిం చుటకు హైదరాబాదులోని గాంధీస్మారకనిధిపక్షమున నా అధ్యక్షతక్రింద ఒక కమిటీని నియమించియున్నారు. దానికి అనేకమంది సహాయపడవలసి యున్నది. అన్నిటికంటె ఆంధ్రవాఙ్మయముయొక్క పెద్ద లోటు చారిత్రిక, శాస్త్రీయగ్రంథముల లోపము. విజ్ఞానచంద్రికామండలి మొదలైన గ్రంథ మాలలు కొద్దిగ సేవచేసియున్నవి కాని, అవి సాగక చాలకాలముక్రిందనే నిలిచిపోయినవి. కావున చారిత్రక, రాజకీయార్థికశాస్త్రములు, ప్రకృతి శాస్త్ర

ములు, ఇంజనీరింగు మొదలైన నవీన విజ్ఞానమునిచ్చు విషయములమీద గ్రంథములు తెలుగులో వ్రాయించుటకు, ప్రచురింపుటకు, విశ్వవిద్యాలయములలో ఆవిషయములను బోధించు ఆచార్యులలో కొందరు, బయట పని చేయుచున్నవారు కొందరు 1958 డిశంబరునెలలో హైదరాబాదులోని ఎసెంబ్లీలోని నాగదిలో సమావేశమై చరిత్ర, శాస్త్రముల తెలుగు ఎకాడమీని స్థాపించియున్నారు. అది ఎంతయో పనిచేయవలసియున్నది. దానికి నన్ను అధ్యక్షుని గావించినారు. శ్రీ మాడపాటి హనుమంతరావు, విస్సా అప్పారావు, మామిడిపూడి వెంకటరంగయ్యగారలను ఉపాధ్యక్షులుగాను, డాక్టర్ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు. డాక్టర్ మారేమండ రామారావు, డాక్టర్ ఎన్. సుబ్బారావు, ఆచార్య కుమారి సరోజినీ రేగానిగారలను కార్యదర్శులుగాను ఎన్నుకొనియున్నారు. విశ్వవిద్యాలయపు ఆచార్యులును, ఇంకను బైట ఇట్టి విజ్ఞానప్రదాతలగువారును ఆ ఎకాడమీలో సభ్యులుగ నున్నారు. నేను ఇప్పుడు రచించిన 'తురుష్క ప్రజాస్వామికము-మధ్యప్రాచ్యదేశములు' అను గ్రంథమును 1958వ సంవత్సరము ఆఖరువరకు వ్రాసి ఆ ఎకాడమీపక్షమున ప్రచురించియున్నాము. కాలక్రమేణ చాల గ్రంథములు వెలువడునని ఆశించుచున్నాను. ప్రకృతిశాస్త్రవిజ్ఞానమును సులభశైలిలో ప్రజల కిచ్చుటకు కృషి నలుపుచున్న వేమరాజు భానుమూర్తిగారిసేవ ప్రశంసనీయమైనది. విస్సా అప్పారావుగారుకూడ అణుశక్తి నిగురించిన చక్కని గ్రంథమును తెలుగులో వ్రాసి గొప్ప భాషాసేవ చేసియున్నారు. ఈ ఉద్యమమునకు చాల ధనము కావలసియున్నది. ప్రజలు, ప్రభుత్వములు ఇందుకు తగిన సహాయము చేయవలసియున్నది.

# 5 నేను లాయరుగా పనిచేసినకాలము

గుంటూరులో కొండా వెంకటప్పయ్యగారి ఆఫీసులో పనిచేయుట - బెజవాడలో లాయరుగా చేరితిని - బెజవాడ చరిత్ర - మద్రాసు ఎస్టేట్సు లాండుఆక్టు దావాలు - బెజవాడకు సబుకోర్టు వచ్చుట - నేను లాయరుగా ప్రథమస్థానమాక్రమించితిని - మా కుటుంబము - సంఘసంస్కారములో నాకు తోడ్పాటు - మా బోడిపాడి స్వప్నకథ - స్త్రీవిద్యాభివృద్ధి - గవర్నరుపేటలో ఇల్లు కట్టుకొనుట - నాకు జబ్బుచేసి నీలగిరికి పోవుట - ఆచంట లక్ష్మిపతి, శ్రీమతి రుక్మిణమ్మ - ఉయ్యూరురాజాగారి దావా - విజయవాడలో కాలేజి - మాడపాటి వెంకటేశ్వరరావుగారి ధర్మములు - ఆయుర్వేదకళాశాల - పింగళి వెంకట్రామరెడ్డిగారు - వసప్తర్తి దావా -ఆంగ్లేయుల పొగరుబోతుతనము - వితంతూద్వాహపు క్రిమినలు కేసు - నా జూనియరులాయర్లు - న్యాయాధిపతి మీద ట్రాన్సుఫరుఅర్జీలు, బదలాయింపు - బెజవాడలో కన్యకాపరమేశ్వరి హైస్కూలు - శ్రీనివాసశాస్త్రి - కార్యోపండితుడు - నందిగామలో హైస్కూలు-డాక్టరు కేటాకురు- మూలుపూరు రంగయ్యవివాహము - మిన్ టెనెంటు - గుంటూరు నియోగ వైదికుల కక్షలు - బెజవాడలో పరిష్కారము—

(1)

నా చెల్లెలు శ్యామలాంబ గర్భిణితోనుండి జబ్బుచేసినందున 1905 వ సంవత్సరము మేనెలలో వారి స్వగ్రామమైన అరుగొలనునుండి గుంటూరుకు తీసుకొనివచ్చి ప్రసవించుటకుగాను కుగ్లరు స్త్రీలఆసుపత్రిలో నుంచితిమి. ఆమె యొక ఆడశిశువునుకనెను. దానికి సరస్వతి అని నామకరణముచేసితిమి. అటుతరువాతకూడ చాల జబ్బుచేసినందున ఆ ఆసుపత్రిలోనే 1906 వ సంవత్సరములో కొన్ని నెలలవరకు ఆమెను ఉంచవలసివచ్చినది. ఆకాలములో ఆమెకు ప్రతిదినము భోజనము తీసుకొనివెళ్లుటకును, ఇతర ఉపచారములు చేయుటకును మా అమ్మగారిని, నా అక్కగారి వితంతుతోడికోడలిని, మరి యొక నౌకరును జతయిచ్చి ఆసుపత్రికి కొద్దిదూరముననున్న యడవల్లివారి సత్రములో నుంచితిమి, నేనుకూడ గుంటూరులోనే తరచుగా యుండేవాడను. ఆ సత్రము యడవల్లి రామకృష్ణయ్యగారిది. వారికుమారుడగు యడవల్లి సూర్యనారాయణ నే నక్కడికి వెళ్లినపుడల్లా నా దగ్గరకు చనువుగా వచ్చేవాడు. ఆయనే పిమ్మట బెజవాడ మైలవరంనాటకసమాజములో ప్రధానపురుషపాత్ర వహించిన సుప్రసిద్ధ నటకుడైనాడు. మా చెల్లెలిని, శిశువును ఆసుపత్రికి తీసుకొనిపోయి కుగ్లరుదొరసానికి చూపించుచుంటిమి. 1906 ఫిబ్రవరిలో నేను బి. ఎల్. ప్యాసైనట్లు ఫలితములు ప్రకటించబడినవి. అదివరకే 1905 సంవత్సరములో గుంటూరులో జిల్లాకోర్టు స్థాపించబడగానే కొండా వెంకటప్పయ్యపంతులుగారు గుంటూరువచ్చి యొక ప్రముఖన్యాయవాదిగా ఉండెను. బంగాళావిభజనమువలన చెలరేగిన జాతీయోద్యమమునందు ఆయనకు విశేషమైన సానుభూతి యున్నందువలనను ఆయనతో బందరులోనే నాకు బాగుగా పరిచయముకలిగి ఆయనయందు పూజ్యభావముండుటవలనను షుమారు మూడునెలలు ప్రతిరోజూ ఉదయము వారియింటికి వెళ్ళి వారి ఆఫీసులో లాయరుపని నేర్చుకొంటిని. ఆయన నన్నెంతగనో ఆదరించెను. గుంటూరులో కూడ జాతీయోద్యమపక్షమున జరుగుచుండిన బహిరంగసభలలో ఆయన, ఉన్నవ లక్ష్మీనారాయణ, వింజమూరి భావనాచార్యులు, శనగపల్లి రామస్వామిగుప్త, దేవగుప్తా శేషాచలరావుగార్లు కాంగ్రెసునాయకులుగా ప్రాధాన్యమును వహించిరి. నేనుకూడ వారితోపాటు ఆ సభలలో పాల్గొంటి

నేను లాయరుగా ఎచట చేరవలెనను సమస్య ఉద్భవించినది. నేను తొమ్మిది న్నర సంవత్సరములు బందరులో విద్యార్థిగాను, ఉపాధ్యాయుడుగాను ఉండి నప్పటికి బందరులోని శీతపైత్యపు నీళ్లు, వాతావరణము నాకు సరిపడలేదు. అప్పుడప్పుడు అనారోగ్యమును కలిగించుచుండెను. కావున బందరు జిల్లా కోర్టులో లాయరుగా ప్రవేశించదలచలేదు. మా నందిగామతాలూకా గుంటూరుజిల్లాలో భాగముగా నుండినయెడల గుంటూరుజిల్లాకోర్టులో · లాయరుగా ఉండవలెనని నాకు ఉద్దేశ్యముండెను. నందిగామతాలూకాలో నాకు చాలమంది బంధువులు మిత్రులైన రైతులు, జమీందార్లు ఉన్నందున అచటినుండి నాకు చాల కేసులు వచ్చుటకు మంచి అవకాశముండెను. కాని మా నందిగామతాలూకా నూతనముగా ఏర్పడిన గుంటూరుజిల్లాలో నొక భాగముగా చేర్పబడక, కృష్ణాజిల్లాలోనే యుండిపోయినది. అందువల్ల నేను గుంటూరు జిల్లాకోర్టులోనే జిల్లాకోర్టు ప్లీడరుసనదును, గుంటూరు, నెల్లూరు, కృష్ణా అను మూడుజిల్లాలలో న్యాయవాదిగా పనిచేయుహక్కుతో పొంది నప్పటికిని, విజయవాడలోనే లాయరుగాపనిచేయుటకు 1906 వ సంవత్సరం జూన్ నెలలో చేరితిని. తరువాత ఎప్పుడుకూడ నేను హైకోర్టుఅడ్వకేటు కాలేదు. జిల్లాకోర్టువకీలుగానే ప్రతిసంవత్సరం దరఖాస్తుపెట్టి ఇరువదిఅయిదు రూప్యములను చెల్లించి 1920 వ సంవత్సరమువరకు నా సనదును పునరుద్ధరించుకొనుచుంటిని. గాంధీగారి అసహాయోద్యమము కారణముగ 1921 నుండి సనదును పునరుద్ధరించక వదలివేసితిని. నేను ప్రథమమున బెజవాడ గవర్నరుపేటలోని బందరుకాలువకు సమీపముననున్న కాపూరు సోమయాజులుగారింట్లో కుటుంబముతో కాపురముంటిని.

బెజవాడ నేను కాపురమునకు వచ్చేసరికి జనాభా ఇరవై ఎనిమిదివేలు. క్రీ. శ. తొమ్మిది పది శతాబ్దములలో బెజవాడ చాళుక్యచక్రవర్తులక్రింద విశాలాంధ్రదేశమునకు రాజధానిగ నుండెను. లేపాక్షిచిత్తరువులలో చిత్రింపబడిన మాధవవర్మ చక్రవర్తియొక్క ధర్మనిరతిని ప్రదర్శించినకథ బెజవాడకు సంబంధించినదే. ఇంద్రకీలాద్రిపర్వతముమీద విజయుడు తపస్సుచేసి పాశుపతాస్త్రమును పొందినట్లు స్థలపురాణములో నుండుటవలన దీనికి విజయవాడ అనికూడ పూర్వకాలమునుండి నామము కలదు. పావన కృష్ణాస్రవంతి

యొడ్డున నుండుటవలనను, కనకదుర్గక్షేత్ర మగుటవలనను ఇది పురాతన కాలమునుంచి పుణ్యక్షేత్రముగ నెంపబడుచున్నది. చైనాయాత్రికుడగు ఫాహియాన్ బెజవాడవచ్చి కనకదుర్గను దర్శించెను. తూర్పుననున్న మొగల్ రాజపురపుగుహలు జైనులు నిర్మించినవి. యుద్ధమల్లుని బెజవాడశాసనము చరిత్రప్రసిద్ధము. శ్రీకృష్ణదేవరాయలవారు బెజవాడవచ్చి కనకదుర్గను సేవించిరి. వారు తమ ఆముక్తమాల్యదను విజయవాడలోనే ప్రారంభించినటుల వ్రాసికొనిరి. అక్కడున్న నూరునగార్ల సత్రములు కనకదుర్గదేవాలయముక్రిందనే యున్నవి. విశాఖపట్టణముజిల్లాలోని విజయనగరసంస్థానాధీశులగు పూసపాటి వారు బెజవాడ కనకదుర్గను తమవంశదేవతగా ఆరాధించుచున్నారు. ఒకప్పుడు బెజవాడవరకు వారిరాజ్యము వ్యాపించియుండెను. పుణ్యక్షేత్రమైనను కొంత కాలము బెజవాడపట్టణము సన్నగిల్లినది. 1857 లో ఇంజనీయరు కాటన్‌గారు కృష్ణానదిమీద ఆనకట్ట కట్టినప్పటినుంచి క్రమముగా పన్నెండులక్షల యకరములకు నీటిపారుదలగల డెల్టాకు కార్యస్థానమై, బందరుకాలువ, ఏలూరు కాలువ, రైవసుకాలువ, బకింగుహాం కాలువలు త్రవ్వబడి పడవలలో మనుష్యులు, సరకులు పోవుటకును డెల్టా నీటివనరులకును కేంద్రమయినది. ఇక్కడనుంచి ప్రథమమున నైజాంరైలు, పిమ్మట దక్షిణమహారాష్ట్రరైలు, ఆటుపిమ్మట తూర్పుకోస్తారైలు ఆఖరున ఢిల్లీఎక్సుప్రెస్ మొదలగురైళ్ళు నిర్మింపబడి భారతదేశములోని అన్ని ప్రధాననగరములకు రాకపోకలుచేయు కూడలియైనది. అన్నివైపులకు రోడ్లుఏర్పడి, క్రమముగా మోటారుబస్సులు లారీలు వచ్చి బెజవాడబస్తీ అత్యమృతముగా వృద్ధిచెంది నేడు రెండులక్షల జనసంఖ్య కలిగియున్నది. కొన్నినెలలక్రిందనే నిర్మాణము పూర్తికాబడి రహదారికి తెరువబడిన కృష్ణానదిమీద రోడ్డువంతెన కట్టుటవలన కృష్ణకు దక్షిణపువైపున బెజవాడ పెరుగుచున్నది. పదిహేనుసంవత్సరములలో అటునుంచి గుంటూరు, ఇటునుంచి బెజవాడ వృద్ధిచెంది కలసిపోయి ఆంధ్రదేశ మధ్యమున యొక మహానగరము విలసిల్లగలదు. నేను బెజవాడకు ప్లీడరుగా వచ్చినపుడు గవర్నరుపేట అరండలుసత్రమువరకు మాత్రము పెరిగినది. నేను 1914 వ సంవత్సరములో గవర్నరుపేటలో ఇల్లుకట్టుకునేటప్పటికి అరండలుసత్రమునకు తూర్పున నొక ఫర్లాంగువరకుమాత్రము పెరిగి మా

యింటికి తూర్పుననున్న శింగరాజు వెంకటసుబ్బారావుగారియిల్లు ఆఖరుగృహముగా నున్నది. ఇక తూర్పున యిండ్లు లేవు. క్రైస్తవమిషనరీలుమాత్రము అప్పటికి తమబంగళాలను ఊరిబైట కట్టుకొని నివసించుచుండిరి. వారి చర్చి వారి హైస్కూలు పాతబెజవాడలోనే యున్నవి. ఆ మిషన్‌బంగళాలకు వుత్తరముగానున్న రోడ్డుకు నక్కలరోడ్డు అని యిప్పటికిని పేరు. ఆ కాలములో అవన్నీ పొలములగుటవలన రాత్రిళ్ళు నక్కలు వచ్చి కూసేవి.

నేను ప్లీడరీలో చేరేటప్పటికి బెజవాడలో సబుకోర్టు లేదు. కాని నందిగామ, తిరువూరు, నూజవీడు, గన్నవరము, బెజవాడ— ఈ అయిదు తాలూకాల సివిలుదావాలకు సంబంధించిన మునసబుకోర్టులు, మొదటితరగతి క్రిమినలుకోర్టులు, రెవెన్యూకోర్టులు బెజవాడలోనే ఉండెను. నేను లాయరుగాచేరి అచటి సివిలు, రెవెన్యూ, క్రిమినలుకేసులలో పనిచేయసాగితిని. నాకు అతిత్వరితముగానే మిత్రులు దావాలను, కేసులను పంపసాగిరి. నేను వాటిని శ్రద్ధగాను, సమర్థతతోను నిర్వహించి వారికి మాటదక్కించితిని. మద్రాసు ఎస్టేట్సులాండుచట్టము 1908 వ సంవత్సరములో మద్రాసుశాసనసభచేత మంజూరుచేయబడి జమీందారులు, మొఖాసాదారులు, అగ్రహారీకులు మొదలగు భూఖామందులకును, వారిక్రిందనున్న రైతులకును నూతన సంబంధములు నిర్ణయించబడినవి. రైతీ భూములలో రైతులకు శాశ్వత జిరాయితీహక్కు లివ్వబడినవి. భూఖామందుల (ప్రైవేటులాండ్సు) సొంత భూములపరిమితులు నిర్ణయించబడినవి. ఆ చట్టము వచ్చుటకు కొన్నిసంవత్సరములకుముందు, వచ్చినతరువాత కొన్నిసంవత్సరములవరకు విశేషముగా భూఖామందు-రైతులమధ్య ఏర్పడిన అనేక చిక్కుసమస్యలనుగురించి బెజవాడ సబుకలెక్టరుకోర్టులోను, ఎడిషనలు డిప్యూటీకలెక్టరుకోర్టులోను రెవెన్యూదావాలు చాల జరిగెను. భూఖామందులు రైతులను పొలములలోనుంచి వెళ్లగొట్టుటకై వేసిన దావాలు, సివిలుకోర్టులలో దాఖలుచేయబడెను. రైతులు చెల్లించవలసిన శిస్తు స్వభావము, మొత్తము మొదలైన విషయములను గురించిన దావాలు రెవెన్యూకోర్టులలోనే పరిష్కరింపబడవలసియుండెను, కావున ఆకాలమంతటిలో రెవెన్యూకోర్టులు చాలా ప్రాముఖ్యతను కలిగియుండెను. ఈ ఐదుతాలూకాలలో జమీందారీ మొఖాసా గ్రామ

ములు, అగ్రహారములు విశేషముగా నుండి గవర్నమెంటు గ్రామములు చాలతక్కువగా నున్నందున బెజవాడలోని రెవెన్యూకోర్టులలో భూఖామందు-రైతుసమస్యలమీద వేలకువేల దావాలు దాఖలుకాబడెను. నేను కొద్ది కాలములోనే భూఖామందు - రైతుసమస్యలమీద పనిచేయుటకు సమర్థుడనని పేరు సంపాదించగలిగితిని. నాకు విశేషముగా రెవెన్యూకోర్టులలో కూడ వకాలతులు వచ్చుచుండెను. కాలక్రమేణ ఆంధ్రదేశములోని లాయర్లలో మద్రాసు ఎస్టేట్సులాండుచట్టముమీదను, హిందూధర్మశాస్త్రము మీదను ప్రథమశ్రేణికిచెందిన ప్రవీణుడనని పేరుపొందితిని. అంతేకాక ప్రభుత్వము వారు భూఖామందుగ్రామాలలో గ్రామోద్యోగస్థులకు, గ్రామనౌకర్లకు నౌకరీ ఇనాములమీద క్విట్‌రెంటు కట్టి నౌకరీషరతును తీసివేసి, ఆ భూములకు వారికి పట్టాలిచ్చి, వారు నౌకరీచేసినందుకు మాసవారీజీతముల నేర్పరచిరి. చాలమంది భూఖామందులు ఆ నౌకరీఇనాములు తమ పూర్వులవల్ల ఇవ్వబడినవనియు, వాటిమీద క్విట్‌రెంటు పుచ్చుకొనుటకు ప్రభుత్వమునకు ఎట్టి హక్కు లేదనియు, నౌకరీషరతు రద్దుకాగానే ఆ భూములన్నీ తిరిగి తమకే రావలెననియు వాదించుచు ఆ భూములను రాబట్టుటకు సివిలుకోర్టులలో దావాలుకూడ దాఖలుచేయుచుండిరి. నేను ప్లీడరు ప్యాసుకాగానే మా నందిగామ గ్రామమునకు జమీందారైన ముక్త్యాలఎస్టేటు జమీందారుగారగు రాజా వాశిరెడ్డి చంద్రమౌళీశ్వరప్రసాద్ బహదరుగారు నన్ను తమవద్ద దివానుగా నుండవలెనని కోరిరి. కొమర్రాజు లక్ష్మణరావుగారు మునగాలరాజాగారివద్ద దివానుగా నున్నట్లే నేను తమవద్ద దివానుగా వుంచే బాగుంటుందని వారి యుద్దేశ్యమును తెలిపిరి. కాని నేను ఏ జమీందారువద్దను నౌకరీచేయుటకు ఇష్టపడలేదు. వారికి ప్లీడరుగా మాత్రమే యుండుటకు అంగీకరించితిని. నేను ప్లీడరీలోప్రవేశించిన కొలదిరోజులలోనే ముక్త్యాలరాజాగారియొక్క, వారి బంధువులైన వాసిరెడ్డి వెంకటాద్రినాయుడుగారి వంశీకులగు అమరావతి జమీందారిణి జ్ఞానప్రసూనాంబ బహదర్‌గారియొక్క దావాలలో పనిచేయుటకు నన్ను నియమించిరి. పిమ్మట కొలది కాలములో మునగాల, లింగగిరి, ఛేతవోలు జమీందారులుకూడ నన్ను వకీలుగా పెట్టుకొనిరి. నందిగామ తాలూకానుంచి కరణములు రైతులుకూడ నామీద అభిమానముతో వకాల్తి

నామాలను ఇచ్చిరి. ఒక సంవత్సరములోపలనే గంపలగూడెంఎస్టేట్ జమీం దారిణిభర్తగారైన కోటగిరి జగన్నాధరాయణంగారు కూడ తమ ఎస్టేటుకు నన్ను వకీలుగా నియమించిరి. అటులనే తిరువూరు తాలూకాలోని కాకర్ల జమీందారుగారుకూడ నన్ను వకీలుగా పెట్టుకొనిరి. నాకు బంధువు, వ్యవ హారదక్షుడని మిగుల పేరుపొందినవారు, నూజవీడుకాపురస్తులు, అక్కడి జమీందారులలో విశేషమైన పలుకుబడిగలవారు అయిన మాడపాటి వెంకటే శ్వరరావు పంతులుగారుకూడ తమకు నన్ను వకీలుగాపెట్టుకొనిరి, అందువల్ల నాకు వకీలుగా ప్రతిష్ఠ బాగా హెచ్చెను. అంతేకాక బెజవాడ, నందిగామ, జగ్గయ్యపేట, తిరువూరు, గన్నవరం గ్రామాలలో నున్న సబ్‌మేజిస్ట్రేటుకోర్టు లకు కూడ నన్ను తీసుకొనిపోవుచుండిరి. ఇటు తూర్పుపైపుననున్న కంకి పాడులోని నా బంధువులైన కానూరి మల్లిఖార్జునరావుగారు కంకిపాడు, పునాదిపాడుగ్రామాలలోని దావాలలో ప్రవేశమును కల్పించిరి. అంతటితో అతి త్వరితముగానే బెజవాడ, గన్నవరముతాలూకాలలో భాగ్యవంతులైన డెల్టాగ్రామములలోని రైతులు నాకు విశేషముగా పార్టీలుకావడం, సివిలు, క్రిమినలుదావాలలో వకాలతునామాలు యివ్వడం జరుగుతూవచ్చెను. ఉత్తర వల్లూరు జమీందారుగారు మద్దూరు, కానరనేనివారిపాలెం మొదలైన గ్రామాల లోని రైతులమీద వేసిన వేలకువేల రెవెన్యూదావాలలో ఆ రయితులు తమ పక్షమున నన్ను రెవెన్యూకోర్టులలో పనిచేయుటకు వకీలుగాపెట్టుకొనిరి. బారిస్టరు టంగుటూరు ప్రకాశం పంతులుగారిని హైకోర్టులో పెట్టుకొనిరి. ఆ దావాలన్నీ హైకోర్టుకే గాక ప్రీవీకౌన్సిలుకుకూడా పోయి చాలావరకు రైతులపక్షముననే గెలిచినవి. ఇట్టి వాతావరణములో నా ప్లీడరువృత్తి మిగుల జయప్రదముగా సాగెను. ముఖ్యముగా క్రాస్‌పరీక్షలోను, జడ్జీల యెదుట దావాలను, కేసులను సరిగా వాదించడంలోను నాకు ప్రఖ్యాతికలిగెను. వెంకటేశ్వరరావుపంతులుగారిశిఫారసుతో నిడదవోలుఎస్టేటు రిసీవరుగారి దావాలన్నియు నావద్దకే వచ్చెను. అంతటితో ఉయ్యూరు, మీర్జాపురం, ఎల మర్రు జమీందారులుకూడ నన్ను తమకు వకీలుగాపెట్టుకొనిరి. శనివారపు పేట రాజా పార్థసారధి, అప్పారావుగారి దావాలు శ్రీ టంగుటూరు ప్రకాశం పంతులుగారిద్వారా నాకు వచ్చెను. వారికి నేను బెజవాడలో వకీలుగాను.

చెన్నపట్టణములో ప్రకాశంపంతులుగారు వకీలుగాను పనిచేసితిమి. త్వరలోనే చాలమంది మొఖాసాదారులు అగ్రహారీకులు, యితర భూఖామందులు నాకు కక్షిదారులైరి. బెజవాడలోని వర్తకప్రముఖులుకూడ చాలమంది నన్ను వకీలుగ పెట్టుకొనిరి. నేను బెజవాడకు లాయరుగా రాకముందే పెద్దిభొట్ల వీరయ్య, సి. రాజగోపాలాచార్యులుగార్లు బందరు జిల్లాకోర్టును విడిచి బెజవాడలో లాయర్లుగా పనిచేయుచుండిరి.

(2)

1913 వ సంవత్సరం జూన్ నెలలో బెజవాడకు సబుకోర్టు వచ్చినది. దానికొరకు సి. రాజగోపాలాచారి, పెద్దిభొట్ల వీరయ్య, నేను, దాసు మధుసూధనరావు మొదలగు బెజవాడలాయర్లము చాలా ఆందోళనచేసినాము. మద్రాసు గవర్నమెంటు ఎక్జిక్యూటివుకౌన్సిలర్లవద్దకు హైకోర్టుజడ్జీలవద్దకు రాయబారములు పోయినాము.

బందరులో ఒక జిల్లాకోర్టు, సబుకోర్టు, ఏలూరులో మరియొక జిల్లాకోర్టు, సబుకోర్టు మాత్రమే యుండవలెనని ఏలూరులోని ప్రముఖలాయరగు మోచర్ల రామచంద్రరావుపంతులుగారు ప్రయత్నించిరి. బెజవాడలోను నరసాపురములోను సబుకోర్టులు స్థాపించుటకు వారు ప్రతిఘటించిరి. కాని మేమే జయముపొందితిమి. బందరులో జిల్లాకోర్టు, బెజవాడలో సబుకోర్టు, ఏలూరులో జిల్లాకోర్టు, నరసాపురములో సబుకోర్టు స్థాపించబడినవి. వాటన్నిటిలోకి బెజవాడసబుకోర్టు ఎక్కువ భాగ్యవంతమైనదిగా నుండెను. ఇచటనే జమీందారులు, మొఖాసాదారులు ఎక్కువగా నుండుటవలన పెద్ద పెద్దదావాలు బెజవాడలోని సబుకోర్టులోనే దాఖలయ్యెను. బెజవాడలో సబుకోర్టు పెట్టగానే ఏలూరుసబుకోర్టునుంచి కొన్నిదావాలు బెజవాడసబుకోర్టుకు ట్రాన్స్ఫరు అయినవి. వాటిలో కొన్ని కూర్మా వెంకటరెడ్డినాయుడుగారికి వకాలతునామాలు కలవి. వెంకటరెడ్డినాయుడుగారు నాకు చాలా స్నేహితులు. మాడపాటి వెంకటేశ్వరరావుగారి దావాలలో నేను, కూర్మా వెంకటరెడ్డి నాయుడుగారు జాయింటువకీళ్ళముగా పనిచేస్తిమి. వారు నాకంటె సీనియరు. వయస్సులో కొన్నిసంవత్సరములు పెద్దవారు. బెజవాడసబుకోర్టుకు ట్రాన్స్

పరుఅయిన వారితాలూకుదావాలలో పనిచేయుటకు పకాలతునామాలను వారు నాకు పంపిరి. వారిగుమాస్తా ఆ దావాకట్టలనుతీసుకొనివచ్చి నాకు యిచ్చెను. తరువాత కొన్నిసంవత్సరములకు వారు జస్టిస్పార్టీలోచేరి ప్రముఖస్థానము వహించినను, పిమ్మట మద్రాసులో మంత్రిగాను, గవర్నరుగాను ఉండినప్పటికిని ఆఖరువరకు నాకు మంచిస్నేహితులుగా నుండిరి. రాజకీయములలో ఆయన జస్టిస్పార్టీప్రముఖుడుగాను, నేను కాంగ్రెసుపార్టీప్రముఖుడుగా నున్నప్పటికి మా వ్యక్తిగతస్నేహము చెడలేదు. జస్టిస్పార్టీ బ్రాహ్మణులకు వ్యతిరేకమైనపార్టీ అయినను సర్ కూర్మా వెంకటరెడ్డినాయుడుగారికి బ్రాహ్మణమిత్రు లనేకు లుండిరి. వారికి ఆయన యుపకారములు చేయుచుండెను. అప్పటి జస్టిసుపార్టీప్రముఖులలో రాజా రామారాయణంగారు, బొల్లిన మునిసామినాయుడుగార్లుకూడా మాకు వారికి రాజకీయభేదము లున్నను వ్యక్తిగతముగా నాకు చివరవరకు మిత్రులుగా నుండిరి. బెజవాడకు సబుకోర్టు రాగానే నేను తేలికగా మొదటిస్థానమును ఆక్రమించితిని. దాసు మాధవరావుగారుకూడ బెజవాడ సబుకోర్టులో కొన్నిసంవత్సరములు లాయరుగా పనిచేసిరి. సి. రాజగోపాలాచారి, దాసు మాధవరావుగారలును, నేనును మొదటిస్థానములో నుంటిమి. మాధవరావుగారు బెజవాడను విడచిపోయినపిమ్మట వారిస్థానమును వారితమ్ముడు మధుసూధనరావుగారు ఆక్రమించిరి. పెద్దిభొట్ల వీరయ్యగారుకూడ ప్రముఖలాయరుగా నుండిరి.

ప్రథమదశలో నేను తరచుగా నందిగామ, జగ్గయ్యపేట, తిరువూరు సబ్ మేజిస్ట్రేటుకోర్టులకు పోవుచుంటిని. అపుడు బస్సులు, మోటారుకారులు లేవు. బెజవాడకు నందిగామకు మధ్యనున్న కీసరునదిమీద వంతెనలేదు. బెజవాడనుంచినైజాం రైలులోబయలుదేరి అర్ధరాత్రివేళ తెలంగాణములోని మధిర స్టేషనులోదిగి అక్కడినుంచి రెండెడ్లబండ్లమీద తెల్లవారుసరికి నందిగామ పోవలసియుండెను. అటులనేఅర్ధరాత్రివేళతెలంగాణములోనిఎర్రుపాలెం స్టేషనులోదిగిరెండెడ్లబండిమీదతిరువూరుపోవలసియుండెను. ఒక్కొకప్పుడుమధిర ఎర్రుపాలెములలో ఆగవలసివచ్చేది. అక్కడ మాకు చాలమంది బంధువులు, మిత్రులు గలరు. బొమ్మకల్లుస్టేషనులోదిగి గుర్రపుబండిమీద జగ్గయ్యపేట పోవలసియుండెను. కొన్నిసారులు త్రోవలో ఈబండ్లు బోల్తాపడుచుండెను.

మొదటిసంవత్సరములోనే నాకు సివిలు, క్రిమినలు, రెవిన్యూపని ఎక్కువగా నున్నందున విజయనగరంనుంచి బెజవాడలో లాయరుగా పనిచేయుటకు వచ్చిన నామిత్రులగు చింతక్రింది సూర్యనారాయణమూర్తిగారిని జాయింటు వకీలుగా పెట్టుకొంటిని. మూడుసంవత్సరములు మా జాయింటుసంస్థానము ప్రధానస్థాన మాక్రమించియుండెను. మూడు అన్నిరకములైన పని ఎక్కువగానుండెను. కాని క్రిమినలుకేసులకొరకు పల్లెటూళ్ళకుపోవుట నా ఆరోగ్యమునకు భంగముకలుగునట్లు కనపడెను. పల్లెటూళ్ళకు క్రిమినలుకేసులకు పోకుండా బెజవాడలోనే సివిలు రెవెన్యూదావాలలోమాత్రమే పనిచేయవలయునని నిశ్చయమునకువచ్చితిని. అప్పుడు తిరువూరుతాలూకా పెంగొల్లువద్ద ఎద్దులబండి అర్ధరాత్రివేళ దొల్లిపడి నా పెదవులకు దెబ్బలుతగలడం ఈ నిశ్చయమును బలపరచినది. 1910 వ సంవత్సరము జూనునెలలో మా సమిష్టిలాయరుపనిచేయడం మానుకొని ఎవరికివారు ప్రతిగా వృత్తిని నిర్వర్తించుకొంటిమి. అప్పుడున్న దావాలను పంచుకొంటిమి. అప్పటినుంచి నేను వీలైనంతవరకు పల్లెటూళ్ళకు క్రిమినలుకేసులకు పోవడము మానుకొంటిని. నాకు కావలసినంత సివిలు, రెవెన్యూదావాలపని వచ్చెను. ఎప్పుడైనను పెద్ద క్రిమినలుకేసు యున్నచో బెజవాడ మొదటితరగతి మేజస్ట్రేటుకోర్టులో పనిచేయుటకు ఒప్పుకొనేవాడను. బహుఅరుదుగా నందిగామ, తిరువూరు, గన్నవరముకోర్టులకు పోయేవాడను. మధిరస్టేషనునుంచి మేనాలోయెక్కి నందిగామకు పోయేవాడను. తిరువూరుకు గంపలగూడెంరాజాగారి మేనా బండిలో పోయేవాడను.

(౩)

1906 వ సంవత్సరము ఆఖరున మాతల్లి వరలక్ష్మమ్మగారు బెజవాడలోని కాపురపు సోమయాజులుగారియింటిలోనే టైఫాయిడ్‌జ్వరమువల్ల స్వర్గస్థురాలైనది. నా భార్య దుర్గాంబ యింటిపెత్తనమువహించి యోగ్యతలోను, దైవభక్తిలోను, యింటికివచ్చిన అతిథులను ఆదరించుటలోను పూర్తిగా మాఅమ్మగారి అడుగుజాడలలో నడచి మా కుటుంబమర్యాదను బహుచక్కగా నిలబెట్టినది. ఎంతమందిని నేను భోజనమునకు పిలచినను

సంతోషముతో వెంటనే వంటచేయించిపెట్టేది. వంటమనిషి లేకపోతే తానే స్వయముగా వండిపెట్టేది. విద్యార్థులకు చాలమందికి వారములిచ్చేది. ప్రతి సత్కార్యమునందు నాకు ప్రోత్సాహమిచ్చినది. నాజీవితమును మిగుల శాంతి యుతముగాను,సౌఖ్యవంతముగాను గావించినది. నేను ప్లీడరీలోచేరినతరువాత పాతనగలుతీసివేసి బంగారుకంటె, కాసులపేరు, వడ్డాణం, పంజెలు మొద లైననగలు చేయించుకున్నది. ఒకగొలుసుఉంచుకొని మిగిలిననగలన్నింటిని నా ఋణములుతీర్చుటకును, మేడను కొంత విస్తరింపచేయుటకును మరల నాకిచ్చినది. వాటినిఅమ్మి ఆ పనులు చేసినాను.ఆమె కొనుక్కున్నపదహారు యకరాల కేసరపల్లి మాగాణికూడ నా ఋణములక్రిందనే అమ్మివేసినది. వితంతూద్వాహము, రజస్వలానంతర వివాహము చేసుకున్నవారిలో భోజ నముచేయుట, హరిజనులను ఇంట్లోపెట్టుకొనుట, మొదలగు సంఘసంస్కర ణలు ఇంట్లోనే ఆచరించుటకు నేను నిశ్చయించినపుడు ఎట్టి సంకోచము లేకుండ పూర్తిగా నా అభిప్రాయములప్రకారం నడిచేది. ఆమెను ఒప్పిం చడం నాకు బహు తేలికగా వుండేది. నా బావగారి తమ్మునికుమారుడగు వెంకటేశ్వరరావు తనతండ్రితో చెప్పకుండగనే విద్యాభ్యాసమునకై ఇంగ్లాం డుకు 1908లో పారిపోయినాడు. నాతోను, ఆమెతోను చెప్పివెళ్ళినాడు. ఆమె అతనిని ఆశీర్వదించి పంపినది. అతను ఇంగ్లాండునుంచి మరలివచ్చి ముందుగా బెజవాడలోని మా యింటికి వచ్చినాడు. ఆమె అతనిని ఆదరించి నది. అమ్మవారిని ప్రతిదినము పూజచేసినను ఆమె బ్రహ్మసమాజపు ఏకే శ్వరోపాసనకీర్తనలను భక్తచింతామణి పద్యములనుకూడ వల్లించి పాడు కుంటున్నది. భాగవతము చదువుచుండేది. భగవదనుగ్రహమువల్ల అట్టి సాధ్వీమణి నాకు ధర్మపత్నిగా లభించినది. ఆమె ఆరోగ్యము మాత్రము మంచిదికాదు. ఆమెకు సంతానం కలుగలేదు. 1912 సంవత్సరములో నా భార్యకు సంతానము కలుగనందున నాకు రెండవవివాహము చేయించిన బాగుండునని మా బావ, అక్కగార్లనుండి గుసగుసలు బయలుదేరెను. గాని నే నట్టి పాపకర్మమునకు ఒడిగట్టుకొనననని ఖచ్చితముగా కబురంపినందున ఆ గుసగుసలు శాశ్వతముగా సమసిపోయినవి. ఈసంగతి నా భార్యకు తెలిసి ఆమెకు నాయందుగల అనురాగము మరీ హెచ్చినది.మా అక్కగారికి సంతా

నము లేదు. నా చెల్లెలు శ్యామలాంబికకుమాత్రమే అయిదుగురుపిల్లలు. కొంత మంది పుట్టి పోయినారు. నా చెల్లెలుగారిది గన్నవరంతాలూకా ఆరుగొలను. బెజవాడకు 20 మైళ్ళ దూరమునకున్న పల్లెటూరు. ఆ పిల్లలు విశేషభాగము నా భార్యవద్ద పెరిగినవారే. వారి సందరిని ఆమె తన బిడ్డలవలె మిగుల శ్రమ తీసుకొని పెంచి పెద్దవాళ్ళను చేసినది. వాళ్ళంతా ఆమెను తమ తల్లికంటె ఎక్కువ భక్తిగౌరవములతో చూస్తారు. నా చెల్లెలి భర్త సూర్యనారాయణ గారు 1924లో మరణించినారు. మా అక్కగారుకూడ ఆమెభర్తచనిపోగానే వచ్చి మా యింట్లోనే ఉన్నది. నా భార్య, మా అక్క, నా చెల్లెలు-ముగ్గురు వితంతూద్వాహముచేసుకున్నను, రజస్వలానంతరవివాహము చేసుకున్నను విదేశములకు వెళ్ళివచ్చినను బ్రాహ్మణులయితే వారితో భోజనముచేయుటకు అలవాటుపడినారు. కొమర్రాజు లక్ష్మణరావుగారి మేనమామ భండారు దండ పాణిగారు వితంతూద్వాహము చేసుకొనిరి. ఆయన భార్యాపిల్లలతో మా యింటికి రాగా మావాళ్ళంతా వాళ్ళతోకలసి భోజనంచేసేవారు. అటులనే స్వతంత్రపోరాటములో జైలుకువెళ్ళిన దేశభక్తురాలు అఖిలభారత మహిళా సంఘ నాయకురాలు అమెరికా వెళ్ళివచ్చిన సుప్రసిద్ధ విదుషీమణి మాకు సమీపబంధువు నగు శ్రీమతి పెద్దాడ కామేశ్వరమ్మ డాక్టరు కుప్పుస్వామిగా రను మైసూరు విశ్వవిద్యాలయములో ఆచార్యులుగనున్న యొక బ్రాహ్మణేత రుని వివాహమాడి పిల్లలను కనినను ఆమెతోను, ఆమెపిల్లలతోను మా యింటికి వచ్చినపుడు నా భార్య, మా అక్క, నా చెల్లెలు కలసి భోజనం చేయుచున్నారు. కాని వారు బ్రాహ్మణేతరులతో సరాసరిగా భోజనముచేయుట లేదు. వారిస్వతంత్రముతో నేను జోక్యంపుచ్చుకొనుటలేదు. కాని, పిమ్మట నేను బ్రాహ్మణేతరులనేగాక, మాలమాదిగలను మహమ్మదీయులను, క్రైస్త వులను, విదేశీయులనుకూడ మా యింటికి ఆహ్వానించి వారితో నేను మా యింటిలోనే భోజనముచేస్తుంటే నా అక్క, నా భార్య నాకు తోడ్పడు చున్నారు. ఒకసారి ఒక జపానువాడైన - సంస్కృతవిద్యార్థి మా యింటిలో వారమురోజులుండి మా అందరితో కలసియే భోజనముచేసెను. మిస్ బెనెంటు అను ఆంగ్లయువతి మా యింటిలోనేయుండి నాతో భోజనము చేసెను. నేను కుల మతభేదములులేక అందరియిండ్లకు వెళ్ళి భోజనముచేసి

వస్తుంటే, నేను జందెము తీసివేస్తే, తద్దినములు మానివేస్తే నా కెట్టి అభ్యం తరముకూడ నా భార్యనుండిగాని, అక్కచెల్లెండ్రనుండిగాని రాలేదు. మా చెల్లెలి అయిదుగురు పిల్లలుమాత్రము ఈ అన్నివిషయములలో నాతోపాటే పూర్తిగా కులభేదములను వదలిపెట్టి ప్రవర్తించుచున్నారు. నా చెల్లెలి పెద్ద కూతురు సరస్వతమ్మను పెద్దాడ వెంకటేశ్వరరావు అను బి. ఏ. విద్యార్థి కిచ్చి వివాహముచేసినాము. అతను బి. యల్. కూడ ప్యాసై మరణించి నాడు. అందుమీద సరస్వతమ్మను కొంతకాలము గుంటూరులోని శారదానికే తనములో సంస్కృతము, హిందీ మొదలగునవి నేర్పించి పిమ్మట కాశీలోని హిందూ విశ్వవిద్యాలయమునకు పంపి, బి. ఏ. ప్యాసుచేయించినాను. చెన్న పట్టణములో నావద్దనేయుండి హిందీలో రాష్ట్రభాషావిశారద, హిందీప్రచారక పరీక్షలు ప్యాసుఅయి, ఇంగ్లీషులో బి. టి. కూడ ప్యాసయినది. అటుతరు వాత సేవాగ్రామములోని ఆర్యనాయగం ఆషాదేవిగార్లవద్దకు పంపితిని. అచట బేసిక్‌ట్రైనింగ్‌లో కృతార్థురాలైనది. మహాత్మా గాంధీగారితో సొంత పరిచయము కలిగినది. వారి ఆదేశానుసారముగా బేసికువిద్యకే జీవితమును అర్పణచేయుటకు నిశ్చయించినది. ఇపుడు హైదరాబాదులోని బేసికుకళా శాలలో ఉపాధ్యాయినిగా పనిచేయుచు, నావద్దనేయుండి జబ్బుగానున్న నా భార్యకు సేవచేయుచున్నది. నా చెల్లెలి రెండవబిడ్డ వరలక్ష్మమ్మను కొమ్ము రాజు లక్ష్మణరావుగారి బావమరదియగు కానూరు లక్ష్మణరావు కిచ్చి వివా హముచేసినాము. ఆ పిల్ల ఎక్కువగా మా యింట్లో నా భార్యవద్ద పెరిగి నది. ఆ వివాహము మా యింట్లోనే జరిగినది. కానూరు లక్ష్మణరావు బి. ఇ. ప్యాసై గవర్నమెంటులో ఇంజనీరై పిమ్మట ఇంగ్లండుపోయి ఇంజనీ రింగు డాక్టరేటుపరీక్షలో కృతార్థుడై, ఛీఫ్ ఇంజనీయరుగా నుండి, యిపుడు ఇండియా గవర్నమెంటుయొక్క వాటర్ అండ్ పవర్ కమిషనులో సభ్యు డుగా నున్నాడు. ఆయనను డాక్టరు కె. యల్. రావు అని పిలుస్తారు. ఆయన ఆంధ్రప్రభుత్వమునకు నాగార్జునసాగర్, పోచంపాడు, ఇచ్చంపల్లి మొదలగు ప్రాజెక్టుల నిర్మాణంలో ముఖ్యసలహాదారుడు. మా అమ్మాయికూడ ఆయ నతో ఇంగ్లాండులోని బర్మింగుహాములో ఏడు సంవత్సరము లున్నది. ఆ కాలములో సాంఘికవిషయములలో బర్మింగుహాము విశ్వవిద్యాలయములో

డిప్లొమా పొందినది. ఇండియాలో ఎఫ్. ఎ. ప్యాసై ఇంగ్లాండు వెళ్ళినది. వారికి ఇంగ్లాండులో మగ్గురు పిల్లలు - పద్మ, నిర్మల, అశోక అనువారు ఇండియాలో ఇద్దరుపిల్లలు విజయ, సుజాత అనువారు జననమొందినారు. నా చెల్లెలి మొగపిల్లలలో పెద్దవాడు వెంకటరమణారావు. ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటులో ఏప్యూబ్లిక్ శాఖలో అసిస్టెంటు ఇంజనీయరుగా నున్నాడు. రెండవవాడగు వెంకటేశ్వరరావు యల్. ఐ. యమ్. ప్యాసై అరుగోలనులో తమ ఇంటివద్దనే యుండి వైద్యవృత్తిని నిర్వర్తించుచు, వ్యవసాయము చేయించుకొనుచు, కాంగ్రెసుపక్షమునకూడ కొంత పనిచేయుచున్నాడు. మూడవపిల్లవాడగు వెంకటకృష్ణమోహనరావు బి. యస్. సి. రసాయనశాస్త్రములోను, బి. యస్. సి. వ్యవసాయశాస్త్రములోను కృతార్థుడైనాడు. వాడు పుట్టిన నాలుగునెలలకే తండ్రి మరణించినాడు. ఎక్కువగ తన తల్లివద్దకంటె నావద్ద, నా భార్యవద్ద పెరిగినాడు. వాడినిగూర్చి ఒక కథయున్నది. వాడు 1924లో కుగ్గరుఆస్పత్రిలో పుట్టినాడు. వాడికి అయిదవ సంవత్సరము రాగానే వాడితల్లి శ్యామలాంబ తిరుపతికి తీసుకొనివెళ్ళి పుట్టువెంట్రుకలుతీయించి తలకు బోడిగుండుచేయించి బెజవాడ తీసుకొనివచ్చినది. తిరుపతి వెంకటేశ్వరస్వామి విగ్రహమును వాడు బాగా చూచి జ్ఞాపకముంచుకొన్నాడు. ఆ పిమ్మట కొద్దిరోజులకు బెజవాడలో అక్షరాభ్యాసము చేయిద్దామని నేను దానినిచేసేటట్లు నిర్ణయించినాము వెండి గిన్నెచేయించి సిద్ధముచేయించినాము. కాని ఆ క్రిందటి రోజు మధ్యాహ్నము గాంధీగారిని బర్మాపోకుండ కలకత్తాలో అరెస్టుచేసినట్లు వార్తవచ్చినది. నే నపుడు బెజవాడ మ్యునిసిపలుచైర్మనుగ నున్నాను. ఆవెంటనే టెలిఫోనుచేసి మర్నాడు అన్ని ఫాక్టరీలు, దుకాణములు విద్యాశాలలు పూటకూటియిండ్లు కట్టివేసి హరతాళముచేయునట్లు ఏర్పాటులుచేసినాను. మోహనరావు అక్షరాభ్యాసము మరునాడు జరగవలసినదానిని మానివేయుదమని ఇంట్లో నిశ్చయించుకున్నాము. ఆ తెల్లవారుఝామున ఆ పిల్లవాడు ప్రక్కమీద లేచికూర్చుని తనతల్లితోను, నా భార్యతోను వెంకటేశ్వరస్వామి పంగనామాలుపెట్టుకుని తనదగ్గిరకు వచ్చి "బోడివాడాబోడివాడా" అని పిలచి, "నీవు రేపు అచ్చురాభ్యాసము చేసుకుంటావా" అని అడిగినట్లు,

"ఎట్లా అచ్చరాభ్యాసం చేసుకోను సామీ, గాంధీమహాత్ముణ్ణి పట్టుకున్నారట, అచ్చరాభ్యాసం మూసేశారు" అని తాను చెప్పినట్లు "రెండు అరటి పండ్లు ఇస్తావా, గాంధీమహాత్ముణ్ణి విడిచిపెట్టిస్తాను" అని వెంక టేశ్వర్లు చెప్పినట్లు తాను "సామీ గాంధీమహాత్ముణ్ణి విడిచిపెట్టించు, రెండు అరటిపండ్లు ఇస్తా"నని చెప్పి దణ్ణంపెట్టి రెండు అరటిపండ్లు ఇచ్చినానని, "గాంధీమహాత్ముణ్ణి విడిచిపెట్టిస్తానులే, అచ్చర్యాభాసం చేసుకో" అనిచెప్పి వెంకటేశ్వర్లు వెళ్ళిపోయినాడని చెప్పినాడు. వారిద్దరు నన్ను పిలచి నాతో ఈ సంగతి చెప్పినారు. నేను వెం టనే వాడిదగ్గరకు పోయి బోడివాడా ఏమిటిరా అని అడుగగా ఈమాటలన్నీ నాతోకూడ చెప్పినాడు. మేము వాణ్ణి వేళాకోళముచేసి నాము. ఇంకొక అరగంటసేపటికి కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు మదరాసునుంచి మెయిలులో బెజవాడలో తమయింటికివచ్చి నాకు టెలిఫోను చేసినారు గాంధీగారిని విడిచిపెట్టినారని. నేను వెంటనే ఈసంగతి ఫోనులో అందరు దుకాణదార్లకు, ఫాక్టరీలకు చెప్పి హరతాళము మాన్పించినాను. ఆఉదయమువాడికి అక్షరాభ్యాసం నేనుచేయించినాను. వెండిగిన్నెయిచ్చినాను. అప్పటినుంచి వాణ్ణి బోడివాడా అని పిలుస్తుంటాము. పిమ్మట కొన్నినెల లకు గాంధీగారు ఖద్దరువసూలుకు పశ్చిమకృష్ణాలో సంచారముచేసినారు. వారిని మా చెల్లెలి కాపురస్థలమైన ఆరుగొలనుకుకూడా తీసుకొనివెళ్ళినాను. అక్కడ యితరులవలెనే మాచెల్లెలుకూడ కొంత చందాచెల్లించి గాంధీగారి దర్శనమునకు వచ్చినది. మాచెల్లెలితోకూడ మోహనరావు వచ్చినాడు. వాడికి గాంధీగారిని చూపించినాను. వాడు సంతోషించినాడు. ఇప్పటికి వాడికి గాంధీగారిమీద బహుగొప్పభక్తి. నా భార్య చాలాఅనారోగ్యవంతురాలైనది. ఆమెకు బాధ్యతతో సేవచేసేవారుండరు. ఈ పిల్లవాడిని (బోడివాణ్ణి)దత్తత చేసుకుందామని ఆమె నాతో చెప్పుచూ వచ్చినది. స్వరాజ్యపోరాటం ముగిసే వరకు నేను దత్తతచేసుకొనేది లేనిది తేల్చక సంవత్సరాలకొద్ది కాలయాపన చేసినాను. తుదకు స్వతంత్రము వచ్చినతరువాత కుటుంబవ్యవహారము లను ఏదోవిధముగా స్థిరపరుచుకోదలచి నా భార్యయొక్క కోరికప్రకారం **1948 మార్చినెలలో వెంకటకృష్ణమోహనరావును (బోడివాణ్ణి) హిందూలా**



అయ్యదేవర కాళేశ్వరరావుగారి కుటుంబము

శ్రీ కాళేశ్వరరావు, భార్య సత్యాంబ,

కుమారుడు మోహనరావు, కోడలు మాలతి,

మనుమరాలు సరస్వతి, మనుమడు అశోక్.

ప్రకారం నేను, నా భార్య దత్తతచేసుకొని ఉపనయనముచేసినాము. యథా విధిగా శాస్త్రప్రకారం చేసుకోకపోతే ఆస్తిహక్కులురావు. ఆ సంవత్సరము మేనెలలో నాకు సమీపబంధువులైన తుర్లపాటి సంగమేశ్వరరావు యం. ఏ. బి. యల్. గారికూతురు, వారిఅన్న బారిస్టరు వెంకటేశ్వరరావుగారు పెంచిన పిల్లయగు కుమారి మాలతిని నా కుమారుడు వెంకటకృష్ణమోహనరావుకిచ్చి నందిగామతాలూకా అడవికావులపాడులోని వధువుపుట్టింటివారిస్వగృహములో వివాహముచేసి నందిగామలోని నా పురాతనగృహములో గృహప్రవేశ మైనాము. మోహనరావు కపుడు 24 సంవత్సరాలు. మాలతికి 18 సంవత్స రము లుండెను. మాలతి వివాహమునాడే యఫ్. ఏ. ప్యాసైనట్లు వార్త తెలిసి నది. పిమ్మట చెన్నపట్టణములోని మేరీరాణికళాశాలలో దేశచరిత్ర, ఆర్థిక రాజకీయశాస్త్రములతో బి. ఏ. ప్యాసైనది. మోహనరావు వ్యవసాయశాస్త్ర ములలో ఉత్తమవిద్య నభ్యసించుటకు అమెరికావెళ్ళి అక్కడ కొంత సంపా దించుకుంటూ కొలరోడా విశ్వవిద్యాలయములో ఎంటమాలజీలో యం. యస్. సి. ప్యాసై, పిమ్మట ఇల్లినాయిసు విశ్వవిద్యాలయములో పి. హెచ్. డి, డాక్టరేటుపరీక్షలో కృతార్థుడై ఆ బిరుదమును పొందినాడు. తాను సంపా దించి చదువుకుంటూ తన భార్యనుకూడ పోషించగలనని,తన భార్యను అమెరి కాకు పంపవలెనని చాలా పట్టుదలగా కోరినందున శ్రీమతి మాలతినికూడ 1953వ సంవత్సరములో అమెరికాకు పంపినాను.ఆ అమ్మాయికూడ కష్టపడి చదివి ఒక యం. ఏ. పబ్లికు అడ్మినిస్ట్రేషనులోను, రెండవ యం. ఏ. ఆర్థిక రాజకీయ సాంఘికశాస్త్రములలోను ప్యాసయినది. టైపురైటింగు షార్టు హాండుకూడ బాగా నేర్చుకున్నది. 1957 ఫిబ్రవరిలో నేను ఆంధ్రప్రదేశ్ ఎసెంబ్లీకి స్పీకరుగా ఎన్నుకొనబడి యింకా ఇల్లుదొరకక హైదరాబాదులో లేకువ్యూగెస్టుహౌస్‌లో నుండగా నా కొడుకు, కోడలు నావద్దకు ఇండియాకు వచ్చిరి. నాకు హైదరాబాదులో ఇల్లుదొరికినపిమ్మట వారిద్దరు నావద్ద, నా భార్యవద్ద కొంతకాలమున్నారు. ఆకాలములో నా కోడలు మాలతి కొన్ని నెలలు హైదరాబాదులోని ఉస్మానియావిశ్వవిద్యాలయములో సాయంత్రపువేళ కళాశాలలో పబ్లికు అడ్మినిస్ట్రేషన్ నేర్పు ఆచార్యురాలుగా పనిచేసినది. ఇంతలో తనభర్త మోహనరావుకు కేరళలో నొక యుద్యోగము దొరకగనే

విశ్వవిద్యాలయపు ఆచార్యత్వమును వదలిపెట్టి భర్తవద్దకు పోయినది. అత నిపుడు ప్రపంచఆరోగ్యసంస్థవల్ల చలిజ్వరమును నివారణచేయు శోధనల లోకి తీసుకొనబడినాడు. టంగనీయకాలోను, ఇరానులోను తరిబీయతుపొంది కృతార్థుడై గ్రీసుదేశములో పనిచేయుచున్నాడు. శ్రీమతి మాలతికూడ భర్తవద్దకు వెళ్ళినది. ఈమధ్య హైదరాబాదు వచ్చినది. మరల నతనివద్దకు కొన్నినెలలలో వెళ్ళగలదు.మా పిల్లలెవరుసూ విదేశములలోకూడ మాంసా హారమును, మద్యమును చవిచూడలేదు. ఇది నా కెంతో గర్వకారణముగ నున్నది. ఇది నా స్వకుటుంబవృత్తాంతము.

స్త్రీలవిద్య, స్త్రీలస్వతంత్రము ఆంధ్రదేశములో యీ అరువదిసంవత్స రములలో ఎంతగనో అభివృద్ధిచెందినది. 1881 వ సంవత్సరములో వీరేశ లింగంపంతులుగారు రాజమహేంద్రవరములో ప్రైమరీ బాలికాపాఠశాలను చాలాకష్టపడి స్థాపించినారు. నేను నందిగామలో అపటి తహశీలుదారు సహా యముతో 1903వ సంవత్సరమున విక్టోరియారాణిపేర ప్రైమరీబాలికాపాఠశా లను స్థాపించితినని చెప్పియున్నాను. మా స్వంతకుటుంబములోనే మాఅమ్మ గారికి తెనుగుకూడ చదువను వ్రాయను బొత్తుగా రాదు. నా భార్య, నా అక్క, నా చెల్లెలు, కొమర్రాజు లక్ష్మణరావుగారిభార్య కోటమ్మగారు కొంత తెనుగుమాత్రము చదువడం, వ్రాయడం నేర్చుకున్నారు. నా కోడలు మాలతి అమెరికాకుపోయి రెండు యం. ఏ. పరీక్షలు ప్యాసై వచ్చినది. నా మేనగోడళ్ళలో నొకతె ఇండియాలో బి. ఏ. బి. టి. ప్యాసైనది. రెండ వది ఇంగ్లాండులో సాంఘికశాస్త్రములో డిప్లొమా పొందినది. కొమర్రాజు లక్ష్మణరావుగారిపుత్రిక అచ్చమాంబ ఆయన మరణించినపిమ్మట ఇంగ్లాండుకుపోయి యల్. ఆర్. సి. పి. అండ్ ఎస్. వైద్యపరీక్షలో కృతార్థురాలై బెజవాడలో జయప్రదముగా వైద్యవృత్తిని సాగించుచున్నది. కొంతకాలము కమ్యూనిస్టుగా నుండినను, దానిని మానుకొని కాంగ్రెసులో చేరి, కాంగ్రెసుపక్షమున లోక్‌సభసభ్యురాలుగా ఎన్నుకొనబడినది. డాక్టరు లక్ష్మీపతిగారిభార్య రుక్మిణమ్మగారు బి. ఏ. ప్యాసై ప్రపంచస్త్రీలమహాసభల కొరకు యూరపుకు, జపానుకు పోయివచ్చినది. మద్రాసుశాసనసభసభ్యు రాలై కొంతకాలము డిప్యూటిస్పీకరుగాను ఆరోగ్యశాఖామంత్రిగాను పనిచేసి

నది. ఆయనయొక్క యిద్దరుకుమార్తెలు ఇంగ్లాండుకుపోయి పెద్ద పెద్ద వైద్యపరీక్షలు ప్యాసైవచ్చినారు. అందులో పెద్దకూతురు డాక్టరు లక్ష్మీదేవి ఒక సింధురాష్ట్రపు వైశ్యయువకుని పెండ్లియాడినది. ఆయన ఇండియా గవర్నమెంటులో పెద్దయుద్యోగములోనున్నాడు. అది అంతర్వర్ణవివాహము. ఇటుల ఆంధ్రదేశములో నేడు అనేకవందలు కాదు వేల కుటుంబములలో యువతులు పెద్దపరీక్షలు ప్యాసగుటయేగాక కొందరు విదేశములకు కూడ పోయి గొప్పపరీక్షలలో నుత్తీర్ణులైనవారు గలరు. నేడు హైదరాబాదు ఉస్మానియా విశ్వవిద్యాలయ స్త్రీకళాశాల ప్రధానాచార్యురాలగు శ్రీమతి శ్రీదేవి యను ఆంధ్రయువతి అమెరికాలో చదివి డాక్టరేటు పట్టాను పొంది వచ్చినది. ఆ స్త్రీకళాశాలలో 1500 మంది విద్యార్థిను లున్నారు. అందులో సగముమంది ముస్లింబాలికలు. ఎంతోమంది ముస్లిం బాలికలు యం. ఏ. పి. హెచ్. డి. పట్టములను ఏటేట పొందుచున్నారు. ఘోషాను విసర్జించినారు. హైదరాబాదులోని పింగళి వెంకటరామారెడ్డి స్త్రీ కళాశాలలోను, తిరుపతి, గుంటూరు,ఏలూరు పట్టణములలోని స్త్రీలకళాశాలల లోను వందలాది విద్యార్థినులు చదువుతున్నారు. ఇటీవలనే కర్నూలులో కూడ ప్రత్యేక స్త్రీలకళాశాల స్థాపింపబడినది.అంతేగాక మామూలు కళాశాల లలో ప్రతిచోటను విద్యార్థులతోపాటు విద్యార్థినులుకూడ కలసి వందలాది చదువుకొనుచున్నారు. కర్నూలు, విశాఖపట్టణం, గుంటూరు, హైదరాబాదు వైద్యకళాశాలలలో వందలకొలది బాలికలు బాలురతోపాటు యం. బి. బి. యస్. ప్యాసై, వైద్యవృత్తిని స్వీకరించుచున్నారు. కొంతమంది బాలి కలు లాకళాశాలలలో చదువుచున్నారు. లాయర్లుగ పనిచేయుచున్నారు. ప్రభుత్వోద్యోగములలో ప్రవేశించుచున్నారు. శాసనసభల సభ్యురాండ్రుగ నున్నారు.ఇటుల స్త్రీవిద్య.స్త్రీలస్వతంత్రము ఆంధ్రదేశములో చాల వృద్ధిచెందు చున్నది.ఆంధ్రస్త్రీలు మేల్కొన్నారు. తమహక్కులను, బాధ్యతలను గుర్తిం చుచున్నారు. కాని ఇంక నెంతయో విద్య వ్యాపించవలసియున్నది. ఆంధ్ర ప్రదేశ్‌లో ఇపుడు స్త్రీలలో నూటికి ఎనిమిదిమంది మాత్రమే చదువను వ్రాయను వచ్చినవారు గలరు.

(4)

మా అమ్మగారు మరణించిన కొద్దికాలమునకు కాపూరు సోమయాజులు గారియింటిలోనుంచి లేచి గవర్నరుపేటలోనే మరియొకయింటిలో కాపురము పెట్టితిమి. గవర్నరుపేటలో మా కుటుంబము ఏదోకారణముచేత యిండ్లను మారవలసివచ్చెను. నాభార్యపట్టుదలమీద 1913 వ సంవత్సరములో మునిసిపల్ వేలములో గవర్నరుపేటలోని 1,575 గజములస్థలమును గజము 1 కి 1-1ం-0 చొప్పున విక్రయముపొందితిని. వెంటనే ఇల్లుకట్టుట ప్రారంభించితిమి. నా చెల్లెలి పెనిమిటి నండూరు సూర్యనారాయణగారు నేనిచ్చిన ప్లానుప్రకారమే నేను వేసంగిలో కూనూరుపెళ్ళి తిరిగివచ్చేసరికి ఆ యిల్లు కట్టడమును పూర్తిచేయించెను. 1914 వ సంవత్సరము మేనెలలో మాఇంటి చుట్టూ ఆవరణగోడకూడ పూర్తిఅయి, జూన్‌లో గృహప్రవేశము చేసితిమి. 1918 వ సం॥ లో మా యింటిమీద మేడను కూడ వేయించితిని. గవర్నర్‌పేటలోని ఆ మేడ యిప్పటికి నాక్రిందయున్నది. నాకు 1913వ సం॥ జూన్‌లో చాల జబ్బుచేసినది. నరములు, హృదయము, జఠరము బలహీన పడినవి. మీగాళ్ళమీద కొంచెము సొట్టలుపడినవి. సుప్రసిద్ధ ఆయుర్వేద వైద్యులైన నోరి రామశాస్త్రిగారివద్దను, గొప్ప ఎల్లోపతివైద్యులైన డాక్టర్ ఛార్లెస్‌గారివద్దను మందుపుచ్చుకొంటిని. కాని నెమ్మదించలేదు. అంతటితో మునసబుకోర్టుపనిని చాలించుకొని, సబుకోర్టులోను రెవిన్యూకోర్టులలోను పని చేయుటకు మాత్రము నిశ్చయించితిని. అపుడు బెజవాడలో నాలుగు మునసబుకోర్టులుండెను. నావద్ద ఆరుగురు గుమాస్తాలుండిరి. నావద్ద మునసబు కోర్టులలోని సివిలుదావాలు అయిదువందలుండెను. ఆ దావాలనన్నిటిని మునసబుకోర్టులో ప్రధానస్థానము వహించిన రెండవగ్రేడు ప్లీడరు సూరి వెంకటనరసింహశాస్త్రిగారికి యిచ్చి, నాకు అదివరకు ముట్టిన ఫీజు కాక ఇంకను రావలసిన ఫీజుఅంతయు వారే వసూలుచేసుకొనవలసినదని చెప్పితిని. అప్పటినుంచి ఎప్పుడో తప్ప మునసబుకోర్టులకు వెళ్లుటలేదు. ఆయన నాకు ఆప్తమిత్రుడు. అతియోగ్యుడు. రాజకీయములలోను వైజ్ఞానిక విషయములలోను ఆంధ్ర గ్రంథాలయోద్యమములోను నాకు ముఖ్య స్నేహితుడు. ఆ సంవత్సరమే మునగాలఎస్టేటు పెద్దదావాలు బందరు జిల్లాకోర్టులో

విచారణకువచ్చినవి.ఆదావాలను 1904లో అప్పటి జిల్లాజడ్జిగారు లాపాయింట్ల మీద కొట్టివేయుట, అందుమీద కీసరవారు హైకోర్టులో అప్పీళ్లు దాఖలు చేయుట జరిగెనని ఇదివరకే తెలిపియుంటిని. హైకోర్టు అప్పీళ్లలో ఆ దావాలను పునర్విచారణచేయవలసినదని కృష్ణాజిల్లాకోర్టుకు తిప్పిపంపిరి. అందువల్ల ఆ రెండుదావాలు 1913 వ సం॥ ఆఖరున, 1914 వ సం॥ ప్రారంభమున కృష్ణాజిల్లా జడ్జి కోలురిడ్జిగారివద్ద విచారణచేయబడెను. మునగాలదివాను కొమ్మరాజు లక్ష్మణరావుగారు వాటిని నడుపుచుండిరి. మద్రాసు హైకోర్టునుంచి ఎస్. శ్రీనివాస అయ్యంగార్, టి. రంగాచారిగారలు మునగాలరాజాగారిపక్షమున వచ్చిరి. బందరులో జంధ్యాల గౌరీనాధశాస్త్రి, శిడింబి హనుమంతరావుగారలు రాజాగారిపక్షమున వకీళ్లుగానుండిరి. నాకుకూడ రాజాగారిపక్షమున వకాలతునామా నిచ్చి బందరుకు వచ్చి ఆ దావాలలో పనిచేయవలసినదని మునగాలరాజాగారు, లక్ష్మణరావుగారు కోరినందున నేను విచారణకాలమున బందరులో వుంటిని. ముఖ్యముగా సాక్షుల మూజవానివిచారణలో నేను ఎక్కువ పనిచేయవలసివచ్చినది. లాపాయింట్లమీద ఎస్. శ్రీనివాసఅయ్యంగారు ప్రముఖపాత్ర వహించిరి. రంగాచారిగారు నేను వారికి వప్పగింతచేసినసాక్షులను విచారించిరి. బందరులో నేను మూడునెల లుండవలసివచ్చినది. నా ఆరోగ్యము మరింత చెడిపోయినది. 1914 మార్చిలో నేను మరల బెజవాడ వచ్చితిని. జిల్లాజడ్జి ఆ రెండు దావాలలో కూడ మా పక్షముననే తీర్పు చెప్పెను. మునగాలరాజాగారిదత్తత ఖాయమయ్యెను, అందుమీద అవతలిపార్టీవారు హైకోర్టులోను, అటుపిమ్మట ప్రీవీకౌన్సిలులోను అప్పీళ్లుచేయుటయు, 1931లో మునగాలరాజాగారి పక్షముననే ఆఖరుతీర్పు చెప్పటయు జరిగెను. ఆ రెండుదావాలు పరిష్కారమయ్యేసరికి నలుబదిరెండు సంవత్సరములు పట్టినవి. (laws delays). మనిషికి నూరేండ్లయితే వ్యాజ్యానికి వెయ్యేండ్లాయుష్యం అనే సామెత సార్థకమయినది, ఈ దావాలతో అవతలిపార్టీవారైన కీసరవారు పూర్తిగా కృంగిపోయిరి. 1914 మార్చినెలలో వైద్యులసలహామీద నేను కుటుంబముతోకూడ చెన్నపట్టణము వెళ్లి అపు డచట ప్రముఖ అలోపతివైద్యుడుగానున్న డాక్టర్ లక్ష్మీపతిగారివద్ద వైద్యముచేయించుకొంటిని. అప్పటి కింకను ఆయన

ఆయుర్వేదములో దిగలేదు. లక్ష్మీపతిగారు 1907 వ సంవత్సరమునుండి లక్ష్మణరావుగారితోపాటు నాకుకూడ ఆప్తమిత్రులుగా నుండిరి. నేను జబ్బు చేసి మందుకువెళ్లినపుడు ఆయన నన్ను తన యింటిలో నొకభాగములోనే వుంచుకొనెను. నా భార్య, నా పినతండ్రిగారిభార్య వంటచేసిపెట్టి ఉపచారము చేయుచుండిరి. డాక్టరు లక్ష్మీపతిగారు పశ్చిమగోదావరిజిల్లా కొవ్వూరు తాలూకా మాధవరముకాపురస్తులు. బాగా భూమిగలవారు. ఆయన ప్రథమ భార్య ఆయనమేనమామ కూతురు. ఆమె చిన్నతనముననే ఒక కొడుకును, ఇద్దరుకూతుళ్లను కని మరణించినది. ఆయన చెన్నపట్టణంలో బి. ఏ., యం. బి. సి. యం. ప్యాసై అల్లోపతివైద్యుడుగా మంచిపేరు సంపాదించుకొని యుండగా తిరువల్లిక్కేణిలో ఆయనయింటికి సమీపముననున్న యొక గొప్పకుటుంబమునకుచెంది ఎఫ్. ఏ. చదువుతున్న రుక్మిణమ్మ అనే 19 సంవత్సరములయువతిని మరల వివాహమాడినాడు. అప్పటి కాయన వయస్సు 30 సంవత్సరములు, రుక్మిణమ్మగారితండ్రి ఆస్తిపరుడే. అప్పటికే సంసారం కొంత ఆర్థికముగా చితికిపోయి మరణించినాడు. తల్లిన్ని, తమ్ముడున్ను గలరు. తల్లితండ్రిగారగు రాజా తుమ్మలపల్లి రామారావుగారు అంతకుముందుకాలములో చెన్నపట్టణం హైకోర్టులో భాష్యం అయ్యంగారితోపాటు పెద్ద లాయరు. ఆయన పెద్దకుమారుడు సబుజడ్జిచేయుచు చనిపోయినాడు. ఆయన రెండవకూతురు రుక్మిణమ్మగారితల్లి. ఆయన మూడవ కూతురిని నెమలి పట్టాభిరామారావుగారి కిచ్చినారు. వారంతా మదనపల్లివైపు గోలుకొండవ్యాపారులగు బ్రాహ్మణులు. లక్ష్మీపతి - రుక్మిణమ్మగారల వివాహము 1911 డిశంబరులో జరిగినది. అది రజస్వలానంతరవివాహమైనందున మాధవరంలో ఛాందసబ్రాహ్మణులు లక్ష్మీపతిగారితమ్ముణ్ని కొంతకాలము వెలివేసినారు. ఆ వెలి ఎటులనో దానంతట అదే సమసిపోయినది. కొమర్రాజు లక్ష్మణరావుగా రపుడు మునగాలలోనే యుండిరి. మద్రాసుకు వచ్చి నన్ను చూచిపోవుచుండిరి. శ్రీమతి రుక్మిణమ్మగారు గొప్ప సుగుణసంపన్నురాలు. తరువాత బి. ఏ. ప్యాసైనది. నేను జబ్బుగావుండి వారింటికి వెళ్లినపుడు నన్నెంతో సోదరీవాత్సల్యముతో ఆదరించినది. అప్పటినుంచి ఆమెజీవితమంతటిలో నన్ను తన సొంతఅన్నగారివలె అత్యంత

వాత్సల్యముతోను గురుభావముతోను గౌరవించినది. తరువాత సాంఘిక, వైజ్ఞానికరంగములలో, స్వతంత్రపోరాటములో ఆమె దేశమున కెంత సేవ చేసినది యావద్భారతదేశమునకు తెలియును. లక్ష్మీపతి - రుక్మిణమ్మగార్లకు రామారావను ఒకకుమారుడు, ప్రమీళ, ఇందిర అను నిద్దరుకూతుళ్ళు గలరు. అందరు మంచిస్థితిలో నున్నారు. 1914 నుండి లక్ష్మీపతిగారికుటుంబము లక్ష్మణరావుగారికుటుంబము, నాకుటుంబము ఒకే కుటుంబమువలె కలసి మెలసి యున్నాము. మేము ముగ్గురము అన్నివిషయములలోను అత్యంత ఆప్తమిత్రులముగా నుంటిమి. లక్ష్మీపతిగారి వైద్యమువల్ల నా జబ్బు కొంత వరకు నెమ్మదించినది. కాని నేను నీలగిరికి పోయి, అక్కడ ఒకటి రెండు నెల లుండుటవలన నా శరీరము స్వస్థమగునని వారు సలహాయిచ్చినందున నేను నా భార్యను, వంటవానిని తీసుకొని నీలగిరిలోని కూనూరులో హైగరు హిల్లు అను కొండకు దిగువభాగమున నెలా పదిహేను రోజులు నివసించి తిని. నా శరీరము చాలవరకు చలివల్ల స్వస్థపడెను. కాని నాభార్య కా ఛలి సరిపడలేదు. అప్పుడు ఉదకమండలములో మోచర్ల రామచంద్రరావు, భోగరాజు పట్టాభిసీతారామయ్య, కొచ్చర్లకోట వెంకటకృష్ణారావు బహదూర్ గారలు ఒక యిల్లు తీసుకొని అక్కడే వేసంగిని గడుపుటకు వచ్చిరి. నేను అపుడపుడు ఉదకమండలము పోయి వారిని దర్శించుచుండెడివాడను. 1915 సం॥ వేసంగిలో ఆ ముగ్గురు ఆంధ్రప్రముఖులతో కలసి నేనుకూడ ఉదకమండలములో ఒకయింటిలోనే యుంటిని. దేశవ్యవహారములనుగూర్చి మేమందరము బాగుగా చర్చించుకొనుటకు మంచి అవకాశముకలిగినది. అటుపిమ్మట 1919 సంవత్సరమువరకు ప్రతిసంవత్సరము వంటవాణ్ని తీసుకొని కూనూరులో వేసవికాలము గడుపుచుండుట జరుగుచుండెను. 1920 వేసంగిలో బెంగుళూరులో వుండుటకు నిశ్చయించుకొని అచట బసవాన్‌గుడిలో ఒక గృహమును అద్దెకుతీసుకొంటిని. ఒకనెల అద్దెకూడ చెల్లించితిని. కాని అపుడు గంపలగూడెం ఎస్టేటువారికిని తిరువూరురాణి గారికిని ఒక పెద్ద చెరువునుగురించి విశేషమైన దెబ్బలాటలు జరిగి ఇరు వైపుల తలకాయలు బ్రద్దలై మూడు పెద్ద క్రిమినలుకేసులు దాఖలై, పోలీసు వారు తిరువూరురాణీగారితో లాలూచీగానుండి యొకకేసులో గంపలగూడెం

రాణీగారి భర్తగారైన కోటగిరి జగన్నాధరాయణంగారిని, వారి యుద్యోగస్తులనుకూడ ముద్దాయిలుగాపెట్టుటవలన నేను స్వయముగా ఆ కేసులలో పని చేయవలసివచ్చి నా వేసంగిప్రయాణమును మానుకొంటిని. మరుసటిసంవత్సరము మార్చిలోనే నేను గాంధీగారి సహాయనిరాకరణోద్యమములో చేరి ప్లీడరువృత్తిని మానుకున్నందువలన అప్పటినుంచి వేసంగిలో నీలగిరికివెళ్లే అలవాటు పోయినది. అప్పటినుంచి కొండలలోనివాసమునకు ఖర్చుపెట్టుటకు వలయు ద్రవ్యముకూడ నావద్ద లేకుండెను.

(5)

అపుడు బెజవాడ సబుకోర్టులో పెద్దపెద్ద దావాలు చాలా దాఖలుకాబడెను. ముఖ్యమైనదావాలన్నిటిలో సాధారణముగా నాకు ఏదో ఒకపక్షమున వకాలతునామా వచ్చినది. అప్పుళ్ళలోకంటె ఒరిజినల్ దావాలలోనే నాకు పని విశేషముగానుండెను. కొన్నికొన్ని దావాలలో నాకు వకాలతునామాలిచ్చిన కక్షిదారులు చెన్నపట్టణమునుంచి ప్రముఖ న్యాయవాదులుగానున్న ఎస్. శ్రీనివాస అయ్యంగారినిగాని, కె. శ్రీనివాస అయ్యంగారినిగాని యిచటి సబుకోర్టులో వాదించుటకు తీసుకొనివచ్చుచుండిరి. మాడపాటి వెంకటేశ్వరరావు పంతులుగారికిని, వెంట్రప్రగడ జమీందారుగారికిని జరిగిన యొక పెద్దదావాలో నా కక్షిదారులైన మాడపాటి వెంకటేశ్వరరావు పంతులుగారు కె. శ్రీనివాస అయ్యంగారిని తీసుకొనిరాగా అవతలిపార్టీవారైన వెంట్రప్రగడ జమీందారుగారు ఎస్. శ్రీనివాసఅయ్యంగారిని తీసుకొనివచ్చిరి. వెంట్రప్రగడ జమీందారుగారిపక్షమున కీర్తిశేషులైన మునునూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వకీలుగా నుండిరి. మరియొక పెద్దదావాలో నొకవైపున రాజా పార్థసారధి అప్పారావుగారికి బారిష్టరు టంగుటూరి ప్రకాశంపంతులుగారు, బడేటి వెంకట్రామయ్యనాయుడుగారు వకీళ్ళుగా పనిచేసిరి. రెండవవైపున ఉయ్యూరు, మీర్జాపురం, ఎలమర్రు జమీందారులు కక్షిదారులుగానుండిరి. వీరిలో ఉయ్యూరురాజాగారికి సుబ్రహ్మణ్యశాస్త్రిగారును, మీర్జాపురం, ఎలమర్రు రాజాగారలకు నేనును వకీళ్ళముగా నుంటిమి. మా అందరికీ సీనియరుగా మా కక్షిదారులు ఎస్. శ్రీనివాసఅయ్యంగారిని వాదించుటకు తెచ్చుకొనిరి. మరియొకదావా ఉయ్యూరురాజాగారిచేత మాడపాటి వెంకటేశ్వరరావుగారిమీద దాఖలుచేయబడెను. ఉయ్యూరురాజాగారి పక్షమున ఎస్. శ్రీనివాసఅయ్యంగారు, సుబ్ర

హ్మణ్యశాస్త్రిగారు, మాడపాటి వెంకటేశ్వరరావు పంతులుగారిపక్షమున కె. శ్రీనివాసఅయ్యంగారు, నేను లాయర్లుగానుంటిమి. ఉయ్యూరు రాజాగారైన శ్రీ రాజా రంగయ్యప్పారావు బహద్దరుగారొక వీలునామావ్రాసి మరణించిరి. వారికి మాడపాటి వెంకటేశ్వరరావుపంతులుగారి ప్రోత్సాహమువల్ల ఆ వీలునామా వ్రాయబడెను. దానిని అమలుజరుపుటకు వెంకటేశ్వరరావుపంతులుగారికి అధికారమివ్వబడినది. దానిప్రకారము నూజవీడులో ఉయ్యూరురాజాగారు స్థాపించిన హైస్కూలు వెంకటేశ్వరరావుపంతులుగారి యాజమాన్యమున నుండెను. బెజవాడలోకాని, ఏలూరులోకాని యొక కళాశాలను స్థాపించుటకు వెంకటేశ్వరరావుపంతులుగారికి అధికారమివ్వబడెను. వేలేరు అను గ్రామము దానిఖర్చులకుగాను యివ్వబడెను. ఉయ్యూరు కమతముభూములు వెంకటేశ్వరరావుపంతులుగారి కివ్వబడెను. ఆ వీలునామా చెల్లదని వారి దత్తతకుమారులగు వెంకటాద్రి అప్పారావు బహద్దూర్‌గారు సబుకోర్టులో దావా దాఖలుచేసిరి. ఆ దావా నడుచుచుండగ వెంకటేశ్వరరావుపంతులుగారు మరణించిరి. వారొక వీలునామావ్రాసి దానిప్రకారము వారిఆస్తులకు, దానధర్మములకు నలుగురు ఎక్జిక్యూటర్లను నియమించి వారిలో నన్ను ప్రధాన ఎక్జిక్యూటరుగా చేసిరి. వెంకటేశ్వరరావుపంతులుగారు చనిపోగానే ఆ దావాలో వాదిగారైన ఉయ్యూరురాజాగారితో రాజీపడుటకు నిశ్చయించితిమి. నూజవీడులోని హైస్కూలును ఉయ్యూరురాజాగారి కిచ్చివేసితిమి. ఇతర ఆస్తులవిషయములోకూడ రాజీగా పరిష్కరించుకొంటిమి. బెజవాడలోనే యొక కళాశాలను ఉయ్యూరురాజాగారే స్థాపించి నడుపునట్లును, వేలేరు గ్రామముమీద వచ్చెడి ఆదాను దానిక్రిందనే ఖర్చుచేయునట్లును అంగీకరించితిమి. ఈవిధముగా ఆ దావా రాజీగా పరిష్కారమైనపిమ్మట కొంతకాలమునకు మరల వారివద్దకు వెళ్ళి జ్ఞాపకముచేయగా ఉయ్యూరురాజాగారే బెజవాడలో శ్రీ రాజా రంగయ్యప్పారావు కళాశాల అనుపేరుతో (యస్. ఆర్. ఆర్. కళాశాల) నొక రెండవగ్రేడుకళాశాలను స్థాపించిరి. అది కొలది సంవత్సరములలోనే మొదటితరగతి కళాశాల అయి బి. ఏ., బి. ఎస్. సి., బి. కామ్. క్లాసులుకూడ పెట్టబడినవి. కొన్ని సంవత్సరములు దానికి డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారు ప్రధానాచార్యులుగా నుండి బాగుగా వృద్ధి

చేసిరి. వా రాంధ్రదేశములో గొప్ప చారిత్రకపరిశోధకులు. వా రిపుడు హైదరాబాదులో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పురాతత్వశాఖ డైరెక్టరుగా నున్నారు. బెజవాడలోని ఆ కళాశాలకు ఉయ్యూరురాజాగారు ఒక పాలకవర్గముగా ఐదుగురుసభ్యులుగల కమిటీని నియమించిరి. నన్ను పాలకవర్గములో నొక సభ్యుడుగా నియమించిరి. పిమ్మట దానికి కొంత ద్రవ్యసహాయముచేసి బెజవాడ వైశ్యప్రముఖులును, దాతలునగు చుండూరు వెంకటరెడ్డిగారు తమ పేరునుకూడ కళాశాలకు చేర్పించుకొని పాలకవర్గములో చేరిరి. 1958 జులై నెలనుండి ఆ కళాశాలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు తమ యాజమాన్యముక్రిందకు తీసుకున్నారు. అది యిపుడు ఒక ముఖ్యమైన మొదటితరగతి కాలేజీగా పదిహేడువందలమంది విద్యార్థులతో వర్ధిల్లుచున్నది. ఈ కళాశాల స్థాపించకముందు అత్యంతముగ పెరుగుచున్నట్టియు, ఆంధ్రదేశమునకు ప్రధానకేంద్రముగా నున్నట్టియు బెజవాడలో ఎట్టి కళాశాల లేకుండెను. ఈ కళాశాలవలన విజయవాడపౌరులకు విశేషమైన లాభము కలిగెను. శ్రీనివాసయ్యంగారు దక్షిణహిందూదేశములో గొప్ప కాంగ్రెసునాయకుడుగా నుండెను. నాకు వారితో రాజకీయములలో అత్యంత సన్నిహితస్నేహము కలిగెను.

వీటన్నిటికంటె ఎక్కువ యుద్రేకమును కలుగజేసిన కేసు మాడపాటి వెంకటేశ్వరరావుపంతులుగారిమీద ఉయ్యూరు, వెంట్రప్రగడ జమీందారులు కలిసి బెజవాడ సబ్‌డివిజనల్ మేజిస్ట్రేటుకోర్టులో దాఖలుచేయించిన క్రిమినలు ద్రవ్యాపహరణకేసు. ఆ క్రిమినలుకేసును వైద్యుల కృష్ణారావుగారిచేత దాఖలుచేయించిరి. అది చాలా తీవ్రరూపమును దాల్చినది. అది రుజువైనచో వెంకటేశ్వరరావుగారికి కొన్ని సంవత్సరములు శిక్షపడును. ఆయనకు గొప్ప మనోవేదన కలిగెను. ఆరోగ్యముకూడ దెబ్బతినెను. ఆయన పక్షమున నేను వకీలుగా నుంటిని. నాకు సీనియర్లుగా చెన్నపట్టణమునుండి బారిస్టరు టంగుటూరి ప్రకాశం, రిచ్‌మండ్‌గార్లు వచ్చుచుండిరి. కొన్నినెలలు జరిగినపిమ్మట క్రిమినలుకేసు కొట్టివేయబడి వెంకటేశ్వరరావుగారు నిర్దోషులని తీర్పు చెప్పబడెను. తరువాత కొన్నినెలలకే వారు మరణించుట తటస్థించినది. అపుడు వారికి రెండవసంబంధపు భార్య, దత్తతకుమారుడు

ఉండిరి. ఆ దత్తతకుమారుడు మైనరు. అతని జనకతండ్రి మాడపాటి వీర భద్రయ్యగారు మా నందిగామ కాపురస్థులు.నాకు కొంచెం సమీపబంధువులు. మాడపాటి వెంకటేశ్వరరావుపంతులుగారు నందిగామ తాలూకామధ్యనున్న పరిటాల జాగీరుకుచెందిన కొడవటికల్లు గ్రామకాపురస్థులు. వారు మాడపాటి హనుమంతరావుపంతులుగారు ఒకకోవకు చెందినవారే. ఉభయుల స్వగ్రామములు బహుసమీపమున నున్నవి. వెంకటేశ్వరరావుపంతులుగారు కడు బీదతనములో పుట్టి వుయ్యూరురాజాగారివద్ద చిన్న గుమాస్తాగా ప్రవేశించి, గొప్ప వ్యవహారదక్షుడై నూజవీడుజమీందారుల వ్యాజ్యములలో పనిచేసి ఉయ్యూరురాజాగారివద్దను శనివారపేటరాణిగారివద్దనుకూడ దివానుగానుండి విశేషమైన ఆస్తిని సంపాదించి రెడ్డిగూడెం, రంగాపురంఎస్టేట్లకు జమీందారై చనిపోయెను. తర్వాతతరమునకుచెందిన నూజవీడు జమీందార్ల కాయన యందు విశేషమైన ఈర్ష్య అసూయ కలిగెను. ఆయన 1917 వ సంవత్సరములో మరణించగానే యినుపపెట్టెలు తీసి వెతుకగా నొక వీలునామా 1913 వ సంవత్సరములో వ్రాసినది దొరకినది. ఆ వీలునామా ఉన్నట్లు ఎవరికిని చెప్పకుండానే ఆయన మరణించినాడు. అదియే ఆయన ఆఖరు వీలు. దానిప్రకారము నేను, మాడపాటి వీరభద్రయ్య మొదలైనవారము నలుగురు ఎగ్జిక్యూటర్లు అందు ట్రస్టీలుగా ఏర్పడితిమి. నన్ను ముఖ్యట్రస్టీగా చేసిరి. దానిలో చాలా దానధర్మములు వ్రాయబడెను. ఆ వీలు బైటికి తీసినపుడు వెంకటేశ్వరరావుగారి లాయరగు శిడింబి హనుమంతరావుగారు, సమీపబంధువగు వేమూరి రామచంద్రరావుగారు దగ్గరయుండిరి. దాన ధర్మములున్నందున నన్ను ట్రస్టీ అండ్ ఎగ్జిక్యూటరుగా నుండవలెనని వారిద్దరు బలవంతపెట్టగా నేను అందుకు అంగీకరించితిని. 1913 వ సంవత్సరములో ఉంచిన కొన్ని ఆస్తులు మరణమునకుమునుపే ఆయన అన్యాక్రాంతము చేసియుండెను. దానధర్మములు కాశీ మొదలుకొని రామేశ్వరము వరకు వ్రాయబడి యుండెను. వాటిని సరిగా అమలుజరుపుట చాల కష్టముగా నుండెను. అందువల్ల అవియన్నియు అమలుజరుప లేక కొన్నిటినిమాత్రమే అమలుజరిపితిమి. ఆయన రెండవభార్యవల్లను, ఆమె మేనమామలవల్లను నేను కొంత నిష్ఠూర్యమును పొందితిని. వారి

యిష్టమువచ్చినట్లు చేయలేదని వారికి కోపము. నేను వెంకటేశ్వరరావు పంతులుగారి ఉద్దేశ్యప్రకారమే చేయుటకు ప్రయత్నించితిని. ఏది ఎట్లున్నను బెజవాడలో ఉయ్యూరురాజాగారి కళాశాల గాక వెంకటేశ్వరరావు పంతులు గారితాలూకు మూడు ధర్మసంస్థలుండెను.వాటిని నిలబెట్టడం,వృద్ధిచేయడము నాకు ప్రధానకర్తవ్యముగానుండెను. అందులో మొదటిది వెంకటేశ్వరరావు టౌన్‌హాల్ అండ్ సోషల్‌క్లబ్. దానిని బలవంతముగా స్వాధీనపరచుకొన వలెనని, ఆ ధర్మమును చెడగొట్టవలెనని, మైనారిటీ వెళ్ళగానే దత్తత కుమారుడగు సూర్యనారాయణరావుగారు ప్రయత్నించిరి. కాని నేను వారికి స్వాధీనముకాకుండ నిలిపి తగిన ట్రస్టీల నేర్పాటుచేసి నా ఎగ్జిక్యూటరుపనిని ముగించుకొంటిని. అది యిపుడు చాలా మంచిస్థితిలో నున్నది. బెజవాడ పౌరులు దాని నిప్పటికీ బాగా వాడుకొనుచున్నారు. తోట వేసినారు. భవనములను వృద్ధిచేసినారు. కళకళలాడుచున్నది. రెండవది గెస్టుహౌస్. కొద్ది కిరాయి పుచ్చుకొని బెజవాడవచ్చిన పెద్దమనుష్యులకు వసతిగృహముగా అది వాడబడుచున్నది. మూడవది సాలుఒకటికి పన్నెండువందలరూపాయల చొప్పున నొక ఆయుర్వేదకళాశాలకు దానము చేయవలెనని ఆయన వ్రాసి పోయెను. అది ఎవరు స్థాపించవలెనని కోర్టులో దావాలుకూడా జరిగెను. శంకర వెంకటరామయ్య, బొడ్డపాటి వెంకటప్పయ్యగార్లు మొదలగువారు రామమోహన ఆయుర్వేదవైద్యశాలను గవర్నర్‌పేటలో నడుపుచుండిరి. తమ వైద్యశాలకే ఈ పన్నెండువందలరూపాయలద్రవ్యము నిచ్చినచో,తామే ఆయుర్వేదకళాశాలను స్థాపింతుమని వారు వాదనచేసిరి. ఆయుర్వేదాచార్య పండిత గోపాలాచార్యులవారిచే మద్రాసులో స్థాపింపబడిన ఆయుర్వేద కళాశాలలో ప్రథమజట్టులో చేరి కృతార్థులై 1906 వ సం॥ నుంచి ఆయుర్వేద వైద్యులుగాను, ఆయుర్వేదపండితులుగాను ప్రఖ్యాతిచెందిన నోరి రామశాస్త్రిలుగారే తాము స్వంతముగా ఆయుర్వేదకళాశాలను నడుపుతామని, తమకే ఈ సాలుసరి విరాళము పన్నెండువందలరూపాయలు యిప్పించవలెనని దావాలో వాదించిరి. వెంకటేశ్వరరావుపంతులుగారు బ్రతికియుండగా పండిత గోపాలాచార్యులవారు, రామశాస్త్రిలవారు, నేను కూడ కలిసి వారితో మాట్లాడగా, వీరి యాజమాన్యమున నొక కళాశాల విజయవాడలో స్థాపించిన

ట్లయిన తాము సహాయముచేయుదుమని వెంకటేశ్వరరావుగారు వాగ్దానము చేసియుండిరి. వెంకటేశ్వరరావుగారు, ఇతర నూజవీడుజమీందార్లు గొప్ప ఆయుర్వేదపోషకులుగా నుండిరి. గొప్ప ఆయుర్వేద పండితులను తమవద్ద పెట్టుకొని వారిచేత ప్రశస్తమైన ఆయుర్వేదమందులను తయారుచేయించిరి. వెంకటేశ్వరరావుగారు స్వయముగా ఆయుర్వేదమునందు, జ్యోతిషమునందు (లా) వ్యవహారమునందు గొప్ప నిపుణులు. వెంకటేశ్వరరావుపంతులుగారి యుద్దేశ్యము ననుసరించియే నేను నోరి రామశాస్త్రిలుగారికి విరాళమునిచ్చి వారిచేతనే ఆయుర్వేదకళాశాలను నడిపించుట యుక్తమని కోర్టుకు నా ప్రమాణపత్రమును పంపితిని. దానిమీద బెజవాడ సబుకోర్టువారు నోరి రామ శాస్త్రిలుగారికే ఈ సాలుసరి విరాళము నివ్వవలెనని, వారే ఆయుర్వేదకళా శాలను బెజవాడలో స్థాపించి నడుపవలెనని తీర్పుచెప్పిరి. ప్రతిసంవత్సరము ఆ విరాళము రామశాస్త్రిగారికి ముట్టుచుండెను. వారు బెజవాడలో ఆయుర్వేద కళాశాలను స్థాపించిరి. దాని భవననిర్మాణమునకై బెజవాడలోని వెంకటే శ్వర టౌనుహాలుకు వెనుకనున్న కాళీస్థలమునుకూడ నేను యిప్పించినాను. దానిలోనే వారు భవనములుకట్టించి ఒక మంచి ఆయుర్వేదకళాశాలను వెంక టేశ్వరరావు ఆయుర్వేదకళాశాల అను పేరుతో నడుపుచున్నారు. అందులో ప్యాసైనవిద్యార్థులు ఆంధ్రదేశములో అక్కడక్కడ ఉద్యోగములను సంపా దించుకొనుచున్నారు. మంచి పండితులుగాను, వైద్యులుగాను తయారగు చున్నారు. గొప్ప ఆయుర్వేదాభిమానులును, ఆర్షరసాయనశాలస్థాపకులు నగు ముక్త్యాలరాజాగారైన వాసిరెడ్డి చంద్రమౌళీశ్వరప్రసాద్ బహద్దరుగారు, పించన్‌పొందిన జిల్లాకలెక్టరుగారగు లక్కరాజు లక్కరాజుపంతులుగారు, యింకా యితరప్రముఖులు దాని కొరక కమిటీగా ఏర్పడిరి. నేనుకూడ కొంత కాల మా కమిటీలో సభ్యుడుగా నుంటిని. ముక్త్యాలరాజా చంద్రమౌళీశ్వర ప్రసాదుగారు నాయం దెంతో వాత్సల్యముగలవారు. ఆంధ్రభాషాపోషకులు, గొప్ప దాతలు; నెలకు 116 రూప్యముల చొప్పున చాలసంవత్సరములు ఆంధ్ర ఆస్థానకవి, మహామహోపాధ్యాయ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారికి శ్రీకృష్ణభారతమును తెలుగులో వ్రాయుటకిచ్చినారు, రాజాగారు పంచాంగమును అచ్చువేయించేవారు. ఆయుర్వేదపండితులు, ఆయుర్వేదపోషకులు. నేను

వారికి కరణమును, రైతును, లాయరును. రైతాంగవ్యవహారములన్నీ బహు సౌమ్యముగా పరిష్కరించేవారు. నాతోపాటు ఎల్లప్పుడు కాంగ్రెసుకే మద్దతు చేసేవారు. ప్రకాశంగారిని తీసుకొనిపోయి అడుగగా స్వరాజ్యపత్రికకు రెండు వేల రూప్యముల విరాళము నిచ్చిరి. శివపూజాదురంధరులు. క్రమముగా యోగాభ్యాసముచేసి యోగిసత్తములయినారు. పెద్దవారైనపిమ్మట కనుచూపు తక్కువయినందున ఎల్లప్పుడు ఈశ్వరధ్యానములోనుండి తుదకు యోగాస నములో తమగదిలో అతి సునాయాసముగా పరమపదించినారు. వెంకటే శ్వరరావుపంతులుగారు చేసిన పై మూడుధర్మములు విజయవాడ పౌరులకు చాల లాభదాయకముగా నేటికిని నడచుచున్నవి. వారు బందరులో ఒక బాలికాపాఠశాలకుకూడ ధర్మము వ్రాసిరి. దానికికూడ వారు వ్రాసినవిరాళము ముట్టినది. 1920 వ సంవత్సరములో మైనారిటీ వెళ్లగానే వెంకటేశ్వరరావు పంతులుగారి దత్తపుత్రుడైన సూర్యనారాయణరావుగారికి వారి ఆస్తినంతా మేము వప్పగించితిమి. తరువాత కొద్దికాలమునకే వెంకటేశ్వరరావుగారి భార్య మరణించడం, అటుపిమ్మట కొద్దికాలానికే దత్తకుమారుడు సూర్య నారాయణరావుగారు అవివాహితుడుగా మరణించడం జరిగినది. వెంకటేశ్వర రావుపంతులుగారి స్వంతఆస్తులన్నియు వారికి జాల దూరపుజ్ఞాతులైన మాడ పాటివారికి చెంది, వారు చాల పేదవారైనందున వాటి నన్నింటిని, గుడివాడ తాలూకాలో ధనికులైన అడుసుమిల్లి గోపాలకృష్ణయ్య, కోగంటి వెంక ట్రామయ్య మొదలైన రైతులకు అమ్మికొని లేచిపోయిరి.

ఇంకా రెండుమూడుదావాలనుగురించి చెప్పి,నా ప్లీడరీవృత్తాంతమును ముగించెదను. వరంగల్లు సమీపముననున్న వడ్డేపల్లిగ్రామములో మిగుల ధనవంతులు, దేశముఖులు, కంట్రాక్టరులు అయిన పింగళి వెంకట్రామరెడ్డి గారు నాకు కొన్నిదావాలను బెజవాడ సబుకోర్టులో దాఖలుచేయుటకు పంపిరి. వాటిని దాఖలుచేసి డిక్రీలు పొందితిమి. అప్పటినుంచి వారికి నాకు చాలా స్నేహము కలిగెను. వారు చాలా విజ్ఞానవంతులు. 1915సంవత్సరములోబెజవాడలోనిరామమోహన ధర్మగ్రంథాలయముయొక్క వార్షికోత్సవమునకు వారిని అధ్యక్షులుగా తీసికొనివచ్చితిమి. ఆ సభలోనే వారు ప్రథమమున మిగుల ఆంధ్రాభిమానపూరితమైన పద్యములను రచించి

మనోజ్ఞముగా చదివి రాయప్రోలు సుబ్బారావుగారు ప్రాముఖ్యతకువచ్చిరి. తనకు వివాహముచేయుటకు తన తలిదండ్రులు వరకట్నము చెల్లించలేక పడుచున్నబాధలను చూచి ఆత్మహత్యచేసుకున్న బంగాళీయువతియగు స్నేహలతమీద మిగుల కరుణారసముతో ఆయన వ్రాసిన ప్రథమ కావ్యమప్పుడే వెలువడినది. ఆయన రచించిన తెనుగుతోట, తృణకంకణం అను కావ్యములుకూడ త్వరలోనే వెలువడినవి. మా సభ చాల పెద్దయెత్తునజరిగినది. వెంకట్రామరెడ్డిగారు ఆంధ్రజాతినిగురించి. ఆంధ్రభాషనుగురించి చక్కని ఉపన్యాసమిచ్చిరి. ఇటువైపు ఆంధ్రుల గౌరవమును పొందిరి. వారిఆహ్వానముమీద కొలదికాలములో పెద్దిభొట్ల వీరయ్య, సూరి వెంకటనరసింహశాస్త్రి, అయ్యంకి వెంకటరమణయ్య, కోవెలమూడి గోపాలకృష్ణయ్య, నేను కలసి వడ్డేపల్లి వెళ్లితిమి. వెంకట్రామరెడ్డిగారి ఆతిథ్యమును పొందితిమి. తెలంగాణమువారి ఆతిథ్యము నేటికిని చాల గొప్పది. వారు మమ్ము కారులలో తీసుకొనివెళ్లి వరంగల్లుకోటను, హనుమకొండలోని వెయ్యిస్తంభాలమండపము, గొప్పదేవాలయము మొదలైనవాటిని చూపించిరి. వెంకట్రామరెడ్డిగారు నైజాముయిలాకా రాజకీయములలో ప్రాముఖ్యత చెందినవారు. ఆనరెరీ సెషన్స్‌జడ్జిగా నియమింపబడినారు. ఇపు డాయన గొప్ప పలుకుబడిగల గృహస్థుగా హైదరాబాదులోని బేగంపేటలో నివసించుచున్నారు. వారి రెండవకుమారుడు జగన్మోహనరెడ్డిగారు ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో జడ్జిగా నున్నారు. కుమార్తె శ్రీమతి కుముదినీదేవిగారు వనపర్తి ఎస్టేట్ రెండవరాజాగారైన రామదేవరావుగారిభార్య.

నైజాంయిలాకాలో వనపర్తి గొప్ప ఎస్టేటు. ఆ ఎస్టేటుకుసంబంధించి మద్రాసురాష్ట్రములోనున్న కొన్ని గ్రామములను, ఇతరఆస్తులను రాబట్టుకొనుటకు చెంగల్పట్టు జిల్లాకోర్టులో కీ. శే. వనపర్తిరాజాగారి మైనరుకుమారుడైన రాజా రామేశ్వరావుగారిపక్షమున దావా దాఖలుచేయవలసివచ్చెను. మైనరుగారితల్లి రాణీ సరళాదేవిగారు, ఆమెతండ్రి మునగాల రాజాగారు, దానిలో నన్ను వారిపక్షమున పనిచేయవలెనని కోరిరి. మా పక్షమున ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారిని, ఎస్. శ్రీనివాసఅయ్యంగారిని, వకీళ్లుగా పెట్టుకొనిరి. హైదరాబాదునుంచి బారిస్టరు అక్బరాలీఖానుగారు

కూడ వచ్చి మాతో పనిచేసిరి. వారు మాకందరికి ఎస్టేట్లకు, ఈనాములకు, జాగీర్లకు నైజామయిలాకాలో వర్తించుచుండిన అతియాత్‌లాను నేర్పించిరి. ఆ దావాలో రెండవవైపున రామేశ్వరరావుగారి పినతండ్రిగారగు రామదేవరావుగారు పార్టీగానుండిరి.వారు పింగళి వెంకట్రామరెడ్డిగారిఅల్లుడు. వారిపక్షమున అల్లాడి కృష్ణస్వామిఅయ్యరుగారు వకీలుగా పనిచేసిరి. ఆ దావా కొంతకాలమునకు బెంగుళూరులో చీఫ్ జస్టిస్ అయిన రీలిగారివద్దకు ట్రాన్స్‌ఫర్‌అయ్యెను. అక్కడ వుండగా నేను ముఖ్యముగా ఇటు మునగాల రాజాగారితోను, అటు పింగళి వెంకట్రామరెడ్డిగారితోను సమాలోచనలు జరిపి తుదకు రాజీగా ఆ దావాను పరిష్కరించితిమి. అపుడు మునగాల రాజాగారి పెద్దఅల్లుడు రాజగోపాలరెడ్డిగారు బారిస్టరు-ఎట్-లాగా నుండిరి. వా రిటీవల స్వర్గస్థులైరి. మూడవఅల్లుడు ఎస్. ఎన్. రెడ్డిగారు కూడ ఎమ్. ఏ. బారిస్టరు-ఎట్-లా ప్యాసై హైదరాబాదునగరమునకు పోలీసు కమీషనరుగా పనిచేసి ఉద్యోగమును విరమించియున్నారు. ఇపుడు నైజాము స్వంతఎస్టేటుకు ట్రస్టీగా నున్నారు. రెండవకుమార్తె వనపర్తిరాణీగారైన సరళాదేవిగారి సైఫాబాద్‌లోని బంగళాకు నేను అనేకసార్లు పోయి కొన్ని రోజులు ఉండవలసివచ్చినది. రాజా రామేశ్వరరావుగారు మైనారిటీవెళ్లిన పిమ్మట ఎమ్. ఏ. ప్యాసై కొంతకాలము గవర్నమెంటు అఫ్ ఇండియా విదేశశాఖలో సహాయరాయబారిగా పనిచేసి, ఇపుడు పార్లమెంటుసభ్యులుగా నున్నారు. మాతో పనిచేసిన అక్బరాలీఖాను బారిష్టరుగారు కూడ ఇపుడు రాజ్యసభలో సభ్యులు. వారు హైదరాబాదులో స్థాపించబడిన పాలిటెక్నికు కళాశాలకు ఏబదివేల రూప్యములు విరాళమునిచ్చిరి. గొప్ప జాతీయవాది. నాకు ముఖ్యమిత్రులు. ఈ రెండుదావాలను బట్టి నాకు హైదరాబాదులోని ఈ ప్రముఖులందరితో చాలాసంవత్సరములనుంచి స్నేహము కలిగినది. ఇదికూడ నేను విశాలాంధ్రస్థాపనకొరకు హైదరాబాదులో చేసిన కృషిలో చాల తోడ్పడినది.

బెజవాడకు సబుకోర్టు వచ్చినప్పటినుంచి 1921 సంవత్సరము ఏప్రిలు వరకు నేను పెద్ద గుర్రపుబగ్గీని (విక్టోరియాను) పెద్ద గుర్రమును పెట్టు కుంటిని. నా బండితోలే రాజయ్య మాలవాడు. అతను మా తక్కిన శూద్ర

నౌకర్లవలెనే పంటయిల్లుతప్ప మా యింట్లో మిగతాభాగమునం దంతట స్వేచ్ఛగా తిరుగుచు, మిగతాపనులుకూడ చేసేవారు. ఆ కాలములో పెద్ద గుఱ్ఱపుబగ్గీ నాకుగాక వకీళ్లలో సి. రాజగోపాలాచారిగారికిమాత్రమే గలదు. ఆయన కొంతకాలము సబుకోర్టులో గవర్నమెంటు ప్లీడరుగాకూడనుండెను. అప్పటికి మోటారుకార్లింకను మా ప్రాంతములకు రాలేదు. నూజవీడుకు మాడపాటి వెంకటేశ్వరరావుగారియొక్కగాని యితర జమీందార్లయొక్కగాని దావాలపనిమీద పోయినపుడు జోడుగుఱ్ఱాలుకట్టిన పెద్దబండిని నూజవీడుస్టేషనుకు వారు పంపేవారు. నేను నూజవీడుస్టేషనువరకు రైలుబండిలో మొదటితరగతిలోపోయి అక్కడనుంచి ఆ జోడుగుఱ్ఱాలబండిలో పదమూడు మైళ్లదూరములోనున్న నూజవీడు వెళ్లేవాణ్ణి. 1919 వ సంవత్సరములో అన్నదమ్ములైన మీర్జాపురం, ఎలమఱ్ఱురాజాగార్లు భాగములుపంచుకొని విడిపోయినపుడు నన్నే కావలెనని కోరి యలమఱ్ఱురాజాగారు తమ వకీలుగా తీసుకున్నారు. వారిఎస్టేటుకు నాతో జాయింటులాయరుగానున్న యల్లంరాజు శాస్త్రిలుగారిని మీర్జాపురంరాజాగారు తీసుకున్నారు. 1920 లో యలమఱ్ఱు రాజాగారు మోటారుకారు కొన్నారు. నేను నూజవీడుకు వారిపనిమీద వెళ్లవలసివచ్చినపుడు నూజవీడుస్టేషనుకు వారిమోటారుకారు వచ్చేది. దానిమీద నేను నూజవీడుకు వెళ్లేవాడను.

19౹2 లో నేను పనియుండి మద్రాసు పోవలసివచ్చి రెండవతరగతి టిక్కెట్టుకొనుక్కొని మెయిలులో ఒక రెండవతరగతిపెట్టెలో నా సామాను పెట్టించయత్నించితిని. అందులో ఒక బ్రిటిషుసైనికుడు ఒకక్రింద(బర్తు)పరుపు మీద పడుకొని మద్రాసు వెళ్లుచున్నాడు. రెండవ క్రిందిపరుపు, ఇంకా పై రెండుపరుపులు ఖాళీగానున్నవి. నా నౌకరు నా పరుపుచుట్టను సామానును దానిలోపలికి తీసుకొనిపోవుచుండగా ఆ బ్రిటిషు సైనికుడు నా నౌకరును తోసి బయటకుపెళ్ళగొట్టినాడు. నా పరుపుచుట్టను సామానును లోపలపెట్టనివ్వ లేదు. నేను ఆరైలుపెట్టెవద్దకు పైకి ఎక్కుటకుపోగా, ఆ సైనికుడు ఆ పెట్టె ద్వారమువద్ద నిలుచొని బూటుకాలుతో నన్ను తన్నుటకు కాలు చాచెను. నేను కొంచెము దూరముగనున్నందున నాకు కాలుతగులలేదు. 'You niggard' నల్లవాళ్ళెవరిని ఇందులోకి రానివ్వను. ఇంకొకపెట్టెలోకి పో' అని బిగ్గరగా

చెప్పెను.అపుడు పోలీసును రైలువేయుద్యోగస్తులను పిలిచితిని.వారిని అతడు లక్ష్యపెట్టలేదు. లోపలికి రానివ్వను అన్నాడు. అతడు తనపేరు చెప్పుటకు కూడ నిరాకరించినాడు. దగ్గరకు ఎవరువచ్చినను కొట్టుతానన్నాడు. అసలే తెల్లవాడు, అందులో సైనికుడు; అతనినిచూచి మన హైందవరైలువేపోలీసు ఉద్యోగులకు గాభరా కలిగినది. ఇంతలో టైము అవుతున్నదని గంట కొట్టినారు. నన్నే ఆ రైలువేఉద్యోగస్తులు ప్రతిమిలాడి మరియొక పెట్టెలో రెండవ క్లాసులో ఎక్కించి పంపిరి. ఆకాలములో ఆంగ్లేయుల జాత్యహంకారము హద్దుమీరి యుండెను. భారతీయుల కెట్టి అవమానములు కలుగజేసినను వారిని అడుగువారు లేరు.

అపుడపుడు పేదవాళ్ళ దావాలుగాని ఏదైనా. సిద్ధాంతములమీద పని చేయవలసిన దావాలుగాని ఫీజులేకుండా పనిచేసేవి వుండేవి. ఓబ్రియనుఅను నొక యూరపియను ఇంజనీయరు తరచుగా ఎవరోయొకరిమీద ఏదోపేరున క్రిమినలుకేసులు పెట్టుతూవచ్చినందున వాటిలో నేనుగాని, పెద్దిభొట్ల వీరయ్యగారు గాని ఫీజులేకుండానే బెజవాడ సబుమేజస్ట్రేటుకోర్టులో ముద్దాయిలతరపున వాదించి కొట్టివేయించి. ఆ ఇంజనీయరుకు గుణపాఠము నేర్పితిమి. ఒక దానిలో ఆ ఇంజనీయరును సాక్షిబోనులోకి తెప్పించి నేను క్రాసుపరీక్ష చేయగా ఆయన సరిగా జవాబులు చెప్పలేక కేసును వదలుకొన్నాడు. తెనాలిలో వితంతూద్వాహము చేసుకున్న యొక బ్రాహ్మణమిత్రుని, ఆయన భార్యను చెవిటికంటి సుబ్రహ్మణ్యంగారను అచటి పెద్ద లాయరు అవమానకరమైన మాట లనినాడు. దానిమీద ఆ లాయరుమీద నా మిత్రుడు తెనాలి మొదటి తరగతి మేజస్ట్రేటుకోర్టులో మానసష్టపుదావా దాఖలుచేసి తనపక్షమునవాదించవలెనని నన్ను కోరెను, ఆ ప్రకారమే నేను ప్రతి వాయిదాకు ఫీజు లేకుండా నా స్వంతఖర్చుమీద తెనాలివెళ్ళి ఆ కేసును విచారణచేయించితిని. తుదకు ఆ లాయరుగారికి కోర్టువారు రు 50 లు జుల్మానా విధించిరి.

నావద్ద నలుగురు యువకులు జూనియర్ లాయర్లుగా పనిచేసి అభివృద్ధిలోకి వచ్చిరి. వారిలో శ్రీ దోర్బల శేషాద్రి యిపుడు బెజవాడ సబుకోర్టులో ప్రథమశ్రేణి లాయరుగా నున్నాడు. మహాత్మాగాంధీగారు లాయర్ల నందరిని ఒక సంవత్సరము తమవృత్తిని మానివేసి కాంగ్రెసుపని చేయవలె

పని కోరగా, అటుల చేసినవారిలో ఈయన యొకరు. 1921 సంవత్సర మంతా లాయరుపనిని మానుకొని కోర్టులకు పోక పశ్చిమకృష్ణాజిల్లా కాంగ్రెసు కమిటీకి కార్యదర్శిగా పనిచేసెను. మరల 1922 లో వృత్తిలో చేరెను. ఇటీవల చైనాదేశమునకు మిత్రబృంద సభ్యుడుగా భారతదేశపక్షమున పంపబడి అచటి సహకారవ్యవసాయపద్ధతులమీద నొక చక్కని పుస్తకమును ఇంగ్లీషులో ప్రచురించెను. అది ప్రముఖుల మన్ననలను పొందినది. నావద్ద జూనియర్‌గానుండినవారిలో మరియొకరు బారిస్టరు శ్రీ తుర్లపాటి వెంకటేశ్వరరావు. ఈయన కృష్ణాజిల్లాబోర్డు సభ్యుడుగా, మ్యునిసిపలు సభ్యుడుగా సాంఘికసేవకుడుగా జిల్లాకోర్టులో పబ్లికుప్రాసిక్యూటరుగా పనిచేసి పరమపదించెను. మూడవవారు శ్రీ ఆలీబేగు సాహెబు. ఈయన మంచి సమర్థుడైన లాయరేగాక మద్రాసు శాసనసభలోను, భారతరాజ్యాంగ నిర్ణయసభలోను పార్లమెంటులోను కొంతకాలము సభ్యుడుగాకూడ నుండెను. నాలుగవవారగు శ్రీ కొల్లిపర వెంకటరమణయ్యానాయుడు బందరు జిల్లాకోర్టులో సమర్థతకు పేరొందిన లాయరై కృష్ణాసహకారబ్యాంకుకు అధ్యక్షులై, ఆంధ్రరాష్ట్రశాసనసభలోను, ఆంధ్రప్రదేశ్ శాసనసభలోను ప్రముఖసభ్యుడుగా నున్నాడు. ఇటీవలనే ఆయన మరణించినాడు.

కొన్నివిషయములలో లాయర్ల కుపయోగించే నా స్వానుభవముల్రాయుచున్నాను. ఎంతపెద్దకేసు వచ్చినా ఎంతఫీజు యిస్తామన్నా నేను దానిని ముందుగానే బాగుగాచదివి గెలిచేఅవకాశంలేదని నాకుతోచినచో 'ఇది గెలువదు. నేను దాఖలు చెయ్యను' అని చెప్పి కక్షిదారుణ్ని పంపించేవాణ్ని. ఇందువల్ల నా ప్రతిష్ఠ హెచ్చినది. నేను దాఖలుచేసిన దావాలుకూడాచాలవరకు గెలిచేవి. రెండవది: నేను పనిచేయుచున్నఒకదావాలో 'అవతలవైపువారు న్యాయాధిపతికి లంచమిచ్చుటకు ప్రయత్నించుచున్నారు. ఆయన కా పేరున్నది. మన వైపునే లంచమిచ్చుటకు మీరు మీ మిత్రులద్వారా ఏర్పాటుచేయించండి' అని నన్ను నా కక్షిదారు డడిగెను. ఆయన నాకు ముఖ్యమైన కక్షిదారులలో నొకరు. 'నే నటువంటి వెన్నటికి పెట్టుకోను. నాపనిఅల్లా మీ కేసు బాగా చదివి వాదించటంతప్ప మరేమీ లేదు. తక్కినవిషయాలతో నా కెట్టిప్రసక్తి లేదు. మీకు తగినకారణములుంటే ఈదావాను ఈ న్యాయాధిపతిమందీ మరి

యొకచోటికి మార్పించుకొనుటకు హైకోర్టులో అర్జీ దాఖలుచెయ్యండి. అన్యాయము జరిగితే అప్పీలుచేసుకొనండి. అంతేగాని లంచాలు ఇవ్వవలెనను ప్రయత్నం మీకుకూడా మంచిదికాదు' అని చెప్పినాను. లాయర్లు జడ్జీలను ఆశ్రయించి వారి అనుగ్రహము పొందుదామని ప్రయత్నము చేయుటవలన లాభించదు. లాయర్లకు పరువుప్రతిష్ఠలు పోతవి. తన స్వశక్తిమీదనే లాయరు ఆధారపడాలి. క్రొత్తగా వచ్చినపుడును బదిలీ అయ్యేటప్పుడును తప్ప మిగతా కాలములలో జడ్జీలయిండ్లకు పోకూడదని మేము మా కాలములో న్యాయవాదులసంఘములో నిర్ణయించుకుంటిమి. ఒక న్యాయాధిపతి మిగుల పక్షపాతియని పేరుపొందెను. ఆయనవద్ద నుంచి ట్రాన్సుఫరుచేయవలెనని ఏడుదావాలలో కృష్ణాజిల్లాకోర్టులో అర్జీలు పెట్టించితిమి. అందులో ముందు దావాలో నా కక్షిదార్లు అట్టిఅర్జీలుపెట్టిరి. నాలుగు దావాలలో నా కావలివైపు కక్షిదార్లు అర్జీలుపెట్టిరి. ఏడుదావాలలోకూడ అటో ఇటో నాకు సంబంధ ముండెను.గాని ఏప్రిలునెలలో కోర్టులు మూసివేసేకాలములో ఆ అన్నిట్రాన్సుఫరుఅర్జీలను జిల్లాజడ్జి కొట్టివేసెను. ఆ నెలాఖరున నేను వేసంగిలో ఉదకమండలము పోతిని. అప్పుడు నేను పనిచేయుచున్న యొక దావాలో మా సీనియరులాయరగు కె. శ్రీనివాసయ్యంగారు హైకోర్టుజడ్జీగా నియమింపబడిరి. ఆ దావాకూడ ట్రాన్సుఫరు అర్జీ పెట్టబడినదే. ఆసంగతి ఆయనకు తెలుసును. ఆయ నపుడు ఉదకమండలమువచ్చెను.నేను వారినిచూచి అభివందనములను తెలిపితిని. ప్రసంగవశమున ఫలానాన్యాయాధిపతి మామూలుగానే యున్నాడా అని నన్నడిగెను. అటులనే యున్నాడు. ఆయన నెచటికైన బదలాయింపుజేసి మా పీడ వదల్చండి అని చెప్పినాను. ఆయన విని యూరుకొన్నాడు. ఆయన ఏమైన చర్యపుచ్చుకొనెనో లేక జిల్లాజడ్జీయే ఏమైన పైకి వ్రాసెనో తెలియదుగాని మరల వేసంగిసెలవులకు పిమ్మట మా కోర్టు తెరచేటప్పటికి ఆ న్యాయాధిపతిని మరియొక దూరప్రాంతమునకు బదలాయించిన ట్లుత్తరువు లొచ్చినవి.

బెజవాడలో వర్తకముచేయుచున్న వైశ్యులు తాము అమ్మిన ప్రతి వస్తువుమీద దానిఖరీదుకు పైన ధర్మఖర్చు అని చెప్పి కొంత వసూలు చేయుచుండిరి. ఆ ధర్మనిధితో బెజవాడలో కన్యకాపరమేశ్వరి సత్రమును

నిర్వహించుచు దానిలో బ్రాహ్మణులకు వైశ్యులకు అన్నప్రదానంచేయు చుండిరి. కొంతమంది విద్యార్థులకుకూడ భోజనము పెట్టుచుండిరి. విద్యార్థులుకాక అక్కడ భోజనముచేయువారిలో చాలమంది సోమరిపోతులే. అందువల్ల ధర్మనిధికూడ సరిగ వసూలగుటలేదు. దానిని కట్టుదిట్టముగ వసూలుచేసి యొక హైస్కూలును (ఉన్నతపాఠశాలను) కన్యకాపరమేశ్వరీ హిందూ హైస్కూలు అను పేరిట నడిపితే బాగుంటుందను భావము వైశ్య ప్రముఖులగు విస్సంసెట్టి వెంకటరత్నంగారికిని వారి మిత్రులును, బ్రాహ్మణవర్తకులు నగు ఆకెళ్ల వెంకయ్యగారికిని కలిగి. 1911 వ సంవత్సరములో నావద్దకు వచ్చి తద్విషయములో నా సహాయ ప్రోత్సాహములను వాంఛించిరి. నేను వారిలో నేకీభవించి సర్వవిధముల సహాయముచేతునని చెప్పితిని. ఏటేట వచ్చు ధర్మపుసొమ్ము గాక విరాళములుగా కొంత పెద్ద మొత్తమును వసూలుచేయుట అవసరమనియెంచి కన్యకాపరమేశ్వరీ సత్రపు మేడమీద నొక సాయంత్రము వైశ్యప్రముఖులును, వారిమిత్రులైన ఇతర వర్ణములవారిని సమావేశపరచిరి. విస్సంసెట్టి వెంకటరత్నంగారును, ఆకెళ్ల వెంకయ్యగారును చెరి అయిదువేలరూప్యములను విరాళము ఇచ్చినట్లు జ్ఞాపకము. కన్యకాపరమేశ్వరీ హిందూ హైస్కూలును స్థాపించునటులను, ప్రతివారివద్దనుంచి రెండువందలఏభై రూప్యములకు తక్కువగాకుండ విరాళములను వసూలుచేయునటులను తీర్మానించబడెను. మేమందరము అటుల విరాళములనిచ్చినాము. కొంతమంది వైశ్యప్రముఖులు తలాయొకవెయ్యిరూప్యముల నిచ్చినారు. మొత్తము ఏబదివేలు వసూలైనది. హైస్కూలు స్థాపితమైనది. అప్పటికి బెజవాడలో నొక హైస్కూలు కలదు. అది ఆంగ్ల క్రైస్తవ మిషనరీలది. మిషనరీ పాఠశాలలయందిష్టములేక గుంటూరులో, బందరులో అదివరకే హిందూ హైస్కూళ్లు స్థాపితమైనవి. మేము నూతన హిందూ హైస్కూలుకు అంగీకారమునిప్పించవలెనని రాష్ట్రవిద్యాశాఖాధికారివద్ద నర్జీ దాఖలుచేయగా విస్సంసెట్టి వెంకటరత్నంగారియందు అసూయగల మరియొక వైశ్యప్రముఖులగు అద్దేపల్లి వెంకటగురునాథరామశేషయ్య శ్రేష్ఠిగారును మరియొకరును ఒక హైస్కూలుండగా నీ క్రొత్త హైస్కూలును అంగీకరించకూడదని, ఈ క్రొత్తదానికి సొమ్ము చాలదని మొదలైన

ఏవేవో సంగతులతో ఆక్షేపణఅర్జీని దాఖలుచేసి వాదించిరి. నేను, వెంకటరత్నంగారు, వెంకయ్యగారు విద్యాశాఖాధికారివద్దకు స్వయముగా వెళ్ళి మాట్లాడి కన్యకాపరమేశ్వరీ హిందూ హైస్కూలుకు తాత్కాలిక (రికగ్నిషన్) అంగీకారపుఉత్తరువును పొందితిమి. రామస్వామిఅయ్యరుగారు మూడు నాలుగుసంవత్సరములు ప్రథమమున ప్రధానోపాధ్యాయులుగా పనిచేసిరి. వారు వెళ్ళిపోయిన పిమ్మట కొఠారు రామారావుగారు చాలా సంవత్సరములు ప్రధానోపాధ్యాయులుగ నుండిరి. వీరుభయులును మంచి పేరు ప్రతిష్ఠలు గలవారే. రామారావుగారు ఇటీవలనే ఉద్యోగము మాను కొని స్వర్గస్థులైరి. ఉన్నతపాఠశాల బాగుగ వృద్ధిచెంది దినదినప్రవర్ధమానము గ నున్నది. ఇంకా కొంత మూలధనము కావలసివచ్చినది. ఇరవై వేల రూప్యముల విరాళ మెవరిస్తే వారిపేరుకూడ చేర్చెదమని పాఠశాలకమిటీ సర్వసభ్యసమావేశంలో నిశ్చయించితిమి. ఉపకారవేతనము పుచ్చుకున్న జిల్లాజడ్జి ఎల్లేపద్ది జానకిరామయ్యగారు తనతల్లిపేర ఇరవై వేలరూప్యముల నిచ్చెదమని ముందుకువచ్చిరి. విస్సంసెట్టి వెంకటరత్నంగారు తానే ఇరవై వేలు ఇచ్చెదనని చెప్పెను. కొంత చర్చజరిగి సర్వసభ్యసమావేశములో విస్సంసెట్టి వెంకటరత్నంగారి ఇరవై వేలరూప్యములవిరాళమే పుచ్చుకొని, విస్సంసెట్టి వెంకటరత్నం కన్యకాపరమేశ్వరీ హిందూ హైస్కూలు అని పేరుపెట్టుటకే తీర్మానించితిమి. ధనికులగు వైశ్యసంఘంవారిని విద్యాసంస్థలకు దానములుచేయుటకు ప్రోత్సహించుట యుక్తమని తలచితిమి. ఆ హైస్కూలును విస్సంసెట్టి వెంకటరత్నంగారు మరణించిన పిమ్మటకూడ నొక కమిటీ నడుపుచున్నది. మాయూరి వైశ్యప్రముఖులు దానియందత్యంత శ్రద్ధచూపుచున్నారు. దాని కొక శాఖను మూడవఫారమువరకు గవర్నరుపేటలో నెలకొల్పిరి. నాలుగు సంవత్సరములక్రిందట దానినికూడ పూర్తియైన హైస్కూలుగాచేసి గాంధీనగరములో సొంతభవనములో స్థాపితము చేసినారు. రెండు హైస్కూళ్లును బాగుగా పనిచేయుచు వర్ధిల్లుచున్నవి.

1913 వ సంవత్సరములోనని జ్ఞాపకము. సర్వెంట్సు ఆఫ్ ఇండియా (భారతసేవకసంఘ) సభ్యులయిన శ్రీనివాసశాస్త్రిగారు బెజవాడవచ్చి మూడు రోజులు నా కతిథిగా నుండిరి. అపుడు గోపాలకృష్ణ గోఖలేగారు ఆ సంఘ

మున కధ్యక్షులు. నన్ను ప్లీడరీవృత్తిని వదలి తమసంఘములో సభ్యుడుగ చేరవలెనని కోరిరి. నా కా సంఘమునందును, అధ్యక్షులైన గోఖలేగారి గారియందును, శ్రీనివాసశాస్త్రిగారియందును అత్యంత గౌరవమే కలదు గాని, రాజకీయములలో నేను బాలగంగాధరతిలకుగారి అనుచరుడను. భారతసేవక సంఘమువారి మితవాదిత్వముతో నే నేకీభవించనుగనుక వారిసంఘములో చేరజాలనని చెప్పితిని. వారిసంఘమునకు కొంత ధనమును సేకరించుటకు వా రపుడు ఆంధ్రపట్టణములలోని కొందరు మిత్రులనుచూచుటకు వచ్చినారు. నే నట్టి మిత్రులలో నొకడను. నేను కొంత మంచి విరాళమిచ్చి, కొంత మిత్రులనుండి వసూలుచేసిపెట్టితిని. కవుతా సూర్యనారాయణరావుగారు కొంత విరాళమిచ్చినారు.

ఆ మరుసటిసంవత్సరము పూనా వితంతుశరణాలయమును స్త్రీల విద్యాలయమును స్థాపించిన విద్యానిధి అయిన కార్వే పండితుడు బెజవాడకు మాయింటికివచ్చి నా కతిథిగా నుండెను. అయిదారుదినములు నావద్దనుండెను. ఒక సాయంత్రము మాడపాటి వెంకటేశ్వరరావుటౌనుహాలులో నుపన్యసించెను. నే నధ్యక్షతవహించితిని. తాము స్థాపించిన ప్రతిష్ఠాపనలకు కొంత సొమ్ము వసూలుచేయుటకై వచ్చెను. నేను కొంత మంచివిరాళమే ఇచ్చితిని, ఇతరులవద్దకూడ వసూలుచేసిపెట్టితిని. ఆయన నాతోకూడ మిత్రులయిండ్లకు నడచివచ్చి చిన్నమొత్తము లిచ్చినను సంతోషముతో పుచ్చుకొనెను. ఆయన కిటీవలనే నూరుసంవత్సరములు నిండిన యుత్సవము చేసినారు. ఇప్పటికిని దైవానుగ్రహమువలన మంచి ఆరోగ్యముకలిగి దేశసేవ చేయుచున్నారు. నే నొకసారి పూనానగరమునకు పోయినపుడు వారి దర్శనముచేయ నుద్దేశించి వారి గృహమునకు వెళ్ళితిని. ఆయన నిరాడంబరజీవి. ఒక సామాన్యగృహములోనే నివసించెను. నేను వారిని పిలువగా లోపలినుంచి యొక సౌందర్యవతియైన యువతి తలుపుతీసి నా పేరడిగెను. నా పేరు చెప్పగా నన్ను గౌరవించి కూర్చొనమని చెప్పినది. ఆయన బొంబాయి విశ్వవిద్యాలయపుపనిమీద బొంబాయి వెళ్ళినారనిన్నీ, వారు వచ్చినతరువాత నేను వచ్చినసంగతి ఆయనతో చెప్పెదననిన్నీ చెప్పినది. ఆమె ఆయనగారి కోడలు.

జర్మనీలో కొన్నిసంవత్సరములు చదివి రెండు ఎం. ఏ. లు (Double M. A.) ప్యాసై వచ్చినది. అపుడు కార్వేగారు లేకున్నను కేట్కారుగారి సహాయముతో వితంతుశరణాలయమును, స్త్రీల విశ్వవిద్యాలయమునుచూచి వచ్చితిని. నేను పూనా నుంచి బెజవాడ వచ్చినపిమ్మట ఎంతో ఆదరముతో కార్వేపండితులు నా కొక లేఖ వ్రాసినారు.

మా నందిగామలో ప్రాథమికపాఠశాలలు - ఒకటి బాలురది, రెండవది బాలికలది, మూడవది ముసల్మాన్‌పిల్లలకు - మూడు మాత్రమే యుండెను. 1912 వ సంవత్సరములో నొక సెకండరీపాఠశాలను స్థాపించుటకు నిశ్చయించితిమి. మా తాలూకాలో నెచటకూడ సెకండరీ (యున్నత) పాఠశాల లేకుండెను. ప్రభుత్వోద్యోగుల సహాయముతో తాలూకాయంతయు తిరిగి సొమ్ము వసూలుచేయుటకుద్దేశించి పంచమజార్జి పట్టాభిషేక సెకండరీ పాఠశాల యని నామకరణముచేయుటకు తీర్మానించి, మా తాలూకాపెద్దలు ముఖ్యముగ మా గ్రామపెద్ద లొక కమిటీని ఎన్నుకొని నన్ను దానికి అధ్యక్షునిగావుండి సొమ్ము వసూలుచేసి పాఠశాలను సక్రమముగనడుపుబాధ్యత వహించవలెనని కోరిరి. నే నప్పుడు బెజవాడలో లాయరుగానుండి యప్పడపుడు స్వగ్రామమగు నందిగామకు వచ్చుచు పోవుచుంటిని. నే నందు కొప్పుకొని కమిటీకిఅధ్యక్షునిగా పనిచేసితిని. తుర్లపాటి సుందరశివరావుగారా కమిటీకి కార్యదర్శిగాను, తుర్లపాటి వీరభద్రరావుగారు కోశాధికారిగాను ఎన్నుకొనబడిరి. మా తాలూకా తహసీలుదారు జగన్నాధరావుపంతులుగారు సొమ్ము వసూలుచేయుటలో చాల సహాయపడిరి. వారు చాల సజ్జనులు. లంచమేమిటో యెరుగనివారు. విద్యాభిమాని. ప్రథమమున రాఘవాపురము వైశ్యులు గోపు జోగయ్యగారింటికిపోయి అడిగినాము. ఆయన అయిదువందల రూప్యముల నిచ్చెను. ఈవిధముగ తిరిగి నలుబదివేలరూప్యములను వసూలుచేసితిమి. మునగాలరాజాగారగు నాయని వెంకటరంగారావుగారు స్వంతముగ అయిదువేలరూప్యములను దయచేసి వారిపరగణాలో ప్రజలనుండి అయిదువేలరూప్యములను వసూలుచేసి యిప్పించిరి. ఒకఅద్దెయింట్లో మొదటిఫారముమొదలు మూడవఫారమువరకు మాత్రము ప్రారంభించితిమి. కొండిపర్తి వీరభద్రాచార్యులుగారిని ప్రధానోపాధ్యాయునిగా నియమించి వారి

సలహాపైన తగినవారిని యుపాధ్యాయులుగా నియమించితిమి. పాఠశాల ఆదర్శప్రాయముగా జరుగుచుండెను. చల్లటి ఉదయపుపూట, మరల సాయంత్రము పాఠశాల జరిగెను. నీతిబోధ, దైవభక్తి కూడ విద్యార్థులకు బోధించబడెను. ప్రహ్లాదచరిత్ర, గజేంద్రమోక్షము, నిర్బంధ పాఠ్యగ్రంథములుగా చేసితిమి. హరిజనులనుకూడ చేర్చుకుంటిమి. ఉర్దూభాషకూడ నేర్పితిమి. మా తాలూకా నైజాంరాజ్యమున కానుకొని యున్నందున ఉర్దూ నేర్చుకొనుట విద్యార్థులజీవనోపాధికి యుపయోగించునని తలంచితిమి. కాని నాలుగవ ఫారముకూడ ప్రారంభించగానే విద్యాశాఖాధికార్లు భవనము కావలెనని తొందరపెట్టసాగిరి. ముక్త్యాలరాజాగారగు వాసిరెడ్డి చంద్రమౌళీశ్వరప్రసాదు బహద్దరుగారు నందిగామలోని మంచి ఖాళీస్థలమును. దానిలో బిల్డింగు కట్టించి ఇచ్చెదమని వాగ్దత్తముచేసిరి. అందులో బిల్డింగు కట్టించుచుండగా వారికిని కమిటీవారికిని భేదాభిప్రాయములు కలిగెను. ఆయన దాని నిచ్చుటకు ఆలస్యముచేసెను. కమిటీవారు వారిఅనుమతి పొందకుండగనే దానిలో ప్రవేశించి పాఠశాల తెరచిరి. నా కది యిష్టములేదు. ఆయన వ్యాజ్యము వేసెను. స్థలమును, కొంత కట్టబడిన బిల్డింగును వారికే స్వాధీనముచేయునట్లు రాజీపడితిమి. వారితరపున అపుడు పెద్దిభొట్ల వీరయ్యగారు లాయరు. ఆయన కూడ పాఠశాలయందు చాలా అభిమానులు. రాజాగారిమర్యాద కాపాడుటకై ఆవిధముగా రాజీపడినచో వారు తప్పకుండా ఆ భవనమును కట్టించి యిచ్చెదరని వీరయ్యగారును, రాజాగారిబావమరదిగారును చెప్పిరి. దానిని నమ్మి ఆ రాజీకి అంగీకరించవలెనని సలహానిచ్చితిని. కాని తుదకు రాజాగారా స్థలమును, కట్టిన బిల్డింగును స్వాధీనముచేసికొని పాఠశాల కివ్వక వారి స్వంతముక్రిందకే తీసుకున్నారు. వారు విద్యాపోషకులే. నందిగామమీద కోపమువచ్చి వారి దానధర్మములను వారికి సమీపముననున్న జగ్గయ్యపేట హైస్కూలుస్థాపనకు చేసినారు. మా నందిగామ పాఠశాలను మరియొక అద్దె యింటిలో పెట్టినారు. అయిదవఫారముకూడ తెచ్చినారు. పీసిభద్రాచార్యులుగారు తురిమెళ్ళ హైస్కూలుకు వెళ్లిరి. చెరుకుపల్లి వెంకటప్పయ్యగారిని ప్రధానోపాధ్యాయునిగా నియమించితిమి. వీరు అతియోగ్యులు, సమర్థులు. చాలాసంవత్సరములు బహుచక్కగా పాఠశాలను నడిపిరి. ఆరవఫారముకూడ తెరవబడి

నది. 1920 లో సహాయనిరాకరణము వచ్చినందున నేను అధ్యక్షపదవికి రాజీనామా నిచ్చితిని. కొద్దికాలములో ఆ స్థితితోసహా ఆ పాఠశాలను నా సలహాపైన కృష్ణాజిల్లాబోర్డుకు కమిటీవారు వప్పగింతచేసిరి. ఆ పాఠశాల మంచిస్థితిలో నున్నది. నందిగామడీరిబైట పదునాలుగు యకరాలస్థలము కొని, జిల్లాబోర్డువారు బిల్డింగు కట్టినారు. అప్పటికి అదియే మా తాలూకాలో మొదటి హైస్కూలు. దానితోపాటే దాదాపుగా అదేసమయములో గెంటాల జోగయ్యగారి ధర్మమువల్లను. ముక్త్యాలరాజాగారి ధనసహాయమువల్లను మా తాలూకాలోని జగ్గయ్యపేటలోకూడా ఒక హైస్కూలు స్థాపించబడినది. 1957 సంవత్సరములో మా నందిగామతాలూకాలో ప్రజలవిరాళములతో స్థాపించ బడి బోర్డువారిక్రింద నడుపబడుచున్న హైస్కూళ్లు (ఉన్నతపాఠశాలలు) పది యున్నవి. ప్రజలు విద్యాసంస్థలకు భూరివిరాళములిచ్చుట నేర్చుకొనుచు న్నారు. డాక్టరుకేట్కారు అను మహారాష్ట్రపండితుడు అమెరికాలో పి. హెచ్. డి. ప్యాసైవచ్చి హిందూదేశములోని కులములు అను విషయములో ప్రత్యేక పరిశోధనలుజరిపి యొక మంచిగ్రంథము వ్రాసినాడు. ఆంధ్రదేశ ములోకూడ కొంత పరిశోధనచేయదలచి 1915 సంవత్సరములో బెజవాడకు వచ్చి నా కతిథిగా మాయింట్లో వారమురోజు లున్నాడు. అప్పటికి ఆయన మహారాష్ట్రభాషలో విజ్ఞానసర్వస్వమును వ్రాయవలెనని యత్నించుచుండెను. నాతోను, కొమర్రాజు లక్ష్మణరావుగారితోను ఆ విషయములన్నీ మాట్లాడి నాడు. ఆయనతో జరిపిన సంభాషణలఫలితముగ లక్ష్మణరావుగారు ఆంధ్ర భాషలో విజ్ఞానసర్వస్వమును ప్రారంభించినారు; గాని మూడుసంపుటములు మాత్రము ప్రచురించి దివంగతులైనారు. డాక్టరు కేట్కారుగారు చాల మంచి పేరుగన్న మహారాష్ట్రవిద్వాంసులను పోగుచేసుకొని యొక గొప్ప ఉపసంపాదకీయసంఘము నేర్పాటుచేసి వలయుద్రవ్యమును సేకరించి మహా రాష్ట్ర విజ్ఞానసర్వస్వమును పూర్తిచేసినాడు. పిమ్మట కొన్నిసంవత్సరాలకు ఆయన నన్ను బొంబాయిలోను, పూనాలోను, మదరాసులోను కలసినాడు. పూనాలో తమగృహమునకు నన్ను తీసుకొనివెళ్ళి రెండురోజులు అతిథిగా ఉంచుకొన్నాడు. ఆ విజ్ఞానసర్వస్వమును నాకు చూపించినారు. అది యుత్కృష్టవ్యాససంపుటి. పూనాలో నేను ఆయనతోకూడవెళ్ళి సర్వెంట్సు

ఆఫ్ ఇండియా సొసైటీని (భారతసేవకసంఘమును), ఫర్గూసన్ కళాశాలను, లాకళాశాలను, కేట్కారుగారిని, వారు నడుపుచున్న కేసరి, మహారాటా పత్రికలఆఫీసులను దర్శించినాను. సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటీలో ఆ సమయమున కోదండరావుగారు మాత్ర మున్నారు. వారు ఆంధ్రులు, ఆ సంఘమునకు కార్యదర్శిగానుండిరి. కొంతసేపు వివిధవిషయములనుగూర్చి మాట్లాడినాము. అదివరకే కార్వేపండితుని దర్శించదలచి వారిగృహమునకు వెళ్లితిని. వారు బొంబాయికి వెళ్ళినారు. కాని వారు నడుపుచున్న గొప్ప సంస్థలనుమాత్రము కేట్కారుగారిసహాయమున చూచివచ్చితిని.

1918 సంవత్సరము ఏప్రిలునెలలో మూల్పూరు రంగయ్య అను విశాఖపట్టణములోని వైద్యకళాశాలలో మూడవయేడు పరీక్ష పూర్తిచేసిన వైద్యవిద్యార్థి శ్రీమతి చుక్కమ్మ అను వితంతుయువతిని ప్రేమించి ఆమెను వివాహముచేసుకొనుటకు తనతో తీసుకొని బెజవాడ వచ్చెను. వారిద్దరితోకూడ మరి యిరవైమంది వైద్యకళాశాల విద్యార్థులు వచ్చిరి. అది ఆదర్శప్రాయమైన వివాహము. ఇద్దరు సుగుణసంపన్నులు. శ్రీమతి చుక్కమ్మ తెనుగు బాగా చదువుకున్నది. ఇంగ్లీషు, హిందీ కొంచెముగా వచ్చును. నన్ను వివాహముజరిపించవలెనని కోరిరి. బెజవాడ గవర్నరుపేట లోని యొకసత్రములో వారందరికి విడిది యేర్పాటుచేసితిని. యథావిధిగా వివాహముజరిపితిమి. వధూవరులు కమ్మవారు. వారితో వచ్చిన స్నేహితులు అన్నివర్ణములకు చెందినవారుండిరి. వివాహముకాగానే అందరముకలసి ప్రీతిభోజనముచేసితిమి. వారి వివాహజీవితము మిగుల సౌఖ్యదాయకముగా పేరుప్రతిష్ఠలతో జరుగుచున్నది, రంగయ్యగారు ఆఖరు వైద్యపరీక్షలో ఉత్తీర్ణుడై ఏలూరులో సుప్రసిద్ధ డాక్టరుగా పనిచేయుచున్నారు. ఆయన ఆంధ్రదేశములో పేరుగన్న కాంగ్రెసునాయకుడు. అనేకసార్లు జైలుకు పోయినాడు. జిల్లాబోర్డు అధ్యక్షుడైనాడు. ఆంధ్రప్రదేశ్ ఎసెంబ్లీలో ప్రముఖసభ్యుడు. ఆమెకూడ అనేకసార్లు జైలుకు వెళ్ళినది. ఆంధ్రదేశ ములో కాంగ్రెసుకుచెందిన విదుషీమణులలో గొప్పస్థానమలంకరించు చున్నది. దానధర్మములకు హరిజనసేవకు సాంఘికసేవకుకూడ ప్రసిద్ధి కెక్కియున్నది. వారి కొక్కడే కుమారుడు. అతనికి మెట్రిక్యులేషన్‌వరకు

చదువుచెప్పించి తలిదండ్రులు తమభూములను వ్యవసాయముచేయించుకొను పనిలో వినియోగించినారు. కొలదినెలలుమాత్రము వారిబంధువులు వారి యింటికి రాకుండా దూరముగానున్నారు. కాని అదంతా త్వరలోనే సమసి పోయి వారితో బంధువులు, మిత్రులు కలిసిపోయినారు. ఇది ఆంధ్రదేశము లోని యొక ఆదర్శమైన వివాహము. సంఘసంస్కరణ విషయములో సంఖ్య కంటె ఆదర్శమైనవివాహములే ముఖ్యము.పిమ్మట నేను, దర్శి చెంచయ్యగారు కలసివెళ్ళి కృష్ణాజిల్లా పెడనలో మరియొక వితంతూద్వాహము చేయించినాము. అది విశ్వబ్రాహ్మణ కుటుంబములోది. అదికూడ ఆదర్శమైనదే అక్కడకూడ మేము భోజనముచేసివచ్చినాము. ఇంకా కొన్ని వితంతువివాహములకువెళ్లి ఆశీర్వదించి భోజనముచేసి వచ్చేవాడను.

ఆ సంవత్సరమే మిస్ బెనెంటు అను ఆంగ్లేయయువతి దేశమం తయు సంచారముచేసి రజస్వలకాకమునుపే బాలికలకు వివాహముచేసెడి ఆచారమును ఖండించుచు యుపన్యాసముల నిచ్చెను. గుంటూరులో కొండా వెంకటప్పయ్యగారు, బెజవాడలో నేను ఆమె కాతిథ్యమిచ్చి యుపన్యాసముల నిప్పించితిమి, ఆమె నా కతిథిగా నాలుగుదినము లున్నది. నాతోపాటు భోజ నముచేసినది.

పోలవరము జమీందారగు కొచ్చెర్లకోట వెంకటకృష్ణారావుబహద్దరు గారు నాకు గొప్పమిత్రులు. వారు కాకినాడలో కాపురముండేవారు. వారు గొప్ప ఆంధ్రభాషాభిమానులు, విద్యాపోషకులు, మంచి కవీశ్వరులు. సుప్ర సిద్ధులైన తిరుపతి వెంకటకవులలో దివాకర్ల తిరుపతికవి శిఖామణులు వారి ఆస్థానకవీశ్వరులుగా నుండిరి. నవీనాంధ్రదేశములో జన్మించిన కవిశేఖరు లలో రసజ్ఞతలో విద్వత్తులో తిరుపతివేంకటకవులను మించినవారు లేరు. పెక్కు శతావధానములు చేసినారు. అనేక కావ్యములను రచించినారు, తిరు పతికవి రసజ్ఞతలో నవీనాంధ్రకవులలో ప్రథమస్థాన మలంకరించినారని చెప్పుదురు. కొచ్చెర్లకోట వెంకటకృష్ణారావుగారు పెక్కుసార్లు జమీందార్ల పక్షమున శాసనసభకు సభ్యులైనారు. కృష్ణాజిల్లాలో జమీందార్లు, మొఖాసా దార్లు ఎక్కువమంది ఓటర్లుగా గలరు.నాకు వారిలో చాలామందితో సంబంధ ముండెను. అందువల్ల వారందరిఓట్లను సంపాదించుటకై వారములకొద్ది

బెజవాడలో ఉయపతిశాస్త్రులవారు మాయింటిలో నా కతిథులుగానుండి ఆ భూఖామందుఓటర్లను నా ఉత్తరములతోకూడ చూచి, ఓట్లు స్థిరపర్చు కొని వచ్చేవారు. తిరుపతికవీశ్వరులవారు నాకు పరమాప్తులైనారు. వీరి మూలముననే వెంకటశాస్త్రులవారిని కొద్దిగా ఎరుగుదును. వా రపుడు బందరు హిందూహైస్కూలులో పండితులుగా నుండిరి. తిరుపతి వెంకట కవులు వైదీకులు. ఆశుకవిత్వములో కొప్పరపు సోదరకవులు ఎక్కువ ప్రవీణత కలిగియుండిరి. వారు గుంటూరుజిల్లా నరసరావుపేట తాలూకా కాపురస్తులగు నియోగులు. వారు విజయవాడ వచ్చినపుడల్లా మా గృహములోనే దిగుచు నా కతిథులుగా నుండిరి. మా బావగారితమ్ముడగు సుందరశివరావుగారు వారి కుమారుడగు వెంకటేశ్వరరావు వివాహము 1907 సంవత్సరమున నందిగామలో చేసినపుడు కొప్పరపు సోదరకవులను ఆశు కవిత్వమునకు పిలిపించిరి. గౌరీకళ్యాణమును, బొబ్బిలికథను ఆశుకవిత్వములో బహు బాగుగా చెప్పిరి. ఆ వివాహమునకు పొన్నూరునుంచి పొన్నూరి రామసుబ్బయ్యగారను సుప్రసిద్ధ ఆంధ్రగాయకశిఖామణినికూడ పిలిపించి వారి మనోహరమైన సంగీతముతో మా అందరి వీనులకు విందుగావించిరి. రామ సుబ్బయ్యగారు నాకు చాల మిత్రులు. వారు వైదికులు. ఆంధ్రదేశము యొక్క దురదృష్టమువలన వారు పిన్నవయస్సునందే మరణించిరి. బెజవాడలో పారుపల్లి రామకృష్ణయ్యగారు గాత్రములో ఫిడేలులో సుప్రసిద్ధవిద్వాంసులు. నాకు పరమమిత్రులు. సుసర్ల గంగాధరశాస్త్రిగారుకూడ వేణుగానములో గొప్ప ప్రవీణులు. వారుకూడ నాకు అత్యంతముఖ్యులుగా నుండిరి. 1915-16 సంవత్సరములలో గుంటూరుజిల్లా అంతయు నియోగ, వైదిక కక్షలతో తగులబడిపోయెను. లాయర్లలో, ఉద్యోగస్థులలో, కరణములలో ప్రారంభమైన కక్షలు పండితులకు, గాయకులకు, విద్వజ్జనులకుకూడ తీవ్రముగా వ్యాపించి ఆంధ్రబ్రాహ్మణులకు మిగుల అప్రతిష్ఠను కలుగచేసినవి. మంగళ్లనుకూడ నియోగిమంగళ్లని, వైదికమంగళ్లని పిలిచినారు. అటులనే చాకళ్లనుకూడ నియోగిచాకళ్లని వైదికచాకళ్లని పిలచినారు. కోటేశ్వరశర్మ మార్కండేయశర్మగారలు నియోగులపక్షమున నీ మంటను ఎగసనచేయు చుండిరి. అటులనే కొందరు వైదికనాయకులు అవతలవైపున నుద్రేకమును

కలుగచేయుచుండిరి. వైదికులు తిరుపతి వెంకటకవుల నూరేగించగా, నియోగులు కొప్పరపు సోదరుల నూరేగించిరి. ఈ కవులను వైదికులు, ఆ కవులను నియోగులు దూషించిరి. నియోగినైన నేను కోటేశ్వరశర్మ, మార్కండేయశర్మగారలు తమ స్వార్థముకొరకు కక్షలులేవదీసినారని ఖండించుచు పత్రికలకు వ్రాసితిని. ఇంతటితోనాగక బెజవాడలో కొంత సొమ్ము వసూలుచేసి తిరుపతివెంకటకవులను రావించి వారికి గొప్పసన్మాన సభను బెజవాడలోని వెంకటేశ్వరరావుటౌనుహాలులో నా అధ్యక్షతక్రింద జరిపినాము. వారికి గొప్ప బహుమానము నిచ్చినాము. పిమ్మట కొలదిరోజులకు కొప్పరపు సోదరకవులను రావించి ఆ టౌనుహాలులోనే నోరి వెంకట నరశింహశాస్త్రిగారి అధ్యక్షతక్రింద సన్మానసభ జరిపి బహూకరించినాము. ఆరోజున వారు బొబ్బిలికథను మిగుల శ్రావ్యముగా చెప్పిరి. కాని విద్వత్తులో గ్రంథరచనలో, కవిత్వములో ప్రథమస్థానము తిరుపతివెంకటకవులదే. ఈవిధముగా నియోగి వైదికతగవులు కృష్ణదాటి ఉత్తరముగా కృష్ణాజిల్లాలో ప్రవేశించకుండా అరికట్టినాము. కృష్ణాజిల్లాలో నెపుడును నియోగి వైదిక తగాదాలు లేవు.

1918 సంవత్సరములో అఖిలాంధ్ర ఆయుర్వేదమహాసభ విజయవాడలో జరిగినది. పండిత గోపాలాచార్యులవా రధ్యక్షతవహించిరి. డాక్టరు లక్ష్మీపతిగా రప్పటికే ఆయుర్వేదవైద్యములో గొప్ప ప్రవీణులైవచ్చి ఆ మహాసభలో ప్రముఖపాత్రను ధరించిరి. అన్నివైపులనుండి ప్రముఖులైన ఆయుర్వేదపండితులు వచ్చిరి. నేనుకూడ దానిలో పాల్గొంటిని. మా విజయవాడ వర్తకులు కన్యకాపరమేశ్వరీసత్రములో భోజనాది వసతు లేర్పాటు చేసిరి. సభ మిగుల జయప్రదముగా ముగిసినది.

# 6 ఆంధ్రోద్యమము

మాతృభాషలో పరిపాలన - ఉత్తమవిద్య - మద్రాసు రాష్ట్రములో ఆంధ్రులస్థితి - తెలంగాణములో ఆంధ్రులస్థితి - ఆంధ్రులపూర్వవైభవము - మద్రాసురాష్ట్రాంధ్రులలో ప్రత్యేకాంధ్రరాష్ట్ర వాంఛ - 1913 లో బాపట్లలో ప్రథమాంధ్రమహాసభ - బెజవాడలో, విశాఖపట్టములో ఆంధ్రమహాసభలు - కాకినాడ ఆంధ్రమహాసభలో ఆంధ్రరాష్ట్ర తీర్మానము - కాశీనాథుని నాగేశ్వరరావు - కొండా వెంకటప్పయ్య - నెల్లూరు మహాసభ - మాంటేగ్యు గారిరాక - ప్రత్యేకాంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీ - కడప మహాసభ - బెజవాడలో ప్రత్యేకాంధ్రమహాసభ - జస్టిస్ పార్టీ బ్రాహ్మణేతర సభ - కాంగ్రెసు బ్రాహ్మణేతరసభ - ఆదిమాంధ్ర మహాసభ - రామమోహన లైబ్రరీలోకి ఆది ఆంధ్రులను రానిచ్చు సమస్య - మాంటేగ్యుగారివద్దకు ఆంధ్రరాయబారములు - గుంటూరు, మహానంది సభలు - పిమ్మట ఆంధ్రమహాసభలు - సైమను కమిషను బహిష్కారము - ఆంధ్రమహాసభలకు విశాలాంధ్రోద్యమమునకు సంబంధము లేదు.

బంగాళారాష్ట్రవిభజనకు వ్యతిరేకముగా చెలరేగిన జాతీయోద్యమములో ఏకభాషమాట్లాడుప్రజల కొకేరాష్ట్రము ప్రత్యేకముగ నుండవలెనను నది ముఖ్యసిద్ధాంతము. దానికి కాంగ్రెసుకూడ సమ్మతించినది. 1911 వ సం॥లో పంచమజార్జి చక్రవర్తిగారు బంగాళారాష్ట్రవిభజనమును రద్దుపరచుచు బంగాళీభాష మాట్లాడు ఏక బంగాళారాష్ట్రమును, హిందీ

భాషమాట్లాడు బీహారురాష్ట్రమును, అస్సామీస్‌భాషమాట్లాడు అస్సామ్ రాష్ట్రమును, మూడు ఏకభాషారాష్ట్రములను నిర్మాణముచేసియున్నారు. అదివరకే 1911 వ సంవత్సరములో గవర్నరుజనరలు హార్డింజిప్రభువు లండనులోని బ్రిటిషుప్రభుత్వమునకు పంపిన నివేదికలో హిందూదేశమును భాషాప్రయుక్తరాష్ట్రములుగా విభజించవలెననియు అట్టి భాషాప్రయుక్తరాష్ట్రముల సమ్మేళనముగానే భారతప్రభుత్వ ముండవలెననియు వ్రాసియున్నాడు. ఈ భాషారాష్ట్రతత్త్వము ఉమ్మడిమదరాసురాష్ట్రములోని ఆంధ్రజిల్లాల ప్రజలలో బాగుగా వ్యాపించినది. రాబోవు స్వరాజ్యములో నిజమైన ప్రజారాజ్యమేర్పడవలెనన్న, ప్రజల మాతృభాషలోనే శాసననిర్మాణము, పరిపాలనా నిర్వహణము, న్యాయవిచారణకార్యక్రమము జరుగుట యావశ్యకమని ఆంధ్రులలో రాజకీయవిజ్ఞానముకలవా రెల్ల రును తలచిరి. అంతేగాక ప్రజల మాతృభాషలోనే విద్య గరపబడవలెననియు ఉత్తమవిద్యను తెనుగులో నేర్పుటకు ప్రత్యేక ఆంధ్రవిశ్వవిద్యాలయము సత్వరముగ స్థాపింపబడవలెననియుకూడ సంకల్పించిరి. ఉమ్మడి మద్రాసురాష్ట్రములో తమిళ, ఆంధ్ర, కర్ణాటక, కేరళభాషలు మాట్లాడు జిల్లాలు కలసి ఏకప్రభుత్వముక్రింద నున్నవి. అందువలన శాసనసభ కార్యక్రమము, ప్రభుత్వనిర్వహణము, న్యాయవిచారణ అంతయు విదేశభాషయైన ఇంగ్లీషులో జరుగుచున్నది. ఈ నాలుగుభాషలప్రతినిధులకు ఒకరిభాష మరియొకరికి తెలియదు. అందరు ఇంగ్లీషు నేర్చుకొనవలెను. విద్యావిధానమంతయు నింగ్లీషులోనే జరుగుచున్నది.

ఇదియునుగాక మద్రాసుశాసనసభలలో ఆంధ్ర, కన్నడ, కేరళ ప్రతినిధులందరును కలసిననుకూడ వారికంటె నెక్కుడుగ తమిళప్రతినిధులున్నారు మద్రాసురాష్ట్రశాసనసభలలోను,ప్రభుత్వములోను, హైకోర్టులోను తమిళులకే ఎక్కువగ పలుకుబడి యున్నది. తమిళులయాజమాన్యముక్రింద నడుచుచున్న మద్రాసుప్రభుత్వములో ఆంధ్రుల వ్యక్తిత్వము, ఆత్మగౌరవము తగ్గిపోయినవి. అది తమిళరాజ్యమే గాని ఆంధ్రులరాజ్యము కాదు. ఆంధ్రులంటే ఉత్తరహిందూస్థానములో నెవరికిని తెలియనిస్థితికి వచ్చితిమి. **"The Forgotten Empire"** "విస్మృత సామ్రాజ్యము" అని విజయనగర

సామ్రాజ్యమునుగూర్చి స్మూయెల్‌గారు వ్రాయవలసివచ్చినది. ఆంధ్రులచరిత్ర గత రెండువందలసంవత్సరములనుండియు మరచిపోబడినది. చెన్నరాష్ట్రములో నున్నవారందరికి మద్రాసీలనే పేరు. మద్రాసీలనగా మద్రాసురాష్ట్రమునకు బయట తమిళులని మాత్రమే తెలియును. మద్రాసునగరములో క్రమముగ తమిళులసంఖ్య చాల హెచ్చి, అది ప్రధాన తమిళనగరమైనది. మద్రాసుప్రభుత్వముక్రింద తమిళులే అన్నిసౌకర్యముల ననుభవించుచుండగా యుద్యోగములలోను, విద్యలోను, సంపదాభివృద్ధిలోను ఆంధ్రులు సర్వవిధముల వెనుకబడియున్నారు. తమిళలాయర్లు, తమిళఇంజనీయరులు ఆంధ్రజిల్లాలనుండి విశేషముగా ధనమును గొనిపోవుచున్నారు. పరిశ్రమలు, విద్యుచ్ఛక్తి తమిళప్రాంతములలో నున్నంతగ ఆంధ్రప్రాంతములో లేవు. తమిళదేశములోని కావేరిమీద తొమ్మిది రోడ్డువంతెనలుండగ, కృష్ణా, గోదావరినదులమీద నొకవంతెనకూడ లేకుండెను. తమిళబస్తీలు అభివృద్ధి చెందినట్లు ఆంధ్రబస్తీలు అభివృద్ధియగుటలేదు.

తమ పూర్వపుస్థితి మిగుల గొప్పదని ఆంధ్రులకు తెలియును. దానిని గూర్చి వారికి గర్వము కలదు. ఇప్పటిస్థితి వారికి దినదినమునకు దుర్భరముగనున్నది. చరిత్ర తెలిసినప్పటినుండియు, ఇరువదిరెండుశతాబ్దముల కాలము వరుసగా శాతవాహన, చాళుక్య, కాకతీయ, విజయనగర, గోల్కొండ చక్రవర్తులక్రింద ఆంధ్రదేశమంతయు నేకఖండముగాను, ఏకపాలనముక్రిందను వుండి మహోజ్వలచరిత్రను గలిగి భరతవర్షముయొక్క సర్వతోముఖమయిన నాగరికతను అంతర్జాతీయప్రతిష్ఠను ఇనుమడింపచేసినది. ఆ కాలమంతటిలోను ఆంధ్రుల శౌర్యప్రతాపములు, పరిపాలనాదక్షత, రాజకీయనైపుణ్యము, విజ్ఞానము, సిరిసంపదలు, కళాకౌశలములు అనన్యసామాన్యముగ వెంపొందెను. ఆంధ్రదేశమునకు ఏడువందలమైళ్లపొడుగు గల సముద్రతీరము గలదు. ఆంధ్రులు అనాదికాలమునుండి యోడలనిర్మాణముచే సముద్రములో దూరదేశములకుకూడ పోయి వర్తక - వ్యాపారములను సాగించినారు. బర్మా, సయాం, కాంబోడియా, ఇండోనీషియాలలో ఆంధ్రులు వలసలను స్థాపించి యచట ఆంధ్రనాగరికతను, శిల్పమును, కళలను విజ్ఞానమును హిందూబౌద్ధధర్మములను నెలకొల్పినారు. క్రీ.శ. 1685వ

సంవత్సరమున గోల్కొండ సుల్తాను భాగ్యనగరమని సార్థకనామముగల హైదరాబాదునగరమును నిర్మించి దానిని విశాలాంధ్రమునకు రాజధానిగ చేసెను. అది నేడు పన్నెండులక్షల జనసంఖ్యగల ఆంధ్రనగరముగ విలసిల్లుచున్నది. 1686 వ సంవత్సరమున విశాలాంధ్రమును మొగలాయిచక్రవర్తి ఔరంగజేబు లోబర్చుకొని ప్రక్కనున్న మహారాష్ట్ర కర్ణాటకజిల్లాలను కూడ విశాలాంధ్రములోచేర్చి దీనిపైన యొక సుబేదారును (రాజప్రతినిధిని) నియమించెను. ఆయన మరణించినపిమ్మట 1722 లో విశాలాంధ్ర (దక్కన్) సుబేదారగు నైజాముల్ముల్కు ఢిల్లీసింహాసనమునుండి స్వతంత్రమును ప్రకటించి 1748 వ సంవత్సరమువరకు నైజాంరాజ్యమును స్వతంత్రరాజుగ పాలించి మరణించెను. అటుపిమ్మట ఆయనవారసులలోను నైజాముకు సామంతప్రభువైన కర్ణాటకనవాబుకుటుంబములోను కలిగిన అంతఃకలహములను సావకాశముగా తీసికొని కుంపిణీ (ఆంగ్లేయులతూర్పు ఇండియాసంఘము) వారు విజృంభించి విశాలాంధ్రమునుండి 1765 లో ఉత్తరసర్కార్లను, 1800వ సంవత్సరమున దత్తమండలములని పిలువబడిన రాయలసీమజిల్లాలను, 1801 వ సంవత్సరమున నెల్లూరు, ఆర్కాటు, చెంగల్పట్టుజిల్లాలను స్వాధీనపర్చుకొని తమ మద్రాసురాష్ట్రములో భాగముగ చేసిరి. ఇటుల మద్రాసురాష్ట్రములో చేర్చబడిన ఆంధ్రులు అరవలకంటె స్వల్పసంఖ్యాకులై అరవలయాజమాన్యముక్రింద పలుకుబడి కోల్పోయిన వారుగను ఆత్మగౌరవశూన్యులుగను నుండిరి. ఇంతేగాక బ్రిటిషుకంపెనీవారు కొంత ఆంధ్రభాగమును మైసూరురాష్ట్రములో చేర్చినందున ఆ కర్ణాటక రాజ్యములో ఆంధ్రులవ్యక్తిత్వము పూర్తిగ నశించినది. ఇటులనే మరికొన్ని ఆంధ్రభాగములైన సిరివంచ, బస్తరు, ఛాందా భాగములను తమ మహారాష్ట్రరాజ్యముక్రింద కలిపినందున అచటకూడ అత్యల్పసంఖ్యాకులైన ఆంధ్రులస్థితి హీనముగ నున్నది.

నైజాంప్రభువునుంచి బ్రిటిషువారు తీసుకొనిన ఆంధ్రభాగములుగాక నైజాంకు వదలిపెట్టబడిన ఆంధ్రదేశమునకు తెలంగాణమని పేరు. హైదరాబాదునగరము తెలంగాణమునం దున్నది. తెలంగాణము ఎనిమిదిజిల్లాలు గలది. దీనికి అయిదు మహారాష్ట్రజిల్లాలు మూడు కర్నాటకజిల్లాలు చేర్చి

నైజాంరాజ్యముగ చేయబడినది. దీనికి హైదరాబాదురాష్ట్రము అనికూడ పేరు. నైజాంరాజ్యములో సగముకన్నఎక్కువ వైశాల్యము తెలంగాణ మైనను, జనసంఖ్యలో సగము తెలంగాణములోనే యున్నను తెలంగాణా ఆంధ్రులస్థితి క్రమముగ క్షీణించి ముఖ్యముగ నిప్పటి నైజాముకాలములో అత్యంతశోచనీయముగ నుండెను.

ఇరువదవశతాబ్దపు మొదటి రెండుదశాబ్దములనాటి తెలంగాణా ఆంధ్రుల దైన్యస్థితినిగూర్చి శ్రీ మాడపాటి హనుమంతరావుపంతులుగారు రచించిన "తెలంగాణా ఆంధ్రోద్యమము" అను గ్రంథముయొక్క మొదటి భాగములో విపులముగ వర్ణింపబడియున్నది. నైజామురాజ్యములో వాక్స్వాతంత్ర్యము, పత్రికాస్వాతంత్ర్యము, సభాస్వాతంత్ర్యము, మానవప్రాథమిక హక్కులు, రాజకీయప్రాతినిధ్యహక్కులు, బొత్తిగా లేకుండెను. ఆంధ్ర, మహారాష్ట్ర, కన్నడభాషలు అణచివేయబడి ఉర్దూభాషలోనే విద్యావిధానము, పరిపాలనాకార్యక్రమము నిర్వహింపబడెను. 1895 వ సంవత్సరమున హైదరాబాదునందు శాసనసభయొకటి స్థాపింపబడెను. కాని దానిలో నలుగురు మాత్రము ఎన్నికైన సభ్యులుగాను, మిగిలినవారందరును ప్రభుత్వ నియమితులుగాను నుండిరి. హనుమంతరావుపంతులుగారు గ్రంథము వ్రాయువరకును ఒక్క ఆంధ్రుడేనియు దానిలో సభ్యుడగుభాగ్యమును పొందలేదు. సాధారణముగ పెద్ద ఉద్యోగములన్నియు మునల్మానులకే యివ్వబడినవి. ఎక్కడనైన హిందువులు అవల్‌తాలూకాదార్లుగను, సుబేదారులుగను, ఇతర పెద్ద యుద్యోగస్థులుగను పనిచేసినను ఆంధ్రుడెవ్వడును అట్టి గౌరవమునకు పాత్రుడు కాలేదు. ఆ యుద్యోగమునకు కాయస్థునిగాని, మహారాష్ట్రునిగాని నియమించిరి. నూరురూపాయలకుమించిన మాసవారీవేతనముగల యుద్యోగముచేసిన తెలుగువారిని వ్రేళ్ళమీద లెక్కించవచ్చును. తెలుగువారు నైజాంరాజ్యమునందు ఏమాత్రమును గొప్పస్థితికి రాలేదు. మరియు హనుమంతరావుపంతులుగారిట్లు వ్రాసియున్నారు. "కొన్నిసంవత్సరములక్రింద హైకోర్టుజడ్జిపదవిని ఆకస్మికముగపొందిన యొక నాయుడుగారిని వదలివేసి తిమేని హైకోర్టుపదవికి వెళ్ళిన తెలుగువాడు లేనేలేడు. తుదకు హైదరాబాదు హైకోర్టులో ప్రముఖులుగ పనిచేయుచున్న న్యాయవాదులలో ఆంధ్రు

డెవడైన నున్నాడా యని సంశయింపవలసియున్నది. ఆంధ్రులస్థితికన్న మహారాష్ట్రులస్థితి మెరుగుగా నున్నది. తెలుగుదేశమున మాధ్యమికపాఠశాలలసంఖ్య 18, మరాత్వాడాజిల్లాలలో నట్టివి 29 ఉన్నవి. హైదరాబాదులోని కళాశాలలయందు నేటివరకును ఎఫ్. ఏ., బి. ఏ. పరీక్షలలో నెగ్గినవారిలో తెలుగువారిసంఖ్య అత్యల్పము. మరాత్వాడా విద్యార్థులసంఖ్య తెలుగువారిసంఖ్యకంటె ఎన్నియోరెట్లు మించియున్నది. ఆ కాలమున హైదరాబాదుపురమున ప్రజాహితకార్యములందు అభిరుచిగలవారందరు మహారాష్ట్రులుగనే యుండిరి. ఉన్నతవిద్యాభూషితులగు పురుషులును, స్త్రీలును వారిలోనే కానవచ్చుచుండిరి. సభలందును, సంస్థలందును వారే ప్రధానముగ నుండిరి. తెలుగు ప్రాథమికపాఠశాలనుకాని, గ్రంథాలయమునుకాని స్థాపింపవలెనన్న ప్రభుత్వముయొక్క అనుమతి కావలెను. అట్టిఅనుమతి వచ్చుట బహుదుర్లభముగ నుండెను. ఎటులనో కష్టపడి ప్రభుత్వానుమతిని సంపాదించి హైదరాబాదులోను, సికిందరాబాదులోను, హనుమకొండలోను గ్రంథాలయములు స్థాపింపబడెను. అయితే 1922 వ సంవత్సరమున జరిగిన యొక సంఘటన ఆ [illegible]ంలను కొంతవరకు మేల్కొల్పినది. 1922 వ సంవత్సరము నవం[illegible] 11, 12 తేదీలలో హైదరాబాదుపట్టణమున నైజామురాష్ట్రసంఘసం[illegible]ర మహాసభ సమావేశమయ్యెను. దానికి విఖ్యాతచరిత్రుడును, మహిళా[illegible] విద్యాలయస్థాపకుడునగు కార్వేపండితుడు అగ్రాసనాధిపత్యము వహించెను. వారి యధ్యక్షోపన్యాసములో చాలభాగము మహారాష్ట్రములోను కొంత ఇంగ్లీషులోను ఉండెను. రెండుదినములు అనేకతీర్మానములు అంగీకరింపబడినవి. వానిపైన జరిగిన ఉపన్యాసములు ఇంగ్లీషులోను, ఉర్దూలోను, మహారాష్ట్రములోను ఉండెను. నగరములోని సుప్రసిద్ధ ఆంధ్రన్యాయవాది శ్రీ అలంపల్లి వేంకటరామారావుగారు ఒక తీర్మానముపైన తెనుగులో నుపన్యసించ నారంభించగా, సభాసదులు - ముఖ్యముగా మహారాష్ట్రులు - విననొల్లక చప్పట్లుచరచి ఉపన్యాసకుడు ప్రసంగమునాపి కూర్చుండునట్లు చేసిరి. తెలంగాణములోని ప్రధాననగరమున, ఆంధ్రులు బహుళసంఖ్యాకులుగానున్న రాజధానీనగరమున, ఆంధ్రభాషలో నుపన్యాసముజరుగుట అసంభవమగుట సభలోనున్న పలువు రాంధ్రులను దుఃఖితులజేసెను. సభా

కార్యములు పూర్తికాకముందే వారు వెడలిపోయిరి. ఆనాటిరాత్రియే ఆంధ్రోద్యమము నారంభించు సంకల్పముతో ఆంధ్రజనసంఘ మనునది స్థాపింపబడెను."

"ఆ ఆంధ్రజనసంఘ స్థాపనము ఇపుడు కీర్తిశేషులైన రేకు మాల రంగారావు హైకోర్టువకీలుగారిభవనమున కొలదిమంది ఆంధ్రుల సమావేశముతో జరిగినది. వారిలో ముఖ్యులు రేకుమాల రంగారావు, ముందుముల నరసింగరావు, బూర్గుల రామకృష్ణారావు, మాడపాటి హనుమంతరావు, పందిటి రామస్వామినాయుడు, ఆదిరాజు వీరభద్రరావు, కొండా వెంకటరంగారెడ్డి, బారిస్టరు ఆర్. రాజగోపాలరెడ్డి, మిట్టా లక్ష్మీనరసయ్యగారలు. త్వరలోనే ఆంధ్రజనసంఘమునందు నూరుగురు సభాసదులు చేరిరి. ఆ కాలముననే రెడ్డివిద్యాలయమొకటి కూడ స్థాపింపబడెను. ఆ విద్యాలయమందిరమున శ్రీ కొండా వెంకటరంగారెడ్డిగారి అధ్యక్షతను మహాసభ జరిగి నియమావళిని అంగీకరించి కార్యనిర్వాహవర్గము ఎన్నుకొనబడినది. అప్పటినుంచియే ఆంధ్రులలో ఐకమత్యమును, చైతన్యమును, విద్యావ్యాపకమును, స్త్రీలవికాసమును కలుగచేయుటకు తెలంగాణా ఆంధ్రోద్యమము ప్రారంభమైనది."

ఇట్టి పరిస్థితులలో ఆంధ్రదేశముండగ మద్రాసురాష్ట్రములోని 11 జిల్లాలలో నివసించుచున్న షుమారు రెండుకోట్లమంది ఆంధ్రులలో ఇరువదవశతాబ్దమున రాజకీయచైతన్యము ప్రవర్ధమానమైనకొలది అరవల యాజమాన్యమునుండి స్వతంత్రమునుపొంది, ప్రత్యేక ఆంధ్రరాష్ట్రమును స్థాపించుకొని సర్వతోముఖమైన అభివృద్ధిని పొందవలెనను వాంఛ దృఢపడినది. అందువలన తాము పూర్వపుటౌన్నత్యమును పొందుటయేగాక నితరరాష్ట్రములలోనున్న తమ సోదరాంధ్రులకుకూడ కొంత సహాయము చేయవచ్చునను నమ్మకముకూడ వారికికలిగెను. ఇతరరాష్ట్రములలోని ఆంధ్రులకు స్వాభావికముగనే మద్రాసురాష్ట్రాంధ్రుల ప్రత్యేకరాష్ట్రసంపాదనాయత్నములపట్ల విశేషమైన సానుభూతి ఏర్పడెను.

(2)

ఆంధ్రులయొక్క వ్యక్తిత్వమును, ఆత్మగౌరవమును పునః ప్రతిష్ఠించుటకును యావదాంధ్రజాతియొక్క, ఆంధ్రభాషయొక్క ఆంధ్రరాష్ట్రసంపాదనకొరకు, ఆంధ్రవిశ్వవిద్యాలయ స్థాపనకొరకు, అభ్యున్నతికొరకు కృషిసలుపుటకును 1913 వ సంవత్సరము వేసవికాలములో గుంటూరుజిల్లాలోని బాపట్లలో ప్రధమాంధ్రమహాసభ జరిగెను. దానికి దేశభక్త కొండా వెంకటప్పయ్యపంతులుగారు ఆహ్వానసంఘాధ్యక్షులుగా నెన్నుకొనబడిరి. అంతకుపూర్వమే గుంటూరులోని న్యాయవాదప్రముఖులగు వింజమూరి భావనాచార్యులుగారిఇంటిలో జొన్నవిత్తుల గురునాథం, ఉన్నవ లక్ష్మీనారాయణ, చల్లా శేషగిరిరావుగారలుమొదలగువారు సమావేశమై తనకుకబురంపినారనిన్ని, ఆంధమహాసభను సమావేశపరచుటయొక్కయు, ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకై కృషిసల్పుటయొక్కయు ఆవశ్యకతనుగూర్చి తనతోచెప్పి, ఆంధ్రరాష్ట్రస్థాపనవిషయమై భారమునుమోయవలసినదని తనను కోరినారనిన్ని కొండా వెంకటప్పయ్యపంతులుగారు తమ స్వీయచరిత్రలో వ్రాసినారు. మిత్రులందరి తోడ్పాటు కలిగినచో తాను అన్నివిషయములలోను సంపూర్ణ కృషి సలుపుటకు సిద్ధముగానున్నానని తాము చెప్పినట్లుకూడా వ్రాసినారు. గుంటూరుజిల్లాలోనే ప్రధమాంధ్రమహాసభ జరుపుటకుకూడ అప్పుడే తీర్మానమైనది. 1913 వ సంవత్సరము మేనెలలో గుంటూరుజిల్లా రాజకీయమహాసభ బాపట్లలో జరుగుటకు అదివరకే ఏర్పాట్లుచేయబడియున్నందున అది జరిగిన మరునాడు ఉదయాన బాపట్లలో ఆంధ్రమహాసభ సమావేశముకూడ జరుపుటయుక్తమనిఎంచబడెను.కొండా వెంకటప్పయ్యపంతులుగారు, గొల్లపూడి సీతారామశాస్త్రిగారు, ఉన్నవ లక్ష్మీనారాయణగారు, యితరమిత్రులు బాపట్లపోయి బాపట్లప్రముఖులతో సంప్రతించి బాపట్లలోనే ప్రధమాంధ్రమహాసభ జరిపించుటకు సన్నాహములన్నిటిలో పూర్తిగా తోడ్పడెదమని వారిచే అంగీకరింపచేసిరి. అపుడు బాపట్ల న్యాయవాదులలో ప్రముఖులుగా నున్న చోంగుడి వెంకటాద్రిగారు సహాయముచేయుటకు పూనుకున్నారు. యువకలాయర్లు వెలగపూడి వెంకటసుబ్బారావుగారును, గొల్లపూడి సీతారామశాస్త్రిగారును ప్రత్యేకముగ దీక్షబూని మహాసభ ఏర్పాట్లన్నియు పెద్దయెత్తున

చేసిరి. ఆంధ్రజిల్లాలలోని ప్రముఖులకందరికిని ప్రత్యేక ఆహ్వానములు పంపబడెను. ఆంధ్రుల సమస్యలన్నిటిని తీర్చుటకు బాపట్లలో ఆంధ్రమహాసభ జరుగబోవుచున్నందున దానికి రావలెనని ఆంధ్రమహాజనులకు విన్నపములు పంపబడెను. ఆంధ్రమహాసభకు మద్రాసులో గొప్ప న్యాయవాదియు, ఆంధ్ర కాంగ్రెస్‌వాదులలో ప్రముఖస్థానమును వహించియున్నవారును నగు బయ్యా నరసింహేశ్వరశర్మగారు అధ్యక్షతవహించిరి. వీరు పిమ్మట 1920 వ సంవత్సరమునుంచి కొన్ని సంవత్సరములు గవర్నరుజనరలుగారి కార్యనిర్వాహకసభ్యులుగ నుండిరి. బాపట్లలో జరిగిన ఆంధ్రమహాసభకు నేనుకూడ హాజరైతిని. న్యాపతి సుబ్బారావు, మోచర్ల రామచంద్రరావు, గుత్తి కేశవపిళ్లె, ముట్నూరి ఆదినారాయణయ్య, వేమవరపు రామదాసు, భోగరాజు పట్టాభిసీతారామయ్య, చిలకమర్తి లక్ష్మీనరసింహం, ముట్నూరి కృష్ణారావు, ఉన్నవ లక్ష్మీనారాయణగార్లు మొదలైన ఆంధ్రనాయకులెల్లరును విచ్చేసిరి. ఆ మహాసభ మిగుల జయప్రదముగ జరిగినది. ఆంధ్రుల యొక్క, ఆంధ్రభాషయొక్క సర్వతోముఖమైన అభివృద్ధికి చేయవలసిన కృషినిగూర్చి తీర్మానములన్నియు మిగుల యుత్సాహముతో నేకగ్రీవముగా చేయబడినవి. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రనిర్మాణమునుగూర్చిన తీర్మానము విషయములో తీవ్రమైన అభిప్రాయభేదములు కలిగినవి. వేమవరపు రామదాసుపంతులుగారు ప్రత్యేక ఆంధ్రరాష్ట్రమేర్పరచవలెనని తీర్మానమును ప్రవేశపెట్టగా మోచర్ల రామచంద్రరావు, గుత్తి కేశవపిళ్లె, ముట్నూరి ఆదినారాయణయ్యగారు మొదలగు పెద్దలు గట్టిగా వ్యతిరేకించిరి. ఆ కారణమువల్ల ప్రత్యేక ఆంధ్రరాష్ట్రనిర్మాణముయొక్క యావశ్యకతనుగూర్చి ఆంధ్రజిల్లాలలో సంచారముచేసి ప్రజాభిప్రాయమును సేకరించి అనుకూలమైన వాతావరణమును సృష్టించుకొన్నపిమ్మటనే ఆంధ్రరాష్ట్రతీర్మానము ఆంధ్రమహాసభలో మరల ప్రవేశపెట్టుట యుక్తమని, న్యాయమని అందరును అంగీకరించినందున వేమవరపు రామదాసుపంతులుగారు తమ ఆంధ్రరాష్ట్రతీర్మానము నుపసంహరించుకొనిరి. కాని ఆంధ్రుల ఐక్యత, ప్రత్యేకవ్యక్తిత్వము ఆ మహాసభలో గొప్ప పునాదులమీద నిర్మాణముగావింపబడినవి. ఆంధ్రులు ఆత్మవిశ్వాసముతో స్వయంకృషితో తమ భావికళ్యాణ

మును సాధించుకొనవలెనని యుత్సాహపూరితమైన, దృఢమైన నిశ్చయము కలిగినది. ఆంధ్రమహాసభ ఆంధ్రులయాశయములను నెరవేర్చు ఏకైక సంస్థగా స్థాపించబడినది. దానికి కొండా వెంకటప్పయ్యపంతులుగారు 'జనరలు శెక్రెటరీ' గా నెన్నుకొనబడి, కార్యభారమంతయు ముఖ్యముగా వారి మీద నుంచబడినది. ఒక బలవత్తరమైన స్థాయీసంఘము ఏర్పడెను. అన్ని ఆంధ్రజిల్లాలలోని ప్రముఖులు దానిలో సభ్యులుగా నెన్నుకొనబడిరి. ఆంధ్రోద్యమమునుగురించి ఆంధ్రజిల్లాలలో బాగుగ ప్రబోధము గావించవలెనని, జిల్లా, తాలూకాసభలు స్థాపించవలెనని తీర్మానించబడెను. మరుసటి సంవత్సరము వేసవికాలములో ద్వితీయ ఆంధ్రమహాసభ కృష్ణాజిల్లాలో విజయవాడలో జరుపుటకు పెద్దిభొట్ల వీరయ్యగారు, నేను ఆహ్వానించితిమి. మా ఆహ్వాన మంగీకరింపబడెను. అప్పటినుంచి ఆంధ్రమహాసభపక్షమున పని చురుకుగా సాగినది. కొండా వెంకటప్పయ్యపంతులుగారు రాయలసీమ జిల్లాలలో సంచారముచేసి ఆంధ్రాభిమానమును పురిగొల్పిరి. ఎక్కడివారము అక్కడ పనిచేయసాగితిమి. ఒక్కొక్కప్పుడు ఇతరజిల్లాలకుకూడ పోయి ఉపన్యాసములనిచ్చివచ్చితిమి. జిల్లాసంఘములు, తాలూకాసంఘములు నిర్మాణముగావింపబడసాగెను.

1914 వ సంవత్సరము మేనెలలో రెండవ ఆంధ్రమహాసభ బెజవాడలో సమావేశమయ్యెను. కృష్ణాజిల్లామొత్తముమీద సన్మానసంఘము నేర్పాటుచేసి దానికి బందరు న్యాయవాదనాయకులైన పురాణం వెంకటప్పయ్యపంతులుగారిని అధ్యక్షులుగా నెన్నుకుంటిమి. న్యాపతి సుబ్బారావుపంతులుగారిని మహాసభకు అధ్యక్షులుగా ఎన్నుకుంటిమి. నన్ను ఆహ్వానసంఘమునకు ప్రధమ కార్యదర్శిగా నియమించిరి. కాని దురదృష్టవశాత్తు నాకు చాల జబ్బుచేసినందున నేను ఔషధసేవ నిమిత్తము ఏప్రిలులోనే మద్రాసువెళ్ళి అక్కడినుంచి ఏప్రిలునెలాఖరున నీలగిరిలోని కూనూరు వెళ్ళితిని. అచట జూన్‌నెలమధ్యభాగమువరకు నివసించి చాలవరకారోగ్యమును కోలుకొని బెజవాడకు వచ్చితిని. అందువలన ద్వితీయ ఆంధ్రమహాసభలో పాల్గొనుభాగ్యము నాకు కలుగలేదు. బెజవాడలో జరిగిన ఆంధ్రమహాసభలకు ఏర్పాట్లన్నియు చాల బాగుగ జరిగినవి. కాని గాలివాన,

తుఫాను వచ్చుటవల్ల పాకలు, పందిళ్లు పడిపోయి ఆ మహాసభకు ఏతెంచిన రెండువేలప్రతినిధులకు, పైగా వచ్చిన వేలకొలదిప్రేక్షకులకు చాల యిబ్బందులు కలిగినవి. బాపట్లమహాసభకంటె చాల ఎక్కువగా బెజవాడ మహాసభకు జనము వచ్చిరి. రాజకీయనాయకులేగాక కందుకూరి వీరేశలింగంపంతులుగారు తిరుపతి వెంకటేశ్వరకవులుకూడ విచ్చేసి సభలో పాల్గొనిరి. కాని చాల యిబ్బందులుపడిరి. ఐనప్పటికిని మా బెజవాడ మిత్రులు ఆ వెంటనే పాకలను, పందిళ్లను రెండవసారి నిర్మించి సభను జయప్రదముగా జరిపించిరి. నే నొక సందేశమును మాత్రము ఆ మహాసభకు పంపితిని. ఆ మహాసభలోకూడ అధ్యక్షులగు న్యాపతి సుబ్బారావు పంతులుగారికి యిష్టములేకపోవుటచేత ప్రత్యేక ఆంధ్రరాష్ట్రతీర్మానము మంజూరుకాలేదని తెలిసినది.

ఆ సంవత్సరములోనే కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు తామువరకు బొంబాయిలో వారపత్రికగా నడుపుచుండిన ఆంధ్రపత్రికను దినపత్రికగా మద్రాసులో స్థాపించిరి. చాలకాలము దానికి చాల నష్టము వచ్చుచుండినను ఆయన తన సొంత అమృతాంజనంవర్తకరాబడిలో నుంచి భరించి కొన్ని సంవత్సరములకు స్వయంపోషకముగ చేయగలిగిరి. ఆంధ్ర వారపత్రికను, భారతి అను సాహిత్య మాసపత్రికను ఆంధ్రగ్రంథమాలను కూడ స్థాపించి ఆంధ్రోద్యమమునకు, గాంధీగారి దేశస్వతంత్రోద్యమమునకు ఆంధ్రభాషాభివృద్ధికి ఎడతెగకుండ యావజ్జీవము అపారమైన సహాయము చేసియున్నారు. ఆ పత్రిక యిప్పటికిని జాతీయపత్రికగా గొప్ప స్థానము వహించియున్నది. కాంగ్రెసునాయకులై అనేకసార్లు కారాగృహమునకు వచ్చినారు. వారు అతి గొప్ప దాతృత్వముగలవారు. ప్రతి మంచికార్యమునకు వారు మిగుల ఔదార్యముతో సహాయముచేయుచుండిరి. మహాత్మాగాంధీగారు వారినిగూర్చి 1929 లో విశ్వదాతయని తమ హరిజనపత్రికలో వ్రాసిరి. వారు సుగుణసంపన్నులు, నిరాడంబరజీవి, దయార్ద్రహృదయులు. వారుకూడ 1914 నుండి ఆంధ్రమహాసభలన్నిటికి వచ్చి పాల్గొనుచుండిరి. వారికి చెన్నపట్టణములో కట్టమంచి రామలింగారెడ్డిగారి అధ్యక్షతక్రింద

జరిగిన ఆంధ్రమహాసభవారు దేశోద్ధారక అను బిరుదమును, ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు కళాప్రపూర్ణ అను బిరుదమును ఒసంగిరి.

మూడవ ఆంధ్రమహాసభ 1915 వ సంవత్సరము వేసంగిలో పానుగల్లురాజా రామారాయణంగారి అధ్యక్షతక్రింద విశాఖపట్టణములో జరిగినది. ఆంధ్రనాయకులందరు విచ్చేసిరి. అచటకూడ అభిప్రాయభేదములు రానివ్వకుండుటకై ఆంధ్రరాష్ట్రతీర్మానము ఆమోదముకావలెనని పట్టుపట్టక విడచి వేసితిమి. అధ్యక్షులైన పానుగల్లురాజాగారు ఆంధ్రరాష్ట్రనిర్మాణమున కనుకూలముగనే యుండిరి.

(౩)

నాలుగవ ఆంధ్రమహాసభ 1916 వ సంవత్సరము వేసంగిలో మోచర్ల రామచంద్రరావుపంతులుగారి అధ్యక్షతక్రింద కాకినాడలో జరిగినది. బులుసు సాంబమూర్తిగారు అప్పటికి లాయరుగా పేరుప్రతిష్ఠలు పొంది ప్రజాహితజీవనములోకివచ్చి బాగా పనిచేయుచున్నారు. హోమ్ రూలు (భారతదేశ స్వపరిపాలన) ఉద్యమములోకూడ ముఖ్యపాత్ర వహించుచున్నారు. కాకినాడ ఆంధ్రమహాసభ ఏర్పాట్లలో ఆయన శ్రద్ధగా పని చేసెను. ఆ మహాసభలో ఎట్టకేలకు ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణతీర్మానము ఏకగ్రీవముగా ఆమోదింపబడి ఆంధ్రవిశ్వవిద్యాలయముకూడ కావలెనని తీర్మానించబడినది. అప్పటినుంచి ప్రతిసంవత్సరము ఆంధ్రజిల్లాలలో నేదో యొకచోట ఆంధ్రమహాసభ జరుగుట, ఆంధ్రరాష్ట్రతీర్మానము ఆంధ్రవిశ్వవిద్యాలయతీర్మానము ఆమోదింపబడుట జరుగుచుండెను.

అదివరకే తమ భావిజీవితమునంతను దేశసేవలో గడపవలెనని నిశ్చయించుకొని 1915 వ సంవత్సరము డిసెంబరు 31 వ తేదీనాడు కొండా వెంకటప్పయ్యగారు తమ ప్లీడరీవృత్తిని శాశ్వతముగా విసర్జించిరి. మహాత్మా గాంధీగారు లాయర్లను స్వతంత్రపోరాటములో పనిచేయుటకై తమవృత్తిని వదలిపెట్టి రావలసినదని కోరకమునుపు అయిదుసంవత్సరములకుముందే కొండా వెంకటప్పయ్యగారు లాయరుగా మంచి ప్రఖ్యాతికలిగి విశేషముగా ద్రవ్యార్జనచేయుచున్నకాలములో తమ న్యాయవాదవృత్తిని శాశ్వతముగ వదలుకొని యఖండత్యాగమును గావించిరి. మరల నెప్పుడును దానిలో

చేరలేదు. సనాతన హిందూధర్మమునమసరించి కొంత వయసువచ్చినపిమ్మట ద్రవ్యసంపాదనచేయు గృహస్థాశ్రమము వదలిపెట్టి వానప్రస్థాశ్రమమును స్వీకరించవలెనని ఆయనఆదర్శము. ఆయన బందరులోనున్నకాలములోనే ఏబదిసంవత్సరములు రాగానే ప్లీడరీవృత్తినివదలి దేశసేవకై కాలమంతయు వినియోగించదలచినాననియు. ఇదియే హిందూధర్మమనియు తనమిత్రులైన చెన్నాప్రగడ భానుమూర్తిగారితో చెప్పగ ఆయనకూడ అటులనే తన ఉద్యోగమును వదులుకొని దేశసేవలోదిగుటకు సమ్మతించినాడనియు, తను తన మాటప్రకారము ప్లీడరీవదులుకొని వారికితెలుపగా వారు బదులువ్రాయక యూరుకొని తనయుద్యోగమును వదులుకొనలేదనియు, వెంకటప్పయ్యగారు స్వీయచరిత్రలో వ్రాసినారు. ఇందువలన యుద్యోగమును వదలుకొనుట యెంతకష్టమైనపనియో తేటతెల్లమగుచున్నది. వెంకటప్పయ్యగారు ప్లీడరీ వృత్తిని విసర్జించునప్పటికి 49 సంవత్సరములుమాత్రమే వయస్సుండెను. అప్పటినుంచి ఆయన అఖండబ్రహ్మచర్యమును నిర్వర్తించి అత్యంత పవిత్రమైనజీవితమును గడుపుచు దేశహితైకకార్యములలో నిమగ్నుడై స్వతంత్ర పోరాటములో నన్నిత్యాగములుచేసి దేశముకొరకు ప్రాణము లర్పించెను. ఆయనకు తరువాత యివ్వబడిన 'దేశభక్త' బిరుదము ఆయన కొక గొప్ప బిరుదు కాదు. ఆయన నిజమైన దేశభక్తులు. ఆయన దేశముకొరకు ప్రాణములర్పించిన మహాధీరులు. ఆధ్యాత్మిక నైతికసంపన్నులు. మాబోటివారి కందరికి ఆదర్శమూర్తి. మహాత్మా గాంధీగారు స్వతంత్రపోరాటమును ప్రారంభించి ఆంధ్రదేశపుపరిస్థితులు తెలుసుకొనగానే దేశభక్త కొండా వెంకటప్పయ్యగారియందు అత్యంతమైన గౌరవమును, ప్రేమను చూపెను. గాంధీగారికి పాండిత్యప్రకర్షకంటె ఆధ్యాత్మిక నైతికసంపదయందు ఎక్కువ గౌరవము. గాంధీగారి యుద్యమమే నైతికయుద్యమము. కాంగ్రెసుసంస్థ కాయన నైతికస్వరూపము నిచ్చెను. మన జాతీయధర్మములో రాజకీయము వేరు, ఆధ్యాత్మికనైతికములు వేరు అనునది లేదు. గాంధీగారిమార్గము ననుసరించి నీతివర్తనులముగా నుండినచో కాంగ్రెసువాదులమైన మనము బాగుపడెదము. కాంగ్రెసు బలపడి ప్రజానురాగమును పొందును. నైతిక మార్గమునకు ఎంతగా దూరమయ్యెదమో అంతగా కాంగ్రెసుసంస్థకే పత

నము కలుగును. అందువల్ల గాంధీగారిదృష్టిలో ఆంధ్రదేశములో మొదటి స్థానము దేశభక్త కొండా వెంకటప్పయ్యగారి కివ్వబడెను. అట్టిస్థానమునకు వారే అర్హులు. 1920 వ సంవత్సరము డిశెంబరులో నాగపూరు కాంగ్రెసు మహాసభలో స్వరాజ్యతీర్మానము, దౌర్జన్యరాహిత్య సహాయనిరాకరణతీర్మానము ఆమోదింపబడి, నూతననియమావళిని కాంగ్రెసుసంస్థ కేర్పాటుచేసి నపుడు ఆంధ్రదేశపక్షమున ప్రథమమున అఖిలభారత కాంగ్రెసువర్కింగు కమిటీలో సభ్యుడుగా కొండా వెంకటప్పయ్యగారు చేర్చుకొనబడినారు. ఆతరువాత 1921 వ సంవత్సరారంభములో నూతననియమావళిప్రకారము ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీ ఎన్నికలు బెజవాడ రామమోహనగ్రంథాలయములో జరిగినపుడు అధ్యక్షుడుగా వెంకటప్పయ్యగారినే ఎన్నుకున్నాము. ఆయన 1928 వరకు వర్కింగుకమిటీసభ్యుడుగా గాంధీగారి గౌరవమన్నన లను పొందుచూ పనిచేసెను. ఆయన 1923 డిశంబరులో కాకినాడ కాంగ్రెసుమహాసభకు ఆహ్వానసంఘాధ్యక్షులు. ఆసంవత్సరమే అఖిలభారత కాంగ్రెసుకమిటీకి అధ్యక్షుడుగకూడ నెన్నుకొనబడి పనిచేసెను. ఆంధ్ర రత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు అఖిలభారతకాంగ్రెసుకమిటీకి ప్రధాన కార్యదర్శిగా నుండెను. అఖిలభారత కాంగ్రెసుమహాసభకార్యస్థాన మా సంవత్సరము బెజవాడలో దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి యాజమాన్యమున నెలకొల్పబడినది. నే నపుడు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీ ప్రధానకార్యదర్శిగా నుంటిని. రాష్ట్రకాంగ్రెసు కార్యస్థానము బెజవాడలో మాయింటిలోనే యుండెను. మిగుల అన్యోన్యముగా ఆంధ్రరత్న గోపాలకృష్ణయ్యగారు, నేను కలసి పనిచేయుచుంటిమి. ఆపిమ్మట అచిరకాలములోనే దేశము యొక్క దురదృష్టమువలన ఆంధ్రరత్న గోపాలకృష్ణయ్యకు క్షయరోగ మేర్పడి 1928 లో చీరాలలో అకాలమృత్యువువాతపడెను. కొండా వెంకటప్పయ్యగారికూతురు, అల్లుడు తీవ్రమైన జబ్బులుపడి, అల్లుడు మరణించి కూతురుకు భార్యకు దీర్ఘమైన జబ్బులుచేయగా వారికి ఉపచారముచేయువా రెవరు లేనందున ఆయన తన ప్రధానధర్మమనియెంచి అఖిలభారతకాంగ్రెసు వర్కింగుకమిటీనుంచి తప్పుకొని వారి కుపచారముచేయుచు వచ్చినారు. అప్పటినుంచి యితర ఆంధ్రప్రముఖులు వర్కింగుకమిటీకి సభ్యులైనారు.

గాని, ఆయన ప్రతి స్వాతంత్ర్యయుద్ధములోను తప్పకుండ ముందుకువచ్చి జైలుకుపోయెను.

1917 సం॥ వేసంగిలో అయిదవ ఆంధ్రమహాసభ నెల్లూరులో జరిగెను. దానికి ఒంగోలు వెంకటరంగయ్యగారు ఆహ్వానసంఘాధ్యక్షులు. కొండా వెంకటప్పయ్యపంతులుగారు ఆ మహాసభకు అధ్యక్షతవహించిరి. ప్రస్తుత సెంట్రలు గవర్నమెంటులో ఆర్థికస్టేటుమంత్రిగానున్న డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారితండ్రి బెజవాడ పట్టాభిరామరెడ్డిగారు ఆంధ్రరాష్ట్ర పక్షమునకు చాల దోహదమిచ్చిరి. ఆయన మంచి జాతీయవాది. ఆ ప్రాంతములలో చాల పలుకుబడిగల నాయకుడు. ఆంధ్రనాయకులెల్లరును మహాసభకు వచ్చిరి. మహాసభలో ఆంధ్రరాష్ట్రనిర్మాణావశ్యకత విషయమై తీవ్రమైన వాదోపవాదములు జరిగెను. శాసనసభాసభ్యులును మితవాద నాయకులు నగు ఆమంచర్ల సుబ్బకృష్ణారావుగారు, మరియొక ప్రముఖ న్యాయవాది మైనపోలు చెంగయ్యగారు ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకు వ్యతిరేకముగా వాదించిరి. మేము కొందరము అనుకూలముగా నుపన్యసించితిమి. తుదకు ఓట్లు పుచ్చుకొనగా మొత్తముమీద ఆంధ్రరాష్ట్రతీర్మానమునకు అనుకూలపక్షీయులే హెచ్చుగానున్నారని సభాధ్యక్షునిచేత ప్రకటించబడెను. విడదీసి లెక్కించవలెనని సభ్యులు కొందరు పట్టుపట్టిరి. ఆప్రకారము అనుకూలురను, ప్రతికూలురను విడదీయగా వ్యతిరేకులకంటె మున్నూరుమంది అనుకూలురే యధికముగా లెక్కకువచ్చిరి. అభినవభీముడని పేరుగాంచిన కోడి రామమూర్తిగారు ఆ సభకు వచ్చి ఆంధ్రరాష్ట్రతీర్మానమును బలపరచిరి. హిందీలోను, తెలుగుభాషలోను కూడ ధారాళముగా ఉపన్యసించిరి. ఆంధ్రవిశ్వవిద్యాలయము కావలెనను తీర్మానముకూడ ఏకగ్రీవముగ ఆమోదించబడినది.

ఆ సంవత్సరమే డిశంబరులో కలకత్తాలో జరిగిన కాంగ్రెసు మహాసభలో అఖిలభారత కాంగ్రెసుకమిటీసభ్యులుగా వెళ్ళిన డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారిప్రతిపాదనమీద లోకమాన్య బాలగంగాధరతిలకుగారి సహాయముచేత మద్రాసురాష్ట్రములోని ఆంధ్రులను విడదీసి ప్రత్యేకాంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీ నేర్పాటుచేయుటకు తీర్మానించిరి. 1918 సం॥

నుంచి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీ ఏర్పడినది. దానికి న్యాపతి సుబ్బారావు పంతులుగారు అధ్యక్షులుగాను, కొండా వెంకటప్పయ్యపంతులుగారు కార్యదర్శిగాను ఎన్నుకొనబడిరి నేనుకూడ రాష్ట్రకాంగ్రెసువర్కింగుకమిటీకిని అఖిలభారత కాంగ్రెసుకమిటీకిని సభ్యునుగా నెన్నుకొనబడితిని. అప్పటి నుంచి ప్రతిసంవత్సరము ఆంధ్రమహాసభలోను, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు రాజకీయమహాసభలోను కూడ ఆంధ్రరాష్ట్రము కావలెనని తీర్మానములు చేయుచుంటిమి. ఆఱవ ఆంధ్రమహాసభ 1918 వ సంవత్సరము వేసంగిలో రాయలసీమలోని కడపపట్టణమందు గొప్పగా జరిగినది. కడపజిల్లా నాయకులు బారిష్టరు అయిన కడప కోటిరెడ్డిగారు మొదటినుంచియు ఆంధ్రరాష్ట్రోద్యమమునకు గొప్ప సహాయకులుగా నుండిరి. ఆ మహాసభకు నెమలి పట్టాభిరామారావుగారు అధ్యక్షతవహించితిరి. ఆంధ్రమహాసభతో పాటు కడపలోనే ప్రథమ ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుమహాసభకూడ జరుపబడెను. ఆ మహాసభకు విశాఖపట్టణవాస్తవ్యులును, శాసనసభ్యులును మితవాదనాయకులునగు భూపతిరాజు వెంకటపతిరాజుగారు అధ్యక్షతవహించిరి. ఈ రెండు మహాసభలలోను ఆంధ్రరాష్ట్రనిర్మాణతీర్మానము యేకగ్రీవముగానే ఆమోదించబడినది. నేనుకూడ ఆ మహాసభలో పాల్గొంటిని. ఆ మహాసభ పూర్తి కాగానే నేను చిత్తూరుకు వచ్చి పార్థసారథిఅయ్యంగారియింట మకాంచేసి అచటి వైశ్యసత్రములో ఆంధ్రోద్యమమునుగురించియు, ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణమునుగురించియు తెనుగులో ఉపన్యసించితిని. 1906 వ సం॥ నుంచి ఆంధ్రదేశములో నెచ్చోట యుపన్యాసమునిచ్చినను తెనుగులోనే మాట్లాడితీరవలెనని దీక్షవహించినవారిలో నే నొకడను. చిత్తూరులోని యీ సభకు అప్పటికే లాయరుగానున్న ఆర్. బి. రామకృష్ణరాజుగారు అధ్యక్షతవహించిరి ఆంధ్రరాష్ట్రము కావలెనని మిగుల యుత్సాహముతో మాట్లాడిరి. చిత్తూరులోని పెద్దలాయరు దొరస్వామిఅయ్యంగారు తుదివరకు ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు వ్యతిరేకముగా నుండిరి. ముఖ్యముగా మద్రాసుకు చిత్తూరు చాలా సమీపముననుండుటవలన ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణమయితే మద్రాసు నుంచి రాజధానిపోయి ఏ బెజవాడలోనో గుంటూరులోనో రాజధాని ఏర్పడునని వారికి భయము. నేను పిమ్మట నెల్లూరులో ఆగి అచట నొక బహిరం

గసభలో ఆంధ్రోద్యమమునుగూర్చియు ఆంధ్రరాష్ట్రమునుగూర్చియు నుపన్యసించితిని. పట్టాభి సీతారామయ్య. ముట్నూరి కృష్ణారావు. వల్లూరి సూర్యనారాయణరావుగారలుకూడ ఆంధ్రరాష్ట్రనిర్మాణముకొరకై రాయలసీమలోని కొన్నిప్రాంతములకుపోయి యుపన్యాసములనిచ్చి వచ్చిరి.

(4)

1917 సం॥ నవంబరునుంచి బ్రిటిషుఇండియామంత్రి మాంటేగ్యూగారు, గవర్నరుజనరలు చెమ్సుఫర్డుగారు కలసి యే రాజకీయసంస్కరణముల నివ్వవలెననువిషయములో విచారణచేయుటకు భారతదేశములోని ముఖ్యపట్టణములను దర్శించబోవుచున్నందున ఆంధ్రులకోర్కెలను మద్రాసులో వారికి నివేదించుటకు ప్రత్యేక ఆంధ్రమహాసభ బెజవాడలో సెప్టెంబరులో జరిగినది. దానికి నేను ఆహ్వానసంఘాధ్యక్షుడను. అయ్యంకి వెంకటరమణయ్యగా రాహ్వానసంఘమునకు ప్రధానకార్యదర్శి. విశాఖపట్టణం కాంగ్రెసునాయకుడగు చింతలపాటి నరసింహరాజుగారిని మహాసభ కధ్యక్షులుగ నెన్నుకొంటిమి. అప్పటికి రాజకీయరంగములో రెండుముఖ్యసమస్యలు కలవు. ఒకటి కాంగ్రెసు - లీగు సంస్కరణములను కోరుట. రెండవది రాబోయే శాసనసభలో మద్రాసురాష్ట్రములోని బ్రాహ్మణేతరులకు సమష్టి నియోజకవర్గములలో ప్రత్యేకముగా కొన్నిస్థానములనిచ్చుట (ప్రత్యేక ప్రాతినిధ్యము) ఈ రెండుసమస్యలుగాక ఆంధ్రుల ప్రధానసమస్య మద్రాసు రాష్ట్రములోని ఆంధ్రజిల్లాలను విడదీసి ప్రత్యేకఆంధ్రరాష్ట్రముగా నిర్మాణముచేయుట. ఆంధ్రరాష్ట్రనిర్మాణమువిషయములో అప్పటికి జాతీయవాదులకు, మితవాదులకు, వివిధమతములవారికి, కులములవారికి, సర్కార్లవారికి, రాయలసీమవారికీ ఏకాభిప్రాయమేర్పడినది. అందరును ఆంధ్రరాష్ట్రము కావలెననువారే. ఎక్కడనైనను కొద్దిమంది వ్యక్తులకు సందేహముగాని, ప్రాతికూల్యముగాని యుండియుండవచ్చును. గావున ఆ మహాసభకు ఆంధ్రదేశములోని బళ్లారిమొదలు గంజాంజిల్లావరకు అన్నిజిల్లాల నుండి ఆంధ్రప్రముఖు లెల్లరును విచ్చేసిరి. అట్టిప్రాతినిధ్యముగల అట్టి ఐకమత్యమును ప్రదర్శించిన మహాసభ మరేదియు లేదు. కాంగ్రెసు

ప్రముఖులే గాక ఏ. పి. పాత్రో, కూర్మా వెంకటరెడ్డినాయుడు, కోవెలమూడి గోపాలకృష్ణయ్య, పానుగల్లురాజా రామారాయణంగారు, చల్లపల్లిరాజా అంకినీడుబహద్దరు, బొల్లిన మునిస్వామినాయుడు మొదలైన బ్రాహ్మణేతర నాయకులు కూడ వచ్చిరి. వాతావరణము బాగున్నది. వర్షపు బాధ లేదు. ఏర్పాట్లు చాల సంతృప్తికరముగా చేసినాము. మహాసభ కిక్కిరిసి ప్రశాంతముగా నున్నది. వేదమంత్ర, ఖురాను, బైబిలు పఠనముతోను, ఆంధ్రమాతకు స్త్రీల మంగళహారతులతోను, వందేమాతరంకీర్తనతోను, రవీంద్రనాధటాగూరుగారు రచించి, దంటు సుబ్బావధానిగారు తెనుగులో కనువదించిన యుత్సాహపూరితమైన "సమయ మిది వచ్చె స్వేచ్ఛా ప్రసాద మునకు, ఏది యిప్పుడు భారతం బేది కలదు, వడివడిగ తోడివారితో నడువ దేల, నీదు జయభేరిరవము వినిపింపు దేవ" అను కీర్తనతోను మహాసభ ప్రారంభమైనది. నా ఆహ్వానసంఘాధ్యక్షోపన్యాసములో కాంగ్రెసు—లీగు సంస్కరణములను, ఆంధ్రరాష్ట్రమును కోరితిని. బ్రాహ్మణేతరు లత్యధిక సంఖ్యాకులు. వారిదే రాజ్యము. వారు కోరుచున్నారు గనుక వారికి ప్రత్యేక ప్రాతినిధ్య మివ్వవలసినదేనని చెప్పితిని. కాని అధ్యక్షోపన్యాసములో మొదటిరెంటిని కావలెనని సమర్థించిన నరసింహరాజుగారు బ్రాహ్మణేతరుల ప్రత్యేకప్రాతినిధ్యమును తీవ్రముగా వ్యతిరేకించిరి. బ్రాహ్మణుడనైన నేను బ్రాహ్మణేతరులకు ప్రత్యేకప్రాతినిధ్య మివ్వవలెనని చెప్పితిని. బ్రాహ్మణేతరుడైన అధ్యక్షులు తమకు ప్రత్యేకప్రాతినిధ్య మక్కరలేదని, అత్యధిక సంఖ్యాకులగు బ్రాహ్మణేతరులు స్వల్పసంఖ్యాకులైన బ్రాహ్మణులను చూచి వెరగంది ప్రత్యేకప్రాతినిధ్యము కోరుట హాస్యాస్పదమని చెప్పిరి. యావత్తు మహాసభ విషయనిర్ణయసభగా చేసితిమి. కొంత చర్చ జరిగిన పిమ్మట మూడువిషయములు ఏకగ్రీవముగా అంగీకరించబడెను. మహాసభలో బ్రాహ్మణేతరులకు ప్రత్యేక ప్రాతినిధ్యమివ్వవలెనను తీర్మానమును డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు ప్రతిపాదించిరి. ఆంధ్రరాష్ట్రతీర్మానమును కొండా వెంకటప్పయ్యగారు ఉపపాదించిరి. కాంగ్రెసు - లీగు సంస్కరణములనువాంఛించుచు తీర్మానమును భూపతిరాజువెంకటపతిరాజుగారుపపాదించగా గుత్తి కేశవపిళ్లైగారు బలపర్చిరి. మూడుతీర్మానములును

ఏకగ్రీవముగా అంగీకరించబడినవి. సభ కోలాహలముగా ముగిసినది. కాని మరునాడు ఆంధ్రమహాసభ స్థాయీసంఘసమావేశము బెజవాడ గవర్నరుపేటలోని మా యింటిలోనే జరిగినది. వారందరు నా కతిథులుగా నుండిరి. అందులో బ్రాహ్మణేతరుల ప్రత్యేకప్రాతినిధ్యమునుగూర్చి మరల చర్చజరిగినది. తుదకు ఆంధ్రరాష్ట్రనిర్మాణము కావలెనని ఇండియానంతను భాషాప్రయుక్తరాష్ట్రములుగా విభజింపవలెనని మాత్రము ఆంధ్రమహాసభ పక్షమున న్యాపతి సుబ్బారావుగారి నాయకత్వముక్రింద నొక రాయబారమును మాంటేగ్యూగారివద్దకు పంపవలెననియు్న్ని, రాజకీయవిషయములన్నీ కాంగ్రెసుసంస్థకే వదలివెయ్యవలెననిన్నీ తీర్మానించి మాంటేగ్యూగారిని దర్శించుట కొక రాయబార యుపసంఘము నెన్నుకొనిరి. మాంటేగ్యూ గారికి సమర్పించవలసిన నివేదికను తయారుచేసి యా రాత్రి యెక్కడివా రక్కడ వెళ్ళిపోయినారు. వారు రాజకీయవిషయములలోచేసిన తీర్మానము సమర్థనీయమే. అప్పటికి ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుకమిటీ ప్రత్యేకముగా లేదు. మద్రాసురాష్ట్రమునకంతకు ఒకే రాష్ట్రకమిటీ, ఒకే హోంరూలులీగు ఉన్నవి. ఆ రెంటిపక్షమున లక్షలమందిచేత కాంగ్రెసు - లీగు సంస్కరణలు కావలెనని దస్కతులుచేయించిన మహజరు లున్నవి. వాటిని అనిబిసెంటమ్మ మొదలగువారు మాంటేగ్యూగారికి సమర్పించి కాంగ్రెసు - లీగు సంస్కరణలను బలపర్చుచు మాట్లాడెదరు. ఆ సందర్భములోనే బ్రాహ్మణేతరులకు ప్రత్యేకప్రాతినిధ్య మివ్వవలెనా యను విషయము చర్చింపబడును. అదికూడ యావత్తు మద్రాసురాష్ట్రమునకు సంబంధించినది. ప్రత్యేక ఆంధ్ర యుపసంఘము చెప్పవలసినది కాదని, ఆంధ్రప్రముఖులు తలచి దానిని తమ విన్నపములో ఎత్తుకొనలేదు. ఆంధ్రయుపసంఘమువారు పిమ్మట మాంటేగ్యూగారిని చెన్నపట్టణములో దర్శించి నివేదికను సమర్పించి చర్చించిరి. మాంటేగ్యూగారు సానుభూతి తెలిపినారు. అందుకు సంబంధించిన రాష్ట్ర శాసనసభలలో అనుకూలతీర్మానములు జరిగినచో నెచటనైనను భాషాప్రయుక్తరాష్ట్రముల నేర్పాటుచేయుటకు ఇండియాప్రభుత్వముయొక్క సిఫారసుపైన ఇండియామంత్రి అట్టియేర్పాటు చేయవచ్చునని తమరిపోర్టులో వ్రాసిరి. ఇదికూడ భాషాప్రయుక్తరాష్ట్రనిర్మాణోద్యమమునకు గొప్ప యానుకూల్యమును కలుగచేసినది.

ఈ మహాసభ ముగిసిన కొలదిరోజులకే అప్పటిగవర్నరుగారి బ్రిటిషు వారైన ఎక్జిక్యూటివ్‌కౌన్సిలర్ల ఆశీర్వచనములతో ఆంధ్రదేశములోని బ్రాహ్మణేతరనాయకులు బ్రాహ్మణేతరపార్టీ (జస్టిసుపార్టీ) లో చేరి, కాంగ్రెసు-లీగు సంస్కరణముల నెదిరించుచు, బ్రాహ్మణేతరులకు శాసనసభలో ప్రత్యేకప్రాతినిధ్యమును, ఉద్యోగములలో గొప్పభాగమును బ్రిటిషుప్రభుత్వ మిచ్చు షరతుతో సంకుచితమైన రాజకీయసంస్కరణములు ప్రస్తుతమునకు చాలునని ప్రకటనచేసినారు. ఈ కక్షియొక్క పత్రికకు 'జస్టిసు' అనుపేరుండుటచే ఈ కక్షిని సామాన్యముగ జస్టిసుపార్టీ అని పిలచుచుంటిమి. దక్షిణహిందూదేశపు జనసంఖ్యలో నూటికి తొంబదిఅయిదుమందిగల బ్రాహ్మణేతరులు కాంగ్రెసుకు ముస్లింలీగుకు, కాంగ్రెసు - లీగు సంస్కరణములకు వ్యతిరేకముగనున్నారు గావున, వాటి నివ్వనక్కరలేదని బ్రిటిషు పత్రికలన్నియు వ్రాయుటయేగాక ఇంగ్లాండులో లండన్ మొదలగు నగరములలో గోడలమీద పెద్దపెద్ద అక్షరములుగల అట్టలను అంటించినారు. ఈ అభివృద్ధినిరోధకయుద్యమమునకు ముఖ్యనాయకులు పిట్టి త్యాగరాయచెట్టి, డాక్టరు నాయరు, సుబ్బరాయలరెడ్డియార్, లక్ష్మణస్వామిమొదలియార్ మొదలగువారు. వారితో ఆంధ్రప్రముఖులగు ఏ. పి.. పాత్రో, పానుగల్లు రాజా రామారాయణంగారు, కూర్మా వెంకటరెడ్డినాయుడు, కోవెలమూడి గోపాలకృష్ణయ్య, బొల్లిని మునిస్వామినాయుడు, బెజవాడ రామచంద్రారెడ్డి, బొబ్బిలి, చల్లపల్లిరాజాలు మొదలగువారు చేరిరి. ప్రత్యేక ఆంధ్రమహాసభ జరిగినరెండువారములకు సెప్టెంబరునెలలో షన్మండలాంధ్ర (సాగరజిల్లాల) బ్రాహ్మణేతరమహాసభ బెజవాడలోనే జరుపుటకు నిశ్చయించిరి. బెజవాడలో ఆహ్వానసంఘ మేర్పడెను. ఆహ్వానసంఘాధ్యక్షులుగా చల్లపల్లిరాజాగారైన యార్లగడ్డ అంకినీడు ప్రసాద బహద్దరుగారు ఎన్నుకొనబడిరి. మహాసభ అధ్యక్షులుగా దక్షిణహిందూదేశ బ్రాహ్మణేతరకక్షియొక్క ప్రధాన నాయకులగు పిట్టి త్యాగరాయచెట్టిగా రెన్నుకొనబడిరి. మహాసభ బెజవాడలోని హిందూనాటకశాలలో జరుపుట కేర్పాట్లుజరిగెను. ఆంధ్రదేశములోని బ్రాహ్మణేతరులంతా కాంగ్రెసుకు వ్యతిరేకులై జస్టిసుపార్టీలోచేరితే కాంగ్రెసుఉద్యమము ఆంధ్రదేశములో సాగకుండా నామమాత్రావశిష్టమై పోవునే, ఆంగ్లేయవిద్యాధికులైన బ్రాహ్మణేతరయువకుల కుద్యోగములు

దొరకుననుఆశతో వారిలో చాలభాగము జస్టిసుపార్టీలో చేరిపోవుదురే; గనుక దీనికి ప్రతిగా ఆంధ్రరైతాంగములో కాంగ్రెసుకనుకూలమైనవారి నందరినీ చేరదీసి బలపర్చి కాంగ్రెసును పటిష్టముచెయ్యవలెనని, వారిచేత కాంగ్రెసు లీగు సంస్కరణలు కావలెనని తీర్మానముచేయించవలెనను దృఢసంకల్పము నాకు కలిగినది. ఇంకొక వారమురోజులలో జస్టిసుపార్టీ మహాసభ జరుగుతుంది. బొత్తిగా వ్యవధిలేదు. ఆ పరిస్థితిలో వందేమాతరం ఉద్యమములోను, హోంరూలుఉద్యమములోను మాతోపాటు పనిచేస్తున్న కొందరురైతునాయకులకు కబురంపినాను. కృష్ణాజిల్లా కవుతరం కాపురస్తులు కానూరు వెంకటచలపతయ్య, కానూరు దామోదరయ్య, బొబ్బా పద్మనాభయ్య, ఆతుకూరు కాపురస్తులగు సుంకర బసవయ్య, ఏలూరుతాలూకా చాటపర్రుకాపురస్తులగు మాగంటి సీతయ్య, గుంటూరుజిల్లా రాయపూడి కాపురస్తులగు మల్లెల శివరామకృష్ణయ్యగార్లు, కోలవెన్ను, కంకిపాడు, నెప్పల్లె, నందిగామ మొదలైనచోట్లనుండి కొందరు రయితులు మొత్తం ముప్పదిమంది రైతునాయకులు బెజవాడవచ్చి మాయింటిలో నాతో సలహా సంప్రదింపులు జరిపినారు. ద్రవ్యలోపముగాని, బెజవాడలో మహాసభ ఏర్పాట్లలోపముగాని ఏమియునుండదు. బహు కొద్దిరోజులవ్యవధిమాత్రమున్నది గాన, ద్రవ్యము తెచ్చినంత తెండి, దానికొరకు కాలహరణం చెయ్యవద్దు, మిగిలినదంతయు నేను చూస్తాను. మహాసభ ఏర్పాట్లన్నియు పూర్తిగా నాకు వదిలివెయ్యండి."వేలాది రైతులను తీసుకొనిరావడంమాత్రమే మీ బాధ్యత" అని చెప్పినాను. "బాగా ప్రకటనలుచెయ్యాలె కరపత్రములు విరివిగా పంచిపెట్టవలె.ఎటుల తమస్వలాభంకోసరం కొద్దిమందిఆంధ్రవిద్యాధికులు దేశాన్ని ఆంగ్లేయులకు శాశ్వతంగా కట్టబెట్టుతున్నారో, దేశద్రోహం చేయుచున్నారో బాగా ప్రజలకు తెలిపి కాంగ్రెసును బలపర్చాలె:" అని నిశ్చయించినాము. జస్టిసుపార్టీవారు బెజవాడలో షన్మండల బ్రాహ్మణేతరసభ జరిపేదినముననే అంతకన్న గొప్పగా బెజవాడలోనే కాంగ్రెసుపక్షావలంబులగు బ్రాహ్మణేతరుల మహాసభ జరుపవలెనని తీర్మానముచేసినాము. ఒక పలుకుబడిగల ఆహ్వానసంఘము నేర్పాటుచేసిరి. నెల్లూరుజిల్లా. పొట్లపూడి కాపురస్తులగు పొణకా పట్టాభిరామారెడ్డిగారిని ఆహ్వానసంఘాధ్యక్షులుగా ఎన్నుకొనిరి. అపుడే క్రొత్తగా ఇంగ్లాండునుంచి బారిస్టరుపరీక్షలో కృతార్థుడై వచ్చిన

త్రిపురనేని రామస్వామిగారిని మహాసభకధ్యక్షునిగా నెన్నుకొనిరి. కాంగ్రెసు పక్షవలంబులగు బ్రాహ్మణేతరులమహాసభకు నేను, నా మిత్రులు బెజవాడలో బ్రహ్మాండమైన యేర్పాట్లు చేసితిమి. నా మిత్రులైన మైలవరం రెండవ రాజాగారిని నేను కోరగానే వారి పెద్ద నాటకశాలను మహాసభ జరుపుటకు మాకిచ్చిరి. భోజనపుఏర్పాట్లన్నీ మాడపాటి వెంకటేశ్వరరావుగారి విశ్రాంతి గృహములో నేర్పాటుచేసితిమి. అక్కడే చాలమంది ప్రతినిధులు బస చేసిరి. రైతునాయకులు బియ్యం వగైరాలు తెచ్చిపడవేసినారు. మిగిలిన దంతా నేను బెజవాడలో వర్తకులవద్ద పోగుచేసి ఖర్చుపెట్టితిని. ఆ ప్రక్కనే యున్న వెంకటేశ్వరరావుగారి టవునుహాలులో అహ్వానసంఘకార్యస్థాన మేర్పాటుచేసితిమి. దానికి ఎదురుగానున్న నా కక్షిదారైన రాజా పార్థసారధి అప్పారావు బహద్దరుగారి పెద్దబంగళాలో వచ్చెడి నాయకులు, చాలమంది ప్రతినిధులు వుండుటకు ఏర్పాట్లుచేసినాము. మంచి (వాలంటీరు దళము) నేర్పాటుచేసితిమి. నే నపుడు మ్యునిసిపలుకౌన్సిలరును. చైర్మన్ దినవహి హనుమంతరావుగారు నాకు స్నేహితులు. మ్యునిసిపాలిటీ అంతయు మా చేతిలోనుండెను. బెజవాడ వర్తకులు, కార్మికులు మాకు సంపూర్ణసాను భూతినిచూపిరి. బస్తీనిండ ప్రతిబజారులోను "కాంగ్రెసుపక్షవలంబులగు బ్రాహ్మణేతరులకు స్వాగతము" "కాంగ్రెసు-లీగుసంస్కరణములు కావలె" "కాంగ్రెసువర్ధిల్లాలె" అని వ్రాయబడినఆర్చీలు (తడికెలు), పతాకములు, తోరణములు కట్టబడెను. బస్తీలోని పెద్దగుర్రపుబండ్లన్నియు మాక్రిందకే వచ్చెను. అనిబిసెంటమ్మగారికిని, యితరమిత్రులకును నేను వ్రాసి కొందరు నాయకులను రప్పించితిని. రంగనాథమొదలియార్, గుత్తి కేశవపిళ్ళె, గద్దె రంగయ్యనాయుడు, శ్రీరాములునాయుడుగారు మొదలగు నాయకులువిచ్చేసిరి. వారినందరిని మా మేడమీదనే దింపితిని. వారు మాయింటిలో నాతోపాటు భోజనముచేసిరి. ఆఉదయముపదిగంటలకల్లా అన్నివైపులనుండి రైళ్ళలో వేలకొలదిరైతులు బెజవాడ వచ్చిదిగిరి. అభినవభీమ కోడి రామమూర్తిగారు తన బృందముతో బెజవాడలో దిగగా జస్టిసుపార్టీవారు ఆయనను తీసుకొని వెళ్లుటకు స్టేషనువద్దకు వచ్చిరి. బిచ్చికభటులతో నేను స్వయముగావెళ్ళి ఆహ్వానించి మా బసలోనే దింపితిని. వారు నన్ను గౌరవించి నాతో వచ్చిరి.

మా యేర్పాట్లుమున్నదర, మా ప్రతినిధులసంఖ్యమున్నదర అవతలపార్టీవారివి దివిటీముందు దీపమువలె నున్నవి. మా అధ్యక్షుని యూరేగింపు నా స్వంత గుర్రపుబగ్గీమీద జరిగెను. నేను వెళ్ళలేదు. అంతా బ్రాహ్మణేతరులే చేసికొనిరి. మా సభజరిగిన మైలవరంహాలు చాలాపెద్దది. షుమారు నాలుగువేలమంది కాంగ్రెసుపక్ష బ్రాహ్మణేతరులతో నిండెను. మా బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు, కార్మికులుకూడ ఈ సభకు వెళ్ళిరి. అవతలివారిసభలో షుమారు 500 మంది ప్రతినిధులుండిరి. వేదఘోష, వందేమాతరం మొదలైనవాటితో కాంగ్రెసు పక్షీయుల మహాసభ ప్రారంభమయ్యెను. దేశాభిమానతరంగము లుప్పొంగెను. రైతునాయకులు, పైనుంచివచ్చిన నాయకు లుద్రేకపూరితమైన యుపన్యాసము లిచ్చిరి. కాంగ్రెసు - లీగు సంస్కరణములే కావలెనని, బ్రాహ్మణేతరులకు ప్రత్యేకప్రాతినిధ్యము కావలెనని, ఆంధ్రరాష్ట్రము కావలెనని మూడుతీర్మానములు ఏకగ్రీవముగా ఆమోదించిరి. అవతలిపైపువారు కాంగ్రెసును బ్రాహ్మణులపార్టీయని ఖండించుచు కాంగ్రెసు - లీగు సంస్కరణములు అక్కరలేదని, బ్రాహ్మణేతరులకు ప్రత్యేకప్రాతినిధ్యము, పెద్దయుద్యోగములు కావలెనని, ప్రస్తుతము కొద్దికొద్ది సంస్కరణములు చాలునని తీర్మానించిరి. ఆ రాత్రికే రెండుమహాసభలు పూర్తియై ఎక్కడివారక్కడ వెళ్ళిపోయిరి. అభినవభీమ కోడి రామమూర్తిగారు బెజవాడలో రెండురోజులుండిరి. కొత్తపేటలోని కార్మికులలాభముకొరకై ఆయనపేర నొక గ్రంథాలయమును స్థాపించితిమి. నేనే అధ్యక్షతవహించితిని. ఆయన దానిని తెరచెను. కొంత ద్రవ్యసహాయము చేసెను. మాంటేగ్యూగారు మద్రాసుకు వచ్చినపుడు ఆంధ్ర బ్రాహ్మణేతరులపక్షమున రెండునివేదికలు వివిధకాలములందు సమర్పించబడెను.

(౭)

1917 సంవత్సరము సెప్టెంబరు ఆఖరువారములో, బ్రాహ్మణేతర మహాసభలు జరిగిన వారమురోజులపిమ్మట, బెజవాడలోనే ఆంధ్రదేశ ఆది ఆంధ్రమహాసభ జరిపితిమి. ప్రథమమునుంచి పంచముల అస్పృశ్యత రూపుమాపవలెనని మతధర్మముగా పెట్టుకొనినవారిలో నేనొకడను. 1906 వ సం॥లో నేను బెజవాడలో లాయరుగాపనిచేయుచున్నప్పటినుంచియు అస్పృ

శ్యతానివారణకొరకు ఉడుతాభక్తిని పనిచేయుచున్నవాడను. మా గృహములో నొక పంచమనౌకరును పెట్టుకొంటిని. నా స్వంతఖర్చుమీద ఒక పంచములపాఠశాలను నడపుచుంటిని. 1914 నుంచి స్థాపించబడి వృద్ధి చెందుతున్న ఆంధ్ర గ్రంథాలయోద్యమ కార్యక్రమములో పంచములకు రాత్రిపాఠశాలలు స్థాపించవలెనని యొక భాగముగా చేర్చితిమి. గ్రంథాలయములను పల్లెటూళ్ళలో స్థాపించిన యువకులు అట్టిపనిచేసి పంచములఅభివృద్ధికి తోడ్పడుచుండిరి. ఆంధ్రదేశములో కేంద్రగ్రంథాలయముగా విలసిల్లుచున్న బెజవాడలోని రామమోహనగ్రంథాలయము యొక్క యాజమాన్యముక్రింద 1914నుండి యొక హరిజన రాత్రిపాఠశాల స్థాపింపబడి పని చేయుచుండెను. 1915 వ సంవత్సరములో నేను నడుపుచున్న పంచముల పాఠశాల వార్షికోత్సవమును శ్రీమాన్ శ్రీనివాసయ్యంగారి అధ్యక్షతను రామమోహన గ్రంథాలయములో జరిపితిమి. చాలాకాలముగా మాతో సంఘసంస్కర్తలుగానుండి అప్పటికి కొద్దికాలమునుంచి పూర్వాచారపరాయణులతో చేరిన పెద్దిభొట్ల వీరయ్యగారు పంచములను రామమోహన గ్రంథాలయములోకి తీసుకొనివచ్చి దానిని మైలపడవేసినందుకు తీవ్రమైన ఆక్షేపణను లేవదీసిరి. రామమోహనగ్రంథాలయపు మేనేజింగుకమిటీలో కొందరు పంచములను గ్రంథాలయములోనికి రానివ్వవలెననువారు, కొందరు రానీయకూడదనువారు కలరు. సూరి నరసింహశాస్త్రి, అయ్యంకి వెంకటరమణయ్య, గోపరాజు బ్రహ్మానందంగారలు నాతోపాటు పంచములను గ్రంథాలయములోనికి రానివ్వవలెననియు, అన్నిచోట్ల నున్న గ్రంథాలయములు అన్నివర్ణములవారికి అన్నిమతములవారికి స్వేచ్ఛగా తెరువబడవలెననియు అభిప్రాయము కలిగియుండిరి. పెద్దిభొట్ల వీరయ్యగారు మొదలయినవారు తెలుపుచున్న ఆక్షేపణలను ఖండించుచు నేను హిందూ, న్యూ యిండియా ఇంగ్లీషు పత్రికలకు, ఆంధ్రపత్రికకు వ్రాసితిని. ఆ మూడుపత్రికలును నన్ను బలపరచుచు సంపాదకీయవ్యాసములను వ్రాసినవి. దానితో అవతలి పక్షమువారిబలము తగ్గిపోయి ప్రజాభిప్రాయము మాపక్షమునకే ఎక్కుడుగా తిరిగెను. పంచములను ఆ గ్రంథాలయములో ప్రవేశపెట్టుటయే ఖాయమైనదో తాము వేరుగా మరియొక గ్రంథాలయమును స్థాపించి దానికి శంక

రాచార్యగ్రంథాలయమని పేరుపెట్టుదుమని పెద్దిభొట్ల వీరయ్యగారును వారికి మద్దత్తుగానున్న కౌతా సూర్యనారాయణరావుగారు మొదలగువారును బెదరించిరి. పంచములను గ్రంథాలయములో చేర్చుకొనకపోయినచో మేమే విడిపోయి వేరుగా రామమోహనగ్రంథాలయమనుపేర నొక గ్రంథాలయమును స్థాపించెదమని మేము బెదరించితిమి. కాని ప్రజాభిప్రాయము మాపక్షమునకే మొగ్గినందున వీరయ్యగారు మొదలగువారు తమ ఆక్షేపణలను వదలుకొనిరి. పంచములప్రవేశమునకు రామమోహనగ్రంథాలయ మేనేజింగుకమిటీవారు ఏకగ్రీవముగా నంగీకరించిరి. శంకరాచార్యగ్రంథాలయమును పెద్దిభొట్ల వీరయ్యగారు స్థాపించలేదు. కాని రామమోహనగ్రంథాలయకార్యనిర్వాహకవర్గమునుండి వారు, మరి యిద్దరు ముగ్గురు రాజీనామా లిచ్చిరి. రామమోహన గ్రంథాలయముక్రింద నడుపబడుచున్న పంచములపాఠశాల వార్షికోత్సవము ఏమ్మట కొలదిరోజులలో రామమోహనగ్రంథాలయములోనే జయప్రదముగ జరుపబడెను.

ఈవిధముగా బెజవాడలో మేము పంచముల అస్పృశ్యతానివారణ కొరకు పనిచేయుచుంటిమి. ఇటులనే గుంటూరులో ఉన్నవ లక్ష్మీనారాయణ, నల్లపాటి హనుమంతరావుగార్లు, రాజమహేంద్రవరములో చిలకమర్తి లక్ష్మీ నరసింహంగారు మొదలైనవారు పనిచేయుచుండిరి. బందరులోని జాతీయ కళాశాలలో పంచములను చేర్చుకొనిరి. కాని మధ్యాంధ్రములో కేవలము పంచముల అస్పృశ్యతానివారణకొరకును, వారి విద్యావిషయిక, ఆర్థిక మొదలైన సర్వతోముఖాభివృద్ధికొరకును, తమ యావజ్జీవితములను అంకితముచేసిన వారు ముగ్గురు గలరు. వారిలో నొకరు గుడివాడకాపురస్థులగు గూడూరి రామచంద్రరావుగారు. ఆయన వైద్యకళాశాలలో ఎమ్. బి. బి. ఎస్. చదువుతూ మూడవతరగతిలో జబ్బుచేసి మానివేసియుండెను. యావజ్జీవబ్రహ్మచారి. బందరుకాపురస్థులగు వేమూరి రాంజీరావుగారు రెండవవారు. ఆయన కూడ బ్రహ్మచారే. మూడవవారు వెల్లంకి కృష్ణమూర్తిగారు. ఆయన వితంతూద్వాహముచేసుకున్న ఆర్యసామాజికుడు. వీరు ముగ్గురు నాకు ముఖ్యస్నేహితులు. అన్నివిషయములలో నేను వారికి తోడ్పడుచుంటిని. వీరుగాక హరిజన నాయకులగు రాయుడు గంగయ్య, చుంద్రు వెంకయ్య, అత్తిలి సూర్యనారా

యణ, నరాలశెట్టి దేవేంద్రుడు, చింతా శేషయ్య, కుసుమ వెంకట్రామయ్య, మంగళగిరి రాఘవదాసు, నూతక్కి వెంకటేశ్వర్లు మొదలగువారు పంచమోద్ధరణసంఘముగ నేర్పడి పంచములలో ఆత్మవిశ్వాసమును, ఆత్మగౌరవమును, స్వయంసహాయమును, ఐకమత్యమును నెలకొల్పుటకును వారిలో త్రాగుడుమాన్పి పరిశుభ్రత వృద్ధిచేసి వారియిబ్బందులనుగూర్చి స్థానికసంస్థలతోను ప్రభుత్వముతోను రాయబారములుజరుపుటకును ప్రయత్నించుచుండిరి. నేను మధ్యాంధ్రములోని కేంద్రమైన బెజవాడలో వుండుటవల్ల నన్ను తరచుగా కలసి నా సలహా సహాయములను పొందుచుండిరి మాయింటికివచ్చి, అక్కడే భోజనముచేయుచుండిరి. నన్నుకూడ పంచములగూడెములకు తీసుకొనిపోయి యుపన్యాసముల నిప్పించుచుండిరి. పంచములలో భాగవతాదిగ్రంథపఠనము, హరికథలు ప్రబలెను. ప్రతిచోట రామాలయములు నెలకొల్పబడెను. హిందూమతమును విడచిపెట్టకుండ ప్రోత్సాహము కలిగెను. ఒకసారి కృష్ణాజిల్లా కపిలేశ్వరపురమువద్ద గూడెములవెంట గూడెములు క్రైస్తవమతమును స్వీకరించబోవుచున్నారని తెలిసి నావద్దకువచ్చి కొంత ద్రవ్యసహాయమునుపొంది ఈ పంచమపెద్దలు అచటికిపోయి బోధించి వారందరు హిందూమతములోనే యుండునట్లు గట్టిచేసి వచ్చిరి.

మాంటేగ్యూగారు మద్రాసువచ్చుచున్నందున వారిని పంచముల ప్రతినిధులు కలసికొని శాసనసభలలో పంచములకు ప్రత్యేకప్రాతినిధ్యము కావలెనని అడుగుటకు, పంచములయిక్కట్టుల నివారణగూర్చి విన్నవించుటకు, ఆంధ్రపంచములసభయొకటి బెజవాడలో చేదామని వీరందరును మాయింటిలోనే సమావేశమై నా సలహామీద నిశ్చయించిరి. గూడూరు రామచంద్రరావుగారుకూడ దానికి హర్షమును తెలిపిరి. బెజవాడలోని వెంకటేశ్వరరావు పంతులుగారి టౌనుహాలులో పంచములప్రతినిధులందరు బసచేయవచ్చునని ఆ ఆవరణలోనే మహాసభ ఏర్పాటుచేయవచ్చునని, దానికి తగినపాకలు, పందిళ్ళు మిగిలిన ఏర్పాట్లన్నీ నేనే చేసిపెడతానని, వచ్చిన పంచమప్రతినిధులందరికి భోజనపుఏర్పాట్లు నేనే చేస్తానని చెప్పితిని. అటులనే పంచములమహాసభ బెజవాడలో జరిగినది. దానికి ఆహ్వానసంఘాధ్యక్షులుగా చుంద్రు వెంకయ్యగా రెన్నుకొనబడిరి. వారి ఆహ్వాన

సంఘాధ్యక్షోపన్యాసమును నేనే వ్రాసియిచ్చితిని. వారందరి అభిప్రాయ ప్రకారము హైదరాబాదులోని సుప్రసిద్ధ ఆదియాంధ్రనాయకులగు భాగ్య రెడ్డివర్మగారిని మహాసభ కధ్యక్షతవహించుటకు తీసుకొని వచ్చితిమి. నా పెద్ద గుర్రపుబగ్గీలో భాగ్యరెడ్డివర్మగారిని, చంద్రుడు వెంకయ్యగారిని కూర్చొనబెట్టి మేమందరము నడచి వందలకొలది పంచమప్రతినిధులు వెంటరాగా బెజవాడపురవీధులలో నూరేగించితిమి. ఆ మహాసభ యేర్పాట్లకు కావలసిన సొమ్మును నేను స్వహస్త పరహస్తములతో వసూలుచేయ గలిగితిని. ఏర్పాట్లన్నీ చాల చక్కగా జరిగెను. ఆర్చీలు తోరణములు కట్టించితిమి. ఆ ఆవరణలోవేయబడిన ఒక పెద్ద పందిరిక్రింద మహాసభ జయప్రదముగా జరిగెనది. ఆంధ్రదేశములోని పంచములను అంతటినుంచి ఆదియాంధ్రులని పిలువవలెనని, ఆదియాంధ్రులనెవరినీ రామిగాడు సుబ్బిగాడు అని నీచమైనవిధముగా పిలువకూడదని, రామయ్య, సుబ్బయ్య అని మాత్రమే పిలువవలెనని, అటులనే సర్కారులెక్కలలో వ్రాయవలెనని తీర్మానించితిమి. ఆదియాంధ్రులకు అస్పృశ్యత పోగొట్టుటకు ప్రభుత్వము వారు, ప్రజలు కృషిసలుపవలెనని, ఆదియాంధ్రుల విద్య, ఆర్థికవిషయము లలో ప్రభుత్వమువారు శ్రద్ధతీసుకొనవలెనని తీర్మానములు చేసితిమి. భాగ్యరెడ్డివర్మగారి యుపన్యాసము గంభీరముగా నుండెను. ఆదియాంధ్రుల యిక్కట్టులనుగురించి వారు వివరించిరి. పిమ్మట రాబోవుశాసనసభలలో ఆదియాంధ్రులకు వారిసంఖ్యనుబట్టి ప్రత్యేకప్రాతినిధ్యము కావలెనని తీర్మా నించబడెను. కాంగ్రెసు-లీగు సంస్కరణములను కోరుచూ తీర్మానము చేయవలెనని నేను ప్రోత్సహించితిని. కాని గూడూరి రామచంద్రరావుగారు ఆదియాంధ్రులను ఏ రాజకీయపార్టీలోను దించుటకు తరుణమురాలేదని చెప్పి ప్రత్యేకప్రాతినిధ్య తీర్మానముమాత్రము ఆమోదించునట్లు చేసినారు. ఆంధ్ర రాష్ట్రము కావలెనని కూడ ఏకగ్రీవంగా తీర్మానించిరి. భాగ్యరెడ్డివర్మ, చంద్రుడు వెంకయ్య, రాయుడు గంగయ్యగార్లు మొదలైన కొందరు నాయ కులను ప్రత్యేక యుపసంఘముగా నేర్పాటుచేసి, వారు వెళ్ళి ఆదియాంధ్రుల కోరికలను మాంటేగ్యుగారికి చెన్నపట్టణములో నివేదించునట్లు నిశ్చయించ బడెను. ఆ రాత్రితో ఆ మహాసభ మిక్కిలి జయప్రదముగా ముగిసినది.

1926 లో చంద్రుప్ప వెంకయ్య, పేమూరి రాంజీరావుగార్లు మద్రాసు శాసన సభలో ప్రభుత్వనియమితసభ్యులై పంచమోద్ధరణకొరకు పనిచేసిరి. నేనుకూడ కాంగ్రెసుపార్టీసభ్యుడుగ వారికి ప్రతివిషయములోను తోడ్పడు చుంటిని.

1918 లో మాంటేగ్యు ఛెమ్సుఫర్డు రిపోర్టువిషయమై చర్చించుటకు గుంటూరులో ప్రత్యేకాంధ్ర కాంగ్రెసుమహాసభ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి అధ్యక్షతను జరిగెను. ఛెమ్సుఫర్డు సంస్కరణములు కొరమాలినవని, ఆశాభంగకరముగ నున్నవని తీర్మానించబడెను. ఆంధ్రరాష్ట్రము వెంటనే కావలెనని, బ్రాహ్మణేతరులకు ప్రత్యేకప్రాతినిధ్య మక్కరలేదని తీర్మానించబడెను. 1919 వ సంవత్సరము వేసంగిలో ఏడవ ఆంధ్రమహాసభ అనంతపురములో గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి అధ్యక్షతను, 1920 వేసంగిలో ఎనిమిదవ ఆంధ్రమహాసభ కర్నూలుజిల్లా మహానందిలో రంగనాధమొదలియారుగారి అధ్యక్షతను జరిగెను. మహానంది ఆంధ్రులపుణ్య క్షేత్రము, నైసర్గిక సౌందర్య మెక్కువగా కలిగిన ప్రదేశము. నేను కుటుంబముతోకూడ నచటికి వెళ్ళితిని. ఈ రెండుమహాసభలలోను తర్జనభర్జనలు జరిగినమీదట ఆంధ్రరాష్ట్రతీర్మానము ఏకగ్రీవముగా ఆమోదించబడెను. మహానందిలో అపుడే ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుమహాసభకూడ జరిగెను. దానికి బారిస్టరు టంగుటూరి ప్రకాశంపంతులుగారు అధ్యక్షతవహించిరి. వారు 1919 ఫిబ్రవరిలో మహాత్మా గాంధీగారు చెన్నపట్టణము పోయి రౌలటుసత్యాగ్రహములో చేరుటకు రమ్మనికోరగా సత్యాగ్రహముచేయుట కొప్పుకొని కాంగ్రెసులోచేరి, తదాది కాంగ్రెసుకు మహానాయకులైనారు. మహానంది రాజకీయసభలో మాంటేగ్యుగారు ఇవ్వదలచిన రాజకీయసంస్కరణములు కొరమాలినవని, అంగీకరింపతగినవి కావని తీర్మానించబడెను, పంజాబులో బ్రిటిషుప్రభుత్వమువారు జరిపిన దురంతములను తీవ్రముగా ఖండించితిమి. ఆంధ్రరాష్ట్రతీర్మాన మేకగ్రీవముగా నంగీకరించితిమి. 1921 వ సంవత్సరమునుంచి మహాత్మాగాంధీగారు కాంగ్రెసుకు నాయకత్వమువహించి దేశవ్యాప్తముగా దౌర్జన్యరాహిత్య సహాయనిరాకరణోద్యమమును ప్రజ్వరిల్ల చేయగా కాంగ్రెసుసంస్థప్రాముఖ్యత భరతవర్షములోనేగాక ప్రపంచమునం

దంతటను హెచ్చినది. ఆ మహోద్యమప్రారంభమునుంచి ఆంధ్రమహాసభ ఆంధ్రగ్రంథాలయోద్యమములు ప్రాముఖ్యమును గోల్పోయినవి. ఆపిమ్మట ఆంధ్రరాష్ట్రసంపాదనబాధ్యత పూర్తిగ ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీమీదనే పడినది. ఆంధ్రమహాసభ స్థాపకులగు దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారుకూడ కాంగ్రెసులోనే నిమగ్నులై ఆంధ్రమహాసభను విడచి పెట్టిరి. ఆంధ్రమహాసభలు వాదాపుగా ఏటేట జరుగుచు ఆంధ్రరాష్ట్రతీర్మానములు చేయుచునేవచ్చినవి. 1924వ సంవత్సరములో మద్రాసులో కట్టమంచి రామలింగారెడ్డిగారి అధ్యక్షతక్రింద జరిగిన ఆంధ్రమహాసభలో కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారికి దేశోద్ధారక అను బిరుద మొసంగబడినది. 1934 సంవత్సరం డిశంబరునెలలో విశాఖపట్టణములో జరిగిన ఆంధ్ర రాజకీయమహాసభకు నేను అధ్యక్షతవహించగ, ఆంధ్రమహాసభకు దేశ పాండ్య సుబ్బారావుగా రధ్యక్షతవహించినారు. 1937 సంవత్సరములో ఆంధ్ర మహాసభయొక్క రజతోత్సవము బెజవాడలో జరిగెను. టి. యన్. రామ కృష్ణారెడ్డిగా రధ్యక్షతవహించిరి 1938 లో మద్రాసులో జరిగిన ఆంధ్రమహా సభకు డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణగా రధ్యక్షతవహించిరి. మద్రాసునగరమే ఆంధ్రరాష్ట్రమునకు రాజధానికావలెనని తీర్మానించబడెను. పిమ్మట కొంత కాలము. విజయనగరరాజకుమారులగు సర్ విజయగారును, మరికొంత కాలము ఉయ్యూరు కుమారరాజా శ్రీ యం. ఆర్. అప్పారావుగారును, పిమ్మట గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారును ఆంధ్రమహాసభకు అధ్యక్షులుగ నుండి నడపిరి.

ఈసందర్భంలో ఒక మాట చెప్పదలచినాను. స్వరాజ్యము వచ్చిన పిమ్మటనైనను నైజామురాష్ట్రము విచ్ఛిన్నమై తెలంగాణము ఆంధ్ర జిల్లాలతో కలిసి యొకే విశాలాంధ్రరాష్ట్రము కావలెననుభావము ఆంధ్రోద్యమములో లేదు. మదరాసురాష్ట్రములోని ఆంధ్రజిల్లాలను మాత్రము విడదీసి ప్రత్యేకాంధ్రరాష్ట్రముగా చేయించుకొనవలెననుకృషియే ఆంధ్రోద్యమము. నైజాము, మైసూరు, తిరువాన్కూరు మొదలగు స్వదేశసంస్థానాధీశులు బ్రిటిషుప్రభుత్వముక్రింద నున్నటులే భారత స్వరాజ్యప్రభుత్వము క్రింద కూడ సామంతులుగ నుండి బాధ్యతాయుతప్రభుత్వమును తాము

ప్రజలకు కలుగచేసి ఇంగ్లండురాజుకు వలె, రాజ్యాంగచట్టమునకు లోబడి పేరుకు మాత్రమే రాజులుగ (Constitutional Monarchs) నుందురనియే నాయకులందరి అభిప్రాయమైయుండెను. ఒక ఏడాదిలో డొమినియనుప్రతిపత్తి కలుగచేయనిచో సంపూర్ణ స్వతంత్రముకొరకే పోరాడెదమని తీర్మానముచేసిన 1928 కలకత్తా కాంగ్రెసులో స్వదేశప్రభువులందరును వెంటనే తమ సంస్థాన ప్రజలకు బాధ్యతాయుత ప్రభుత్వమును ఇవ్వవలెనని కోరుచు ఏకగ్రీవమైన తీర్మానముచేయబడినది. సంస్థానముల విచ్ఛిన్నత మాట లేనేలేదు. తెలంగాణాలో ఆంధ్రోద్యమము వృద్ధిచెందినమాట వాస్తవము, ప్రథమమున ఆంధ్రజనసంఘముగా ప్రారంభమై పిమ్మట తెలంగాణా ఆంధ్రమహాసభగా మారి పన్నెండుసంవత్సరములు మహాసభలు జరిగెను. గాని అవియన్నియు నైజాంప్రభుత్వము యొక్క నిగహాకు, నిర్బంధములకు లోనైయుండెను. రాజకీయములు మాటలాడుటకు వీలులేదు. కేవలము సాంఘిక విద్యావిషయికములుగ నుండవలెను. ప్రతి సభకు ప్రభుత్వానుమతి కావలెను. అనేకసార్లు ప్రభుత్వానుమతి దొరకుట కష్టమయ్యెను. కాలహరణము జరిగెను. ఒకపుడు రెండువేలరూప్యముల ధరావతుకూడ అధికారులు కోరిరి. ఇంతేకాదు, తెలంగాణాఆంధ్రులు ప్రక్కనున్న మద్రాసుఆంధ్రులతో కలసిపోవుటను వాంఛింతురేమోనని అప్పుడప్పుడు అనుమానముతో నైజాముఅధికారులు కనిపెట్టి విచారణచేయుచుండిరి. అట్టిభావములేమియు తమకు లేవనియు, ఘనతవహించిన నైజాముప్రభువుపాలనముక్రిందనే తాము అభివృద్ధిచెందదలచినామనియు తెలంగాణా ఆంధ్రోద్యమనాయకులు హామీలుయిచ్చుచూ వచ్చినారు. పదమూడు ఆంధ్రమహాసభలు తెలంగాణములోని వివిధజిల్లాలలో తెలంగాణాలోని ముఖ్యనాయకుల అధ్యక్షతను అత్యుత్సాహముతో జరిగినవి. వాటితోపాటు మహిళాసభలు, గ్రంథాలయసభలు కూడ జరిగెను. చాల వైజ్ఞానికాభివృద్ధి, సాంఘికాభివృద్ధి కలిగెను. (1) సురవరము ప్రతాపరెడ్డి, (2) బూర్గుల రామకృష్ణారావు, (3) పులిజాల వెంకటరంగారావు, (4) మాడపాటి హనుమంతరావు, (5) కొండా వెంకటరంగారెడ్డి, (6) ముందుముల నరసింగరావు, (7) ముందుముల రామచంద్రరావు,

(8) రావి నారాయణరెడ్డి (9)మాదిరాజు రామకోటేశ్వరరావు (10) కొండా వెంకటరంగారెడ్డి (రెండవసారి) (11) రావి నారాయణరెడ్డి (కమ్యూనిస్టు ఆంధ్రమహాసభ) (12) ముందుముల నరసింగరావు(రెండవసారి) (13)జమలాపురపు కేశవరావుగార్లు వరుసగా ఆ మహాసభలకు అధ్యక్షతవహించిరి. 1942 వ సంవత్సరమున నైజాంప్రభుత్వమువారు కొన్ని రాజకీయసంస్కరణములను ఇవ్వదలచినట్లు ప్రకటించినందున మాదిరాజు రామకోటేశ్వరరావుగారి అధ్యక్షతక్రింద జరిగిన తొమ్మిదవ ఆంధ్రమహాసభలో అవి చాలవనియు, దేశాభివృద్ధికి హానికరముగనున్నవనియు, శాసనసభలు ప్రజాస్వామికసిద్ధాంతములపై ఆధారపడి ప్రాంతీయపద్ధతిమీద ఎన్నికలు జరుపబడవలెననియు, ప్రజాసామాన్యముచే ఎన్నుకొనబడిన శాసనసభ్యులనుంచి మంత్రివర్గము నియమింపబడవలెననియు తీర్మానించినారు. మరల 1945 వ సంవత్సరమున ఖాజీపేటకు సమీపముననున్న మడికొండలోజరిగిన 12 వ ఆంధ్రమహాసభలో నైజాముప్రభువుక్రింద నైజామురాష్ట్రములో బాధ్యతాయుతపరిపాలన నొసంగవలెననియు, ప్రాంతీయప్రాతినిధ్యము, సంయుక్త నియోజకపద్ధతి యుండవలెననియు తీర్మానముచేసి మహాసభాధ్యక్షులగు ముందుముల నరసింగరావుగారు 6-12-1945 వ తేదీన నైజాముప్రభువుయొక్క ప్రధానామాత్యులైన సర్. అక్బరుహైదరీగారిని కలిసి ఆ విషయములను తెలిపిరి. పిమ్మట ఆంధ్రమహాసభ హైదరాబాదుస్టేటుకాంగ్రెసుకు అంతర్భాగమయ్యెను. 1947 వ సంవత్సరములో బ్రిటిషురాష్ట్రములకు స్వరాజ్యము రాగా స్వదేశసంస్థానముల ప్రజలభవితవ్యమునుగూర్చి ఆందోళన జరుగుచున్నకాలములో నైజామురాష్ట్రములోకూడ 1947-48 సంవత్సరములో హైదరాబాదు స్టేటుకాంగ్రెసుయొక్క నాయకత్వమున జరిగిన ప్రజాస్వాతంత్ర్యపోరాట జయముయొక్క ఫలితముగా మాత్రమే నైజాంప్రభువును తీసివేసి, నైజాంరాజ్యము విచ్ఛిన్నముచేసి తెలంగాణమును ఆంధ్రలోచేర్చి, విశాలాంధ్రరాష్ట్రమును, అటులే ఐక్యమహారాష్ట్ర సంయుక్తకర్నాటకరాష్ట్రములను స్థాపింపవలెనను ఆశయము కలిగినది. దానినిగూర్చి రెండవసంపుటములో వివరముగ తెలిపెదను.

# 7 ఆంధ్రోద్యమము - ఆంధ్రవిశ్వవిద్యాలయము

శాసనసభాతీర్మానములు – థారుకమిషన్ – జె.వి.పి. రిపోర్టు – అమరజీవి పొట్టి శ్రీరాములుగారి ఆత్మార్పణఃఫలితముగ ఆంధ్రరాష్ట్రస్థాపనము – గవర్నరుపాలనము – 1955 ఎన్నికలలో చరిత్రాత్మకపోరాటము – కాంగ్రెసు కఖండవిజయము – ఆంధ్రవిశ్వవిద్యాలయము.

## (1)

మద్రాసు శాసనసభలో ఆంధ్రరాష్ట్రము కావలెనని కొన్నిసార్లు తీర్మానములుచేసితిమి. నేను 1926 మొదలు 1929 వరకు మదరాసుశాసనసభలో కాంగ్రెసుపక్షసభ్యుడుగ నున్నకాలములో 1927 లో కాంగ్రెసుపక్షసభ్యులమైన నేను, పిల్లలమర్రి ఆంజనేయులుగారు ఆంధ్రరాష్ట్రము కావలెనని తీర్మానములు పంపగా మొదట ఆయనపేరున వచ్చినది. ఆయన ఆ తీర్మానమును ఉపపాదించగ నేను బలపర్చితిని. రాజా పానుగల్లు రామారాయణంగారు ఇతర జస్టిసుమంత్రులు తటస్థులుగా నున్నారు. వాదోపవాదములుజరిగి అధికసంఖ్యాకులచే తీర్మానము ఆమోదించబడి 1928 సం॥ లో మరల ఆంధ్రరాష్ట్రము కావలెనని ఆదాయవ్యయపట్టికచర్చలో కోతతీర్మానము నిచ్చితిని. నేను దానిని ఉపపాదించగ పిల్లలమర్రి ఆంజనేయులుగారు బలపర్చిరి. మరల నధికసంఖ్యాకులచే తీర్మానము అంగీకరింపబడినది. 1923 మొదలు 1926 వరకు మదరాసురాష్ట్రములో జస్టిసుపార్టీ ముఖ్యమంత్రిగనున్న పానుగల్లురాజా రామారాయణంగారు గొప్ప ఆంధ్రరాష్ట్రాభిమానిగ నుండెను. ఆయన ప్రత్యేకరాష్ట్రము కావలెననికోరుచు మద్రాసు నగరమును రెండుభాగములుగచేసి కూవమునది కుత్తరభాగమును ఆంధ్రరాష్ట్రమునకు రాజధానిగను, దక్షిణభాగమును తమిళరాష్ట్రమునకు రాజధానిగను ఏర్పాటుచేయవలెనని రిపోర్టువ్రాసినట్లు తెలిసినది. మదరాసులోనియుత్తరభాగము ఆంధ్రరాజధాని కాకుండినచో బెజవాడయే రాజధాని కావలె

నని ఆయన దృఢాభిప్రాయము. 1928 లో భారతదేశమునకు ఇవ్వవల సిన రాజకీయసంస్కరణములనుగూర్చి విచారణచేయుటకు ఇంగ్లాండు నుంచి సైమనుకమిషనువారు హిందూదేశములో సంచారముచేయగా దానిని కాంగ్రెసువారు, మితవాదులు బహిష్కరించిరి. జస్టిసుపార్టీవారుమాత్రము దానితో సహకరించి సాక్ష్యమిచ్చిరి. జస్టిసుపార్టీవారి కపుడు బలములేదని 1926 వ సంవత్సరపు శాసనసభ ఎన్నికవల్లనే రుజువైనది. ఆంధ్ర కాంగ్రెసువాదులము, పెద్దలగు మోచర్ల రామచంద్రరావుగారివంటి ఆంధ్ర మితవాదులు (లిబరల్సు) కూడ దానిని బహిష్కరించి, దానియెదుట సాక్ష్య మివ్వనందున, ఓఢ్రభాష మాటలాడు ఒరిస్సారాష్ట్రమును, పుష్తూభాషమాట లాడు పశ్చిమోత్తరపరగణాలరాష్ట్రమును, సింధీభాషమాటలాడు సింధు రాష్ట్రమును - మూడు భాషాప్రయుక్తరాష్ట్రములను ఇవ్వవలెనని సిఫారసు చేసి ఆంధ్రరాష్ట్ర మివ్వవలెనని సిఫారసుచేయలేదు. ఆంధ్రులు ముందుగ దేశస్వతంత్రమునకు ప్రాధాన్యమిచ్చి అందుకొరకు కఠండత్యాగములు చేసిరి. అందువలన సైమనుకమీషనునివేదిక ఫలితముగ తయారుచేయబడిన "1935 సం॥ గవర్నమెంటు ఆఫ్ ఇండియా" చట్టముక్రింద పైనపేర్కొన బడిన మూడు భాషారాష్ట్రముల నేర్పరచిరి. మొదటిది ఒరియాజమీందారు లకును, తక్కినరెండు మునల్మానులకును ఇచ్చిరి. కొంతకాలము గవర్నరు జనరలు ఎక్జిక్యూటివ్‌కౌన్సిలుసభ్యులుగానున్న ఈడుపుగంటి రాఘవేంద్రరావు గారు మదరాసుకు వచ్చినపుడు చెప్పినటుల జాతీయవాదులైన ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్రమిచ్చుటకు బ్రిటిషుప్రభుత్వము సంకోచించెను. ఆంధ్రరాష్ట్ర స్థాపనమును బ్రిటిషువారు వెనుకకునెట్టిరి. పైగా 1936 వ సంవత్సరములో నూతనముగ నేర్పడిన ఒరిస్సారాష్ట్రములో మద్రాసురాష్ట్రములోని ఆంధ్ర ప్రాంతములగు గంజాంజిల్లాను విశాఖపట్టణముజిల్లాలోని కొన్నిభాగములు చేర్చి ఆంధ్రుల కన్యాయముచేసిరి. ఆ అక్రమము నేటికిని ఆంధ్రప్రదేశ్‌రాష్ట్ర మేర్పడినపిమ్మటకూడ చక్కబడలేదు. ఆంధ్రుల కింతవరకును న్యాయము చేకూరలేదు.

1931 వ సంవత్సరములో మహాత్మా గాంధీగారు రెండవ రౌండు టేబులుకాన్ఫరెన్సుకు లండనుకు వెళ్ళుచుండిరి. అందరము బొంబాయిలో

అఖిలభారత కాంగ్రెసుకమిటీలో కలసి వారిని ఏకైకప్రతినిధిగా ఎన్నుకొని పీడ్కోలునిచ్చితిమి. వారివద్ద సెలవుపుచ్చుకొనుటకు డాక్టరు పట్టాభి సీతా రామయ్యగారు, నేను వెళ్ళితిమి. అపుడు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీపక్ష మున ప్రధాన కార్యదర్శిగ ఆంధ్రరాష్ట్రము కావలెనని పాతచరిత్రతో, అంకెలతో, హేతువులతో యొక నివేదికను వ్రాసి వారికి సమర్పించితిని. దానిలో ఇండియామంత్రితో చెప్పి ఆంధ్రరాష్ట్రము తీసుకొనిరావలెనని కోరితిని. వారు దానిని స్వీకరించి నవ్వుచు, తాను స్వరాజ్యము తేగలిగితేకదా, ఆంధ్ర రాష్ట్రము తెచ్చేది. స్వరాజ్యము తెచ్చితే ఆంధ్రరాష్ట్రము తప్పకుండ ఇవ్వ గలనని చెప్పిరి. వారు ఓడలో ప్రయాణముచేయుచుండగనే బ్రిటిషుప్రభుత్వ ములో లేబరుప్రభుత్వముపోయి ధనికవర్గపార్టీయాజమాన్యమున జాతీయ ప్రభుత్వ మేర్పడినది. ఇండియాలో రాజప్రతినిధి ఇర్విన్ పోయి వెల్లింగ్డన్ వచ్చినాడు. గాంధీగారి లండనుప్రయాణము విఫలమైనది. స్వరాజ్యము రాలేదు. ఆంధ్రరాష్ట్రము తేలేదు. వారు బొంబాయికి తిరిగిరాగానే అఖండ మైన స్వాగతమిచ్చితిమి, ఆ స్వాగతములో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుపక్షమున నేను ప్రతినిధిగ పాల్గొంటిని. ఆ వెంటనే 1932 వ సంవత్సరపు సత్యాగ్రహ పోరాటము సాగించితిమి. 1934 డిశంబరులో విశాఖపట్టణములో జరిగిన ఆంధ్రరాష్ట్ర రాజకీయమహాసభకు నే నధ్యక్షతవహించితిని. నా అధ్యక్షోప న్యాసములో ఆంధ్రరాష్ట్రస్థాపన కావలెనని సుదీర్ఘముగ వ్రాసితిని. అప్పటికి పార్లమెంటుయెదుట చర్చలోనున్న గవర్నమెంటు ఆఫ్ ఇండియా చిత్తుచట్ట మునుగూర్చి విపులముగ చర్చించి సంస్కరణములలో రాష్ట్రీయ స్వపరి పాలనము పూర్తిగ నివ్వబడగనే రాష్ట్రములలో కాంగ్రెసువారు మంత్రి వర్గములను పుచ్చుకోవలసినదని వ్రాసినాను. అంతవరకు ఏరాష్ట్రములోను మంత్రివర్గమును స్వీకరించవలెనని యెవరును చెప్పియుండనందునను ఆంధ్రులమే ముందు చెప్పుచున్నందునను, ప్రకాశంగారునా అధ్యక్షోపన్యాస మును ముందుగా చదివి నేను వ్రాసినవై ఖరి, హేతువులు బాగానేయున్నవని చెప్పినమీదటనే నేను దానిని మహాసభలో చదివితిని. వి. వి. గిరిగారు కూడ దానికి తమహర్షమును వెలిబుచ్చిరి. ఆ సంస్కరణముల ప్రకారమే

1937 సంవత్సరములో కాంగ్రెసువారు తొమ్మిదిరాష్ట్రములలో జరిగిన ఎన్నికలలో అధికసంఖ్యాకులుగ వచ్చి మంత్రివర్గములను స్వీకరించిరి.

గవర్నమెంట్ ఆఫ్ ఇండియా చట్టప్రకారము 1937 వ సంవత్సరములో శాసనసభలకు జరిగిన ఎన్నికలలో మద్రాసురాష్ట్రములోకూడ కాంగ్రెసుకు అఖండవిజయము కలిగెను. శ్రీమాన్ సి. రాజగోపాలాచారిగారు ప్రధానమంత్రిగా కాంగ్రెసుప్రభుత్వ మేర్పడెను. టంగుటూరి ప్రకాశం పంతులుగారు రెవెన్యూమంత్రిగను, బెజవాడ గోపాలరెడ్డిగారు స్థానికస్వపరిపాలనామంత్రిగను వుండిరి. నేను గవర్నమెంటుకు ప్రధానపార్లమెంటరీ కార్యదర్శిగను, కాంగ్రెసు శాసనసభాపార్టీకి ప్రధానవిప్పుగను ఉంటిని. 1938 సంవత్సరములో ఆంధ్రరాష్ట్రము కావలెనను తీర్మానమును కాంగ్రెసు శాసనసభాపార్టీలోపెట్టి మంజూరుచేయించి ఆ పిమ్మట శాసనసభలో ప్రవేశపెట్టి అంగీకరింపచేయవలెనని యొక అర్జీమీద ఆంధ్రకాంగ్రెసు శాసనసభ్యులలో చాలమందిచేత కాంగ్రెసుపార్టీ ఎసెంబ్లీ సభ్యులుగానున్న కళా వెంకటరావుగారు దస్కతులు చేయించి ఆ అర్జీని ఛీఫ్‌విప్పుగానున్న నా చేతి కిచ్చిరి. దానిని నేను మాపార్టీ నాయకులైన రాజగోపాలాచారిగారికి చూపితిని. రాష్ట్రస్వపరిపాలన మేర్పడగనే మొదటి శాసనసభలోనే ఈ తీర్మానముతెచ్చుట బాగాలేదే అని వా రన్నారు. "ఇపుడు దీనిని ఆమోదింపచేసి రాజప్రతినిధిద్వారా ఇండియా స్టేటుమంత్రికి వ్రాసి ఆయన అనుమతిపొందేవరకు కొన్నిసంవత్సరములు పట్టుతుంది. ఇప్పటినుంచి దీనికొరకు పనిచేస్తే వచ్చేఎన్నికలలోపుగ ఆంధ్రరాష్ట్రమువచ్చుట కవకాశముంటుంది. అంతేగాక ఆంధ్రసభ్యులందరు కోరుచుండగ మనము దీనిని పార్టీలోపెట్టక తిరస్కరించుట భావ్యముకాదని వారికి నేను సలహానిచ్చితిని. అందుమీద దానిని శాసనసభపార్టీలో పెట్టుటకు వారు నా కనుమతినివ్వగ నేను దానిని పార్టీవారు విచారించుట కొక తేదీని నిర్ణయించి పార్టీలో చర్చకు పెట్టితిని. దేశభక్త కొండా వెంకటప్పయ్యపంతులుగారు కూడ నపుడు శాసనసభ్యులుగనుండి మాపార్టీకి ప్రధానకార్యదర్శిగనుండిరి. ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు అధ్యక్షులుగ డాక్టరు పట్టాభిసీతారామయ్యగారుకూడ మాపార్టీలో సభ్యులుగనుండిరి. ఆ తీర్మానము చర్చకువచ్చేసరికి రాజగోపాలాచార్యులుగారు కేవ

లము ఆంధ్రరాష్ట్రము కావలెనని కోరుటకుమారుగ, మద్రాసురాష్ట్రమును ఆంధ్ర, తమిళ, కేరళ, కర్ణాటక రాష్ట్రములుగ విభజించవలెనని తీర్మానమును సవరణచేయుట మంచిదని చెప్పిరి. నేను కొండా వెంకటప్పయ్యగారిని డాక్టరు పట్టాభిసీతారామయ్యగారిని సంప్రదించగ వారిద్దరీ మార్పుకు సమ్మతించిరి. ఈ సవరించబడినతీర్మానమును కాంగ్రెసుశాసనసభాపార్టీలోపెట్టగ బళ్ళారిసభ్యులగు డాక్టరు లక్ష్మీదేవి హాలహర్వి సీతారామరెడ్డి, భీమారావు గార్లు అధిక్షేపించిరి. రాజగోపాలాచార్యులుగారు వారందరిని బ్రతిమిలాడి యొప్పించి తీర్మానమును ఏకగ్రీవముగ ఆమోదింపచేయించెను. అరవలు ఆంధ్రులు పరస్పరము దూషణలుచేసికొనకుండ సరసముగా మాటలాడు సభ్యులనే యుపన్యాసకులుగ వేయవలెనని ఆయన నాతో చెప్పగా నేను జాగ్రత్తగా నుపన్యాసకుల నేరి మాటలాడించితిని, ఎస్సెంబ్లీలో కొండా వెంకటప్పయ్యగారు తీర్మానమును ఉపపాదించగ కడప కోటిరెడ్డిగారు బలపర్చిరి. కౌన్సిలులో కాశీనాధుని పూర్ణమల్లికార్జునుడుగా •రుపపాదించగా వరహగిరి జోగయ్యగారు బలపర్చిరి. రాజగోపాలాచార్యులుగారు తీర్మానమును బలపర్చుచు గంభీరమైన యుపన్యాసమునిచ్చిరి. తీర్మానము ఏకగ్రీవముగ ఎసెంబ్లీలోను, కౌన్సిలులోను ఆమోదింపబడెను. ఇది నిజముగా చరిత్రాత్మకఘట్టము. ఈ తీర్మానమును మంత్రివర్గసమావేశములో పెట్టి శ్రీ రాజగోపాలాచారి ఏకగ్రీవముగా ఆమోదింపచేయించెను. కాని అంతకుముందే మదరాసునగరమున డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణగారి అధ్యక్షతను జరిగిన ఆంధ్రమహాసభలో ఆంధ్రరాష్ట్రమునకు మదరాసునగరమే రాజధానిగనుండవలెనని తీర్మానింపబడియుండెను. ఆ సభకు హైకోర్టుజడ్జి ముత్తా సుబ్బారావుగారు ప్రారంభోత్సవము జరిపిరి. రాజగోపాలాచారిగారికి మద్రాసునగరము ఆంధ్రులకు పూర్తిగగాని, సమిష్టిగగాని రాజధానిగ నుండుట బొత్తుగా ఇష్టములేకుండెను. మదరాసుయావత్తు పూర్తిగ తమిళుల రాజధానిగ నుండితీరవలెనన్నదే ఆయన దృఢమైన అభిలాష. మదరాసు వదులుకొని ఏ బెజవాడలోనో రాజధానిని పెట్టుకునేయెడల తాను వెంటనే గట్టిగావ్రాసి ఆంధ్రరాష్ట్రమును తెప్పించెదనని నాతో చెప్పుచుండెను. కాని ప్రకాశం, సాంబమూర్తి మొదలగువారు మద్రాసునగరమును ఆంధ్రరాజధా

నిగ చేయవలెనని బహుపట్టుదలతోనుండిరి. నాకు, పట్టాభి సీతారామయ్య, కొండా వెంకటప్పయ్య, కాశీనాథుని నాగేశ్వరరావుగార్లకు మదరాసే రాజధాని కావలెనని పట్టుపలలేదు. ఏదోవిధముగ ఆంధ్రరాష్ట్రము వెంటనే వచ్చుటయే మాకు ప్రధానాశయముగ నుండెను. కాని అప్పటి ఆంధ్రప్రజాభిప్రాయముకూడ మదరాసునగరము ఆంధ్రులకు వచ్చితీరవలెననియే యుండెను. ఆకాలమున ఆంధ్రులకు హైదరాబాదు నగరము రాజధాని కాగలదను తలంపేలేదు. మద్రాసును ఆంధ్రులకు, తమిళులకు సమిష్టిరాజధానిగ చేయవలెనని మదరాసు మంత్రివర్గమువారు ప్రకాశంగారి యుపపాదనమీద ఏకగ్రీవముగ తీర్మానించగా, భాషాప్రయుక్తరాష్ట్ర తీర్మానమును మదరాసు సమిష్టిరాజధానిగ నుండవలెనను మంత్రివర్గపు అభిప్రాయమును జోడించి మదరాసుప్రభుత్వమువారు ఇండియామంత్రిగారికి పంపిరి. అప్పటికే ప్రపంచ ద్వితీయసంగ్రామ మేఘములు కమ్ముకొనుచున్నందున ఆంధ్రరాష్ట్రనిర్మాణమునుగూర్చి యోచించుటకు సమయములేదని ఇండియా మంత్రినుండి మదరాసుప్రభుత్వమునకు జాబువచ్చినది. రెండవ ప్రపంచ యుద్ధము ప్రారంభముకాగానే మద్రాసుమంత్రివర్గమువారము 1939 అక్టోబరు నెలలో రాజీనామా నిచ్చితిమి. ఆంధ్రరాష్ట్రమునేగాక తమిళ, కర్నాటక, కేరళరాష్ట్రములను కోరుచు గావింపబడిన తీర్మానము నంత గొప్ప యుపన్యాసముతో బలపర్చిన రాజగోపాలాచార్యులుగారు పిమ్మట 1954 సంవత్సర ప్రారంభమున హైదరాబాదులో జరిగిన కాంగ్రెసుమహాసభలో భాషాప్రయుక్తరాష్ట్రములను కోరుట **'Tribal idea'** అనగ అనాగరిక జాతులవారి కోరికయని చెప్పుట అందరికిని ఆశ్చర్యము కలుగ చేసినది. గొప్పనాయకులు ఎట్లు మారినను ప్రజలు వారితోపాటే మారుచుందురని యనుకొనుట గొప్పపొరబాటు. రాజగోపాలాచార్యులుగారీ పొరపాటునే హిందీవిషయములోకూడ చేయుచున్నారు.

1940 సంవత్సరములో విశాఖపట్టణమునకు మేమందరము ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీ సమావేశమునకు వెళ్ళినపుడు అచట జరిగిన బహిరంగసభలో టంగుటూరు ప్రకాశంగారు మదరాసు ఆంధ్రులకు తమిళులకు సమిష్టిరాజధానిగ నున్నచో ఉభయులము కలహించుకొని, మదరాసుబజారు

అలో రక్తప్రవాహములు జరుగునని మదరాసుగవర్నరు ఇండియామంత్రికి వ్రాసినటులను. అందువలన ఆంధ్రరాష్ట్ర మివ్వబడలేదనియు, ఇండియా మంత్రి జట్లండుప్రభువు ఒక ఆంధ్రప్రముఖునికి చెప్పినాడని తనకు అపుడే తెలిసినదనిన్ని, గవర్నరుచేత ఆప్రకారము వ్రాయించినవాడు రాజగోపాలాచారేననిన్ని, రాజగోపాలాచారి ఆంధ్రరాష్ట్ర నిర్మాణ విఘాతకుడనిన్నీ నేరారోపణచేసి ఆయనమీద ఆంధ్రుల వ్యతిరేకతను రెచ్చగొట్టిరి. అపుడు నేను, గోపాలరెడ్డిగారుకూడ సభావేదికమీద నుంటిమి. రాజగోపాలాచారి తన కేమియు ఆ విషయమై తెలియదని పత్రికలకు వ్రాసినారు. గవర్నరు అటుల వ్రాసినాడో లేదో తెలియదు. మా రికార్డులో ఆ కారణముచేత ఆంధ్ర రాష్ట్రము వచ్చుటలేదని చెప్పుట కెట్టి అవకాశము లేదు. అటుల గవర్నరు వ్రాసినను దానిని రాజగోపాలాచారిగారికి అంటకట్టుట ఆధారములేని విషయమని నేను పత్రికలకు వ్రాసినాను. సత్యమూర్తి మొదలగు అరవ నాయకులు గవర్నరునుచూచి మదరాసు ఆంధ్రులకుకూడ రాజధానిగ నుండుటకు వ్యతిరేకముగ చెప్పుకొనిరి. నేను మహాత్మా గాంధీగారిని అటుపిమ్మట కొద్దిరోజులకు చూచినపుడు వారు నాతో నేకీభవించిరి. రాజగోపాలాచారిమంత్రి వర్గములోనుండిన గోపాలరెడ్డిగారు దానిని సభావేదికనుంచి ఖండించకుండుట తప్పుఅనిన్ని, అది నిజమేఅయినచో రాజగోపాలాచారిగారిమంత్రివర్గమునుండి ప్రకాశంగారు రాజీనామానిచ్చి ఆయనను బహిరంగముగ ఖండించియుండ వలెననిన్ని గాంధీగారు నాతో చెప్పిరి. ప్రకాశంగారు గొప్ప త్యాగియేగాని గాలితోపోట్లాడుటారనికూడ గాంధీగారు నాతో చెప్పిరి. గోపాలరెడ్డిగారు గాంధీగారిని కలిసినపుడు ఆయనను సంజాయిషీఅడిగి ఇటులనే చెప్పినారని తెలిసినది. గాంధీగారు డాక్టరు రాధాకృష్ణన్‌గారికి వ్రాసినలేఖలో ఆంధ్రులకు ఆంధ్రరాష్ట్రము వచ్చినట్లయిన తనకు సంతోషముగనుండునని వ్రాసినారు. ఒకసారి ఆంధ్రమహాసభాధ్యక్షులగు సర్ విజయగారు గాంధీగారు ఆంధ్రులకు అన్యాయముచేసినారని ఆంధ్రమహాసభలో చెప్పగా కొండా వెంకటప్పయ్య, టంగుటూరు ప్రకాశం, పట్టాభి సీతారామయ్యా, కాశేశ్వరరావు, గొల్లపూడి సీతారామశాస్త్రి ఈ అయిదుగు రాంధ్రనాయకులలో ఏ వొక్కరైన తాను. ఆంధ్రులకు అన్యాయముచేసినానని చెప్పినచో తా నా నేరమును

ఒప్పుకొందునని గాంధీగారు హరిజనపత్రికలో వ్రాసినారు. గాంధీగారి నాయకత్వముక్రింద 1947 ఆగస్టు 15వ తేదీన భారతదేశమునకు స్వరాజ్యమువచ్చినది. 1948 ఆగస్టు 15వ తేదీన అపరాహ్ణమువేళ మంచి వ్యక్తిత్వముతో హరినామస్మరణచేయుచు అతి అనాయాసముగా ఆంధ్ర మహానాయకులైన దేశభక్త కొండా వెంటప్పయ్యపంతులుగారు ఆంధ్ర రాష్ట్రమును చూడకుండగనే తమ స్వగృహమున పరమపదించినారు. వారిభార్య వారికిపుండే కొన్ని సంవత్సరాలక్రిందట స్వర్గస్తురాలైనది. ఇద్దరు కూతుళ్లు గలరు. విశ్వదాత దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులుగారు కూడ మదరాసులో తమ స్వగృహమైన శ్రీబాగులో 1938 సంవత్సరమున పరమపదించినారు. వారు ఆంధ్రరాష్ట్రమునే గాక స్వరాజ్యమునుకూడ చూడలేదు. వారి కొక కూతురు కలదు. ఆమెకు సంతానమున్నది. భార్య బాగానేయున్నది. వారిఅల్లుడగు శివలెంక శంభుప్రసాదుగారు ఆంధ్రపత్రికలను, భారతి మాసపత్రికను నడుపుచున్నారు. ఇపుడు ఆంధ్రప్రదేశ్ శాసనమండలిలో సభ్యులు.

రాయలసీమవారు కొందరు ఆంధ్రరాష్ట్రమునకు వ్యతిరేకముగ నుండిరి. 1931 లో నేను ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు ప్రధానకార్యదర్శిగ రాయలసీమజిల్లాలలో సంచారముచేసినాను. అప్పుడు మిత్రులసమావేశములలో ప్రతిచోటను ఆంధ్రరాష్ట్రనిర్మాణమును గురించి చర్చించి దానికి అనుకూలముగ అందరిని త్రిప్పుటకు ప్రయత్నించితిని. చిత్తూరులో అనంతశయనంఅయ్యంగారు, ఆర్. బి. రామకృష్ణరాజుగార్లు, కడపలో కోటిరెడ్డి గారు, అనంతపురములో కల్లూరు సుబ్బారావు, పప్పూరి రామాచార్యులు గార్లు, కర్నూలులో శంకరరెడ్డిగారు నాకు తోడ్పడిరి. 1937 సం॥ లో డాక్టరు పట్టాభిసీతారామయ్య, కొండా వెంకటప్పయ్య, పప్పూరి రామాచార్యులు, కల్లూరు సుబ్బారావు, కడప - కోటిరెడ్డిగార్లు కలసి శ్రీబాగు పాక్టు అను నొక ఒడంబడికను గావించుకొనిరి. అది మదరాసులో కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారి శ్రీబాగుభవనములో వ్రాసుకొనబట్టి శ్రీబాగుపాక్టు అని పిలువబడుచున్నది. దానిమీద నాగేశ్వరరావుపంతులుగారు దస్కత్తుపెట్టుటకు నిరాకరించిరి. అపుడు మదరాసు రెవిన్యూమంత్రియైన

టంగుటూరు ప్రకాశంపంతులుగారికి గాని, స్పీకరుగానున్న బులుసు సాంబమూర్తిగారికి గాని, నాకుగాని ఆ సంగతి తెలియదు గాని, దానిని తరువాత విధిలేక అందరము ఒప్పుకొనినట్టులే తీర్మానములుచేయుచువచ్చినాము. దానిలో రాయలసీమ ఆర్థికప్రయోజనములకు ప్రాధాన్యమివ్వవలెనని యున్నది. అందు కెట్టి అభ్యంతరములేదు. గాని మదరాసునగరము ఆంధ్రులకు రాజధానిగ రాకపోయినచో ఆంధ్రరాష్ట్రముయొక్క రాజధాని, హైకోర్టులలో నొకటి రాయలసీమలోను మరియొకటి ఉత్తరసర్కారులలోను ఉండవలెననిన్ని, ఈ రెంటిలో నేది రాయలసీమలో నుండవలెననునది రాయలసీమవారే నిర్ణయించవలెననిన్ని వ్రాసుకొనబడినది. దీనివల్ల రాయలసీమలోని చాలమందికి సంతృప్తికలిగియుండవచ్చును. గాని రాయలసీమలో రాజధానిని స్థాపించుటకు తగిన పట్టణము లేమియు లేవు. గావున రాయలసీమమిత్రులు అనంతపురములో హైకోర్టు ఉండవలెనని కోరుదురనియు, రాజధానిని బెజవాడ గుంటూరులమధ్య స్థాపించి, అటు గుంటూరు వరకును ఇటు బెజవాడవరకును మహానగరముగా విస్తరిల్లుటకు సమ్మతింతురనియు ఆశించుచుంటిమి. థారుకమీషనువద్ద ఆంధ్రమహాసభపక్షమున నివేదికను తయారుచేసినపుడు నేను రాయలసీమప్రముఖులను ఈ విషయమున సంప్రదింపగా, వా రిందుకే సమ్మతించిరి. ఆప్రకారమే ఆ నివేదికలో నేను వ్రాసి సమర్పించినాను. గాని 1953 అక్టోబరు 1 వ తేదీనాడు ఆంధ్రరాష్ట్రస్థాపన జరిగినపుడు తాత్కాలికరాజధానివిషయములో తీవ్రచర్చలు జరుగగ దానిని మదరాసులో పెట్టుటకు వీలులేనపుడు రాయలసీమలోనే పెట్టితీరవలెనని రాయలసీమనాయకులు పట్టుపట్టినందున కర్నూలులో పెట్టవలసివచ్చినది. అచట భవనములుగాని ఇతర సౌకర్యములుగాని లేకపోవుటవల్ల ఉద్యోగస్థులు, నౌకర్లు, ప్రభుత్వముతో పనియుండివచ్చినవారు చాల ఇబ్బందులకులోనైరి. వేలకొలది యుద్యోగస్థులు, నౌకర్లు కర్నూలులో ఎండనక వాననక చలియనక డేరాలలో నివాసముచేయవలసివచ్చినది. దైవానుగ్రహమువలన మూడుసంవత్సరములకే విశాలాంధ్ర మేర్పడి, సుందరమైన, సువిశాలమైన హైదరాబాదునగరము రాజధానియగుటతోడనే ఆంధ్రుల యిబ్బందులన్నియు అంతరించిపోయినవి. విశాలాంధ్ర మక్కరలేదని, రెండు

ఆంధ్రరాష్ట్రములు - తెలంగాణారాష్ట్రము పేరుగను, ఆంధ్రరాష్ట్రము పేరుగను - ఉండుట సమంజసమని చెప్పిన ఆంధ్రనాయకులు లేకపోలేదు. గాని వారు వ్రేళ్ళమీదలెక్కించగల సంఖ్యాకులే. కొంతవరకు చెప్పదగినంత సంఖ్యగల తెలంగాణానాయకులు, ప్రజలు తెలంగాణమును, దానికి హైదరాబాదును రాజధానిగచేసి ప్రత్యేకరాష్ట్రముగా చేయవలెనని, ఆంధ్రరాష్ట్రముతో చేర్చవద్దని ఆందోళనముచేసినారు. వారు పైనచెప్పిన ఆంధ్రనాయకులపేర్లను తమవాదనకు బలముగ నుపయోగించుచున్నారు. హైదరాబాదు రాజధానిగగల విశాలాంధ్ర మేర్పడనిపక్షములో రాజధానివిషయములో రాయలసీమవారికిని సర్కారువారికిని తీవ్రమైన అభిప్రాయభేదములు పొడగట్టెడివి. అవన్నియు ఏర్పడకుండా శ్రీబాగుపొత్తుతో పనిలేకుండగనే హైదరాబాదు ఆంధ్రజాతికంతకును రాజధానినగరమై అన్ని ప్రభుత్వశాఖలు, హైకోర్టు, శాసనసభలు అన్నియు ఆ మహానగరములోనే స్థాపితమైనవి. ఆంధ్రజాతికి ఐక్యత, తృప్తి కలిగినవి.

స్వరాజ్యము వచ్చినతర్వాత నూతన భారత రాజ్యాంగవిధానమును తయారుచేయుటకు రాజ్యాంగవిధాన నిర్ణాయకసంఘము నొకదానిని ఎన్నుకొనిరి. ఇంగ్లండుతో నెట్టి సంబంధములేని సంపూర్ణ ప్రజాస్వామ్యవిధానమును తయారుచేయుచుండిరి. ఆ కాలములో 1948 వ సంవత్సరమున మద్రాసురాష్ట్రముయొక్క రెండుశాసనసభలలోను అపుడు న్యాయశాఖామంత్రిగానున్న డాక్టరు సుబ్బరాయన్‌గారు భారతరాజ్యాంగవిధానములో రాష్ట్రములవిభజనము భాషలనుబట్టి జరుగునట్లులను, అందులో ముఖ్యముగ ఆంధ్ర, తమిళ, కర్ణాటక, కేరళరాష్ట్రములను స్థాపించునట్లులను, అందుకు కావలసిన చర్యలనన్నిటిని ప్రభుత్వము తీసుకొనునట్లులను రాజ్యాంగవిధానములో చేర్చవలెనని యొక తీర్మానమును ప్రవేశపెట్టి ఏకగ్రీవముగ ఆమోదింప చేసినారు. అపుడు రెవెన్యూ మంత్రిగానున్న కళా వెంకటరావు, శాసనసభ్యులుగనున్న కడప కోటిరెడ్డి, కె. ఆర్. కరంతు మొదలైనవారున్నూ, నేనున్నూ ఆ తీర్మానమును బలపర్చితిమి. ఆ తీర్మానము మద్రాసుమంత్రివర్గములో ఏకగ్రీవముగ అంగీకరింపబడి రాజ్యాంగ నిర్ణాయకసంఘమునకు పంపబడినది. గాని ఆ సంఘమువారు అట్టి విషయ

మును దేనిని నూతనరాజ్యాంగములో చేర్చలేదు. ఢిల్లీ పార్లమెంటులో ఆచార్య రంగాగారు ఆంధ్రరాష్ట్రమునుగూర్చి యొక ప్రత్యేక స్వల్పవ్యవధి ప్రశ్న నిచ్చి ప్రశ్నించగా తక్కినరాష్ట్రములవిషయములో తొందరేమియు లేదనిన్నీ, ఆంధ్రరాష్ట్రమునుమాత్రము వీలైనంత త్వరగా నేర్పాటుచేయుటకు సంకల్పించినామనిన్ని ప్రధానమంత్రి పండిత జవహర్లాల్ నెహ్రూగారు జవాబుచెప్పిరి. పైనచెప్పిన రాజ్యాంగవిధాననిర్ణయసభ సమావేశమయ్యే దినముననే ఉదయపుపూట డాక్టరు పట్టాభిసీతారామయ్యగారి అధ్యక్షతక్రింద అఖిలభారత భాషాప్రయుక్తరాష్ట్రసమ్మేళనము న్యూఢిల్లీలో జరిగినది. నేను కూడ దానికి ఆహ్వానింపబడి అందులో పాల్గొంటిని. భాషాప్రయుక్తరాష్ట్రములను కోరుచు తీర్మానములుచేసినాము. ఆ సంవత్సరమే ఏప్రిలు 26 వ తేదీన, నైజాంరాజ్యంలో ప్రజాపాలననుకోరే ప్రజలమీద రజాకార్లు జరుపుతున్న ఘోరకృత్యములనుగూర్చి అఖిలభారత కాంగ్రెసుకమిటీ రహస్యసమావేశము డాక్టరు రాజేంద్రప్రసాద్‌గారి అధ్యక్షతక్రింద డిల్లీలో జరిగినది. ఆ సమావేశములో నేను, టంగుటూరు ప్రకాశం పంతులుగారు మాట్లాడినాము. ఆ సాయంత్రమే ప్రకాశంగారు, డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారు, తెన్నేటి విశ్వనాధంగారు, నేను, ఇంకా కొందరు ఆంధ్రదేశమునుంచి వచ్చిన అఖిలభారత కాంగ్రెసుకమిటీ సభ్యుల మందరము ఆంధ్రరాష్ట్రమును వెంటనే స్థాపించుటకు తగినచర్యల నన్నిటిని తీసుకొనవలెనని కాంగ్రెసుఅధ్యక్షులైన డాక్టర్ రాజేంద్రప్రసాద్‌గారికి వినతిపత్రమును సమర్పించి వారితో మాట్లాడితిమి. పండిత జవహర్లాల్ నెహ్రూగారుకూడ అపుడు అక్కడేయుండిరి. వీలైనంతత్వరలో ఆంధ్రరాష్ట్రనిర్మాణముకొరకై దానిరాజధాని, ఆర్థికవిషయములు, ప్రక్కనున్న తమిళరాష్ట్రముతో సంబంధములు మొదలైనవాటినిగూర్చి విచారించి తనకు నివేదించుటకొక యుపసంఘమును నియమించెదమని రాజేంద్రప్రసాదుగారు సెలవిచ్చిరి. అందరము ఎవరియిండ్లకు వారము వెళ్ళితిమి. తరువాత నాలుగురోజులకు నేను మద్రాసునుంచి ఢిల్లీకి ట్రంకుఫోనులో డాక్టర్ రాజేంద్రప్రసాద్ గారిని పిలిచి ఆంధ్రరాష్ట్రఉపసంఘమును వేసితిరా? అని అడిగినాను. ఆంధ్రరాష్ట్ర మిచ్చినట్లయితే కర్ణాటకులుకూడ తమ రాష్ట్రమునకు తొందర

చేతురే అన్నారు. వారికికూడ మాతో ప్రత్యేకరాష్ట్ర మివ్వండి, అది న్యాయమేకదా అని జవాబుచెప్పినాను. మీ యుభయులకు యిచ్చినట్లయితే మహారాష్ట్రులుకూడ అడుగుతారు అన్నారు. వారికికూడ యివ్వండి. ఈ మూడు భాషారాష్ట్రములు ఏర్పడడము చాలా అవసరం అని జవాబుచెప్పి నాను. మహారాష్ట్రరాష్ట్రసమస్య వచ్చినపుడు బొంబాయినగరసమస్య చాల క్లిష్టముగనుండునే, దానివిషయమై తాము వల్లభాయిపటేల్‌గారితోను, జవహర్లాల్‌నెహ్రూగారితోను సంప్రతించవలసియుండునని వారు జవాబుచెప్పిరి. సంప్రతించండి, బొంబాయినగరము మహారాష్ట్రులకు రాజధానియగుటయే న్యాయమేమో ఆలోచించండి అని నేను జవాబుచెప్పితిని. అంతటితో మా సంభాషణ ముగిసినది. వారు మేనెల 9 వ తేదీన వల్లభాయిపటేల్‌గారిని, జవహర్లాల్‌నెహ్రూగారిని కలసి ఈవిషయమై సంప్రతింపులుజరిపినట్లు తెలిసినది.

(2)

తరువాత కొలదికాలమునకు థార్‌కమిషను నొకదానిని ముఖ్యముగా ఆంధ్రరాష్ట్రవిషయమునుగూర్చియు, సామాన్యముగా భాషాప్రయుక్తరాష్ట్రములన్నింటినిగూర్చియు విచారణచేసి యొకనివేదికను తమకు అందజేయుటకు ఇండియాప్రభుత్వమువారు నియమించిరి. ఈ థార్‌కమిషనులో నాకు ఎక్కువస్నేహితులుగానున్న జగత్‌నారాయణ్‌లాల్‌గారు కూడ సభ్యులుగా నుండిరి. మిగిలినవారిని నే నెరుగను. ఆ కమిషను 1948 సం. రెండవభాగమున మద్రాసుకు ఆంధ్రరాష్ట్రస్థాపనవిషయమై విచారణచేయుటకు వచ్చినది. మద్రాసువిచారణలో తమకు సహాయముచేయుటకు అపుడు మద్రాసు లెజిస్లేటివుకౌన్సిలు అధ్యక్షులుగానున్న ఆర్. బి. రామకృష్ణరాజుగారిని చేర్చుకొనిరి. మద్రాసుగవర్నమెంటు ఆంధ్రులపక్షమున నన్ను మొదటిసాక్షిగ అరవలపక్షమున డాక్టర్ సుబ్బరాయన్‌గారిని మొదటిసాక్షిగను నియమించిరి. ఆ కమిషను వచ్చుచున్నదనగ ప్రకాశంపంతులుగారి కోరికమీద ఆంధ్రరాష్ట్ర విషయమైన పాతచరిత్రను, అంకెలను, ఇతరభోగట్టాలన్నీ సమకూర్చి యొక నివేదికను తయారుచేసితిని. అపుడు ఆచార్య రంగాగారు ఆంధ్రరాష్ట్రకాం

గ్రెసుకమిటీఅధ్యక్షులుగ నుండిరి. వారు నన్ను కోరినచో ఆ నివేదికను వారి కిచ్చి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీపక్షమున అచ్చువేయించి కమిటీకి సమర్పించుట బాగుగానుండునని తలచితిని. ఆ నివేదిక చాలా బాగుగ నున్నదని అందరును తలచిరి. ఆంధ్రుల పూర్వచరిత్రను వ్రాయుటలో నాకు భావరాజు వెంకటకృష్ణారావుగారు అమూల్యమైన విషయములను తెలిపిరి. వారు గొప్ప ఆంధ్ర చారిత్రకపరిశోధకులు. అపుడు హిందూదేవాదాయకమీషనరుగ వారు మద్రాసులో నుండిరి. ప్రకాశంపంతులుగారు మద్రాసునగరము ఆంధ్రుల కేల రాజధానిగా నుండవలెను అను విషయములో బహు చక్కని నివేదికను వ్రాసి కమిషనువారికి సమర్పించి సాక్ష్యమిచ్చిరి. నా నివేదికను ఆచార్యరంగాగారు అడుగక బెజవాడలోనున్న వారిశిష్యులగు చెరుకూరి వీరయ్యచౌదరి బి. ఏ. బి. ఎల్. గారిని నివేదిక తయారుచేయ నియమించిరి. వారు నాదగ్గరకువచ్చి విషయములన్నీ ఎక్కడ దొరకుతాయని అడిగినారు. లైబ్రరీలో చూచుకోండి అని నేను చెప్పినాను. ఇంతకు వారు నివేదికను తయారుచేయనేలేదు. అపుడు ఆంధ్రమహాసభ అధ్యక్షులుగానున్న ఉయ్యూరు కుమారరాజాగారు నాదగ్గరకువచ్చి ఆ నివేదికను తమ కిప్పించవలసినదని, ఆంధ్రమహాసభతరఫున దాని నచ్చువేయించి తాను, నేను, హరిసర్వోత్తమరావు, గుళ్ళపల్లి పున్నయ్యశాస్త్రిగార్లు కమిషనుఎదుట దాఖలుచేసి సాక్ష్యమిచ్చెదమని కోరగా, నేను ఆ నివేదికను వారి కిచ్చితిని. వారు దానిని అచ్చువేయించి కమిషనుకు సమర్పించిరి. వారు సాక్ష్యమిచ్చిరి. కాని వారిసాక్ష్యమునకు ముందే నా సాక్ష్యము ముగింపబడెను. నేనుకూడ ఆ నివేదికను కమిషనువారికి సమర్పించి సాక్ష్యమిచ్చితిని. నేను సాక్ష్యమిచ్చునపుడు తగినంతమంది ఆంధ్రరాష్ట్రముకోరే ప్రముఖులను మద్రాసుగవర్న మెంటువారు సాక్ష్యమునకు పిలువలేదనియు, అందువలన ఆంధ్రులకు అన్యాయము జరుగుచున్నదనియు నేను కమిషనువారితో చెప్పితిని. అటులైన ఎవ్వరెవ్వరిని సాక్షులుగా పిలువవలెనో సూచించుచు అర్హులైనవారిపేర్ల జాబితాను కొత్తగా తయారుచేసి ఇవ్వవలసినదని వారు నన్ను కోరిరి. అంతట షుమారు 30 మంది ఆంధ్ర ప్రముఖులను ఆంధ్రసాక్షులుగా పేరులిచ్చితిని. దాదాపు వారి నందరిని కమిషనువారు ఆహ్వానించి విచారించిరి. వారందరికి నేను వ్రాసియిచ్చిన నివే

దీక్షప్రతులను ఉయ్యూరు కుమారరాజాగారు పంపించిరి. వారందరు దాని నుపయోగించుకొనిరి. ఈవిధముగా ఆంధ్రులతరపున పూర్తియైన సాక్ష్యమును కమిషనుయెదుట నివేదించబడెను. కాని అర్థికకారణములు చెప్పి కమిషనువారు ఆంధ్రరాష్ట్రముగాని మరి యితర భాషాప్రయుక్తరాష్ట్రములుకాని ఇచ్చుటకు సమయము రాలేదని నివేదికలో వ్రాసిరి. ఆంధ్రరాష్ట్రము మహారాష్ట్రము స్థాపించినకులైన మదరాసు, బొంబాయి నగరములను రెంటిని ప్రత్యేక నగరరాష్ట్రములుగ చేయవలెనని సిఫారసుమాత్రము చేసిరి. నేను తయారుచేసిన నివేదికలో మద్రాసునగరమే ఆంధ్రులకు రాజధాని కావలెననిన్ని, అటులకానిచో బెజవాడ - గుంటూరుపట్టణములమధ్య కృష్ణకు దక్షిణపువైపున ఆంధ్రరాజధాని యుండవలెననియు, హైకోర్టు అనంతపురములో స్థాపింపబడవలెననియు వ్రాసితిని. నేను రాయలసీమ మిత్రులను సమావేశపరచి అడుగగా వారిందు కొప్పుకొనిరి. యుద్ధకాలమున చెన్నపట్టణముమీద బాంబులుపడగనే హైకోర్టుయొక్క ఆంధ్రభాగమును అనంతపురములో పెట్టియుండిరి. రికార్డులన్నియు అక్కడికి పంపబడెను. అనంతపురములోని జిల్లాకోర్టుకార్యాలయమును ఏడుగురు హైకోర్టుజడ్జీలు కూర్చొని విచారణచేయుటకువీలుగ భవనములను విస్తరింపచేసియుండిరి. అందువలన అనంతపురమే హైకోర్టుకు తగినస్థలమని తలచితిమి.

1949 ప్రారంభమున జరిగిన జయపూరు (రాజస్థాన్) కాంగ్రెసు మహాసభకు డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు అధ్యక్షులుగ ఎన్నుకొనబడిరి. వారిఅభ్యర్థిత్వమును నేను, ప్రకాశంగారు బలపర్చి ఆంధ్రులఓట్లను చాలవరకు ఇప్పించితిమి, గాని ఆచార్యరంగాగారు, వారిఅనుచరులుమాత్రము పట్టాభిసీతారామయ్యగారికి వ్యతిరేకముగ ఓటుచేసిరి. జయపూరులో మన ఆంధ్రనాయకులైన అధ్యక్షులవారికి ఏనుగులతో, గుర్రములతో మోటారు కార్లతో వాలంటీరుదళముతో జరిగిన గొప్పయూరేగింపు అఖండసన్మానము మాకందరకు అత్యంత గర్వకారణమైనది. జయపూరు కాంగ్రెసుమహాసభలో ధారుకమిషను రిపోర్టును తీవ్రముగ ఖండించుచు నొకతీర్మానమును నేను ప్రతిపాదించెదనని అధ్యక్షులైన పట్టాభి సీతారామయ్యగారికి తెలియపరచితిని. వారు నన్ను పిలచి "ఆంధ్రరాష్ట్రమువిషయములో కాంగ్రెసుతరపున

మరియొక కమిటీని వేయదలచినాము. నీవు పోయి వల్లభాయి పటేలు గారితో మాట్లాడవలసినదని" ఆయన నాతో చెప్పినాడు. నేను వల్లభాయి గారిని జవహర్‌లాల్ నెహ్రూగారిని కలసి మాట్లాడగ తా మటుల ఆంధ్రరాష్ట్రముకొరకు కొరకు కమిటీని వేయబోవుచున్నందున, న న్నెట్టితీర్మానమును ఉపపాదింపవద్దని చెప్పిరి. ఈసంగతి అధ్యక్షులవారితో చెప్పి వారిసలహాపైననే నా తీర్మానము నుపపాదించుట మానుకొంటిని. కాంగ్రెసుపక్షముననే జె. వి. పి. కమిటీ వేయబడ్డది. "జె" అనగ జవహర్‌లాల్ నెహ్రూ, "వి" అనగ వల్లభాయిపటేలు "పి" అనగ పట్టాభి సీతారామయ్యగారు.

జె. వి. పి. కమిటీవారు ఆంధ్రరాష్ట్రమును స్థాపించవలెనని శిఫారసుచేయుచు మద్రాసునగరము ఆంధ్రరాష్ట్రమునకు రాజధానిగానుండుటకు వీలులేదని వ్రాసిరి. కాని మద్రాసు తమిళ రాష్ట్రమునకు మాత్రమే రాజధానిగానుండవలెనని వ్రాయనందున ఆ నగరము ఆంధ్రులకును అరవలకును సమిష్టిరాష్ట్రముగ నుండుటకు అవకాశము కలదని ప్రకాశం పంతులుగారివంటివారు వాదించసాగిరి. ఏదిఎట్లున్నను మద్రాసునగరము ఆంధ్రరాజధానిగా నుండనక్కరలేదని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీవారు ఒప్పుకొన్ననే కాని ఆంధ్రరాష్ట్రము స్థాపించబడనేరదని స్పష్టపడినది. అందుమీద ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీవారము బెజవాడలో సమావేశమై మద్రాసునగరమును వదలుకొన్నట్లు తీర్మానించినాము. వెంటనే ఆంధ్రరాష్ట్రము స్థాపించవలెనని తీర్మానము చేసినాము. మదరాసునగరమును ప్రత్యేకరాష్ట్రముగ నిర్మాణముచేయవలెనని తీర్మానించినాము.

1949 వ సంవత్సర చివర భాగమున ఆంధ్రరాష్ట్రముయొక్క సరిహద్దులు, ఆదాయవ్యయములు, మిగిలిన మద్రాసురాష్ట్రమునుండి రావలసిన నష్టపరిహారము మొదలైన విషయములనుగూర్చి విచారించి ఏదోయొక ఏకాభిప్రాయమునకు వచ్చుటకుగాను గవర్నమెంటు ఆఫ్ ఇండియావా రొక యుపసంఘమునువేసిరి. దానిలో భక్తవత్సలం, కుమారస్వామిరాజా, టి. టి. కృష్ణమాచారి, మాధవ మీనన్‌గార్లును, టంగుటూరు ప్రకాశం, కళా వెంకట్రావు, బెజవాడ గోపాలరెడ్డి, నీలం సంజీవరెడ్డిగార్లును సభ్యులుగా నుండిరి. కొంతకాలము తాత్కాలికముగ మద్రాసులోనే ఆంధ్రరాజధానికూడ

వుండనివ్వవలెనని ప్రకాశంప్రభృతులు కోరిరి. కాని అరవసభ్యులు అందుకు బొత్తుగా ఒప్పుకోలేదు. ఆంధ్రులు మదరాసులోనే తిష్టవేసుకొని మదరాసునగరము సమిష్టినగరమని పట్టుపట్టెదరని వారి భయము. ఆంధ్ర రాష్ట్రములోనే ఎక్కడో ఒక చోట రాజధానిని నెలకొల్పుకొనవలెనని గట్టిగా చెప్పిరి. హైకోర్టు మాత్రము కొంతకాలమువరకు సమిష్టిగానే మద్రాసులో ఉండవచ్చునని అంగీకరించిరి. అప్పటికే నేను, కొంతమంది ఇతరమిత్రులు కలిసి 1949వసంవత్సరం నవంబరు 26వ తేదిననే విశాలాంధ్ర మహాసభను స్థాపించియుంటిమి. ఆ ఉద్యమము సఫలముకాగలదనియు, అందువల్ల ఆంధ్రులకు హైదరాబాదునగరము శాశ్వతమైన రాజధానిగ నుండగలదనియు ఆంధ్రులలో ఆశలు ప్రబలెను. 1950 వ సంవత్సరారంభ మున ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుమహాసభ మద్రాసులో ఆచార్య రంగాగారి అధ్యక్షతను సమావేశమైనపుడు నా యుపపాదనమీదనే తాత్కాలికరాజధాని మద్రాసులోను, శాశ్వతరాజధాని హైదరాబాదులోను ఉండవలెనని ఏకగ్రీవ ముగ తీర్మానముచేసిరి. కాని తాత్కాలికరాజధానికూడ మద్రాసులో నుంచు టకు అరవలు ఒప్పుకొననందున అనంతపురములో రాజధానినుంచవలెనని కళా వెంకట్రావువర్గమువారు, తిరుపతిలో వుండవలెనని రంగావర్గమువారును పరస్పరము భిన్నాభిప్రాయములను ప్రకటించియుండిరి. హైకోర్టునుకూడ సమిష్టిగ నుంచనక్కరలేదని, ఆంధ్రహైకోర్టు ప్రత్యేకముగ ఆంధ్రరాష్ట్రము లోనే యుండవలెనని ఆంధ్రసభ్యులు తలచిరి, కళా వెంకట్రావు ప్రభృతులు హైకోర్టు కాకినాడలో వుండవలెనని, రంగావర్గం.వారు బెజవాడలో వుండ వలెనని వివాదపడిరి. మద్రాసునుంచి ఆంధ్రరాష్ట్రమునకు రావలసిన నష్ట పరిహారమునుగురించి కూడ ఒక కోటిరూప్యములు వచ్చినచో చాలునని కళా వెంకట్రావుగారు, 80 కోట్లు రూపాయలు రావలెనని ప్రకాశంపంతులు గారు వాదించిరి. వీరుభయులు ఏవిధముగాను సమన్వయము కుదరని అభిప్రాయభేదములు కలిగియుండిరి. 1950 జనవరి 26 నుంచి నూతన రాజ్యాంగవిధానము అమలులోనికివచ్చును, కనుక ఆపిమ్మట ఆంధ్ర రాష్ట్రము రావలెనంటే ఢిల్లీపార్లమెంటులో నొక బిల్లు రెండు సభలలోను ప్రవేశపెట్టబడి ఒక చట్టముకావలసియుండును. అందువలన జనవరి 26

లోపలనే పాత ఇండియాపట్టముక్రిందనే ఆంధ్రులమధ్యను, అరవలమధ్యను ఏకాభిప్రాయము కుదిరినయెడల ఆ ప్రకారము లండనులోని ఇండియామంత్రి వలననే ఆంధ్రరాష్ట్రము స్థాపితమగునట్లు చేయవలెనని ఢిల్లీప్రభుత్వమువారు ప్రయత్నముచేసిరి. కాని ప్రయత్నము సఫలీకృతముకానేరదని తెలిసి కమిటీవారు కార్యమును విరమించిరి.

అటుపిమ్మట 1950లో ఆంధ్రరాష్ట్రముకొరకు సత్యాగ్రహముచేతుమని స్వామీ సీతారాంగారు, వారిశిష్యులు ఉపవాసములు ప్రారంభించి కొన్ని రోజులకు వినోబా భావేగారిసలహామీద ఆ ఉపవాసమును విరమించిరి. పిమ్మట స్వామీజీ శిష్యులు కొందరు భీమవరములోను, బెజవాడలోను కొద్ది కాలము సత్యాగ్రహము సాగించిరి. కాని అందువల్ల ఏమియు ప్రయోజనము కలుగలేదు. తుదకు 1952 అక్టోబరు 18 వ తేదీన ఆంధ్రరాష్ట్రస్థాపనకొరకు ఆ మరణ ఉపవాసదీక్షను పూనెదనని శపథముగావించి పొట్టి శ్రీరాములు గారు ఉపవాస మారంభించిరి. ఇది మద్రాసులో జరిగెను, ఆయన ఉప వాసముచేయుచున్నప్పటికి అపుడు మద్రాసుముఖ్యమంత్రిగానున్న సి. రాజ గోపాలాచార్యులుగారు లక్ష్యపెట్టలేదు. రోజు రోజుకు పొట్టి శ్రీరాములుగారు కృశించుచుండిరి. బంధువులు, మిత్రులు వచ్చి ఆయనను ఉపవాసము చాలించవలసినదని కోరుచుండిరి. ఎవరును ఆయనకు ఉపవాసము సాగించుటకు ఆశ్రయమిచ్చునట్లు కనబడలేదు. మైలాపురములో నున్న బులుసు సాంబమూర్తిగారు వారిని తీసుకొనివచ్చి తాను కాపురమున్న యింటివసారాలో వేపచెట్టునీడలో ఆశ్రయమిచ్చిరి. తాను ఆంధ్రరాష్ట్రము కొరకు బలియగుటకు సిద్ధముగానున్నాననియు, తన్ను ఉపవాసదీక్షను మానవలెనని ఎవ్వరునూ కోరవలదనియు చెప్పుచు పొట్టి శ్రీరాములుగారు దృఢసంకల్పముచేసుకొని ఆదీక్షను కఠోరముగా కొనసాగించుచుండిరి అనేక మంది వచ్చి చూచిపోవుచుండిరి. క్షణక్షణమునకు బలహీనత, శరీరబాధ ఎక్కువవవుతున్నప్పటికి ఆ మహాపురుషుడు తనదీక్షను మానలేదు. తుదకు 1952 డిశంబరు 15 వ తేదీన పొట్టి శ్రీరాములుగారు ఆ దీక్షలోనే పరమ పదించినారు. ఆంధ్రరాష్ట్రముకొరకు ఆయనచేసిన ఆత్మార్పణము ఆంధ్రు లందరిని సంచలింపచేసినది. ఆయనకళేబరమును స్మశానమునకు తీసుకుని

వెళ్ళినపుడు మద్రాసులో ఏబదివేలజనము భజనలతో ఊరేగింపులో పాల్గొనిరి. "ఈవిధముగా ఒకగొప్ప యుద్యమముకొరకు ఉపవాసముచేసి ప్రాణములర్పించుట, ఆయనశవముతో వేలకువేలమంది ఊరేగింపులో స్మశానమునకు భజనలతో పోవుట నాకు ఆశ్చర్యముకలుగచేసినది." అని అది చూచివచ్చిన ఒక అమెరికను పత్రికాప్రతినిధి నాతో బెజవాడలో చెప్పెను. పొట్టి శ్రీరాములుగారి ఆత్మార్పణవార్త తెలియగానే ఆంధ్రదేశములోని విద్యార్థులలోను, యువకులలోను అమితాగ్రహము, రోషము, ఆవేశము కలిగి ఎక్కడివా రక్కడ రైళ్ళను ఆపివేసినారు. బెజవాడ రైలుస్టేషనులో అట్లు ఆపివేయగా దానిని అవకాశముగాతీసుకొని అల్లరిమూకలు, దోపిడీగాండ్రు వచ్చి ఆ స్తిని దొంగిలించుకొనిపోయినారు. షుమారు రెండుకోట్లరూప్యములు కిమ్మతుచేసే ఆస్తి ఈవిధముగ దొంగిలింపబడినదని చెప్పబడుచున్నది. నే నా దినమున బెజవాడలోనే యుంటిని. ప్రభుత్వోద్యోగులు ఏమీ చేయజాలక యూరకున్నారు. వాల్తేరు నెల్లూరు స్టేషనులలోను మరికొన్ని రైలుస్టేషనులలోను పోలీసులు తుపాకులుకాల్చగా కొందరుయువకులు మరణించినారు. పొట్టి శ్రీరాములుగారు మహాపురుషుడు. గాంధీగారి నిజమైన శిష్యుడు. నిర్మాణకార్యక్రమములకు హరిజనసేవకు జీవితమర్పించిన సత్యసంధుడు. 59 రోజులు ఆంధ్రప్రజల ప్రధానాశయమైన ఆంధ్రరాష్ట్రస్థాపన కొరకు ఉపవాసముచేయుచుండగా మద్రాసుప్రభుత్వమువారుకాని, ఢిల్లీప్రభుత్వమువారుకాని ఏమిన్నీ జోక్యము పుచ్చుకొనకపోవుటవల్లనే ఆయన మరణించినాడనేభావముతో ఆంధ్రదేశమంతటా ఆగ్రహము కార్చిచ్చువలె ప్రబలినది.ఈ మహాసంఘటన పండిట్ జవహర్లాల్ నెహూర్రుగారిహృదయమును మార్చినది. డిశంబరు 19 వ తేదీన లోకసభలోను, రాజ్యసభలోను 1953 అక్టోబరు 1 వ తేదీనాటికి ఆంధ్రరాష్ట్రమును స్థాపింతునని పండిట్ జవహర్లాల్ నెహూర్రుగారు ఒకప్రకటన చేసినారు. అంతటితో ఆంధ్రదేశమంతట తిరిగి శాంతినెలకొన్నది. 1953 వ సంవత్సరం ప్రారంభములోనే రాజస్థాన్ హైకోర్టు ప్రధానన్యాయమూర్తి జస్టిస్ వాంఛూను విచారణకర్తగా నియమించిరి. ఆయన ఫిబ్రవరిలో మద్రాసువచ్చి సాక్ష్యము పుచ్చుకొనెను. అన్ని పార్టీలవారు ఆయనవద్ద సాక్ష్యమిచ్చిరి. ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుయొక్క ఉప

సంఘములో నేను, నీలం సంజీవరెడ్డి, బెజవాడ గోపాలరెడ్డి, కళా వెంకట్రావు, టి. యస్ వెంకటసుబ్బారెడ్డి, కొత్త రఘురామయ్యగారలుసభ్యులుగా నియమింపబడితిమి. అధ్యక్షులైన నీలం సంజీవరెడ్డిగారు నేను మద్రాసులో కొన్నిరోజులుండి నివేదికవ్రాయడములో శ్రద్ధతీసుకొనవలెనని నన్ను కోరిరి. వారు నన్ను ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుసంఘమున కుపాధ్యక్షులుగ నియమించిరి. ముళ్ళపూడి పల్లంరాజుగారిని మరియొక యుపాధ్యక్షునిగను అల్లూరు సత్యనారాయణరాజుగారిని ప్రధానకార్యదర్శిగను నియమించిరి. మే మొక నివేదికను తయారుచేసి జస్టిస్ వాంఛూగారికి సమర్పించితిమి. మద్రాసులోనే తాత్కాలికరాజధాని యుండవలెనని అందులో కోరినాము. హైదరాబాదుసమస్య పరిష్కారమయ్యేవరకు రాజధాని మద్రాసులోనే యుండవలెనని, ఆపిమ్మట హైదరాబాదు మాకు రాకపోయినయెడల ఆంధ్రరాష్ట్రములోనే ఏదోయొకచోట పెట్టుకొనెదమని వ్రాసితిమి. 50కోట్ల రూప్యములు ఉమ్మడిమద్రాసురాష్ట్రమునుంచి మాకు రావలెనని కోరితిమి. 11 జిల్లాల మూడుతాలూకాలు ఆంధ్రరాష్ట్రములో చేరవలెననునది నిర్వివాదాంశమని వ్రాసితిమి. పైనచెప్పిన మూడుతాలూకాలు కాక బళ్లారిపట్టణమున్ను బళ్ళారి, రూపనగుడి, మోకా అను మూడుఫిర్కాలున్నూ, మాకు రావలెనని కోరితిమి. చెంగల్పట్టు, సేలము, ఉత్తరఆర్కాటుజిల్లాలనుంచి కొంత భాగముకూడ మాకు రావలెనని కోరితిమి. కాని అవిఅన్నీ పెట్టుకొన్నట్లయిన కాలయాపన మగును. కనుక వెంటనే ఆంధ్రరాష్ట్రమును స్థాపించుకొని, పిమ్మట ఒక సరిహద్దువిచారణసంఘము నేర్పాటుచేసుకొని మిగిలిన మదరాసురాష్ట్రమునుంచి రాదగినవాటిని రాబట్టుకొనవచ్చునని వాంఛూగారు సలహానిచ్చిరి. మద్రాసురాష్ట్రములోనుండి ఆంధ్రరాష్ట్రమునకు రావలసిన భాగములనుగూర్చియే తాను విచారణచేయుటకు అధికారముకలదనియు, మైసూరు ఒరిస్సా మొదలగు నితరరాష్ట్రములనుంచి రావలసినవానినిగురించి విచారించుటకు తనకు అధికారములేదనికూడా వాంఛూగారు స్పష్టముగ చెప్పిరి. కమ్యూనిస్టుపార్టీవారుమద్రాసులో తాత్కాలికరాజధానిని యుంచకూడదని, దానిని వెంటనే బెజవాడ - గుంటూరులమధ్య స్థాపించవలెనని కోరిరి. ఆచార్య రంగాగారి కె. ఎల్. పి. పార్టీవారు రాజధానిని తిరుపతిలో

వుండవలెనని, బెజవాడలో హైకోర్టు ఉండవలెనని కోరిరి. ప్రజాపార్టీతరఫున ప్రకాశంగారుకూడ నొక మెమొరాండమును సమర్పించిరి. మద్రాసు తాత్కాలికరాజధానిగ నుండవలెనని అందులో కోరిరి. 50 కోట్ల ఋణ్యములు మద్రాసుప్రభుత్వమునుంచి ఆంధ్రరాష్ట్రమునకు రావలెననికూడకోరిరి. విచారణ ముగిసెను. వాంఛూనివేదిక వెలువడెను. మద్రాసు తాత్కాలిక రాజధానిగానుండుట యుక్తమని వారు వ్రాసిరి, శాశ్వతరాజధాని గుంటూరు విజయవాడలమధ్య నుండవలెనని కూడ వ్రాసిరి. కాని గవర్నమెంటు ఆఫ్ ఇండియావారు ఆ సూచనకు ఒప్పుకొనలేదు. ఆంధ్రరాష్ట్రములోనే మరి యొకచోట రాజధానిని తాత్కాలికముగ ఏర్పాటుచేసుకొనవలసినదని చెప్పిరి. అసలు ఆంధ్రరాష్ట్రమును మిగుల క్లిష్టమైన పరిస్థితులలో తీసుకొనవలసి వచ్చినది. తగిన రాజధాని లేదు. మద్రాసునగరమునుంచి వచ్చే మిగులు ఆదా అయిదుకోట్లు తరుగు. పైగా కాంగ్రెసు 1952 ఎన్నికలలో దెబ్బ తిన్నందున ఆంధ్రరాష్ట్రశాసనసభలో కాంగ్రెసుకు అధికసంఖ్యాబలములేదు. అయినను ఒకసారి విడిచిపెట్టినయెడల మరల ఆంధ్రరాష్ట్రము రాదు. గనుక ఏమైనను సరే లోపములు నెమ్మదిగ సర్దుకొనవచ్చునను విశ్వాసముతో ఆంధ్రరాష్ట్రము తీసుకొనుటకు ఒప్పుకొంటిమి.

(౩)

తర్జనభర్జనలు జరిగినపిమ్మట మద్రాసురాష్ట్ర శాసనసభలో కర్నూలులో ఆంధ్రరాజధాని యుండునట్లును, హైకోర్టు గుంటూరులో వుండునట్లును నిర్ణయింపబడెను. రాజధాని రాయలసీమలో యుండవలెనని రాయలసీమ కాంగ్రెసుసభ్యులందరు పట్టుపట్టిరి. అనంతపురము, తిరుపతి, కర్నూలు మూడుపట్టణములలో ప్రకాశంపంతులుగారు నిర్ణయించిన పట్టణములో రాజధానిని పెట్టవలెననిరి. ప్రకాశంపంతులుగారు కర్నూలు పేరును చెప్పిరి. అది అంగీకరింపబడెను. అది సుమారు 54 వేల జనసంఖ్యగల చిన్న పట్టణము. రెండుకోట్లఋణ్యములను మాత్రమే మదరాసుప్రభుత్వము ఆంధ్రుల కివ్వవలెనని వాంఛూగారు వ్రాసిరి. దానికిన్నీ ఒప్పుకున్నాము. 1953 అక్టోబరు ఒకటవ తేదీన ఆంధ్రరాష్ట్రము 11 జిల్లాల మూడు తాలూకాలతో ఏర్పడినది. ఆ మూడుతాలూకాలు బళ్ళారిజిల్లానుంచి వచ్చినవి.

వాటిలో రెండుతాలూకాలు కర్నూలుజిల్లాలోను, ఒకతాలూకా అనంతపురము జిల్లాలోను కలుపబడినవి. అందువల్ల 11 జిల్లాలుగ ఆంధ్రరాష్ట్రమేర్పడినది. కర్నూలులో ఇళ్ళులేనందున వేలకువేల డేరాలు వేయవలసివచ్చినది. వాటిలోనే ఆంధ్రప్రభుత్వముయొక్క ఉద్యోగస్థులు, చిన్నసౌకర్యల్లు కాపురముండవలసివచ్చినది. నూతన గృహములు కట్టుట ప్రారంభించిరి. పండిత జవహరులాలు నెహ్రూగారు అదివరకు కాంగ్రెసులోనుంచి 1951 లో లేచిపోయి ప్రజాపార్టీని ఏర్పరచిన ప్రకాశంపంతులుగారిని బలవంతపెట్టి కాంగ్రెసుపత్రముమీద అసోసియేటుసభ్యులుగా దస్కతుచేయించి కాంగ్రెసులో కలుపుకొని ముఖ్యమంత్రిని గావించిరి. ప్రకాశంగారు ఆంధ్రులకు మహానాయకుడు. ఆయన ముఖ్యమంత్రిగాలేని ఆంధ్రరాష్ట్రము తలలేని మొండెముపలెనుండునని నెహ్రూగారు తలచిరి. అపుడు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీ కర్ధ్యక్షుడు సంజీవరెడ్డిగారుకూడ నెహ్రూగారితో ఏకీభవించిరి. సంజీవరెడ్డిగారు డిప్యూటీ ముఖ్యమంత్రిగా నియమింపబడిరి. పరిపాలనలో అనుభవజ్ఞుడైన త్రివేదీగారు గవర్నరుగా నియమింపబడిరి. ఆంధ్ర హైకోర్టు 1954 జూలై 4 వ తేదీన గుంటూరులో స్థాపితమైనది. జస్టిస్ కోకా సుబ్బారావుగారు ప్రధాన న్యాయమూర్తిగా నియమింపబడెను. ఇటుల 1913 లో ప్రారంభమైన ఆంధ్రోద్యమము నలుబదిసంవత్సరములు సాగి అమరజీవి పొట్టి శ్రీరాములుగారి ఆత్మార్పణఫలితముగ 1953 అక్టోబరు ఒకటవతేదీన జయప్రదమైనది. పదకొండుజిల్లాలు, రెండుకోట్ల అయిదులక్షల జనాభా కలిగి, 63,417 చదరపుమైళ్ళవైశాల్యముగల ఆంధ్ర రాష్ట్రము స్థాపితమైనది. దాని కొరకే శాసనసభ ఏర్పడెను. అందులో 196 మంది ప్రజా ప్రతినిధులైన సభ్యులుండిరి. కాని కాంగ్రెసుపార్టీ కెక్కువ బలము లేకుండెను. ప్రకాశం సంజీవరెడ్డి మంత్రివర్గము ఆంధ్రరాష్ట్రాభివృద్ధికై గొప్ప సద్భావముతో కృషిసలుపుచున్నను, 1954 నవంబరునెలలో తేబడిన విశ్వాసరాహిత్య తీర్మానము ఒకే ఒకఓటుతో గెలిచి ప్రకాశంమంత్రివర్గము రద్దయ్యెను. తాత్కాలికముగ ఆంధ్రరాష్ట్రము గవర్నరుపాలనము క్రిందకు వచ్చెను. 1955 మార్చినెలలో మరల జరిగిన ఎన్నికలలో కాంగ్రెసుపార్టీకి అఖండవిజయము కలిగినది. ఈ ఆంధ్ర ఎసెంబ్లీఎన్నికలు

యావద్భారతదృష్టిలోనే గాక అంతర్జాతీయరంగములో కూడ ప్రాముఖ్యత చెందెను. 1946 సంవత్సరపు సమిష్టి మద్రాసు ఎసెంబ్లీ ఎన్నికలలో ఆంధ్ర దేశములో బలపడుచున్న కమ్యూనిస్టుపార్టీవారు 27 మంది అభ్యర్థులను నిలువబెట్టగ 26 మంది యోడిపోయి ఒకరుమాత్ర మెన్నుకొనబడిరి. అరవజిల్లాలనుంచికూడ యొకే కమ్యూనిస్టుసభ్యుడు వచ్చెను. 1948 నుండి 1951 ప్రథమభాగమువరకు తెలంగాణములోను ప్రక్కనున్న ఆంధ్ర జిల్లాలలోను కమ్యూనిస్టులు గొప్ప రక్తపాతముతోకూడిన భయానక విప్లవము జరిపి ఘోరహత్యలు, దోపిళ్ళు తీవ్రముగగావించి, భారతయూనియను మదరాసు హైదరాబాదు ప్రభుత్వములు తీసుకున్న దౌర్జన్యప్రతీకారచర్యల వలన నోడిపోయి, 1951 రెండవభాగమునుంచి విప్లవములుచాలించి, ఆయుధములను వప్పగించి చట్టసమ్మతిమైనపద్ధతులలో ప్రచారముసాగించుకొనుట కంగీకరించి 1952 ప్రారంభమున ఆంధ్రదేశములో జరిగిన ఎన్నికలలో నిలచి గొప్ప జయముపొందిరి. కాంగ్రెసుకును, కమ్యూనిస్టులకును దాదాపు సమానముగ స్థానములు లభించెను. ఒక్క ఓటుతో ప్రకాశం ప్రభుత్వమును పడగొట్టగలిగిరి. అదివరకు గాంధీగారికి ప్రియమైన రాష్ట్రమని, కాంగ్రెసుకు అతి బలమైనరాష్ట్రమని పేర్గాంచిన ఆంధ్రరాష్ట్రములో నిటుల 1952 నాటికి ఆంధ్రప్రజలు ఎసెంబ్లీ ఎన్నికలలో కమ్యూనిస్టులు ఘోరహత్యలు చేసినను వారికే ఓట్లనిచ్చి కాంగ్రెసును బాగా దెబ్బకొట్టుటకు కారణమేమి? కమ్యూనిస్టులు తాము ఆంధ్రదేశములో బాగుగ బలపడినామని, ఆంధ్రులు అధికసంఖ్యాకులుగ కమ్యూనిస్టుపక్షమున చేరినారని, 1955 ఎన్నికలలో తమకు నూటికి 90 పాళ్ళ స్థానములు వచ్చునని భ్రమపడసాగిరి. గాని అది యధార్థస్థితికాదనితేలినది. 1942 క్విట్ ఇండియా యుద్యమకాలమున ఆంధ్రకాంగ్రెసువాదులలో రానున్న అధికారపంపిణీ కొరకు జైళ్లలోనే ప్రారంభమై, వీరందరు బయటకువచ్చినపిమ్మట బాగుగ హెచ్చి, టంగుటూరు ప్రకాశంగారిప్రభుత్వస్థాపనలోను, అది పడిపోవుట లోను, పిమ్మటను ఇంకను తీవ్రరూపముదాల్చి కులతత్వము, లంచగొండి తనము మొదలగు గొప్ప చెడుగులలోని కీడ్చిన ఆంధ్రకాంగ్రెసు గ్రూపులు, అంతఃకలహములు ప్రజలలో కాంగ్రెసునందు హేయభావమును కలుగచేసి

నవి. ప్రకాశం, రంగాగార్లు, వారి అనుయాయులు కాంగ్రెసులోనుండి లేచి పోవుట, మరల వారిలోవారికి చీలికలుకలుగుట, కాంగ్రెసు ఎలెక్షన్‌కమిటీ వారు అభ్యర్థులను నిర్ణయించుటలో కలిగిన అసంతృప్తి మరింతగా కాంగ్రెసును బలహీనపర్చినవి. ఆంధ్రప్రజలు కాంగ్రెసుతో విసుగుచెంది 1952 వ సంవత్సరపు ఎన్నికలలో కాంగ్రెసువారికి గుణపాఠము నేర్పవలెనను వుద్దేశ్యముతో కాంగ్రెసును ప్రతిచోట ఓడించినారు. మంత్రివర్గములోనున్న వారు, కాంగ్రెసునాయకులుగనున్నవారు, ప్రకాశంగారు, రంగాగారు, రంగా గారిభార్య మొదలైనవారంతా ఓడిపోయినారు. కాంగ్రెసువారు 1952 ఎన్నికల గుణపాఠము మరువరానిది. కాంగ్రెసుసంస్థయు, అందలిసభ్యులును, శాసనసభ్యులును ఐకమత్యముగ గాంధీగారు బోధించిన సత్యము, ధర్మములతో నిష్కల్మష ప్రజాసేవచేసినపుడే కాంగ్రెసు బలముగ నుండగలదు. ఆ ఎన్నికలలో దెబ్బతిన్నతరువాత ఆంధ్రరాష్ట్రకమిటీకి అధ్యక్షులైన సంజీవరెడ్డిగారును, వారు జనరల్ కార్యదర్శిగా నియమించుకున్న అల్లూరి సత్యనారాయణరాజుగారును కాంగ్రెసుయొక్క స్థైతికపరిస్థితులను, ఐకమత్యమును చాలవరకు అభివృద్ధిచేసిరి. 1953 లో ప్రకాశంగారు మరల కాంగ్రెసులోకి వచ్చిరి. 1955 వ సంవత్సరపు ఎన్నికలు వచ్చుసరికి రంగా, విశ్వనాధంవర్గములుకూడ కాంగ్రెసులోకలసి ఐకమత్య మేర్పడెను. ఆంధ్రరాష్ట్రము ఏర్పడినపిమ్మట వచ్చిన మొదటిఎన్నికలు ఇవే అయినందున ఆంధ్రరాష్ట్రములో బలమైన కాంగ్రెసుప్రభుత్వమును ఏర్పరచవలెననేభావము ఆంధ్రప్రజలలో కలిగినది. ఇపుడు కాంగ్రెసు గెలువకపోయినచో విశాలాంధ్రము రాదను భావము ప్రబలెను. తెలంగాణమునుండికూడ చాలమంది కాంగ్రెసు నాయకులు ఐచ్ఛికసేవకులు వచ్చి ఆ ఎన్నికలలో మాకు చాలగా తోడ్పడిరి. కాంగ్రెసుఅధ్యక్షులగు ఢేబరుగారును, ప్రధానమంత్రి జవహర్లాల్‌నెహ్రూగారును, ఆ ఎన్నికలకు ప్రత్యేకముగ నియమింపబడిన ఎస్. కె. పాటిల్ గారును ఇతర కాంగ్రెసుపెద్దలును వచ్చి ఆంధ్రదేశములో ప్రచారముచేసిరి. అవతలివైపున అఖిలభారత కమ్యూనిస్టునాయకులందరు వచ్చి ప్రచారము చేసిరి. కాంగ్రెసుకును కమ్యూనిస్టులకును అతి తీవ్రపోరాటము జరిగెను. తెలంగాణములోను ఆంధ్రలోను కమ్యూనిస్టులు సాయుధవిప్లవము జరిపిం

చుట విదేశీపత్రికలను ముఖ్యముగ అమెరికాపత్రికలను బాగుగఆకర్షించినది. అమెరికాపత్రికలప్రతినిధులు అనేకసార్లు విజయవాడవచ్చి రా. కాం. ఆఫీసుకు, నావద్దకు వచ్చి ఎందువలన కమ్యూనిజము ఈ ప్రాంతములో ఇంతగా వృద్ధిచెందినదో తప్పేళ్లు తెలుసుకొనిపోవుచుండిరి. గంటలకొలది నావద్ద కూర్చొని తెలుసుకొనిపోవుచుండిరి. హైదరాబాదుకు కూడ పోయి తెలిసికొని తమపత్రికలలో ప్రచురించుచుండిరి. అందువల్ల 1955 ఎన్నికలలో అమెరికావారు గొప్ప ఆత్రత చూపినారు. ఈ ఎన్నికలలో కమ్యూనిస్టులే గెలుచుట కెక్కువ అవకాశము కలదనియు, ఆంధ్రయేగాక భరతవర్షము అంతయు కమ్యూనిస్టులతో చేరిపోవునేమోననియు అమెరికాలో కొన్ని ప్రధానపత్రికలు వ్యాసములు వ్రాసెను. అపుడు అమెరికాలో చదువుకొనుచున్న నా కుమారుడు మోహనరావు ఈ సంగతే నాకు వ్రాయుచుండెను. ఈ కాంగ్రెసు కమ్యూనిస్టు యుద్ధములో ఆంధ్రదేశము కురుక్షేత్రమయ్యెను. అందులో విజయవాడపట్టణము ఇందుకు ప్రధానకేంద్రమయ్యెను. ఇక్కడే ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు కార్యస్థానము, ఆంధ్ర కమ్యూనిస్టుకార్యస్థానము ఉన్నవి. కాంగ్రెసుజండా, కమ్యూనిస్టుజండా రెండును ఎగురుచున్నవి. ఈ యుద్ధము విజయవాడలో ప్రారంభమగుచున్నది. అఖిలభారత పత్రికా విలేఖరులే గాక అమెరికా, ఇంగ్లాండు, రిష్యా మొదలగు విదేశ పత్రికా ప్రతినిధులు కూడ విజయవాడలో కార్యస్థానమేర్పరచుకొని ఆంధ్రదేశమంతయు సంచారముచేసిరి. విజయవాడ దక్షిణ ఉత్తర నియోజకవర్గములలో ఆంధ్రఎన్నికలు ప్రారంభముకాగానే విదేశపత్రికావిలేఖరులు ఓటువేయుటకు వచ్చిన వేలకువేల స్త్రీ పురుషుల గుంపులను ఫొటోగ్రాపులు తీసి తమ పత్రికలకు పంపిరి. వందలకొలది కాదు వేలకొలది ముస్లిం ఘోషాస్త్రీలు రిక్షాలలోను కాలినడకను ముసుగులతో వచ్చి కాంగ్రెసుకు ఓటుచేయుట చూడదగిన దృశ్యము. కాంగ్రెసు బ్రతుకునా లేదా యనునది సమస్య. అటులనే ప్రతి ముఖ్యస్థలములోను ఆ ఎన్నికల దినములలో ఫొటోగ్రాపులు తీసుకొని పంపిరి. ఆంధ్రదేశము గొప్ప ఏనుగవంటిది. ఈ పర్యాయము కాంగ్రెసువైపుకు గాంధీవైపుకు మొగ్గినది. కమ్యూనిస్టులను వదలివైచినది. కాంగ్రెసుకు అఖండవిజయము కలిగినది. 196 మంది సభ్యులలో 147 మంది

కాంగ్రెసుసభ్యు లెన్నుకొనబడిరి. నేనుకూడ అటుల కాంగ్రెసుపక్షమున విజయవాడ దక్షిణనియోజకవర్గమునుండి ఎన్నుకొనబడినవాడనే. కమ్యూనిస్టులు 17 మంది మాత్రమే వచ్చిరి. 13 సోషలిస్టులు, 19 స్వతంత్రులు కూడ ఎన్నిక అయినారు. ఈ ఎన్నికలఅనంతరము బెజవాడ గోపాలరెడ్డిగారు ముఖ్యమంత్రిగ కాంగ్రెసుప్రభుత్వ మేర్పడినది. సంజీవరెడ్డిగారే తిరిగి డిప్యూటీ ముఖ్యమంత్రిగ చేయబడిరి. రొక్కం లక్ష్మీనరసింహందొరగారు స్పీకరుగ ఎన్నుకొనబడిరి. పిమ్మట 1956 నవంబరు 1 వ తేదీన ఆంధ్రప్రదేశ్‌రాష్ట్రమనుపేరుతో హైదరాబాదు రాజధానిగ నెటుల విశాలాంధ్రరాష్ట్ర మేర్పడినదో తెలుపుచు, ఆ విశాలాంధ్ర మహోద్యుద్యమ చరిత్రను రెండవసంపుటములో వివరించెదను.

(4)

ఆంధ్రోద్యమముయొక్క ముఖ్యసిద్ధాంతము ఆంధ్రభాషలో శాసననిర్మాణము, పరిపాలనానిర్వహణము, న్యాయవిచారణ జరుగుటయే గాక యావత్తు విద్యాబోధనము హైస్కూళ్ళలోను, కళాశాలలలోను కూడ ఆంధ్రభాషలోనే గరపుటకూడ అయియున్నది. అందువలన ఆంధ్రభాషలో సమస్త ఉత్తమవిద్యనిచ్చుటకుగాను ప్రత్యేకాంధ్రవిశ్వవిద్యాలయ మేర్పడవలెనని ఆంధ్రులు వాంఛించుచు తీర్మానములు చేసియున్నారని ఇదివరకే చెప్పియున్నాను. జస్టిసుపార్టీ ముఖ్యమంత్రి, ఆంధ్రనాయకులు, అంధ్రాభిమానులు పానుగల్లురాజా రామారాయణంగారు 1925 లో మద్రాసుశాసనసభలో ఆంధ్రవిశ్వవిద్యాలయపుబిల్లును ప్రవేశపెట్టి దానిని చట్టముచేయించిరి. ఈ చట్టప్రకారము విశాఖపట్టణము, రాజమహేంద్రవరము, అనంతపురములలో విశ్వవిద్యాలయకేంద్రములు నెలకొల్పబడెను. ఈ మూడుకేంద్రములలోను ఆనర్సు (Hons), ఎమ్. ఎస్. సి., (M. Sc.) రిసెర్చి (Research) డాక్టొరేటు (Doctorate) మొదలగునవి నేర్పబడును. మామూలు బి. ఏ., బి. ఎస్. సి., బి. కాం. తరగతులుకూడ అక్కడే యుండవలెను. మరి ఎచ్చటను ఉండరాదు. ఈ మూడుకేంద్రములలోనే కళాశాలవిద్యార్థులు నివసించుచు చదువుకొనవలెను. మిగిలినచోట్ల రెండవతరగతి కళాశాలలు మాత్రమే యుండగలవు. శాసనసభలో ఈ చర్చలు జరుగుచుండగా నేను,

గూడూరి లక్ష్మణరావు, దోర్బల శేషాద్రిశాస్త్రి. గులాంమొహిద్దీను, అడుసు మిల్లి గోపాలకృష్ణయ్యగారలు మద్రాసువెళ్ళి నాలుగవకేంద్రమునైనను బెజవాడ కిప్పించవలెనని జస్టిసుపార్టీనాయకులను, వారికి ప్రతిపక్షముగనున్న జాతీయపార్టీనాయకులనుకూడ అభ్యర్థించితిమి. ఆంధ్రదేశములోకెల్ల పెద్ద నగరమగు బెజవాడలో నెట్టి కేంద్రము లేకుండచేయుట మిగుల అనర్థకమని అందరికిని మనవిచేసితిమి. అపుడు కట్టమంచి రామలింగారెడ్డి, గుత్తి కేశవ పిళ్ళె, చింతలపాటి వెంకటనరసింహరాజుగారలు జాతీయపక్షపు నాయకులుగ నుండిరి. నాలుగవకేంద్ర మిచ్చుటకు పరిస్థితులు బాగుగ లేవని చెప్పి అధికారములోనున్న జస్టిసుపార్టీవారు ఒప్పుకొనలేదు. కాని జస్టిసుపార్టీ నాయకులైన రాజా రామారాయణంగారికి ఆంధ్రరాష్ట్రమేర్పడవలెనని, దానికి మద్రాసులో "కూమ్" నదికి ఉత్తరభాగమున రాజధాని యుండవలెనని, అటుల జరగనిచో బెజవాడపట్టణమే రాజధానిగ చేయబడవలెనని గట్టి యుద్దేశ్యముండెను. గావున వారు స్వయముగ బెజవాడలోనే ఆంధ్ర విశ్వవిద్యాలయపు కార్యస్థానమును నెలకొల్పునటుల సవరణపెట్టి మంజూరుచేయించిరి. దీనివలన బెజవాడలో కేంద్రము లేనప్పటికిని వైస్‌ఛాన్సలరు, రిజిష్ట్రారుల కార్యస్థానము, ఇతర ఆఫీసులు బెజవాడలోనే యుండగలవు. అతిత్వరితముగనే మరల చట్టమును సవరణచేసి నాలుగవకేంద్రమునుకూడ బెజవాడలోనే, అనగా విశ్వవిద్యాలయపు కార్యస్థాన మున్నచోటనే స్థాపించెదమనికూడ ఆయన శాసనసభలో వాగ్దానముచేసెను. కట్టమంచి రామలింగారెడ్డిగారు ప్రథమఉపాధ్యక్షుడుగ విశ్వ విద్యాలయము బెజవాడలో స్థాపింపబడినది. దానికొరకు కొన్నిగృహములు అద్దెకు తీసుకొనబడెను. బెజవాడలోని మ్యూజియము సెనేటుసభలకై వారికి వశపరచబడెను. మూడుసంవత్సరములు ఆంధ్రవిశ్వవిద్యాలయము బెజవాడలో నుండెను. నేనుకూడ సెనేటులో సభ్యుడుగనుంటిని.

1926 నవంబరునెలలో మరల శాసనసభల ఎన్నికలు జరిగినపుడు జస్టిసుపార్టీవారు ఓడిపోయిరి. కాంగ్రెసువారము నలుబదిరెండుమందిమి సభ్యులుగ ఎన్నుకొనబడితిమి, నేను కృష్ణాజిల్లానుండి కాంగ్రెసుపార్టీసభ్యుడుగ ఎన్నుకొనబడితిని. మేము మంత్రిపదవులను తీసుకొనుటకు విరాక

రించితిమి. అందువలన మూడవపార్టీగా ఎన్నికలలో గెలుపొందిన జాతీయ పార్టీనాయకులైన డాక్టరు సుబ్బరాయనుగారిని గవర్నరుగారు ముఖ్య మంత్రినిగావించిరి. ఆయన విద్యామంత్రిగకూడ పనిచేసెను. రంగనాధ మొదలియారు, ఆరోగ్యస్వామి మొదలియారు గారలు మిగత మంత్రులుగ నుండిరి. అపుడు ద్వంద్వప్రభుత్వముండెను. మిగిలిన ముగ్గురు ఎగ్జిక్యూటివు కౌన్సిలుగ నుండిరి. నేను 1927 లో బెజవాడను ఆంధ్రవిశ్వ విద్యాలయమునకు నాలుగవకేంద్రముగ గావించవలెనని యొక సవరణబిల్లును ప్రవేశపెట్టుటకు మద్రాసుశాసనసభకు నోటీసునిచ్చితిని. డాక్టరు సుబ్బ రాయనుగారిని నా బిల్లుకు మద్దతునిచ్చి మంజూరుచేయించవలెనని కోరితిని. ఆ బిల్లును నేను శాసనసభకు పంపకముందే ఉపాధ్యక్షులైన కట్టమంచి రామలింగారెడ్డిగారికి చూపించి వారిఅంగీకారమును పొందియేయుంటిని.కాని నాతో సుబ్బరాయనుగారు "ఇప్పుడే ఒక పావుగంటకుముందే రామలింగా రెడ్డిగారు నాతో వచ్చి మాట్లాడిపోయినారు. బెజవాడలో నాలుగవకేంద్రము నకు వారు ఇష్టపడుటలేదు. ఒక్కటే కేంద్రముండవలెనని, అది విశాఖపట్ట ణములోనే యుండవలెనని వారి అభిప్రాయమయియున్నది. కనుక మీబిల్లుకు నేనేమీ సహాయముచేయజాల" నని వారు నాతో చెప్పిరి. అనధికారబిల్లు నెగ్గుటకు సావకాశములేదని తలచి రామారాయణంగారితో. కూడ సంప్ర తించి నే నా బిల్లు నుపసంహరించుకొంటిని. రామలింగారెడ్డిగారికి నన్నా యన దగాచేసినట్లు వ్రాసితిని. ఆయన వెంటనే నా కొక జాబు వ్రాయుచు "తనయొక్క, విద్యామంత్రియైన డాక్టరు సుబ్బరాయన్ గారియొక్క ముఖ్య మైన అభిప్రాయము ఒకేకేంద్ర ముండవలెనని, అది చల్లగానున్నవాల్తేరులో నుండవలెననియు, కాని, అది సాగకపోయినచో తాను బెజవాడను అంగీక రించుటకు సిద్ధముగానున్నాననియు, అందుకు కృషిసలుపుమ" ననియు వ్రాసి నారు. అంతటిలో ఆ ప్రయత్నము మానివేసినాను.

అటుపిమ్మట మరల 1928 లో విశ్వవిద్యాలయపు మీమాంస బయలు దేరినది. ఆంధ్రవిశ్వవిద్యాలయపు కేంద్రములేని వట్టి కార్యస్థానమైన బెజ వాడలో పనిచేయుటకు రామలింగారెడ్డిగారి కిష్టములేదు. బెజవాడలో సెనేటు మందిరము, ఉపాధ్యక్షులకు, రిజిష్ట్రారుకు, ఆఫీసులకు సరియైన భవనములు

వెంటనే కట్టవలసియున్నది. ఇదంతయు శాశ్వతముగ ఏదోవిధముగ తేల్చు కొనుటకు డాక్టరు సుబ్బరాయనుగారితో ఆలోచనలుసలిపి విశ్వవిద్యాలయపు చట్టమును సవరణచేయించుటకు రామలింగారెడ్డిగారు నిశ్చయించిరి. కార్య స్థానములో నొక కేంద్ర ముండితీరవలయును. కేంద్రము లెన్నియుండ వలెననునది మరియొకసమస్య. ఈవిషయములో విశ్వవిద్యాలయపు సిండికేటుయొక్క అభిప్రాయమును కోరగ లక్కరాజు సుబ్బారావుగారి ప్రతిపాదనపైన బెజవాడలో నాలుగవకేంద్రము స్థాపించవలెనను తీర్మానము సిండికేటులో నేకగ్రీవముగ నంగీకరింపబడెను. దీనిని రామలింగారెడ్డిగారు కూడ నంగీకరించి ఈ తీర్మానమును మద్రాసుప్రభుత్వమునకు పంపిరి. కాని విద్యాశాఖాధికారులు, విద్యాశాఖకార్యదర్శి దీనిని వ్యతిరేకించిరి. నాలుగవకేంద్రము పెట్టుటకు తమకు ఇష్టములేదనియు, ఖర్చు చాల ఎక్కు వగుననియు, మూడుకేంద్రములు మాత్రమే యుండవలెననియు, రాజ మహేంద్రవరపుకేంద్రమును తీసి బెజవాడలో పెట్టినయెడల తమ కభ్యంత రములేదనియు, అటుల వీలుకానిచో బెజవాడలోనికార్యస్థానమును తీసుకొని పోయి రాజమహేంద్రవరములోనే పెట్టుట యుక్తమనియు గట్టిగా వ్రాసిరి. గనుక బెజవాడకును, రాజమహేంద్రవరమునకును పోటీ, ఘర్షణలు కలిగెను. ఇది రామలింగారెడ్డిగారికి యిష్టములేనిమాట వాస్తవమే. కాని గవర్నమెంటు నుంచి వచ్చిన తాకీదు కనుక దీనిని ఆంధ్రవిశ్వవిద్యాలయపు సెనేటుముందు పెట్టవలసివచ్చినది. రాజమహేంద్రవరమునుంచి న్యాపతి సుబ్బారావుపంతులు గారు, మద్దూరి అన్నపూర్ణయ్యగారు బయలుదేరి రాయలసీమకు పోయి రాయలసీమలోనున్న సెనేటుసభ్యులను కూడగట్టుకొని, అనంతపురమునకు విశ్వవిద్యాలయపుకార్యస్థానము నిచ్చునట్లు వాగ్దత్తముచేసి, సెనేటుసభలో అధికసంఖ్యాకులచేత రెండుకేంద్రములు మాత్రమే ఉండవలెననియు, అందులో నొకటి ఉత్తరసర్కారులలోని రాజమహేంద్రవరములోను, రెండవ కేంద్రము రాయలసీమలోని అనంతపురములోను ఉండవలెననియు, విశ్వ విద్యాలయపుకార్యస్థానము అనంతపురములో నెలకొల్పవలెననియు తీర్మా నముచేయించిరి. మేము ఎంతప్రయత్నముచేసినను ఓడిపోతిమి. ఈ తీర్మా నము మద్రాసుప్రభుత్వమునకు పంపబడెను. మద్రాసు విద్యాధికారులు దీని

నంగీకరింపక విశాఖపట్టణము, రాజమహేంద్రవరము, అనంతపురము, ఈ మూడు కేంద్రములుమాత్రమే యుండవలెననియు, ఆంధ్రవిశ్వవిద్యాలయపుకార్యస్థానమును రాజమహేంద్రవరమునకు మార్చుట తమకిష్టమే గాని, విద్యావిషయములో వెనుకబడియున్న అనంతపురమునకు మార్చుటకు తాము సమ్మతింపజాలమనియు అభిప్రాయమును తెలియపర్చిరి. అందుమీద వివిధరకములైన సవరణబిల్లులు శాసనసభలో ప్రవేశపెట్టబడెను. అన్ని బిల్లులను పరిశీలించి రిపోర్టువ్రాయుట కొరకు పెద్ద సెలెక్టుకమిటీని శాసనసభవారు నియమించిరి. దానిలో మేమందరము ఉంటిమి. చాలవరకు ఒకే కేంద్ర ముంటే మంచిదని, అక్కడే కళాశాలవుండవలెనని అభిప్రాయము వెలిబుచ్చబడినది. చివరకు సెలెక్టుకమిటీవారమందరము ఏకగ్రీవముగ యొకేకేంద్రముండవలెనని, అది అనంతపురములోనే యుండవలెననియు, అక్కడనే విశ్వవిద్యాలయపుకార్యస్థాన ముండవలెననియు తీర్మానించి రిపోర్టు పంపితిమి. మద్రాసుప్రభుత్వము దీనికి అంగీకరించలేదు. ఆ రిపోర్టు శాసనసభయెదుట ఆలోచనకువచ్చినపుడు అనంతపురమునకు బదులుగ ఆ కేంద్రము కార్యస్థానము రాజమహేంద్రవరములో నుండవలెనని ఒక సవరణను ప్రభుత్వమువారే శాసనసభయెదుట పెట్టిరి. అది గవర్నమెంటువారి సవరణ; గవర్నమెంటువారుపెట్టినసవరణ గెలుచుట నిశ్చయమని నేను భయపడి రాజా రామారాయణంగారివద్దకు పోయి వారి సలహాసహాయములతో వాయిదా ప్రయత్నముచేసితిని; మేము బెజవాడ మునిసిపాలిటి, గుంటూరుమునిసిపాలిటి, కృష్ణాజిల్లాబోర్డు, గుంటూరుజిల్లాబోర్డు, పశ్చిమగోదావరిజిల్లాబోర్డు, కొంతమంది జమీందారులు, వ్యక్తులు అందరుకలిసి- ఇరువై లక్షలరూప్యములను బెజవాడలోనే విశ్వవిద్యాలయ స్థాపన జరిగినయెడల ఇచ్చెదమని దస్కతులుచేయించి ప్రభుత్వమున కిచ్చినాము. బెజవాడలోనే స్థాపించవలెనని కోరినాము. అవసరమైనచో దానిని విచారించుటకు వాయిదావేయవలెనని కోరితిమి, డాక్టరు సుబ్బరాయనుగారు వాయిదావేయించుటకు ఒప్పుకొనిరి. అందుమీద ఆ బిల్లుయొక్క విచారణ వాయిదాపడినది. కాని కొన్నినెలలలోనే బెజవాడదురదృష్టవశమున పానుగల్లురాజా రామారాయణంగారు స్వర్గస్థులైనారు. ఆయన జీవించియున్న

న్నాళ్ళు బెజవాడలోనే ఆంధ్రవిశ్వవిద్యాలయస్థాపన జరుగవలెనని చాల పట్టు దలగనుండిరి. వారు మరణించినపిమ్మట మునిసిపాలిటీలు, జిల్లాబోర్డులు విశ్వవిద్యాలయస్థాపనకు ద్రవ్యసహాయము చేయకూడదని ప్రభుత్వమువా రొక జి. వో. ను పాస్‌చేసిరి. దానితో మేము విరాళాలిచ్చెదమన్న వాగ్దాన ములు రద్దయినవి. పిమ్మట రాజమహేంద్రవరమను పదమును తీసివేసి విశాఖపట్టణమనుపదమును సవరణగ చేర్చి సుబ్బరాయన్‌ప్రభుత్వమువారు సెలెక్టుకమిటీరిపోర్టుయొక్క విచారణను శాసనసభఎదుటికి తెచ్చిరి. అనగ ఒకేకేంద్రము. కార్యస్థానము రెండును విశాఖపట్టణములో (వాల్తేరులోనే) యుండవలెనని ఆ సవరణయుద్దేశ్యము. దానికి వ్యతిరేకముగ నేను, పిల్లల మర్రి ఆంజనేయులు. గొల్లపల్లి రాజాగారు రాజమహేంద్రవరమనుపదమును తీసివేసి విశాఖపట్టణము అనుటకుమారుగ బెజవాడ అని పెట్టవలె నని సవరణను ఇచ్చినాము. బొల్లిన మునుస్వామినాయుడుగారు, ఇంకా కొందరు జస్టిసుపార్టీసభ్యులు, మమ్ములను బలపరచిరి. కాని ప్రభుత్వము వారే విజయమునొందిరి. యావత్తు ఆంధ్రవిశ్వవిద్యాలయము వాల్తేరులోనే (విశాఖపట్టణములోనే) స్థాపింపబడవలెనని అధికసంఖ్యాకులచే మంజూరు చేయబడెను. ఆ వెంటనే బొల్లిన మునుస్వామినాయుడు, రంగనాథమొద ల్యారుగారు మొదలైనవారు కలసి రాయలసీమజిల్లాలనన్నిటిని ఆంధ్రవిశ్వ విద్యాలయమునుండి వేరుచేయవలెనని, బెజవాడనుంచికూడ చాల ఉత్తరము నకు తీసుకొనిపోవుచున్నారు కనుక, వాల్తేరులోని విశ్వవిద్యాలయములో తమ జిల్లాలుండజాలవనియు నొక సవరణను ప్రతిపాదించిరి. అప్పటికే రంగనాథ మొదల్యారుగారు మంత్రిపదవిని వదలుకొనియుండిరి. ఈ సవరణకు డాక్టరు సుబ్బరాయనుగారు అంగీకరించిరి. ఆంధ్రవిశ్వవిద్యాలయము రెండుభాగములుగ విభజింపబడుట శోచనీయమనియు, కార్యస్థానము ఎక్కడనున్నను అన్ని ఆంధ్రజిల్లాలు ఆంధ్ర విశ్వవిద్యాలయముక్రిందనే యుండవలెననియు, రాయలసీమజిల్లాలు విడిపోయి మద్రాసువిశ్వవిద్యాలయ ములోనే యుండుట శోచనీయమని నేను గట్టిగ వాదించితిని. నా వాదన అరణ్యరోదనమయ్యెను. మేము ఓడిపోతిమి. ఈ విధముగ ఆంధ్రవిశ్వ విద్యాలయము ఉత్తరసర్కారులకును నెల్లూరుజిల్లాకును పరిమితమై

వా_త్తేరులో నెలకొల్పబడినది. ఆ వెంటనే మామూలు బి. ఏ., బి. యస్. సి., బి. కాం. తరగతులు గల మొదటితరగతి కళాశాల బెజవాడలో నుండ వచ్చునను సవరణను నే నుపపాదించితిని. బెజవాడకొరకు నేను అడుగగ, కాంగ్రెసుపక్షసభ్యులైన మోతే నారాయణరావుగారు ఏలూరు కొరకు, జస్టిసుపార్టీసభ్యులైన వెంకటగిరికుమారరాజాగారు నెల్లూరుకొరకు అడిగినారు. సభవారు ద్రవ్యముంటే ప్రతిచోట మొదటితరగతి కళాశాలలు పెట్టుకొన వచ్చునని మంజూరుచేసినారు. ఆ కారణముచేతనే ఈ మూడుపట్టణముల లోనే కాక ఆంధ్రదేశములో పెక్కుచోట్ల మొదటితరగతికళాశాలలు అప్పటి నుంచి స్థాపింపబడినవి.

ఇటీవల ఆంధ్రరాష్ట్రమేర్పడి ప్రకాశంమంత్రివర్గ మేర్పడినతరువాత రాయలసీమజిల్లాలను, నెల్లూరుజిల్లానుచేర్చి ప్రత్యేకముగ తిరుపతిలో వెంక టేశ్వరవిశ్వవిద్యాలయమును స్థాపించిరి. కాని ముప్పదిసంవత్సరములపైగా అయినను ఇంతవరకును ఆంధ్రవిశ్వవిద్యాలయములో ఉత్తమవిద్యను ఆంధ్ర భాషలోనే గరపుట కెట్టిప్రయత్నము జరుగలేదు. 1937 లో రాజగోపాలా చారిప్రభుత్వము స్థాపితమైనపుడు ధైర్యముగ ఆరవఫారమువరకు హైస్కూ ళ్ళలో యావత్తువిద్య దేశభాషలలోనే నేర్పుట కేర్పాటుచేసిరి. అప్పటినుంచి ఆంధ్రజిల్లాలలో తెలుగులోను, అరవజిల్లాలలో అరవములోను స్కూల్ ఫైనలు, మెట్రిక్యులేషనువరకు యావత్తువిద్య నేర్పబడుచు, ఇంగ్లీషును రెండవభాషగ నేర్పుచున్నారు. ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమేర్పడినపిమ్మట ఆంధ్రప్రదేశ్‌లో మూడు విశ్వవిద్యాలయము లున్నవి. ఆంధ్రవిశ్వవిద్యా లయము, వెంకటేశ్వరవిశ్వవిద్యాలయము, హైదరాబాదులోని ఉస్మానియా విశ్వవిద్యాలయము. నైజాముపాలనలో ఉస్మానియా విశ్వవిద్యాలయ ములో యావత్తువిద్య ఉరుదుభాషలోనే నేర్పబడుచువచ్చినది. ఇంగ్లీషు రెండవభాషగమాత్ర ముండెను. నైజామురాష్ట్ర మంతరించగానే ఉస్మా నియా విశ్వవిద్యాలయములోకూడ ఉరుదూకుబదులు ఇంగ్లీషునే పెట్టినారు. ఈ మూడు విశ్వవిద్యాలయములలోను విద్యయావత్తు ఇంగ్లీషులోనే గరప బడుచున్నది. తెలుగు, ఉరుదుభాషలు ఐచ్ఛికస్థానమునుమాత్రము పొందినవి. నేను కొన్నిసంవత్సరములు ఆంధ్రవిశ్వవిద్యాలయ సెనేటులోను సిండికేటు

లోనుకూడ సభ్యుడుగ నుంటిని. కాని భాషవిషయమున నే నేమియు చేయ జాలకపోతిని. మద్రాసుప్రభుత్వమువారు రాష్ట్రీయూనివర్సిటీగ్రాంటుల కమిటీలో టి.ఆర్.వెంకట్రామశాస్త్రి,మామిడిపూడి వెంకటరంగయ్య, డాక్టర్ గురుస్వామి మొదలియార్లతోపాటు న న్నొకసభ్యునిగ నియమించిరి. మూడుసంవత్సరములు అందులో పనిచేసితిమి. పిమ్మట రాష్ట్రగ్రాంటుల కమిటీలు రద్దుపరచబడినవి. యావద్భారతదేశమున కొకకమిటీ కేంద్రప్రభుత్వముచే నియమింపబడి పనిచేయుచున్నది. దానికి ఇపుడు చింతామణిదేశముఖ్ గారు అధ్యక్షులుగ నున్నారు. కొన్నిసంవత్సరములకు పిమ్మట ఉయ్యూరురాజాగారు బెజవాడలో మొదటితరగతి కళాశాలను స్థాపించిరి. దానిని ఇటీవలనే ఆంధ్రప్రదేశ్ప్రభుత్వమువారు తమయాజన్యముక్రిందకు తీసుకొనియున్నారు. రోమనుకాథలిక్కు మిషనరీలుకూడ బెజవాడలో లయోలాకాలేజి యను మొదటితరగతి కళాశాలను స్థాపించియున్నారు. ఇపుడు ఆంధ్రప్రాంతములోను తెలంగాణములోనుకూడా ప్రతి జిల్లాలోను మొదటితరగతికళాశాల లున్నవి. హైదరాబాదు, తిరుపతి, గుంటూరు, ఏలూరులలో ప్రత్యేకముగా స్త్రీల మొదటితరగతి కళాశాల లున్నవి. కాని కళాశాలలన్నిటిలోనూ ఆంధ్రభాషలో నుత్తమవిద్య గరపవలెనను సమస్య పరిష్కారముకాకుండ నిలచియున్నది.

# 8 మహాత్మా గాంధీ నాయకత్వము

బెజవాడకు మహాత్మాగాంధీగారి ప్రథమఆగమనము—వారి నాయకత్వ స్వీకరణము – పంజాబు దురంతములు – లోకమాన్య తిలకుగారి మరణము – కలకత్తా ప్రత్యేక కాంగ్రెసు – బెజవాడకు గాంధీగారి ద్వితీయ ఆగమనము – గాంధీ విజయము – సౌర్జన్యరాహిత్య సహాయనిరాకరణము—మతం బాలసుబ్రహ్మణ్యగుప్త కేసు – నేను `లాయరువృత్తిని శాశ్వతముగ విసర్జించుట – బెజవాడ జాతీయపాఠశాల – కాశీ హిందూ విశ్వవిద్యాలయములో మొదటిహరిజనవిద్యార్థి.

## (1)

1919 సం॥ జనవరి 19 వ తేదీన రౌలటుకమిటీరిపోర్టు ప్రకటించ బడినది. బ్రిటిషుప్రభుత్వమువారి యుద్యోగస్థులకు అనుమానముగలవారి నెవరినైనను అరెస్టుచేసి విచారణలేకుండ ఎంతకాలమైనను జైలులోపెట్టుటకు అధికారమునిచ్చు శాసనమునుచేయుట అవసరమని ఆ రిపోర్టులో సిఫారసుచేయబడినది. ఆ సిఫారసుప్రకారము అట్టిబిల్లును శాసనసభలలో ప్రవేశపెట్టినచో తాను దేశమందంతట ప్రభుత్వముపైన సత్యాగ్రహమును సాగించెదనని మహాత్మాగాంధీగారు ప్రకటించినారు. గాంధీగారి బెదిరింపులను సరకుచేయక ప్రభుత్వమువారు ఫిబ్రవరి 6వ తేదీన భారత.కేంద్రశాసనసభలో రౌలటుబిల్లును ప్రవేశపెట్టిరి. దానిమీద సత్యాగ్రహముచేయువారిని సమకూర్చుకొనుటకై గాంధీగారు దేశమంతట సంచారముచేసిరి. ప్రతిచోటను జాతీయవాదులు గాంధీగారినాయకత్వముక్రిందికి చేరిరి. మహాత్మాజీ ఫిబ్రవరి నెలలోనే సికందరాబాదువచ్చి అక్కడ యుపన్యసించెను. అక్కడనుంచి విజయవాడకు వచ్చెను. వారు వచ్చుచున్నారని సికందరాబాదులోని మిత్రుల

వద్దనుంచి నాకు టెలిగ్రామువచ్చినది. నే నా మహాపురుషుని ఆ ఉదయము రైలుస్టేషనులో కలసి తీసుకొనిపోయి నా కతిథిగా నుంచుకొంటిని. అది నా మహద్భాగ్యము. ఆయన శుద్ధఖద్దరువస్త్రములను ధరించెను. బొంతల అంగరఖా తొడుగుకొని మార్వాడీతలగుడ్డ చుట్టుకొనెను. ఆ సాయంత్రము రామమోహనగ్రంథాలయపు ఆవరణలో సత్యాగ్రహమును ప్రబోధించుచు ఇంగ్లీషులో నుపన్యసించగ నేను తెలుగులోనికి అనువదించితిని. ఆయన కపుడు హృదయము చాల బలహీనముగనుండుటచే నొక కుర్చీలో రెండు మెత్తనిదిండ్లమీద కూర్చొని యుపన్యసించెను. ఆయన బిగ్గరగ మాట్లాడ లేదు. అపుడు దూరశ్రవణయంత్రములు లేవు. వచ్చిన రెండువేలమంది జనమునకు నేను బిగ్గరగా తెలుగులో చెప్పినాను. ఆయననోటినుండివచ్చిన మాటలు ప్రవక్తమాటలుగ నుండెను. నన్ను తన సత్యాగ్రహోద్యమములో చేరవలెనని ఆయన కోరెను. నేను సంతోషముతో ఎట్టి సంకోచముచూప కుండ చేరితిని. విజయవాడలో నింకెవరును చేరలేదు. ఆయన 1906 నుంచి దక్షిణాఫ్రికాలో భారతీయులకష్టముల నివారణకు గావించుచుండిన సత్యాగ్రహోద్యమమునుగూర్చి జాగ్రత్తగా చదువుచుంటిని. అపుడే తన యావదాస్తిని త్యజించి బ్రహ్మచర్యవ్రతమును స్వీకరించి ఆశ్రమవాసియై మానవోద్ధరణకు తనజీవితము నంకితముచేసెను. పిమ్మట హిందూదేశములో కైరాలోను, చాంపరానులోను జయప్రదముగా జరిపిన సత్యాగ్రహోద్యమములను గూర్చికూడ చదువుచుంటిని. ఆయన సర్వమతములను సమానముగా ఆదరించునట్టియు, కులమతభేదములను పాటింపక అస్పృశ్యతను రూపుమాపి మానవసమానత్వమును సోదరత్వమును స్థాపించుటకు కంకణముకట్టుకున్నట్టియు ఆధ్యాత్మికసంపన్నుడని నాకు అదివరకే తెలుసును. ఆయనయే భారతదేశరక్షకుడని స్వతంత్రమునుతేగల మహాపురుషుడని నాకు దృఢ విశ్వాస ముండెను. గావున ఆయన నావద్దకే వచ్చి నన్ను తనశిష్యులలో నొకనిగ చేర్చుకొనుట నా పూర్వజన్మసుకృతముగ భావించితిని. నేను వారికి వెంటనే సర్వవిధముల శిష్యుడనైనాను. వారిజీవితకాలమంతలోను వారున్న చోటుకు వెళ్ళినపుడు తప్పకుండ వారిదర్శనముచేసి సలహాలనుపొంది వచ్చుచుంటిని. వారు నన్ను మిగులదయతో నాదరించిరి. ఆయన నాకు ప్రియతము

డైన బాపు! అపుడును ఇపుడునుకూడ నేను వారికి అల్పుడనైన శిష్యుడను. గాంధీజీ ఆ రాత్రి రైలులో మద్రాసు వెళ్ళిరి.

గాంధీగారు విజయవాడకు వచ్చిన క్రిందటిరోజున నా పాతమిత్రులగు బిపిన్‌చంద్రపాలుగారు తన భార్యతోను, కూతురుతోను గుంటూరునుంచి బెజవాడ వచ్చి నా కతిథులుగ నుండిరి. వారికోరికమీద ప్రయాణపుఖర్చులు కూడ నిచ్చితిని. నాటి రాజకీయపరిస్థితులమీద ఆయన ఆ సాయంత్రం గొప్ప యుపన్యాసమిచ్చెను. ఆయన సుప్రసిద్ధ వక్త. గాంధీజీ మరునాడు విజయవాడ వచ్చుచున్నారని తెలిసి బందరు వెళ్లెను. గాంధీజీ వెళ్ళినమరు నాడు మరల విజయవాడ వచ్చి రెండవయుపన్యాసమిచ్చెను. గాంధీగారి సత్యాగ్రహమును ఖండించుచు మాట్లాడెను. ఆయన యుపన్యాసములో భాషాచమత్కృతి మాత్రమే బాగున్నది గాని కార్యక్రమమేమియు లేదు. అది యెవరికిని రుచించలేదు. బిపిన్‌చంద్రపాలుగారు బ్రిటిషువారికి క్షమా పణపత్రము వ్రాసియిచ్చి ఆంగ్లేయపత్రికలలో వ్యాసములు వ్రాయుచుండుట వల్ల ఆదివరకే నైతికబలమును, పలుకుబడిని గోల్పోయినాడు. మహాత్మా గాంధీజీమాటలు ఋషివాక్కులై ప్రజలహృదయముల చొచ్చుకొనెను. నేను గాంధీగారిశిష్యుడనైనానని, సత్యాగ్రహము చేయబోవుచున్నానని ఆయనతో ఏమాత్రము ఏకీభవించనని బిపిన్‌చంద్రపాలుగారితో నిష్కర్షగా చెప్పినాను. ఆరాత్రి వారిని కుటుంబసమేతముగా రైలు ఎక్కించి రాజ మహేంద్రవరముకు పంపినాను.

మహాత్మా గాంధీ మద్రాసు వెళ్ళి రౌలటుబిల్లుకు వ్యతిరేకముగ దేశ వ్యాప్తముగ సాగించవలసియున్న సత్యాగ్రహమునుగూర్చి యుపన్యసించిరి. హిందూపత్రిక సంపాదకులగు కస్తూరి రంగయ్యంగారు, ఆంధ్ర న్యాయవాద ప్రముఖులగు బారిస్టరు టంగుటూరు ప్రకాశంపంతులుగారు, మరి కొంత మంది జాతీయవాదులు గాంధీగారి సత్యాగ్రహోద్యమములో చేరిరి. అప్పటి నుండియు ముందుకు వచ్చి టంగుటూరు ప్రకాశంపంతులుగారు ఆంధ్ర కాంగ్రెసురాజకీయములలో నాయకత్వమువహించిరి. దక్షిణదేశయాత్రను ముగించి గాంధీగారు మరల అహమ్మదాబాదు చేరెను.



మహాత్మా గాంధీ

[ 1919 సం॥ లో విజయవాడ వచ్చినప్పుడు ]

(2)

1919 మార్చి 30 వ తేదీన భారతదేశమునందలి అన్నిప్రాంతముల లోను హరతాళములు జరిపి ఉపవాసములు, ప్రార్థనలుచేసి ఉత్సవములతో పోయి బహిరంగసభలలో రౌలటుబిల్లును ఖండించుచు తీర్మానములుచేయ వలెనని, సత్యాగ్రహాశపథములు పూనవలెనని ప్రకటించిరి. ఆ రోజును ఏప్రిల్ నెల 6 వ తేదీకి మార్చిరి. కాని ఆ సంగతి తెలియక మార్చి 30 వ తేదీననే ఢిల్లీనగరములో జాతీయవాదులు హరతాళము జరిపి ఊరేగింపుతో వచ్చుచుండగా సైనికులు తుపాకులుకాల్చి ప్రజలను చెదరగొట్టిరి. మరునాడు ఆర్యసమాజనాయకులగు శ్రద్ధానందస్వాములవారు మరియొక ఊరేగింపును తీసుకొనివచ్చుచుండ, దానిని ఆపివేయవలెనని సైనికాధికారులు ప్రయ త్నించగా స్వాములవారు లక్ష్యపెట్టక ముందుకు పోవుచున్నందున సైనికులు తుపాకులుకాల్చుటకు సిద్ధపడిరి. శ్రద్ధానందులవారు తన ఛాతీని చూపి ధైర్యముతో నిలచి తనమీద కాల్చవలసినదని సైనికులతో చెప్పగా వారు ధైర్యముచాలక నిశ్చేష్టులై యూరుకొనిరి. ఉత్సవము సాగిపోయి బహిరంగ సభ జరిగెను. ఢిల్లీలోనే మరియొకచోట ప్రజలయూరేగింపుమీద సైనికులు తుపాకులు కాల్చి చెదరగొట్టిరి. ఐదుగురు మరణించిరి. కొందరికి గాయ ములు తగిలెను. ఏప్రిలు 6 వ తేదీన దేశములోని చాలప్రదేశములలో ఉత్సవములు, సత్యాగ్రహసభలు జరిగెను. ఆంధ్రదేశములోని బెజవాడ, బందరు, గుంటూరు, రాజమహేంద్రవరములలో సభలుజరిగెను. ఈ సత్యాగ్రహోద్యమములో హిందువులును, ముసల్మానులును ప్రతిచోట ఏకమైనారు. బ్రిటిషుసామ్రాజ్యవాదులు తురుష్కజాతికి చేయుచున్న ఘోరా పకారములవలన భారతీయముసల్మానులకు బ్రిటిషుప్రభుత్వముపై ఆగ్ర హము కలిగినది. హిందూ, ముసల్మాను, సిక్కు ఐక్యత కలిగినచో ఇండి యాలో తమరాజ్యము పోవునని బ్రిటిషువారికి గొప్ప భయము. అట్టిఐక్యతను సర్వవిధముల విచ్ఛిన్నముచేయవలెను.నయమునచేయలేనిచో భయమునసైన చేయవలెను. అమృతసర్‌నగరములో కూడ ఏప్రిలు 6 వ తేదీన హరతా ళము, ఉత్సవము సత్యాగ్రహసభ జయప్రదముగా జరిగెను. హిందువులు

ముస్లిములు, సిక్కులు పాల్గొనిరి. ఆ వెంటనే హిందూనాయకులగు డాక్టర్ సత్యపాలును, ముస్లింనాయకులగు డాక్టరు కిచులూను జిల్లామేజిస్ట్రేటు కబురంపి పిలిపించి, ఎక్కడికో ప్రవాసమునకు పంపించెను. అది తెలిసి నగరములోనిప్రజలలో గొప్ప యాందోళనము కలిగెను. ప్రజలు గుంపులుగూడి ఉత్సవముగానేర్పడి జిల్లామేజిస్ట్రేటువద్దకు రావలెనని ప్రయత్నించగా వారిని సైనికులు అడ్డగించి జిల్లామేజిస్ట్రేటుతో మాట్లాడనివ్వలేదు. అందువల్ల ప్రజల కాగ్రహము హెచ్చి కొన్ని ప్రభుత్వభవనములను ధ్వంసము చేసిరి. అటులనే పంజాబులో ఇంకా రెండుమూడు పట్టణములలో జరిగెను. పంజాబుకుపోయి పరిస్థితులను శాంతింపచేయవలెనని మహాత్మాగాంధీ రైలులో బయలుదేరగా ఆయనను అరెస్టుచేసి మరల అహమ్మదాబాదులో విడిచిపెట్టిరి, ప్రభుత్వమువారు ప్రజలపైన పూర్తిగా కసితీర్చుకొనవలెనని, గొప్పభీతావహము కలుగచేసి మరల ఎన్నటికిని లేవకుండచేయవలెనని దృఢనిశ్చయులైరి. అమృతసరమును సైనికపాలనముక్రిందకు చేర్చిరి. సైనికాధికారులు ప్రజలపైనజరిపిన ఘోరకృత్యములకు మేరలేదు. జాతీయవాదులని అనుమానింపబడినవారినెల్ల పట్టుకొని హిందువులను, ముసల్మానులను కలిపి సంకెళ్ళువేసి వీధులలో త్రిప్పి. కొందరికి మరణశిక్షలను, కొందరికి యావజ్జీవశిక్షలను, చాలమందికి దీర్ఘకారావాసశిక్షలను విధించిరి. లాలా హరికిషన్‌లాల్ అను ధనవంతుడగు జాతీయవాదనాయకుడికి యావజ్జీవమైదుశిక్ష విధింపబడుటయేగాక 40 లక్షల కిమ్మత్తుగల ఆయనయావదాస్తిని ప్రభుత్వమువారికి చెందవలెనని తీర్పుచెప్పిరి. అమృతసరములోని బజార్లలో స్త్రీలను పొట్టలమీద దేకించిరి. విద్యార్థులను వేలమందిని ఏప్రిలునెల మండుటెండలో 18, 19 మైళ్ళు నడిపించిరి. కొరడాదెబ్బలు కొట్టిరి. తుదకు ఏప్రిలు 13 వ తేదీన జలియన్‌వాలాబాగ్ అను నొకదొడ్డిలో శాంతముగా బహిరంగసభ చేసుకొనుచున్న హిందూ, ముసల్మాను, సిక్కు స్త్రీలపైన పురుషులమీద పిల్లలమీద డయ్యర్ సేనాని తుపాకులను కాల్పించగా 1600 మంది హతులైరి. ఆ హతులైనవారికళేబరముల భస్మమునుండియే భారత స్వాతంత్ర్యోద్యమవృక్షము పుట్టి పెరిగినది. వీటికి పంజాబుదురంతములని పేరు. వీటివల్ల బ్రిటిషుప్రభుత్వమునందు ప్రజల కెక్కువ భయముకలిగి అణగిమణగి

యుందురని ప్రభుత్వమువారు ఆశించిరి. కాని అందుకు వ్యతిరేకమైన ఫలితమే కలిగినది. దేశమందంతటను గొప్ప రోషము, ఆగ్రహము, ఆవేశము దేశాభిమానము, ఇట్టిదురంతములు జరిపిన విదేశప్రభుత్వమును వెడలగొట్టి స్వరాజ్యసంపాదనచేయవలెనను దృఢదీక్ష కార్చిచ్చువలె వ్యాపించినది. తాను సత్యాగ్రహోద్యమము నపుడు సాగించినట్లయిన ప్రజల కింక నెక్కుడుగా కష్టములు కలుగుననియు, అంతేకాక సత్యాగ్రహమునకు కావలసిన శాంతియుత, అహింసాత్మక కార్యక్రమమునకు ప్రజ లింకను తయారుకాలేదనియు నెంచి మహాత్మా గాంధీగారు రౌలటుసత్యాగ్రహమును తాత్కాలికముగా నిలుపుదలచేసినామనియు, మరల నెపు డవసరమైన నపుడు అట్టి సత్యాగ్రహమును సాగింతుమనియు ప్రకటనచేసినారు. పంజాబుదురంతములు మిగతాచోట్ల తెలియకుండ ప్రభుత్వమువారు గట్టి బందోబస్తు చేసిరి. ఆ యుదంతములు పత్రికలలో ప్రచురింపబడకుండ నిషేధించిరి. కొంతకాలమునకు అంతయు బయటికివచ్చెను. అఖిలభారత కాంగ్రెసుకమిటీవారు సమావేశమై యిట్టిఘోరకృత్యములను సైనికోద్యోగులు జరిపినందుకు విచారణసంఘమును ప్రభుత్వమువారే నియమించవలెనని కోరిరి. కాంగ్రెసు కమిటీవారుకూడ మహాత్మా గాంధీ, చిత్తరంజనదాసు, మోతీలాలు నెహ్రూ, స్వామి శ్రద్ధానంద, పండిత మదనమోహనమాలవ్యా మొదలైన నాయకులతో యొక విచారణసంఘమును నియమించిరి. కొంతమంది నాయకులు ఇంగ్లాండుకు పోయి ఈ సంగతులనన్నిటిని బ్రిటిషుప్రముఖులకు తెలియపరచిరి. ప్రభుత్వపక్షమున విచారణచేయుట కొక కమిటీని నియమించవలసివచ్చెను. గవర్నరుజనరలు ఛెమ్సుఫర్డుప్రభువు హంటరుకమిటీ యనుదానిని నియమించిరి. హంటరుకమిటీఎదుట డయ్యరుసేనాని మొదలగు సైనికోద్యోగులు సాక్ష్యమిచ్చుచు తాముచేసినది సరియైనదేననియు, బ్రిటిషుసామ్రాజ్యమును కాపాడుటకు అది అవసరమైనదనియు చెప్పిరి. అపుడు మరణించిన కొందరిని కాల్చుటతోనే తనవద్దనున్న మందుగుండుసామాను అయిపోయినదనియు, ఇంకను తనవద్ద మందుగుండుసామానుండియున్నచో ఇంక నెక్కుడుమందిని కాల్చి చంపియుందుననియు డయ్యరుసేనాని సాక్ష్యమిచ్చెను.

1919 వ సంవత్సరాంతమున కాంగ్రెసుమహాసభ పండిత మోతీలాల్ నెహ్రూగారిఅధ్యక్షతను అమృతసర్‌లోనే జరిగెను. ఇన్ని దురంతములు బ్రిటిషుఉద్యోగస్థులచే చేయబడినను ప్రజానాయకులు, ప్రజలు నిరుత్సాహపడక అన్ని ఏర్పాట్లను చక్కగాచేసి కాంగ్రెసుమహాసభను జయప్రదము గావించిరి. ఆ మహాసభకు లోకమాన్య బాలగంగాధరతిలకు, అనిబిసెంటు, మహాత్మా గాంధీ, చిత్తరంజనదాసు మొదలైన నాయకులందరు హాజరైరి. మితవాదులు, అతివాదులు కలసి జరిపిన ఆఖరు కాంగ్రెసుమహాసభ అదియే. అంతటినుంచి అనిబిసెంటమ్మగారు కాంగ్రెసుకు ఎదురుతిరిగినది. మాంటేగ్యు - ఛెమ్సుఫర్డు సంస్కరణములను అంగీకరించి పనిచేయవలెనని ప్రజలను కోరినది. గాంధీగారి సత్యాగ్రహోద్యమము చాల అపాయకరమైన దని ప్రజలను నాశనముచేయునదిమాత్రమేనని తీవ్రముగా ఖండించినది. ఆమెయొక్క హోంరూలు లీగు విచ్ఛిన్నమైనది. వారిలో చాలమంది గాంధీగారిశిష్యత్వములోచేరిరి. కొద్దిమంది శిష్యులతో (National Home Rule League) జాతీయ హోంరూలు లీగును స్థాపించుకొని కొద్దికాల మాందోళన చేసినది. అతిత్వరితముగనే ఆమె భారతరాజకీయములనుంచి అదృశ్యురాలైనది. గాంధీగారి యుద్యమము వచ్చినతరువాత ఆంగ్లవనిత అనిబిసెంటమ్మయేగాక అదివరకు ఇంగ్లాండులో భారతదేశమిత్రులమని కపట నాటకమాడుచున్న లిబరల్, లేబరుపార్టీల సభ్యులెల్లరు భారతదేశమునకు సహాయపడుట మానుకొనిరి.

అప్పటికే బ్రిటిషుపార్లమెంటులో మాంటేగ్యు ఛెమ్సుఫర్డ్ సంస్కరణములబిల్లు మంజూరై శాసనముగావించబడినది. ఆ సంస్కరణములను అంగీకరించవలెనా, లేక తిరస్కరించవలెనా అను సమస్య తీవ్రముగ అమృతసర్ కాంగ్రెసుమహాసభఎదుటికి వచ్చెను. దీర్ఘమైన వాదోపవాదములు జరిగి తుదకు రాజకీయసంస్కరణములు చాలినవి కావనియు, అసంతృప్తికరమైనవనియు, ఆశాభంగకరమైనవనియు తీర్మానింపబడెను. కాని మహాత్మా గాంధీగారి ప్రతిపాదనమీద యీ సంస్కరణములలో నుంచియే సాధ్యమైనంత త్వరితముగ సంపూర్ణమైన బాధ్యతాయుతప్రభుత్వము స్థాపింపబడునట్లు వాటిని అమలుపరచవలెననియు, ఆ సంస్కరణముల నిచ్చుటలో

నెక్కుడుగ కృషిసల్పినందుకు ఇండియామంత్రి మాంటేగ్యుగారికి కాంగ్రెసు మహాసభ వందనములర్పించుచున్నదనికూడ తీర్మానముచివర చేర్చిరి. పంజాబు దురంతములను జరుపనిచ్చినందుకు, గవర్నర్ జనరలు ఛెమ్సుఫర్డుప్రభువును వుద్యోగమునుండి విరమింపచేసి ఇంగ్లాండుకు పిలిపించవలెనను తీర్మానము కూడ చేయబడెను. దానిని ఆంధ్ర మితవాదనాయకులగు బయ్యా నరసింహేశ్వరశర్మగారు ధైర్యముగా ఎదిరించినారు. అందుకు ప్రతిఫలముగా ఆయనకు 1920లో గవర్నరుజనరలు కార్యనిర్వాహకసభ్యత్వము లభించినది. పంజాబులోను, గుజరాతులోను ప్రభుత్వమువారు జరిపిన దురంతములను ఖండించుచు తీర్మానములుచేయబడెను. ప్రభుత్వమువారు నియమించిన హంటరుకమిటీలో స్వతంత్రులైన భారతీయులెవరును లేనందున వారిఎదుట సాక్ష్యమిచ్చుటకు కాంగ్రెసువారు నిరాకరించిరి. 1920 సం॥ మే 28వ తేదీన హంటరుకమిటీనివేదిక ప్రకటింపబడెను. దానిలో జనరల్ డయ్యరు మొదలగు సేనానులు గావించిన క్రూరకృత్యములన్నియు సమర్థించబడెను. జనరలు డయ్యరును ఆఖరుకు మందలించకపోగా ఆయన సామ్రాజ్య రక్షకుడని బ్రిటిషుప్రభుత్వము మెచ్చుకొన్నది. మిగత సేనానులందరు చేసినపనిని సమర్థించుచు శాసనముకూడ చేయబడెను. అంతేగాక డయ్యరుసేనాని గావించిన మహత్కార్యమున కాంగ్లేయులు సొమ్మువసూలుచేసి ఒక బంగారు ఖడ్గమును, మూడులక్షలరూప్యములను బహూకరించిరి. 1920 మార్చి 25 వ తేదీన కాంగ్రెసుకమిటీనివేదిక ప్రకటింపబడెను. పంజాబులో జరిగిన విషయములనన్నిటిని వివరించుచు ప్రభుత్వోద్యోగులు చేసిన దురంతములు తీవ్రముగా ఖండించబడెను.

ఏప్రిలు 6 వ తేదీనుంచి 13 వ తేదీవరకు దేశమందంతటను జాతీయ వారము జరుపవలెననియు పంజాబుదురంతములను ఖండించవలెననియు మహాత్మా గాంధీగారు ప్రకటించెను. యూరపుఖండములో తురుష్కదేశమును విభజించుచు ఆంగ్లేయులు మొదలగు మిత్రమండలివారి యాధిపత్యమును దానిమీద నెలకొల్పుచు తురుష్కసుల్తాను నొక కైదీవలెచేయుచు సెవరసుసంధి చేసికొనబడెను. సుల్తాను దానిమీద దస్కతుపెట్టెను. అందుమీద తురుష్కదేశములోని జాతీయవాదులు ముస్తఫా కెమాల్‌పాషా నాయ

కత్వముక్రింద గొప్ప జాతీయస్వతంత్రపోరాటమును సాగించుటకు తీర్మా నించిరి. దానివల్ల హిందూదేశములోని ముసల్మాను నాయకులగు మహమ్మ దాలి, షౌకతాలి, డాక్టరు అన్సారి మొదలైనవారును, మహాత్మా గాంధీగారును సంపూర్ణమైన సానుభూతిని ప్రకటించిరి. దానికి మనదేశములో ఖిలాఫతు ఉద్యమమని పేరు. హంటరుకమిటీ నివేదిక, క్రూరకృత్యములుచేసిన సేనా నులయెడ బ్రిటిషుప్రభుత్వమువారు చూపిన పక్షపాతము, ఖిలాఫతు అన్యాయ ములు, మహాత్మాగాంధీగారిని తన చారిత్రాత్మకమైన దౌర్జన్యరాహిత్య సహాయనిరాకరణోద్యమమును లేవదీయుటకు పురిగొల్పినవి. 1920 ఏప్రిలు 17 వ తేదీన మద్రాసులో ప్రథమపర్యాయము మహాత్మా గాంధీగారు, ముస్లిం నాయకులు కలిసి బిరుదులు, గౌరవోద్యోగములు, శాసనసభలు, ప్రభుత్వో ద్యోగములను బహిష్కరించుట మొదలు పన్నులనిరాకరణమువరకు జరుప వలసిన సహాయనిరాకరణోద్యమముయొక్క యావశ్యకతనుగూర్చి ప్రకటన గావించిరి. ఈ విషయములన్నియు విచారణచేయుటకు అఖిలభారతకాంగ్రెసు కమిటీవా రా సంవత్సరము సెప్టెంబరునెలలో కలకత్తానగరమునందు ప్రత్యేక కాంగ్రెసుమహాసభ జరుగవలెనని తీర్మానించిరి. లాలా లజపతిరాయ్‌గారి అధ్యక్షతక్రింద కలకత్తామహాసభ జరుపబడవలసియున్నది. ఈలోపల జులై 31 వ తేదీన లోకమాన్య బాలగంగాధరతిలకుగారు దేశమును దుఃఖసముద్ర మున ముంచి పరలోకగతులైరి. వారు అదివరకే కొంతకాలమునుంచి అస్వస్థతగానుండిరి. వారు మరణించకముందు కొద్దిరోజులక్రిందట మహాత్మా గాంధీగారు వెళ్ళి వారిని దర్శించివచ్చిరి. తిలకుగారు తన నైతికశక్తినంతను ఆ సమయమున గాంధీగారికి సంక్రమింపచేసెననియు భవిష్యత్తును నడుపు భారమును ఆయనకు వప్పగించెననియు తలచబడెను.

లోకమాన్య బాలగంగాధరతిలకుగారు బొంబాయిలో సర్దారుగృహమునం దుండగా జులై 12 వ తేదీనుండి వారికి చలిజ్వరము వచ్చుచుండెను. మిత్రులు కాశ్మీరుపోయి విశ్రాంతితీసుకొనవలెనని వారికి సలహానిచ్చిరి. కాని వా రందుకు ఒప్పుకొనలేదు. కొంత నెమ్మదించినటుల కనబడెను. జులై 20 వ తేదీ సాయంత్రము వారిమిత్రులైన చమన్‌లాల్‌గారితోకూడ కారులో తిలకుగారు షికారువెళ్ళిరి. వారికి ఆ రాత్రి తీవ్రముగా జ్వరమువచ్చెను.

సర్దారుగృహములో వారు పరుండియుండిరి. జులై 23 వ తేదీ వారిజన్మ దినము. వారికి ఆ రోజున అభినందనలు సమర్పించుచు అనేక టెలిగ్రాములు సందేశములు వచ్చినవి. జులై 26 నుండి వారి కుడిశ్వాసకోశము చెడినదని కనుగొనబడినది. జ్వరము ఎక్కువైనది. జులై 28 వ తేదీన కొంచెము జ్వరముతగ్గినట్లు కనబడినది.కాని ఆ మధ్యాహ్నము మరల వారికి పెద్దజ్వరము వచ్చి హృదయము బలహీనతను చూపసాగెను. ఆ సాయంత్రమునకు ఆయనకు స్పృహతప్పినది. సన్నిపాతజ్వరము వృద్ధియైనది. ఆయన అప స్మారకపుమాటలు మాట్లాడుచుండెను. ఆయన మాట్లాడుతున్న అసందర్భపు మాటలలో దేశసంగతులుతప్ప మరేమియు లేకుండెను. ఆవిధముగనే ఆయన జులై 31 వ తేదీవర కుండెను. ఆ రాత్రి ఆయనహృదయము మరింత బలక్షీణమై తుదకు తెల్లవారుఝామున 12 గంటల 50 ని॥ లకు ఆ స్వతంత్రోద్యమమహానాయకుడు ఈలోకమును విడచి పరమపదించిరి. వారి అకుంఠిత దేశాభిమానము, అఖండత్యాగము, అత్యున్నతనాయకత్వము, అనన్య ధైర్యసాహసములు, నిరుపమాన విజ్ఞానసంపద భారతదేశమునకు చిరస్థాయిగ, ఆదర్శములుగ నిలచియున్నవి.ఆయనకీర్తి శాశ్వతముగనున్నది. ఆయన మరణించెననువార్త తెల్లవారకమునుపే బొంబాయినగరమంతట వ్యాపించెను. ప్రజలకందరికిని తమ ప్రేమపాత్రుడయిన నాయకుడు మర ణించినందున వర్ణనాతీతమైన దుఃఖము, నిరాశ వ్యాపించినవి. ఉదయము ఏడుగంట లగునప్పటికి సర్దారుగృహమువద్ద వేలకువేలుప్రజలు గుమిగూడ సాగిరి. ఎనిమిదిగంటలకు హిందువులు, మునల్మానులు, పారశీకులు, క్రైస్త వులు, షాహుకారులు, కార్మికులు స్త్రీలు పురుషులు రెండులక్షలమంది చేరిరి. వారిశవమును దర్శించుటకు పోటీపడిరి. ఆయనశవముమీదపడిన పుష్ప గుచ్ఛములకు లెక్కలేదు. ఆయనను స్మశానమునకు తీసుకొనిపోవు ఉత్స వము ఆ మధ్యాహ్నము రెండుగంటలకు బయలుదేరెను. అది యొక మైలు న్నరపొడవుండెను. బొంబాయినాయకులేగాక మహాత్మాగాంధీ, షౌకతాలీ, డాక్టరు కిచ్లూ, జమునాదాస్ ద్వారకదాస్, జవహర్లాల్ నెహ్రూ, శంకర్‌లాల్ బ్యాంకర్‌గారలు మొదలగు నాయకులుకూడ వచ్చిరి. పూనానుంచి రెండు ప్రత్యేకరైళ్ళు వేయబడి వేలకొలదిజనులను తీసుకొనివచ్చెను. వారస్నేహి

తులు వారిదేహమునకు పూనానగరమునందు దహనసంస్కారము చేయవలె నని కోరిరి కాని బొంబాయినాయకులు ఒప్పుకొనలేదు. బొంబాయినాయకులు గవర్నరైన సర్ జార్జి లాయడ్‌కు మనవిచేసి సముద్రతీరముననున్న చౌపాతీరేవులోని ఇసుకప్రదేశములో వారిని దహనముచేయుటకు అనుమతి తెచ్చుకొనిరి. ఆయనశవము ఒకపల్లకీలో పూలమాలలతో అలంకరించబడి కూర్చొనపెట్టబడినది. ఆ పల్లకీని గాంధీ, షౌకతాలీ, కిచ్లూ, జవహర్లాల్ నెహ్రూ మొదలగు మహానాయకులు మోసుకొని త్రోవలో అనేకచోట్ల ఆపుచు పుష్పవర్షముల నందుకొనుచు చౌపాతీ ఇసుకప్రాంతమునకు తీసుకొనివెళ్లిరి. అక్కడ పార్శ్వవర్తకులు సమర్పించిన మంచిగంధపుచితిమీద దానిని పరుండబెట్టిరి, తులసీదామములు దానిపైవైచిరి. ఆయనకుమారుడు చితికి నిప్పుముట్టించెను. కొంతసేపటికి ఆయనశరీరము భస్మమైనది. ఆయనఆత్మ పరమపదమును చేరినది. అచట నొక తాత్కాలికసమాధిని నిర్మించిరి. పిమ్మట కొలదిసంవత్సరములకు ఆ ప్రదేశమున గొప్ప స్మారక స్తంభమునిర్మింపబడి లోకమాన్యునివిగ్రహము దానిమీద ప్రతిష్ఠింపబడినది. అది భారతీయులకేకాక ప్రపంచములో స్వతంత్రముకొరకు పోరాడు ప్రజలకందరికిని పుణ్యక్షేత్రమైనది. లోకమాన్య తిలకుగారు పరమపదించగనే మహాత్మాగాంధీయే భారతదేశమునకు ఏకైకనాయకుడయ్యెను. ఆయన షౌకతాలీగారిని వెంటబెట్టుకొని తాను సాగించదలచిన అహింసాయుత సహాయనిరాకరణోద్యమమునుగూర్చి ప్రబోధముగావించుటకు భారతదేశములో సంచారముచేసెను.

(౩)

మింటో మార్లే సంస్కరణములు 1909 లో వచ్చినవి. వాటిప్రకారము గోదావరి, కృష్ణా, గుంటూరుజిల్లాలనుంచి యొకస్థానము, మద్రాసు శాసనసభలో నివ్వబడినది. దానికి ఈ మూడుజిల్లాలలో మునిసిపలుసభ్యులుగా, జిల్లాబోర్డుల సభ్యులుగా 9 సంవత్సరముల కాలములో నెపుడైనను నున్నవారుమాత్రమే ఓటుచేయవలెను. ఇదివరకే మోచర్ల రామచంద్రరావు పంతులుగారు ఆ స్థానమునకు ఎన్నుకొనబడి సభ్యులుగానుండిరి. మూడు

సంవత్సరముల కాలపరిమితి ముగిసినందున నూతనఎన్నిక జరుగవలసి వచ్చినది. గుంటూరులో జాతీయవాదనాయకులుగానున్న కొండా వెంకటప్పయ్యగారిని నిలువవలెనని కౌతా సూర్యనారాయణరావు, నేను మొదలైన మిత్రులము ప్రోత్సహించితిమి. రామచంద్రరావుపంతులుగారు బెజవాడకు మాయింటికివచ్చి మరల తామే నిలచెదమనియు. తమకు బెజవాడలోనిఓట్లన్నియు నిప్పించవలెననియు నన్ను అడిగిరి. వారిపక్షమున ముట్నూరి కృష్ణారావుగారు బందరునుంచి వారితోకూడ వచ్చిరి. మా యింటిలో వారికి ఆ రాత్రి విందుచేసితిని. కాని ఓట్ల నివ్వజాలమని, కొండా వెంకటప్పయ్యగారిని నిలబెతామని ఖచ్చితముగా చెప్పితిని. కౌతా సూర్యనారాయణరావుగారు ఒక దరఖాస్తుఫారమును తెప్పించి, మేము బెజవాడలో ప్రతిపాదనచేసి, బలపరచగా వెంకటప్పయ్యగారిచేతకూడ దస్కతుచేయించి మద్రాసుకు పంపిరి. రామచంద్రరావుగారు నిలువలేదు. జస్టిస్‌పార్టీప్రముఖులు కూర్మా వెంకటరెడ్డినాయుడుగారు మాత్రమే నిలబడిరి. ఇరుపక్షముల ఓట్లకొరకై కొంత ప్రయత్నము జరుగుచుండగా వెంకటరెడ్డినాయుడుగారు మానుకొని ఇంగ్లాండుకు పోయిరి. వెంకటప్పయ్యపంతులుగారు మద్రాసు శాసనసభకు సభ్యుడుగా ఎన్నుకొనబడిరి. ఇంతలో 1919 లో మాంటేగ్యు చెమ్సుఫర్డు సంస్కరణలనబడెడి నూతన రాజకీయసంస్కరణములు వచ్చినవి. 1920 నవంబరులో ఎన్నికలు జరుగును. వాటిప్రకారము కృష్ణాజిల్లాకు నాలుగుస్థానములు. సాలుకు పదిరూపాయల శిస్తుచెల్లించే రైతులు ఓటర్లు. అప్పటికి ప్రస్తుతము కృష్ణాజిల్లాలోనున్న తొమ్మిదితాలూకాలేగాక ప్రస్తుతము పశ్చిమగోదావరిజిల్లాలో నున్న తాలూకాలన్నియు కృష్ణాజిల్లాలోనే చేరియుండెను. 1924 వ సంవత్సరములో కృష్ణాజిల్లాలోనుండి పశ్చిమగోదావరి వేరుచేయబడెను. అందువల్ల ఆ పెద్ద కృష్ణాజిల్లాకంతకు నలుగురు సభ్యుల నెన్నుకొనవలసియుండెను. బెజవాడలోను. ఏలూరులోను, భీమవరములోను కాంగ్రెసువారలు సభలుచేసి ప్రజాభిప్రాయము తెలుసుకొని నన్ను, గంపలగూడెం కుమారరాజా కోటగిరి వెంకటకృష్ణారావుగారిని, పెద్దాడ సాంబశివరావుగారిని, బడేటి వెంకట్రామయ్యనాయుడుగారిని ఆ నాలుగు స్థానములకు అభ్యర్థులుగా నిర్ణయించిరి. అందులో పెద్దాడ సాంబ

శివరావు, బచేటి వెంకట్రామయ్యనాయుడుగారలు ఏలూరులో న్యాయవాదులు. నేను బెజవాడలో న్యాయవాదిగ నుంటిని. కోటగిరి వెంకటకృష్ణారావుగారు తిరువూరుతాలూకా గంపలగూడెంఎస్టేటు జమీందారిణిగారి దత్తపుత్రుడు. దేశాభిమానపూరితములైన నాటకములను వ్రాసెను. ఈవిధముగ మమ్ముల నభ్యర్థులుగ పెట్టుటవల్ల నేను కృష్ణాజిల్లాయంతయు సంచారముచేసి మా నలుగురి అభ్యర్థిత్వములను బలపరచుచుంటిని. మాకు వ్యతిరేకముగ మిత వాదులును, జస్టిసుపార్టీవారును నిలచిరి.

ఇటుల ప్రచారముచేయుచు కొవ్వూరుతాలూకామహాసభను జరిపి యందులో నేను పాల్గొని మా అభ్యర్థిత్వములను గట్టిగా బలపరచుకొని విజయవాడ వచ్చితిని. ఆ మరునాడే మహాత్మాగాంధీ, షౌకతాలీగారలు విజయ వాడకు విచ్చేసి నా కతిథులుగా నుండిరి. వా రుభయులును చెన్నపట్టణము నుంచి కలకత్తాలో సెప్టెంబరు 4 వ తేదీనుంచి జరుగబోవుచున్న ప్రత్యేక కాంగ్రెసుమహాసభకు పోవుచు,త్రోవలో విజయవాడలోనాగుచున్నామని నాకది వరకే తెలిపియుండిరి. నేను వారిని విజయవాడ రైలుస్టేషనులో, బచ్చికబళ్లు లతో వెళ్ళి స్వాగతమిచ్చి తీసుకొనివచ్చి మునిసిపలు రహదారిబంగళాలో బస చేయించితిని. ఆ రహదారిబంగళా అపుడు పాతబస్తీలో టెలిగ్రాఫ్ఆఫీసుకు పడమరవైపున, దరిమిలా పెద్దమార్కెటు కట్టబడియున్నచోట యుండినది. అందులో ఆ మహానాయకు లిరువురును బసచేసిరి. శ్రీమాన్ చక్రవర్తుల రాజగోపాలాచార్యులుగారు కూడ మద్రాసునుంచి వారితో వచ్చిరి. కాని ఆ రహదారిబంగళాలో బసచేయక బెజవాడ రైలుస్టేషనులో విశ్రాంతిగదిలో బసచేసిరి. మహాత్మాగాంధీగారు బెజవాడవచ్చుచున్నారనువార్త ఉత్తరముల ద్వారాను, టెలిగ్రామ్‌లద్వారాను ఆంధ్రదేశములోని వివిధపట్టణములలో నున్న నాయకులకు, ప్రముఖులకు నేను తెలియపర్చితిని. బరంపురం మొద లుకొని నెల్లూరువరకు వివిధజిల్లాలనుండి చాలమంది వచ్చిరి. అయిదువేల జనులు ఆ సాయంత్రం జరిగిన బహిరంగసభలో పాల్గొనిరి. అది రహదారి బంగళాయొక్క పెద్దయావరణలోని జమ్మిచెట్టుక్రింద జరిగినది. కొద్దిగా చినుకులుపడ్డవి. అయినను సభ మిగుల జయప్రదముగా జరిగినది. బందరు నుంచి ముట్నూరి కృష్ణారావుగారు, చెఱుకువాడ నరసింహంగారు వచ్చిరి.

కాని భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు రాలేదు. గుంటూరునుంచి కొండా వెంకటప్పయ్యపంతులుగారు సీతారామశాస్త్రిగారు రాలేదు; ఉన్నవ లక్ష్మీ నారాయణగారు వచ్చిరి. టంగుటూరి ప్రకాశంపంతులుగారు చెన్నపట్టణములో గాంధీగారిని దర్శించియుందురు. బెజవాడకు రాలేదు. ఆమహాసభలో మహాత్మాగాంధీగారు భావోద్రేకపూరితమైన యుపన్యాసములో పంజాబు దురంతములవల్ల కలిగిన జాతీయావమానమును బాపుకొనుటకును, మనతోడి ఆసియాఖండదేశమైన తురుష్కదేశమునకు జరిగిన అన్యాయమునకు ప్రతిఘటనము చేయుటకును, భారతదేశమునకు స్వరాజ్యసంపాదనముకొరకును తాను కలకత్తాలో జరుగబోవుచున్న ప్రత్యేకమహాసభలో దౌర్జన్యరాహిత్య సహాయనిరాకరణమును ప్రతిపాదించబోవుచున్నానని చెప్పి, ఆ సహాయనిరాకరణోద్యమముయొక్క తబ్సీళ్ళను సెలవిచ్చిరి. బిరుదులను, గౌరవోద్యోగములను విసర్జించుట, శాసనసభలను బహిష్కరించుట, ప్రభుత్వపాఠశాలలను, కళాశాలలను విద్యార్థులు వదలిపెట్టుట లాయర్లు కోర్టులను బహిష్కరించుట, ప్రభుత్వోద్యోగములకు సైనికోద్యోగములకు రాజీనామాలిచ్చుట, శాసనములను ధిక్కరించుట, తుదకు పన్నులనిరాకరణము అను పనులను కొన్ని మెట్లుగా ప్రజలు చేయవలసియున్నదనిరి. ఇవి సత్య అహింసా యుతముగనే చేయవలెనని వారు వివరించిరి. మహాజనమున కంతకును చాల యుత్సాహముగ నుండెను. వారి యుపన్యాసముముగిసినతరువాత మహాత్మాజీ నన్ను దగ్గరకుపిలిచి మీరు నేను చెప్పినదానితో ఏకీభవించుచున్నారా? అటులైనచో మీరు కృష్ణామండలమునుండి మద్రాసుశాసనసభకు సభ్యులుగ పోదలచి ప్రచారముచేయుచున్న అభ్యర్థిత్వాన్ని వదలుకొనెదరా? యని నన్ను ప్రశ్నించిరి. నేను మారుమాటాడకుండ "నా అభ్యర్థిత్వమును తమ పాదములకడ విసర్జించితిని. తమతో నేను పూర్తిగ ఏకీభవిస్తున్నాను. తమ శిష్యత్వాన్ని మనసారా అంగీకరించుచున్నాను. నేను, నా మిత్రులుకూడ వచ్చి కలకత్తా కాంగ్రెసుమహాసభలో తమపక్షమునకు బలమును కలుగచేస్తాము" అని మనవిచేసితిని. నా ముఖ్యమిత్రులైన మహమ్మదు గులాం మొహిద్దీన్ సాహెబుగారు మొదటితరగతి గౌరవమేజిస్ట్రేటుగ నుండిరి. నాతోపాటు తాముకూడ ఆ గౌరవోద్యోగమును వదలుకొనెదమని ప్రకటించిరి. అపుడు

శ్రీమాన్ చక్రవర్తి రాజగోపాలాచారిగారుకూడ నచటనే యుండిరి. ఆంధ్ర దేశములో మహాత్మాగాంధీగారి దౌర్జన్యరాహిత్య సహాయనిరాకరణోద్యమము ననుసరించి శాసనసభఅభ్యర్థిత్వమును, మొదటితరగతి గౌరవమేజిస్ట్రేటుపద విని వదలుకొన్నవారము అప్పటికి మేమిద్దరమే. ఈసంగతి మహాత్మాగాంధీ గారు ఆసభలో గుమికూడిన వేలాదిప్రజల కరతాళధ్వనులమధ్య ప్రకటించిరి. తమ 'యంగ్ ఇండియా' పత్రికలోకూడ వ్రాసిరి. అంతటితో నేను శాసన సభకుపోవు ప్రయత్నమును విరమించుకుంటిని. మహాత్మాగాంధీగారి సహాయ నిరాకరణోద్యమములో చేరిపోతిని. ఇటీవల నా 78 వ జన్మదినోత్సవము విజయవాడపౌరులు కోలాహలముగా జరిపినపుడు ఒక యాశీర్వచనపులేఖను పంపుచూ నా పూజ్యమిత్రులగు శ్రీమాన్ చక్రవర్తుల రాజగోపాలాచార్యులు గారు ఒకమాటనే ఆ లేఖలో వ్రాసిరి. "1920 ఆగస్టునెలాఖరున మహాత్మా గాంధీగారు, నేను దౌర్జన్యరాహిత్య సహాయనిరాకరణోద్యమములో చేరవలసి నదని మిమ్ముల నడుగగా ఒక్కక్షణమైన సంకోచములేకుండ మీరు చేరి నారు. అది నా కిప్పటికిని కన్నులయెదుట కనపడుచున్నది." అని మిక్కిలి ప్రేమపూర్వకముగ వ్రాసిరి. తెల్లవారుఝామున మద్రాసునుంచి కలకత్తాకు పోయే మెయిలుబండిలో ఆ ముగ్గురు మహానాయకులను ఎక్కించి సెలవు తీసుకొని యింటికి వచ్చితిని. ఆ మరునాడే నేను గులాం మొహిద్దీన్ సాహెబుగారును కొంతమంది మిత్రులము బయలుదేరి కలకత్తా వెళ్ళి తిమి. అదివరకే బెజవాడలో కాంగ్రెసుకమిటీతోపాటు ఖిలాఫతుకమిటీ కూడ స్థాపించబడియుండెను. దానికి గులాంమొహిద్దీను సాహెబుగా రధ్యక్షు లుగనుండిరి.

నన్ను కలకత్తాలో దేశభక్త కొండా వెంకటప్పయ్యపంతులుగారు కలవటంతోటే "నాతో సంప్రతించకుండగనే, నాతో చెప్పకుండగనే మీరు మీ శాసనసభ అభ్యర్థిత్వమును విసర్జించినారేమి?" అని నన్ను అడిగినారు. వెంకటప్పయ్యపంతులుగారికి యావజ్జీవితములో సీతారామశాస్త్రిగారియందు, నాయందు ఎక్కువ నమ్మకము, ప్రేమ యుండెను. సాధారణముగ నన్ని విషయములను సంప్రతించుకొనియే చేసేవారము. గాని ఇది అటువంటి మామూలువిషయముకాదు గావున "మహాత్ములవారే నూతనోద్యమమును

సాగించదలచి నన్నందులో చేరవలెనని కోరినపుడు మిమ్ము సంప్రదించు టకు అవకాశము లేకపోయినది. తామును కూడ వెంటనే సంకోచము పెట్టుకొనక ఈ మహోద్యమములో చేరండి" అని జవాబుచెప్పినాను. గాని వారందుకు అప్పటికి వ్యతిరేకముగ నున్నారు.

(4)

. సెప్టెంబరు నాలుగవతేదీనుంచి ప్రత్యేక కాంగ్రెసుమహాసభ ప్రారంభ మయ్యెను. లాలా లజపత్‌రాయ్‌గారు అధ్యక్షతవహించిరి. ముందుగా విషయనిర్ణయసభ జరిగెను. నేను అఖిలభారత కాంగ్రెసుకమిటీ సభ్యుడుగ నుండుటచే విషయనిర్ణయసభలో సభ్యుడుగ పాల్గొంటిని. మహాత్మా గాంధీగారు ప్రతిపాదించిన దౌర్జన్యరాహిత్య సహాయ నిరాకరణమును మహాసభ అంగీకరించవలెనా, లేదా యనువిషయ ములో ప్రచండమైన వాదోపవాదములు జరిగెను. అభిప్రాయభేదములు అతి తీవ్రముగానుండెను. మితవాదులు ఆ సభకు రానేలేదు. జాతీయవాదులలోనే గొప్ప భేదాభిప్రాయములు ప్రస్ఫుటమయ్యెను. అప్పటికి లోకమాన్య బాల గంగాధరతిలకుగారు స్వర్గస్థులైరి. వారిక్రిందను, లాలా లజపత్‌రాయ్, చిత్త రంజన్‌దాసు మొదలైన జాతీయవాదనాయకులక్రిందను తీవ్రముగా బ్రిటిషు ప్రభుత్వమునకు వ్యతిరేకమైన విమర్శనలు, ఖండనలు జరుగుచుండెను. అనేక మంది జాతీయవాదులను బ్రిటిషుప్రభుత్వమువారు జైళ్లలో పెట్టుటయు, నిర్బంధములలో నుంచుటయు జరుగుచుండెను. స్వరాజ్యము కావలయు ననెడి తీవ్రవాంఛ జాతీయవాదులలో ప్రబలియుండెను. కాని స్వరాజ్యము సంపాదించుటకు ఒక నిర్దుష్టమైన కార్యక్రమము, విస్పష్టమైనసాధనమును జాతీయవాదనాయకులెవరును ప్రతిపాదించియుండలేదు. విదేశప్రభుత్వ ముపై వ్యతిరేకతను, తిరుగుబాటుభావమును యువజనులలో లేవదీసిరి. కాని విదేశప్రభుత్వమును వెడలగొట్టుసాధనములను స్పష్టముగ నిర్ణయించినవారు లేరు. ఒకవైపున చాలమందియువకులు అరాజకవాదులలో చేరి బాంబులు వేసి, తుపాకులను కాల్చి విదేశస్థులను, ప్రభుత్వోద్యోగులను హత్యలు గావించి స్వతంత్రమును సంపాదించవలెనను ఉద్యమము సాగుచున్నది.

దానికి కాంగ్రెసుమహాసభకు నెట్టి సంబంధములేదు. కాంగ్రెసుపక్షమున మరియొక నిర్దుష్టమైన కార్యసాధనము నిర్ణయింపబడలేదు. అందువల్ల అది వరకే దక్షిణాఫ్రికాలోను, కైరోలోను, చాంపరానులోను సత్యాగ్రహసాధనముచే దిగ్విజయమునుపొంది ప్రపంచములో పేరుప్రతిష్ఠలు సంపాదించిన మహాత్మా గాంధీ సత్యాహింసలతోకూడిన సహాయనిరాకరణోద్యమును స్వరాజ్యసంపాదనకు నిర్దుష్టమైనసాధనగా నుపయోగించదలచినపుడు జాతీయవాదులలో చాలమంది ముఖ్యముగ యువజనులు ఆయనయొక్క కార్యక్రమముచే నాకర్షింపబడి, ఆయననాయకత్వ మంగీకరించి, ఆయన సాగింపతలపెట్టిన విధానమును అవలంబించుటలో నెట్టి ఆశ్చర్యము లేదు. అంతేగాక తోడి ఆసియాదేశీయులగు తురుష్కప్రజలకు సెవరసుసంధినంటగట్టి మిత్రమండలివారు చేసిన ఘోరమైన అన్యాయములను, అవమానములనుకూడ దానితో జతపరచుటవలన ఆయన భారతదేశ స్వతంత్రముమాత్రమే గాక ఆసియాఖండములోని మిగతాదేశముల స్వతంత్రమునుకూడ సంపాదించవలెనను దీక్షగల మహాపురుషుడని స్పష్టపడినది. భారతదేశములోని ముసల్మానులందరును ఆయనపతాకముక్రింద చేరినారు. అందువల్ల కలకత్తా ప్రత్యేకకాంగ్రెసులో వాదోపవాదములు చెలరేగినను జాతీయవాదనాయకులైన విఠల్‌భాయ్ పటేలు, చిత్తరంజన్‌దాసు, లాలా లజపతిరాయ్, కస్తూరి రంగయ్యంగారు, టంగుటూరు ప్రకాశంపంతులు, కొండా వెంకటప్పయ్య, ఎస్. శ్రీనివాసయ్యంగారు మొదలైనవారు తీవ్రముగ ప్రతిఘటించినను మహాత్మాగాంధీగారి ప్రతిపాదనమే విషయనిర్ణయసభలోను, కాంగ్రెసు మహాసభలోను నెగ్గినది. ఆంధ్రనాయకులగు పట్టాభి సీతారామయ్యగారు విషయనిర్ణయసభలో ఓటుచేయక తటస్థముగానుండి మహాసభకు హాజరు కాకనే వెళ్ళిపోయిరి. ఆ సభకువచ్చిన ఆంధ్రులలో నేను, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, బులుసు సాంబమూర్తి, గొల్లపూడి సీతారామశాస్త్రి, దండు నారాయణరాజు, ఆత్మకూరి గోవిందాచార్యులు, పేట బాపయ్య, గంపలగూడెం కుమారరాజా కోటగిరి వెంకటకృష్ణారావు మొదలైనవారమంతా మహాత్మా గాంధీగారి పక్షముననే నిలచితిమి. శ్రీమాన్ చక్రవర్తుల రాజగోపాలాచారి, మోతీలాల్‌నెహ్రూ, రాజేంద్రప్రసాద్, వల్లభాయ్ పటేల్, మహమ్మదాలీ

షౌకతాలీ, డాక్టరు అన్సారీ, హకీం అజ్మల్ ఖాన్, అబ్దుల్ కలాం ఆజాద్ మొదలైన నాయకులంతా మహాత్మాగాంధీగారిని బలపర్చిరి.

ఈ ప్రత్యేకకాంగ్రెసులో దౌర్జన్యరాహిత్య సహాయనిరాకరణతీర్మానము కొద్దిమెజారిటీతో ఆమోదింపబడినను కాంగ్రెసునాయకులెల్లరును దానిని హృదయపూర్వకముగ శిరసావహించి వెంటనే అమలుజరిపిరి. సెప్టెంబరు 9 వ తేదీన కలకత్తా కాంగ్రెసుమహాసభ ముగిసినది. వివిధరాష్ట్రముల లోని కాంగ్రెసునాయకులంతా శాసనసభలలోని తమ అభ్యర్థిత్వములను వదలిపెట్టిరి. నవంబరులో జరుగు శాసనసభ ఎన్నికలలో ఓటర్లు ఎవరికిని ఓటుచేయకుండ నుండుటకును, బాలెటుపెట్టెలలో ఓటుపడకుండ ఖాళీపెట్టెలే పంపుటకును తీవ్రముగ కృషిసలిపిరి. కాంగ్రెసువారు ఇదివరకే శాసనసభ్యులుగనున్నచోట్ల శాసనసభాసభ్యత్వములకు రాజీనామా నిచ్చిరి. కొండా వెంకటప్పయ్యపంతులుగారు మద్రాసుశాసనసభలో సభ్యుడుగా నుండెను. మేమందరము వెళ్ళి పట్టుబట్టి ఆయనచేత శాసనసభాసభ్యత్వమును వదలుకొనునట్లు చేసితిమి. గుంటూరులో కొంతమంది లాయర్లు తమవృత్తులనుత్యజించి సహాయనిరాకరణోద్యమములో తీవ్రముగ పనిచేయుటకు ముందుకువచ్చినచో, కొండా వెంకటప్పయ్యగారు తాను తనసభ్యత్వమును విడచిపెట్టెదనని చెప్పినమీదట ఉన్నవ లక్ష్మీనారాయణ, పోలిశెట్టి హనుమయ్యగుప్త, నడింపల్లి వెంకటలక్ష్మీనరసింహారావు, గొల్లపూడి సీతారామశాస్త్రి, మాడభూషి నరసింహాచార్యులుగార్లు మొదలైన కొందరులాయర్లు తమవృత్తులను విడచిపెట్టిరి. వారిలో కొందరు శాశ్వతముగ తమవృత్తులను త్యజించిరి. మరికొందరు ఒకసంవత్సరముకాగానే మరల వృత్తులలో చేరిరి. వెంకటప్పయ్యపంతులుగారు అదివరకే ఐదుసంవత్సరములక్రిందట ప్లీడరీవృత్తిని శాశ్వతముగ వదలిపెట్టియుండిరి. ఇపుడు శాసనసభాసభ్యత్వమునకురాజీనామా నిచ్చి బాలెటుపెట్టెలలో ఓట్లు వేయవద్దని బోధించుటకై జిల్లాలలో సంచారం చేసిరి. మేమందరము ఎవరిజిల్లాలలో వారు బహిరంగసభలుచేసి సహాయనిరాకరణోద్యమమును బోధించి నవంబరునెలలో జరిగే ఎన్నికలలో ప్రజలు పాల్గొనవద్దని, ఓట్లువేయవద్దని ప్రబోధముగావించితిమి. అనేక పోలింగులలో ఖాళీపెట్టెలు పైకి పంపబడెను. ప్రజలు కాంగ్రెసుచేసిన సహాయ

నిరాకరణతీర్మానముపట్ల విశేషముగ ఉత్సాహమును చూపిరి. వారికి మిత వాదులయందుకాని జస్టిసుపార్టీవారియందుకాని ఎట్టి నమ్మకము లేదు. కాంగ్రెసుసంస్థయే, ముఖ్యముగ దానికి నాయకత్వమువహించిన మహాత్మా గాంధీయే దేశస్వతంత్రము తెచ్చునని వారికి బాగుగ నమ్మకము కలిగినది. కాంగ్రెసువాదులు శాసనసభలకు పోకున్నందున కొద్దిఓట్లతో నెగ్గి మితవాదు లున్నూ, జస్టిసుపార్టీవారున్నూ శాసనసభలను నింపిరి. శాసనసభలలో యే స్థానము ఖాళీగనుండలేదు. కాని ప్రజలకుమాత్రము అట్టిశాసనసభలయందు విముఖత్వమే కలిగినది. 'కాంగ్రెసుకు జై' 'మహాత్మాగాంధీకి జై' అను నినాదములు దేశములోని అన్నిప్రాంతములలోను మారుమూలలలోకూడ వినపడెను.

శాసనసభలఎన్నికల బహిష్కరణ సందర్భములో నొక వైశ్య యువకుడగు మతం బాలసుబ్రహ్మణ్యముగుప్తగారు ఎక్కడనుంచియో వచ్చి బెజవాడలో మకాంపెట్టి బెజవాడలోను, కృష్ణా, గుంటూరు, పశ్చిమగోదావరి జిల్లాలలోను మిక్కిలి తీవ్రమైన యుపన్యాసముల నిచ్చుచుండెను. బ్రిటిషు ప్రభుత్వమును అతిధైర్యముగ విమర్శించెను. మితవాదులను, జస్టిసుపార్టీ వారిని దేశద్రోహులని నిందించెను. అతని యుద్రేకపూరితమైన యుపన్యాస ములు సామాన్యజనసమూహముల నాకర్షించెను. పండితుడు కానందున మామూలు పామరజనులు వాడుకొనునట్టి తేలికపదములనే అత డుపయో గించెను. అందువలన అతడు ఎక్కడికిపోయినను అతనియుపన్యాసములను వినుటకు వేలకొలది ప్రజలు వచ్చుచుండిరి. బెజవాడలో అతడుపన్యసించిన కొన్నిసభలకు నేను అధ్యక్షతవహించితిని. అతనిని వెంటబెట్టుకొని ఏలూరు వెళ్ళితిని. దండు నారాయణరాజుగారిఅధ్యక్షతక్రింద మేమిద్దర ముపన్యా సముల నిచ్చితిమి. మోచర్ల రామచంద్రరావుగారి పలుకుబడి పోయినది. కాంగ్రెసువాదుల పలుకుబడి హెచ్చినది. కృష్ణాజిల్లాలో ప్రభుత్వములో పలుకుబడిగలనాయకులు కొందరు అతనియుపన్యాసముల నాపించివేయుమని జిల్లాకలెక్టరుగారితో చెప్పుకున్నట్లు తెలిసినది. అందుమీదట జిల్లామేజిస్ట్రేటు వద్ద ఆయనపై కేసుపెట్టబడినది, రాజద్రోహకరమైన ఉపన్యాసములనిచ్చు చున్నందుకు ఏల ఆరునెలలకాలము జామీనుపుచ్చుకొనకూడదో కారణము

చూపించవలసినదని నోటీసు యివ్వబడినది. నేనప్పుడు బెజవాడలో లాయరుగ పనిచేయుచుంటిని. కాబట్టి ఆయనతరపున నేనే వకీలుగ మేజిస్ట్రేటు గారిదగ్గర హాజరైతిని. ప్రథమజామీనుమీద ఆయనను విడుదలచేయించితిని. చాలమంది ఉత్తరసాక్షులను వేసితిని. వాయిదాలుపడుచుండెను. విచారణ పూర్తిఅయ్యేవరకు అతడు తన యుపన్యాసములను సాగించుచునేయుండెను. ఆయనమీద కేసువచ్చినదని తెలిసినందున ఆయన ఉపన్యాసములను వినుటకు ప్రజ లెక్కువగ వచ్చుచుండిరి. ఒకసారి ఆయనను వెంటబెట్టుకొని నేను కొవ్వూరుగ్రామమునకు వెళ్లితిని. అక్కడ మేము యిరువురము ఉపన్యసించితిమి. రాజమహేంద్రవరమునుంచి మాస్టరు కె. వి. ఆర్. స్వామి, చిలుకూరి వీరభద్రరావుగార్లు మొదలగుకాంగ్రెసు నాయకులు అక్కడికివచ్చి మమ్ములను కలసిరి. కళాశాలలవద్దకు, హైస్కూళ్ల వద్దకుకూడ పోయి విద్యార్థులను కళాశాలలను, పాఠశాలలను వదలిపెట్టి బైటికిరమ్మని బోధించితిమి. బందరుపోయి నేను నోబుల్ కళాశాల విద్యార్థులను కాలేజీ విడిచిపెట్టి రమ్మనికోరగా బి. ఎ. సీనియరు చదువుచున్న కళా వెంకటరావు నా యుపన్యాసము విని కళాశాలవదలిపెట్టి వచ్చివేసెను. నేను రాజమహేంద్రవరముకూడ వెళ్లి అక్కడ నాటకశాలలో రెండు యుపన్యాసము లిచ్చినాను. అందుమీదకూడ కొంతమందివిద్యార్థులు పాఠశాలలను, కళాశాలలను బహిష్కరించి బయటికివచ్చిరి. 1920 డిసెంబరులో మరం బాలసుబ్రహ్మణ్యంగుప్తగారి జామీనుకేసు బెజవాడలోని పి. డబ్ల్యు. డి. రహదారిబంగళాలో జిల్లామేజిస్ట్రేటుగారివద్ద తుదివిచారణకు వచ్చినది. అప్పుడు నేను బాలసుబ్రహ్మణ్యంగుప్తగారి ప్రసంగములలో రాజద్రోహము లేదని, కొన్నిచోట్ల భాష కొంచెం తీవ్రముగ, అనాగరికముగనుండినను ఇండియన్ పీనలుకోడ్ 124 (ఎ) సెక్షనుక్రిందికిమాత్రము రాదని వాదించితిని. అదిగాక 1898లో బాలగంగాధరతిలకుగారిమీద జామీనుకేసు పెట్టబడి కొట్టివేయబడిన హైకోర్టుతీర్పును, ఇంకా కొన్నితీర్పులను చదివి వినిపించితిని. కాని జిల్లామేజిస్ట్రేటు నా వాదనను అంగీకరింపక ఆరునెలలకాలము మంచి ప్రవర్తన కలిగియుండెదనని, ఉపన్యాసములనివ్వనని జామీనునివ్వవలెననియు, అటుల జామీనుఇవ్వనియెడల గుప్తగారు ఆరునెలలు జైలులో

నుండవలెననియు తీర్పుచెప్పిరి. జిల్లామేజిస్ట్రేటు యూరోపియను. ఆయన ప్రక్కనే మరియొక యూరోపియను జిల్లా పోలీసుసూపరింటెండెంటు కూడ కూర్చుండెను. సుబ్రహ్మణ్యంగుప్తగారు జామీనిచ్చుటకు నిరాకరించెను. అంతుమీదట వెంటనే ఆయనను బెజవాడ సబుజైలుకు పంపి ఆ రాత్రి రైలులో రాజమహేంద్రవరము సెంట్రలుజైలుకు పంపవలసియున్నది. కాని ఆ క్రిందటిసాయంత్రమే బెజవాడలోని గాంధీమైదానములో పెద్దసభ జరిపితిమి. అద్దేపల్లి రామశేషయ్యశ్రేష్ఠి, చిట్టూరు రామకృష్ణయ్యగార్లు నాకు మద్దతుగానుండిరి. ఆ శిక్షచెప్పినరోజున బస్తీలోని కొట్లు, ఫ్యాక్టరీలు మూసివేసి హర్తాళము జరిపించవలెనని ప్రకటించితిమి. హైస్కూళ్ళవిద్యార్థులను కూడ బయటికిరావలెనని కోరితిమి. అంతుపిల్లి బాలసుబ్రహ్మణ్యంగుప్త గారికి ఆరునెలల శిక్షచెప్పినరోజున కార్మికులు, రైతులు, వర్తకులు, విద్యార్థులు ఇతరజనులు వేలాదిగా బందరురోడ్డుప్రక్కన బారులుతీర్చియుండిరి. పి. డబ్ల్యు. డి. రహదారిబంగళా ఆవరణలోకి ప్రజలు రాకుండమాత్రము పోలీసువారు బందోబస్తుచేసిరి. ఒక యూరోపియను సార్జెంటు యాజమాన్యముక్రింద స్పెషలుపోలీసు ప్రతిచోట పెట్టబడినది. అక్కడక్కడ ప్రజలు రహదారిబంగళా ఆవరణలోకి రావలెనని ప్రయత్నించుచుండగా యూరోపియను సార్జెంటు బెత్తములతో వారికాళ్ళమీద కొట్టుచు కొంత క్రోధోద్రేకమును కలిగించుచుండెను. క్రిందటిరోజు జరిగిన బహిరంగసభలో నేను ప్రజలకు శాంతముగ నుండవలెనని, ఎట్టి అల్లరి చేయకూడదని బాలసుబ్రహ్మణ్యంగుప్తగారియందు మీకుగలభక్తిమాత్రము ప్రకటించుటకు హర్తాళము చేయవలెనేగాని పోలీసులమీదకాని, ఇతర ఉద్యోగస్థులమీదగాని ఎట్టి దౌర్జన్యము చేయకూడదని, దూషింపకూడదని గట్టిగా చెప్పియుంటిని. అందువల్ల ప్రజలు మొత్తముమీద శాంతమువహించుటకు నిశ్చయించుకొనివచ్చిరి. గాంధీయుద్యమము ప్రారంభమయిన తరువాత ఆంధ్రదేశములో నదియె మొదటి రాజకీయయభియోగము. బాలసుబ్రహ్మణ్యం గుప్తగారు ప్రజానురంజకుడైన వక్త. కాబట్టి జిల్లాలో పల్లెటూళ్ళనుంచికూడ చాలమందిజనము వచ్చిరి. జిల్లామేజిస్ట్రేటుకు, జిల్లా పోలీసుసూపరింటెండెంటుకు నొక సమస్య యుదయించినది. ఈ గుంపులుగూడినజనములలోనుంచి బాలసుబ్రహ్

హ్మాణ్యంగు ప్తగారిని బెజవాడ సబుజైలుకు ఎటుల తీసుకొనిపోవుటా? యని. అక్కడికి ఆ సబుజైలు ఆరుఫర్లాంగులదూరమున నున్నది..ఆ యిద్దరు జిల్లా అధికారులు ఆయనను జైలుకు తీసుకొనిపోవుటలో నా సహాయమపేక్షించిరి. నేను ఆయన నడిగి అందుకు సమ్మతించితిని. నా పెద్ద గుఱ్ఱపుబగ్గీలో ఆయనతోపాటు నేను కూర్చొని వెళ్ళునట్లును, ఆ బగ్గీ ముందరిభాగమున డ్రైవరుప్రక్కన యూరోపియను సార్జెంటు కూర్చుండునట్లును యేర్పాటు చేసి, నా బగ్గీలో మేము బయలుదేరితిమి. ప్రజలు మిన్నుముట్టునట్లు జయ జయధ్వానములు చేసిరి. ఆటంకముగాని, అల్లరులుగాని చాలదూరమువరకు నేమియు జరుగలేదు. తరువాత నాలుగుఫర్లాంగులదూరముపోయిన పిమ్మట జనులలోనుంచి ఎవరో సార్జెంటుపైన రాళ్లువేయసాగిరి. సార్జెంటు వారి మీద తుపాకులు కాల్చెదనని బెదరించెను. నేను అతనిని నివారించితిని. రాళ్ళు ఆగిపోయెను. మరల రాళ్లుపడెను. నేను బయటికివచ్చి శాంతింపు డని ప్రజలను కోరితిని. ఒకొకప్పుడు బాలసుబ్రహ్మణ్యంగు ప్తగారిచేతకూడ చెప్పించితిని. రాళ్లు ఆగెను. మొత్తముమీద ఏమీ అల్లరిజరుగకుండగనే బెజవాడ సబుజైలుకు తీసికొనిపోయి ఆయనను వప్పగించిచేసితిని, ఆ రాత్రి రాజమండ్రి తీసుకొనిపోదురని ప్రజలు వేలకువేలుగ వచ్చి రైలుస్టేషను వద్ద కాచుకొనియుండిరి, కాని అటుల తీసుకొనిపోక కారులో తెల్లవారు ఝామున తీసుకొనిపోయి గన్నవరముస్టేషనులో రైలుఎక్కించి రాజమహేంద్రవరము సెంట్రలుజైలుకు మరునాటియుదయమున చేర్చిరి. ఆ మరునాడు మరల బెజవాడలో సంపూర్ణమైన హర్తాళముజరిగెను. కొట్లన్నియు ఫ్యాక్టరీలన్నియు,స్కూళ్ళన్నియుమూసివేయబడెను. లాయరులుచాలమంది కోర్టులకు వెళ్ళుటము మానివేసిరి. కాని కోర్టులు, కచేరీలు తెరువబడియున్నందున ప్రజలు కచేరీలకు, కోర్టులకు వెళ్ళి కుర్చీలు లాగి, అల్లరిచేసి బలవంతముగాకోర్టులుమూయించిరి. కలెక్టరు. సూపరింటెండెంటు వచ్చుచుండగా ఎవరోచిన్నపిల్లలు వారినెత్తిన ఇసుక, దుమ్ము పోసిరి. డిప్యూటీమేజిస్ట్రేటు బ్రహ్మయ్యపంతులుగారనుఆయన వచ్చుచుండగా ఎవరో ఒకరాయివేసినందున వారికి తగిలినదట. వారిఆఫీసుమీద రాళ్లువిసరబడెను. ఇదంతా నాకు తెలిసి నాలుగుగంటలకు నాబగ్గీమీద ఊరంతాతిరిగి జనులనందరినీ తీసుకొని

పోయి గాంధీమైదానములో బ్రహ్మాండమైన సభ జరిపితిని. దానికి ఇరవై వేలమంది జనము వచ్చిరి. నేను గంటన్నరసే పుపన్యసించితిని. "అల్లరి చేయుటవల్ల మనకార్యము చెడును. మనము ఒకరాయివేస్తే ప్రభుత్వపక్షము వారు తుపాకులుకాలుస్తారు. మనము తుపాకులుకాలిస్తే వారు ఫిరంగులుకాలుస్తారు. హింసాతత్వమువల్ల వారితో మనము నెగ్గజాలము" అనియు; మనము బలహీనులమనియు, కావున మనము నిబ్బరముగావుండి శాంతముగ నేకమై కట్టుకట్టి మహాత్మా గాంధీగారు చెప్పినట్లు కలకత్తాకాంగ్రెసులో తీర్మానించినవిధముగా బహిష్కారములను, శాసనోల్లంఘనమును ఆఖరుకు పన్నులనిరాకరణమును చేసినచో ఇంగ్లీషువాడు దేశమునుంచి తప్పకుండ లేచిపోవును. ఇదియే నిశ్చయమైనమార్గము అని నేను గట్టిగా బోధించి ప్రజలను ఇళ్ళకు పంపివేసితిని. 106 మందిమీద బలవంతముగా కోర్టులను మూయించినారని, దౌర్జన్యముజరిపినారని పేర్లు వ్రాసుకొనిరి కాని మరునాడు జిల్లామేజిస్ట్రేటు, జిల్లా పోలీసుసూపరింటెండెంటు నన్ను పిలిపించి నాసలహా నడిగిరి. ఏదో కొంత ఉద్రేకముమీద కొన్నిలోపములు జరిగినను మేముకూడ అల్లరులకు, అశాంతికి వ్యతిరేకులము. కావున ఎట్టికేసులను పెట్టుట యుక్తముకాదు. ఇంతటితో వదలిపెట్టిన బాగుండునని నేను సలహా చెప్పగా, వారు అందుకు అంగీకరించి కేసులనుపెట్టకుండ మానుకొనిరి. ఇది శంకర్‌నాయర్‌గారు వ్రాసిన Unrest of India అను గ్రంథములో కూడ ప్రస్తావించబడినది.

1920 సెప్టెంబరులో జరిగిన కలకత్తా ప్రత్యేకకాంగ్రెసుమహాసభ భారతదేశచరిత్రలోనేకాక మానవచరిత్రలోకూడ అత్యంత ప్రాముఖ్యతవహించినది. ఆ కాంగ్రెసుమహాసభయొక్క తీర్మానములఫలితముగ మహాత్మాగాంధీ కాంగ్రెసుసంస్థకును, తద్వారా భారతదేశమునకును ఏకైకనాయకుడైనాడు. ఆయన అవలంబించిన అహింస, సత్యములనెడి సిద్ధాంతములు ఆయన కనిపెట్టిన సత్యాగ్రహాయుధము భారతదేశస్వాతంత్ర్యసంపాదనకేగాక ప్రపంచమందంతటను అణగద్రొక్కబడిన జాతులకు, సంఘములకు శరణ్యములైనవి; బలహీనులు బలవంతుల దౌష్ట్యమునుండి, యొత్తిడినుండి విముక్తినొందుటకు ప్రధానమార్గములైనవి. వాటిమూలమున భారతదేశములోను

మానవకోటిలోనుకూడ నొక నూతనమైన సత్యయుగస్థాపనకు మహాత్మా గాంధీ ఆచార్యుడైనాడు. 1920 డిశంబరులో నాగపురమున కాంగ్రెసుమహాసభ సేలం విజయరాఘవాచారిగారిఅధ్యక్షత క్రింద మరల సమావేశమైనది. దానిలో చిత్తరంజన్‌దాసుగారి ప్రతిపాదనమీదనే ఔద్ధత్యరాహిత్య సహాయ నిరాకరణముయొక్క అన్ని యంశములును ఏకగ్రీవముగ అంగీకరించబడినవి. కాంగ్రెసుమహాసభ యుద్దేశ్యము శాంతియుతమైన అన్నిసాధనలచే స్వరాజ్యమును స్థాపించుటయే అని నిర్ణయింపబడినది. కాంగ్రెసుయొక్క రాజ్యాంగవిధానము భాషాప్రయుక్తరాష్ట్రములమీద నిర్మాణముచేయబడ్డది. అఖిలభారతకాంగ్రెసుకమిటీక్రింద రాష్ట్రకాంగ్రెసుకమిటీలు, వాటిక్రింద జిల్లా కాంగ్రెసుకమిటీలు, ఆఖరున పట్టణకాంగ్రెసుకమిటీలు గ్రామ కాంగ్రెసు కమిటీలు నిర్మింపవలెనని నిశ్చయించబడినది. భారతీయ కాంగ్రెసువాదులందరును మహాత్మాగాంధీ ఏకైకనాయకత్వముక్రింద స్వతంత్రపోరాటమును సాగించుటకు దృఢనిశ్చయులై నిలబడినారు. అఖిలభారత కాంగ్రెసు వర్కింగుకమిటీలో కొండా వెంకటప్పయ్యగారినే సభ్యులుగ వేయించుకున్నాము. నాగపురము కాంగ్రెసుమహాసభ పూర్తికాగానే నాకు కొంచెము జబ్బుచేసినందున 5, 6 దినములు నేను మాకు బంధువులైన భవానీశంకర్ నియోగిగారియింట నాగపురములో వుండిపోయి స్వస్థతకలిగినపిమ్మట విజయవాడకు వచ్చినాను. భవానీశంకర్‌నియోగి, ఈడ్పుగంటి రాఘవేంద్రరావుగార్లు ఇద్దరు ఆంధ్రబారిష్టరులు. అప్పటికి ప్రముఖ కాంగ్రెసునాయకులు. చాల మంచివారు. నాకు ఆప్తమిత్రులు. భవానిశంకర నియోగిగారు కొమర్రాజు లక్ష్మణరావుగారికి పెత్తల్లికొడుకు. రాఘవేంద్రరావుగారితాతగారు కృష్ణాజిల్లా కురుమద్దాలినుంచి మధ్యపరగణాలకు వెళ్ళి నివాసమేర్పరచుకొనిరి. రాఘవేంద్రరావుగారు గుడివాడకాపురస్థులగు అడుసుమల్లి హరినీడుగారి బావమరది. కాని తరువాతకాలములో భవానీశంకర్ నియోగిగారు నాగపూరు హైకోర్టుజడ్జిగాను, ఈడ్పుగంటి రాఘవేంద్రరావుగారు నాగపూరు గవర్నమెంటులో హోంశాఖమెంబరుగాను, గవర్నరుజనరలు కార్యనిర్వాహకసభ్యులుగాను, ఇండియా ప్రభుత్వోద్యోగములలో మంత్రిగారి కౌన్సిలులో సభ్యులుగను పైకివచ్చినారు. రాఘవేంద్రరావుగారు దురదృష్టవశాత్తు కొన్నిసంవత్స

రములక్రిందట మరణించిరి. భవానీశంకర్‌నియోగిగారు ఉపకారవేతనమును పొంది ప్రజోపయోగకార్యములలో పనిచేయుచు ప్రజారంజకులై యున్నారు. నాగపూరు కాంగ్రెసుతీర్మానముల ఫలితముగా హిందూదేశమందంతటను కాంగ్రెసునాయకులైన లాయర్లు తమవృత్తులను త్యజించినారు. కలకత్తాలో బారిష్టరుగనున్న దేశబంధు చిత్తరంజన్‌దాసుగారు, అలహాబాదులో బారిష్టరుగానున్న పండిత మోతీలాలునెహ్రూగారు నెలకు 50, 60వేల రూప్యముల రాబడియున్నను దానినంతను త్యజించి తమ బారిష్టరువృత్తులను శాశ్వతముగ మానివేసినారు. ఇద్దరును భోగభాగ్యములను త్యజించి దేశస్వతంత్రముకొరకు ప్రాణముల నర్పించినారు. దేశమునకు స్వతంత్రమురాకమునుపే స్వర్గస్థులైనారు. ఆంధ్రదేశములో కొండా వెంకటప్పయ్యపంతులుగారు మొదలైన పైనచెప్పబడిన గుంటూరులాయర్లేగాక మిగతచోట్లకూడ కొంతమంది లాయర్లు తమవృత్తులను త్యజించిరి. టంగుటూరి ప్రకాశంపంతులుగారు, బులుసు సాంబమూర్తిగారు, దండు నారాయణరాజుగారు, వెన్నేటి సత్యనారాయణగారు, తెన్నేటి విశ్వనాథంగారు, వసంతరావు బుచ్చిసుందరరావుగారు, ఓరుగుంటి వెంకటసుబ్బయ్యగారు, కోలవెన్ను రామకోటేశ్వరరావుగారు మొదలైనవారు తమతమ లాయరువృత్తులను శాశ్వతముగ వదలిపెట్టిరి. వేలూరు సత్యనారాయణగారు కొన్నిసంవత్సరములవరకు లాయరుపనిని మానివేసిరి. బెజవాడలో దాసు మధుసూధనరావు, దోర్బల శేషాద్రిశాస్త్రి గార్లు ఒకసంవత్సరమువరకు మాత్రము ప్లీడరీవృత్తిని మానివేసిరి. 1931లో మల్లాది యజ్ఞనారాయణగారు ప్లీడరీవృత్తిని శాశ్వతముగా త్యజించిరి. టంగుటూరి ప్రకాశంపంతులుగారు సాధారణముగ నెలకు పదివేలరూప్యములుసంపాదించుచుండిరి. బ్రహ్మజ్యోసులసీతారామయ్యగారు బి.ఎ.యల్.టి. ఓరుగంటి సీతారామయ్య ఎం. ఏ. ఎల్. టి. గారు డెప్యూటీస్కూలుఇనస్పెక్టరుపదవులను త్యజించిరి. కానుకొలను రాజశేఖరంగారు పి. డబ్లియు. డి. యుద్యోగమును మానుకొనిరి. ఇటులనే ఆంధ్రదేశములో కొందరు ఉద్యోగములు చేయుచున్నవారు తమయుద్యోగములకు రాజీనామాలిచ్చి స్వతంత్ర పోరాటములో చేరిరి. కళా వెంకట్రావు, మొసలికంటి తిరుమలరావు, క్రొవ్విడి లింగరాజు, దామరాజు పుండరీకాక్షుడు, దళిక సూర్యప్రకాశరావు,

తాడేపల్లి వేణుగోపాలరావు, మానికొండ సత్యనారాయణశాస్త్రి మొదలగు కళాశాలవిద్యార్థులును కళాశాలలను వదలిపెట్టి సహాయనిరాకరణోద్యమములో చేరిరి. మహాత్మాగాంధీగారు ప్లీడరులందరు ఒక సంవత్సరముకాలము తమవృత్తిని మానివేసి స్వతంత్రముకొరకు పనిచేసినయెడల జనులలో అధికసంఖ్యాకులు ఖద్దరుధారణచేసి అస్పృశ్యతను రూపుమాపినయెడల, హిందూ ముస్లిం సఖ్యత దృఢపడినయెడల యొకసంవత్సరములోనే అనగా 1921 డిసెంబరు 31 వ తేదీనాటికి తాను స్వరాజ్యము తప్పక తీసుకొని వచ్చి యిత్తునని ప్రకటించెను. కాని ఆయనచెప్పినషరతులను లాయర్లుకాని, యితరప్రజలుకాని అమలుజరుపలేదు. ఆ షరతులు కొంతవరకుమాత్రమే అమలుజరుపబడ్డవి. లాయర్లుకూడ కొంతమందిమాత్రమే యొకసంవత్సరము వరకు తమవృత్తిని మానుకొనిరి. అందువల్ల స్వరాజ్యము ఒకసంవత్సరము కాలములో రాలేదు.

నేను 1921 మార్చి 21 వ తేదీన శాశ్వతముగ లాయరువృత్తిని త్యజించితిని. నా చేతిలో నపుడు 60 వేల రూప్యములఫీజువచ్చు నొక పెద్ద దావాయును, 25 వేల రూప్యములఫీజువచ్చు కొన్నిదావాలును వుండెను. ఆ దావాలమట్టుకే నేను పనిచేసి, క్రొత్తదావాలను పుచ్చుకొనకుండ నున్నచో నాకు 75 వేల రూప్యములు వచ్చెడివి. 60 వేల రూప్యముల ఫీజువచ్చెడి పెద్దదావా మీర్జాపురము, యలమర్రురాజాలమధ్య జరుగుచుండెను. నేను, మద్రాసులోని ఎస్. శ్రీనివాసయ్యంగారు యలమర్రురాజాగారి వకీళ్ళము. మీర్జాపురము, యలమర్రురాజాలు అన్నదమ్ములు. వారి ఎస్టేటుపంపిణీలో మీర్జాపురమురాజాగారు జాయింటుదివానును లోబరచుకొని తనకు అక్రమములు చేసిరని యలమర్రురాజాగారి వాదము. ఎస్టేటుపంపిణీకి పూర్వము వారుభయులకు జాయింటుగా నేను, యల్లంరాజు శాస్త్రిలుగారు బెజవాడలో వకీళ్ళముగా నుంటిమి. ఆ పంపిణీలో యలమర్రురాజాగారు తనకు వకీలుగా యుండవలెనని కోరి నన్ను తీసుకొనిరి. రెండవ లాయరగు యల్లంరాజు శాస్త్రిలుగారు మీర్జాపురమురాజాగారి వకీలైరి. నామీద యలమర్రురాజా గారికి అత్యంతమైన నమ్మకము. మంచి సమర్థత, గట్టి నమ్మకము రెండు నాయందున్నవని ఆయనకు పూర్తివిశ్వాసము. ఆ పెద్దదావాలో కొన్ని

చిక్కులుండుటవల్ల జనవరిలోనే నేను వదలుకొనజాలకపోతిని. ఆ దావాలో రాజీచేయవలెననికూడ ప్రయత్నించితిని. రాజీ కుదరలేదు. కనుక నేను మార్చి 21 వ తేదీవరకు ఆ దావాలో పనిచేసి, ఆ తేదీనుంచి కోర్టుకువెళ్లుట మానివేసితిని. ఆ ప్రకారము ప్రకటించితిని. నావద్దనున్న కేసులను నా కక్షిదారులు ఇతర లాయరుల కిచ్చి పనిచేయించుకొనిరి. నేను మరల నెప్పుడును ప్లీడరీవృత్తిని చేయలేదు. కోర్టుకు పోలేదు నా ప్లీడరీసనదు రద్దు అయినది. నేను ప్లీడరీని వదలుకొన్నానని తెలియగనే యలమర్రురాజాగారు నావద్దకువచ్చి తమతాలూకు ఆ పెద్దదావాను మాత్రము వదలుకోవద్దని, దానిని తుదివరకు నడపవలసినబాధ్యత నామీద వదలి నన్ను నమ్ముకున్నానని కోరినాడు. హైకోర్టుకు ప్రివీకౌన్సిలుకు ఆయనతరపున నేనే తీసుకొని వెళ్ళవలెనని ఎంత ఫీజుఅయినను యిచ్చెదనని ఎంతగానో బ్రతిమలాడిరి. నేను బొత్తుగా ఒప్పుకొనలేదు. కోర్టులకు పోకూడదని కాంగ్రెసుయొక్క మహాత్మాగాంధీయొక్క ఉత్తరువుఅయినందున కోర్టులలో నేవిధమైనపని చేయజాలననియు, అంతటినుంచి నేను నా జీవితమును స్వరాజ్యసంపాదనకొరకు అంకితముచేయుదుననియు, నే నందుకే జన్మించితిని కాని, ఐశ్వర్యము ననుభవించుటకు జన్మించలేదని,ప్లీడరీవృత్తిమాత్రము చేయబోవడములేదనియు మనవిచేసి ఎటులనో వారిని పంపివేసితిని. ఆ దావాను విజయవాడలో ఎవరికివ్వవలెనని వారు నా సలహా అడిగినారు. సి. రాజగోపాలాచారిగారు చాల సమర్థుడు, నా తరువాత ఆయనే గట్టివాడు, ఆయన కివ్వండి అని చెప్పినాను. నమ్మకంగా అవతల మీర్జాపురమురాజాగారితో నెట్టి లాలూచీ పడకుండా దావాలో పనిచేస్తాడా అని నన్ను అడిగినారు. తప్పకుండా నమ్మకంగా పనిచేస్తాడు, ఏమీ సంకోచించనక్కరలేదని చెప్పినాను. అందుమీద ఆ పెద్దదావాను ఆయన సి. రాజగోపాలాచారిగారి కిచ్చినారు. ఆ దావా తుదకు సబుకోర్టులో విచారణపూర్తి కాకముందే రాజీఅయినది. ఆ రాజీ షరతులు తీసుకొనివచ్చి యలమర్రురాజాగారు నాకు చూపినారు. నేను ఏమీ ఫీజుపుచ్చుకొనకుండానే వాటినిచూచి కొద్దిసవరణలతో అంగీకరించి వారికిచ్చినాను. రాజీ కుదిరినందుకు రాజగోపాలాచార్యులుగారికి ముప్పదిఅయిదువేల రూప్యములు ఆ దావాలో ముట్టినవి. దానితో ఆయన

గవర్నరుపేటలో పెద్ద మేడ కట్టించుకొన్నాను. నేను గాంధీగారి శిష్యత్వ మును 1919నుంచి అవలంబించియున్నాను. అందువల్ల తప్పక నేను ప్లీడరీ వృత్తిని వదలిపెట్టెదనని, స్వతంత్రపోరాటములోనికి దుమికి జైళ్ళకుపోదు నని నా కుటుంబమువారు నా మిత్రులు అనుకుంటూనేయున్నారు. నేను నా ప్లీడరీవదలిపెట్టెవిషయములో ఎవరితోను సంప్రతించలేదు. మా కుటుంబ ములో కూడ ఎవరుకాని నన్ను వద్దని చెప్పలేదు. నన్ను వెనుకకులాగుటకు యత్నించలేదు.

నేను ప్లీడరీ వదలిపెట్టేనాటికి బెజవాడలో నా కొక మేడ, నంది గామలో చిన్న పాత యిల్లు, 127 ఎకరములభూమి, నా భార్యకు 16 ఎకర ముల పల్లపుభూమి, బెజవాడలో 5,400 చదరపుగజములస్థలము ఉన్నవి. నావద్ద డబ్బు ఏమీ లేదు. యిల్లు కట్టినబాపతు ఋణము ఇంకా 5 వేల రూపాయలున్నది. ప్లీడరీలో బాగా ఆదావచ్చినను మంచికార్యములకు పెద్ద పెద్ద చందాలిచ్చి అర్హులైనవారికి ద్రవ్యసహాయముచేసి, యింటిలో ఆతిథ్య మిచ్చి, డబ్బు కూడబెట్టలేదు. కాని 1921 నుంచి నేటివరకు కుటుంబజీవి తమును సుఖముగాను మర్యాదగాను జరుపుకొనుటలోను, ముఖ్యముగ ఎన్ని కలలో పెద్ద ఖర్చులుచేయుటకును, కాంగ్రెసుమహాసభలకు అఖిలభారత కాంగ్రెసుకమిటీలకు, ఇతరసభలకు పోవుటకును, నా కొడుకును, కోడలిని అమెరికాకు చదువుకొనుటకు పంపుటకును చేసిన ఋణములు తీర్చివేయు టకు నా పొలములో 102 ఎకరములను, నా భార్యతాలూకు 16 ఎకరముల పొలమును, 4 వేల 8 వందల గజములస్థలమును అమ్మినాను. ఇంకను నాకు నందిగామలో మెట్ట పల్లము కలసి ఇరవైఅయిదు యకరముల భూమిన్ని, నా భార్యకు 600 గజములస్థలము, నందిగామలో పాత యిల్లు, బెజవాడలో మేడ యున్నవి. నేను ఖర్చులు తగ్గించుకొని కొంతఆస్తిని మిగుల్చుకొని ఇంకొకరివద్దకు నా జీవనోపాధికొరకు యాచించుటకు పోకుండా కాపాడుకున్నాను. ఎన్నికలకాలములోను, మ్యునిసిపల్ ఛైర్మను గానున్న కాలములోను చీఫ్ పార్లమెంటరీ సెక్రటరీగా ఉన్నకాలములోను మోటారుకార్లను కొని కొంతకాలము ఉపయోగించుకొని వాటిని అమ్మి వేసినాను. మిగతకాలములలో మోటారుకార్లమీదనే పోదామని తాపత్రయ

పడలేను. మోటారుకార్లు లేనపుడు రిక్షాలమీద, గుఱ్ఱపు జట్కాలమీదను వెళ్లేవాడిని.

(6)

1921 జనవరిలో ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుకమిటీ బెజవాడలో రామమోహనగ్రంథాలయములో సమావేశమై నూతనకాంగ్రెసురాజ్యాంగవిధానము ప్రకారము వర్కింగుకమిటీని ఎన్నుకున్నది. అందులో ప్రతి ఆంధ్రజిల్లాకు ఒక్కొక్క జిల్లాకాంగ్రెసుకమిటీ యుండవలెనని తీర్మానించబడి భోగరాజు పట్టాభిసీతారామయ్యగారి ప్రతిపాదనపై కృష్ణాజిల్లాను మాత్రము తూర్పు కృష్ణా, పశ్చిమకృష్ణా, పశ్చిమగోదావరి అను మూడుజిల్లాలుగా విభజించి తూర్పుకృష్ణాజిల్లా కాంగ్రెసుకమిటీకార్యస్థానము బందరులోను, పశ్చిమకృష్ణా జిల్లా కాంగ్రెసుకమిటీ కార్యస్థానము బెజవాడలోను, పశ్చిమగోదావరిజిల్లా కాంగ్రెసుకమిటీ కార్యస్థానము ఏలూరులోను వుండునట్లు తీర్మానించబడెను. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీకి కొండా వెంకటప్పయ్యపంతులుగారు అధ్యక్షులుగను, గొల్లపూడి సీతారామశాస్త్రిగారు ప్రధానకార్యదర్శిగాను, వి. వి. గిరిగారు సంయుక్తకార్యదర్శిగాను ఎన్నుకొనబడిరి. నేను, భోగరాజుపట్టాభి సీతారామయ్య, నాగేశ్వరరావుపంతులు, బులుసు సాంబమూర్తి, దండు నారాయణరాజు మొదలైనవారమంతా వర్కింగుకమిటీకి సభ్యులుగా ఎన్నుకోబడితిమి. తరువాత కొలదిరోజులలోనే బెజవాడలో నొక జాతీయవిద్యా కమిటీ నేర్పరచి, దానికి నన్ను అధ్యక్షునిగా నెన్నుకొని యొక జాతీయ ఉన్నతపాఠశాలను స్థాపించితిమి. ప్రారంభమైనతరువాత కొంతకాలము అది దాసు మధుసూధనరావుగారి గృహములో నుండెను. వారు అద్దె పుచ్చుకొనలేదు. ఆయన 1921 వ సంవత్సరము ఆఖరుకాగానే తన ప్లీడరీవృత్తిలో మరల చేరితినని కాంగ్రెసుకమిటీకి తెలియపరచినాడు. అప్పటినుంచి జాతీయ ఉన్నతపాఠశాలను మాయింటిలో అద్దెలేకుండా కొంతకాల ముంచినాము. పిమ్మట దానిని మాయింటికి సమీపముననున్న యొకభవనమును అద్దెకుతీసుకొని దానిలో నుంచితిమి. అది 1921 మొదలు 1925 వరకును నడపబడినది. ఈ అయిదుసంవత్సరములకాలములో దాని నిర్వహణవ్యయము నిమి

త్తము సుమారు 30 వేల రూప్యములను వసూలుచేసితిమి. బెజవాడలోని వర్తకులు, లాయర్లు, ఇతరులు ఆర్థికసహాయముచేసిరి. వర్తకప్రముఖులగు అద్దేపల్లి వెంకటప్పయ్య, చుండూరు నాగభూషణం,విస్సంసెట్టి వెంకటరత్నంగార్లు తలొక రు 1,116 ల నిచ్చిరి. లాయరు ప్రముఖులగు సి. రాజగోపాలాచారి, పెద్దిభొట్ల వీరయ్య, దాసు మధుసూధనరావు, బొడ్డపాటి వెంకటప్పయ్య, అచ్యుతన వెంకటరావు, వెలగలేటి దశరథరామయ్యగారలు తలొక అయిదువందలరూప్యముల నిచ్చిరి. భూఖామందులగు శింగరాజు వెంకటసుబ్బారావుగారు మొదలగువారుకూడ మంచి విరాళముల నిచ్చిరి. ఆ జాతీయపాఠశాలలో మెట్రిక్యులేషన్‌వరకు అన్నివిషయాలను తెలుగులోనే బోధించడం, రెండవభాషగామాత్రము ఇంగ్లీషు నేర్పడము, హిందీకూడ నిర్బంధముగ నేర్పడం, రాట్నములుపెట్టి నూలుతీయించడము, జాతీయ గీతములతోను, భగవత్ప్రార్థనలతోను పాఠశాల ప్రారంభించడం, అస్పృశ్యులను పాఠశాలలో చేర్చుకొనడము, హిందూదేశచరిత్రను, ఆంధ్రులచరిత్రను సక్రమముగ బోధించడము, 1, 2 చేతిపనులు నేర్పడం మొదలైన జాతీయ విద్యాక్రమమంతయు అమలులో పెట్టినాము. మొదటిఫారమునుండి ఆరవ ఫారమువరకు తెరచినాము. షుమారు 250 మందివిద్యార్థులు ఉత్సాహముతో చేరినారు.

1921 లో ఈ జాతీయపాఠశాలకొరకు ద్రవ్యమును వసూలుచేయుటకై డాక్టరు ధన్వాడ రామచంద్రరావుగారు, నేను వరంగల్లుకు వెళ్ళితిమి. అప్పుడు రామచంద్రరావుగారు పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసుకమిటీకి అధ్యక్షులు. మాతోకూడ పశ్చిమకృష్ణాజిల్లా కాంగ్రెసుకమిటీయొక్క గుమాస్తా బెజవాడనుంచి వరంగల్లువరకు రైలులో ప్రయాణముచేసెను. మా పక్క కంపార్టుమెంటులో నైజాము రైల్వేపోలీసు హెడ్‌కానిస్టేబులు ప్రయాణము చేయుచుండెను. మాతోకూడ నున్నవారిని ఆ పోలీసుఉద్యోగి పిలచి మేమెవరమో తెలుసుకొనగోరెను. ఆ ఉద్యోగి ముసల్మాను. మేము కాంగ్రెసు-ఖిలాఫతుఉద్యమములో పనిచేయుచున్న నాయకులమని అతనికి తెలియుటతోడనే మావద్దకువచ్చి సలాంపెట్టి కుశలప్రశ్నలడిగెను. మాయెడల నెంతో మర్యాదచూపెను. మేము వరంగల్లుస్టేషనులో దిగగానే మా మేనమామ

కుమారుడు, అచట ప్రముఖలాయరునగు మాదిరాజు రామకోటేశ్వరరావు గారును, మరికొందరు లాయరుమిత్రులును మమ్ములను కలిసి యొక టాంగా మీద రామకోటేశ్వరరావుగారియింటికి తీసుకొనిపోయిరి. అక్కడ నాలుగు రోజులుంటిమి. జిల్లాకోర్టులోని లాయర్లగదికి పోయి వారినుండి చందాలు వసూలుచేసితిమి. ఒక ముసల్మానుపోలీసుఇనస్పెక్టరు అక్కడికివచ్చి మేము వచ్చినపనికి చాల సానుభూతి తెలిపెను. కాంగ్రెసు-ఖిలాఫతు అని చెప్పుట తోడనే ఆయనకుకూడ చాల అభిమానము కలిగెను. వసూళ్ళలో మాకు నిరోధముకలిగించుటకు మారుగా ఆయనకూడ రామకోటేశ్వరరావుగారివలెనే మాతోకూడ వచ్చి చందాలివ్వవలసినదని వర్తకులను ప్రోత్సహించెను. మొత్తముమీద 2,500 రూప్యములు వసూలయ్యెను. రామకోటేశ్వరరావు గారు మమ్ములను అపుడు సబుజడ్జి, జిల్లామేజిస్ట్రేటుగానున్న ముసల్మాను యుద్యోగస్తునివద్దకు తీసుకొనిపోయిరి. వారు మమ్ముల నెంతగనో మర్యాద చేసి తేనీటివిందుచేసి, కాంగ్రెసునందును, ఖిలాఫతుయుద్యమమునందును గొప్ప అభిమానమును, సానుభూతిని కనబరచిరి. సొమ్ము వసూలు చేసుకుని విజయవాడకు వెళ్ళితిమి 1923 డిశెంబరులో కాకినాడలో జరిగిన కాంగ్రెసుమహాసభ ముగిసినపిమ్మట కాంగ్రెసునాయకులగు అజాద్ సుభానీగారు నన్ను రమ్మని కోరగా నేను వారితోకలిసి వరంగల్లు పోతిని. హనుమకొండలోనున్న మాదిరాజు రామకోటేశ్వర రావుగారియింటిలోనే బసచేసితిమి. వరంగలులో సుబేదారుగానున్న (గవర్నరు) యొక ముస్లింఉద్యోగస్థునివద్దకు రామకోటేశ్వరరావుగారు నన్ను, అజాద్ సుభానీగారినితీసుకొనిపోయిరి. వారు మమ్ముల నెంతో గౌరవముగా ఆదరించి మాకు తేనీటివిందుచేసిరి. అటులనే సబుజడ్జి, జిల్లా మేజిస్ట్రేటుగానున్న యొక ముస్లింయుద్యోగస్థునివద్దకు మమ్మలిద్దరినీ రామకోటేశ్వరరావుగారు తీసుకొనిపోయిరి. వారు మమ్ములను గౌరవించి తేనీ రిచ్చుటయేగాక ఆరాత్రి రామకోటేశ్వరరావుగారియింటకి వచ్చి మా యిద్దరినీ దర్శించిరి, తరువాత అజాద్ సుభానీగారును, నేనును బెజవాడకు వచ్చితిమి. అక్కడినుంచి వారు ఉత్తరహిందూస్థానమునకు వెళ్లిపోయిరి. ఆ కాల మంతటిలోను, నైజాము నవాబుయొక్క ముసల్మాను

ఉద్యోగస్థులకును అనుద్యోగస్థులకును కాంగ్రెసు - ఖిలాఫత్ ఉద్యమమునందును మహాత్మాగాంధీ, షౌకతాలీ, మహమ్మదాలీ మొదలైన నాయకులయందును చాల భక్తిగౌరవము లుండెను. విదేశీయులగు ఆంగ్లేయులను వెళ్ళగొట్టుట వారికి యిష్టముగానుండెను. హిందూదేశమునకు స్వరాజ్యము వచ్చినయెడల నైజాము ప్రభువుకూడ తనసంస్థానప్రజలకు తగినహక్కులనిచ్చి బాధ్యతాయుతపాలన స్థాపించి, తానే రాజుగానుండునని వారందరి యాశయము.

నేను 1922 ఫిబ్రవరి మొదలుకొని 1923 ఫిబ్రవరివరకు జైలులో నుంటిని. అకాలములో బెజవాడ జాతీయవిద్యాలయకమిటీకి ధన్వాడ రామచంద్రరావుగారు అధ్యక్షుడుగను, డాక్టరు ఘంటసాల సీతారామశర్మగారు కార్యదర్శిగను, శింగరాజు వెంకటసుబ్బారావుగారు కోశాధికారిగను ఎన్నుకొనబడిరి. వారు సొమ్మువసూలుచేసి విద్యాలయమును చక్కగా నడిపిరి. ప్రథమమున జాతీయపాఠశాలకు జొన్నలగడ్డ సూర్యనారాయణరావుగారు ప్రధానోపాధ్యాయులు. వీరు బి. ఏ. చదువుచు మానివేసి వచ్చినారు. పి. డబ్ల్యు. డి. ఉద్యోగము వదలిపెట్టివచ్చిన కానుకొల్లు రాజశేఖరంగారు, ఇటులనే ఉద్యోగ, విద్యార్థిదశలను వదలిన మాదిరాజు భాస్కరరావుగారు మొదలైనవారిని ఉపాధ్యాయులుగా వేసుకొనినాము. వారందరు పాఠశాలను ఉత్సాహముతో నిర్వహించినారు. ఒక సంవత్సరమైన పిమ్మట కురుగంటి సీతారామయ్య, ఎమ్. ఏ. గారిని ప్రధానోపాధ్యాయులుగా తెచ్చుకొంటిమి. వారు రెండుసంవత్సరములు పనిచేసి, ఇచ్చటనుండి తంజావూరుకు ప్రాచీన ఆంధ్ర గ్రంథపరిశోధనకై వెళ్ళిరి. అటుతరువాత ఉస్మానియా విశ్వవిద్యాలయములో చేరిరి. వారికి భట్టాచార్య బిరుదువచ్చెను. వారు బహుళగ్రంథకర్త. హైదరాబాదులో వైజ్ఞానికరంగములో ప్రముఖపాత్రను వహించుచున్నారు. వారు వెళ్ళిపోగానే బి. ఏ. సీనియరు చదువుచు కళాశాలవదలివచ్చిన తాడేపల్లి వేణుగోపాలరావుగారిని ప్రధానోపాధ్యాయునిగా చేసితిమి. వారు ఆఖరువరకు ప్రధానోపాధ్యాయులుగానుండిరి. నేనుకూడ బెజవాడలో నున్నప్పుడు తరుచుగ అయిదు ఆరు ఫారములకు హిందూదేశచరిత్రను స్వతంత్రపోరాటముల చరిత్రనుగూర్చినపాఠములను చెప్పుచుంటిని. ఈ జాతీయపాఠశాలను 5

సం॥లు నడిపితిమి. పిమ్మట 1925 సం॥లో దానిని బెజవాడ మ్యునిసిపాలిటీ క్రిందకు హయ్యరు ఎలిమెంటరీపాఠశాలగా తీసుకుంటిమి. 1922 సం॥లో బెజవాడ మ్యునిసిపాలిటీ ఎన్నికలలో కాంగ్రెసు కమిటీవారు పోటీచేసి 24 స్థానములలో 15 స్థానములను సంపాదించిరి. డాక్టరు ధన్వాడ రామచంద్ర రావుగారు, సి. రాజగోపాలాచారి, కౌతా పూర్ణానందం, బారిస్టరు తుర్లపాటి వెంకటేశ్వరరావు, డాక్టరు ఘంటసాల సీతారామశర్మ, చుండూరి సీతారామయ్య, సి. కొళందరెడ్డి మొదలైనవారు కాంగ్రెసుసభ్యులుగా మ్యునిసిపాలిటీకి ఎన్నుకొనబడిరి. నే నపుడు కడలూరుజైలులో నుంటిని. సి. రాజగోపాలాచారి, బారిష్టరు వెంకటేశ్వరరావుగారలు నావద్దకు వచ్చి ఎవరిని ఛైర్మనుగాచేసిన బాగుండునని నా సలహా నడిగిరి. నేను డాక్టరు ధన్వాడ రామచంద్రరావుగారిని ప్రథమ కాంగ్రెసు మ్యునిసిపలుఛైర్మనుగా ఎన్నుకొనవలసినదని సలహానిచ్చితిని. ఆప్రకారమే వారిని ఛైర్మనుగా ఎన్నుకొనిరి. ధన్వాడ రామచంద్రరావుగారు ఆంధ్రక్రైస్తవులు. రెవరెండ్ కానన్ అనంతంగారి పుత్రులు. బహు సజ్జనులు. ఇంగ్లండువెళ్ళి 10 సంవత్సరములు అచట చదివి, ఎమ్. ఏ., ఎమ్. డి. పరీక్షలలో ను త్తీర్ణులై హిందూదేశమునకు వచ్చిరి. గొప్ప జాతీయవాది. కాంగ్రెసుభక్తుడు. నిత్య ఖద్దరు ధారి. 1921 సం॥ లో నూతనముగా నేర్పడిన పశ్చిమకృష్ణాజిల్లా కాంగ్రెసు కమిటీకి ఎన్నికలు జరిగినపుడు ధన్వాడ రామచంద్రరావుగారిని అధ్యక్షునిగా నెన్నుకొంటిమి. ప్లీడరీ మానివేసిన దోర్బల శేషాద్రిశాస్త్రిగారిని కార్యదర్శిగా చేసితిమి. నేను, కోటగిరి వెంకటకృష్ణారావు, దాసు మధుసూదనరావు, కాట్రగడ్డ రఘురామయ్య, పేట బాపయ్య, పెదర్ల వెంకటసుబ్బయ్య కాకుమాను లక్ష్మయ్య, నల్లూరి పాపయ్య, అద్దేపల్లి వెంకటగురునాధరామ శేషయ్య శ్రేష్ఠి మొదలగువారము కార్యనిర్వాహకసంఘసభ్యులుగా నుంటిమి.

1924 నవంబరునెలలో కొన్నిస్థానములకు మునిసిపలుఎన్నికలు జరిగెను. అపుడు మునిసిపలుసభ్యులలో మూడవవంతు మంది. ప్రతిసంవత్సరము ఎన్నుకొనుపద్ధతి యుండెడిది. అపుడు జరిగిన ఎన్నికలలో నేను, అద్దేపల్లి వెంకటగురునాధరామశేషయ్యశ్రేష్ఠిగారును కాంగ్రెసుపార్టీపక్షమున మునిసిపలుసభ్యులుగ నెన్నుకొనబడితిమి. 1925 సం॥ ఏప్రిలునెలలో

ధన్వాడ రామచంద్రరావుగారు మద్రాసుకు పోదలచి మునిసిపలు ఛైర్మను పదవికి రాజీనామాపెట్టిరి. అందుమీద నన్ను మునిసిపలుఛేర్మనుగా ఎన్ను కొనిరి. ఆపిమ్మట జాతీయపాఠశాల కార్యక్రమములు చాలాభాగము మ్యునిసిపల్ ఎలిమెంటరీపాఠశాలలో ప్రవేశపెట్టుటవలనను, ద్రవ్యము వసూలుకావడము కష్టముగానున్నందునను జాతీయపాఠశాలను మూసివేసి, దానిని మునిసిపలు హయ్యరుఎలిమెంటరీపాఠశాలగా చేసితిమి. అప్పటికి జాతీయ పాఠశాలలోనున్న ఉపాధ్యాయులను నౌకర్లను మునిసిపలు ఉపాధ్యాయులు గను, నౌకర్లుగాను తీసుకొంటిని. ఆకాలములో మ్యునిసిపాలిటీలకు కమిషనర్లు లేరు. ఛైర్మనుకే సర్వాధికారము లుండెను. కావున జాతీయపాఠశాల ప్రధానోపాధ్యాయులగు తాడేపల్లి వేణుగోపాలరావుగారిని మునిసిపలు ఎలిమెంటరీపాఠశాలల సూపర్‌వైజరుగా నియమించితిని. అటుపిమ్మట ఆయన 1930 సం॥ లో జైలుకుపోయి వచ్చెను. బి. ఏ., ఎమ్. ఏ. కూడ ప్యాసయ్యెను. నేను ఛేర్మనుగానుండగనే 1930లో ఆయనను మునిసిపలుఎకౌంటెంటుగా చేసితిని. ఆపిమ్మట ఆయన మునిసిపలుమేనేజరుగా పనిచేసి ఉపకారవేతనమునుపొంది పరమపదించెను. మాదిరాజు భాస్కరరావుగారిని మునిసిపలుపన్నులు వసూలుచేయు వారంటుఆఫీసరుగా నియమించితిని. కానుకొల్లు రాజశేఖరముగారిని మునిసిపలు హైస్కూలు ఉపాధ్యాయునిగ నియమించితిని. కొంతకాలమునకు వారు బి. ఏ., ఎమ్. ఏ. ప్యాసై యిప్పటికిని బెజవాడ మునిసిపలుహైస్కూలులో ఉపాధ్యాయుడుగ పనిచేయుచున్నారు. నేను జాతీయపాఠశాల కార్యక్రమమునంతను అన్ని ఎలిమెంటరీ పాఠశాలలలోను ప్రవేశపెట్టుటవల్ల నాకును మద్రాసుగవర్నమెంటుకును తగవు లేర్పడెను. వాటినిగురించి ముమ్ముందు తెలిపెదను. 1920 లోనే క్రైస్తవమిషనరీలు బెజవాడలో నడుపుచున్న హైస్కూలును ద్రవ్యలోపముచే మూసివేయుదుమని చెప్పినందున దానిని అప్పటి మ్యునిసిపలుఛేర్మను దినవహి హనుమంతరావుగారు బెజవాడమునిసిపాలిటీపాలనక్రిందకు తీసుకొనిరి. ఆ హైస్కూలును ఛేర్మనుగ నేను నడిపితిని. కాని హైస్కూలుమీద ప్రభుత్వమున కెక్కువ యాజమాన్యము ఉండెను. ప్రధానోపాధ్యాయుడగు అత్తిలి గురుమూర్తిగారు ప్రభుత్వ విద్యాశాఖాధికారి (Director of

Public Instructor) తో చేరి, నేను హైస్కూలులోకూడ జాతీయపాఠశాల పద్ధతులను ప్రవేశపెట్టదలచగా నాకు ప్రతిఘటన కలుగచేసెను.

మా జాతీయపాఠశాల నిర్వహింపబడుచున్నకాలములో వేముల కూర్మయ్య అను హరిజనవిద్యార్థి మెట్రిక్యులేషన్‌వరకు దానిలో చదువుకొన్నాడు. అతను కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారి స్వగ్రామమైన యలకుర్రుగ్రామకాపురస్థుడు. వారిచే ఆ గ్రామములో స్థాపించబడిన ఎలిమెంటరీస్కూలులో చదువుకొని ప్యాసై బెజవాడకు నావద్దకు రాగా మా జాతీయపాఠశాలలో విద్యార్థిగా చేర్చుకొంటిని. అతను నా గృహము లోనే నివసించుచు ఆ పాఠశాలలో చదువుకొనుచుండెను. వంటగదులు తప్ప తక్కిన మా యింటిలో అంతట అతను స్వేచ్ఛగా తిరుగుచు మా పిల్లలతో కలిసిమెలిసియుండెను. మావాళ్లెవరును పంచముల అస్పృశ్యతను పాటించినవారుకారు. బెజవాడలో జాతీయోన్నతపాఠశాలలో మెట్రిక్యులేషనులో కృతార్థుడైన పిమ్మట వేముల కూర్మయ్యను నేను పండిత మదన మోహన మాలవ్యాగారికి లేఖవ్రాసి కాశీ హిందూవిశ్వవిద్యాలయములో చేర్చుకొనవలసినదని వారివద్దకు పంపినాను. పండిత మదనమోహన మాలవ్యాగారు ఆ విశ్వవిద్యాలయమునకు ఉపాధ్యక్షులు, దాని స్థాపకులని కూడ చెప్పవచ్చును. దానిని అత్యంతముగా వృద్ధిచేసినవారు. వారు అదివరకే అనేకసార్లు పంచముల అస్పృశ్యతను రూపుమాపవలెనని దేశములో ప్రచారముచేయుచుండినవారు. నేను వేముల కూర్మయ్యను కాశీ విశ్వవిద్యాలయములో విద్యార్థిగా చేర్పించవలసినదని మహాత్మా గాంధీగారికికూడ వ్రాసినాను. వారు పండిత మదనమోహనమాలవ్యాగారికి గట్టిగ శిఫారసు చేసినారు. అదివరకు ఆ విశ్వవిద్యాలయములో హరిజనులెవరును విద్యాభ్యాసము చేయలేదు. వేముల కూర్మయ్యయే మొదటి హరిజనవిద్యార్థి. అందువల్ల మాలవ్యాగారుకూడ కొంత సంకోచించిరి. కాని మహాత్మాగాంధీగారి పట్టుదలమీద కూర్మయ్యను మెట్రిక్యులేషనుక్లాసులో కాశీ విశ్వవిద్యాలయపు హైస్కూలులో చేర్చుకొనిరి. ప్రథమమున క్లాసులో అతనిని తక్కినహిందూ విద్యార్థులతో కలుపకుండ వేరుగా కూర్చొనబెట్టిరి. క్రమముగ అలవాటై మిగత విద్యార్థులతో అతను పూర్తిగ కలసిపోయెను. మెట్రిక్యులేషను ప్యాసు.

కాగానే విశ్వవిద్యాలయములోని కళాశాలలో ఎఫ్. ఏ., బి. ఏ., ఎల్. ఎల్. బి. క్లాసులలోచేరి తుదకు బి. ఏ., ఎల్. ఎల్. బి. అయ్యెను. పండితమదన మోహనమాలవ్యాగారు కూర్మయ్యకు ఫీజు పుచ్చుకొనకుండ చదువుచెప్పించుటయేగాక విద్యార్థివేతనమునుకూడ నిచ్చిరి. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు అతనికి చాల సహాయము చేయుచుండిరి. నేనుకూడ ఉడుతాభక్తిని సహాయముచేసితిని. హిందువులకు పుణ్యక్షేత్రమగు కాశీనగరములోని హిందూ విశ్వవిద్యాలయములో ప్రథమ హరిజనవిద్యార్థిని చేర్పించిన గౌరవప్రతిష్ఠలు ఆంధ్రదేశమునకు దక్కినవి. ఆంధ్రులు ఉదారభావములు కలవారని, తీవ్ర సంస్కారపరులని పేరువచ్చినది. వేముల కూర్మయ్య విద్యార్థిగా చేరినతరువాత ఎంతమందో హరిజనవిద్యార్థులు ఆ విశ్వవిద్యాలయములో చేరిరి. విద్యార్థుల వసతిగృహములలో తక్కినవిద్యార్థులతో పాటు చేర్చుకొనబడిరి, తక్కిన విద్యార్థులందరితోకూడ కలిసిమెలిసి భుజించిరి. ఇపుడు కేంద్రమంత్రిగానున్న జగజీవనరాంగారు ఆ మరుసటిసంవత్సరము హిందూవిశ్వవిద్యాలయములో చేరెను. వేముల కూర్మయ్య బి. ఏ. ఎల్. ఎల్. బి. ప్యాసై బెజవాడకురాగానే మా నందిగామతాలూకా జగ్గయ్యపేట ఫిర్కానుంచి కృష్ణాజిల్లాబోర్డుకు సభ్యునిగా ఎన్నికచేయించితిమి. 1937 లో మద్రాసుఎసెంబ్లీకి జరిగిన ఎన్నికలలో తూర్పుకృష్ణాజిల్లా పక్షమున కాంగ్రెసుకమిటీవారిచేత వేముల కూర్మయ్య ఎసెంబ్లీ అభ్యర్థిగా నిలబెట్టబడి జయమొంది 1937 మొదలు 39 వరకు ఎసెంబ్లీలో సభ్యుడుగానుండెను. 1940 — 41 వ సంవత్సరములోజరిగిన వ్యక్తిగత సత్యాగ్రహోద్యమములో సత్యాగ్రహముచేసి ఒకసంవత్సరము ఆయన జైలులోనుండెను. పిమ్మట 1946 లో జరిగిన ఎసెంబ్లీఎన్నికలలో మరల సభ్యుడుగా నెన్నుకొనబడి సమిష్టి మద్రాసురాష్ట్రములో 1946 నుంచి 49 వరకు మంత్రిగా పనిచేసెను. ఆపిమ్మటను, ఇప్పటికిని ఆయన ఆంధ్రప్రదేశ్ శాసనసభలో కాంగ్రెసుసభ్యుడుగా నున్నాడు.

# 9 బెజవాడ కాంగ్రెసు కార్యక్రమము, 1921-23 సత్యాగ్రహము

బెజవాడలో అఖిలభారత కాంగ్రెసుకమిటీ - మహా నాయకుల రాక - మూడులక్షల జనము - రామదండు - బెజవాడ కాంగ్రెసుకార్యక్రమ విజయము - గాంధీగారి ఆంధ్ర దేశ సంచారము - చీరాల పేరాల సత్యాగ్రహము - ఖద్దరు, హిందీయుద్యమములు - హైదరాబాదు ముస్లింవిద్యార్థుల సహాయనిరాకరణము - నా రాయలసీమ సంచారము - కల్లూరి సుబ్బారావు - సంజీవరెడ్డి - గాంధీటోపి - మాచర్ల పుల్లరి సత్యాగ్రహము - అరెస్టులు - కన్నెగంటి హనుమంతు యొక్క ఆత్మత్యాగము - బరంపురం సభలు - అరెస్టులు - పెదనందిపాడు పన్నులనిరాకరణము - బ్రిటిషు రాజకుమారుని బహిష్కారము - బెజవాడ మున్సిపల్ పన్నులనిరాకరణము - మేము జైలులోనుండుట - బెజవాడ మునిసిపల్ ఎన్నికలలో కాంగ్రెసువిజయము - రాజమహేంద్రవరము, కడలూరు జైళ్లలో స్వాతంత్రవీరులు - విప్లవకారుడు పృథ్వీసింగు - బార్డోలీ సత్యాగ్రహము - గాంధీగారికి ఆరుసంవత్సరముల శిక్ష - కొండా వెంకటప్పయ్య అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షులు - దుగ్గిరాల గోపాలకృష్ణయ్య ప్రధానకార్యదర్శి - ఢిల్లీ ప్రత్యేకకాంగ్రెసు - నా కలకత్తాప్రయాణము - నాగపుర జాతీయపతాక సత్యాగ్రహము - కాకినాడ కాంగ్రెసు -

బులుసు సాంబమూర్తి - హైదరాబాదునుంచి కాంగ్రెసుకు ప్రతినిధులు - టంగుటూరి ప్రకాశంగారు - స్వరాజ్యపత్రిక - హైదరాబాదులో వసూళ్లు.

(1)

నాగపురము కాంగ్రెసుమహాసభ జరిగినపిమ్మట మొదటి అఖిలభారత కాంగ్రెసుకమిటీసమావేశము 1921 సం॥ మార్చి 31, ఏప్రిలు ఒకటవ తేదీలలో బెజవాడలో అత్యంత ఉత్సాహముతో జరిగెను. అఖిలభారత కాంగ్రెసు కమిటీలన్నియు ఉత్తరహిందూదేశముననే జరుగుచున్నవనియు, ఈ సమావేశమైన ఆంధ్రదేశములోని కూడలిస్థానమైన బెజవాడలో జరుపవలసినదనియు నేను మహాత్మాగాంధీగారితోను, దేశబంధు చిత్తరంజనదాసుగారితోను, అధ్యక్షులైన సేలం విజయరాఘవాచారిగారితోను మనవిచేసి వారితో ఉత్తరప్రత్యుత్తరములు జరిపి, వర్కింగుకమిటీ సభ్యులకందరకు టెలిగ్రాములిచ్చి బెజవాడలో ఆ సమావేశము జరుగునటుల నిర్ణయింపచేసినాను. ఆ సభజరుపుటకు ఏర్పాట్లన్నియు బెజవాడవారము చేసినాము. బందరువారుకాని, గుంటూరువారుకాని మరి యే యితరచోట్లనున్న నాయకులుకాని మాకు సహాయపడలేదు. మేము వారిని సహాయముచేయమని అడగనులేదు. బెజవాడలో బహిరంగసభలుజరిపి అఖిలభారత కాంగ్రెసుకమిటీ బెజవాడకు వచ్చుచున్నదని, మహాత్మాగాంధీ మొదలగు నాయకులందరును వచ్చుచున్నారని ప్రజలకు చెప్పితిమి. ఒక బలవత్తరమైన ఆహ్వానసంఘము నేర్పాటుచేసితిమి. కావలసినద్రవ్యము వసూలయ్యెను. కాని ఆకాలములో మహాసభలు జరుపుటకు తగిన పరికరములు బెజవాడలో లేకుండెను. విద్యుద్దీపములు లేవు. బెజవాడకు విద్యుచ్ఛక్తి 1930 సం॥ లో నేను ఛైర్మెనుగానున్నకాలములో వచ్చినది. 1921 సం॥ లో బెజవాడలో పెట్రోమాక్సు దీపములమీదనే ఆధారపడవలసివచ్చినది. అపుడు దూరశ్రవణయంత్రములు (లౌడుస్పీకరులు) ను లేవు. ఎన్నివేలమందిజనము సమావేశమైనను వక్తలు నోటితోనే బిగ్గరగా ఉపన్యాసము లివ్వవలసియుండెను. బస్సులుకూడ లేవు. మోటారుకారులుకూడ ఒకటిరెండు మాత్రమే యుండెను. నా వద్ద పెద్ద

గుర్రపుబగ్గీమాత్ర ముండెను. దానిని ఆహ్వానసంఘమువారిక్రింద నుంచితిని. లాయరు సి. రాజగోపాలాచారిగారివద్ద కూడ పెద్ద గుర్రపుబగ్గీ యుండెను. కాని ఆయన అపుడు గవర్నమెంటు ప్లీడరగుటచే దానిని మా కిచ్చుటకు భయపడెను. మ్యునిసిపలుఛైర్మను దినవహి హనుమంతరావుగారు కాంగ్రెసు కపుడు వ్యతిరేకముగా నున్నను, మంచినీళ్ళ సప్లయి, పరిశుభ్రత, మొదలైన విషయములలో ఆయన మాకు పూర్తిగ తోడ్పడెను. మార్చి 31 వ తేదీన అఖిలభారత కాంగ్రెసు కమిటీకి బెజవాడ పురపాలకసంఘపక్షమున ఆయన సన్మానపత్రముకూడ సమర్పించెను. నాయకులు వత్తురని మాకు తెలుపుట తోడనే మేము వారి యాగమనమునుగూర్చి పత్రికలలోను, బెజవాడలో జరిగిన బహిరంగసభలలోను ప్రకటించుచుంటిమి. అప్పటికి సినిమాలుకూడ లేవు. అందువల్ల అఖిలభారతకాంగ్రెసుకమిటీసమావేశము గవర్నరుపేటలో మ్యూజియముహాలులో ఏర్పాటుచేసితిమి. పంకాలు అమర్చితిమి. దానికి చుట్టును పెద్ద యావరణము కలదు. చెట్లుకూడా బాగానే ఉన్నవి. మధ్యాహ్నము నాయకులందరు ఆ దొడ్డిలోనే ఫలహారములుచేయుటకు డేరాలు వేయించితిమి. వివిధరాష్ట్రములనుంచి వచ్చెడి సభ్యులను ఒకచోటనేయుంచ దగిన పెద్దభవనములు లేవు. మామూలు కాంగ్రెసుమహాసభ అయినయెడల కొన్ని వందలఎకరములస్థలము ఊరిబైట తీసుకొని ఆరునెలలు కద్దనగ ఏర్పాట్లు మొదలుపెట్టి లక్షలధనము వసూలుచేసి సభలకు గొప్పగొప్ప పాకలు, పందిళ్ళు, ప్రతినిధులుగ ప్రేక్షకులుగ వేలకొలది వచ్చెడివారికి బసలు, భోజనవసతులు చాల పెద్దపెట్టున ఏర్పాట్లుచేసేవారు. అపుడు బెజవాడలో జరిగినది కాంగ్రెసుమహాసభ కాదు, అఖిలభారత కాంగ్రెసుకమిటీ సమావేశమే. రెండుపందలమందికంటె నెక్కుడుగ సభ్యులు రారు. వారికి మాత్రమే బసలు, భోజనములు ఏర్పాటుచేయవలసియుండెను. అందువలన ఒక్కొక్కరాష్ట్రమునుంచి వచ్చిన అఖిలభారత కాంగ్రెసుకమిటీసభ్యులకు బెజవాడలోని యొక్కొక్కప్రముఖునియింటిలో బస ఏర్పాటుచేసితిమి. మా మేడమీద దేశబంధు చిత్తరంజనదాసు, వారితో వచ్చెడి బంగాళీ నాయకులకు బస నేర్పాటుచేసితిమి. ఇటులనే దాసు మధుసూదనరావు గారియింటిలో మోతీలాలునెహ్రూగారికి, వారితోకూడ వచ్చెడివారికి; సింగ



మహాత్మా గాంధి

[ 1920 సం॥ లో విజయవాడ వచ్చినప్పుడు ]

రాజు వెంకటసుబ్బారావుగారియింటిలో లాలా లజపతిరాయిగారికి, వారితో వచ్చెడివారికి; చింతక్రింద సూర్యనారాయణమూర్తిగారియింటిలో ఎన్. సి. కేల్కారుగారికి, వారితోవచ్చెడి వారికి; పెద్దిభొట్లవీరయ్యగారిమేడమీద బాబు రాజేంద్రప్రసాదుగారికి. వారితో వచ్చెడివారికి, ముస్లిమునాయకులకు పాత బస్తీలోని కొన్నిభవనములలోను ఈవిధముగా తలాఒకచోట విడిదులను ఏర్పరచితిమి. గవర్నరుపేటలో బసలుగల సభ్యులందరు సింగరాజు వెంకట సుబ్బారావుగారియింటికే వచ్చి అక్కడ భోజనములుచేయవలయును. చిత్త రంజనదాసుగారుమాత్రము మా మేడమీదనే భుజించిరి, అధ్యక్షులైన సేలం విజయరాఘవాచారిగారికిని, వారితోవచ్చిన తమిళప్రతినిధులకును పాటిబండ్ల వెంకటరమణయ్యగారియింటిలో బస నేర్పాటుచేసి వారే వారిభోజనపు ఏర్పాట్లుకూడ చేయునట్లు చేసితిమి పాతబస్తీలోని ముస్లింనాయకుల భోజ నపుఏర్పాట్లు బెజవాడ ముస్లింప్రముఖులే తమమీద పెట్టుకొనిరి. ఆంధ్ర జిల్లాలనుండివచ్చిన నాయకులు బెజవాడలోని తమతమ స్నేహితులయిండ్లలో దిగిరి. కొండా వెంకటప్పయ్యపంతులు, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, గొల్ల పూడి సీతారామశాస్త్రిగార్లు, యింకా కొంతమంది ఆంధ్రప్రముఖులు మా యింటిలో బసచేసిరి. మహాత్మాగాంధీగారిని, వారితోవచ్చిన మాతా కస్తూరి బాయి, విఠల్‌భాయిపటేలు, సర్దార్ వల్లభాయిపటేల్, మహదేవదేశాయి, శంకరలాల్ బ్యాంకర్ మొదలైన ప్రముఖులను వర్తకులు తమకు వప్పగించ వలసినదని కోరినందున వారిలో ఎక్కువచందానిచ్చిన గోళ్ళ నారాయణ రావుగారిమేడలో నుంచితిమి. భోజనపుఏర్పాట్లనుకూడ వారే చేసిరి. మొత్తముమీద అఖిలభారత కాంగ్రెసుకమిటీసభ్యుల బసలు. భోజనములు సంతృప్తికరముగానే ఏర్పాటుచేయబడెను. ఇపుడు బెజవాడలో గాంధీనగర మని పిలువబడే యావత్ప్రదేశములో ఆ కాలమున గృహములేవియు లేవు. అంతయు నొక మైదానముగ నుండెను. ఆ మైదానముమీదనే బహిరంగ సభలు జరుగుట కొరక ఎత్తైయినవేదిక నమర్చితిమి. కీర్తిశేషులైన అద్దేపల్లి రామశేషయ్యశ్రేష్ఠిగారు ఆహ్వానసంఘమున కధ్యక్షుడు. ఆయన ప్రముఖ పాత్రను వహించెను. కీర్తిశేషులైన కావలి శంకరరావుగారి యాజమాన్య మున, అయ్యంకి వెంకటరమణయ్యగారి మద్దత్తుతో నొక పెద్ద పచ్చికభట

దళము బాగుగా పనిచేసినది. రాయలసీమనుండి యొక యువకుడు కల్లూరు సుబ్బారావు ఇచటికి ఉత్సాహముతోవచ్చి వారిక్రింద పనిచేసెను. కీర్తిశేషులైన విస్సంశెట్టి వెంకటరత్నము శేష్టిగారితో చెప్పి వచ్చేడి ప్రేక్షకులకు ప్రత్యేక పూటకూలిబస నేర్పాటుచేయించినాము. దానివల్లవచ్చే నష్టమును తీర్చుటకు అయిదువేలరూప్యములను వసూలుచేసినాము. ఇదిగాక బెజవాడ బస్తీలో ఆసమయమునకు కొన్ని యితరపూటకూలియిళ్లుకూడ నెలకొల్పబడ్డవి. సభ ప్రారంభమగుటకు క్రిందటిరోజున అబ్బాస్ తయాబ్జీగారును, వారితోవచ్చిన ఇద్దరుసభ్యులును మాయింటికి వచ్చిరి.

బెజవాడ అఖిలభారత కాంగ్రెసుకమిటీయొక్క ప్రత్యేకలక్షణములు మూడు. అప్పటికి జీవించియున్న పేరుప్రతిష్ఠలుగల దాదాపుగా అందరు నాయకులు ఆ సభలకు దయచేసిరి.మహాత్మాగాంధీ,కస్తూర్బాగాంధీ, దేవదాసు గాంధీ, మహదేవదేశాయి, వల్లభాయి పటేలు, విఠల్‌భాయిపటేలు, జమునలాల్‌బజాజ్, శంకర్‌లాల్ బ్యాంకర్, సరళాదేవి,పండితమోతీలాల్‌నెహ్రూ, పండిత జవహర్లాల్‌నెహ్రూ లాలా లజపతిరాయి. చిత్తరంజనదాసు, బాబు రాజేంద్రప్రసాదు, ఎన్. సి. కేల్కారు. సరోజినీదేవి, మహమ్మదాలీ, షౌకతాలీ, అబ్బాస్ తయాబ్జీ, హకీం అజ్మల్‌ఖాను, డాక్టరు అన్సారీ, అబుల్‌కలాం ఆజాద్, డాక్టరు సత్యపాల్, డాక్టరు కిచ్లూ, కాకాసాహెబ్ కాలేల్కర్, శ్రీమన్నారాయణ్ అగర్వాల్, పురుషోత్తమదాస్ టాండన్, డాక్టరు సుందరలాల్,శ్యామసుందరచక్రవర్తి,ప్రొఫెసర్ గిద్వాని,సేనుగుప్త మొదలైన ఉత్తరహిందూస్థానములోని మహానాయకులందరును, దక్షిణ హిందూదేశములోని సి. రాజగోపాలాచారి, టంగుటూరి ప్రకాశము, కొండా వెంకటప్పయ్య. పట్టాభి సీతారామయ్య. బులుసు సాంబమూర్తి, డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం, ఉన్నవ లక్ష్మినారాయణ, వి. వి. గిరి, దేశబాంధవి దువ్వూరు సుబ్బమ్మ, గద్దె రంగయ్యనాయుడు, గొల్లపూడి సీతారామశాస్త్రి, డాక్టరు వరదరాజులునాయుడు, రామస్వామినాయకర్, షఫీఅహమ్మద్ గంగాధరరావు దేశపాండ్య, కె. సంతానం, కృపానిధి మొదలయిన నాయకులును అఖిలభారత కాంగ్రెసుకమిటీలో పాల్గొనిరి. తెలంగాణమునుంచి మాడపాటి హనుమంతరావుపంతులుగారు మొదలయిన నాయకులు ప్రేక్షకు

లుగ వచ్చిరి. భారత కాంగ్రెసునాయకు లెల్లరును అత్యుత్సాహముతో ఎట్టి త్యాగములనైనను గావించి దేశస్వతంత్రపోరాటమును సాగించు దృఢనిశ్చయముతో ఏకాభిప్రాయముతో అపట సమావేశమైనట్లు స్పష్టపడినది

రెండవ ప్రత్యేకలక్షణ మేమనగా అఖిలభారత కాంగ్రెసుకమిటీ మహాత్మాగాంధీజీ ఏకైకనాయకత్వమున స్వతంత్రపోరాటమును సాగించుటకు బెజవాడకు వచ్చుచున్నందున, అఖిలభారత మహానాయకులందరు నందులో పాల్గొనుచున్నందున ఈ విషయమంతయు రోజు రోజు పత్రికలలో ప్రకటింపబడుచున్నందున ఆంధ్రదేశమందు అన్నిజిల్లాలలోను ఉజ్జ్వలమైన నూతన చైతన్యము, ఉత్సాహము, దేశాభిమానము ప్రజ్వరిల్లెను. అన్నివైపులనుంచియు ఆంధ్రయువకులు తండోపతండములుగ భజనలు చేసుకొనుచు కాలినడకనువచ్చుచు తాము ఆగిన గ్రామములలో సభలుచేసి స్వతంత్రోద్యమమును/హర్చి బోధించుచు బెజవాడకు చేరిరి. రైళ్లలో దిగిన జనానికి మేరయేలేదు. ఆంధ్రుల యాశయములకు, ఆదర్శములకు బెజవాడ కేంద్రమయ్యెను. పురుషులనక, స్త్రీలనక, హిందువులనక, ముసల్మానులనక, హరిజనులనక స్వతంత్రేచ్ఛతో దేశాభిమానముతో ఉత్సాహముతో రెండులక్షలమంది ప్రేక్షకులు ఆ బెజవాడ సభలకు హాజరైరి. 'మహాత్మా గాంధీకి జై, కాంగ్రెసుకు జై' అను నినాదములు ఆంధ్రదేశమందంతటను మారుమ్రోగెను. ఆ మహాసభలకు వచ్చిన ప్రేక్షకులందరిలో ప్రత్యేకముగ యందరిదృష్టి నాకర్షించినవారు దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు, ఆయన చీరాల పేరాలనుంచి తీసుకొనివచ్చిన ఎఱ్ఱచొక్కాలు ధరించిన అయిదువందలమంది రామదండు భటసంఘము. వారందరు టిక్కెట్టు కొనకుండానే రైళ్ళలో నెక్కి బెజవాడలో దిగిరి. వారిని టిక్కెట్టు అడుగుటకు రైలుఉద్యోగస్థులకు ధైర్యములేకుండెను. వారినందరిని ఊరకనే రైళ్ళలో నెక్కనిచ్చిరి. వారినందరిని ఊరకనే రైళ్ళనుండి దిగనిచ్చిరి. సముద్రతరంగములవలె యుప్పొంగివచ్చిన ఈ జనసమూహములను చూచి నివ్వెరపడి వారందరు ఏమిచేతురో, ఏ యుపద్రవముకలుగునో అను భీతాహముతో జిల్లామేజిస్ట్రేటు, రాజధాని జిల్లా పోలీసుఅధికారులు, బెజవాడ రైలుస్టేషనులోని విశ్రాంతిగదులలో మకాంచేసి తగిన ప్రత్యేక పోలీసు

సిబ్బందితో అహర్నిశలు వీక్షించుచుండిరి. ఈ వచ్చిన మహాజనము ముందర మేముచేసిన ఏర్పాట్లు సరిపోలేదు. అది మాకు తెలుసును. కాని వారందరు భోజనముకొరకు సౌఖ్యములకొరకు రాలేదు. భోజనము దొరికినంత దొరికినది. విశ్రాంతికి నీడ దొరికినంత దొరికినది. వాటిని వారు లక్ష్యపెట్టలేదు. చాలవరకు భోజనసదుపాయము, విశ్రాంతివసతులు బాగుగనే ఉన్నవి. బస్తీప్రజలందరును వచ్చినప్రేక్షకులను అతిథులవలె ఆదరించినారు.

మూడవ ప్రత్యేకలక్షణము—బెజవాడ అఖిలభారత కాంగ్రెసుకమిటీ తీర్మానములు కాంగ్రెసు స్వతంత్రపోరాటచరిత్రలో చాలా ముఖ్యమైనవిగా పరిగణింపబడుచున్నవి. వాటికి బెజవాడకార్యక్రమమని పేరు. అఖిలభారత కాంగ్రెసుకమిటీసభ్యులంతా రెండురోజులు శాంతముగా బెజవాడ మ్యూజియమ్‌హాలులో సమాలోచనలుజరిపి కొన్ని అత్యంత ముఖ్యమైన తీర్మానములు చేసినారు. స్వతంత్రపోరాటము సాగించుటకు ద్రవ్యము కావలెను. కనుక మూడునెలలలోపల తిలకు స్వరాజ్యనిధి అను పేర కోటిరూప్యములను వసూలుచేయవలెను. రెండవది కాంగ్రెసుసంస్థను మఱ్ఱివృక్షమువలె భారత దేశమంతను వ్యాపింపచేయవలెను. కనుక మూడునెలలలోపల కోటిమంది కాంగ్రెసుసభ్యులను చేర్పవలెను. మూడవది, ఖద్దరును పునరుద్ధరణము చేయవలెను. ఇందుకు ఇరువదిలక్షల రాట్నములను నెలకొల్పవలెను. నాలుగవది, అందరును చేతితోవడికినసూలుతో చేమగ్గములమీద నేయబడినఖద్దరునే ధరించవలెను. అయిదవది, మద్యపానమును నిషేధించవలెను. అస్పృశ్యతను రూపుమాపవలెను. హిందూ, ముస్లిం, క్రైస్తవ, సిక్కు, పారశీమతముల పరస్పరసహనము గౌరవము ఏకత్వము స్థాపించవలెను. ఆరవది, జాతీయపాఠశాలలు విరివిగా నెలకొల్పవలెను. జాతీయభాషగా హిందీని అందరు నేర్చుకొనవలెను. ఈ ముఖ్యమైనతీర్మానములన్నిటిని ఏకగ్రీవముగ అఖిలభారత కాంగ్రెసుకమిటీవారు చేసిరి. అదివరకే మూడు రంగులజండా యుండెను. పింగళి వెంకయ్యగారు జాతీయజండా నమునాను గాంధీగారికి తయారుచేసి యివ్వగా దానిపైన రాట్నచక్రమును చిత్రించి జాతీయజండాగా గాంధీగారు స్థిరపరచిరి. దానిలో ఎరుపురంగు హిందువులను, ఆకుపచ్చరంగు ముస్లిములను, తెల్లరంగు క్రైస్తవాది ఇతర

మతములవారిని తెలుపును. తెల్లికంగుమీద రాట్నపత్రము ముద్రించబడినది. దేశములో ప్రతిచోట జాతీయకీర్తనలు వెల్లివిరిసెను.

బెజవాడప్రజలెల్లరు తమతమవాకిళ్ళలో పందిళ్ళువేసి తోరణములు కట్టుటవల్ల ముఖ్యముగ పాతబస్తీలోని బజార్లన్నియు ఒకేపందిరిగా ఏర్పడెను. మార్చి 31 వ తేదీ ఉదయాన మహాత్మాగాంధీ, కస్తూర్బాగాంధీ, వల్లభాయ్‌పటేల్ గారలు తమ బసనుంచి ఒకకారులో బయలుదేరిరి. ఆ కారులో ముందుభాగమున నేను కూర్చుండి త్రోవచూపించుచుంటిని. వారు వచ్చిన మార్గమంతా పందిరిగా తోరణములతో జాతీయపతాకములతో అలంకరింపబడి శోభాయమానముగా నుండెను. ప్రజలు త్రోవపొడుగున బారులుతీర్చియుండిరి. జయజయధ్వానములు చేసిరి. మహాత్మాగాంధీగారి దర్శనమువల్ల ధన్యులమైతిమని యుప్పొంగిరి. "మహాత్మాగాంధీదర్శనమె పావనము" అనుకీర్తన "మమ్ముత్రోవ మహిని వెలసితివి మహాత్మాగాంధి" అను కీర్తన వీధుల్లో ప్రజాసంఘములచే పాడబడుచుండెను. శ్రీరామచంద్రుడు పట్టాభిషేకమునకై అయోధ్యానగరవీధులగుండ యూరేగినట్టుల తోచెను. ఈ జనముల గుండా గవర్నరుపేటలోని మ్యూజియమ్‌హాలుకు తీసుకొనిపోతిని. ఈవిధముగ బస్తీలోని అన్నిరోడ్లమీద జనములు బారులుతీరి నిలబడి నాయకులు వచ్చుచు పోవుచుండగ జయజయధ్వానములు చేయుచుండిరి. ఈ జనమంతా వచ్చినది నాయకులదర్శనముకొరకే. మొదటిరోజు సాయంత్రము నాయకులను తీసుకొని గాంధీమైదానములోని వేదికవద్దకు వచ్చితిని. కాని జనములలోనుంచి రావడము పోవడము అసాధ్యముగ నుండెను. ఇందుకు ఏదో యొకవైపున కొంతకొంతమంది నాయకులు ఉపన్యసించవలసివచ్చెను. ఆరాత్రి సభ తృప్తికరముగ లేదు. నా గుర్రపుబగ్గీమీద చిత్తరంజనదాసు గారిని, యంగ్ ఇండియా పత్రికాధిపతి జోసెఫుగారిని ఆ జనములోనికి తీసుకొనివచ్చితిని. ఆ మహాజనములో నొకచోటునుంచి ముందుకుపోవుటకు వీలులేకపోయెను. "అక్కడ దాసుగారు ఉపన్యసించుచు దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు చీరాల పేరాలలో చేయుచున్న ధీరోదాత్తమైన మహత్కార్యములనుగూర్చి ఎక్కువగ ప్రశంసించిరి. నేను దానిని తెలుగులోకి తర్జుమా చేసితిని. "అక్కడ మద్రాసుగవర్నరుఅధికారము పోయినది. గోపాలకృ

ష్ణయ్యయే ప్రభుత్వమును వశపర్చుకొన్నాడు" అని దేశబంధు దాసుగారు చెప్పిరి. మీ ఆంధ్రులకు ఆంధ్రాభిమాన మెక్కువేకదా అని దాసుగారు నన్నడిగెను. బంగాళీలకున్నంత రాష్ట్రాభిమానము మాకు లేదని బదులు చెప్పగా పకపకనవ్వెను. గుంటూరులాయరు కొంపల్లి కోటిలింగంపంతులు గారు, ఇంకా కొంతమంది మిత్రులు మాకు తమ మోటారుకారులను ఎరు విచ్చి సాయపడిరి. వాటితో కొంతవరకు పనిజరిగెను.

ఆరాత్రి దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారితో మాట్లాడి తెల్లవారేసరికి ఆ మైదానములో దడులుకట్టి, త్రోవల నేర్పరచి ప్రజలందరు శాంతముగా కూర్చొనునట్లుచేసి, ఈ బాటలమీద నాయకులందరిని త్రిప్పి, ప్రజలకు వారు సందేశములనిచ్చునట్లుచేసి ఎట్టిత్రోపిడి, గల్లంతు లేకుండ అన్నిఏర్పాట్లు చక్కగా జరుపమని నేను గోపాలకృష్ణయ్యగారినికోరగా, వారు తమ రామ దండుచేత ఆ రాత్రియంతయు పనిచేయించి మరునాడు ఉదయపుసభకు, సాయంత్రపుసభకుకూడ ఎక్కడివారక్కడ కూర్చొనునట్లు, నాయకులదర్శ నముచేసి వారిసందేశములను చక్కగావినునట్లు ఏర్పాటుచేసిరి. రెండవరోజు ఉదయము, సాయంత్రముకూడ బహిరంగసభలు తృప్తికరముగ జరిగినవి. ఉదయాన మహాత్మాగాంధీగారితోసహా నాయకులందరు వచ్చి బారులవెంట తిరిగి ప్రజల నుద్బోధించిరి. మహాత్మాగాంధీ అక్కడికిరాగానే ఖద్దరుధరించి వచ్చిన ఆంధ్రయువతి మాగంటి అన్నపూర్ణాదేవి తనవిలువగల పట్టుచీరలను విదేశీచీరలను అన్నిటిని ఆయనయెదుట కుప్పపెట్టి తగులబెట్టి, తన ఆభరణ ములనన్నిటిని ఆయనకు తిలకుస్వరాజ్యనిధి కిచ్చినది. ఆమెభర్త మాగంటి బాపినీడు అపుడు అమెరికాలో యం. యస్. సి. చదువుచుండెను. మాగంటి వారికుటుంబము ఎల్లపుడును జాతీయవాదతత్వముగల కుటుంబమై జస్టిసు పార్టీని తీవ్రముగ ఎదిరించియున్నది. పిమ్మట ఆ యువతి గాంధీగారిసందేశ మును బోధించుచు ఆంధ్రజిల్లాలలో సంచారముచేసి ఏలూరులో ఖద్దరు సంస్థను కొంతకాలము నడిపి, క్షయరోగమునకుగురియై భర్త అమెరికా నుంచి వచ్చిన కొద్దినెలలకు లేబ్రాయమునందే 1926 లో స్వర్గస్థురాలైనది. ఆ సాయంత్రముమాత్రము పని ఎక్కువగానున్నందున మహాత్మాగాంధీగారు, చిత్తరంజనదాసుగారు బహిరంగసభకు రాలేకపోయిరి. ఆసభకు రమ్మని

దాసుగారినికోరగా జాతీయవిద్యాయుపసంఘమున కధ్యక్షులుగనుండి విద్యా విధానమును తయారుచేయుచున్నందున వచ్చుటకు వీలులేదని చెప్పిరి. ఆయనవద్ద నాకు చాల చనువుండెను. గాంధీగారు తొందరపనిలోనున్నందున రమ్మనిఅడుగుటకు నాకు సాహసములేకపోయినది. అందువల్ల కొందరికి అసంతృప్తికలిగినదని తెలిసినది. మాయూరివర్తకులగు విస్సంశెట్టి వెంకటరత్నంశ్రేష్టి, అద్దేపల్లి వెంకటగురునాధరామశేషయ్యశ్రేష్టి మొదలగు కొంతమంది కొంతసొమ్ము కానుకలుగా తీసుకొనివచ్చిరనియు, మహాత్మాగాంధీగారు రాకపోవుటవల్ల దానిని మరల తీసుకొనివెళ్ళి బసలోనే వారికి సమర్పించిరనియు తెలిసినది.మిగిలిన నాయకులందరును ఆ సాయంత్రము బహిరంగ సభలో తమ సందేశములనిచ్చిరి.

ఒక విచారకరమైనవిషయమేమనగ, మహాత్మా గాంధీగారు గాంధీ మైదానములోని మహాసభలో ఆ సాయంత్రము ప్రజలకు సందేశమిచ్చెదరని ప్రకటించినందున కస్తూర్బాగాంధీగారును, దేవదాసుగాంధీగారును, మహాత్మా గాంధీగారు సాయంత్రము పుచ్చుకొను రొట్టె వగైరాలను ఆ మహాసభ వద్దకు తీసుకొనివచ్చి వేచియుండిరి. మహాత్మా గాంధీగారు రాలేదు. సాయంత్రము ఆరుగంటలైనతరువాత వారు భోజనముచేయరు. అందువల్ల ఆ రెండవరాత్రి మహాత్మాగాంధీగారు ఉపవాసముచేసిరి. ఇది నా కెంతో దుఃఖము కలుగచేసినది. మా యింటిలో నా కతిథిగానున్న కొండా వెంకటప్పయ్య పంతులుగారుకూడ చాల విచారమునుపొందిరి.ఏర్పాట్లలో లోపము జరిగెనని చెప్పిరి. నేనుకూడ అటులనే తలచితిని కాని, దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారు ఆ వెంటనే నన్ను కౌగలించుకొని అన్నిఏర్పాట్లు మీరు బాగుగ చేసినారు. ఇటువంటి చిన్నచిన్న తప్పులు జరుగకమానవు అని నాకు ప్రోత్సాహమిచ్చి వెంకటప్పయ్యగారిని శాంతింపచేసిరి. దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారి వలంటీరులలో మల్లాది యజ్ఞనారాయణ మొదలగు కొంత మందికి భోజనము కావలసివచ్చెను. ఆయన మా యింటిలోపలికి పోయి అక్కడున్న భోజనమును స్వయముగ వలంటీరులకు వడ్డించెను. రెండవ రాత్రి తెల్లవారుఝామున నాయకులందరు ఎక్కడివారక్కడ రైళ్లలో వెళ్ళి పోయిరి. నేను మహాత్మా గాంధీగారిదగ్గర శెలవుతీసుకొనుటకు పోయి గత

రాత్రి జరిగిన అపచారమును మన్నించమని వేడుచు వారిపాదములకు మ్రొక్కితిని. ఆయన నన్ను పైకిలేవనెత్తి "ఇది నాకు సామాన్య విషయమే. నేను తరచుగ నాసంచారములో ఉపవాసములు చేయుచునేయుందును. ఇందువల్ల నాకు అనారోగ్యముకాని అలసటకాని కలుగలేదు" అని సెలవిచ్చుట వల్ల మనశ్శాంతికలిగెను. బెజవాడ అఖిలభారతకాంగ్రెసుకమిటీకార్యక్రమ ప్రకారమే మూడునెలలలోపల కోటిరూప్యముల తిలకుస్వరాజ్యనిధి పూర్తిగ వసూలైనది. ఇంకొక పదిహేనువేలు అధికముగానే వసూలైనది. మా విజయవాడపట్టణములోను, పశ్చిమ కృష్ణాజిల్లాలోని గ్రామములలోను కాంగ్రెసువారమందరము సంచారముచేసి మాకు నిర్ణయించబడిన మొత్తము వసూలుచేసి యిచ్చితిమి. అటులనే ఆంధ్రరాష్ట్రము కొంతవరకు నిర్ణయింపబడిన మొత్తముకంటె ఎక్కువగనేరొఖ్ఖరూపమున,నగలరూపమునచెల్లించినది. దేశమందంతటను 20 లక్షల రాట్నములు నెలకొల్పబడినవి. గ్రామములలోని యిండ్లలో అటకలమీద దాచబడిన రాట్నములు క్రిందికిదించి స్త్రీలు నూలుదారములు తీయనారంభించినారు. ఖద్దరుపనిఅంతా తీవ్రముగా ప్రారంభమైనది. కోటిమంది కాంగ్రెసుసభ్యులను చేర్చేవిషయములో మాత్రము అరవై లక్షలమందే సభ్యులైనారు. బెజవాడమహాసభలు ఎట్టి అల్లరులు లేకుండ అతిశాంతముగా జరిగినవి. ఆంగ్లేయప్రభుత్వముమీద గొప్ప తిరుగుబాటు ప్రారంభమైనను ఒక ఆంగ్లేయునికిగాని, ఒక ప్రభుత్వోద్యోగికి కాని అపాయము, అవమానము జరుగలేదు. మహాత్మా గాంధీగారి అహింస, సత్యము అను సిద్ధాంతములు దేశములో బాగుగ స్థాపితమగుచున్నవనుటకు ఇది గొప్ప నిదర్శనము. ఇందుకు ప్రభుత్వోద్యోగులుకూడ ఆశ్చర్యపడినారు. ఏలూరు కాంగ్రెసుప్రముఖులు తిలకుస్వరాజ్యనిధికి ఒక లక్షరూప్యములను వసూలుచేసి జాతీయపాఠశాలను నెలకొల్పి మహాత్మాగాంధీగారిచే ప్రారంభోత్సవము చేయించినారు. దానికి గజవల్లి రామచంద్రరావు, ఎం.ఏ.గారు ప్రథమమున ప్రధానాచార్యులుగా నుండిరి. ఈయన 1907 సంవత్సరములో వందేమాతరంపతకములను ధరించినందుకు రాజమహేంద్రవరం ఆర్ట్సుకళాశాలనుండి మార్కు హంటరుగారిచే వెళ్లగొట్టబడిన విద్యార్థి. వైశ్య ప్రముఖులగు మోతే గంగరాజు మొదలగువారు ఈ సొమ్ము వసూలుచేయుటకై బాగుగ కృషిసలిపిరి.

బెజవాడలో అఖిలభారతకాంగ్రెసుకమిటీ సమావేశమునకు మహాత్మా గాంధీగారు, కస్తూర్బా, కార్యదర్శి మహదేవ దేశాయి మొదలగువారితో కలసి వచ్చుచుండగా, ఆంధ్రకాంగ్రెసునాయకులును, అఖిలభారతకాంగ్రెసు వర్కింగుకమిటీ సభ్యులు నగు కొండా వెంకటప్పయ్యగారును, వారికి కుడి భుజముగాపనిచేసిన గొల్లపూడిసీతారామశాస్త్రిగారును ఎదురుపోయి పూరిజగన్నాధమునుంచి తీసుకొనివచ్చిరి. మార్గమధ్యమున ఆంధ్రదేశము లోనిబరంపురము, అనకాపల్లిలో గాంధీగారు ఉపన్యసించి బెజవాడ వచ్చిరి. బెజవాడసభ ముగియగానే మహాత్మాగాంధీగారు కొండా వెంకటప్పయ్యగారిని వెంటబెట్టుకొని వారంరోజులు ఆంధ్రదేశసంచారముచేసిరి. ఆ సంచారములో కాకినాడ, రాజమహేంద్రవరము, ఏలూరు, బందరు, గుంటూరు, చేబ్రోలు, బాపట్ల, చీరాల, రామనగరం, వేటపాలెం, నెల్లూరుపట్టణములను దర్శించిరి. అచటి కాంగ్రెసునాయకులు గొప్పసభల నేర్పాటుచేసిరి. మహాత్ములవారి దివ్యసందేశములను ఆంధ్రప్రజలు వేలకు వేలుగ వచ్చి వినిరి. ప్రతిచోటను అత్యంతదేశాభిమానము ప్రజ్వరిల్లెను. మహాత్మాగాంధీకీ జై, కాంగ్రెసుకు జై అను నినాదములు చెలరేగెను. తిలకు స్వరాజ్యనిధికి ప్రజలు విరివిగా విరాళములనిచ్చిరి. స్త్రీలు ఆభరణము లను కానుకగానిచ్చిరి. అదివరకే గ్రామపంచాయితీలుగానున్న చీరాల, పేరాల గ్రామములనుకలిపి మ్యునిసిపాలిటీని చేయవలెనని మద్రాసుప్రభుత్వము సంకల్పించగా ప్రజ లొప్పుకొనక అవి పంచాయితీలుగా నుండవలెగాని, మ్యునిసిపాలిటీ తమకు ఇష్టములేదని సభలుచేసి తీర్మానములుచేసి పంపినను మహజర్లుపెట్టుకున్నను ప్రభుత్వం లక్ష్యపెట్టక వాటిని మ్యునిసిపాలిటీగ చేసినామని ప్రకటించి, అధికపన్నులు విధించిరి. దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు ప్రజలలో ధైర్యోత్సాహములు పురికొల్పి వారిచేత పన్నులనిరాకరణము గావింపచేసిరి. అందుకుకూడ ప్రభుత్వము లొంగనందున ఆ రెండుగ్రామముల ప్రజలందరిని రామనగరు అను నూతనముగ నిర్మింపబడిన గ్రామమునకు తీసుకొనివచ్చిరి. అక్కడ మ్యునిసిపాలిటీ లేదు. పన్ను లివ్వనక్కర లేదు, గ్రామస్తులందరు తమయిండ్లకు తాళములువేసి, ఈ రామనగరుకు వచ్చివేసిరి. దేశములో అప్పటికే చెలరేగుచున్న అసహాయోద్యమమువల్ల

బ్రిటిషుప్రభుత్వము పడిపోయి స్వరాజ్యమువచ్చునని ప్రజలు నమ్మిరి. తుదకు ఈ ఉన్నప్రభుత్వమైన ప్రజలకోరికలకు లొంగకమానదని తలచిరి. గోపాల కృష్ణయ్యగారు రామదండు నేర్పరచిరి. శాసనోల్లంఘనములో స్త్రీలు, పురుషులు జైళ్ళకుపోవుచుండిరి. దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారినాయకత్వమున చీరాల, పేరాలలో జరిపిన సత్యాగ్రహములో ప్రదర్శించిన ఐకమత్యము, త్యాగము భారతదేశమంతట ప్రసిద్ధిచెందినవి. మహాత్మాగాంధీగారు తన ఆంధ్రదేశసంచారములో దీనినికూడ చూచిరి. తమ ఆశీర్వాదముల నిచ్చిరి గాని, "ఇది జయప్రదమైనచో ఆ గౌరవమంతా మీతోపాటు కాంగ్రెసు పంచుకుంటుంది. ఇది అపజయమైతే దానిబాధ్యతయంతయు మీదే;" నని చెప్పిరి. డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారు ఆతరువాత కొద్దికాలమునకు గోదావరియొడ్డున తమ సుప్రసిద్ధ గౌతమీ సత్యాగ్రహాశ్రమమును స్థాపించిరి. దిగుమర్తి హనుమంతరావుగారు నెల్లూరుజిల్లా పల్లిపాడులో నొక గాంధీఆశ్రమమును స్థాపించిరి. మహాత్ములవా రా సంచారములో ఆఖరున నెల్లూరుకుపోయి యుపన్యసించిరి. అక్కడ హిందూపత్రికాధిపతులగు కస్తూరి రంగయ్యంగారు మహాత్ములవారిని కలుసుకొని చెన్నపట్టణము తీసుకొనివెళ్ళిరి.

మహాత్మా గాంధీగారు కొండా వెంకటప్పయ్య పంతులుగారితో కలసి చేసిన ఆంధ్రదేశసంచారము మహాత్మా గాంధీగారికి సంతృప్తిని కలుగచేసినది. ఆంధ్రదేశములోని మారుమూలలన్నిటిలో దేశాభిమానము స్వరాజ్య సంపాదనాదీక్ష బాగుగా కనపడినవి. ఎక్కడికిపోయినను ఖద్దరుధరించినవా రెక్కువగా గాన్పించిరి. అస్పృశ్యతానివారణప్రయత్నములుకూడ జయప్రదముగా జరుగుచుండెను. హిందీభాష నాంధ్రప్రజలు శ్రద్ధగా చదువుకొన సాగిరి. తిలకు స్వరాజ్యనిధికి ద్రవ్యమును, ఆభరణములను ఇచ్చిరి. లాయర్లు, విద్యార్థులుమాత్రమేగాక వందలకొలది గ్రామోద్యోగులు రాజీనామాల నిచ్చుచుండిరి. హిందూ-ముస్లిం ఐక్యత బలముగ నుండెను. ఆ కాలమున అలిఘరులోని ముస్లింవిశ్వవిద్యాలయము కాంగ్రెసు-ఖిలాఫతు ఉద్యమమునకు, అసహాయోద్యమమునకు గొప్పకేంద్రమయ్యెను. విద్యార్థులు చాలమంది కళాశాలలను వదలి జాతీయవిద్య నభ్యసించసాగిరి. కళాశాల

లను వదలి సహాయనిరాకరణముచేసినవారిలో (1) మక్బూల్ ఆలీ (వీరు తర్వాత సివిలుసర్జనుగ యుద్యోగమును చాలించిరి.) (2) మహమ్మదు హుస్సేన్ (వీరు పిమ్మట రాజగోపాలాచారితోకలసి రాయవేలూరు జైలులో నుండిరి. పబ్లికురికార్డ్సు డై రెక్టరుగా పనిచేసి ఫింఛన్ పొందిరి.) (3) యూసుఫుద్దీన్ (పిమ్మట రైలువే డిప్యూటీ ఆడిటరు జనరలుగా రిటైరు అయిరి.) (4) అక్బర్ఆలీఖాను (పిమ్మట బారిస్టరుప్యాసై ఇపుడు పార్ల మెంటుసభ్యుడుగ నున్నారు.) (5) హమీదుద్దీను మహమూదు (ఇనాం కమీ షనరుగ నున్నారు.) (6) ఫక్రుద్దీన్ ముసూమ (అల్లాయుద్దీన్ పరిశ్రమల మేనేజరుగానున్నారు.) (7) సయ్యదు మహమ్మదు అన్సారీ (బి. ఏ. యల్. యల్. బి. ప్యాసై అడ్వొకేటుగ నున్నారు.) మొదలైన హైదరా బాదు ఆంధ్ర ముస్లింవిద్యార్థులు గలరు. వీరందరు పిమ్మట హైదరాబాదుస్టేటులో పైన చెప్పినవిధమున పెద్దయుద్యోగములు చేసియున్నారు. అఖిలభారతకమిటీ సమావేశము ముగియగనే బెజ వాడలో దాసు మధుసూధనరావుగారొక ఖద్దరుకేంద్రమును స్థాపించి, విరివిగ ఖద్దరు నితరరాష్ట్రముల కెగుమతిచేయించిరి. శ్రీకాకుళంజిల్లాలోని పొం దూరులో తయారయ్యే అతిసన్నని చేనూలుఖద్దరువస్త్రములు నాజూకుతనము నకు ప్రసిద్ధిచెంది ఆంధ్రఖద్దరు యావద్భారతదేశములో ప్రథమస్థానము నాక్రమించినది. 1921 వ సంవత్సరాంతమున మధుసూధనరావుగారు మరల ప్లీడరీవృత్తిలో ప్రవేశించినందున నేను అద్దేపల్లి వెంకటగురునాధరామ శేషయ్యశ్రేష్ఠిగారు ఆఖద్దరుకేంద్రమును తీసుకొని మేమిద్దరము నోట్లువ్రాసి అఖిలభారత చర్ఖాసంఘమువద్ద రు 2500 లు అప్పుతెచ్చి దానిని నడిపితిమి. మా పశ్చిమకృష్ణాజిల్లాలో ఖద్దరువుత్పత్తి, ఖద్దరువ్యాపకము జయప్రదముగా జరిపితిమి, ఆంధ్రదేశములోకెల్ల విజయవాడయే ఖద్దరునిలయమును జయ ప్రదముగానడిపినది. బందరులో డాక్టరుపట్టాభిసీతారామయ్య,దుగ్గిరాల రాఘవ చంద్రయ్యగారలు తూర్పుకృష్ణాజిల్లాలో సంచారముచేసి ఖద్దరుత్పత్తికేంద్రము లను నెలకొల్పిరి. ఇటులనే గుంటూరుజిల్లాలో కొండా వెంకటప్పయ్య, గొల్లపూడి సీతారామశాస్త్రిగార్ల నాయకత్వమున జరిగెను. కృష్ణాజిల్లా అంగ లూరులో జాతీయపరిశ్రమాలయమనుపేరుతో ఖద్దరునిర్మాణశాలను దుగ్గిరాల

రాఘవచంద్రయ్య, ఆరికెపూడి రామశాస్త్రిలు, ఎర్నేని సుబ్రహ్మణ్యంగార్లు స్థాపించి 1946 వరకు నడిపిరి. బందరు, రాజమహేంద్రవరము, బెజవాడ లోని జాతీయవిద్యాలయములుగాక, గుంటూరుజిల్లాలో నొక జాతీయవిద్యా కమిటీ ఏర్పడినది.దానికి గుళ్ళపల్లి రామకృష్ణయ్యగా రధ్యక్షులుగను బ్రహ్మాండం నరసింహంగారు కార్యదర్శిగను పనిచేసి పదహారు జాతీయపాఠశాలలను ఆ జిల్లాలో స్థాపించిరి. అవి కొన్నిసంవత్సరములు పనిచేసినవి. ఆంధ్ర రాష్ట్రము సర్వవిధముల గాంధీగారియం దెక్కువ భక్తిగల రాష్ట్రముగ విలసిల్లెను.

మహాత్మాగాంధీగారు జాతీయస్వతంత్రపోరాటమునకు నాయకత్వము వహించినప్పటినుండియు భారతదేశములోని వివిధరాష్ట్రములలో ఆ యా రాష్ట్రభాషలు వృద్ధిచేయబడవలసియున్నప్పటికిని దేశమునకంతకు నొక జాతీయభాష యుండవలెనని భారతీయులలో అధికసంఖ్యాకులకు తెలిసిన హిందీభాషయే జాతీయభాష కావలెననియుః తలచి దక్షిణహిందూదేశములో హిందీభాషను వ్యాపింపచేయుటకై 1918 నుండి ప్రయత్నములుచేయసాగిరి. ఆసంవత్సరము మేనెలలో హోంరూలులీగుకార్యస్థానమైన మద్రాసునగరములోని గోఖ్లే హాలులో డాక్టర్ అనిబిసెంటమ్మగారి అధ్యక్ష్యతను హిందీ సాహిత్యసమ్మేళన ప్రచారకార్యాలయము స్థాపించబడినది, అప్పటినుంచి ఆపేరుననే 1927 సం॥ వరకు పనిచేసినది. ఆంధ్ర, అరవ, కర్ణాటక, మళయాళ రాష్ట్రములలో హిందీని బాగుగ వ్యాపింపచేసినది. హరిహరశర్మగారు మోటూరి సత్యనారాయణ గారును ఈ హిందీప్రచారమునకంతకు నాయకత్వమువహించి నడిపిరి. ఆంధ్రలో కృష్ణా, గుంటూరు, పశ్చిమగోదావరి, తూర్పుగోదావరి, నెల్లూరు, కడప మొదలైన జిల్లాలన్నిటిలో జిల్లాశాఖలు పెట్టి, హిందీని సర్వవిధముల వ్యాపింపచేయుటకు పాఠశాలలను స్థాపించిరి. బందరు ఆంధ్రజాతీయకళాశాలలోను, 1921 వ సంవత్సరమునుంచి ఆంధ్ర దేశములో స్థాపింపబడిన బెజవాడ, గుంటూరు, ఏలూరు మొదలగుచోట్ల అన్ని జాతీయపాఠశాలలలోను హిందీ నిర్బంధభాషగ నేర్పబడుచువచ్చెను. ఆంధ్రదేశములో ప్రధానహిందీవ్యాపకుడుగ 1922 నుంచి ఉన్నవ రాజ గోపాలకృష్ణయ్యగారు పనిచేసిరి. 1925లో కృష్ణాజిల్లాలో స్థాపించబడిన

జిల్లా హిందీప్రచారమండలికి నన్ను అధ్యక్షునిగ నెన్నుకొనిరి. 1923 లో కాకినాడలో కాంగ్రెసుమహాసభజరిగినపుడు హిందీసమ్మేళనముకూడ జమునాలాల్ బజాజ్‌గారి అధ్యక్షతక్రింద జరిగెను. దానివల్ల ఆంధ్రజిల్లాలలో హిందీవ్యాపకమునకు గొప్ప దోహదము కలిగెను. 1924 నుంచి విజయవాడ, గుంటూరు, నెల్లూరు మునిసిపలుపాఠశాలలలో హిందీని ప్రవేశపెట్టి నేర్పించసాగితిమి. అపుడున్న జస్టిస్‌పార్టీవారు అభ్యంతరపరచిరి. కాని 1927లో వచ్చిన జాతీయపార్టీ నాయకుడు, ముఖ్యమంత్రియైన డాక్టరు సుబ్బరాయనుగారు హిందీని పాఠశాలల్లో నేర్పుటకు అనుజ్ఞనిచ్చిరి. 1927 లో దక్షిణభారత హిందీప్రచారసంఘము మద్రాసులో స్థాపింపబడి, అప్పటినుంచి విశేషముగ పనిచేయుచున్నది. 1936 లో ఆంధ్రరాష్ట్రహిందీప్రచారసంఘము రిజిష్టరుచేయబడినది. కొన్నిరోజులు అది ఆంధ్రరత్నభవనములో నుంచబడి పిమ్మట స్వంతభవనము నిర్మింపబడ్డది. నేను కొంతకాలము ఆ సంఘమునకు ఉపాధ్యక్షుడుగ నుంటిని. కొండా వెంకటప్పయ్యపంతులుగారు చాలసంవత్సరములు అధ్యక్షుడుగ నుండిరి. వారు మరణించినపిమ్మట టంగుటూరు ప్రకాశంపంతులుగారు, పిమ్మట డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారు అధ్యక్షులుగ నున్నారు. తమిళదేశములో హిందీకి వ్యతిరేకముగ రామస్వామినాయకర్‌పార్టీయైన ద్రవిడఖజగం తీవ్రముగా ప్రతిఘటించుచున్నప్పటికిని ఆంధ్రదేశములో హిందీయందు ఏకగ్రీవమైన అభిమానము, అభిలాష కలవు. మహాత్మా గాంధీగారు ఆంధ్రదేశసంచారములో ఆంధ్రదేశీయులు జాతీయభాషయైన హిందీఎడల చూపుచున్న అభిలాషకు చాల సంతోషించిరి. హిందూస్థానీని తేలికభాషగచేసి దేవనాగరిఅక్షరములలోను, ఉరుదు (అరబి) అక్షరములలోను నేర్చుకొనుట యుక్తమని ఆయన యుద్దేశ్యము. రాజగోపాలాచారిగారి ప్రధానిత్వములో మేమందరము 1937 వ సంవత్సరములో మద్రాసు కాంగ్రెసుప్రభుత్వములో నున్నపుడు ఒకటి, రెండు, మూడు ఫారములకు హిందీని నిర్బంధముచేసి జకరు హుస్సేన్, మోటూరి సత్యనారాయణగార్ల సహాయముచే ఒకేపాఠమును దేవనాగరిలిపిలోను ఉరుదు లిపిలోను వుండునట్లు పుస్తకములను ప్రచురింపించి పాఠశాలలలో నర్పించితిమి. 1952 మొదలుకొని 1956 వరకు ఐదుసంవత్సరములలో మొత్తముమీద

4 లక్షల 85 వేల 632 మంది ఆంధ్రదేశమునుంచి హిందీపరీక్షలలో నుత్తీర్ణులైరి.

(2)

1921 వేసంగిలో ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుకమిటీ కొండా వెంకటప్పయ్య గారి అధ్యక్షతక్రింద గుంటూరులో జరిగినది. అందులో నేను రాయలసీమలో సంచారముచేసి దౌర్జన్యరాహిత్య సహాయనిరాకరణోద్యమమునుగూర్చి యుపన్యాసములనిచ్చి ప్రబోధముగావించవలెనని నన్ను నియమించుట తీర్మానించిరి. ఆప్రకారమే నేను నరసరావుపేట, మార్కాపురము, కంభం, నంద్యాల, కర్నూలు, బేతంచెర్ల, గుంతకల్లు, అనంతపురము, గుత్తి, పెనుగొండ, తాడిపత్రి, ధర్మవరము, కదిరి, హిందూపురము, మదనపల్లి, చిత్తూరు, తిరుపతి పట్టణములలో షుమారు 25 రోజులు సంచారముచేసి యుపన్యసించి వచ్చితిని. ఒక సి. ఐ. డి.పోలీసుసబ్ఇన్స్పెక్టరు ప్రత్యేకముగ నియమింపబడి నాసంచారమంతటిలో నాతోవచ్చి నా యుపన్యాసముల నన్నిటిని వ్రాసుకొనెను. అప్పటికి రాయలసీమలో కొంచెముగా రాజకీయ చైతన్యము కలిగియుండెను. కొంతమంది మిత్రులు ఆసంవత్సరం మార్చి నెలలో బెజవాడలోజరిగిన అఖిలభారత కాంగ్రెసుకమిటీ సమావేశమునకు వచ్చియుండిరి. రాయలసీమలోనెల్ల మిగుల ప్రఖ్యాత కాంగ్రెసునాయకుడైన కల్లూరి సుబ్బారావుగారు అపుడు 24 సం॥ యువకుడు. ఆంధ్ర కర్నాటక భాషలలో పండితుడు. 1920 లో మహానందిలో జరిగిన ఆంధ్రమహాసభ లకు వచ్చి ఆయన మంచి యుపన్యాస మిచ్చినాడు. మహానందిలో మేము కలిసినాము. దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారితో ఆయన సన్నిహితసంబంధ మేర్పరచుకొనెను. బెజవాడ అఖిలభారత కాంగ్రెసుకమిటీకి ఆయన వచ్చి ఐచ్ఛికసేవకుడుగ పనిచేసినాడు. రాయలసీమలోకూడ కొంతమంది లాయర్లు, విద్యార్థులు అప్పటికే తమవృత్తులను తమ చదువులను సహాయ నిరాకరణోద్యమములో మానివేసియుండిరి. నాసంచారములో నేను మార్కాపురం వెళ్లినపుడు అచట బహిరంగసభకు పూర్ణచంద్రరావుగారు అను లాయరు అధ్యక్షతవహించెను. కంభంలో నొక రెడ్డియువకుడు నాకు బహిరంగసభ నేర్పాటుచేసెను. నంద్యాలలో పాణ్యం రామచంద్రయ్యగారు అను

లాయరు తనవృత్తిని సహాయనిరాకరణోద్యమములో మానుకొనియుండెను. కాసరబాద నరసింగరావు, మహానందయ్య, కైప సుబ్రహ్మణ్యశర్మ, దేశ పాండ్య సుబ్బారావుగారలుకూడ ప్రముఖ కాంగ్రెసువాదులుగా నుండిరి. నే నుపన్యసించిన బహిరంగసభకు పాణ్యం రామచంద్రయ్యగారు అధ్యక్షత వహించిరి. మరునాడు కర్నూలులో అచటి మిత్రులు బహిరంగసభ నేర్పాటు చేసిరి. బి. నారాయణమూర్తిగారను లాయరు తనవృత్తిని విసర్జించియుం డెను. శంకరరెడ్డిగారను బి. ఏ. విద్యార్థి తనచదువును మానివేసియుండెను. కర్నూలులో తుంగభద్రానదీతీరమున రెండుమూడువేలమంది సమావేశమై నా ఉపన్యాసము వినిరి. నారాయణమూర్తిగా రధ్యక్షతవహించిరి అనంత పురములో కాంగ్రెసునాయకుడు ఎ. పి. కవిగారు మండపమువద్ద బహిరంగ సభ నేర్పాటుచేసిరి. ఆయన 1921 వ సంవత్సరాంతమున ఆంగ్లేయరాజకుమా రుని బహిష్కారహరతాళములో అరెస్టుచేయబడి జైలుశిక్ష ననుభవించెను. అనంతపురములో గుత్తి కేశవపిళ్లెగారిని చూచితిని. ఆయన హోం రూలులో గట్టిగాపనిచేసిరి. కాని గాంధీగారియుద్యమములో చేరలేదు. ధర్మవర ములో హత్తి శివరావు, హత్తి శంకరరావుగారలను కలిసితిని. వారిద్దరూ హోంరూలుఉద్యమములో అదివరకే చేరి కాంగ్రెసులో నాయకులుగనుండిరి. శంకరరావుగారు కొంతకాలము అఖిలభారత కాంగ్రెసుసభ్యుడుగ కూడ నుండెను. అచట జరిగిన బహిరంగసభలో శంకరరావుగారు అధ్యక్షత వహించిరి. నేను అచటికి వెళ్ళినదినములలోనే డాక్టరు ఆచంట లక్ష్మీపతి గారు ధర్మవరములోజరిగిన ఆయుర్వేదమహాసభకు వచ్చిరి. దానికి నేను కూడ వెళ్ళితిని. కదిరిలో లక్ష్మీనరసింహస్వామివారి దేవాలయముఎదుట సభజరిగెను వై. నారాయణరెడ్డి, సుబ్బాశాస్త్రిగా రచట కాంగ్రెసునాయకు లుగ నుండిరి. గుత్తిలో ఓబిరెడ్డిగారు, సేతంరావుగారు కాంగ్రెసుప్రముఖు లుగ నుండిరి. వారే నా బహిరంగసభ నేర్పాటుచేసిరి. తాడిపత్రిలో కలచ వీటి వెంకటరమణాచారి, సి. వి. వెంకటరంగాచారి, కె. శ్రీనివాసాచారిగారలు కాంగ్రెసుప్రముఖులుగనుండిరి వారే బహిరంగసభ నేర్పాటుచేసిరి. నేను హిందూపురం వెళ్ళగా అక్కడ కల్లూరిసుబ్బారావుగారు, మలుగురి గురుమూర్తి గారు నన్ను కలిసిరి. బహిరంగసభలో కల్లూరి సుబ్బారావుగారు తాను అప్పటి

నుంచి కాంగ్రెసుసేవకే తనజీవితమును అంకితముచేసుకొనుచున్నానని ప్రకటించెను.ఆయన అదివరకు ఉపాధ్యాయుడుగ నుండిరి. దానిని వదలివేసి కాంగ్రెసుకు నాయకత్వమువహించిరి.

అప్పటినుంచి స్వతంత్రపోరాటములో యావజ్జీవముకృషిసలిపి ప్రతిపర్యాయము జైలుకువచ్చి, ఆంధ్రదేశములో గొప్ప కాంగ్రెసునాయకుడయ్యెను. గొప్ప వక్త. పిమ్మట కొన్నిపర్యాయములు శాసనసభ్యుడై డిప్యూటీస్పీకరై ఇపుడుకూడ ఆంధ్రప్రదేశ్ఎసెంబ్లీలో ప్రముఖసభ్యుడుగ నున్నాడు. నేను కల్లూరు సుబ్బారావుగారు కలసి పెనుగొండ వెళ్ళితిమి. అచట బహిరంగ సభ జరిగెను. మే మచట శివశంకరంపిళ్ళైగారిని దర్శించితిమి. ఆయన తీవ్రముగ హోంరూలుఉద్యమములో పనిచేసెను. కాని, గాంధీయుద్యమములో చేరలేదు. ఆయన మా బహిరంగసభకు వచ్చెను. నేను పిమ్మట గూడ కొన్నిపర్యాయములు కాంగ్రెసుప్రచారమునకై పెనుగొండ వెళ్ళినప్పడల్లా వారిని దర్శించివచ్చేవాడను. పెనుగొండలో తిరుమలరాయలవద్ద ఆస్థాన కవిగానుండిన భట్టుమూర్తియనికూడ పిలువబడెడి రామరాజభూషణుడు తన సుప్రసిద్ధద్వ్యర్థికావ్యమగు వసుచరిత్రమును రచించి అచటి దానిమ్మ, ద్రాక్ష తోటలను, కొండలను, సెలయేళ్ళను వర్ణించెను. నేను అచటికి వెళ్ళినప్పడల్లా రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు రచించిన "మా పెనుగొండ కొండ" యను అత్యంత హృదయాకర్షకమై ఆంధ్రాభిమానపూరితమైయున్న కీర్తనను పాడించి వినేవాడను. అందులోకూడ నీ వర్ణనలన్నీ యున్నవి. నేను మదనపల్లి వెళ్లినపుడు లక్ష్మీపతిగారితో కలసి నెమలి పట్టాభిరామారావుగారి యింటిలో నుంటిని. అపుడుజరిగిన బహిరంగసభకు రామారావుగారు కూడ వచ్చిరి. నా యుపన్యాసము మిగుల తీవ్రముగ నున్నదని ఆయన తలచెను. అక్కడినుంచి నేను, లక్ష్మీపతిగారు చిత్తూరుకు వెళ్లితిమి. చిత్తూరులో ప్రధానన్యాయవాది కాంగ్రెసునాయకులునగు దొరస్వామయ్యంగారు నా యుపన్యాసమునకు అధ్యక్షతవహించిరి. రాజగోపాలాచారిగారు ప్లీడరీవదలి కాంగ్రెసుసేవలో నిమగ్నులై యుండిరి. తిరుపతిలో శ్రీనివాసాచారిగారను యువకుడు కాంగ్రెసులో పనిచేయుచుండెను. అక్కడ బహిరంగసభ నేర్పాటుచేసెను.ప్లీడరీవదలివేసిన రాజగోపాలాచారిగా రధ్యక్షత వహించెను.

పుత్తూరునుంచి వచ్చి రంగంశెట్టిగారు నన్ను అక్కడ కలిసిరి. వారు పిమ్మట 1922 లో జైలుకువచ్చి నాతోకూడ కడలూరు జైలులో నుండిరి. హరిజన సేవలో చాల కృషిసలిపిరి. వారి ఆహ్వానముమీద నేను పుత్తూరుకు రెండు మూడుసార్లువెళ్లితిని. ఇటుల కాంగ్రెసుమిత్రులు నా సంచారములో విశేషముగ సహాయముచేసిరి.

పిమ్మట నే నెన్నియోసార్లు రాయలసీమజిల్లాలలో కాంగ్రెసుకార్య క్రమనిర్వహణకై సంచారముచేసియున్నాను. ముఖ్యముగా 1923 నుంచి షుమారు పదిన్నరసంవత్సరములకాలము నేను ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్‌కమిటీకి ప్రధానకార్యదర్శిగా నున్నందున ఆంధ్రదేశములోని అన్నిజిల్లాలలోను కాంగ్రెసుప్రచారమునిమిత్తము సంచారముచేసితిని. అంతేకాక శాసనసభల ఎన్నికలలోను, జిల్లాబోర్డుల ఎన్నికలలోను కాంగ్రెసుఅభ్యర్థులను బలపరచుటకుకూడ నేను రాయలసీమజిల్లాలలో సంచారముచేసియున్నాను. రాయలసీమలోని దేశాభిమానులలో నిస్సందేహముగ ప్రథమస్థానమాక్రమించినవాడు కల్లూరి సుబ్బారావు. ఆయన కాలినడకను గ్రామములలో సంచారముచేసి యువకులను తర్ఫీతుచేసి రాయలసీమలో— ముఖ్యముగ అనంతపురం జిల్లాలో రాజకీయచైతన్యమును అత్యంతముగ పెంపొందచేసెను. నే నాయనతో కలసియే ఎల్లపుడును పనిచేసితిని. మేము అనంతపురముజిల్లాలో ఎన్నికల ప్రచారమునకు దిగేటప్పటికి కొంతమంది పెద్ద రెడ్డిసర్దారు లుండిరి. వారు కొన్నిగ్రామములను తమ నిరంకుశపు పలుకుబడిక్రింద యుంచుకొనియుండిరి. అందుచే ప్రజలెవరును వారియుత్తరువులులేకుండ ఏపనిచేయుటకు వీలులేదు. ఓట్లు ఇచ్చుటకు అసలే వీలులేదు. వారిలోవారికి తగవులు కలిగి హత్యలుగావించుకొనుచు విశేషద్రవ్యము ఖర్చుచేసి తరచుగ విడుదల యగుచుండిరి. వారు చాలవరకు కాంగ్రెసుకు వ్యతిరేకముగనుండిరి. ఆ సర్దారులలో చిన్నారపరెడ్డిగారు మాత్రము కాంగ్రెసుకు సన్నిహితుడుగ నుండెను. ఆయనకు ప్రత్యర్థిగానుండిన రెడ్డిసర్దారు హత్యగావించబడెను. ఆయన గుత్తి కేశవపిళ్లెగారి శిష్యుడు. ఆ పెద్దకేసులోనుంచి చిన్నారపరెడ్డిగారు బయటపడిరి. మేము ఎన్నికలప్రచారము చేసినకొద్ది సర్దారులబలము తగ్గినది. ప్రజలు వారినిరంకుశత్వమునుండి స్వతంత్రులైరి. 1926 శాసన

సభఎన్నికలలో ఒక కాంగ్రెసుయువకుడైన సి. నారాయణరెడ్డిగారు గుత్తి కేశవపిళ్లెగారివంటి గొప్పనాయకుని యోడించెను. అనంతపురంజిల్లాలో కాంగ్రెసు నిర్మాణకార్యక్రమమునకు ముఖ్యముగ తోడ్పడినవారు నీలం (ఇల్లూరి) చిన్నపరెడ్డి, ఆయన బావమరది తరిమెల సుబ్బారెడ్డిగారలు. చిన్నప్పరెడ్డిగారికి ధర్మరాజని పేరుండెను. వారిద్దరు సర్దారులబృందములో చేరినవారుకారు. సామాన్యరైతులు. దైవభక్తిగలవారు, భాగవతాదిపురాణ పఠనాసక్తులు. నిత్య ఖద్దరుధారులైరి. ఖద్దరును వ్యాపింపచేసిరి. కాంగ్రెసుకు సర్వవిధముల సహాయముచేసిరి. కల్లు, సారా దుకాణములను వారు ఆ ప్రాంతములలో నెవరిని పాడకుండచేసి పూర్తిగా ఎత్తివేయించిరి. అస్పృశ్యతను పాటించలేదు. నేను ఆ జిల్లాకువెళ్లినపుడు ప్రతిపర్యాయము సుబ్బారావుగారు నేను కలిసి వారిని చూచేవారము. వారు మాకు ప్రతివిషయములో తోడ్పడేవారు, అందులో చిన్నప్పరెడ్డిగారి కుమారుడే నీలం సంజీవరెడ్డి. ఆ యువకుడు మిగుల బుద్ధికుశలతకలవాడు. యోగ్యుడు. తండ్రిగారి దైవభక్తి పట్టుబడినది. ఎప్పుడును ఖద్దరునేధరించుచు కాంగ్రెసునందు ఉత్సాహము చూపుచుండెను. ఆ కాలములో దేశభక్తులైన పప్పూరి రామాచారిగారివద్ద విద్యనభ్యసించుచుండెను, మేము వెళ్ళగానే గౌరవముతో మావద్దకువచ్చి కూర్చునేవాడు. మేము అడిగిన ప్రశ్నలకు తెలివిగా జవాబు చెప్పేవాడు. కొంత పెద్దవాడైనపిమ్మట అనంతపురం కళాశాలలో చదువుకొనుచుండగ మా బోధలు ఎక్కువగ నాటుకొని కళాశాలనువదలి పూర్తిగ కాంగ్రెసులో చేరెను. పెక్కుసార్లు జైళ్లకు వెళ్లెను. రాష్ట్రకాంగ్రెసు జాయింటుకార్యదర్శిగను, కొంతకాలము రాష్ట్రకాంగ్రెసు అధ్యక్షుడుగను, అఖిలభారతకాంగ్రెసువర్కింగుకమిటీ సభ్యుడుగను మిగుల బాధ్యతకలిగిన కాంగ్రెసుఉద్యోగములను చక్కగా నిర్వహించెను. తుదకుమద్రాసురాష్ట్రములోను, ఆంధ్రరాష్ట్రములోను మంత్రిగ పనిచేసెను. విశాలాంధ్రోద్యమములో మాకు చాల తోడ్పడినాడు. విశాలాంధ్ర (ఆంధ్రప్రదేశ్)రాష్ట్ర మేర్పడిన తరువాత దానికి ముఖ్యమంత్రియై సమర్థతతో పనిచేయుచున్నాడు. తరిమెల సుబ్బారెడ్డిగారికుమారుడు నాగిరెడ్డికూడ చాల ఉత్సాహవంతుడైనయువకుడు. బనారసుహిందూవిశ్వవిద్యాలయములో చదివి, ఎం.ఏ.లో కృతార్థుడయ్యెను.

మేము వెళ్ళినపుడు మాతో చేరేవాడు. కాంగ్రెసులోచేరి జైళ్ళకువచ్చి కొంత కాలము కాంగ్రెసుసేవచేసి పిదప కమ్యూనిష్టులతో చేరినాడు. ప్రముఖ కమ్యూనిస్టుగా ఇపుడు కమ్యూనిస్టుపార్టీ పక్షమున పార్లమెంటుసభ్యుడుగా ఎన్నుకొనబడినాడు.

ఆ సంవత్సరము జులై నెలలో బొంబాయిలోజరిగిన అఖిలభారత కాంగ్రెసుకమిటీకి నేను వెళ్ళితిని. మలబారుకొండకు సమీపముననున్న యొక పెద్దబజారులో పత్రికాప్రతినిధియగు రంగసామిగారిమేడమీద నేను సత్యమూర్తి, వేమవరపు రామదాసు, కస్తూరి రంగయ్యంగారు, రంగస్వామి అయ్యంగారు కలిసియుంటిమి. ఆసభలో ప్రతి కాంగ్రెసుసభ్యుడు ఖద్దరును విధిగా ధరించితీరవలెనని తీర్మానించబడినది. దేశములో విదేశవస్త్రబహిష్కరణకు అవసరమైనచర్యలు తీసుకోవలెననికూడ నిశ్చయించబడెను. నేను బొంబాయిలో ఖద్దరుదుకాణమునకు పోయి కొంత ఖద్దరును కొనుక్కొనివచ్చుటయేగాక ఖద్దరు గాంధీటోపీలను కొనితెచ్చి తలకు పెట్టుకుంటిని. సత్యమూర్తి, రామదాసు మొదలగువారు నన్నుచూచి వేళాకోళము చేసిరి. అది (Fools cap) పిచ్చివాడిటోపీలాగున నున్నదని వెక్కిరించిరి. 'నే నిపుడు దీనిని ధరించుటయేగాక, ఆంధ్రదేశమునకు తీసుకొనిపోవుచున్నాను. అక్కడ ఇదే వాడుకలోకి వచ్చును. చూడండి; మీరుకూడ ఒక రోజున పెట్టుకొనెదరు' అని చెప్పినాను. గాంధీటోపి ఆంధ్రదేశములోనూ మిగతరాష్ట్రములలోను బాగుగ వాడుకలోకి వచ్చినది. సత్యమూర్తికూడ తరువాత ఎల్లపుడు గాంధీటోపీ పెట్టుకొనేవాడు. నే నప్పటినుంచి నేటివరకు విడువకుండ గాంధీటోపీ పెట్టుకొనుచున్నాను.

(౩)

19౭1 జులైలో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసంఘసభ్యులము వెంకటగిరిలో సుప్రసిద్ధకాంగ్రెసునాయకులగు కటికినేని వెంకటరామారావు, కళ్యాణరావుగార్ల యింటిలో సమావేశమైతిమి. గుంటూరుజిల్లా పల్నాడులో అడవి పుల్లరినిగురించి అటవీశాఖాధికారులు ప్రజలను పీడించుచున్నందున ప్రజలు రోషపూరితులై పుల్లరి నసలే చెల్లించక తిరుగుబాటుచేయనారంభించిరి.

విదేశ ప్రభుత్వముమీదతిరుగుబాటుచేయవలెనని అచటిప్రజలుప్రజానాయకులు దృఢమనస్కులైరి. ఆ విషయము విచారణచేసి నివేదికపంపవలెనని ఉన్నవ లక్ష్మీనారాయణగారిని, మాడభూషి వేదాంతం లక్ష్మీనరసింహాచారిగారిని నియమించుచు ఆసభలో తీర్మానముచేసితిమి. వారిద్దరు పల్నాడులో మాచెర్ల గ్రామములోను, ఆసమీపగ్రామములలోను సంచారముచేసిరి. ప్రభుత్వాధికారుల కెవరికిని పూటకూళ్ళఇసలలోనైనను భోజనముపెట్టకూడదనియు, ఆహారసామగ్రులను అమ్మకూడదనియు ప్రజలు సంఘబహిష్కారమును తీవ్రముగ సాగించిరి. మాచెర్లలో డిప్యూటీ తహసీల్దారు పొన్నాడ రామకోటిగారియింటిలో పసిపిల్లలకు పాలుకూడ పుట్టకపోయెను. ఇట్టిపరిస్థితులలో గుంటూరుజిల్లాకలెక్టరు షీల్డు మాచర్లవెళ్ళి ఊరువెలుపల తోపులో దేరా వేయించుకొని నివాసముండెను. ఆయనకు కావలసిన కోడిగ్రుడ్లుసైతము గుంటూరునుండియే తెప్పించుకొనవలసివచ్చెను. మాచర్లలో దండోరా వేయించుటకు కలెక్టరుగారు గ్రామమునసబును పిల్పించి తప్పెట్లను తెప్పించమని కోరగా ఆయన కొంతతడవాగి, మరల కలెక్టరుగారివద్దకువచ్చి తప్పెటలు చిరిగిపోయినవని తప్పెటలవాండ్లు చెప్పుచున్నందున తప్పెటలు దొరకలేదని మనవిచేసెను. లక్ష్మీనారాయణగారిమీదను, నరసింహాచారిగారిమీదను శాంతిభద్రతలకు జామీను ఏల యీయకూడదో సమాధానముచెప్పుటకు తన వద్దకు హాజరుకావలసినదని కలెక్టరు నోటీసు జారీచేసెను. లక్ష్మీనారాయణగారిని గజ్జెలగుఱ్ఱముమీద నెక్కించుకొని తప్పెటలవాయింపుతో ఊరేగింపుతో తీసుకొనివెళ్ళి ప్రజలు కలెక్టరుగారిడేరావద్ద దింపిరి. తమకుతప్పెటలు వాయించుటకు దొరకలేదుగాని కాంగ్రెసునాయకులకు తప్పెటలు దొరికినందుకు జిల్లాకలెక్టరు దిగ్భ్రమచెందెను. వారిద్దరిని శాంతిభంగముగావించకుందుమని ఒక్కొక్కసంవత్సరమునకు పూచీపత్రమును వ్రాయవలసినదిగా కలెక్టరు కోరెను. కాని వారు అందుకు సమ్మతించనందున జులై 25 న ఒక్కొక్కసంవత్సరము విడిజైలుశిక్ష విధించెను. వారిని జైలుకుపంపుటకు పోలీసులు రైలుమీద గుంటూరుతీసుకొనివచ్చిరి. వారినిగుంటూరుకు తీసుకొని వచ్చుచున్నారనువార్త పట్టణములో వ్యాపించి వేనవేలు ప్రజలు రైలుస్టేషనుకు వచ్చిరి. కొండా వెంకటప్పయ్యపంతులుగారు, కోలవెన్ను రామకోటే

శ్వరరావుగారుకూడ రైలుస్టేషనువద్దకు పోయి వారిని కలసిరి. శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు ధైర్యమువీడక ఉత్సాహపూరితురాలై యుండెను. భర్త దేశహితకార్యమునందు దండింపబడినందుకు ఆమె ఆనందముతో ఉప్పొంగి అప్పటినుండియు దీక్షతో జాతీయోద్యమములోదిగి పాటుపడి పెక్కుసార్లు జైలుకు వచ్చినది. విజయనగరము, విశాఖపట్టణములకుపోయి అచట విద్యార్థులందరికిని గాంధీటోపీలను స్వయముగ యిచ్చి,వారిలో గొప్ప సంచలనముకలుగచేసి చాలామందిని కళాశాలలను విడిచిపెట్టునట్లు చేసినది. లక్ష్మీనారాయణగారిని, నరసింహాచార్యులుగారిని గుంటూరుసబుజైలుకు తీసుకొనివెళ్ళి మరునాడు వేలూరు సెంట్రలుజైలుకు పంపిరి. ఆ సాయంత్రము కొండా వెంకటప్పయ్యపంతులుగారిఅధ్యక్షత క్రింద గుంటూరులో గొప్ప బహిరంగసభ జరిగి, వారముకోజులు దుకాణములన్నీ కట్టివేసి హర్తాళముచేయవలెనని తీర్మానముచేయబడెను. అప్పుడు ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు గొప్పయుపన్యాసమిచ్చి ప్రజల నుద్రేకపరచిరి. నేనుకూడ గుంటూరువెళ్ళి ఆ బహిరంగసభలో ఉపన్యసించితిని. ఆ సమ్మెవార్త విని పల్నాడునుంచి జిల్లాకలెక్టరు మరల గుంటూరు వచ్చెను. ప్రభుత్వోద్యోగులు ఎట్లైనను ఆ హర్తాళమును భగ్నముచేయవలెనని యుద్దేశించిరి. మద్ది వెంకటసుబ్బయ్య, చీమకుర్తి బసవయ్య, గొల్లపూడి సీతారామశాస్త్రి, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, చట్టి నరసింహారావు, నడింపల్లి నరసింహారావు, బారిస్టరు గుప్త మొదలగువారు వెంకటప్పయ్యగారి నాయకత్వము క్రింద ఆ వారముకోజులు గట్టిగా హర్తాళము జరుగునట్లు ఏర్పాటుచేసిరి. సమ్మె బహు జయప్రదముగా జరిగెను. దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు మరికొందరు శాంతిసైనికులను వెంటబెట్టుకొని ఊరేగింపుగా బయలుదేరి హైస్కూళ్ళకు, కాలేజీలకు సర్కారుకచేరీలకు పోయి వారివారి కార్యాలయములను కట్టివేయవలసినదని ప్రబోధము గావించుచుండిరి. ఇంతలో భట్టిప్రోలు సూర్యప్రకాశరావుగారిని పోలీసుస్టేషములో పెట్టిరి. ప్రజలు స్టేషముమీదపడి అల్లరిచేసిరి. మరియొకవిద్యార్థినికూడ పట్టుకొనిపోయిరి. వీరిద్దరిని కొంతసేపటికి విడిచిపెట్టిరి. డిప్యూటీకలెక్టరుగారు జట్కాబండిలో వచ్చుచుండగ ప్రజలు దానిమీద రాళ్ళువేయసాగిరి. కొండా వెంకటప్పయ్యగారు రాళ్ల

వేయుటను ఆపించిరి. ఆరోజు ఆబ్కారీదుకాణపుపాటలు. కొండా వెంకటప్పయ్యగారు ఎవరును పాటలుపాడవద్దని డిప్యూటీకలెక్టరుఆఫీసుకు పోయి ప్రబోధముగావించసాగిరి. ఎవరును పాటలుపాడకపోయిరి.మరునాడు కొండా వెంకటప్పయ్య, మద్ది వెంకటసుబ్బయ్య, చీమకుర్తి బసవయ్య, బారిస్టరు గుప్త ఇంకా మరిద్దరిని పోలీసువారు అరెస్టుచేసి గుంటూరుతాలూకాజైలులో పెట్టిరి. నే నాసంగతి వినగానే గుంటూరుపోయి సబుజైలులోని ఆ నాయకులను చూచితిని. అంతలో ప్రజలలోను, సర్కారుఉద్యోగస్థులలోను గొప్ప ఉద్రేకము కలిగెను. దిగుమర్తి వెంకటరామస్వామి బి. ఏ. బి. యల్. గారు సబుకోర్టు శిరస్తాదారుపదవినుంచి రాజీనామాచేసిరి. కలెక్టరుకచేరీగుమాస్తాలు నూరుమంది సోమవారమునాడు జీతముతీసుకొని రాజీనామాలు దాఖలుచేయుటకు నిశ్చయించిరి. న్యాయవాదులు సభచేసి ఆరుమాసములు తమవృత్తి కార్యములు కట్టిపెట్టుటకు తీర్మానించిరి. సమ్మె ప్రారంభమయ్యెను. ఆదివారమునాడు ఉదయమున కలెక్టరుగారు కొండా వెంకటప్పయ్యపంతులు గారిని విచారించి ఆయన నిర్దోషి అని తీర్పుచెప్పి విడుదలచేసెను. ఆ సాయంత్రము తక్కినవారినికూడ విడుదలచేసెను. అప్పటినుంచి రోజు రోజు మహాసభలు బహిరంగముగ గుంటూరుమైదానములో జరుగుచుండెను. వాటిలోని కొన్నిటిలో నేనుకూడ పాల్గొంటిని. రాజీనామాలిచ్చుటకు తీర్మానములుగావించుకున్న గుమాస్తాలు కాంగ్రెసునాయకులను వదలివేయుటతోడనే రాజీనామాల నుపసంహరించుకొనిరి. దిగుమర్తి వెంకటరామస్వామి గారుమాత్రము అటుల ఉపసంహరించుకొనక ఖాయముగ దౌర్జన్యరాహిత్య సహాయనిరాకరణోద్యమములో చేరెను. గాంధీగారు ఈసంగతులన్నీ తెలుసుకొని వెంటనే ఉత్సాహముతో వెంకటప్పయ్యగారిని జైలులోపెట్టగానే సరి కాలేదు. "I wish he was shot down" "ఆయనను తుపాకితో కాల్చినచో బాగుండేది" అనెను. వెంకటప్పయ్యగారి అఖండత్యాగమువల్ల ఆంధ్రదేశమంతటా మహత్తరమైన చైతన్యము, స్వతంత్రేచ్ఛ కలుగునని మహాత్మాగాంధీగారియుద్దేశ్యము. గుంటూరున్యాయవాదులు ఆరుమాసములు వృత్తిని కట్టిపెట్టవలెనని తీర్మానించుకొనినవార్తవినినతోడనే తెనాలి, బాపట్ల నర్సారావుపేట, ఒంగోలుగ్రామములలోని న్యాయవాదులలో పలువురు తమ

వృత్తిని కొంతకాలము మానివేసిరి. కోర్టులకు కక్షిదారులు పోవుటతగ్గిపోయి నందున గుంటూరులో ఒక న్యాయస్థానమునుస్థాపించి దిగుమర్తి వెంకట రామస్వామిగారిని దానికి అధిపతిగా రాష్ట్రకాంగ్రెసుసంఘము నియామకముచేసి వ్యాజ్యములు పరిష్కారముచేయించసాగెను.

1921 సం॥ జులై 8 తేదీన కరాచీలో మౌలానా మహమ్మదాలీగారి అధ్యక్షతక్రింద జరిగిన అఖిలభారత ఖిలాఫతుమహాసభలో ముస్లిములెవరును బ్రిటిషుప్రభుత్వపుసేనలలో నౌకరీచేయగూడదని, అటుల సైనికకొలువులో నున్నవారు రాజీనామాపెట్టి వచ్చివేయవలసినదని తీర్మానించినందున సెప్టెంబరు 14 తేదీన ఆంధ్రదేశములో సంచారము ప్రారంభించిన మౌలానా మహమ్మదాలీగారిని వాల్తేరులో అరెస్టుచేసి వారికి, డాక్టరు కిచ్లూ, శారదా పీఠ జగద్గురు శంకరాచార్యులుగారు మొదలైనవారికి రెండేసిసంవత్సరముల శిక్షలు విధించి కారాగారమునకు పంపిరి. భారతదేశములోని అన్నిచోట్లను ఆ కరాచీ తీర్మానములను బహిరంగసభలలో చదివి మంజూరుచేసినాము. కాని, మమ్ముల నరెస్టుచేయలేదు.

పల్నాడు అడవిపుల్లరి సత్యాగ్రహపుకేసులో ఉన్నవలక్ష్మినారాయణ, మాడభూషి వేదాంతం నరసింహాచార్యులుగార్లు జైలుకు పోగానే పుల్లరి యివ్వకుండా పశువులు మేపుకుందామని, బ్రిటిషుప్రభుత్వమును ధిక్కరిద్దామన్న ఉద్యమము పల్నాటితాలూకాఅంతట రైతులలో వ్యాపించినది. దీనికి పల్నాడుతాలూకా మించాలపాడుకాపురస్తుడగు కన్నెగంటి హనుమంతుగారు నాయకత్వమువహించెను. అక్కడ షుమారు 30 గ్రామములలో అడవులుండెను. మంచి అడవిప్రదేశ మది. ఆ గ్రామాలన్నిటిలో బోధచేసి హనుమంతుగారు పుల్లరినివ్వకుండానే రైతులు అడవిలో పశువులను మేపేటట్లు బందోబస్తుచేసిరి. సర్కారుఉద్యోగస్థులు అడ్డుపెట్టినను ఆగుటలేదు. ఆ గ్రామములలో ప్రభుత్వము స్తంభించెను. ప్రభుత్వోద్యోగులకు అన్నము, నీళ్లు పుట్టుటలేదు. అట్టి సమయములో పోలీసువారు ఆ గ్రామములకు అధికసంఖ్యాకులుగ పోయినారు. ఏమిచేసినను ప్రజలు లొంగుటలేదు ప్రభుత్వము గడగడలాడుచున్నది. అందుమీద కన్నెగంటి హనుమంతు గారితో మాట్లాడుతామని డిప్యూటీకలెక్టరు కబురంపినారు. ఆయన మించాల

పాడునుంచి కొలిగొట్లకు వచ్చుచున్నాడు. త్రోవలో ఈ రెండుగ్రామముల మధ్య ఒకచోట 30 మంది పోలీసులు తుపాకులతో ఆయనచుట్టూ వలయముగా చుట్టుముట్టినారు. తక్కినవారిని ఎవరిని ఆయనదగ్గరికి పోనివ్వలేదు. నాలుగువైపులనుంచి ఆయనమీద తుపాకులు కాల్చినారు. ఆయన నేల కూలినాడు. కొన్నిగంటలసేపు బ్రతికియున్నాడు. ఆసమయములో దాహం దాహం అని అడిగినాడు. పోలీసువారు దాహమివ్వలేదు. ఎవరిని దగ్గరికిపోయి దాహ మివ్వనియ్యలేదు 30 మంది పోలీసులు తుపాకులతో చుట్టవేసియున్నారు. పోలీసు హెడ్ కానిస్టేబులుమాత్రము తనమూత్రము తీసుకొనిపోయి ఆయననోట్లోపోసి ఇదియే నీ కివ్వదగిననీరనిచెప్పినాడు.కొంతసేపటికి ఆయన మృతిచెందినాడు. ఆయనదేహమును అనుచరులందరు పెద్ద ఊరేగింపుతోతీసుకొనివెళ్ళికొలిగొట్లదగ్గిర చెరువుకు సమీపముగపోవుచున్న హైరోడ్డుప్రక్కన సమాధిచేసినారు. అక్కడ ఒక అరుగుకట్టి దానిమీద ఒక రాయిస్థాపించినారు. దానిమీద ఆయనపేరు చెక్కినారు. అది బస్సులుపోయే రోడ్డు.ప్రజలుఅప్పుడప్పుడుఆసమాధివద్దకుపోయికొలుపులుకొలుస్తారు.స్వతంత్ర పోరాటములో ఒక గొప్పపాత్రవహించి బలిదానముచేసిన మహావీరు డతడు. దానిని ఆంధ్రప్రదేశ్ప్రభుత్వమువారు గుర్తించి ఆ సమాధిని పెద్ద స్మారకచిహ్నముగా నిర్మించడం అవసరము.

ఆసంవత్సరము ఆగస్టునెలలో కృష్ణాపుష్కరములు వచ్చినవి. వేలకు వేల యాత్రికులు యావదాంధ్రదేశమునుండియేగాక యావద్భారతదేశము నుండికూడ కృష్ణానదిలో స్నానముచేయుటకు బెజవాడ వచ్చిరి. బెజవాడలో చర్చిప్రక్కననున్న గాంధీపార్కులో కాంగ్రెసుబహిరంగసభలు ప్రతిసాయంత్రం ఏర్పాటుచేసినాము. కొండా వెంకటప్పయ్య, గొల్లపూడి సీతారామశాస్త్రి దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, కల్లూరు సుబ్బారావు, దండు నారాయణరాజు, మాగంటి అన్నపూర్ణాదేవి మొదలగు నాయకులున్నూ, బెజవాడవారము అక్కడ సమావేశమైన వేలకువేలజనముల కుపన్యాసముల నిచ్చితిమి. అప్పటికే చీరాల పేరాల పన్నులనిరాకరణము, చీరాల పేరాలవారు గ్రామములనుంచి వచ్చి రామనగరమును నిర్మించుకొని కాపురముచేయుట, రామదండు నిర్మాణము దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారిఖ్యాతిని యావద్భారత

దేశములోను పెంపొందచేసినవి. సంగీతసాహిత్యములతో తాండవించే ఆయనయుపన్యాసములు ప్రజల నెక్కువగా ఆకర్షించినవి. గోపాలకృష్ణయ్యగారికి ముఖ్యశిష్యుడుగ గౌసుబేగుసాహెబుగా రుండిరి. గౌసుబేగుసాహెబు గారుకూడ అనేకసార్లు జైలుకుపోయి ప్రముఖ కాంగ్రెసునాయకుడయ్యెను. ఈ యుపన్యాసములు స్వతంత్రోద్యమమునకు దోహద మిచ్చినవి.

ఆసంవత్సరము సెప్టెంబరునెలలో మహాత్మాగాంధీగారు రాయలసీమలో సంచారముచేసిరి. అదివరకే ఆగష్టునెల 29 వ తేదీన కల్లు సారా పాటలు పాడవద్దని బోధించినందుకు హిందూపురములో కల్లూరు సుబ్బారావుగారిని అరెస్టుచేసి ఒకనెల శైదువిధించి బళ్ళారిజైలుకు పంపిరి. ఆయన జైలునుంచి విడుదలయ్యేనాటికి మహాత్మాగాంధీగారు రాయలసీమలోని తాడిపత్రికి వచ్చుచున్నందున అచటికి వెళ్ళి వారినికలుసుకొని, వారితోను, కొండా వెంకటప్పయ్యగారితోను కలిసి సంచారముచేసిరి. మహాత్మాగాంధీగారు త్రోవలోని ముఖ్యగ్రామములను దర్శించుచు సెప్టెంబరు 28 తేదీన కర్నూలులోను 29 వ తేదీన తాడిపత్రిలోను; 30 తేదీ ఉదయాన కడపలోను మహోపన్యాసములనిచ్చి ఆరాత్రికి బళ్ళారిచేరిరి. అక్కడ గాంధీగారు, వారితోకూడవచ్చిన షౌకతాలీగారు కరాచీలో అఖిలభారత ఖిలాఫతు కమిటీలో తీర్మానింపబడిన ప్రకారము ప్రభుత్వసేనలలోనున్న భారతీయు లందరును సైనికకొలువును విడిచిపెట్టిరమ్మని కోరుచు ఉపన్యసించిరి. ఆ సభలోనే వారిద్దరిని అరెస్టుచేతురేమోనని తలచునట్లుగ పోలీసుఏర్పాట్లుజరిగి వాతావరణము చాల యుద్రేకముగ నుండెను. ఆ మహాసభకు ఏబదివేల జనము వచ్చిరి. కొండా వెంకటప్పయ్యగారు, కల్లూరు సుబ్బారావుగారుకూడ నుండిరి. అరెస్టులు జరగలేదు. మరునాడుదయము రైలులో గాంధీ షౌకతాలీగార్లు బొంబాయికివెళ్ళిరి. అదివరకే సెప్టెంబరు 14 వ తేదీననే మహమ్మదాలీగారిని అరెస్టుచేసియుండిరి. బళ్ళారిజిల్లాలో వర్షము బొత్తుగా లేక కరువు వచ్చునని భయపడుచుండిరి. గాంధీగారు వచ్చినదినముననే మూడుదుక్కుల వర్షము పడినది. మహాత్ముని ఆశీర్వచనఫలితమని తలచి ప్రజలు ఎంతో ఆనందించిరి.

(4)

1921 నవంబరులో ఆంధ్రరాష్ట్ర రాజకీయమహాసభ బరంపురములో జరిగినది. 1936 సంవత్సరములో గంజాం, కోరాపుట్టిజిల్లాలను ఒరిస్సాలో చేర్చేవరకు బరంపురము ఆంధ్ర రాజకీయ, సాంఘికరంగాలలో ఉజ్వలమైన స్థానమువహించియున్నది. గంపలగూడెం కుమారరాజా కోటగిరి వెంకట కృష్ణారావుగా రధ్యక్షత వహించినారు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీకూడ కొండా వెంకటప్పయ్యగారి అధ్యక్షతను సమావేశమైనది. గంజాంజిల్లా మేజిస్ట్రేటు కొంతమంది కాంగ్రెసునాయకులకు 144 శెక్షనుక్రింద బహి రంగసభలో మాట్లాడకూడదని నిషేధాజ్ఞలనిచ్చెను. అందులో డాక్టరు పట్టాభి సీతారామయ్య, వి. వి. గిరి, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, చెరకువాడ నర సింహం, నేనుకూడ ఉన్నాము. అప్పటికి అట్టిఆజ్ఞలను ధిక్కరించవలెనని కాంగ్రెసుతీర్మానము లేదు. అందువల్ల తక్కినవారమందరము ధిక్కరించక ఊరుకుండగా, ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు మాత్రము నిషే ధాజ్ఞను ధిక్కరించుచు బహిరంగసభజరిపి ప్రజలను ముగ్ధులనుచేసే గొప్ప యుపన్యాసమిచ్చినాడు. గొప్ప సంచలనముకలిగినది. కొందరు లాయర్లు, కళ్ళికోటకళాశాలఅధ్యాపకులు, విద్యార్థులు తమవృత్తులను, చదువులను వదలి వేసి, కాంగ్రెసుఉద్యమములో చేరినారు. అటులచేసినవారిలో మల్లాది కృష్ణ మూర్తి, గాదె బలరామదాసు, నిరల సోమయాజులు (లాయర్లు) ఉన్నవ రామలింగంపంతులు (కళాశాల ఆచార్యులు), న్యావతి నారాయణమూర్తి బి. ఏ. (విద్యార్థి) గలరు. కోటగిరి వెంకటకృష్ణారావుగారిమీద 108 శెక్షన్ రాజద్రోహనేరముక్రింద జామీనుకేసుపెట్టి అరెస్టుచేసినారు. జామీనుఇచ్చు టకు నిరాకరించినందున ఒకసంవత్సరము ఖైదులోవేసినారు. దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారిని అరెస్టుచేసి విచారణకు బందరుకుపంపినారు. అక్కడ రాజద్రోహనేరముక్రింద విచారించి ఒకసంవత్సరం ఖైదువేసినారు. మేము ఇండ్లకు బయలుదేరివస్తున్నాము. పలాసాస్టేషనులో గంపలగూడెంరాణీగారి వద్దనుంచి ఒకగుమాస్తావచ్చి నన్ను కలసినాడు. పొరబాటున కుమారరాజా గారు జామీనుఇస్తానంటాడేమో, అలా జామీను ఇవ్వవద్దని పౌరుషముగా జైలుకు పోవలసినదేనని రాణీగారు, ఆమెభర్త ఇద్దరూ కబురంపినారని

కుమారరాజాగారితో చెప్పవలసినదని నన్ను వెనుకకు బరంపురము తీసుకొని వెళ్లినాడు. నేను మరల బరంపురమువెళ్లి అక్కడి సెంట్రలుజైలులోనున్న కుమారరాజాగారిని ఒక లాయరుగారిసహాయముతో కలుసుకొని ఈ ధీరోదాత్తమయిన సందేశమును వారికి తెలిపినాను. ఆయన సంతోషించినారు. అప్పు డందరికి 'సి' క్లాసే. నెయ్యి, మజ్జిగ లేవు. ఒక అన్నంముద్ద, పప్పు పులుసు, ముంత, మూకుడు, గొంగళి, మట్టిలాగు ఇవ్వబడెను. జైలు సూపరింటెండెంటు మంచివాడైతే పళ్లెం, చెంబు, పక్కచుట్ట, లాంతరు తెచ్చుకొనుట కనుమతి నివ్వవచ్చును. గంపలగూడెం కుమారరాజాగారు నాయకుడుగనుక నా విన్నపముతో సూపరింటెండెంటుగారు లాంతరు,చెంబు పళ్లెం, పక్కచుట్ట కుమారరాజాగారు తెచ్చుకొనుట కంగీకరించెను. ఆయన జామీనుఇవ్వకుండా సంవత్సరంశిక్ష పూర్తిచేసి అటుపిమ్మట విడుదలైనారు.

1921 నవంబరు 5 తేదీన సమావేశమైన అఖిలభారత కాంగ్రెసు వర్కింగుకమిటీలో ఏరాష్ట్రములోనైనను ఆ రాష్ట్రకాంగ్రెసుకమిటీ బాధ్యత మీద పన్నులనిరాకరణము మొదలగు శాసనోల్లంఘనముచేయుట కధికార మిచ్చుచు తీర్మానించబడినది. ఈ తీర్మానము డిశంబరునెలలోజరిగిన అహమ్మదాబాదు కాంగ్రెసుమహాసభలో పునరుద్ఘాటింపబడినది. దీని ననుసరించి ఆసంవత్సరము డిశెంబరునెలనుండి పెదనందిపాడు పన్నులనిరాకరణము ప్రారంభమయ్యేను. ఇది ఆంధ్రదేశ సత్యాగ్రహచరిత్రలో మిగుల ప్రసిద్ధి కెక్కినది. మిగుల జయప్రదముగ బ్రిటిషుప్రభుత్వముపై జరిగిన తిరుగుబాటు. ప్రజలు అద్భుతమైన దేశాభిమానమును, ఐకమత్యమును ప్రదర్శించిరి. బ్రిటిషుప్రభుత్వము గడగడ వణికినది. బ్రిటిషుపార్లమెంటుదృష్టి నిది యాకర్షించినది. ఇట్టి మహోద్యమముయొక్క పురోగతిని, అపుదలనుగూర్చి దీనికి నాయకత్వమువహించిన దేశభక్త కొండా వెంకటప్పయ్యగారి స్వీయ చరిత్రనుండియే ముఖ్యసంగతులు ఎత్తివ్రాయుచున్నాను. ఆకాలమున ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసుకమిటీకి కొండా వెంకటప్పయ్యపంతులుగా రధ్యక్షులు, గొల్లపూడి సీతారామశాస్త్రులువారు ప్రధానకార్యదర్శి. శ్రీ వెంకటప్పయ్య పంతులుగా రిటుల వ్రాసినారు:

"1921వ డిశంబరులో నేను, (వెంకటప్పయ్యపంతులుగారు.) గొల్లపూడి సీతారామశాస్త్రిగారును గుంటూరుజిల్లాను పన్నులనిరాకరణముకొరకు సిద్ధపరచవలెనని ఉద్దేశించి ప్రతిదినము ఉదయము 7 గంటలకే భోజనము చేసి చెరియొకమోటారులో సంచారముచేసి రాత్రి 7,8 గంటలకు గుంటూరు చేరుచుంటిమి. అటుల పదునైదుదినములు ప్రచారముచేసినతరువాత అహమ్మదాబాదులో జరుగనున్న కాంగ్రెసుమహాసభకు వెళ్ళవలసివచ్చెను.

"కాంగ్రెసుమహాసభ పన్నులనీయవలదని తీర్మానించునని మావిశ్వాసము. కావున ఆ సభలో తీర్మానమగువరకు పన్నులియ్యక వేచియుండవలెననియు, సభానంతరము పన్నులిచ్చుటో మానుటో చేయదగుననియు మేము ప్రజలకుబోధించితిమి. ప్రజలును అందుకు ఉత్సాహముతో సమ్మతించిరి. ఆ మహాసభలో పన్నులనిరాకరణతీర్మానము ఆమోదించబడినది. నేను జ్వరము వలన ఆసభకు పోజాలకపోతిని. నన్నుమరల కార్యవర్గసభ్యుడుగా నియమించిరి.గాంధీజీ, విఠల్‌భాయ్‌పటేల్ వచ్చి నన్ను పరామర్శచేసివెళ్ళిరి. ఆ మరునాడు గుంటూరుకు ప్రయాణమైతిని. డాక్టరు పట్టాభిసీతారామయ్యగారు నాకు తోడుగానుండిరి, నేను గాంధీజీకి కబురంపి వారిఅంగీకారమును తీసుకొని గుంటూరు వెళ్ళితిని. నేను స్వయముగా వారిని చూడలేకపోతిని. నేను జ్వరముతోనే గుంటూరువచ్చితిని. నెలదినములు డాక్టర్ చౌదరిగారు నాకు చికిత్సచేసినమీదట క్రమక్రమముగ జాడ్యము నయమయ్యెను. నేను జాడ్యము నయమై మంచముమీదనుండగనే · పన్నులనిరాకరణోద్యమము ఆంధ్ర రాష్ట్రమునందు ప్రారంభించబడెను. కాంగ్రెసుమహాసభ చేసిన పన్నుల నిరాకరణతీర్మానము నమలులోపెట్టుటకు తగినప్రదేశములనిర్ణయించుఅధికారము రాష్ట్రములకే నొసంగబడెను. ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుసంఘము బెజవాడలో సమావేశమై గుంటూరు, తూర్పుగోదావరిజిల్లాలలో నెచట కాంగ్రెసు విధించిన షరతులన్నియు పరిపూర్తిచెందునో అట్టిచోట్ల పన్నులనిరాకరణము సాగించవచ్చునని తీర్మానించిరి. దానినేనుసరించి గుంటూరులో పెదనంది పాడును, మరికొన్నిచోట్లును నిర్దేశించబడినవి. తూర్పుగోదావరిలో సీతానగరప్రాంతములో జరుపునట్లు ఆ జిల్లాసంఘము నిర్ణయించెను. గుంటూరు జిల్లాసంఘము జిల్లాలో ఏప్రాంతములో పన్నులనిరాకరణము సాగించవలెనో

యోచించుటకు పొన్నూరులో సభజరుప యత్నించుచుండగా జిల్లామేజిస్ట్రేటు పొన్నూరుసరిహద్దులలో ఎక్కడను సభ జరుపకూడదని నిషేధించుచు ఉత్తరువులనుప్రకటించి దండోరావేయించెను. ఆ ఉత్తరువును ధిక్కరించి జిల్లాసంఘసభ్యులు పలువురు పొన్నూరులోనే సమావేశమై పెదనందిపాడు ఫిర్కా-గ్రామములలోను, మరికొన్నిస్థలములలోను పన్నులనిరాకరణ చేయ వలెనని తీర్మానించిరి. పొన్నూరులో సభ ప్రారంభమైనతోడనే పోలీసులు శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రి, మద్ది రాధాకృష్ణయ్య మొదలైన మిత్రులను బంధించి వెంటనే విచారణచేసి శిక్షలువిధించి జైలుకుపంపిరి.నేను మోటారు కారుమీద మెల్లగా అక్కడికి వెళ్లి కారుమీదనేయుండి జైలుకుపోవుచున్న వారిని అభినందించితిని. పన్నులనిరాకరణమునకు పూర్వమే సహాయనిరా కరణోద్యమము ననుసరించి గ్రామోద్యోగులగు మునసబులు, కరణములు, కొందరు వెట్టివారుసైతము ఉద్యోగములకు రాజీనామాలనిచ్చిరి. పెదనంది పాడుఫిర్కా గ్రామములలోని ఉద్యోగులను పురికొల్పుటకు శ్రీ పర్వతనేని వీరయ్యచౌదరిగారు భారమువహించి ఊళ్ళలో తీవ్రముగ ప్రచారముచేసిరి. పెదనందిపాడుఫిర్కా-గ్రామములలోను. మరికొన్ని పరిసరగ్రామములలోను కరణములు, మునసబులు ఉద్యోగములకు రాజీనామాలిచ్చిరి. కాబట్టి ఆ గ్రామములలో పన్నులనిరాకరణోద్యమము సుకరముగా సాగించుట కవకా శము హెచ్చుగానుండెను. ఈ ఉద్యమము మొదలుపెట్టి సాగించుటకు ముఖ్యసాధకుడు శ్రీ పర్వతనేని వీరయ్యచౌదరిగారు, నాయకప్రముఖులైన ఉన్నవ లక్ష్మీనారాయణగారును, మాడభూషి వేదాంతం నరసింహాచార్యులు గారును అదివరకే పల్నాటి అడవుల పుల్లరిసత్యాగ్రహమునకు దండితులై జైలుకేగియుండిరి. దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారుకూడ అదివరకే జైలులో పెట్టబడిరి. పర్వతనేని వీరయ్యచౌదరిగారు పల్లెటూరిచదువుమాత్రమే చదివిన వాడైనను కాంగ్రెసులో సంపూర్ణవిశ్వాసమున్న ఉత్సాహశీలి యగుటవలన పెదనందిపాడుప్రజలకు వారియందు ప్రత్యేక గౌరవమున్నందున ప్రచారము చేసి పన్నులుచెల్లించకుండ ప్రజలను దిట్టపరచి ఊరూర శాంతిసైనికులను సిద్ధపరచెను. పన్నులు వసూలుచేయుటకు ప్రభుత్వోద్యోగులకు సాధ్యము కాకుండెను. రైతులు భయమునువిడనాడి పన్నులుచెల్లింప నిరాకరించిరి.

ధాన్యముకాని, తలుపులు, మంచములు మొదలగుపరికరములుకాని, ప్రభుత్వోద్యోగులు జప్తుచేసినను వాటిని వేలంవేయుటకై తాలూకా కచేరీకి మోసుకొనిపోవువారు దొరకరైరి. పెదనందిపాడుఫిర్కామాత్రమేకాక చుట్టుపట్ల గ్రామములవారును పన్నులను చెల్లింపకుండిరి. దౌర్జన్యములుచేసి పన్నులు వసూలుచేయవలెనని యుద్దేశించి చెన్నపట్టణమునుంచి సైనికదళమును మందుగుండుసామానుతోను, మరఫిరంగులతోను గుంటూరు రప్పించిరి. సైనికులు పెదనందిపాడు వెలుపల చింతలతోపులో విడిసియుండి గ్రామాల వెంట తిరుగుచుండిరి. కాని ప్రయోజనము లేకపోయెను. ఊళ్లలోతిరుగుచుండిన సర్కారుఉద్యోగస్థులకు మంచినీళ్ళు పుట్టవయ్యెను. కోమటియిండ్లలో ఉప్పు చింతపండైనను వారికి అమ్ముటలేదు. కాకుమానుగ్రామములో ఒకఆసామిఎద్దులను, మరియొకఆసామిబండిని ఉద్యోగులు జప్తుచేసిరి. బండిని ఎద్దులను 40 మంది సైనికులసహాయముతో తోలుకొనిపోవుటకై ప్రయత్నించిరి. గ్రామప్రజలు గుంపులుగాచేరి ఆ బండినీ, ఎద్దులను తోలుకొనిపోవుటకు అడ్డునిలచిరి. సైనికులు తుపాకులుకాల్చుటకు సిద్ధపడిరి. ఇంతలో వీరయ్యచౌదరిగారు వచ్చి ప్రజలను శాంతింపగోరి శాంతినినెలకొల్పగా సిపాయిలు ఎద్దులను, బండిని తోలుకొనిపోయిరి. ఇట్లు నడచుచున్న మహాయజ్ఞమునుగూర్చినవార్తలు పత్రికలలోపడుటచే దేశమంతటవ్యాపించుచుండెను. ఉత్తరజిల్లాలవారు ఈ ఉద్యమచర్యలను చూచుటకు వచ్చుచుండిరి. కృష్ణాపత్రికసంపాదకులు శ్రీ ముట్నూరు కృష్ణారావుగారు ఒకరాత్రి బందరునుండి నావద్దకువచ్చి ఈ పన్నులనిరాకరణము జరుగుచున్న పెదనందిపాడులో కాంగ్రెసునియమించినఅహింస, ఖద్దరు, అస్పృశ్యతానివారణనుగురించిన సూత్రములను ప్రజలు పూర్తిగా అనుష్ఠించుచున్నారా అని ప్రశ్నించినారు. నాకు తెలిసినంతవరకు వారు చాలవరకు అనుష్ఠించుచున్నారనియే నా అభిప్రాయము. కాని మీరు ఆ గ్రామములకు పోయి చూడవచ్చునని బదులుచెప్పితిని. కాని వారు అచటికి పోక నామాటలను విశ్వసించకయే వెడలిపోయిరి. ఆ సంవత్సరముననే మహాత్ముడు బార్డోలీలో పన్నులనిరాకరణోద్యమము సాగించదలచి దానినిగురించి గవర్నర్ జనరలుగారికి లేఖవ్రాయుచు అందులో గుంటూరుజిల్లాలోకూడ ఇట్టి ఉద్యమము నడచుచున్న

దనియు, అవసరమైన అప్పటికి తాము పోవుదుమనియు వివరించిరి. ఈ లేఖచే గుంటూరుఉద్యమవిషయము మరింత ప్రాముఖ్యమువహించెను. నాకును, నా తమ్ములకును జాయింటుభూములు కొన్ని గుంటూరులో కలవు. ఆ భూమిమీద శిస్తులు మొదటికిస్తీ 5, 6 రూప్యములు మాతమ్ముడు సూర్య నారాయణ నాకు తెలుపకుండ చెల్లించెను. ఆ భూమి గుంటూరు కాంగ్రెసు కమిటీవారు ఉద్యమములో చేర్చకూడదని నిషేధించినప్రాంతములోనైనను, కిస్తీచెల్లించినట్లు నాకు తెలియగనే యికముందు చెల్లించవద్దని నేను మా తమ్మునితోచెప్పి భద్రపరచితిని. దీనినిగోరంతలుకొండంతలుచేసి ప్రభుత్వము వారు ప్రచారముసాగించిరి.....ఇట్లు ఉద్యమము తీవ్రముగ జరుగుచున్న కాలములో మహాత్ములవారు ఈ పన్నులనిరాకరణోద్యమమును ఆపివేయ వలసినదని నాకు ఉత్తరము వ్రాసినను దానిని లెక్కచేయక నేను మూర్ఖించి ఉద్యమము సక్రమముగ నడపించుచున్నట్లు కరపత్రములను అచ్చువేయించి ఉద్యోగులు జిల్లాఅంతటా పంచిపెట్టుచున్నారని నాకు తెలియవచ్చినది. ఉత్తరమేదియు నాకు మహాత్మునియొద్దనుంచి రాలేదు. దానినిగురించివిచారణ చేయగ శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు మహాత్మునివద్దకు పోయి ఇక్కడిఉద్యమము షరతులకుభిన్నముగ నడపింపబడుచున్నదని చెప్పినం దున వారిమాట నమ్మి మహాత్ములు నాకు ఉద్యమము ఆపివేయవలసినదని ఉత్తరమువ్రాసి దానిని నా కందచేయవలసినదని సీతారామయ్యగారిచేతికి యిచ్చినట్లును, ఆయన మరెవ్వరిద్వారానో నా కిమ్మని పంపగా, అది అధికా రులచేత చిక్కినందున వారు కరపత్రములు అచ్చొత్తించి ప్రకటించినారని తెలిసినది. నేను గుంటూరులో నడింపల్లి లక్ష్మీనరసింహారావు, గొల్లపూడి రామనాధయ్య మొదలగు ప్రముఖులను పిలిపించి వారితోసంప్రతించి పెద నందిపాడుకు మనుష్యులనుపంపి పరిస్థితులను మరల రూఢిచేసుకుని ఒక తంతివార్త మహాత్మునికి పంపితిని. ఉద్యమము అప్పటికే చాలదూరము సాగినదనియు, అపుడు ఆపివేయుటయే సంభవించినయెడల ఆంధ్రదేశమును కాంగ్రెసునుండి బొత్తుగా తొలగించవచ్చుననియు ఖండితముగ తెలిపితిని. ఈ వార్తారావము దేశములో ఆసేతుహిమాచలము ప్రతిధ్వనించినది. వార్తా పత్రికలలో ప్రకటింపబడినది. ఈ ఉద్యమము ప్రభుత్వమును భయాక్రాంత

మొనర్చినది. మహాత్మునికి తంతితోపాటు ఇక్కడిపరిస్థితులు తెలుపుచు ఒక జాబు వ్రాసి నడింపల్లి నరసింహారావుగారిని పంపితిని. వారు దానికి బదులు వ్రాయుచు 'అచ్చటిస్థితిగతులు స్థానికులైన మీకు తెలిసినట్లు నాకు తెలియవు. గాన ఆబాధ్యతఅంతయుమీదే'నని స్పష్టపరచిరి. అపుడు మద్రాసుగవర్నరు లార్డు వెల్లింగ్టన్ పిమ్మట కొంతకాలానికి ఇంగ్లండుకు వెళ్ళినపుడు పెదనందిపాడుఫిర్కాలోని పన్నులనిరాకరణోద్యమము బ్రిటిషుప్రభుత్వమును కూకటివ్రేళ్ళతో కదిలించినదని పార్లమెంటులో వాక్రుచ్చెను. పెదనందిపాడుఉద్యమమునుగురించి కాంగ్రెసుచరిత్రకారులు కాంగ్రెసుచరిత్రలో నామమాత్రముగ సూచించి విడచుట శోచనీయము. గాంధీగారువ్రాసిన లేఖను బట్టియే కాబోలు అవెంటనే ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుకార్యనిర్వాహకవర్గము పెదనందిపాడుఫిర్కాలో జరుగుచున్న ఉద్యమఫలితములను బాగుగ పరిశీలనచేసి నివేదికపంపుటకు కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు, టంగుటూరి ప్రకాశంపంతులు, దండు నారాయణరాజుగారలను ఉపసంఘముగ నియమించెను. వారు ఆ గ్రామములలో సంచారముచేసి కాంగ్రెసుషరతులన్నియు ప్రజలు చక్కగా పాటించియే ఉద్యమమును మిక్కిలి దీక్షతో జరుపుచున్నందుకు వారిని ప్రస్తుతించుచు, ప్రభుత్వము ప్రజలపై దౌర్జన్యమునుప్రయోగించినపుడు తాళుకొనునంత నిబ్బరము వారియందుగలదని విశ్వసింపజాలకున్నామనియు, అందువల్ల ఉద్యమము నిలిపివేయుటయే యుక్తమనియు నివేదికను సిద్ధముచేసిరి. మరల జిల్లాకాంగ్రెసుకార్యవర్గము మాయింటిలో సమావేశమై ఆ నివేదికవిషయమై విమర్శచేయుసమయముననే మహాత్ములు వ్రాసిన చిన్నకాగితపుముక్క నొకదాని నెవరో అందించిరి. అందులో తాము అదేసమయములో బార్డోలీలో ఉద్యమము సాగించుచున్నందున గుంటూరుఉద్యమ మెట్లు సాగుచున్నదో అను విషయము ఎప్పుడును మనస్సును కలతనొందించుచుండును గాన అచట ఉద్యమమును ఆపివేయవలసినదని యుండెను. అది చదువుకొనినతోడనే నాహృదయము మిక్కిలి విచారముచే కృంగిపోయెను. అంత చక్కగా సాగుచున్న ఉద్యమమును బుద్ధిపూర్వకముగ ఆపివేయుట నాకు ఇష్టములేకపోయెను. అయినను గాంధీగారే తాముసాగించు ఉద్యమమున కిది అడ్డమువచ్చుచున్నదనుభావము వెలి

బుచ్చినపుడు నే నింక ముందుకుసాగించుట అవధ్యమని నాకు తోచెను. తక్కినసభ్యులును ఆపివేయుటయే సమంజసమని అభిప్రాయపడిరి. గాన ఆపివేయక తప్పినదికాదు. కాని గాంధీగారిమొద్దనుండి ఆ చిన్న కాగితపు ముక్క నెవరు తెచ్చిరో, నాకే వారు ఏల ఉత్తరముప్రాయలేదో, నేను విచారించలేదు. వారు రహస్యముగ నుండవలెనని యుద్దేశించి అట్లు వ్రాసి యుందురని తలంచితిని. ఉద్యమము ఆపివేయబడినదనువార్త తెలియుట తోడనే కాంగ్రెసువారి ఆజ్ఞఅయినది గాన పన్నులు చెల్లించవచ్చునని రైతులు గ్రహించి పన్నులు పూర్తిగ చెల్లించిరి. ఉద్యమము ఇట్లు ఆగిపో యినపిమ్మట ప్రభుత్వము పూర్తిగ నిరంకుశవిధానమువహించి ప్రజలను పీడింపసాగెను. గుంటూరుజిల్లాకలెక్టరు రూథర్‌ఫోర్డు మిక్కిలి కఠినుడు. అనేకమంది రైతులను కొరడాదెబ్బలుకొట్టించెను. అనేకమందికి శిక్షలు వేసి జైలుకుపంపించెను. వీరయ్యచౌదరిగారిని అరెస్టుచేసి కాల్చివైచెదమని భయపెట్టి ఆయనవద్ద క్షమాపణను పుచ్చుకొని విడచిపెట్టిరి. ఆపిమ్మట నన్ను మాయింటిలోనుండగా పట్టుకొని చెరసాలయందుంచిరి. నన్నొక సంవత్స రము పూచీకత్తును వ్రాయవలసినదని మేజిస్ట్రేటు కోరినదానికి నేను సమ్మ తించనందున ఒకసంవత్సరము విడిఖైదుశిక్షను విధించి రాజమహేంద్ర వరముచెరసాలలో పెట్టిరి.

1921 సం॥ నవంబరు 17వతేదీన బ్రిటిషు రాకుమారుడు బొంబాయిలో దిగెను. ఆయనను బహిష్కరించవలెనని కాంగ్రెసు తీర్మానించెను. ఆ బహి ష్కరణఫలితముగ బొంబాయిలో అల్లరులు జరిగెను. పోలీసులు తుపాకులు కాల్చిరి. అయిదుగురు మరణించిరి. విదేశీవస్త్రములు దేశమందంతటను మంటలకాహుతిచేయబడెను. ఆంధ్రదేశములో అన్నిచోట్లను విదేశబట్టలను ప్రతియింటినుండి పోగుచేసి కాంగ్రెసువాదులము తగులబెట్టితిమి. రాజ కుమారుడు కలకత్తా, ఉత్తరప్రదేశ్, పంజాబులను దర్శించుటకు వెళ్ళగా కాంగ్రెసు, ఖిలాఫతు వాలంటీర్లు, శాంతిసైనికులు బహిష్కారమును ఏర్పాటు చేసిరి. శాంతిసేన అక్రమసంఘమని ప్రకటించబడెను. 1921 డిశంబరులో జరిగిన అహమ్మదాబాదుకాంగ్రెసునాటికి దేశబంధు చిత్తరంజనదాసు, మోతీ లాల్ నెహ్రూ, జవహర్లాల్ నెహ్రూ, లాలా లజపతిరాయ్ మొదలగువారు

జైళ్ళకు పంపబడిరి. ఇంకను ఆ రాష్ట్రములలో 20 వేలమంది శాంతిసైని కులు నిషేధాజ్ఞలనుల్లంఘించి జైళ్లకుపోయిరి.

(5)

1922 జనవరినుండి మేము బెజవాడ మునిసిపలుపన్నులనిరాకరణ మును సాగించితిమి. 1884 సంవత్సరపు మునిసిపలుచట్టమును మదరాసు శాసనసభవారు బాగుగా సవరణచేసి 1920లో అమలులోపెట్టిరి. దానిప్రకా రము కౌన్సిలులో మూడువంతులమంది ప్రజల ఎన్నికసభ్యులు, నాలుగవ వంతుమాత్రమే ప్రభుత్వనియమితు లుందురు. ఛైర్మను, వైస్‌ఛైర్మన్— ఇద్దరూ కౌన్సిలర్లచే ఎన్నుకోబడవలెను. ఓటర్లకుగల అర్హతలలో ఆస్తిని తగ్గింపుచేసి ఓటర్లసంఖ్యను చాల వృద్ధిచేసిరి. కౌన్సిలుకుకూడ అధికారము లెక్కువచేసిరి. ఈప్రకారము నూతనఎన్నికలు మదరాసురాష్ట్రములో అన్ని మునిసిపాలిటీలలోను 1920 నవంబరునెలలోగా జరుపబడెను. గాని బెజ వాడ మునిసిపలుకౌన్సిలర్లఎన్నిక, ఛైర్మనుఎన్నిక జరుపకుండ నాపిరి.

ఎన్నికలుజరిపినచో కాంగ్రెసువారు పోటీచేసి గెలిచి, మునిసిపాలిటీని స్వాధీనపర్చుకుంటారని మదరాసుప్రభుత్వమునకు భయము. బెజవాడలో కలి గిన నూతన రాజకీయచైతన్యము మరిఎచ్చటను కానరాకుండెను. అందువల్ల 1921 జనవరినుంచి అధికారములోకివచ్చిన జస్టిసుపార్టీ ముఖ్యమంత్రియగు రాజా పానుగల్లు రామారాయణంగారుకూడ ఎన్నికలు జరుపక కాలహరణము చేయుచుండిరి. దీనవహి హనుమంతరావుగారు ఛైర్మనుగానుండి, ఈ భయ మును గవర్నమెంటులో వృద్ధిచేసి రద్దుచేయబడిన పాతచట్టప్రకారము అధికా రములోకివచ్చిన తాను, తన కౌన్సిలర్లు కాలపరిమితి దాటినపిమ్మటకూడ ఉద్యోగములలోనుండుచువచ్చిరి. వారి స్థితి లిమిటేషన్‌పట్టిన ప్రామిసరీ నోట్లు చలామణియయినట్లుండెను. వెంటనే ఎన్నికలు పెట్టించవలసినదని ఎన్ని బహిరంగసభలలో తీర్మానాలుచేసి పంపినను గవర్నమెంటువారు పెడ చెవినిపెట్టిరి. అందుమీద మునిసిపలుఎన్నికలు పెట్టేదాకా మునిసిపలు పన్నులు ఇవ్వవద్దని నేను, అద్దేపల్లి వెంకటగురునాధరామశేషయ్యశ్రేష్ఠిగారు ప్రజలకు ఆదేశించినాము. బహిరంగసభలు జరిపి బోధించినాము. ప్రజ

లంతా మామాటమీద నిల్చినారు. పన్నులివ్వకుండా వర్తకులు, విద్యార్థులు, మామూలుప్రజలు_కూడ బిగబట్టినారు.ఒక రూపాయికూడ వసూలగుటలేదు. అంతేగాక వాయిద్యములతో మేము, మరికొంతమంది స్నేహితులు వెళ్ళి కౌన్సిలర్లుగానున్నవారిచేత రాజీనామాలుచేయించి వారు దస్కతుచేసిన రాజీనామాలను ప్రభుత్వమునకు, ఛైర్మనుగారికి పంపించినాము. కొతా పూర్ణానందం, అద్దేపల్లి వెంకటప్పయ్య, సౌదాగరుసాహెబు మొదలైన ప్రముఖులంతా మాతో సహకరించి రాజీనామాలు పెట్టినారు. కోరంలేకుండ చేసినాము. 24 మంది కౌన్సిలర్లలో 18 మంది రాజీనామాలిచ్చినారు. బెజవాడ మునిసిపలువ్యవహారములను నడుపుటకు ప్రజలచే ఎన్నుకొనబడిన ఒక కౌన్సిలు నేర్పాటుచేసినాము. ఈ ప్రజాకౌన్సిలుకే ప్రజలు పన్నులివ్వవలెననికూడ బోధించినాము. పన్నులువసూలుచేసి ఖర్చుపెట్టేఅధికారము వీరిదేనన్నాము. అదివరకే నేను కొండపల్లిలో ఇచ్చిన యుపన్యాసము ఘాటుగా మున్నదని నన్ను అరెస్టుచేయవలెనా లేదా యని ఆలోచనలోనున్నట్లు నాకొక పోలీసుఅధికారి వచ్చి చెప్పినాడు. ప్రభుత్వ మునిసిపలుకౌన్సిలుకు పన్నులు బందుఅయినవి. అంతేగాక ప్రజలచే ఎన్నుకొనబడిన కౌన్సిలు ఏర్పడినది. దానికి కొతా పూర్ణానందంగారు అధ్యక్షుడుగఎన్నుకొనబడినాడు. దీనిమీద ప్రభుత్వమువారు 1922 ఫిబ్రవరి 23 వ తేదీన నన్ను, వెంకట గురునాధరామశేషయ్యశ్రేష్ఠిగారిని, ఆతుకూరుకాపురస్తుడు మాతోపాటు పనిచేసిన సత్యనారాయణ అనే బాబూరావును_ముగ్గురిని 107 సెక్షన్‌క్రింద జామీనుకేసుపెట్టి అరెస్టుచేసినారు. అరెస్టుకు మూడురోజులు కద్దనగానే నాకు సబుకలెక్టరుఆఫీసునుంచి, పోలీసులనుంచికూడ రహస్యపుకబురువచ్చినది. మేము సిద్ధముగానే యున్నాము. మాయింట్లో మావాళ్ళతో చెప్పినాను. మా చెల్లెలు, బావగారు ఆరుగొలనునుంచి వచ్చినారు. అరెస్టుచేసేదినము నాకు తెలుసును. ఇందువల్ల భోజనంచేసి జైలుకుపోవుటకు పెందలాడే వంటచెయ్యమని మా యింట్లో చెప్పినాను. వంట అవకుండగనే అరెస్టు చేయుటకు పోలీసుఇన్‌స్పెక్టరు వచ్చినాడు. 'అబ్బాయిభోజనం అయ్యేదాకా కొంచెం ఆగవలసిన' దని మా అక్కగారు చెప్పగా, ఆయన వెళ్ళి మరల కొంతసేపటికి వచ్చినాడు. భోజనముచేసి సిద్ధముగానున్నాను. హారతి

యిచ్చి ప్రార్థనలుజరిపి కుంకుమబొట్టుపెట్టి ఆశీర్వచనములతో నన్ను మా వాళ్ళు జైలుకుపంపినారు. నా గుర్రపుబగ్గిలోనే నేను, పోలీసుఇన్‌స్పెక్టరు కూర్చొని బెజవాడ మేజిస్ట్రేటుకోర్టులో కనిపెట్టుకొనియున్న డెప్యూటీకలె క్టరు వల్లమూడి బ్రహయ్యగారివద్ద హాజరైనాము. అప్పటికే తక్కినఇద్దరు మిత్రులను (ముద్దాయిలను) తీసుకొనివచ్చియున్నారు. ఆయన వెంటనే విచారణప్రారంభించి సాయంత్రం 4 గంటలయ్యేసరికి మా ముగ్గురికి ఒక సంవత్సరం జామీనుకోరుచు తీర్పుచెప్పినాడు. జామీనుఇచ్చుటకు నిరాక రించినాము. ఆ సాయంత్రం రైలులో రాజమహేంద్రవరము సెంట్రలు జైలుకు పంపినారు. ఆ సాయంత్రం పదివేలమందిజనము మేజిస్ట్రేటుకోర్టు వద్ద గుంపుకూడినారు. నేను బయటికివచ్చి "యాత్రకు పోతున్నాము. ఒక యేడాదికి ఇంటికి మరల వస్తాము. మీరందరు శాంతముగా సంతోషముగా ఆశీర్వదించిపంపండి, గాని ఎన్నికలుపెట్టేదాకా మునిసిపలుపన్నులు ఇవ్వ కండి" అని చెప్పినాను. రామశేషయ్యగారుకూడా అలాగేచెప్పినారు. అందరు శాంతముగా నున్నారు. జైజైలుకొట్టినారు. పోలీసువారుకూడ మా ప్రక్కనే యుండి చూస్తూ ఊరుకున్నారు. ఏ అల్లర్లు జరుగకుండా మేము రైలుఎక్కి జైలుకుపోయినాము. అపుడు అందరికి 'సి' క్లాసే. తరువాత మూడునెల లకు జబ్బుచేసి సత్యనారాయణ అనే బాబూరావుకు బంకవిరేచనములుకాగా జామీనిచ్చి జైలునుంచి వెళ్ళిపోయినాడు. నేను, రామశేషయ్యశ్రేష్ఠి యేడాది జైలుజీవితము పూర్తిచేసినాము.

మమ్ము జైలులోపెట్టినమూడునెలలకు మంత్రి రామారాయణంగారు బొడ్డపాటి వెంకటప్పయ్య, సి. రాజగోపాలాచారి, కొండా పూర్ణానందం మొదలైన పెద్దలను పిలిపించి మునిసిపలుపన్నులు యిచ్చేటట్లయితే మునిసి పలుఎన్నికలు వెంటనే జరిపించెదమని చెప్పినారు. దానిమీద జైలులో నున్న మా నాయకులను సంప్రతించి ఏ సంగతి మీకు తెలుపుతామని వారు మంత్రిగారికి జవాబుచెప్పినారు, ఆ మిత్రులు అప్పటికి కడలూరుజైలులో నున్న నన్ను, రామశేషయ్యశ్రేష్ఠిగారిని జైలుఅధికారులఅనుమతితో చూచి మాట్లాడినారు. మునిసిపలుఎన్నికలు జరిపితే పన్నులు యివ్వండి, అది మనకు విజయమే. మా ఖైదుకు మీరు పన్నులుయివ్వడానికి ముడిపెట్ట

వద్దు. మేము గాంధీగారిసహాయనిరాకరణోద్యమములో జైలుకువచ్చిన వారము. మీరు పన్నులివ్వక యింకా కొన్నినెలలు బిగబట్టితే జప్తులు, వేలములు మొదలైనవి జరిగి, ప్రజలలో కొందరిని ప్రభుత్వమువారు చీలదీసి ఇపుడున్న ఐకమత్యమును చెడగొడితే మనము ఓడిపోతాము. కనుక ఇప్పుడే,ప్రభుత్వము మిమ్ము బ్రతిమలాడుచున్నపుడే పన్నులనిచ్చివేసి ఎన్నికలు తెచ్చుకోండి అని సలహాచెప్పినాము. మమ్ము విడుదలచేయమని మా మిత్రులు ప్రభుత్వమునకు చెప్పగా, వారిని సహాయనిరాకరణోద్యమములో తీవ్రముగా పనిచేస్తున్నందుకు పట్టుకున్నాము, కేవలము మీ పన్నులనిరాకరణముకొరకే కాదు. దానికి ముడిపెట్టితే రాజీకుదరదు అని ప్రభుత్వపక్షమున చెప్పబడినది. బెజవాడపౌరులు మా సలహాప్రకారము పన్నుల నిచ్చినారు. 1922 సం॥ మధ్యభాగములోనే బెజవాడ మునిసిపలుఎన్నికలు జరిగినవి, ఆ ఎన్నికలలో దివానుహి హనుమంతరావుగారు కాంగ్రెసుపార్టీతో తీవ్రముగ పోటీచేసినారు కాంగ్రెసుపార్టీకి 15 మంది సభ్యులును, హనుమంతరావుగారిపక్షమున 9 మంది సభ్యులును గెలిచినారు. అపుడు కాంగ్రెసు పార్టీయే చైరుమను, వైస్‌_చైరుమను పదవులను సంపాదించుకున్నది. చైరుమనువిషయములో ఎవరిని ఎన్నుకుంటే బాగుంటుందని మరల రాజగోపాలాచారి, బారిస్టరు తుర్లపాటి వెంకటేశ్వరరావుగారలు నాతోను, రామశేషయ్యశ్రేష్ఠిగారితోను సంప్రతించుటకు కడలూరుజైలుకువచ్చి కలుసుకున్నారు. పశ్చిమకృష్ణాజిల్లా కాంగ్రెసుకమిటీ అధ్యక్షుడు, జాతీయక్రైస్తవుడైన డాక్టరు ధన్వాడ రామచంద్రరావు ఎమ్. ఏ.; ఎమ్. డి. గారిని మునిసిపలుచైరుమనుగా ఎన్నుకొనవలసినదని మేము సలహాయిచ్చినమీదట ఆప్రకారమే రామచంద్రరావుగారిని కాంగ్రెసుపార్టీ చైరుమనుగా ఎన్నికచేయించుకున్నారు. మేము సంతోషముగా పూర్తిగ సంవత్సరము జైలులో నుండినాము. మేమిద్దరము విడుదలై బెజవాడలో ఉదయమున రైలులోనుంచి దిగగానే వేలాదిప్రజలు, చైరుమను, వైస్-ఛైరుమను, కౌన్సిలర్లు, లాయర్లు, వర్తకులు, డాక్టర్లు, కార్మికులు మొదలగువారు మమ్ము స్టేషనులో గొప్పగా సన్మానించి పెద్దయూరేగింపుతో ముందుగ మునిసిపలుఆఫీసుకు తీసుకొనిపోయి అక్కడ పౌరసన్మానపత్రమును సమర్పించి, అనన్యసాధా

రణమైన యూరేగింపుతో బెజవాడపురవీధులగుండా యూరేగించి, పన్నెండు గంటలకు మా స్వగృహములో విడచిపెట్టిరి. ఇటింట హారతులిచ్చి అనేక చోట్ల ఖద్దరుచాపులను బహూకరించిరి. మాకు సమర్పించబడిన పూలదండలకు పుష్పగుచ్ఛములకు, పండ్లకు మేరలేదు.

దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు జైలుకుపోగానే చీరాల పేరాల ప్రజలు తట్టుకోలేకపోయినారు. నాయకుడు లేకపోయినాడు. దుండగులు ప్రభుత్వపక్షీయుల ప్రేరేపణచే కొన్నిపాకలకు నిప్పంటించినారు. దానితో ప్రజలు భయపడి ఎక్కడివారు అక్కడ రామనగరమును విడచి మరల చీరాల పేరాలగ్రామములలోనున్న తమ స్వస్థలములకు చేరుకున్నారు.పన్ను లిచ్చుటకు ఒప్పుకున్నారు. గవర్నమెంటువారు ప్రజలనెత్తిమీద మునిసిపాలిటీని రుద్దినారు. ప్రజలు ఒప్పుకొని ఎన్నికలుపెట్టుకొని మునిసిపాలిటీ ఏర్పాటుకు అంగీకరించిరి.

(6)

అద్దేపల్లి వెంకటగురునాథరామశేషయ్యశ్రేష్ఠిగారు, నేను రాజమహేంద్రవరము సెంట్రలుజైలులో అయిదవవార్డులోని రెండుగదులలో నుంచబడితిమి. త్వరలో నందిగామతాలూకాలో పన్నులనిరాకరణప్రచారము చేసి ఏడాది శిక్షతో వేదాంతం శంభుశాస్త్రిలుగారు వచ్చి మాతో చేరిరి. మా ప్రక్కగదిలోనే వారికిని స్థానము దొరకెను. ఆయన మా బెజవాడ జాతీయకళాశాలలో తెనుగుపండితుడుగ పనిచేయుచుండెను. అస్పృశ్యతా నివారణకు దీక్షవహించినవారై యితరపండితులతో చర్చలుజరుపుచుండెను. మాకంటె కొంచెము ముందుగనే గొల్లపూడి సీతారామశాస్త్రి, మద్ది రాధాకృష్ణయ్యగార్లు పెదనందిపాడు పన్నులనిరాకరణసందర్భములో నొక సంవత్సరము జైలుశిక్ష ననుభవించుటకు ఆ జైలుకే పంపబడిరి. ఉన్నవ లక్ష్మీనారాయణ, మాడభూషి వేదాంతం లక్ష్మీనరసింహాచార్యులుగార్లు రాయవేలూరుజైలుకు పంపబడిరి. అందరికంటె ముందుగా కాకినాడలోని కాంగ్రెసుకార్యాలయముపైన జాతీయజండాను ప్రతిష్ఠచేసి, జిల్లామేజిస్ట్రేటు తీసివేయవలెనని యిచ్చిన ఉత్తరువు నుల్లంఘించి, పోలీసువారు దానిని

దింపివేయుటకు చేసినప్రయత్నమును ప్రతిఘటించి అరెస్టుచేయబడి బులుసు సాంబమూర్తి, మండపాక రంగయ్యనాయుడుగార్లు ఒక సంవత్సరం శిక్షతో రాజమహేంద్రవరముజైలుకు పంపబడిరి. వారికిపిమ్మట దేశబాంధవి దువ్వూరి సుబ్బమ్మగారు ఆ జైలులోని స్త్రీలవార్డులో ఒకసంవత్సరము కారాగారవాసముచేయుటకు వచ్చెను. ఆమె అక్కడనుంచి బిగ్గరగా గోవింద రామాయణంపాటలు పాడుతూవుంటే మా వార్డులలోకి వినపడేవి. రాజమహేంద్రవరమునుంచి డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం, తూర్పుగోదావరినుంచి వెన్నేటి సత్యనారాయణ, కళా వెంకటరావు, మొసలికంటి తిరుమలరావు మొదలగువారు వచ్చి ఆ జైలులో చేరిరి. ఇంతలో పెదనందిపాడు పన్నులనిరాకరణసందర్భములో ముందుగా కొండా వెంకటప్పయ్య పంతులుగారు మా జైలుకు పంపబడిరి. పిమ్మట తండోపతండములుగ గుంటూరుజిల్లానుండియు, నితరజిల్లాలనుండియు కాంగ్రెసు ఖైదీలు వచ్చి మాతో చేరినకొలది మేమందరము అత్యంత ఉత్సాహవంతులమైతిమి. బులుసు సాంబమూర్తిగారు జైలుసూపరింటెండెంటుతో మాట్లాడి మాకందరికి సర్కారువారు ఇచ్చే "సి" క్లాసుబత్తెమునే వారికి ప్రతిరోజా వప్పగింత చేయునటులను, దానితో కొంచెము బాగుగ వంటచేసి మాకు పెట్టునటులను అనుజ్ఞపొంది వంటచేయనారంభించిరి. వారికి కాంగ్రెసుఖైదీలు కొందరు ఇద్దరు ముగ్గురు మామూలుఖైదీలు సహాయమివ్వబడిరి. గుంటూరుజిల్లానుండి మాజైలుకువచ్చినవారిలో గుళ్లపల్లి పున్నయ్యశాస్త్రి, గౌసుబేగు, కన్నెగంటి సూర్యనారాయణ, భట్టిప్రోలు సూర్యప్రకాశరావు, చింతమనేని భావయ్యచౌదరి, గంధం నాగేశ్వరరావు, బ్రహ్మాండం నరసింహం, శీరం సుబ్బారావు, మాచిరాజు రామమూర్తి, గోపాలుని రామలింగయ్యగార్లు మొదలగువారు గలరు. నెల్లూరుజిల్లాలో తిక్కవరపు రామిరెడ్డి, వెన్నెలకంటి రాఘవయ్య, ఓరుగంటి వెంకటసుబ్బయ్య, కటికనేని కళ్యాణరావు, కటికినేని వెంకటరామారావు, బొమ్మా శేషరెడ్డి మొదలగువారు కల్లు సారా దుకాణములవద్ద త్రాగవద్దని బోధించుచు శాంతియుతమైన పికెటింగుచేసినారు. వారికందరకు శిక్షలువేసి రాయవేలూరుజైలుకు పంపినారు. ఇదేవిధముగ పశ్చిమకృష్ణాజిల్లా నూజవీడులో కొల్వాలు.అబ్బాపల్లి,దశిక సూర్యప్రకాశరావు,

భట్టి వెంకోజీ, నీలాచాలం, తటవర్తి రంగయ్య మొదలగువారు కల్లు సారాదుకాణములవద్ద పికెటింగుచేయగా వారినందరిని రాజమహేంద్రవరము జైలుకు పంపినారు. వల్లూరు రామారావుగారు పికెటింగుచేయు చుండగా దుకాణదా రాయననుపట్టుకొని స్తంభమునకుకట్టివేసి నెత్తిమీదను, నోటిమీదను, మొగముమీదను, వంటిమీదను సారా పోసి వెంటనే పోలీసులచేత అరెస్టుచేయించెను. ఆరునెలలు శిక్షవేసి ఆయనను రాజమహేంద్రవరము జైలుకు తీసుకొనివచ్చిరి. పశ్చిమకృష్ణాజిల్లాకు బెజవాడయే కేంద్రస్థానము. కాంగ్రెసుమహానాయకులెల్లరు అక్కడికే వచ్చుట వలన రాజకీయసంచలన మెక్కువగ నుండెను. పశ్చిమకృష్ణాజిల్లాలోని తిరువూరుతాలూకా గంపలగూడెంలో కుమారరాజాగారినాయకత్వముక్రింద పని చేయుచున్న పేట బావయ్య మొదలగు పదిమందిని జాతీయకీర్తనలుపాడు చున్నారని ఏదో హాని ర్మోనియంతగాదాతో పోలీసువారు అరెస్టుచేసి శిక్షలు వేయించి రాజమహేంద్రవరముజైలుకు పంపిరి. ఆ జిల్లాలోని మైలవరంలో అడవిపుల్లరి ఇవ్వవద్దని బోధించుచున్నారని శనగవరపు సుబ్బయ్యశాస్త్రి మొదలగువారిని, గొడవర్రు, ఉయ్యూరు గ్రామములనుంచి రొయ్యూరు అచ్యుతరామయ్య, జొన్నవిత్తుల కుటుంబసుబ్బారావుగారు మొదలగువారిమీద కేసులుపెట్టి శిక్షలువేసి రాజమహేంద్రవరము జైలుకు పంపిరి. మరం బాల సుబ్రహ్మణ్యంగుప్త విడుదలైనపిమ్మట ఆయనమీద రాజద్రోహనేరంమోపి రెండవసారి శిక్షవేసి రాజమహేంద్రవరం జైలుకు పంపిరి. చిత్తూరుజిల్లా పుత్తూరునుండి రంగం శ్రేష్టిగారి కొకసంవత్సరం శిక్షవేసి రాయవేలూరు జైలుకు పంపిరి. తూర్పుకృష్ణానుండి చెరుకువాడ వేంకటనరసింహంగారిని జైలుకుపంపిరి. ఏలూరునుంచి ఆత్మకూరు గోవిందాచార్యులు, దుగ్గిరాల కృష్ణమూర్తి, బసవరాజు శ్రీరంగశాయి, గరికపాటి మల్లావధానులు, జోగయ్య శర్మ, డాక్టరు ఉప్పులూరు పట్టాభిరామయ్యగార్లు, భీమవరంనుండి ముష్టి లక్ష్మీనారాయణ, సుబ్రహ్మణ్యం, వేలూరు సత్యనారాయణ, అడవి బాపిరాజు మొదలగువారు శిక్షలువేయబడి, రాజమహేంద్రవరముజైలుకు పంపబడిరి. విశాఖపట్టణములోని వైద్యకళాశాల విద్యార్థులను జాతీయనాటకము వేయ వద్దని నిషేధించగా వారా ఆజ్ఞల నుల్లంఘించి నాటకమువేయబోగా పోలీసు

వారు వచ్చి కె. యల్. నరసింహారావు. ఉల్లి తిరుపతి మొదలైన నలుబది మంది వైద్యవిద్యార్థులను అరెస్టుచేసి ఆరేసినెలలు శిక్షలువేయించి రాజమహేంద్రవరం జైలుకు పంపిరి. వసంతరావు బుచ్చిసుందరరావుగారినికూడ శిక్షవేసి ఆ జైలుకేపంపిరి. బరంపురములో వి.వి. గిరి, ఉన్నవ రామలింగం న్యాపతి నారాయణమూర్తి, నాధి రామకృష్ణారావు మొదలగు ఇరవైమందికి శిక్షలువేసి బరంపురంజైలులోపడవేసిరి. ఇంకను చాలమందికాంగ్రెసువాదులు ఆంధ్రదేశమునుండి ఆ స్వతంత్రపోరాటములో జైళ్లకువచ్చిరి. రాజమహేంద్రవరముజైలులో షుమారు రెండువందలమంది కాంగ్రెస్‌వాదులముంటిమి. మాలో కొందరము విడిశైదువిధించబడినవాళ్ళము. మా బట్టలే కట్టుకోవచ్చును. జంపకానా గాని, తుంగచాప గాని తెచ్చుకోవచ్చును. జైలులో పనిచేయనక్కరలేదు. మిగిలినవారు చాలమంది కఠినశైదువిధించబడినవారు. వారికి జైలుమట్టలాగులు, చొక్కాలు. నెత్తికి జైలుటోపి, పడుకోవడంకు జైలు మొద్దుచాప, కప్పుకొనుటకు జైలుగొంగడి. పిండివిసరటం మోట లాగడం మొదలైనపనులు వారిచేత చేయించిరి. భోజనం అన్నంముద్ద, నూనె, ఉల్లిగడ్డలువేసిన పప్పుపులుసు కఠినశైదీలకు విడిశైదీలకు ఒక్కటే. కఠినశైదీలకు కొంచెం ముద్ద పెద్దది. ఎవరికిని నెయ్యి, మజ్జిగ లేదు. దానిని ఆరోగ్యకారణముగా జైలుడాక్టరు ఇవ్వవచ్చును. ఒక యూరోపియను అపుడు డాక్టరుగానుండెను. అతను మంచివాడు. బి. ఏ. ప్యాసయిన శైదీలందరికి తలా ఒక బొన్ను నెయ్యి. కొంచెం మజ్జిగ నిచ్చెను. మాలో ఏబదిమందిమి బి. ఏ. ప్యాసు అయినవారుంటిమి. దానిని తెచ్చుకొని రెండు వందల కాంగ్రెసుశైదీలము పంచుకొని వేసుకున్నాము. ఒక మిల్లిగంటెలో సగము నేయి, బొత్తుగా నీళ్లమజ్జిగ అందరము వేసుకున్నాము. కఠినమైన పనిచేయడంవల్ల చాలమందికి జబ్బుచేసినందున క్రమముగ కఠినపని మానివేసి సామాన్యపని— నేత, అచ్చుపని మొదలైనవి చేయించుచు వచ్చినారు. నాకు రాజమహేంద్రవరముజైలులో చాలా వేడిచేసి తల బరువుగ వుండేది. నాకు బొత్తుగా నూనె సరిపడదు. ఉల్లిగడ్డలు ఇష్టములేదు. మరియు జైలుకువచ్చేముందే జ్వరమువచ్చి నెమ్మదించి యింకా చాల బలహీనముగనుండగనే జైలుకువచ్చినాను. వివేకానందస్వాములవారి గ్రంథ

ములు, భాగవతము చదువుకునేవాణ్ని. రెండునెలలు రాజమహేంద్రవరము జైలులోనున్నతరువాత మాలో షుమారు వందమందిని కడలూరుజైలుకు పంపిరి. మద్రాసురాష్ట్రములోని రాయవేలూరు, తిరుచినాపల్లి మొదలగు జైళ్లనుంచికూడ కొందరు కాంగ్రెసువాదులను కడలూరుకు పంపిరి. కడలూరుజైలులో షుమారు రెండువందలమందిమి వుంటిమి. అక్కడ శీతోష్ణస్థితి కొంచెం చల్లగానున్నది. పోకచెట్లు, పనసచెట్లు, మామిడి చెట్లు మొదలైనవాటితో కొంత రమణీయముగా నుండెను. కొండా వెంకటప్పయ్యగారు, యాకూబు హుస్సేన్‌గారు, గొల్లపూడి సీతారామశాస్త్రి, మా బెజవాడ బృందము, డాక్టరు సుబ్రహ్మణ్యం, భీమవరం బృందము, భట్టిప్రోలు సూర్యప్రకాశరావు, మరం బాలసుబ్రహ్మణ్యంగుప్త, ఆత్మకూరి గోవిందాచారి మొదలగువారు కడలూరు వచ్చిరి. డాక్టరు వరదరాజులు నాయుడు, దండపాణి పిళ్లె, భవానిసింగు, ఖాజీసాహెబు, ఇగ్నేషియసు, మధిర ముస్లింసోదరులు మొదలగువారు వచ్చిరి. రంగంశ్రేష్ఠిగారు, పున్నయ్యశాస్త్రి, కర్నాటక నవాబుగార్లు నాకు మిగుల సన్నిహితులుగ నుండిరి.

రాయలసీమలోకూడ కొంతమంది యువకులు సత్యాగ్రహముచేసి జైళ్ళకు వచ్చిరి. 1921 డిశంబరు 10 వ తేదీన కల్లూరి సుబ్బారావుగారిని అరెస్టుచేసి ఒకసంవత్సరము శిక్షవేసి బళ్ళారిజైలుకు పంపిరి. ఆయనను అక్కడినుంచి తిరుచినాపల్లిజైలుకు తెచ్చి పిమ్మట కడలూరుజైలులో మాతోకూడ నుంచిరి. కడపలో ప్రతాపగిరి రామమూర్తిగారను యువకుని ఒకసంవత్సరము శిక్షవేసి, తాడిపత్రినుంచి కలచవీడు వెంకటరమణాచారి గారిని ఒకసంవత్సరము శిక్షవేసి కడలూరుజైలుకు పంపిరి, అచటినుంచి వెంకటరంగాచారి, నరసప్ప, శ్రీనివాసాచార్యులుగారలు కల్లు, సారాదుకాణముల వద్ద పికెటింగ్‌చేయుగా అరెస్టుచేసి వేలూరుజైలుకు పంపిరి; కర్నూలునుండి శంకరరెడ్డిగారిని అరెస్టుచేసి బళ్ళారిజైలుకు పంపిరి. అనంతపురంజిల్లా ఉరవకొండనుండి బియ్యన్నను అరెస్టుచేసి కడలూరుజైలుకు పంపిరి. కడపజిల్లానుంచి గాజుల వీరభద్రరావుగారిని కడలూరుజైలుకు, చింతకుంట సుబ్బారావుగారిని వేలూరుజైలుకు పంపిరి. ఉరవకొండనుండియే

లక్ష్మీపతి, నారాయణప్ప, ఘట్టి వెంకటరమణప్ప, ఉకూరి నారాయణశాస్త్రి, రామదాసునాయుడుగారలను తలా మూడునెలలు శిక్షలువేసి వేలూరుజైలుకు పంపిరి.

కడలూరుజైలులోనే నేను 'ఫ్రెంచిస్వాతంత్ర్యవిజయము' 'అమెరికా సంయుక్తరాష్ట్రములు' వ్రాసితినని మరియొక అధ్యాయమునందు చెప్పి యున్నాను. కొండా వెంకటప్పయ్యగారికి డచ్చిస్వాతంత్ర్యకథను చదివి తెలుగులో వ్రాస్తే బాగుంటుందని నేనే సలహాచెప్పితిని. వారు అచట కొంత తర్జుమాచేసిరి. ఖాజీసాహెబుగారు నాకు ఉర్దూ నేర్పుచువచ్చిరి. చిన్నతనంలో కొంత నేర్చుకొంటిని కాని మరచిపోవుటచే మరల మొదలుపెట్టితిని. కొంత హిందీకూడ చదివితిని. కారలుమార్క్సు జీవితమును, బోధలనుగూర్చి యొకపుస్తకము చదివినాను. కారలుమార్క్సుత్యాగము అఖండమయినది. పేదవారికొరకే తనజీవితము నర్పించెను. కార్మికుల నుద్ధరించ సమకట్టెను. వారిజీవితము మిగుల ఆకర్షణీయముగ నున్నది. దానిని తెనుగులోకి వ్రాసితిని. నేను దానిని ప్రకటించెదనని విజ్ఞానచంద్రికామండలిపత్రమున ప్రకటింపబడినదికూడా. కాని ఆస్తి, వారసత్వము, మతము, వివాహము, కుటుంబములనుగూర్చి ఆయనయొక్క, ఆయనమిత్రుడు ఎంజెల్సుయొక్క బోధలు భారతజాతీయనాగరికతకు కేవలము విరుద్ధముగానున్నందున ఆ పుస్తకప్రచురణను మానివేసినాను. నేను ఏ సత్యములను నమ్మెదనో వాటినే ఆంధ్రప్రజలకిచ్చుటకు నా గ్రంథములు వ్రాసినాను. నాకు కమ్యూనిజం నచ్చలేదు. పిమ్మటకూడా కాపిటల్, కమ్యూనిస్టు మానిఫెస్టో, వెబ్సు, డాబు, ట్రాట్స్కీ, స్టాలిన్, లెనిన్ వ్రాసిన షుమారు పదిహేను పదహారుగ్రంథములు శ్రద్ధగానే చదివినాను. గాని కమ్యూనిజంయందు, దాని క్రూరహింసాపద్ధతులయందు, నిరంతరవర్గపోరాటమునందు, నియంతృత్వమునందు, నాస్తికత్వమునందు వ్యతిరేకుడనై తెలుగులో దానినిగూర్చి గ్రంథము వ్రాయలేదు. నేను జాతీయవాదిని. కమ్యూనిజం కేవలం అంతర్జాతీయతత్వముగనుండి ప్రపంచములోని అందరుకార్మికుల నొకజాతిగను బూర్జువా (పనిచేయించుకామందులు)ను మరియొకజాతిగను విభజించినారు. ఇందువల్లకూడా నా కది రుచించలేదు. యాకూబు హుస్సేన్‌గారు ఖురానుకు వ్యాఖ్యా

నముద్రాయుచువచ్చినారు. ఆత్మకూరి గోవిందాచార్యులుగారికి చాల జబ్బుచేసినది. బ్రతకడనుకున్నాము. జామీనిచ్చి పోవలసినదని అధికారులు చెప్పగా ప్రాణంపోయినను జామీనివ్వనని గట్టిగా చెప్పినాడు. చాల ధీరత్వముతో నిలచినాడు. దైవానుగ్రహమువలన కొన్నిరోజులలో జబ్బు కొంత తగ్గినది. ఎట్టిషరతులు లేకుండ అధికారులు విడుదలచేసినారు. కడలూరుజైలులో రాజమహేంద్రవరం జైలుకంటె కాంగ్రెసుఖైదీలకు కొంచెము ఎక్కువ సదుపాయముగానున్నది. పని చేయించలేదు. నెయ్యి, మజ్జిగ విరివిగా మంజూరు చేస్తూవచ్చినారు. నాకుకూడ అతుల మంజూరైనది గాని, సన్నని జ్వరం ఏడునెలలు వచ్చుటవల్ల నెయ్యివేసుకొన వీలులేకపోయినది. నాకు గుళ్ళవల్లి పున్నయ్యశాస్త్రి చాల సేవచేసినాడు. నా పళ్లెం, చెంబు తోమిపెట్టేవాడు. నాగది తుడిచిపెట్టేవాడు. నేను, పున్నయ్యశాస్త్రి, కర్ణాటకనవాబుగారు కలిసి ఒకచోట కూర్చొని భోజనంచేసేవాళ్లము. పున్నయ్యశాస్త్రికికూడ మా నెయ్యి మజ్జిగ ఉండేవి. అతను అప్పటికి చాలా కుర్రవాడు. నాకు ముఖ్యశిష్యుడుగ నుండేవాడు. మేము కడలూరుజైలులో నుండగా గరిమెళ్ల సత్యనారాయణ గార్ని "మా కొద్దీ తెల్లదొరతనము," "దండాలు దండాలు భారతమాతా, జాతివాడు వచ్చినాడు భారతమాతా, చిప్ప చేతి కిచ్చినాడు భారతమాతా, అడవులన్ని వాడివంట భారతమాతా, అడుక్కుతినడం మనదంట భారతమాతా, కల్లు సారా పోసినాడు భారతమాతా, ఒళ్లు గుల్ల చేసినాడు భారతమాతా!" అను ఉద్రేకపూరితమైన జనరంజకమైన కీర్తనలను అల్లి వ్యాపింపచేసినందుకు మావద్దకు పంపినారు. 1942 లో "క్విట్ ఇండియా" వలె "మా కొద్దీ తెల్లదొరతనము" అనునినాదము 1922 లోనే ఆంధ్రదేశమంతట మారుమ్రోగినది. అందుకు బ్రిటిషుప్రభుత్వమువారు రెండు సంవత్సరముల కఠినశిక్షవేసి ఆ నినాదమును లేవదీసిన గరిమెళ్ల సత్యనారాయణగారిమీద కసితీర్చుకున్నారు. గరిమెళ్ళ సత్యనారాయణగారికీర్తనలు చదువుచు ఇగ్నేషియసు, భవానిసింగు, నేను ఇంక ఇద్దరు ముగ్గురు కోలాటము ఆడేవాళ్లము. ఇంతేగాక,

"ఆంధ్రదేశపు మట్టి, అది మాకు కనకము
ఆంధ్రదేశపు జలము, అమృతంపు రసము
ఆంధ్రదేశపు గాలి, అది మాకు ప్రాణము
ఆంధ్రదేశమె మాకు, అమర దైవతము ॥

అను కీర్తనను నేను పాడుతుంటే వాళ్ళందరికి ఉల్లాసముగా ఉండేది. ఈ మూడు మా కపుడు జైలులో మిక్కిలి ప్రియమైన కీర్తనలు. 1923 వ సంవత్సరము ఫిబ్రవరినెలలో అద్దేపల్లి గురునాధరామశేషయ్యశ్రేష్ఠిగారు నేను విడుదలై బెజవాడవచ్చినామని ఇదివరకే చెప్పియున్నాను. మిగిలినవారందరు వారివారి శిక్షాకాలములు పూర్తిఅయినపిమ్మట విడుదలైనారు.

మేము రాజమహేంద్రవరముజైలులోనుండగా నలుగురు భారతీయ సాయుధవిప్లవకారులు యావజ్జీవశిక్షలు విధింపబడి ఉత్తరహిందూస్థానములోని జైలునుండి పంపబడి రాజమహేంద్రవరముజైలులో ప్రత్యేకముగ నుంచబడినారు. మేము వారు కలవడానికి వీలులేదు గాని, మధ్యాహ్నం జైలుఅధికారులు లేనపుడు వార్డర్ల సానుభూతిని సంపాదించుకొని మేము కొందరము వారివద్దకువెళ్ళి పరామర్శచేసివచ్చేవాళ్లము. అందులో నొకరు ఎల్లపుడు కడుపులోనొప్పితో బాధపడుచుండెను. డాక్టరు ఏవో మందిచ్చు చుండెను. గాని నెమ్మదిలేదు. అలాగే జైలులో వుండకతప్పినదికాదు. వారిలో పృధ్వీసింగు ముఖ్యుడు. మంచి విద్యావంతుడు. వారి విప్లవానుభవములు, వారు పోలీసులచేత పెట్టబడినబాధలు చెప్పుచుండగ మా మనసులో నెంతో సానుభూతి కలిగించేవి. డాక్టరు సుబ్రహ్మణ్యంగారు, పృధ్వీసింగు గారు చాల స్నేహితులైనారు. పిమ్మట కొన్నిరోజులకు పృధ్వీసింగును ఉత్తరహిందూస్థానములోని మరియొక జైలుకు మార్చుచుండిరి. రైలులో పోలీసుబందోబస్తుతో ప్రయాణముచేయుచు నొకచోట రైలు బండిలోని పాయఖానాదొడ్డిలోకి పోయి లోపల తలుపుబిగించి కిటికీని తీసివేసి ఆ రైలు కొండలదగ్గర వంకరగా నెమ్మదిగా తిరిగేచోట రైలునుంచిదుమికి పారిపోయినాడు. బుడబుక్కలవేషము వేసుకొన్నాడు. ఈ ఏర్పాట్లన్నీ అదివరకే డాక్టరు సుబ్రహ్మణ్యంగారిసలహాపైన రాజమహేంద్రవరంమిత్రులు చేసినారని చెప్పుకున్నారు. పోలీసువారు మరుష్టేషనుతో

పాయిఖానాతలుపు కొట్టినారు. లోపలబిగించియున్నది. రాలేదు. రైలునాపించి తలుపుతీయించి చూస్తే లోపల ఖైదీ లేడు. పారిపోయినాడు. అప్పటినుంచి అత్యద్భుతముగ పోలీసులకు చిక్కకుండ మారువేషములతో ఇండియాఅంతా తిరుగుచుండెను. మాకు కాంగ్రెసుమహాసభలకు కరాచీ మొదలైనచోట్లకు పోయినపుడు కనపడి ముచ్చటించి వెళ్లేవాడు. ఒకసారి బెజవాడలో మా యింటికి రాగా మూడురోజులు మా మేడమీద దాచినాను. కొంత ద్రవ్యసహాయముచేసి పంపినాను. రెండపసారి నేను మద్రాసులో డాక్టరు లక్ష్మీపతిగారి ఇంట్లో బసచేసియుండగా నావద్దకు వచ్చినాడు. శ్రీమతి రుక్మిణమ్మగారికి చూపించినాను. రెండుపూటలు మాతోకలసి వారింట్లోనే భోజనముచేసినాడు. లక్ష్మీపతిగారుకూడ వచ్చినపిమ్మట అతనిని ఆదరించినారు. అపుడు నేను శాసనసభ్యుడుగ నుంటిని. కొంతడబ్బు ఇచ్చి పంపినాను. ఆఖరున నేను చీఫ్‌పార్లమెంటరీకార్యదర్శిగానుండగా 1938 లో ఒకరోజున మద్రాసు త్యాగరాయనగరులో మాయింటికి వర్తకునివేషములో వచ్చినాడు. నన్ను పలుకరించినాడు. కొంచెముసేపటికి గుర్తుపట్టినాను. మాయింట్లో ఉంచుకున్నాను. మా ప్రధానమంత్రియైన రాజగోపాలాచార్యులుగారిక్రింద పోలీసు, లాఆర్డరు, ఆర్థికము, సర్విసెస్ మొదలైనవి యున్నందున ఆ శాఖలన్నిటికి నేను శెక్రెటరీగా పనిచేయుచుంటిని. అపుడు డిప్యూటీమంత్రులు లేరు. మేమందరము పార్లమెంటరీశెక్రెటరీ లనే పిలువబడితిమి. పోలీసుశెక్రెటరీగానున్న మాయింట్లోనేయుండ పృధ్వీసింగుకు పోలీసువారిభయ మెక్కడిది? కనుక నిర్భయముగా మాయింట్లో నాలుగురోజు లున్నాడు. బయటికిమాత్రము పోలేదు. ఈసంగతి రాజగోపాలాచార్యులుగారికిగాని ఇతరమంత్రులకుగాని చెప్పలేదు. గోపాలరెడ్డిగారికిమాత్రం తరువాత చెప్పినట్లుజ్ఞాపకము. అయితే ఆ కాలములో మా ప్రభుత్వము రాజకీయఖైదీలనందరిని విడుదలచేయుపద్ధతిని అవలంబించినది. సత్యాగ్రహులనేగాకుండ సాయుధ విప్లవకారులను కూడ విడుదలచేసినాము. ప్రతివాది భయంకరాచారిగారు సాయుధవిప్లవ ప్రయత్నములో అండమానుద్వీపములకు పంపబడినాడు. తూర్పుగోదావరి జిల్లాలో ముస్తఫాలీ, దప్పుల సుబ్బారావు అను నిద్దరు మిగుల క్రూరులైన పోలీసుఉద్యోగులు సాంబమూర్తిగారిని స్పృహతప్పేటట్లు కర్రలతో తల

మీదకొట్టి, డాక్టరు సుబ్రహ్మణ్యం, నాళం క్రిష్ణారావుగార్ల ఛాతీజొమికెలను విరగకొట్టించి, ప్రతివాది భయంకరాచారిగారి మర్మస్థలములో అతిక్రూరముగ ముస్తఫాలీ స్వయముగ దెబ్బలుకొట్టినాడు. ఈ బాధలు సహించలేక భయంకరాచారిగారు ముస్తఫాలీని హత్యచేయుటకు ప్రయత్నించినాడు. భయంకరాచారిగారికి పదిసంవత్సరముల శిక్షవేసి అండమానులకు పంపినారు. ఆయననుకూడ విడుదలచేసినాము. ఆయనతండ్రి నా వద్దకువచ్చి నన్ను చూచినాడు. నేను రాజగోపాలాచార్యులుగారికి సిఫారసుచేసినాను. రాజకీయ ఖైదీలవిడుదలపని నేను ప్రత్యేకముగ చూస్తుంటిని. గాని ఈ సాయుధవిప్లవకారులు హింసాపద్ధతి త్యజించినామని, అహింసాపద్ధతులమీదనే దేశకళ్యాణమునకు పనిచేస్తామని వారిచేత వ్రాయించుకొని దస్కతులుపెట్టించుకొని విడిచిపెట్టినాము. ఈ సంగతి అంతా పృధ్వీసింగుకు చెప్పి "వెంటనే మహాత్మాగాంధీగారివద్దకు పోయి శరణుపొందండి. సాయుధవిప్లవమును విడిచిపెట్టినానని, అహింసాయుతవిప్లవమునే సాగిస్తానని వారికి వ్రాసియివ్వండి. మిమ్ము వారు యావజ్జీవశిక్షనుంచి విడుదలచేయిస్తారు. స్వతంత్ర కాంగ్రెసువాదిగా పనిచెయ్యవచ్చు" అని బోధించినాను. అతను ఈ విషయమై బాగా ఆలోచిస్తానన్నాడు. తరువాత కొద్దికాలమునకు బొంబాయిలో అఖిలభారత కాంగ్రెసువర్కింగ్‌కమిటీ జరుగుచుండగా డాక్టరు పట్టాభి సీతారామయ్యగారినికలసి ఆయనద్వారా మహాత్మాగాంధీగారివద్దకు పోయి శరణుజొచ్చినాడు. ఆయన ముందుగ అతనిని పోలీసులకు వప్పగింతచేసి జైలులో పెట్టించినాడు. పిమ్మట బొంబాయిరాష్ట్ర హోంశాఖమంత్రియగు మున్షీగారితో సంప్రతింపులు జరిపి హింసాతత్వమును విసర్జించినానని వ్రాయించుకొని పూర్తిగ క్షమాపణనిచ్చి విడుదలచేయించినారు. పృధ్వీసింగు కొంతకాలము సేవాగ్రామములో నున్నాడు. ఆయన సాహసకృత్యములు గాంధీగారి ముఖ్యశిష్యురాలగు మిస్‌స్లేడు (మీరాన్) ను ఆకర్షించినవి. ఆమె ఆయనను వివాహమాడవలెనని ప్రయత్నించినది. పృధ్వీసింగు అంగీకరించలేదు. పిమ్మట అక్కడనుంచి పోయి నిర్మాణకార్యక్రమములో దిగినాడు. దరిమిలా ఏమయినాడో నాకు తెలియదు.

(7)

అహమ్మదాబాదుకాంగ్రెసు 1921 డిశంబరులో జరిగినది. దానికి దేశబంధు చిత్తరంజనదాసు అధ్యక్షుడుగా ఎన్నుకొనబడెను. ఆయన అదివరకే జైలులోపెట్టబడినందున ఆయనఉపన్యాసమును సరోజినీదేవి చదివినది. హకీం అజ్మల్‌ఖానుగారు ఆయనస్థానమున కాంగ్రెసుకు అధ్యక్షత వహించెను. ఆయన హిందూ - ముస్లిము ఐక్యమూర్తి. ఆయన ఢిల్లీలోని హిందూమహాసభ కధ్యక్షుడుగా నెన్నుకొనబడెను. ఆ మహాసభలో కాంగ్రెసు ఉద్యమమును నడుపుటకు మహాత్మాగాంధీగారికి సర్వాధికారమిచ్చి ఏకైక నాయకునిగాచేసిరి. శాసనోల్లంఘనతీర్మానముకూడ చేయబడినది. ఆ తీర్మానానుసారమే గుంటూరుజిల్లా పెదనందిపాడుఫిర్కాలో పన్నులనిరాకరణము జయప్రదముగ సాగించబడెను. దానినిగూర్చి ఇదివరకే చెప్పియున్నాను. ఫిబ్రవరి 1 వ తేదీన మహాత్మాగాంధీగారు గుజరాతులోనిబార్డోలీతాలూకాలో పన్నులనిరాకరణమును స్వయముగ సాగించదలచినానని వైస్రాయికి నోటీసిచ్చెను. బార్డోలీ పన్నులనిరాకరణమునకు అన్నిఏర్పాట్లు చేసెను. సర్దార్ వల్లభాయిపటేలును తనకు ముఖ్యసహాయకునిగా నియమించెను. ఇంతలో ఫిబ్రవరి 5 వ తేదీన చౌరీ చౌరాలో కాంగ్రెసువాదులు పోలీసులను ఎదుర్కొనుటలో పోలీసుస్టేషనును ముట్టడించి, అందులోనున్న పోలీసుఉద్యోగస్థులను మంటలలోవేసి కాల్చిచంపిరి. అందువల్ల కాంగ్రెసువారు ఇంకను బాగుగా అహింసాతత్వమును నేర్చుకొనలేదని మహాత్మాగాంధీగారు తలచి కాంగ్రెసువర్కింగుకమిటీని బార్డోలీలో సమావేశపరచి ఫిబ్రవరి 22 వ తేదీన బార్డోలీ పన్నులనిరాకరణమును తాత్కాలికముగ నిలుపుదలచేసినామనియు, కాంగ్రెసువారు నిర్మాణకార్యక్రమముద్వారా అహింసాతత్వమును బాగుగా నేర్చుకొని సత్యాగ్రహమునకు తయారుకావలెననియు తీర్మానము చేయించెను.పదునాలుగుసూత్రములుగల ఆర్థికసమానత్వము,సర్వోదయ ఆదర్శములును, సాంఘికతత్వమును స్థాపించెడి తన నిర్మాణకార్యక్రమమును శాసనోల్లంఘనము జరిపినపుడు జరుపనపుడు శాసనసభలలోకి వెళ్ళినను వెళ్ళకపోయినను అందరు దీక్షతో జరుపవలెనని మొదటినుంచి ఆదేశించెను. ఖద్దరు , గృహపరిశ్రమలు గ్రామపరిశ్రమలు గ్రామ స్వరాజ్యము ఆయనయొక్క ఆర్థికసిద్ధాంతములు. ఆ 13 వ మార్చి

తేదీన మహాత్మాగాంధీగారిని ప్రభుత్వమువారు అరెస్టుచేసి విచారించి ఆరు సంవత్సరములు కారాగారశిక్ష విధించిరి. తాను బ్రిటిషుప్రభుత్వముమీద తిరుగుబాటును సాగించినమాట వాస్తవమేనని, అందుకుగాను ఏ శిక్షవిధించి నను సిద్ధముగానున్నానని మహాత్మాగాంధీ కోర్టువారితో చెప్పెను. లోక మాన్య బాలగంగాధరతిలకుగారికి వేసినట్లే తనకుకూడ ఆరుసంవత్సరముల కారాగారశిక్ష విధించుట తనకు చాలా గౌరవకరముగా నున్నదని చెప్పెను.

ఆ సంవత్సరము వేసంగిలో మోతీలాల్‌నెహ్రూఅధ్యక్షతక్రింద నొక కాంగ్రెసునాయకులకమిటీ దేశములో శాసనోల్లంఘనము సాగించవలెనా, ఏవిధముగ కాంగ్రెసుఉద్యమము నడిపించవలెను అను విషయమునుగూర్చి విచారించుటకు బయిలుదేరి గుంటూరుకు విచారణకు రాగా 144 సెక్షన్‌ను ప్రయోగించి, దానిని ధిక్కరించి వారిని సత్కరించుటకు వెళ్లిన 3 వందల మంది కాంగ్రెసు శాంతిసైనికులను పోలీసులు అరెస్టుచేసి ఆ కమిటీ వెళ్లి పోయినపిమ్మట 4, 5 రోజులకు విడుదలచేసిరి. కొందరికి మూడువార ములదాకా జైలుశిక్షలు విధించిరి. ఆ కమిటీవారు ఆగస్టునెలలో తమ రిపో ర్టును కాంగ్రెసువర్కింగుకమిటీకి సమర్పించిరి. చాలా విషయములలో ఏకాభిప్రాయమే ప్రకటించబడెను. కాని కాంగ్రెసువారు శాసనసభలలో ప్రవేశించి అధికారమును స్వీకరింపక ప్రభుత్వమును ప్రతిఘటించవలెనని మోతీలాల్‌నెహ్రూ, విఠల్‌భాయిపటేల్, హకీమ్ అజ్మల్‌ఖాన్‌గారలు వ్రాసిరి. కౌన్సిళ్లలో ప్రవేశించకూడదని డాక్టర్ అన్సారీ, సి. రాజగోపాలా చారి, కస్తూరి రంగయ్యంగారలు వ్రాసినారు. 1922 డిశంబరు నెలలో గయవద్ద కాంగ్రెసు జరిగెను. దానికి దేశబంధు చిత్తరంజనదాసుగారు అధ్యక్షతవహించిరి. కాని ఆయన శాసనసభలలో ప్రవేశించవలెనని ఉప న్యాసములో వ్రాయగా శాసనసభలప్రవేశతీర్మానము కాంగ్రెసుమహాసభలో ఓడిపోయినది. ఆయన తన అధ్యక్షపదవికి రాజీనామానిచ్చెను. కొన్ని నెలలు డాక్టరు అన్సారీగారిని చైరుమనుగా చేసిరి. ఆయనకూడ రాజీనామా నిచ్చెను. అందుమీద అఖిలభారత కాంగ్రెసుకమిటీవారు దేశభక్త కొండా వెంకటప్పయ్యగారిని కాంగ్రెసుకు అధ్యక్షునిగా నెన్నుకొనిరి. 1923 డిశంబరువరకు దేశభక్త కొండా వెంకటప్పయ్యగారే కాంగ్రెసుకు అధ్య క్షుడుగా నుండెను. దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు ప్రధానకార్యదర్శిగ

పనిచేసెను. ఆ కాలమందంతటను అఖిలభారత కాంగ్రెసుకమిటీ కార్య స్థానము బెజవాడలో నుండెను. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీకి ఆంధ్ర కేసరి టంగుటూరు ప్రకాశంపంతులుగారు అధ్యక్షులుగను, నేను ప్రధాన కార్యదర్శిగను వుంటిమి. నేను ఆ సంవత్సరము ఫిబ్రవరినెలలో జైలునుంచి విడుదలైనాను. మార్చినెలలో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు వర్కింగు కమిటీ బెజవాడలో మా మేడమీదనే సమావేశమైనది. అప్పటికి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీకి ప్రధాన కార్యదర్శిగావున్న గొల్ల పూడి సీతారామశాస్త్రిగారు తాను యావత్కాలమును ఖద్దరుకును, నిర్మాణకార్యక్రమమునకును వినియోగించదలచినానని, దానివల్ల రాష్ట్ర కాంగ్రెసుకమిటీ కార్యదర్శిగ నుండజాలనని చెప్పినారు. అందుమీద డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు ప్రధానకార్యదర్శిత్వమును స్వీక రించవలసినదని నన్ను కోరగా నేను ఒప్పుకొన్నాను. రాష్ట్రకాంగ్రెసు వర్కింగుకమిటీవారు నన్ను ప్రధానకార్యదర్శిగా నియమించినారు. అప్పటి నుంచి 1934 వ సంవత్సరం ఆఖరువరకు — మధ్యలో ఒకటిన్నరసంవత్సర ములుతప్ప మిగతకాలమంతయు, షుమారు పదిన్నరసంవత్సరములు నన్నే ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీకి ప్రధానకార్యదర్శిగ ఎన్నుకొనుచు వచ్చిరి. ఆకాలములో కొద్దిభాగము కొండా వెంకటప్పయ్యపంతులుగారును, చాలా సంవత్సరములు టంగుటూరి ప్రకాశంపంతులుగారును, ఆఖరున కొంత కాలము దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారును రాష్ట్ర కాంగ్రె సుకమిటీకి అధ్యక్షులుగ నుండిరి. 1931 జులై నుండి రెండునెలలుమాత్రము గంపలగూడెం కుమారరాజాగారు అధ్యక్షుడుగనుండి రాజీనామా నిచ్చిరి. అప్పటినుంచి 1934 ఆగష్టువరకు అధ్యక్షుడే లేడు. నేనే ప్రధానకార్యదర్శిగ అన్నివిషయములు నడిపితిని. కమ్యూనిస్టు, సోషలిష్టుపార్టీలకు అధ్యక్షు డుండడు. ప్రధానకార్యదర్శియే ముఖ్యయుద్యోగస్తుడు. ఆవిధముగ మేము నడిపితిమి. కాంగ్రెసుసంస్థనిర్మాణము స్వతంత్రపోరాటము జరుగుచున్న ఆకాలములో అఖిలభారత కాంగ్రెసుకమిటీయొక్క, రాష్ట్రకాంగ్రెసుకమిటీ యొక్క జనరలుకార్యదర్శిగ అనుభవశాలియై, సమర్థతతోను జాగ్రతతోను పనిచేయువారినొకరిని సంవత్సరములకొలది నుంచుచువచ్చిరి. పండిత జవ హర్‌లాల్ నెహ్రూ ఆకాలమున అనేకసంవత్సరములు అఖిలభారత కాంగ్రెసు

కమిటీకి జనరలు (ప్రధాన) కార్యదర్శిగ పనిచేసెను. ఒక్కొకపుడు కాంగ్రెసుకు అధ్యక్షుడైనను అధ్యక్షపదవి అయిపోగానే మరల జనరలు కార్యదర్శిగ వచ్చెను. ఆయన అక్కడ, నేను ఇక్కడ ప్రధాన కార్యదర్శులముగానున్న ఏకకాలము చాల గలదు. మే ముభయులము కార్యదర్శులుగా నున్నకాలములో అఖిలభారత కాంగ్రెసులోగాని, ఆంధ్రరాష్ట్రకాంగ్రెసులోగాని మతాతత్వములు (గ్రూపులు) కులతత్వములు, లంచగొండితనము కాంగ్రెసులో ప్రవేశించనేలేదని సగర్వముగా చెప్పగలను. అది త్యాగము చేయుటకు ఉత్సాహపడుచున్నకాలము. అధికారాన్ని దర్వ్యార్జనను పంచుకుందామన్న కాలముకాదు.

గయకాంగ్రెసులో దేశబంధు చిత్తరంజనదాసుగారిపార్టీ ఓడిపోయినందున కాంగ్రెసుఅధ్యక్షపదవికి రాజీనామానిచ్చిన దేశబంధు దాసుగారును, పండిత మోతీలాల్‌నెహ్రూగారును ప్రత్యేకముగ యొక స్వరాజ్యపార్టీని స్థాపించి కౌన్సిళ్లలో ప్రవేశించవలెనని ప్రబోధముచేయుచువచ్చిరి. అందుకు వ్యతిరేకముగ రాజగోపాలాచారిగారు ప్రచారముచేసెను. 1923 లో తూర్పు గోదావరిజిల్లా కాంగ్రెసుకాన్ఫరెన్సు గౌతమీ సత్యాగ్రహ ఆశ్రమములో జరిగినపుడు నన్ను దానికి అధ్యక్షునిగానెన్నుకొనిరి. డాక్టర్ సుబ్రహ్మణ్యం, మద్దూరి అన్నపూర్ణయ్య, క్రొవ్విడి లింగరాజుగారలు మొదలైనవారు అచ్చట ప్రముఖులుగ నుండిరి. నా అధ్యక్షోపన్యాసములో శాసనసభలలో ప్రవేశించుటయే యుక్తమనియు, కాని మంత్రిపదవులను స్వీకరించకూడదనియు చెప్పితిని. అటులనే అక్కడ తీర్మానముకూడ ప్యాసయ్యెను. 1923 సంవత్సరములో మద్దూరి అన్నపూర్ణయ్యగారికి రాజద్రోహనేరము క్రింద మూడుసంవత్సరములశిక్ష విధించిరి. ఇటుల శాసనసభ ప్రవేశవాదులు, శాసనసభ బహిష్కారవాదులు దేశములో పోరాడుచుండుట మంచిదికాదని తలచి ఏదోఒకవిధముగ రాజీచేయవలెనను యుద్దేశ్యముతో 1923 సెప్టెంబరు నెలలో మౌలానా అబుల్‌కలాం ఆజాద్‌గారి అధ్యక్షతక్రింద ఢిల్లీలో ప్రత్యేక కాంగ్రెసుసమావేశము ఏర్పాటుచేయబడెను. ప్రభుత్వపక్షమువారు హిందూ-ముస్లిముతగాదాలను రెచ్చగొట్టుచువచ్చిరి. టంగుటూరు ప్రకాశంగారు నేను కలసి వారి మోటారుకారులో ఢిల్లీనుంచి పోయి షాజహాను

పురంలో హిందూ-ముస్లిం కలహములవల్ల జరిగిన హత్యలను, జరిగిన వినాశమునుగూర్చి తెలుసుకొనివచ్చితిమి. అట్టి తీవ్రమైన హిందూ-ముస్లిం కలహములు చెలరేగి హత్యలు జరుగుచుండుటవలన ప్రభుత్వమును శాసనసభలో ఎదుర్కొనుటకైన కొంత వీలుగానుండును గావున, శాసన సభాప్రవేశమున కనుమతినిచ్చుట యుక్తమని యెంచితిమి. శాసనసభలలో జరిగిన చర్చలకు ప్రభుత్వమువారు కొంత లక్ష్యముచూపెదరు. స్వరాజ్య పార్టీవారు శాసనసభలకు పోవచ్చుననియు, వారు అటుల ఎన్నికలకు నిలచినచో వారికి మిగతా కాంగ్రెసువారందరు సహాయముచేయవలెననియు ఆ కాంగ్రెసుమహాసభలో రాజీతీర్మానము చేయబడెను. ఈ రాజీ కుదుర్చుటలో టంగుటూరి ప్రకాశంపంతులుగారు, నేను తమకు చాల సహాయము చేసినామని దేశబంధు చిత్తరంజనదాసుగారు సంతోషమును వెలిబుచ్చిరి. కాని మేమిద్దరము 1923 నవంబరులో జరిగిన శాసనసభల ఎన్నికలలో అభ్యర్థులుగా నిలువలేదని నాకు చిత్తరంజన దాసుగారు నిష్ఠూరమును తెలిపెను. ఢిల్లీ ప్రత్యేకకాంగ్రెసు ముగియుటతోడనే నాకుటుంబముతోకూడ నేను అలహాబాదుకు పోయి ఉత్తరప్రదేశరాష్ట్ర కాంగ్రెసుఆఫీసులోనే దిగి, అచట త్రివేణీసంగమములో స్నానముచేసి మోతీలాలునెహ్రూగారు కాంగ్రెసుకు (దరిమిలాను) ఇచ్చిన గొప్పభవనమును దర్శించి, అచటినుంచి కాశీకి పోతిని. అచట హనుమాన్‌ఘాటులో నున్న కొమర్రాజు గంగమ్మగారి ఇంటిలో బసచేసి విశ్వేశ్వరదేవాలయమును దర్శించితిమి.పిమ్మట హిందూ విశ్వవిద్యాలయమును, పండిత మదన మోహనమాలవ్యా, బాబు భగవాన్‌దాసుగార్ల దర్శనముచేసి, గయకు పోతిమి. కొమర్రాజు గంగమ్మగారు కొమర్రాజు లక్ష్మణరావుగారితల్లి. ఆమె ఏకైక పుత్రిక భండారు అచ్చమాంబ, ఏకైకపుత్రుడు కొమర్రాజు లక్ష్మణరావు దేశంలో గొప్ప ఖ్యాతిని గడించినవారు. అదివరకే అకాలమరణము నొందిరి. ఆమె వేదాంతియయినందున దుఃఖమును పాటించక కాశీలోని హనుమాన్‌ఘాటులో కొలదిసంవత్సరములు నిత్య గంగాస్నానములు చేయుచు విశ్వేశ్వరుని దర్శించుచు కాలముగడపి అచటనే పరమపదించెను. గంగలో స్నానముచేసి గయలో మా తల్లిదండ్రులకు పిండప్రదా

నముచేసి, గయాశ్రాద్ధముపెట్టి తర్వాత కలకత్తాకు వెళ్ళితిని. గయలో పిండ ప్రదానముచేయగనే మా తల్లిదండ్రులకు తద్దినములుపెట్టుబాధ్యత నాకు తప్పిపోయినది. అంతటినుంచి తద్దినములుపెట్టుట మానివేసితిని. కలకత్తాలో నేను చిత్తరంజనదాసుగారికి అతిథిగా నాలుగురోజు లుంటిని. అప్పుడు ఆయనను అరెస్టుచేసెదరని వదంతు లెక్కువగా నుండెను. కాని అరెస్టు చేయలేదు. కలకత్తా కార్పొరేషనుకు కాంగ్రెసువారు అభ్యర్థులను పెట్టి ఎన్నికలప్రచారమును గొప్పగా సాగించుచుండిరి. అంతకుపూర్వమే సుభాసు చంద్రబోసుగారు జైలులోనుండిరి. దాసుగారు నన్నుకూడ ఆ బహిరంగ సభలకు తీసుకొనిపోయి ఉపన్యసింపచేసిరి. మే మెట్లు బెజవాడ మునిసి పాలిటీని కాంగ్రెసుపక్షమున స్వాధీనపరచుకొంటిమో ఆ సభలలో వివరించి తిని. నాకు కొంచెము జ్వరమువచ్చెను. అంతట చిత్తరంజనదాసుగారివద్ద సెలవుతీసుకొని కలకత్తానుండి బయలుదేరి నేను నా కుటుంబముతో ఖర్గ పురములో దిగి, కొమర్రాజు లక్ష్మణరావుగారి మేనమామ, వితంతూద్వాహము చేసుకొన్నవారును అయిన భండారు దండపాణిగారిఇంటిలో మూడురోజులు విశ్రాంతితీసుకొంటిని. ఆయన అక్కడవున్న ఆంధ్రులందరికి నాయకుడు. ఆ ఆంధ్రసభవారు నా గౌరవార్థము సన్మానసభ జరిపిరి. అక్కడనుంచి బయలుదేరి విశాఖపట్టణములో దిగి వసంతరావు బుచ్చిసుందరరావుగారి అతిథిగానుంటిని. అచటి కాంగ్రెసువాదులందరితో ముచ్చటించి విజయవాడ వచ్చితిని.

(8)

1923 వ సం॥ మే 1 వ తేదీన నాగపురములో కాంగ్రెసువాలంటీ రులు జాతీయపతాకములు తీసుకొని సివిలులైనులవైపుకు పోవుచుండగా దారిలో పోలీసువారు అడ్డగించి చెదరకొట్టిరి. ఆవైపుకు జాతీయపతాకము లను తీసుకొనిపోగూడదని నిషేధించిరి. కాంగ్రెసుసైనికులు నిషేధాజ్ఞల నుల్లంఘించుచు ఆరోజున జాతీయపతాకములను తీసుకొనిపోవుచుండగా పోలీసువారు వారిని అరెస్టుచేసి జైళ్ళలోపెట్టిరి. మరల శాంతిసైనికులు తాము ఎక్కడికైనను జాతీయపతాకములతోపోవుహక్కు ఉన్నదని చెప్పి

అవైపుకే పోవుచుండగా మరల వారిని అరెస్టుచేసి జైళ్ళకుపంపిరి. ఆవిధముగా శాంతిసైనికులు ప్రతిదినము నిషేధాజ్ఞలనుల్లంఘించుచు అవైపునకే జాతీయపతాకములతో పోవుచుండుట, పోలీసువారు అరెస్టుచేసి వారిని జైళ్ళలోపెట్టుట సాగెను. అది గొప్ప సత్యాగ్రహమయ్యెను. దానికి జెండా సత్యాగ్రహమని పేరు. అరెస్టుకాబడిన శాంతిసైనికులకు ఆరునెలలు కఠిన జైదుశిక్షను విధించిరి. వారిచే రాళ్ళను కొట్టించిరి. జైళ్ళలో కఠినముగా చూచిరి. ఇవి జరిగినకొద్దీ శాంతిసైనికులువచ్చి సత్యాగ్రహముచేయుచుండిరి. మధ్యప్రదేశ్ నాయకుడైన జమునాలాల్ బజాజ్‌గారు సత్యాగ్రహముచేయగా వారినికూడ అరెస్టుచేసి శిక్షవిధించి జైలుకుపంపిరి. నాగపురములోనే అఖిల భారత కాంగ్రెసువర్కింగుకమిటీ, అఖిలభారత-కాంగ్రెసుకమిటీవారు సమావేశమై నాగపురము సత్యాగ్రహకమిటీకి సహాయముచేయవలెనని, ప్రతి దినము కొద్దిమందినైన సత్యాగ్రహులను పంపవలెనని తీర్మానించిరి. జులై 18 వ తేదీ దేశమందంతటను జాతీయజెండా సత్యాగ్రహదినముగ ఎంచబడెను. ఆరోజున ఉత్సవములు, సభలు జరుపబడెను. అన్ని రాష్ట్రి కాంగ్రెసుకమిటీలకు వారమున కొక ఎనిమిదిమంది శాంతిసైనికులను నాగ పురము పంపవలసినదని అఖిలభారత కాంగ్రెసుకార్యాలయమునుండి ఉత్తర్వులు వచ్చినందున ఆంధ్రరాష్ట్రి కాంగ్రెసుకమిటీకి ప్రధానకార్యదర్శిగా నున్న నేను బెజవాడనుంచి పోతిన గణపతిరావుపాత్రుడుగారి నాయకత్వమున పార్వతీశము మొదలైన ఎనిమిదిమంది సత్యాగ్రహులను నాగపురమునకు మొదటిజట్టుగా పంపితిని. వారందరు సత్యాగ్రహముచేయగా శిక్షలుపడెను. జైళ్ళలో అతికఠినముగ చూడబడిరి. ఉత్సాహమే ప్రబలెను గాని, ఎవరికిని ధైర్యముచెడలేదు. వారమువారము ఆంధ్రరాష్ట్రిమునుండి సత్యాగ్రహులజట్టులను పంపితిని. రెండవవారము పశ్చిమగోదావరిజిల్లా కొవ్వూరునుండి, మూడవవారము తూర్పుగోదావరిజిల్లా రాజమహేంద్రవరమునుండి, నాలుగవ వారము గుంటూరుజిల్లానుండి, అయిదవవారము నెల్లూరుజిల్లానుండి సత్యాగ్రహజట్టులను పంపితిని. వారందరు సత్యాగ్రహముచేసి జైళ్ళకుపోయిరి. ఆంధ్రయువకులు నాగపురము వెళ్ళి సత్యాగ్రహముచేయుటకు పోటీపడిరి. నేను వెళ్ళవద్దన్నవారికి నామీద నిష్ఠూరము కలిగెను. ఎంతమందియైనను

పోవుటకు ముందుకువచ్చిరి. మరం బాలసుబ్రహ్మణ్యంగు ప్తకూడ వెళ్ళి సత్యాగ్రహముచేసి జైలుకుపోయెను. నాగపూరులో జండాసత్యాగ్రహోద్యమమునకు విఠల్‌భాయి పటేల్‌గారు నాయకత్వమువహించి నడుపసాగిరి. ప్రభుత్వమువారు లొంగిపోయి కాంగ్రెసువారు ఏరోడ్డున జండాలు తీసుకొనిపోయేదీ తమకు ముందుగా తెలిపిన చాలుననియు, తాము ఎట్టిఅభ్యంతర పెట్టమనియు తెలిపిరి. ఆవిధముగా రాజీ ఏర్పడెను. జండాసత్యాగ్రహోద్యమము ఆపివేయబడెను. జైళ్ళలోనున్న ఖైదీలనందరిని వెంటనే విడుదల చేసిరి.

ఆ సంవత్సరము డిశంబరునెలలో మౌలానా మహమ్మదాలీగారి అధ్యక్షతక్రింద కడు వైభవముగా కాకినాడలో కాంగ్రెసుమహాసభ జరిగెను. దేశభక్త కొండా వెంకటప్పయ్యపంతులుగారు ఆహ్వానసంఘాధ్యక్షులుగ నుండిరి. బులుసు సాంబమూర్తిగారు ఆహ్వానసంఘ ప్రధానకార్యదర్శిగ నుండెను. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు అఖిలభారత కాంగ్రెసుకార్యాలయమును, నేను ఆంధ్రరాష్ట్రి కాంగ్రెసుకార్యాలయమును కాకినాడలో తెరచి అక్కడే యుంటిమి. కాంగ్రెసుమహాసభ యింకను వారమురోజులున్నదనగా సాంబమూర్తిగారి ఏకైకపుత్రుడు మరణించెను. దానిని లక్ష్యముచేయక సాంబమూర్తిగారు అమిత దేశాభిమానముతో పనిచేసి, కాకినాడ కాంగ్రెసుమహాసభకు ఏర్పాట్లన్నియు పెద్దఎత్తున బహు చక్కగా చేయించెను. కాంగ్రెసు మహాసభావేదికనుంచి సరోజినీదేవి సాంబమూర్తిగారి దేశాభిమానమునుగూర్చి, ఆయనకు కలిగిన ఆపత్తును గురించి, ఎంత ధైర్యముతో ఆయన పనిచేసెనో దానినిగురించి యుపన్యసించినది. సాంబమూర్తిగారు స్వతంత్రపోరాటములో యావదాస్తిని కోల్పోయిన మహాత్యాగి.

కాకినాడ కాంగ్రెసులో, అదివరకు ఢిల్లీ ప్రత్యేకకాంగ్రెసుమహాసభలో శాసనసభాప్రవేశవాదులకును శాసనసభ నిషేధవాదులకును మధ్య జరిగిన రాజీతీర్మానమే మరల ఖాయపరచబడెను. దానిని రాజాగోపాలాచార్యులుగారుకూడ అంగీకరించిరి. కౌన్సిలులో ప్రవేశించియే సహాయనిరాకరణముచేయవచ్చునని వ్యాఖ్యానముచెప్పబడెను. నిర్మాణకార్యక్రమము

నిర్వర్తింపవలెనని, తద్వారా శాసనోల్లంఘనమునకు దేశమును తయారు చేయవలెననికూడ తీర్మానించబడెను.

నాగపురముకాంగ్రెసులో బ్రిటిషురాష్ట్రములను భాషాప్రయుక్తరాష్ట్రములుగా విభజించుచు, ప్రతి యొక భాషారాష్ట్రమున కొక ప్రత్యేక రాష్ట్రకాంగ్రెసుకమిటీ నిచ్చినారు. స్వదేశసంస్థానములనుకూడ ప్రక్కనున్న భాషారాష్ట్రములలో చేర్చినారు. అందువల్ల హైదరాబాదుసంస్థానములోని హైదరాబాదునగరము, తెలంగాణాజిల్లాలు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీ క్రిందకు వచ్చినవి. అటులనే అచటి కర్ణాటకజిల్లాలు కర్ణాటకరాష్ట్రకాంగ్రెసు కమిటీక్రిందకును, మరాఠ్వాడాజిల్లాలు మహారాష్ట్రకాంగ్రెసుకమిటీక్రిందకును వెళ్లినవి. ప్రతిసంవత్సరము కాంగ్రెసుమహాసభకు ప్రతినిధులుగా వెళ్లుటకు ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుకమిటీలో హైదరాబాదునగరమునకు, తెలంగాణమునకు జనసంఖ్యనుబట్టి ప్రతినిధులస్థానములను నిలువయుంచి ఆ పేర్లను హైదరాబాదులోని తెలంగాణానాయకుల సలహాప్రకారము కాంగ్రెసు ఆహ్వానసంఘ కార్యాలయమునకు నేను పంపుచుండేవాడను. ఆ ప్రతినిధులపేర్లు ప్రతి సంవత్సరము జరిగే కాంగ్రెసుకు పంపడం, వారందరికి టిక్కెట్లివ్వడం నేనే చూసేవాడను. వామననాయక్, మాడపాటి హనుమంతరావుగార్లు కోరిన ప్రకారమే నేను చేసేవాడను. కొంతకాలమువరకు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీలోనే తెలంగాణమునుంచి కొందరిని అఖిలభారతకమిటీసభ్యులుగా ఎన్నుకొనేవారము. తరువాత కొన్నిసంవత్సరములకు సంస్థానములను ప్రత్యేకించి ప్రతిసంస్థానమునకు స్టేట్ కాంగ్రెసుకమిటీని ఏర్పాటుచేసిరి. ఆఖరున ప్రతిసంస్థానమున కొక రాష్ట్రకాంగ్రెసుకమిటీ నిచ్చినారు. హైదరాబాదుసంస్థానములో స్టేట్ కాంగ్రెసుకమిటీక్రింద, పిమ్మట సంస్థానకాంగ్రెసు కమిటీక్రింద ఆంధ్ర, కర్ణాటక, మహారాష్ట్రశాఖలను ఏర్పాటుచేసినారు. ఆంధ్రజిల్లాలనుండి తరచుగ మేము సికిందరాబాదుమీదుగ అఖిలభారత కాంగ్రెసుకమిటీలకు కాంగ్రెసుమహాసభలకు బొంబాయినగరమునకుగాని ఆ పైకిగాని రైలులో ప్రయాణముచేసేవారము. సికిందరాబాదుస్టేషనుకు ఉదయము పదిగంటలకు చేరేవారము. అటుల జరిగిన ప్రతిపర్యాయము మేము ప్రయాణముచేయుచున్న రెండవతరగతి పెట్టెలలో మా సామానుల

నుంచి, వామన నాయక్‌గారు పంపిన మోటారుకారులలో మేము బీగంపేటకు పోయి వారియింట్లో స్నానముచేసి, భోజనముచేసి బీగంపేటకు రైలురాగానే అందులో మాడబ్బాలలో ఎక్కిపోయేవారము. వామననాయక్‌గారి ఆతిథ్యము చాల గొప్పది. నేను ఒంటరిగ హైదరాబాదులో దిగినచో మాడపాటి హనుమంతరావుగారియింటికే వెళ్లేవాడను.

1921 సం॥ లో టంగుటూరి ప్రకాశంపంతులుగారు మద్రాసులో 'స్వరాజ్య' అను నొక ఇంగ్లీషు దినపత్రికను స్థాపించిరి. అది కొన్నిసంవత్సరములు ఉజ్జ్వలముగా పనిచేసెను. స్వతంత్రపోరాటమును, ఆంధ్రోద్యమమును, అన్ని అభివృద్ధికరమగుభావములను తీవ్రముగ సమర్థించి బలపర్చుచు, భారతదేశములో ప్రధానమైనపత్రికలలో నొకటిగా నుండెను. ఆంధ్రులకు ఇంగ్లీషుదినపత్రికలేనిలోపమును ప్రకాశంపంతులుగారు తీర్చిరని ఆంధ్రులెల్లరును సంతోషించిరి. అప్పటికి ప్రకాశంపంతులుగారివద్ద బ్యాంకులో మూడులక్షలరూప్యము లుండెను. పైగా కొన్నిలక్షలరూపాయల విలువగల భూములు, బంగళాలుకూడ నుండెను. స్వరాజ్యపత్రికకు ప్రకాశం పంతులుగారు సంపాదకులుగ నుండిరి. కృపానిధి, ఖాసా సుబ్బారావు, కోలవెన్ను రామకోటేశ్వరరావు, యస్.యస్. వరదాచారి, చెరుకుపల్లి వెంకటప్పయ్య, కే. శ్రీనివాసన్‌గారలు వారిక్రింద సహాయకులుగ పనిచేసిరి. పెద్ద ముద్రణాయంత్రము కొనబడెను. అదియొక పెద్దభవనములో అమర్చబడెను. పని చురుకుగా సాగుచుండెను. కాని ప్రతినెల స్వరాజ్యపత్రికకు వేలకువేల నష్టమే వచ్చుచుండెను. ప్రకాశంగారి మూడులక్షలరూపాయలు దానిక్రిందనే ఖర్చయ్యెను. పైగా వారు లక్షలకొద్దీ అప్పుచేసిరి. వారిభూములు,భవనములు అన్నియు అమ్మి, ఆ అప్పులు తీర్చబడెను. కొంతమంది మిత్రులు వారికి అప్పులలో జామీనుదారులుగా నుండిరి. వారికికూడ నష్టమే కలిగెను. ఇంతేకాక ముఖ్యముగా ఆంధ్రదేశములో సంచారముచేసి లక్షలాదిధనమును, షేరుధనముక్రింద పోగుచేసిరి. గుంటూరులో నడింపల్లి నరసింహారావు, బెజవాడలో నేను, కాకినాడలో బులుసు సాంబమూర్తి, విశాఖపట్టణములో తెన్నేటి విశ్వనాథం, ఇంకా అనేకమంది మిత్రులు వారిని గురుభావముతో చూచుచున్నవారు, వారిని అత్యంతమైన గౌరవముతో ప్రేమించుచున్నవారు,

వేలకువేలు సొమ్ము వసూలుచేసితిమి. నేను నాకు మిత్రులైన మునగాల, ముక్త్యాల, ఉయ్యూరు, ఎలమర్రు, గంపలగూడెం జమీందారులవద్ద తలా రెండువేలరూప్యములచొప్పున షేరుధనమును. అటులనే బెజవాడలోని వర్తకప్రముఖులవద్దను, చుట్టుపట్లనున్న పెద్దరైతులవద్దను వేలకువేలరూప్య ములను షేరుధనముగా వసూలుచేసి వారి కిప్పించితిని. అంతేకాక ఖమ్మం మెట్టు వచ్చి మాదిరాజు రామకోటేశ్వరరావుగారిసహాయమున వెంసూరు, అమ్మపాలెం, వెంకటాపురం మొదలైన దేశముఖులవద్ద అయిదువేలరూప్య ముల షేరుధనమును యిప్పించితిని. పిమ్మట ప్రకాశంపంతులుగారు, నేను హైదరాబాదు వచ్చితిమి. అది 1924 వ సంవత్సరమని జ్ఞాపకము. ఆయన అపుడు ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుకమిటీకి అధ్యక్షుడుగను, నేను ప్రధానకార్య దర్శిగను ఉంటిమి. హైదరాబాదులో అపుడు ప్రతి మంచి యుద్యమములో తోడ్పడుచుండిన ఇద్దరు నాయకులు - మాడపాటి హనుమంతరావుపంతులు గారు, వామన్ నాయక్‌గారు షేరుధనమును వసూలుచేయుటలో మాకు తోడ్పడిరి. వామన్‌నాయక్‌గారు గొప్ప కాంట్రాక్టులుచేసిన ధనవం తుడు. వారు స్వయముగా రెండువేలరూప్యముల షేరులను కొని డబ్బు ఇచ్చిరి. సికిందరాబాదులోని కొందరు షాహుకారులవద్దనుండికూడ షేరు ధనమును వసూలుచేసితిమి. రావులపాటి హనుమంతరావుసోదరులు మాకు తోడ్పడిరి. హైదరాబాదులో ప్రతాపగిరిజీ, వారి సోదరులు ధనరాజగిరిజీ గారలు, నవాబ్ సాలార్‌జంగ్ బహదూర్‌గారు తలా ఒక వెయ్యిరూప్య ములషేర్లను కొని డబ్బునిచ్చిరి. బారిష్టరు కిషన్‌గారుకూడ మాకు తోడ్ప డిరి. హైదరాబాదు, సికిందరాబాదు బస్తీలలో 14 వేలరూప్యములను మే మిద్దరము వసూలుచేసితిమి. ప్రకాశంగారికి, వారిపత్రికకు అరవదేశము, కేరళరాష్ట్రము కూడ సహాయముచేసినవి. ఒకసారి ఆయన రంగూన్, మలయా, సయాం, కంబోడియాదేశములు తిరిగి కొంతసొమ్ము తీసుకొని వచ్చినాడు. పైగా ప్రకాశంగారికారు, ఆఫీసుఖర్చులు, స్వంతఖర్చులు, ప్రయాణఖర్చులు అన్నీ ఇందులోనుంచియే కావలెను. స్వరాజ్యపత్రిక స్వయంపోషకము కాలేదు. ఎంతసొమ్మైనను మ్రింగినది. ఆయన ఇద్దరు కొడుకులు అక్కరకురాలేదు. ఆయనభార్య హనుమాయమ్మగారు మహా

ఇల్లాలు. గొప్ప సాధ్వీమణి. ప్రకాశంగారు పడుతున్న దరిద్రమువల్ల, కష్ట ములవల్ల ఆమెమనస్సు చెడిపోయినది. అటువంటి మనోచాంచల్యముగల సతీమణిని వెంటబెట్టుకొని ప్రకాశంగారు తనతోకూడ కారులో ఎక్కడికి వెళ్ళినా తీసుకొనిపోయేవారు. కొన్నిసంవత్సరములకు ఆమె పరమపదించి నది. ప్రకాశంపంతులుగారు ఈవిధముగా దేశముకొరకు సర్వసంగపరిత్యా గముచేసినాడు. ఆస్తి ఏమీ లేనివాడైనాడు. కేవలము దరిద్రమును స్వీక రించినాడు. ఆయన దరిద్రమును కష్టములను లెక్కచేయక గొప్ప ధీరత్వ ముతో ఆంధ్రదేశములో స్వతంత్రపోరాటములో ప్రధాననాయకత్వమును వహించినాడు. ఎప్పుడూ ముందుగా జైలుకుపోయేవాడు. ఎపుడూ ఆఖరున విడుదలఅయ్యేవాడు. ప్రజలకు ఏకష్టములువచ్చినా, వరదలు, క్షామం మొదలైన కష్టములు వచ్చినా ఆయన ముందు దుమికి ప్రజల కష్టములను స్వయముగా చూచి, వారిని ఆదరించి సహాయము చేయుచు వచ్చేవారు. ప్రకాశం ప్రజలమనిషి. 1929 లో సైమనుకమిషను మద్రాసుకు వచ్చినపుడు మౌంటురోడ్డువద్ద కమిషనును బహిష్కరించునినాదములతో కాంగ్రెసువాలంటీరులు, వేలాదిప్రజలు ఊరేగింపుతో వచ్చుచుండగా సైని కులు అడ్డుపడిరి. ప్రజలు ముందుకుపోవలెనని ప్రయత్నించిరి. సైనికులు తుపాకులుకాల్చగా నొకరు మరణించెను; ఇద్దరు తీవ్రముగా గాయపడిరి. ఆ సమయమున మరియొకతండాతో మహాధీరుడగు ప్రకాశంగారు వచ్చెను. ముందుకుపోయి ఆ శవమును చూచితీరెదననెను. సైనికులు అడ్డుతగిలిరి. కాల్పులకు సిద్ధపడిరి. 'నామీద కాల్చండి, చూతాము' అని తన ఛాతీచూపి నాడు. దానితో సైనికులు భయభ్రాంతులై కాల్చడం మానివేసి ప్రకాశం గారిని, వాలంటీరులను, జనాన్ని పోనిచ్చిరి. ప్రకాశంగారి త్యాగము, ధైర్యము నిరుపమానమైనవి. అంతేకాక ప్రతికక్షులతో పోట్లాటలో జంకూ గొంకూ లేనివాడు. ఆయనహృదయము నవనీతమైనది. ఇతరులబాధలను బాగుగ గ్రహించి సానుభూతి చూపి సహాయముచేసేవాడు. ధైర్యమునకు, త్యాగమునకు, దేశసేవకు, ఉదారమైన విశాలహృదయమునకు ఆయన ఆదర్శమూర్తి. 7, 8 సంవత్సరములు నడచినతరువాత స్వరాజ్యపత్రిక ఆపివేయబడినది.

# 10 నా మునిసిపలు చెయిర్మనుకాలము

బెజవాడపురపాలకసంఘం ఎన్నికలు - కాంగ్రెసుపార్టీ విజయములు - బెజవాడ వైశ్యసంఘము - జస్టిసుపార్టీ - చెయిర్మను ఎన్నిక-నా చెయిర్మనుపదవి-1925 తుపాను భీభత్సము - దుఃస్థితి నివారణకు ప్రయత్నములు - శ్రీ రాజా పానుగంటి రామారాయణంగారి రాక-చెయిర్మనుగా నేను అవలంబించిన పద్ధతులు, సాధించిన కార్యములు - మునిసిపల్ పరిపాలన సంస్కరణము, ఉద్యోగుల క్రమశిక్షణ - తెలుగులో వ్యవహారములు - మునిసిపలుపాఠశాలల తనిఖీ - హిందీ బోధనము, జాతీయగీతము - ఖద్దరు - గాంధీజీ ప్రశంస-జస్టిస్‌పార్టీ ప్రభుత్వమువారి ఆక్షేపణములు, చర్యలు-బెజవాడ పట్టణ అభివృద్ధిప్రణాళికలు - మునిసిపాలిటీ రోడ్ల అభివృద్ధి - మునిసిపాలిటీక్రింద విద్యుచ్ఛక్తి సరఫరా ఏర్పాట్లు - మంచి నీటికుళాయిల అభివృద్ధి, మురుగుకాల్వల పథకము - గాంధీ పార్కు, రామచంద్రరావు గ్రంథాలయము - కాళేశ్వరరావు మార్కెట్టు - బందరుకాల్వలాకువంతెనపైన రోడ్డు - పాత బస్తీకి గవర్నరుపేటకు రైలులైను అడ్డులేకుండా క్రిందనుండి సరాసరి "సబ్‌వే" రోడ్డుదారి - బెజవాడ మహిళాసంఘము - స్త్రీలక్లబ్బు - ఆంధ్ర జింఖానాక్లబ్బు- నాటకప్రదర్శనములు, సినిమాలు - సైమను కమిషనువారికి నేను పంపిన అధికార పూర్వక బహిష్కరణలేఖ - నా చెయిర్మనుగిరీలో బ్రిటిషు ప్రభుత్వమువారికి గిట్టని పనులు - ఆనాటి ప్రభుత్వ మంత్రుల ప్రశ్నలు, నా జవాబులు.

1922 వ సం॥లో బెజవాడమునిసిపాలిటీకి ఎన్నికలుజరిగి కాంగ్రెసు పార్టీవారు అధికసంఖ్యాకులుగా వచ్చిరనియు, డాక్టరు రామచంద్రరావుగారు చైర్మనుగా ఎన్నుకోబడిరనియు పైన తెలిపియున్నాను. 1924 నవంబరులో జరిగిన మూడవవంతుసభ్యులఎన్నికలలో నేను, అద్దేపల్లి రామశేషయ్యశ్రేష్ఠిగారు కాంగ్రెసుపక్షమున బెజవాడ మునిసిపలుకౌన్సిలుకు సభ్యులుగ నెన్నుకొనబడితిమి. అటుపిమ్మట 1925 ఏప్రిలునెలలో డాక్టరు రామచంద్రరావుగారు చైర్మనుపదవికి రాజీనామానిచ్చి మద్రాసు వెళ్ళిపోయిరి. అపుడు కాంగ్రెసుపార్టీకి 15 స్థానములు, అందుకు వ్యతిరేకముగ నున్న దినవహి హనుమంతరావుగారిపార్టీకి 9 స్థానములుండెను. నన్ను చైర్మనుగ నుండమని మా కాంగ్రెసుపార్టీసభ్యులు కోరిరి. నే నంగీకరించితిని. పదిహేనుఓట్లు నాకు వచ్చెను. నాకువ్యతిరేకముగ నిలబెట్టబడిన పోలూరు హనుమంతరావుగారికి తొమ్మిదిఓట్లు వచ్చెను. ఆయన అపుడు ఇంపీరియల్‌బ్యాంకి మేనేజరుగా నుండెను. ఆయన నిలచినయెడల కాంగ్రెసుపార్టీలోని వైశ్యసభ్యులను తమవైపుకు త్రిప్పవచ్చుననే ఆశతో దినవహి హనుమంతరావుగా రాయనను నిలబెట్టిరి. అపుడు డెప్యూటీ కలెక్టరుగానున్నవారుకూడ వైశ్యులను బెదిరించి నాకు వ్యతిరేకముగా ఓటు చేయించ యత్నించెను. అది యొక ప్రభుత్వపక్ష బ్యాంకిపక్షపు సమస్య అయ్యెను. జైలుకుపోయివచ్చినవారికి చైర్మనుఓటు యిచ్చినచో గవర్న మెంటుకు కోపమువచ్చునని ఆ యుద్యోగి మా వైశ్యసభ్యులను పిలిపించి చెప్పెను; వైశ్యులు పిరికివారని వారనుకొనిరి. వారు పిరికివారు కారు. మహాత్మాగాంధీ, లాలా లజపతిరాయ్‌గార్లు వారికులమువారని వారికి గర్వము. వైశ్యప్రముఖులైన అద్దేపల్లి రామశేషయ్యశ్రేష్ఠిగారు నాతో కూడ జైలులోనుండిరి. మా వైశ్యసభ్యులెవరును ఆ యుద్యోగిసలహాను పాటించలేదు. అందరును నాకే ఓటునిచ్చిరి. నా అనుభవములో వైశ్య సంఘ మెప్పుడును కాంగ్రెసుపక్షముననే నిలచెను. అప్పటికిని నేటికిని మా బెజవాడ వైశ్యసంఘ మేకగ్రీవముగా నాకు కాంగ్రెసుపక్షమున నిలచిన ప్రతి శాసనసభఎన్నికలోను స్త్రీలు, పురుషులు వచ్చి ఓటుచేసిరి. బ్రాహ్మణులలో కొంత ఓర్వలేనితనముచే కొద్దిగానైనను వ్యతిరేకపార్టీ యుండెను.

## 10 నా మునిసిపలు చెయిర్మనుకాలము

బెజవాడపురపాలకసంఘం ఎన్నికలు – కాంగ్రెసుపార్టీ విజయములు – బెజవాడ వైశ్యసంఘము – జస్టిసుపార్టీ – చెయిర్మను ఎన్నిక–నా చెయిర్మనుపదవి–1925 తుపాను భీభత్సము – దుఃస్థితి నివారణకు ప్రయత్నములు – శ్రీ రాజా పానుగంటి రామారాయణంగారి రాక–చెయిర్మనుగా నేను అవలంబించిన పద్ధతులు, సాధించిన కార్యములు – మునిసిపల్ పరిపాలన సంస్కరణము, ఉద్యోగుల క్రమశిక్షణ – తెలుగులో వ్యవహారములు – మునిసిపలుపాఠశాలల తనిఖీ – హిందీ బోధనము, జాతీయగీతము – ఖద్దరు – గాంధీజీ ప్రశంస–జస్టిస్‌పార్టీ ప్రభుత్వమువారి ఆక్షేపణములు, చర్యలు–బెజవాడ పట్టణ అభివృద్ధిప్రణాళికలు – మునిసిపాలిటీ రోడ్ల అభివృద్ధి – మునిసిపాలిటీక్రింద విద్యుచ్ఛక్తి సరఫరా ఏర్పాట్లు – మంచి నీటికుళాయిల అభివృద్ధి, మురుగుకాల్వల పథకము – గాంధీ పార్కు, రామచంద్రరావు గ్రంథాలయము – కాళేశ్వరరావు మార్కెట్టు – బందరుకాల్వలాకువంతెనపైన రోడ్డు – పాత బస్తీకి గవర్నరుపేటకు రైలులైను అడ్డులేకుండా క్రిందనుండి సరాసరి "సబ్ వే" రోడ్డుదారి – బెజవాడ మహిళాసంఘము – స్త్రీలక్లబ్బు – ఆంధ్ర జింఖానాక్లబ్బు– నాటకప్రదర్శనములు, సినిమాలు – సైమను కమిషనువారికి నేను పంపిన అధికార పూర్వక బహిష్కరణలేఖ – నా చెయిర్మనుగిరీలో బ్రిటిషు ప్రభుత్వమువారికి గిట్టని పనులు – ఆనాటి ప్రభుత్వ మంత్రుల ప్రశ్నలు, నా జవాబులు.

1922 వ సం॥లో బెజవాడమునిసిపాలిటీకి ఎన్నికలుజరిగి కాంగ్రెసు పార్టీవారు అధికసంఖ్యాకులుగా వచ్చిరనియు, డాక్టరు రామచంద్రరావుగారు చైర్మనుగా ఎన్నుకోబడిరనియు పైన తెలిపియున్నాను. 1924 నవంబరులో జరిగిన మూడవవంతుసభ్యులఎన్నికలలో నేను, అద్దేపల్లి రామశేషయ్యశ్రేష్ఠిగారు కాంగ్రెసుపక్షమున బెజవాడ మునిసిపలుకౌన్సిలుకు సభ్యులుగ నెన్నుకొనబడితిమి. అటుపిమ్మట 1925 ఏప్రిలునెలలో డాక్టరు రామచంద్రరావుగారు చైర్మనుపదవికి రాజీనామానిచ్చి మద్రాసు వెళ్ళిపోయిరి. అపుడు కాంగ్రెసుపార్టీకి 15 స్థానములు, అందుకు వ్యతిరేకముగ నున్న దినవహి హనుమంతరావుగారిపార్టీకి 9 స్థానములుండెను. నన్ను చైర్మనుగ నుండమని మా కాంగ్రెసుపార్టీసభ్యులు కోరిరి. నే నంగీకరించితిని. పదిహేనుఓట్లు నాకు వచ్చెను. నాకువ్యతిరేకముగ నిలబెట్టబడిన పోలూరు హనుమంతరావుగారికి తొమ్మిదిఓట్లు వచ్చెను. ఆయన అపుడు ఇంపీరియల్‌బ్యాంకి మేనేజరుగా నుండెను. ఆయన నిలచినయడల కాంగ్రెసుపార్టీలోని వైశ్యసభ్యులను తమవైపుకు త్రిప్పవచ్చుననే ఆశతో దినవహి హనుమంతరావుగా రాయనను నిలబెట్టిరి. అపుడు డెప్యూటీ కలెక్టరుగానున్నవారుకూడ వైశ్యులను బెదిరించి నాకు వ్యతిరేకముగా ఓటు చేయించ యత్నించెను. అది యొక ప్రభుత్వపక్ష బ్యాంకిపక్షపు సమస్య అయ్యెను. జైలుకుపోయివచ్చినవారికి చైర్మనుఓటు యిచ్చినచో గవర్నమెంటుకు కోపమువచ్చునని ఆ యుద్యోగి మా వైశ్యసభ్యులను పిలిపించి చెప్పెను; వైశ్యులు పిరికివారని వారనుకొనిరి. వారు పిరికివారు కారు. మహాత్మాగాంధీ, లాలా లజపతిరాయ్‌గార్లు వారికులమువారని వారికి గర్వము. వైశ్యప్రముఖులైన అద్దేపల్లి రామశేషయ్యశ్రేష్ఠిగారు నాతో కూడ జైలులోనుండిరి. మా వైశ్యసభ్యులెవరును ఆ యుద్యోగిసలహాను పాటించలేదు. అందరును నాకే ఓటునిచ్చిరి. నా అనుభవములో వైశ్యసంఘ మెప్పుడును కాంగ్రెసుపక్షముననే నిలచెను. అప్పటికిని నేటికిని మా బెజవాడ వైశ్యసంఘ మేకగ్రీవముగా నాకు కాంగ్రెసుపక్షమున నిలచిన ప్రతి శాసనసభఎన్నికలోను స్త్రీలు, పురుషులు వచ్చి ఓటుచేసిరి. బ్రాహ్మణులలో కొంత ఓర్వలేనితనముచే కొద్దిగానైనను వ్యతిరేకపార్టీ యుండెను.

గాని వైశ్యసంఘమువారు మాత్రము నా కాంగ్రెసుజీవితమంతలో నాకు ఏకగ్రీవముగా మద్దతుగానున్నారు. ఇందుకు నేను వారికి కృతజ్ఞుడను. నేను బెజవాడ మునిసిపలు చైర్‌మను నయినాను. మరల 1927 నవంబరులో ఏడుస్థానములకు మునిసిపలు ఎన్నికలు వచ్చెను. నా స్థానమునకుకూడ ఎన్నిక వచ్చినది. అప్పటికి ఆ మునిసిపాలిటీ సభ్యులసంఖ్య 28 కి పెరిగెను. అందులో 21 మంది ఎన్నికసభ్యులు, 7 గురు ప్రభుత్వనియమితులు. 1924 సం॥ ఎన్నికలలోను, 1927 ఎన్నికలలోను కూడ బెజవాడ మునిసిపాలిటీలో మిక్కిలి కష్టముగానున్నవార్డుకు నన్ను నిలబెట్టవలెనని మా పార్టీ వారిని కోరితిని. గవర్నరుపేటలోని వార్డులు చాల తేలిక. నేను గవర్నరుపేట కాపురస్థుడను. పోటీలేకుండానే అచటి స్థానములు కాంగ్రెసుపార్టీకి వచ్చెను. నేను రెండుసార్లూ కూడ పాతబస్తీలోని ఐదవవార్డుకు నిలబడితిని. అది చాల మిశ్రమవార్డు. రెండుసార్లు పోటీ తీవ్రముగనుండెను. బైటినుంచి అడుసుమిల్లి గోపాలకృష్ణయ్య, మీర్జాపురంరాజా, త్రిపురనేని రామస్వామిగార్లు మొదలైన జస్టిసుపార్టీనాయకులుకూడ వచ్చి నన్ను ఓడించవలెనని చాల ప్రయత్నముచేసిరి. త్రిపురనేని రామస్వామిగారు అప్పటికి జస్టిసుపార్టీలో చేరి నన్ను బెజవాడలో ఓడించుటకన్న జస్టిసుపార్టీ వారికి ఎక్కువ ప్రతిష్ఠకలుగచేయునది యుండనేరదు. 1924 ఎన్నికలలో విన్నకోట రాఘవయ్యగారు - ఆ వార్డు కాపురస్థులు, అచటి గొప్ప కుటుంబమునకు చెందినవారు నాతో పోటీచేసిరి. నేనే గెలిచితిని. 1927 ఎన్నికలలో ఆ వార్డులో సుప్రసిద్ధ వైద్యుడుగా పనిచేయుచున్న డాక్టరు గోవిందరాజులునాయుడుగారితో పోటీచేసి నేనే గెలిచితిని. అపుడు వైస్ చైర్‌మనుగానున్న కొళందరెడ్డిగారు ఆ ఎన్నికను నడిపిరి. ఓట్లపెట్టెలు ఆ సాయంత్రము తమవద్దకు రాగా నేను గెలిచెదనని తెలిసి ఆ ఓట్లను లెక్కింపకుండ ఆపుచేసిరి. డాక్టరు గోవిందరాజులునాయుడుగారిచేత నేను ఎన్నికల్లో చాలా అక్రమములుచేసితినని ఒక పెటిషను దాఖలుచేసికొనిరి. కొద్దిరోజులలో చైర్‌మనుఎన్నిక వచ్చుచున్నది.అప్పటివరకు ఆయన ఆ ఓట్లు లెక్కపెట్టదలచుకోలేదు. నా సభ్యత్వము తీరిపోతున్నది. అందువల్ల నేను మరల మునిసిపలుచైర్‌మనుగా నిలుచుటకు అవకాశముండదు. అట్టిస్థితితో

నేను జిల్లాకలెక్టరయిన వెస్ట్ లేక్ గారివద్ద వెంటనే పెట్టెలు తెరిపించి లెక్కపెట్టించవలెనని అర్జీ దాఖలుచేసితిని. నేను మునిసిపలుచైర్మనుగానున్న కాలములో ప్రథమమున స్టూవర్టుగారు, తరువాత వెస్ట్‌లేక్‌గారు, పిమ్మట యుజిలీగారు కలెక్టర్లుగా నుండిరి. ఆ ముగ్గురు యూరోపియనులైనను నాతో పూర్తిగ సహకరించిరి. నాయందు గౌరవముగా నుండిరి. మునిసిపాలిటీ అభివృద్ధికి నేను పెట్టిన ప్రణాళికలను బలపర్చి గవర్నమెంటుకు పంపిరి. వెస్ట్‌లేక్‌గారు నా పిటీషనుమీద పెట్టెలుతెరవమని ఆజ్ఞాపించిరి. నేను గెలిచితినని ప్రకటింపబడిన కొద్దిరోజులలో చైర్మనుఎన్నిక వచ్చెను. 24 గురు నాపక్షమున నుండిరి. నలుగురుమాత్రము కోళందరెడ్డిగారిపక్షమున నుండిరి. కోళందరెడ్డిగారు మొదట కాంగ్రెసుపక్షమున వచ్చినవారే. నేను చైర్మనుగానున్నకాలములో నాతోపాటు వైస్‌చైర్మనుగా పనిచేసినవారే. కాని 1926 శాసనసభఎన్నికలలో వారిని కాంగ్రెసుఅభ్యర్థిగా పెట్టలేదని కోపమువచ్చి స్వతంత్ర కాంగ్రెసుఅభ్యర్థిగా నిలచి, ఓడిపోవడమేకాక కౌన్సిలులో ఒక చిన్నపార్టీని కూడగట్టుకొని యుండెను. ఆయనపక్షమున నలుగురే సభ్యులు. కనుక ఏకగ్రీవముగానే నేను రెండవపర్యాయము మునిసిపలు చైర్మనుగా ఎన్నుకొనబడితిని. నాతో పోటీచేసిన డాక్టరు గోవిందరాజులునాయుడుగారు జస్టిసుపార్టీవారు. నేను చైర్మనుగా ఎన్నుకొనబడిన తరువాత మునిసిపలుకౌన్సిలుకు ప్రభుత్వముచే నామినేట్‌చేయబడిరి. కాని ఎంతో సరసముగనుండి నాతో పూర్తిగ సహకరించిరి. కోళందరెడ్డిగారు కూడ మరల వారి వైస్‌చైర్మనుఉద్యోగము ఎన్నికకు వచ్చునరికి నాతో సఖ్యపడి మరల వైస్‌చైర్మనుగా ఎన్నుకొనబడిరి. అందరము కలసిపోతిమి. కాని నేను కోళందరెడ్డిగారితో కలియుటమునకు ఇష్టములేని కొందరు, షుమారు తొమ్మిదిమంది—కావలి శంకరరావు, డాక్టరు ఘంటసాల సీతారామశర్మ, పోతిన శ్రీనివాసరావు, శేష్ట్లా వెంకటకృష్ణయ్య, గులాం మొహిద్దీన్‌సాహెబు మొదలైనవారు నాకు, కోళందరెడ్డిగారికి వ్యతిరేకమైన ఒక గ్రూపుగ నేర్పడిరి. కాని మెజారిటీగా మేము 19 మందిమి వుండుటవల్ల కార్యక్రమము అడ్డులేకుండా సాగిపోయినది. నేను చైర్మనుగానుండగనే 1930 ఏప్రిలునెలలో ఉప్పుసత్యాగ్రహముచేసి జైలుకుపోతిని. నేనుజైలులో

నుండగా నా సభ్యత్వస్థానము ఖాళీగనే యుంచబడెను. చైర్మనుపదవికి రెండుగ్రూపులమధ్య పోటీజరిగెను. అందులో కొళందరెడ్డిగారు గెల్చి చైర్మనుగా ఎన్నుకొనబడిరి. నేను జైలునుంచి బైటికివచ్చినపిమ్మట నాకు సమావేశములకురమ్మని నోటీసులు వచ్చినను నేను మునిసిపలుసమావేశములకు పోలేదు. మరల మునిసిపాలిటీలో ప్రవేశించదలచలేదని నా గౌరవార్థమివ్వబడిన యొక అల్పాహారవిందులో ప్రకటించితిని. నేను జైలులోనున్నపుడు కొళందరెడ్డిగారు చైర్మనుగానుండగా రెండుగ్రూపులతగాదాలు చాల హెచ్చి మునిసిపలుపని స్తంభించినదని తెలిసినది. ఇంతలో 1931 సెప్టెంబరులో నూతనఎన్నికలు వచ్చినవి. నే నా ఎన్నికలలో నిలువకుండ యూరకొంటిని. కొళందరెడ్డిగారు, వారిబృందమువారు, నాతో వ్యతిరేకించుచుండిన కావలి శంకరరావుబృందమువారు — ఉభయబృందములవారు నావద్దకువచ్చి నన్ను సభ్యుడుగ నిలవవలసినదని అందరు కలసి నన్ను మరల చైర్మనుగ చేసెదమని, నేను చైర్మనుగలేనిది పని సాగుటలేదని చెప్పిరి. నేను రెండుపర్యాయములకంటె ఎక్కువగ చైర్మనుగ నుండదలచలేదని అయిదుసంవత్సరములకాలము బెజవాడ మునిసిపలువ్యవహారములకై వినియోగించితిననియు, ఇంతకన్న ఎక్కువకాలము నివ్వజాలననియు, ఇకమంచి నా యావత్కాలము స్వరాజ్యసంపాదనకొరకే వినియోగించదలచినాననియు గట్టిగా చెప్పితిని. అందరుకలసి ఏకగ్రీవముగా రమ్మని కోరుచున్నపుడు నేను మునిసిపాలిటీలో మరల ప్రవేశించి చైర్మనుపదవిని స్వీకరించుటయే సరియైనదని వారు చెప్పిరి. "తలాయొకవైపున లాగి విశ్వాసరాహిత్యము ప్రకటించినపుడు పదవిని వదలుకొనిపోవుటలో గొప్ప యేమీలేదు. అందరు నన్నుండమని కోరుచున్నపుడే నేను వదలుకొనిపోవుట గౌరవముగానుండు"నని చెప్పి ఇంకా ఇతరులు ఎంతమందివచ్చి కోరినను నేను సమ్మతించలేదు. చైర్మనుగా వుండకపోతే మానె, వట్టి సభ్యుడుగానైనను ఉండి నడపవలెనని ఆ రెండుబృందములవారు కోరిరి. ఉంటే చైర్మనుగావుండి పూర్తిబాధ్యతవహించవలె, లేదా అసలు మానుకొనవలె. అదే నాఅభిప్రాయము అని చెప్పి, నేనుమునిసిపలుసభ్యత్వమునకుఎన్నికలలో నిలవలేదు. తర్వాత మునిసిపాలిటీలో మరల నేను చేరలేదు. 1930 ఏప్రిలు

19 వ తేదీన అని జ్ఞాపకము. నేను ఆరోజుసాయంత్రము ఎనభై మంది వాలంటీరులను రైలులో తీసుకొని ఉప్పుసత్యాగ్రహము చేయుటకు బందరు వెళ్ళుచుంటిని. ఆ ఉదయమున గుంటూరునుండి గుళ్లపల్లి ఘన్నయ్య శాస్త్రి నాకు ఫోనుచేసి "గుంటూరు మునిసిపలుఛైర్మను నడింపల్లి లక్ష్మీనరసింహారావుగారు ఉప్పుసత్యాగ్రహమునకు సిద్ధపడినాడు. అన్ని ఏర్పాట్లుచేసుకున్నాడు. విశాఖపట్టణంలో తెన్నేటి విశ్వనాథంగారిని, కాకినాడలో బులుసు సాంబమూర్తిగారిని అరెస్టుచేసినారని తెలిసినది. మనవంతుకూడ వచ్చుచున్నది. మీరు సిద్ధపడినారా, అన్ని ఏర్పాట్లు చేసినారా, నరసింహారావుగారు కనుక్కోమన్నారు" అని అడిగినారు. నేను "ఈ సాయంత్రమే సత్యాగ్రహముచేయుటకు బందరు వెళ్లుచున్నా" నని చెప్పినాను. "అయితే నరసింహారావుగారు తాను జైలునుంచి వచ్చేసరికి తనకు మరల ఛైర్మనుపదవిని వప్పగింతచేసేపద్ధతితో తన సమీపబంధువుపైన పొత్తూరు లక్ష్మయ్యగారిని తాత్కాలిక ఛైర్మనుగా చేసిపోతున్నారు. మీరు కూడా అలాగే మీ ముఖ్యులలో ఎవరికైన ఛైర్మనుపదవి వప్పగింతచేసి పొండి. మరల రాగానే అందులో ప్రవేశించవచ్చు"నని చెప్పినాడు. "నేను వెళ్ళిపోతున్నాను. నా తరువాత ఎవరు ఛైర్మనుఅయితే నాకేమి? ఆ విషయము నేను పెట్టుకోదలచుకోలేదు. బహుశః మరల ఛైర్మనుపదవికి యత్నించను" అని చెప్పినాను. నేను మునిసిపలుబురదలోనుండి అంతటితో బయటపడి మనశ్శాంతిని, అంతకంటె మంచిపనిచేయుటకు సావకాశమును పొందినాను. నరసింహారావుగారు జైలునుంచి వచ్చి ఛైర్మనుపదవి తనకివ్వమని అడుగగా పొత్తూరి లక్ష్మయ్యగా రివ్వకపోవడం, అప్పటినుంచి మునిసిపలుయుద్ధములలో నరసింహారావుగారు చిక్కుకొనడం తటస్థపడినది. ఆకాలమున నావలెనే ఆంధ్రదేశములోని మరికొన్ని పట్టణములలో కొందరు సుప్రసిద్ధ కాంగ్రెసునాయకులు మునిసిపలుఛైర్మనులయి సమర్థతతోను జాతీయతత్వముతోను పనిచేసినవారు గలరు. బరంపురములో ఉన్నవ రామలింగంగారు, విజయనగరములో వీరభద్రస్వామిగారు, కాకినాడలో లక్కరాజు సుబ్బారావుగారు, రాజమహేంద్రవరములో కె. వి. ఆర్. స్వామిగారు, ఏలూరులో జోగయ్యశర్మగారు, గుంటూరులో నడింపల్లి లక్ష్మీనరసింహారావుగారు అట్టివారు.

నేను 1925 ఏప్రిలునెలలో బెజవాడమునిసిపాలిటీకి చైర్మనుగా ఎన్నుకొనబడితినని తెలిపియుంటిని. అటుపిమ్మట ఒకనెలలోపలనే, అనగా మే 16 వ తేదీన బెజవాడలోను, బెజవాడకు తూర్పునమున్న కృష్ణా జిల్లాలోను భయంకరమైనతుపాను సంభవించెను. షుమారు 20 గంటలసేపు తుపాను గాలితోకూడా అతిజోరుగ వర్షముకురిసెను. పైరులకు, ఆస్తులకు లక్షలకొలది నష్టముకలిగెను. వందలాది పశువులు మరణించెను. ఇళ్ళు కూలిపోయెను. ఆ తుపానువచ్చినరోజు ఉదయము 9 గంటలకు నేను నా కారులో మాయింటినుంచి మునిసిపలుఆఫీసుకువచ్చి నా కారును పంపివేసి మునిసిపలుఆఫీసు మేడమీద కూర్చొని మా మేనేజరు సుబ్బారావుగారితో సహా కాగితములను చూచుకొనుచుంటిని. వర్షము ప్రారంభమై క్రమక్రమముగ హెచ్చెను అది గొప్పదయ్యెను. మా యింటినుంచి కారు పంపుటకు వీలులేకపోయెను. త్రోవలో గొప్పవరదలుగ నీరు ప్రవహించుటయేకాక చెట్లన్నీ రోడ్డుమీద అడ్డముగ కూలెను. గుర్రపుబండ్లన్నీ ఎవరియింటిదగ్గర వారు ఆపుకున్నారు. నేను, మేనేజరు సుబ్బారావుగారు అటులనే మేడమీద కూర్చుంటిమి. మేడ పెంకులు లేచిపోయి మా మీద వర్షముకురియనారంభించగా క్రిందికివచ్చి రికార్డుగదిలో దాగుకొంటిమి. ఆఫీసుకువచ్చిన గుమాస్తాలు, సిబ్బందికూడ పక్కలనుంచి ఈదురుగాలి, పైనుంచి వర్షము కొడుతున్నందువల్ల చాల యిబ్బందిపడిరి. నేను అదివరకే భోజనముచేసి వచ్చితిని. అప్పటినుంచి సాయంత్రము ఐదుగంటలవరకు అటులనే ఆఫీసులో దాగితిని. సాయంత్రం 5 గంటలకు కొంచెము వర్షముతగ్గినట్లు కనబడినందున నేను, మేనేజరుగారు గొంగళ్ళను నెత్తిమీద కప్పుకొని నడుములోతు నీళ్ళలో రెండుఫర్లాంగులు నడిచి పాతబస్తీలోని నా మిత్రులు మునిసిపలు కౌన్సిలరు అయిన కావలి శంకరరావుగారియింటిలో చేరితిమి. మునిసిపలు మేనేజరుగారియిల్లు వారియింటిపక్కనే ఉన్నది. మాఇల్లు గవర్నరుపేటలో మునిసిపలుఆఫీసుకు దాదాపు రెండుమైళ్లదూరమున మున్నది. అందువల్ల మా యింటికి పోక కావలి శంకరరావుగారియింటిలోనే ఆరాత్రి యుంటిని. ఆయనభార్య ఏదో ఒకవిధముగ కొంచెము అన్నమువండి ఆవకాయ, మజ్జిగ వేసి పెట్టినది. లోపల తలుపువేసుకొని పడుకున్నా వర్షం

తలుపులను బాదుతున్నది. ఉదయాన సుమారు ఐదుగంటలకు తెరపిచ్చినది. అపుడు నేను మెల్లగా మా యింటికివెళ్ళి బట్టలుమార్చుకొని కావలి శంకర రావు మొదలైన కొందరుకౌన్సిలర్లను వెంటతీసుకొని మునిసిపలుసిబ్బందితో సహా బస్తీఅంతా తిరిగి 12 గంటలకు ఇంటికి వచ్చినాను. ఆవెంటనే 5 వేల రూప్యములను మంజూరుచేసి ఇళ్లుపోయినవారినందరిని సత్రములలోను, స్కూళ్లలోను కొద్దిరోజులుంచునట్లు ఉత్తరువుచేసి పేదవారందరికి అన్నం వండించిపెట్టి సహాయముచేయించితిని. నేలకూలిన పెద్ద పెద్ద చెట్లన్నిటిని బెజవాడప్రజలలో ఎవరుపడితే వారు గొడ్డళ్లతోకొట్టుకొని ఆ కట్టెలను నెత్తిమీదపెట్టుకొని తమయిండ్లకుచేర్చుకొనవచ్చునని దండోరావేయించితిని. ఎవరును బండ్లమీద వాటిని తీసుకొనిపోకూడదు. అట్లుల తీసుకొనిపోయి నచో దొంగనేరముక్రింద శిక్షవేయించెదము అని తెలిపితిమి. ఈ విధముగ మూడురోజులలో వేలకువేలమంది పేదవారు ఆ చెట్లకొమ్మలు కొట్టుకొని నెత్తిమోపులు కట్టి తీసుకొనిపోయిరి. వారందరికి సంవత్సరమునకు సరి పోయే వంటచెరకు, పందిళ్ళకు, దడులకు సరిపోయే కట్టెలు లభించినవి. దాదాపు చెట్లన్నీ ఖాళీకాగా మిగిలిన పెద్ద పెద్ద మొండెములను మునిసిపలు ఆఫీసుదగ్గరకు చేర్చి వేలంవేసినాము. తుపానువచ్చినరోజున, ఆ మరునాడు జిల్లాకలెక్టరు స్టూవర్టుగారు బెజవాడ రహదారిబంగళాలో నున్నారు. వారిని నే నిదివరకు చూచియుండలేదు. నేను చైర్మన్‌కాగానే కలెక్టరుదర్శనము చేసే అలవాటు నాకు లేకుండెను. ఏవో పనియున్నపుడు ఉభయులము కలసేవారము. అంతేకాని, కలెక్టరుచుట్టు తిరుగకూడదని నా ఉద్దేశ్యము. కాగితములమీదనే ఉత్తరప్రత్యుత్తరములు జరుపుకొనేవారము. స్టూవర్టు గారు తన బంగళానుంచి బయలుదేరి నన్ను కలియవలెనని మా మునిసిపలు ఆఫీసుకు, పిమ్మట మా యింటికి వచ్చి నేను లేనందున తిరిగి వెళ్ళిపోయిరి. అపుడు ఎగ్జిక్యూటివ్‌ఆఫీసర్లు, రాష్ట్రఉద్యోగస్థులు, మునిసిపాలిటీలమీద లేరు. అన్ని అధికారములు చైర్మనులకే యుండెను. అందువల్ల చైర్మనే ప్రముఖ పాత్ర వహించెను. మా యింటికికూడ కలెక్టరుగారు వచ్చినారని తెలిసినం దున నేను వారినిచూచుటకు రహదారిబంగళాకు వెళ్ళి వారితో మాట్లాడితిని. నేను చేస్తున్న ఏర్పాట్లన్నీ వారికి తృప్తికరముగానుండెను. చెట్లకొమ్మ

లన్నీ స్వయముగ కొట్టుకొని మోపులుకట్టి నెత్తిమీద పెట్టుకొనిపోవుటకు నేను ఇచ్చిన అనుజ్ఞ చాల సమంజసముగనున్నదని ఆయన సంతోషించెను. బెజవాడ బందరు హైరోడ్డు అంతయు కూలిపోయిన చెట్లమయముగ నుండెను. అటులనే ప్రజలు స్వంతముగకొట్టుకొని నెత్తిమీద తీసుకొని పోయినచో తానుకూడా అంగీకరించెదనని నాతో చెప్పెను. మేమిద్దరముకలసి ఊరంతయు చూచితిమి. ప్రభుత్వమునకు వ్రాసి ప్రజల సహాయార్థము ద్రవ్యము తెప్పించెదనని ఆయన నాతో చెప్పెను. పిమ్మట ఆయన బందరుకు వెళ్ళెను. బందరులో బెజవాడకంటె భీభత్సముగనుండెను. బెజవాడలో 5 లక్షలరూప్యములవరకు ఆస్తి నష్టపడినదని, వేలకువేలగుడిశెలు కూలి పోయినవని, వందలాదిపశువులు మరణించినవని అంచనావేయబడినది. మనుష్యులెవరును చావలేదు. కలెక్టరుగారు బెజవాడప్రజలకు సహాయము చేయు నిమిత్తము ద్రవ్యము మంజూరుచేయమని మద్రాసుప్రభుత్వమునకు వ్రాసినందున, బెజవాడలో జరిగిన నష్టమునంతను స్వయముగచూచుటకు జస్టిసుపార్టీనాయకులును, ముఖ్యమంత్రియు, స్వపరిపాలనా మంత్రియు నగు రాజా రామారాయణంగారు బెజవాడకు విచ్చేసిరి. కాని నేను వారినిఆహ్వా నించుటకు బెజవాడ రైలుస్టేషనుకు పోలేదు. ఇతరపార్టీమంత్రు లెవరైనను వచ్చినయడల వారి దర్శనమునకు పోకూడదని, వారికి సన్మానములు చేయకూడదని కాంగ్రెసు ఆదేశము. అందువల్ల నేను పోలేదు. మా మునిసిపలు వైస్చైర్మనుగానున్న కొళందరెడ్డిగారు అపుడు స్వతంత్రుడుగానున్నం దున ఆయన వెళ్ళెను. జిల్లాబోర్డుఅధ్యక్షుడు మీర్జాపురంరాజాగారుకూడ రైలుస్టేషనుకు వెళ్ళిరి. అక్కడ కొంత వాయింపుమేళము జరిగెను. అటు పిమ్మట మంత్రిగారితోకలిసి మా వైస్చైర్మనుగారు, జిల్లాబోర్డుఅధ్య క్షులు బెజవాడటస్తీఅంతయు తిరిగి కూలిపోయిన ఇళ్లను, ఆస్తులను పరీ క్షించిరి. ఇటుల నేను మా మేడమీద నుండగా, మీర్జాపురంరాజాగారికి ముఖ్యుడు, మా నందిగామతాలూకా కాపురస్తుడునగు గుమ్మడపు రంగారావు గారు మా మేడమీదికి వచ్చి ముఖ్యమంత్రి రాజా రామారాయణంగారు మా యింటికే వచ్చుచున్నారని కబురుచెప్పెను. నేను అందుమీద త్వరపడి మేడమీద తివాచీ. కుర్చీలు వేయించి, మామిడిపండ్లు, తమలపాకులు,

పూలదండలు తెప్పించి వారికి స్వాగతమిచ్చుటకు సిద్ధపడితిని. రాపమీద మంత్రిగారు వైస్ చైర్మను, జిల్లాబోర్డుఅధ్యక్షులతో కలిసి మా వాకిట్లోకి రాగానే నేను క్రిందకు దిగివెళ్లి వారిని ఆహ్వానించి మేడమీదకు తీసుకొని వచ్చి మంత్రిగారిమెడలో పూలదండలువేసి మామిడిపండ్లు సమర్పించితిని. వారు నాతో కొంతసేపు సంభాషించిరి. "కాశీశ్వరరావుగారూ, మీరు లాయరు పని చేయుచుండగా నేను, ఉయ్యూరురాజాగారు కలిసి ఒకదావాలో మీ సలహానిమిత్తము వచ్చినాము జ్ఞాపకమున్నదా?" అని వారు నన్ను అడిగిరి. "జ్ఞాపకమున్నది. మీయందు నాకెంతో గౌరవమే, కాని రాజకీయపరిస్థితు లనుబట్టి నేను మిమ్ములను నాహ్వానింపుటకు రైలుస్టేషనుకు రాలే"దని చెప్పి తిని. అపుడు ఆయన "నా కదంతా తెలుసును. మీరుచేసినపనికి నా కేమీ ఆక్షేపణలేదు. మీరు మీ సిద్ధాంతములనుబట్టి నడచుకొనిపోవుచున్నారు. మీవంటి నాయకులయందు నాకు ఎప్పుడూ గౌరవమే"నని చెప్పిరి. "రాయల సీమలో కొంతమంది కాంగ్రెసుబ్రాహ్మణులు సర్ సి.పి. రామస్వామిఅయ్యరు గారువచ్చినపుడు రైలుస్టేషనుకు పోయి దర్శించివస్తున్నారు, అది మీరు ఒప్పు కొనెదరా?" అని అడిగిరి. నేను "ఒప్పుకొనను, మా కాంగ్రెసువారికి మీ జస్టిసుపార్టీవారికంటెకూడ బ్రిటిషు ప్రభుత్వోద్యోగులయిన సర్ సి. పి రామ స్వామి అయ్యరుగారు ఎక్కువదూరము" అని నేను చెప్పితిని. "నాకు తెలుసును, మీరు ఎప్పుడూ క్రమముగనే పనిచేస్తుంటారని. మీరు, నేను అనుద్యోగులము, చెరొకపార్టీతరపున నిలచినాము. ఒకప్పుడు మనము దేశ స్వాతంత్ర్యముకోసము కలసి పనిచేయవలసిన కాలము వచ్చును; ప్రస్తు తముమాత్రమే ఈ అభిప్రాయభేదములు; కొంతకాలము బ్రాహ్మణేతరు లకు ఉద్యోగములు న్యాయముగ లభించేవరకు మాత్రమే వుంటవి; అటు పిమ్మట మనమందరము కలసియే బ్రిటిషువాళ్ళతో పోట్లాడి, దేశస్వాతం త్ర్యమును సంపాదించవలసిఉంటుం" దని వారు నాతో చెప్పిరి. అంతట వారు క్రిందికిదిగి కారులోనెక్కిరి. నేను వారిని కారువరకుపంపి తాంబూలా దులు సమర్పించి సెలవుపుచ్చుకొంటిని. ఆ సాయంత్రము వారు బసచేసి యున్న బంగళాకు వారిదర్శనార్థమై వెళ్ళితిని, వారు నన్నెంతో ఆదరించి చాలాసేపు కూర్చోపెట్టి నన్ను త్వరగా పోనివ్వకుండ చేసిరి.

తానుకూడ దేశాభిమానినని, ఆంధ్రాభిమానినని రుజువుచేయుటకు యత్నించిరి. ఖద్దరుయందు తనకుకూడ అభిమానమున్నదని, ఆయుర్వేదమునందును తనకు అభిమానమున్నదని, ఆంధ్రరాష్ట్రమునకుకూడ ప్రయత్నముగావించెదనని చెప్పెను. అనేకసంగతులను గురించి బహు సరసముగ ఉభయులము మాట్లాడితిమి. ఇంతలో ఒకవిషయములో తాను వ్రాసి పంపబోవుచున్న యొక ఉత్తరమును నాకు చూపెను. దానిని ఆయన కలెక్టరు స్టూవర్టుగారికి పంపుచున్నాడు. స్టూవర్టుగారు రైలుస్టేషనువద్ద రామారాయణంగారిని కలవలేదు. సబుకలెక్టరు చంద్రన్‌గారు మాత్రమే రామారాయణంగారిని స్టేషనులోకలిసి ఆహ్వానించిరి. ఆ సాయంత్రము స్టూవర్టుగారు రామారాయణంగారిని కలిసుకొనగోరి ఎపుడు కలియవలెనో తెలుపవలసినదని కోరుచూ ఉత్తరమువ్రాసిరి. దానికి జవాబుగా రామారాయణంగారు "మిమ్ములనుచూచుటకు నాకు వ్యవధిలేదు" అని వ్రాసెను. ఆ ఉత్తరము నాకు రామారాయణంగారు చూపించెను. "చూడండి కాశేశ్వరరావుగారు, న్యాయానికి మీరు చైర్‌మనుగ, స్టూవర్టు కలెక్టరుగ వచ్చి స్టేషనులో నన్ను ఆహ్వానించవలసియున్నది. మీరు రాజకీయసిద్ధాంతములవల్ల రాలేకపోయినారు. కాని ఈ యూరోపియనులకు చాల పొగరుబోతుతనము: మన మంత్రులంటే వారిమీద అధికారములేనివాళ్లుగా నిర్లక్ష్యము. అందువల్ల నేనుకూడ యూరోపియనులకు గుణపాఠములు నేర్పుతున్నాను. నేను కృష్ణాజిల్లాకు వచ్చికూడ కృష్ణాజిల్లా కలెక్టరు స్టూవర్టుకు వ్యవధిలేదని వ్రాయుచున్నాను చూడండి!" అని నాతో చెప్పిరి. వ్యక్తిగా రామారాయణంగారు స్వతంత్రుడు. యూరోపియనులను లెక్కచేయనివాడు. సర్జను జనరలును నిర్లక్ష్యముచేసి ఆయుర్వేదపాఠశాలను స్థాపించినవాడు. తన డిపార్టుమెంటులనుంచి చాలమంది యూరోపియనులను తీసివేసి భారతీయులనే నియమించినవాడు. ఆయన 1927 సంవత్సరము డిశంబరువరకు ముఖ్యమంత్రిగా నుండెను. ఆ కాలమంతటిలో బెజవాడఅభివృద్ధికి నేను నిర్వర్తించుచున్నపనులలోను, ప్రవేశపెట్టుచున్న ప్రణాళికలలోను ఎంతయో తోడ్పడెను. ఆయన యుద్దేశ్యప్రకారము బెజవాడయే ఆంధ్రరాష్ట్రమునకు, ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు కూడ కార్యస్థానముగనుండవలెనని, అంధ్ర

వల్ల బెజవాడను శ్రేష్ఠమైన మునిసిపాలిటీగ చేయవలెనని నన్ను ప్రోత్స హించేవాడు. అటులచేయుటకు ప్రయత్నించుచున్నానని ఆయన సంతో షించేవాడు. ఒకసారి మద్రాసులోని కాస్మాపాలిటనుక్లబ్బులో నేను, వారు, ఇతర మిత్రులు కలిసినపుడు నేను చైర్మనుగ ఆదర్శప్రాయముగ పని చేయుచున్నానని ఆయన వారితో చెప్పెను. ఆ కాలమున మా మునిసిపాలిటీకి వారుచేసినసహాయమునుగురించి, ఒకప్పుడు వారిపార్టీతో నాకు చైర్మనుగ కలిగిన పోట్లాటలనుగురించి కూడ మున్ముందు తెలిపెదను. రామారాయణం గారు చెన్నపట్టణము వెళ్ళి మా బెజవాడ తుపానుబాధితులకు ఎనిమిదివేల రూప్యములను ప్రభుత్వముచేత మంజూరుచేయించెను. అంతేకాకుండ సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ (Servants of India Society) వారు మూడువేలరూప్యములను మంజూరుచేసిరి. మేము పదివేలరూప్యము లను మునిసిపాలిటీపక్షమున ఖర్చుపెట్టితిమి. ప్రజలనుండి ఇంకొక అయిదు వేలరూప్యములు వసూలయ్యేను. మొత్తము 26 వేల రూప్యములతో నిరు పేదలకు కొన్నిరోజులు భోజనముపెట్టించి, కూలిపోయి నష్టపడిన ప్రతి యింటికి దూలములు, వెదుళ్లు, బొంగులు, తాటాకులు సహాయముచేయగలిగి తిమి. ఈ పని పూర్తిగ ప్రముఖ కాంగ్రెసువాదియు. మా మునిసిపలు సభ్యులు నగు అద్దేపల్లి రామశేషయ్యశ్రేష్టిగారిమీద పెట్టితిని ఆయన ఈ పనిని అతిశ్రద్ధగా చేసెను. పేదలు మునిసిపలుఆఫీసుకు వచ్చి దూలములు, వెదుళ్లు మొదలైనవి తీసుకొనిపోయిరి. ఇటుల మూడునాలుగునెలలవరకు ఈ సహాయ కార్యక్రమము సాగినది. ఆ తుపానువల్ల చాలవరకు రోడ్లు, మురుగుకాలువలు పాడైనవి. వాటిని చాల సొమ్ము ఖర్చుపెట్టి బాగుచేయించి నాము. పాకీవాళ్లు, హరిజనులు కాపురముండే వించిపేటలో చాల క్రొత్త రోడ్లు వేయించినాము. ప్రజలకు మేము చేసినపని తృప్తిని కలిగించినది.

(2)

నేను మునిసిపలుచైర్మనుగా నున్నపుడు కమీషనరులు లేరని, సర్వాధికారములు మునిసిపలుచైర్మనులకే కలవని చెప్పియున్నాను. అందువల్ల బెజవాడమునిసిపాలిటీపరిపాలనను సక్రమముగా నుండునట్లును ప్రజల కెక్కువసౌకర్యములు కలుగచేయునట్లును నడుపుభారమును వహిం

చితిని. నేను మునిసిపలుచైర్మనుపదవిని స్వీకరించగనే మునిసిపలుఉద్యోగస్తులనందరిని పిలిపించినాను, "నాకు నియోగి వైదీకి, బ్రాహ్మణ బ్రాహ్మణేతర, హిందూ ముసల్మాను భేదములు లేవు. మాతో ఎన్నికలలో పోటీచేసినవారిబంధువులు వారికాలములో ఉద్యోగములలో ప్రవేశించినవారు గలరు. నేను ఇంతటినుంచి నా యిష్టమువచ్చినవారి కుద్యోగముల నిచ్చేదను. ఈ ఉభయవర్గములలో నే నెట్టిభేదము పక్షపాతముచూపను. లంచము లేకుండ శ్రద్ధగా పనిచేసినవారికి ప్రోత్సాహము, చెడుగాపనిచేసినవారికి శిక్ష నావల్ల కలుగుతుంది; ఏ చైర్మను వచ్చినను ఆయనకు విధేయతతో పనిచేయడం అందరు నేర్చుకొని న్యాయముగా పనిచేయవలెను. మునిసిపలుఎన్నికలలో ఎవరును జోక్యముకలుగచేసుకొనకూడదు." అని చెప్పినాను. పెద్దఉద్యోగస్థులనైనను చిన్నఉద్యోగస్థులనైనను క్రమశిక్షణతోను, జాగులేకుండగను తమపనులను నిర్వర్తించునట్లుచేయుచుంటిని. తప్పుచేసిన, అశ్రద్ధచేసిన ఉద్యోగస్థులను శిక్షించుచుంటిని. నాకు వెనుక బలముగ మునిసిపలుకౌన్సిలుండెను. నేను న్యాయముగనే ప్రతిపని చేసితినని తలచి వారు నాతో నెల్లప్పుడును ఏకీభవించుచుండిరి. మాకందరికి వెనుక బలముగ మాయందు విశ్వాసముగల పురప్రజ లుండిరి. నేను ప్లీడరీని 1921 లోనే వదలిపెట్టినవాడనగుటచే నా యావత్కాలము మునిసిపలుకార్యనిర్వహణకును, కాంగ్రెసుపని నిమిత్తమును వినియోగించుచుంటిని, కాని నేను చైర్మనుగానున్న అయిదుసంవత్సరములలో మూడున్నరసంవత్సరములు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీకి ప్రధానకార్యదర్శిగా కూడా నుంటిని. ఆఫీసు నావద్ద బెజవాడలో నుండెను. మిగిలినకాలములో ఆరునెలలు బులుసు సాంబమూర్తిగా రధ్యక్షులుగను, మండపాక రంగయ్యనాయుడుగారు ప్రధానకార్యదర్శిగను ఉండిరి. పిమ్మట ఒక సంవత్సరము కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగా రధ్యక్షులుగను, గద్దె రంగయ్యనాయుడుగారు ప్రధానకార్యదర్శిగను ఉండిరి. నేను ప్రధానకార్యదర్శిగానున్న కాలములో కాంగ్రెసుపనిమీద ఇతరచోట్లకు వెళ్ళవలసియుండెను. అంతేగాక కాంగ్రెసు మహాసభలకు, అఖిలభారత కాంగ్రెసుసమావేశములకు పోవుచుంటిని. 1936లో మేనెలనుండి నవంబరువరకు చాలదినములు నేను శాసన

సభ ఎన్నికల ప్రచారమునకై కృష్ణాజిల్లాయంతయు తిరగవలసివచ్చెను. ఆ పిమ్మట 1926 డిసెంబరు నుంచి 1929 ఆఖరువరకు శాసనసభకు పోయి కొన్నిరోజులు మద్రాసులో శాసనసభపనిమీద యుండవలసివచ్చెను. మిగతా దినములలోనే బెజవాడలో నుంటిని. ఆ ప్రకారము నేను బెజవాడలోనున్న ప్రతిదినము ఉదయమున నా మోటారుకారులో బస్తీయంతయు తిరిగి. మునిసిపలుపనులు సక్రమముగ జరుగుచున్నది, లేనిది పరిశీలించి వచ్చు చుంటిని. మరల సాయంత్రము నాలుగునుంచి ఆరున్నరగంటలవరకు మునిసిపలుఆఫీసులోనే కచ్చేరిచేయుచు ప్రజలఅర్జీలను విచారించి వారికి సౌకర్యములుచేయ యత్నించుచుంటిని. కొన్నిరోజులలో మధ్యాహ్నం ఒంటి గంటనుంచే మ్యునిసిపలుఆఫీసుకు వచ్చి పనిచేయుచుంటిని. ఏ అర్జీకూడ జవాబులేకుండ మూడురోజులకంటె నెక్కువకాలము మ్యునిసిపలుఆఫీసులో నిలువయుండకూడదని ఉత్తరువుచేసి, ఆ ప్రకారము అమలుజరుపుచుంటిని. మ్యునిసిపలుకౌన్సిలుకు అధ్యక్షతవహించి తీర్మానములనన్నింటిని నేనే స్వయముగ తెనుగులో వ్రాసితిని. మునిసిపలుసభాకార్యక్రమమంతయు తెలుగులోనే సభ్యులకందరికిని పంపుచుంటిని. ప్రజలతో మాకు జరిగే ఉత్తరప్రత్యుత్తరములు, అర్జీలు, వాటిమీద ఉత్తరువులు అన్నీ తెలుగులోనే జరిపితిమి. జిల్లాకలెక్టరుకు, గవర్నమెంటుకు పోయే కాగితములుమాత్రము ఇంగ్లీషులోనే పోవలసివచ్చెను. నేనే స్వయముగ వాటినిచూచి పంపించు చుంటిని. మ్యునిసిపలుమేనేజరు కాక, రోడ్లు, కట్టడములు, నీటివసతి మొద లైనవాటిని అజ్మాయిషీచేయుట కొరకు సూపర్వైజరుండెను. అపుడున్న సూపర్వైజరు చాలా సోమరిపోతుగ నుండెను. నాకు వెనుక చైర్మనుగ నున్న రామచంద్రరావుగారిహయాములో చైర్మనుగారు వేసిన ఉత్తరువు లను అమలుజరుపుటలో ఆయన చాల కాలహరణము, అశ్రద్ధ చేసెనని నాకు స్వయముగ తెలియును. అందువల్ల నేను చైర్మనుకాగానే ఇంజ నీరింగుసంబంధమైన శాఖలనన్నిటిని విడదీసి ఆయన కొరకు శాఖను స్వయ ముగ నిర్వర్తించవలెనని ఇచ్చి, అన్నిటిమీద నేనే అజ్మాయిషీ పెట్టుకొంటిని. మేము అపుడు విద్యుచ్ఛక్తిభవనములను నిర్మించుచుంటిమి. నీటిసప్లయికి కొండమీద ఒక రిజర్వాయరును నిర్మించుచుంటిమి. ఈ రెంటిని ఆయన

స్వయముగ నిర్మాణముచేయించునట్లు ఉత్తరువుచేసితిని. ఒకరోజున ఉదయము 8 గంటలకు నేను విద్యుచ్ఛక్తిభవనమువద్దకు చూచుటకు వచ్చెదనని చెప్పితిని. ఆయనను అక్కడ వచ్చియుండమని ఉత్తర్వుచేసినాను. నేను 8 గంటలకు సకాలమునకు వెళ్లగా ఆయన గం. 8-30 లకు వచ్చెను. అందుమీద నేను ఆయనకు పదిహేనురూప్యములజరిమానా విధించితిని. ఆయనడ్రాయరులోనున్న కాగితములనన్నిటిని లాగి పరీక్షించితిని. కొన్ని ఆరునెలలు, కొన్ని మూడు నాలుగు నెలలు ఆవిధముగ నెలలకొద్ది ఆయన వద్దనుంచి జవాబులుపోకుండ నిలువయుండెను. దానిమీద ఆయనను సంజాయిషీ అడిగి పదిహేనుదినములు సస్పెండుచేసితిని. ఇటుల నొక పెద్దఆఫీసరుకు చురుకునంటించగ, క్రిందిఉద్యోగస్థులందరును భయపడిరి. నేను ప్రతిదీ స్వయముగ కనుక్కొనెదనని, తప్పుచేసినచో తక్షణమే శిక్షించెదనని భయముకలిగినందున అందరును జాగ్రత్తగా పనిచేయసాగిరి. అటులనే బస్తీలోని బజారులకు పోయి అపరిశుభ్రముగానున్నయెడల శానిటరీఇన్స్పెక్టర్లకు జరిమానావేసితిని. వారు జాగ్రత్తగ పనిచేయించిరి. నేను స్వయముగ అన్ని కాగితములను చూచి ఉత్తరువులువేయుటవలనను, మూడుదినములలోనే పీలైనంతవరకు ప్రజలకు జవాబులు పోవుటవలనను, ప్రజలు వచ్చి ప్రతివిషయము నాతో స్వయముగ చెప్పుకొనుటకు అవకాశముండుటవలనను, నాకాలములో లంచగొండితనము దాదాపుగ లేకుండపోయినదని అందరును భావించిరి. బస్తీలో జరుగుచున్న రోడ్లనిర్మాణముల, కట్టడముల పని నేను స్వయముగ దాదాపు ప్రతిరోజు చూచుటవలన కంట్రాక్టర్లు, ఇంజనీర్లు జాగ్రత్తగను, త్వొందరగను పనులను చేయించిరి.

నేను మునిసిపాలిటీలో మా కౌన్సిలర్లనందరిని సోదరులవలె చూచి శ్రద్ధగ పనిచేయుటకు విశేషమైన ప్రోత్సాహమిచ్చుచుంటిని. ప్రజలకు మనము సేవ చేయవలెననేభావము వారిలోకూడ ప్రబలినది. కొంత కొంత తనికీపని వారికికూడ పంచిపెట్టితిని. మా వైసుచైర్మనుగారికి రెండుశాఖలు వప్పగింతచేసితిని. అల్పసంఖ్యాకులకు కూడ మాయందు విశ్వాసముకలిగినది. ఉద్యోగములిచ్చుటలో అన్నిసంఘములకు పీలైనంతవరకు సహాయముచేసితిమి. ఒకసారి పాతబస్తీలోని నగరాలకును, ముసల్మానులకును

కలతలు వచ్చినవి. మొదట నీటికుళాయిలవద్ద ప్రారంభమైన తగువు కొన్ని గంటలలో యిండ్లవరకు వ్యాపించినది. దెబ్బలాటలు సాగుచున్నవని తెలియగనే నేను ఆ ప్రాంతమునకు పోయి ఆ తగవులు నివారించితిని. నగరాలు కొంచె మెక్కువ బలవంతులుగ కనపడిరి. ముసల్మానుల ప్రాంతమునకు పోయి వారికి రక్షణనిచ్చెదనని హామీనిచ్చితిని. వారు నాయందు విశ్వాసముంచి దెబ్బలాటలు మానివేసిరి. నగరాలవద్దకువెళ్లి కోపపడితిని. ముసల్మానులకు బుద్ధిచెప్పకుండ మీ రెందుకు అడ్డమువచ్చి నారని వారు గొణుగుకొనిరి. 'హిందూ ముసల్మానులలో తగవులు మన బస్తీలో నెప్పుడూ రాకూడదు; ముసల్మానులు తప్పుచేసినచో నాతో చెప్పండి, నేను తగవులనణచుటయు, తప్పుచేసినవారిని శిక్షించుటయు జరిపెదను' అని చెప్పగా వారు దెబ్బలాటలు మానిరి. ఆవిధముగ నేను ఆ ప్రాంతములకు వెళ్ళినపుడు ఆ పేటలకుచెందిన హిందూ ముసల్మాను కౌన్సిలరులను నాతోకూడ తీసుకొనిపోతిని. మరియొకప్పుడు నేను కొండ పల్లిలో రాజకీయోపన్యాసమిచ్చి బెజవాడకు రాగానే సబుకలెక్టరు 'ఆసాయంత్రము నగరాలవీధినుంచి హిందూదేవునిఉత్సవము బయలుదేరు ననియు, బుద్ధిపూర్వకముగ ముసల్మానులను అవమానపరచవలెనని ఉత్స వమునడిచేత్రోవలో మసీదులవద్ద హిందువులు మేళములు వాయించబోవు చున్నారనియు, ఈసంగతి తెలిసి ముసల్మానులు కర్రలతోను, రాళ్ళతోను మసీదులలో గుంపులుగా చేరియున్నారని తనకు తెలిసినదనియు, నన్ను జోక్యముపుచ్చుకొని ప్రమాదమురాకుండ కాపాడవలసినదనియు నాకు ఫోనులో చెప్పిరి. సబుకలెక్టరు చంద్రన్‌గారికి నామీద చాల విశ్వా సము. అన్నిమతముల, వర్ణముల ప్రజలు నా మాటయందు గురియుంచు దురని వారికి తెలుసును. "నేను తగినఏర్పాట్లుచేసెదను. నేనే స్వయముగ ఆ ఉత్సవమును నడిపించెదను. హిదూ ముసల్మాను కౌన్సిలరులనంద రిని దగ్గరఉంచుకొని ఆ వీధులలో ఉత్సవమును సాగించెదను, మసీదుల దగ్గర హిందువులు మేళము వాయించకుండ ఆపెదను. ముస్లిములతో కూడచెప్పి కర్రలతో, రాళ్లతో దాగుకొనకుండ ఆపుచేసెదను. పోలీసు లను అనవసరమైన జోక్యముపుచ్చుకొనకుండ దూరదూరముగ మాత్రము

ఉండమనండి" అని వారికి బదులుచెప్పితిని. ఆవెంటనే ముసల్మానుకౌన్సిల రులను హిందూకౌన్సిలరులను, ముఖ్యముగా ఆ పేటలకుచెందిన కౌన్సిలరు లను పోగుచేసి హిందువులకు, ముసల్మానులకు సఖ్యత కుదిర్చితిని. మేమందరము స్వయముగ ఆ ఉత్సవముముందు నడచుచు మసీదులు ఇంకా కొన్ని గజములదూరమున నున్నవనగ మేళములు ఆపుచు, ఆ ఉత్సవమును బహు శాంతముగ నడిపించినాము. ముసల్మానులందరు చాల సంతోషించిరి. పిమ్మట వారిలో ప్రముఖులుకూడ ఆ ఉత్సవముతోకూడ వచ్చినారు.

ఒకసారి మునిసిపలుకౌన్సిలులో గోవులను మాంసముకొరకై చంప కూడదని నిషేధించుచు తీర్మానముచేసితిమి. పశువధశాలలలో గోవధపూర్తిగ నిషేధించితిమి. గాని, దాని నమలు జరుపుట ప్రారంభముకాగానే ముస్లిము నాయకులు నావద్దకు, మా కౌన్సిలువద్దకు వచ్చి అందుకు వ్యతిరేకతను గట్టిగా తెలిపిరి. గవర్నమెంటుకుకూడ అర్జీలనిచ్చిరి. అందుమీద గోవధనిషేధ తీర్మానము రద్దుపరచుకొంటిమి. మైనారిటీల అభిప్రాయమునకు వ్యతిరేక ముగ ఏ తీర్మానముకూడ వారిపైన నిర్బంధముగ రుద్దుట న్యాయముకాదని, వారిచేత ఒప్పించియే ఎప్పటికైన ఆ పని చేయించవలెనని నిశ్చయించి ఆ తీర్మానమును రద్దుచేయించితిని. గాని 1950 లో అమలులోకి వచ్చిన స్వతంత్ర-భారత రాజ్యాంగవిధానం 48 ఆర్టికిలులో గోవధనునిషేధించుటకు ప్రభుత్వమునకు అధికారము కలుగచేయబడినది.

(౩)

నేను మునిసిపలుచైర్మనుకాగానే మ్యునిసిపలుపాఠశాలలలో జాతీయ విద్యాపద్ధతులను ప్రవేశపెట్టవలెనని నిర్ణయించితిని. ఎలిమెంటరీ పాఠశాల లన్నిటిమీద అదివరకు మా జాతీయోన్నతపాఠశాలకు ప్రధానోపాధ్యాయులుగ నుండిన తాడేపల్లి వేణుగోపాలరావుగారిని సూపర్వైజరుగ నియమించితిని. ఎలిమెంటరీపాఠశాలల ఉపాధ్యాయులను, ఉపాధ్యాయినులను కలిపి యొక సంఘముగ నేర్పరచితిని. అపుడపుడు ఆ సంఘముయొక్క సభలు జరిగెను, ఎవరైన ప్రముఖులు వచ్చినపుడు ఆ సంఘసమావేశములో నుపన్యసించు చుండిరి. నేనుకూడ ఆ సంఘములో నుపన్యసించుచు "వారు శ్రద్ధవహించి విద్యార్థులకు దైవభక్తిని, నీతిని బోధించవలెనని, పాఠములు శ్రద్ధగ చెప్పవలె

నని అందరును ఖద్దరునే ధరించవలెనని దేశాభిమానముకలిగియుండవలె”నని బోధించుచుంటిని. “అస్పృశ్యతను పూర్తిగ రూపుమాపుటకై హరిజన వాడలలో పెట్టబడిన పాఠశాలలలో నుపాధ్యాయులుగ బ్రాహ్మణులను నియమించుచు, బ్రాహ్మణులు, వైశ్యులు నివసిస్తున్నవాడలలో పెట్టబడిన పాఠశాలలలో హరిజనులను నియమించుచువచ్చితిని. ప్రజ లెట్టి ఆక్షేపణచేయక మాతో సహకరించిరి. పాకీవిద్యార్థులకు, హరిజనవిద్యార్థులకు కొన్ని ప్రత్యేక బహుమతులనిచ్చి వారిని ప్రోత్సహించితిని. రెండవతరగతిమొదలు పై తరగతులన్నిటిలో రాట్నములను నెలకొల్పి విద్యార్థులచేత నూలు వడికించితిమి. రాట్నములపని నేర్పుటకు ఇద్దరుపాధ్యాయులను నియమించితిని. అపుడపుడు ఆ నూలును మహాత్మాగాంధీగారి సబర్మతీఆశ్రమమునకు పంపగా వారు మమ్ముని ప్రశంసించుచు తమ యంగ్ ఇండియా “Young India” పత్రికలో వ్రాసిరి. మిగతానూలును మేము బట్టలు నేయించి మునిసిపలు అవసరములకు వాడుకొంటిమి. మునిసిపలు ఉద్యోగస్థులందరును, హైస్కూలుఉపాధ్యాయులుకూడ ఖద్దరును ధరించవలెనని వారికి బోధించుచుంటిమి. ప్రతిరోజు పాఠశాలలన్నిటిలో ప్రారంభమున దైవభక్తికీర్తనలను, జాతీయగీతములను పాడించితిని. నేనే స్వయముగ దైవభక్తిని,దేశభక్తిని,మత,సంఘసామరస్యమును, ఐకమత్యమును బోధించు కీర్తనలను పోగుచేసి ఒక పుస్తకముగ అచ్చువేయించి, వాటిని ఉపాధ్యాయులకును, విద్యార్థులకును పంచిపెట్టితిని. వాటిలోనుంచే వారు పాఠశాలలు ప్రారంభించేముందు కీర్తనలను పాడిరి. ఏదైన గొప్ప సభలుగాని యుత్సవములుగాని జరిగినపుడు నేను మా మునిసిపలుఆఫీసుమీద జాతీయజెండా నెత్తి, పని అయిపోవుటతోడనే దింపించితిని. ప్రభుత్వోద్యోగస్థులు దానితో జోక్యము పుచ్చుకొనక యూరుకుండిరి.

మునిసిపలు ఎలిమెంటరీపాఠశాలలలో ౫వ తరగతినుంచి ౮వ తరగతివరకు, అటులనే మా హైస్కూలులో ఒకటవఫారమునుంచి మూడవ ఫారమువరకు, హిందీభాషను నిర్బంధముగ నేర్పించితిని. హిందీని పఠనీయభాషగా మా పాఠశాలలలో పెట్టుట అప్పటి రాష్ట్రవిద్యాశాఖాధికారిగా నున్న యూహోఫియనుకు చాల అయిష్టముగ నుండెను. విద్యాశాఖకార్యదర్శి

కూడ యూరోపియనే. వారిద్దరుకలిసి నేను మా పాఠశాలలలో హిందీని ప్రవేశపెట్టకూడదని అప్పుడు విద్యామంత్రిగానున్న సర్ ఎ. పి. పాత్రోగారి చేత ఉత్తరువును జారీచేయించిరి. నేను హిందీని 1925 జూన్‌నుంచి ప్రవేశపెట్టితిని. 1926 ఫిబ్రవరినెలలో హిందీని తీసివేయవలసినదని, అట్లుల తీసివేయనిచో హిందీమాస్టరులకయ్యే ఖర్చంతయు నేనే భరించవలసియుంటుందని నాకు గవర్నమెంటునుంచి ఉత్తరువు వచ్చినది. నేను దానిని లక్ష్యపెట్టలేదు. ఆ ఖర్చంతయు నేనే భరించుటకు సిద్ధపడితిని. అనగా ప్రజలు నేను కోరగనే ఆ సొమ్మును నా కిచ్చెదరని, దానిని నేను మునిసిపాలిటీకి జమకట్టగలనని నాకు విశ్వాసముండెను. అందువల్ల నే నా ఉత్తరువును లక్ష్యపెట్టలేదు. మరల మామూలుగనే 1926 జూన్ నెలలో పాఠశాలలలో హిందీ ప్రారంభించితిని. తరువాత నాకు మరియొక ఉత్తరువు వచ్చెను. హిందీని పాఠశాలలలో నేను నేర్పించి నట్లయిన యావత్తువిద్యాబడ్జెటుసొమ్మును నావద్ద వసూలుచేసెదమని ప్రభుత్వమువారు నాకు తెలిపిరి. అది గొప్ప మొత్తమే. ఇంతలో 1926 నవంబరు నెలలో శాసనసభకు ఎన్నికలు జరిగెను. అందులో జస్టిసుపార్టీవారు ఏవిధముగ హిందీకి వ్యతిరేకముగనున్నారో ప్రజలతోచెప్పి వారికి వ్యతిరేకప్రచారము చేసితిని; ఆ ఎన్నికలలో జస్టిసుపార్టీవారు ఓడిపోవుట తటస్థించెను. 1926 డిశంబరులోనే జస్టిసుపార్టీప్రభుత్వముపోయి డాక్టరు సుబ్బరాయన్‌గారి జాతీయప్రభుత్వము వచ్చినది. సుబ్బరాయన్‌ప్రభుత్వము కొంతకాలము కాంగ్రెసుకు అనుకూలముగనుండెను. అందువల్ల నేను అప్పటి ముఖ్యమంత్రి విద్యామంత్రియైన డాక్టర్ సుబ్బరాయన్‌గారితో మాట్లాడి హిందీని మా పాఠశాలలలో నేర్పవచ్చునని ఒక ఉత్తరువును తెప్పించుకొంటిని. తరువాత 1927 మొదలు 1930 లో నేను జైలుకువెళ్లేవరకు మా మ్యునిసిపల్ పాఠశాలలలో హిందీని నిరాటంకముగ నేర్పినాము. మమ్ములను ప్రభుత్వము అడ్డుపెట్టలేదు. అదివరకు జస్టిసుపార్టీప్రభుత్వహయాంలో హిందీని నేర్పించి నందుకు నామీద చేయబడిన సర్చార్జిని సుబ్బరాయన్ ప్రభుత్వమువారు రద్దుపరచినారు. నావద్ద సొమ్మేమియు వసూలుచేయలేదు.

మా మునిసిపలుహైస్కూలులోను ఎలిమెంటరీపాఠశాలలలోను విద్యార్థులకు ఏటేట నిర్ణయించే పాఠ్యగ్రంథములకు పుస్తకవిక్రేతలు దరఖాస్తులు పెట్టుకొనగా వారుపంపిన అన్నిపుస్తకములను నేను స్వయముగ చదివి అందులో బ్రిటిషుప్రభుత్వమువలన లాభములనుగురించి వ్రాసినట్టి, బ్రిటిషు చక్రవర్తులను పొగడినట్టి, రాజభక్తిని బోధించినట్టి పుస్తకములను పూర్తిగ నిషేధించి, మిగిలినవాటిలో వీలయినంత జాతీయతత్వమును, ప్రాచీన దేశ గౌరవమునుగూర్చి చెప్పిన పాఠములుగలవానినే వీరి పాఠ్యగ్రంథములుగ పెట్టేవాణ్ణి. ముఖ్యముగ ఈపద్ధతి తెలుగు, ఇంగ్లీషు భాషావాచకములకును హిందూదేశచరిత్రగ్రంథములకును వర్తించెను.

బస్తీ అభివృద్ధికొరకు, ప్రజలసౌకర్యములకొరకు ముఖ్యమైన నిర్మాణకార్యములను చేయవలెనని నేను, మా కౌన్సిలువారు నిర్ణయించితిమి. మొదటిది బెజవాడలో విద్యుద్దీపములను పెట్టించవలెనని సంకల్పించితిమి. విద్యుచ్ఛక్తి నిర్మాణము క్రాంప్టన్ (crompton) మొదలైన వర్తకసంస్థల కిచ్చుటకు నాకిష్టములేదు. విద్యుచ్ఛక్తి మొదలైనవి (Nationalisation) జాతీయపరంగా నిర్మాణముకావలెననియే ప్రథమమునుంచి నా ఉద్దేశ్యము. నేనదివరకే సోషలిజమునుగురించి చదివి, దానిపట్ల సానుభూతి కలిగియుంటిని. అందువల్ల ప్రభుత్వముయొక్క రాష్ట్ర విద్యుచ్ఛక్తియుద్యోగస్తుని పిలిపించి బెజవాడ బస్తీయంతయు నేను, ఆయన కలిసి తనిఖీచేసి మునిసిపాలిటీయే ప్రభుత్వమువద్దనుంచి ఋణముచేసి విద్యుచ్ఛక్తినిర్మాణము గావించినచో మునిసిపాలిటీకి లాభమువచ్చునని యొక రిపోర్టు పంపితిమి. అందుకు అయిదులక్షలరూపాయలు కావలయును. ఇంకా కొంచె మెక్కువ పట్టినను పట్టవచ్చును. దానిని అప్పటి జస్టిసుపార్టీముఖ్యమంత్రిగా నున్న రామారాయణంగారు అంగీకరించి వెంటనే అయిదులక్షలరూపాయలను మంజూరుచేయుటయేగాక, మా బెజవాడమునిసిపాలిటీ కిప్పించిరి. తరువాత మరల సొమ్ము లభించుట కష్టమని వెంటనే మమ్ములను తీసుకొమని వారే పట్టుపట్టి అయిదు లక్షలరూపాయలను మా కిప్పించగా మేము దానిని బ్యాంకులోవేసుకొని విద్యుచ్ఛక్తినిర్మాణకార్యక్రమమును సాగించితిమి. దానికి ప్లానులు, ఎస్టిమేట్లు తయారుచేయుటకు నెలకు రు. 760 ల జీతముతో నొక బంగాళీ నిపు

ఋని తెప్పించి ఆయనచేత అన్నియు తయారుచేయించితిమి. మాకు కావల సిన యావత్తు ఇంజనులు మొదలైనవాటిని సప్లయిచేయవలసినదని కోరుతూ, టెండర్లు పంపించవలెనని వివిధ విద్యుచ్ఛక్తికంపెనీలను కోరితిమి. అనేక పెద్దపెద్ద కంపెనీలు యావత్తు భారతదేశమునుంచి టెండర్లు పంపినవి. మా కౌన్సిలుతరపున ఒక ఉపసంఘము వేసితిమి. వారందరు మిగుల గౌరవ నీయులు. లంచగొండితనం మా కాలమున మా కౌన్సిలులో జొరబడలేదు. నేను వచ్చిన ప్రతి టెండరును జాగ్రత్తగ చదివితిని. నేను ఇంజనీరును కాకపోయినప్పటికిని వివిధకంపెనీలఇంజనీరులు నాకు యావత్తు తబిసీళ్ళను వివరించిరి. అందువలన ఏ కంపెనీయొక్క ఏ ఏ సామానులు బాగు న్నవో నాకు గోచరమయ్యెను. ఏవి సరసమైనధరలకు దొరకునో కూడ గోచరమయ్యెను. మా మేడమీదనే మా ఉపసంఘము సమావేశ మైనది. నేను టెండర్లను చదివి నేర్చుకున్నదంతయు వారికి విశదపర్చితిని. పైగా వివిధ ఇంజనీరులు వచ్చి మాకు యావత్తూ బోధచేయడం జరిగినది. మాకు ముఖ్యముగా కనపడిన దేమనగా ఇంగ్లీషు కంపెనీలకంటె యూరపుఖండములోని వివిధదేశములకంపెనీలే సరస మైనధరలకు మంచిసరకును యిచ్చునని. అందువల్ల మద్రాసుప్రభుత్వ విద్యుచ్ఛక్తి ఇంజనీరు ఇంగ్లండుసామానులకే నమూనాలనువ్రాసి పంపినను, దానిని త్రోసివైచి వీలైనంతవరకు ఇతరదేశముల సామానులనే మేము కొనుటకు నిర్ణయించుకొని, జర్మనీ, ఇటలీ, స్విట్జర్లండు, జెకోస్లొవేకియా సరకులనే మేము కొన్నాము. ఆ ఇంజనులను, ఆ సరకులను తెప్పించు కొన్నాము. అతి స్వల్పముగమాత్రమే ఇంగ్లీషుసామాను కలిసినది. ఇంజ నులు వగైరాలను మా ఇంజనీర్లు నిర్మాణముగావించినారు. కొంతవరకు ఆ సరకులనమ్మిన కంపెనీల ఇంజనీరులుకూడ మాకు తోడ్పడిరి. తీగెలు, స్థంభములు, బల్బులు మొదలయినవన్నీ అమెరికాకంపెనీవద్ద కొన్నాము. చారి అండ్ చారి గార్లు వాటిని వేసినారు. ఈవిధముగ బెజవాడ విద్యుచ్ఛక్తి నిర్మాణము జరిగినది. మావలెనే కాకినాడ మ్యునిసిపాలిటీవారుకూడ లక్క రాజు సుబ్బారావుగారి యాజమాన్యమున ప్రభుత్వమునుండి ఋణముతీసుకొని విద్యుచ్ఛక్తినిర్మాణము గావించుకొనిరి. పిమ్మట తక్కిన మ్యునిసిపలుసంఘ

ములన్నియు చాలవరకు ప్రభుత్వరుణములనుతీసుకొని విద్యుచ్ఛక్తినిర్మాణము గావించినారు. కొన్నిమాత్రము ముఖ్యముగా రాజమహేంద్రవరము, గుంటూరు మునిసిపాలిటీలు తమ విద్యుచ్ఛక్తినిర్మాణమును ప్రయివేటు విద్యుచ్ఛక్తిసంస్థలకు యిచ్చినవి. వాటివల్ల తరువాతకాలమున కొన్నితగవులు కూడ కలిగినవి. మా విద్యుచ్ఛక్తి ప్రకాశమానముగ, జయప్రదముగ సాగినది. మునిసిపాలిటీకి ఏటేటా లాభమువచ్చుచుండెను. మా మునిసిపాలిటీకి విద్యుచ్ఛక్తికి కావలసిన సొమ్ము యావత్తు ముందుగనే రామారాయణంగారు మాకు రుణముగ పంపినందున,ఆంగ్లేయుడైన ప్రభుత్వ విద్యుచ్ఛక్తి ఇంజనీరుసలహాలను మన్నించక (none British) బ్రిటిషేతరసరకులను కొని నిర్మాణముచేసియున్నాము. ఆ యుద్యోగి సలహా, దర ఎక్కువైనను అన్నియు ఆంగ్లేయకంపెనీలవద్ద ఆంగ్లేయసరకులనే క్రయము చేయవలెనని యైయుండెను మే మితని ఆయనమాటలను సరకుచేయక ప్రవర్తించినందున ఏ మ్యునిసిపాలిటీవారికిని ఇకముందు ప్లానులు, ఎస్టిమేటులు తయారై, ఏ సరుకులు ఎక్కడ తెప్పించవలెనో దానినంతను ప్రభుత్వ విద్యుచ్ఛక్తి ఇంజనీరు అంగీకరించి యుత్తరువుచేసినపిమ్మటనే రుణము మంజూరుచేసి సొమ్ము నివ్వవలెనని డాక్టరు సుబ్బరాయనుమంత్రివర్గకాలములోనే యొకనూతన జి.ఓ. పుట్టెను.అంతటినుంచి నిరాటంకముగా బ్రిటిషుసరుకులే మునిసిపాలిటీలచే పూర్తిగ కొనబడెను. ద్వంద్వప్రభుత్వములో మంత్రి సుబ్బరాయన్ నిస్సహాయుడు. మా కాంగ్రెసు మునిసిపలు ఉపసంఘపు రాజనీతి వీలయినంతవరకు బ్రిటిషుసరుకులను బహిష్కరించుట. బ్రిటిషుప్రభుత్వముయొక్క పునాదిసిద్ధాంతము బ్రిటిషుసరకులను భారతీయులపై అంటగట్టుట. కొన్నిసంవత్సరములకు పిమ్మట మా విద్యుచ్ఛక్తినిర్మాణమునంతను మదరాసుప్రభుత్వమువారే తీసుకొన్నారు. దానిని రాష్ట్రవిద్యుచ్ఛక్తినిర్మాణములలో భాగముగ చేసుకొన్నారు. ప్రభుత్వమువారే మా మునిసిపాలిటీకి మొత్తముగ విద్యుచ్ఛక్తి నమ్ముటయు, దానిని కొంచెము లాభముతో మునిసిపలుకౌన్సిలువారు బజారుదీపములకు, గృహములలోని, దుకాణములలోని దీపములకు, పెద్ద చిన్నపరిశ్రమలకు పంచిపెట్టుచుండుటయు జరుగుచున్నది.

## (4)

అదివరకు 1913 లో తాడంకి వెంకటనరసయ్యగారు మునిసిపల్ చైర్మనుగా నుండగా షుమారు 50 వేలమందిజనమునకు సరిపోయే నీటి వసతుల నిర్మాణముగావించినారు. బస్తీలో నీటికుళాయిలు ఏర్పడినవి, కాని అవి చాలవు. బస్తీ చాలా పెరిగినది. ఇంకా పెరుగుచున్నది. అందువల్ల కొత్తగా బావులుత్రవ్వించి ఇంజనులతో నీరుతోడించి గొట్టములుపెట్టి కుళాయిలను వృద్ధిచేసి నీటిసప్లయి ఎక్కువగా చేయవలెనని నేను, మా కౌన్సిలు నిశ్చయించుకున్నాము. అందువిషయమై ప్రభుత్వముతో ఉత్తరప్రత్యుత్తరములు జరిపినాము. సగము వారు విరాళముగ నిచ్చునట్లును, మిగిలినది మేము పెట్టుకొనునట్లును ఏర్పాటుచేసుకొన్నాము. కొత్తగా బావులు త్రవ్వించినాము. నూతన డీసిలుఇంజన్లుపెట్టి తోడించి నీటివనరును వృద్ధిచేసినాము. గాని విద్యుచ్ఛక్తితోనడిపే ఇంజన్లుకూడ పెట్టుటకు ప్లానులువేసినాము. పాతబస్తీలోని ఎత్తైన ప్రాంతములలో నీటిసప్లయికూడ కష్టముగనుండెను. అందువలన కొండమీద ఎత్తుగా మరియొక నీటిరిజర్వాయరును కట్టించినాను. అది నేను చైర్మనుగనుండగనే పూర్తియైనది. మహాత్మాగాంధీగారు 1929 లో బెజవాడ విచ్చేసినపుడు వారిచేత దానిని తెరిపించినాము. ఇదివరకున్న రిజర్వాయరులోనుంచి నీటిని తక్కువప్రాంతములకు సప్లయిచేయుటవల్ల ఇంకా ఎక్కువప్రాంతములకు సప్లయిచేయుటకు వీలుకలిగినది. మా కాలములో కుళాయిలు కొత్తచోట్ల చాల వేయించినాము. ముఖ్యముగా 1921 లో అఖిల భారత కాంగ్రెసుకమిటీ సమావేశమైనపుడు రెండులక్షలజనము సమకూడిన గాంధీమైదానములో, అప్పటినుంచి గాంధీనగరమను పేట నిర్మాణమై వృద్ధిచెందినది. నేను చైర్మనుగనుండగా దానిఅభివృద్ధికి ప్రత్యేకశ్రద్ధ వహించితిని. దానిలో మంచిరోడ్లు వేయించడం, విద్యుద్దీపములు పెట్టించడం, నీటికుళాయిలు పెట్టించడం ఈ పనులన్నీ నా కాలములో బాగుగా జరిగినవి. బావులలోనుంచి నీళ్ళుతోడుటకు విద్యుచ్ఛక్తిచే నడపబడు ఇంజనులను ఉపయోగించితే ఎక్కువ లాభకరముగా, తేలికగ పని జరుగుతుంది. అందువల్ల నే నదివరకు తయారుచేసిపెట్టిన విద్యుచ్ఛక్తితో

నడిపే నీటివసతిఅభివృద్ధిప్రణాళికలను మావిద్యుచ్ఛక్తినిర్మాణమయినపిమ్మ టనే పూర్తిచేసినారు. అందువల్ల నేను వాటినన్నిటిని తయారుచేసి సిద్ధపరచి నప్పటికి, నా తరువాతవచ్చిన స్పెషల్ఆఫీసరు భాగవతుల ఆదిశేషయ్య గారికాలములో విద్యుచ్ఛక్తిఇంజనులుపెట్టి కార్యము పూర్తియైనది. విద్యుచ్ఛక్తినిర్మాణము పూర్తియై బస్తీలోకి దీపములువచ్చుట 1930 సం॥ ప్రారంభమున జరిగినది. నే నాపైన కొద్దినెలలకే జైలుకుపోయినాను.

ఇంకొకవిషయమైకూడ నేను చైర్మనుగనుండగా ప్రత్యేక శ్రద్ధ వహించితిని. అది మురుగుకాలవలపథకము. బెజవాడ పాతబస్తీ యొక విధముగను. రైలుస్టేషనుకు తూర్పుననున్న క్రొత్తబస్తీ మరియొకవిధము గను ఉన్నవి. అందువలన ముందుగా పాతబస్తీలో మురుగుకాలువల నిర్మా ణమును (**Drainage Scheme**) ప్రారంభింపచేసినాము. దానికి ప్లానులు, ఎస్టిమేట్లు తయారుచేయించినాము. అపుడు శానిటరీఇంజనీరు (**Sanitary Engineer**)గా నున్న (**Waster Dale**) వెస్టరుడేలుగారేమి, వారి తరు వాత వచ్చిన జి. వి. రావుగారేమి ప్రతివిషయములోను నా కెంతో తోడ్పడి నారు. ఆ మురుగుకాలువల నిర్మాణమునకయ్యే ఖర్చులో సగము ప్రభుత్వము విరాళముగ నిచ్చినది. తక్కినసగము మా మునిసిపాలిటీ భరించినది. దానిని ప్రభుత్వము మాకు అప్పుగానిచ్చినది. ప్లానులు, ఎస్టిమేట్లు తయారుచేయించు టకు తమవద్ద తగినసిబ్బంది లేదని శానిటరీఇంజనీరుగారు నాతో చెప్పగా, మా మునిసిపలుఇంజనీరైన హరీశ్వరరావుగారిని ఆరునెలలు మదరాసులో శానిటరీఇంజనీరుఆఫీసులో పనిచేయించి ఆ పథకమును తయారుచేయించి నాము. వాటినిర్మాణము గవర్నమెంటు పి. డబ్ల్యు. డి. కి యిచ్చినాము. వారు నిర్మాణము ప్రారంభించినపిమ్మటనే నేను జైలుకు పోయినాను. తరువాత ఆ పథకముయొక్క యావత్తునిర్మాణము పూర్తిఅయ్యేసరికి మూడు నాలుగు సంవత్సరములు పట్టినది. క్రొత్త బస్తీకి మురుగుకాలువలను నిర్మాణము చేయుటకు వలయు విచారణను ప్లానులను పూర్తిచేయుటకు పదివేల రూప్యములు ధరావతుచేయవలయునని ప్రభుత్వమువారు కోరగా ఆ ప్రకా రము నే నప్పుడే ధరావతుచేసినాను. నా తర్వాత వచ్చినవారు తగినంత శ్రద్ధతీసుకొనకపోబట్టి సంవత్సరముల కాలయాపన జరిగి 1957 సం॥

నుంచి కొత్తబస్తీ మురుగుకాలువలనిర్మాణము ప్రారంభమైనది. చీమ నడక నడచుచున్నది. 1947లో మద్రాసుప్రభుత్వమువారు రాజధానియంతట నీటిసప్లయి, మురుగుకాలువల పథకములనుగూర్చి విచారణజరిపి అవసర ములవెంట నిర్మాణకార్యక్రమవరుసను నిర్ణయించవలెనని నా అధ్యక్షతక్రింద నొక కమిటీని నియమించిరి. ఆ కమిటీ సభ్యులము ఏకగ్రీవముగ కొన్ని సిఫారసులనుచేసినాము. అందులో అరవజిల్లాలలో వేరుగను, ఆంధ్రదేశ ములో వేరుగను నిర్మాణకార్యక్రమవరుసను నిర్ణయించినాము. ఆంధ్రదేశము లోని మురుగుకాలువలపథకమునకు మొదటిస్థానము విజయవాడకు, రెండవ స్థానము ఏలూరుకు ఇచ్చినాము. మంచినీటివసతికి గుంటూరుకు మొదటి స్థానము, విశాఖపట్టణమునకు రెండవస్థానము నిచ్చినాము. అయినను వాటిని ప్రారంభించుట కింతకాలము పట్టినది.

బెజవాడ పాతబస్తీలో క్రైస్తవచర్చి ప్రక్కగానున్న ఖాళీస్థల మును గాంధీపార్కు అని పిలచుచు అందులోనే సహాయనిరాకరణ సభలను జరుపుకుంటూవచ్చినాము. 1920లోను, 1921లోను పెద్దపెద్ద సభ లక్కడే చేసినాము. దానికిచుట్టూ చిన్న గోడకట్టించి గేట్లుపెట్టి లోపల చెట్లు, మొక్కలువేసి ప్రజలు సాయంత్రం కూర్చొనడానికి, బహిరంగసభలకు దానిని నిజమైనపార్కుగా చేయుటయే బాగుం టుందని డాక్టరు రామచంద్రరావుగారి చైర్మనుకాలములోనే మునిసి పాలిటీవారు తలచి దానిని గాంధీపార్కుగా చేయుటకు ప్రారంభించి నారు. నేను వచ్చినతరువాత ఆ గాంధీపార్కును పూర్తిచేయుటయే గాక అందులో డాక్టర్ రామచంద్రరావుగారిపేరిట రామచంద్రగ్రంథాలయ మునుకూడ నెలకొల్పించినాను. అది ఇప్పుడు మంచి గ్రంథాలయముగ విలసిల్లుచున్నది. ఆ పార్కుమధ్య బహిరంగసభలకొరకు ఒక వేదికను నిర్మింపచేసినాము. దానిమీద పిమ్మట గాంధీవిగ్రహముకూడ నిర్మింప బడినది.

1925 మేనెలలో గొప్ప తుపాను వచ్చినదని నేను చెప్పియున్నాను. ఆ తుపానులో పాతబస్తీలోనున్న మునిసిపల్ రహదారిబంగళా శిథిలమై పోయినది. ముఖ్యమంత్రి రామారాయణంగారు బెజవాడవచ్చినపుడు దానిని

చూచినారు. ఆ చోట నొక పెద్దమార్కెట్టు కట్టుట బాగుంటుందని ఆయన, నేను తలచినాము. దానిని ఆనుకొనియున్న రెవెన్యూస్థలమును ఆ మార్కెట్టుకొరకు ఇప్పిస్తామని వారుచెప్పినారు. అందువల్ల నా రహదారీ బంగళాను మరమ్మత్తుచేయించకుండ యుంచి దానిని నేలమట్టముచేయించి ప్రక్కనున్న రెవెన్యూస్థలమును కలుపుకొని ఒక పెద్ద మార్కెట్టుకు ప్లానులు, ఎస్టిమేట్లు తయారుచేయించినాను. వాటిని శానిటరీ ఇంజనీరు జి. వి. రావుగారు చూచి అంగీకరించినారు. బెంగుళూరులోనున్న మార్కెట్టు పద్ధతిని ఆ మార్కెట్టుకు ప్లానులు, ఎస్టిమేటులు తయారుచేసినాము. దానికి రెండులక్షల ఏబదివేల రూపాయలు కావలసియుండెను. దానినికూడ యిచ్చుటకు ప్రభుత్వమంగీకరించినది. మరుసటిసంవత్సరము దానిని బడ్జెటులోచేర్చి ఇవ్వగలుగుదుమని వారు నాకు వ్రాసిరి. ఆ లోపలనే నేను మునిసిపాలిటీని వదలిపెట్టి జైలుకుపోయినాను. అందువలన ఆ మార్కెట్టుకు కావలసినసొమ్మును ప్రభుత్వమువద్దనుంచి తెచ్చుకొనడం, దానిని కంట్రాక్టరులకిచ్చి నిర్మించడం వగైరా జరుపుటకు కొన్నిసంవత్సరములు పట్టినది. 1940 లో మార్కెట్టు పూర్తియైనది. దానిని టంగుటూరి ప్రకాశం పంతులుగారు తెరచినారు. అపుడే మునిసిపలుకౌన్సిలువారు దానికి నా పేరు పెట్టుటకు ఏకగ్రీవముగ తీర్మానించి నా పేరుపెట్టినందున అది కాశేశ్వరరావు మార్కెట్టు అని పిలవబడుచున్నది. అప్పటికి పదిసంవత్సరములకు పూర్వమే నేను మునిసిపాలిటీతో సంబంధము వదలుకొనియున్నాను. అయినను 1940 లో మునిసిపలు కౌన్సిలువారు నే నేదో బెజవాడబస్తీకి సేవచేసినానని తలచి నాపేరు దానికి పెట్టినారు. ఆ మార్కెట్టుకు పునాదిరాయి 1938 లో స్థానికస్వపరిపాలనా మంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారిచేత వేయబడినది. ఆ దినముననే అప్పటి మునిసిపలుకౌన్సిలువారు నాకు 'ఫ్రీ సిటిజన్' (Free citizen) అను గౌరవబిరుదము నిచ్చినారు. ఆ గౌరవము పొందినవారు ఇంగ్లాండులో ఆ మునిసిపలుపన్నులేమీ చెల్లించనక్కరలేదు. గాని నాకు 'ఫ్రీ సిటిజన్'గౌరవమును కలుగచేసినపుడు రాజగోపాలాచార్యులుగారు ప్రధాన మంత్రిగాను, నేను ప్రధాన పార్లమెంటరీ కార్యదర్శిగను వుంటిమి. ఆ ఫ్రీ

సిటిజన్‌గౌరవమును మా ప్రభుత్వము ఖాయముచేసినది. గాని పన్నులను చెల్లించక తప్పదని ఉత్తర్వుచేసినది.

మునిసిపలురహదారిబంగళాను మరియొకచోట కట్టవలసివచ్చినది. అందుకుగాను పి. డబ్ల్యు. డి. వారితోను, ప్రభుత్వముతోను ఉత్తరప్రత్యుత్తరములు జరిపి గవర్నరుపేటలో బందరుకాలవయొడ్డుననున్న యొక స్థలమును సంపాదించితిని. ఆ బంగళానిర్మాణమునకు ప్లానులు, ఎస్టిమేటులు వేయించి మునిసిపాలిటీచేత సొమ్ము మంజూరుచేయించితిని. దానినిర్మాణము నాకాలములో ప్రారంభమైనను నేను జైలుకుపోయినపిమ్మటనే పూర్తియైనది. అది చక్కని రహదారిబంగళాగా వాడబడుచున్నది.

ఒకరోజున నేను భోజనముచేసి కూర్చొనగా మా యింటికి పి. డబ్ల్యు. డి. యుద్యోగస్తుడు నా మిత్రుడు నగు వేలమూరి గోపాలకృష్ణయ్యగారు వచ్చి బందరుకాలువమీద రామమోహనగ్రంథాలయమునకు సమీపమున నొక లాకును, రెగ్యులేటరును తమ డిపార్టుమెంటువారు నిర్మించబోవుచున్నారనియు, దానిమీద రోడ్డువంతెనకూడ నిర్మించినచో సగము ఖర్చుతో పని జరుగుననియు నాతో చెప్పిరి. నేను వెంటనే మునిసిపలుఆఫీసుకు పోయి మా యింజనీర్లతో విచారించి దానిని మునిసిపలుకౌన్సిలులో పెట్టుటకు నిశ్చయించితిని. పి. డబ్ల్యు. డి. వారితో నుత్తరప్రత్యుత్తరములు జరుపగా డెబ్బదియైదువేలరూప్యములతో నా రోడ్డువంతెన పూర్తియగునని వారు తెలిపినారు. ఆ విషయము మా కౌన్సిలులో పెట్టి సొమ్ము మంజూరుచేయించినాను. దానికి గవర్నమెంటుకు వ్రాయగా ఋణమిచ్చినది. దానితో కొలదికాలములోనే ఆ రోడ్డువంతెన నిర్మాణమైనది. గవర్నరుపేటప్రజలు తేలికగ కృష్ణానదికి స్నానముకొరకు, స్మశానముకొరకు, పోవుటకు వీలుకలిగినది. అచట కృష్ణలంకలో నొక పెద్దపేట పెరిగి మునిసిపలువార్డు అయినది. ఆ రోడ్డువంతెనమీదుగా బందరుకాలవప్రక్కనే తూర్పుగ నొక మంచిరోడ్డునువేసి అటు విద్యుచ్ఛక్తికట్టడములకు, ఆ పైకి పోవుటకు మార్గము నేర్పాటుచేసినాము. ఇటీవల కృష్ణానదిమీద కట్టబడిన పెద్ద రోడ్డువంతెనమీదుగా వేయబడిన హైరోడ్డు దీనికి కలియుచున్నది.

(౫)

బెజవాడమీదుగా మద్రాసునుంచి కలకత్తాకు పోవు రైలుమార్గము తూర్పుబెజవాడను పశ్చిమబెజవాడనుండి వేరుచేసినది. అయినప్పటికి పడమర నుంచి తూర్పుభాగములకు వచ్చుటకు అయిదుమార్గము లుండెను. నేను చైర్మను అయిన కొలదినెలలకు వాటిలో బాప్టిస్టుపాలెముగుండ పోవు ఉత్తరపువైపుమార్గమునకు అడ్డముగ పొడుగున రైలువే అధికార్లు ఇనుప కమ్ములను పాతించి ఆ మార్గమును అకస్మాత్తుగా మూసివేసినారు. నేను నా నౌకర్లను ఇంకా ఇతర ప్రజలను తీసుకుపోయి నేనుస్వయముగ దగ్గరయుండి ఆ ఇనపకమ్ములనన్నిటిని పీకివేయించినాను. ఇంతేగాక పూర్ణానందంపేట ప్రజలు పడమరగా ద్వారములు పెట్టుకొని, ఇండ్లుకట్టుకొని యుండగా ఆ ముందుది రైలువేస్థలమని చెప్పి ఆ యిండ్లముందు ఇనుపబాదులను పాతించి నారు. వాటినికూడ పీకించినాను. నేను ఇవతలకు రాగానే మరల ఆ రెండు చోటుల వాటిని పాతించినారు. నేను మరల మనుష్యులను తీసుకువెళ్ళి వాటినన్నిటిని పీకించినాను. ఇటుల వారు పాతించడం నేను పీకించడం వారమురోజులు వరుసగా జరిగినది. వారి మనుష్యులకంటె మా మనుష్య లెక్కువమంది. ఐ స్త్రీప్రజలంతా నా వెనుకనున్నారు. రైలువేవారు సబు కలెక్టరువద్దకు పోయి నామీద 144 సెక్షనుక్రింద నిషేధాజ్ఞ నివ్వవలెనని కోరినారు. సబుకలెక్టరు వచ్చి చూచినాడు. నిషేధాజ్ఞనిచ్చినచో నేను ముందు దానిని ఉల్లంఘించి నాలుగువేలమందిచేత ఉల్లంఘింపచేయుదునని చెప్పి నాను. ప్రజలరాకపోకల హక్కుల కెట్టిభంగము కలుగకుండ కాపాడుట చైర్మనుగ నా విధి అని చెప్పినాను. మా పక్షమున న్యాయమున్నది. అవతలవైపున ఇండియాగవర్నమెంటులో ఎక్కువ పలుకుబడిగల యూరోపి యన్ రైలువేకంపెనీ గలదు. సబుకలెక్టరు చంద్రన్‌గారు జిల్లాకలెక్టరు గారికి వ్రాయగా వారు వచ్చి యావత్తు చూచినారు. వారు యమ్.యస్.యం. రైలువేఏజంటుకు తంతినిచ్చి పిలిపించినారు. మేమందరము కలసినాము. రైలువేస్టేషనుకు పడమరగనున్న ఖాళీస్థలములో వారికి ఇబ్బందికలిగే టట్లుగా పెట్టెదుకాణములకు అనుమతి నిచ్చినానని నామీద నేరారోపణచేసి నారు. ర్ణానంధముపేటప్రజలయిండ్లకు పడమరగా రైలువేస్థలములో

వేయబడే రోడ్డుమీదికి దారి నిచ్చితీరవలెనని. రెండు రోడ్డువంతెనలైనను కట్టనిది రైలువేకు మునిసిపాలిటీకి తగవులు సాగుచునేయుండునని నేను చెప్పినాను. పాతబస్తీకిని క్రొత్త బస్తీకినిగల మామూలు లెవెల్ క్రాసింగువద్ద రైలుబండ్ల షంటింగుకోసరం గేట్లు వెయ్యగానే ఎంతెంతసేపు బండ్లు,కారులు లారీలు ఆగి ప్రజలపనికి ఎంత ఇబ్బందికలుగుచున్నదో వివరించితిని. కలెక్టరు, సబుకలెక్టరు మాపట్ల సానుభూతి చూపిరి. రైలువేవారిని ఆ త్రోవలు మూసివేయకుండ తాత్కాలికముగ ఆపి వైచిరి. పదిహేనురోజులలో ఒక కాన్ఫరెన్సు నేర్పాటుచేసిరి. రైలువేపక్షమున ఏజంటు, చీఫ్ ఇంజనీరు, మునిసిపాలిటీపక్షమున నేను, మా వైస్చైర్మను కొళందరెడ్డి గారు, ప్రభుత్వపక్షమున కలెక్టరు, సబుకలెక్టరు రైలుస్టేషనుమేడమీద పెద్ద గదిలో సమావేశమైనాము. రాజీగా ఏర్పాట్లుచేసుకున్నాము. కలెక్టరు స్టూవర్టు, సబుకలెక్టరు చంద్రన్‌గార్లు మా ప్రజలకు సౌకర్యములుచేయుటకై యత్నించినందుకు వందనీయులు.నేను పెట్టెదుకాణములు తీసివేయుటకును, రైలువేవారు ఉత్తరమార్గమును మూసివేయుటకును,పూర్ణానందంపేటప్రజలు ఇదివరకు కట్టిన యిండ్లముందు ఆటంకము తీసివైచి రైలువేవారు పడమరగా త్రోవనిచ్చినచో క్రొత్తగా ప్రజలటు త్రోవలుపెట్టకుండనుండునట్లును, ఒప్పుకొంటిని. రైలుస్టేషనుమీదుగా తూర్పునుంచి పడమరకు మనుష్యులు, సైకిళ్ళరాకపోకలకు రైలువేఖర్చుమీద నొక వంతెన కట్టునట్లును, దక్షిణమున గవర్నరుపేటకు పాతబస్తీకి మధ్యనున్న లెవెలుక్రాసింగువద్ద నొక (అండర్ బ్రిడ్జి) రోడ్డువంతెనను నిర్మించునట్లును ఒడంబడికచేసుకున్నాము. ఈ క్రింది రోడ్డువంతెన నిర్మాణపుఖర్చు పూర్తిగా రైలువే భరించవలసినదని నేను వాదించినాను. మునిసిపాలిటీ సగము, రైలువే సగము భరించవలెనని రైలువేఏజంటు అన్నాడు. గవర్నమెంటుకూడ కొంత భరించవచ్చునని కలెక్టరు చెప్పినాడు. ఆఖర్చువిషయములో మద్రాసుప్రభుత్వముయొక్క నిర్ణయానికి అంగీకరించుదామని ఒప్పుకొని రాజీషరతులువ్రాసి అందరము దస్కతులు పెట్టినాము. వెంటనే రైలుస్టేషనుమీదుగ తూర్పుపడమరలకు మనుష్యులు రాకపోకలుచేసేవంతెన నిర్మాణము ప్రారంభమై కొలదికాలములోనే పూర్తి అయినది. దానిని రైలువేవారే తమఖర్చుమీద కట్టినారు. 1929 మార్చి31 వ

తేదీన నేను మదరాసుశాసనసభపనిని పూర్తిచేసుకొని బయటకువచ్చుచుండగా టౌనుప్లానింగునిపుణులగు డాన్‌గారు నన్నుకలసి అండర్‌బిడ్జిప్లానులు, ఎస్టిమేట్లు తయారైనవనియు, వాటిని రైలువే చీఫ్ఇంజనీరు ఆ మరునాడు గవర్నమెంటు స్థానికస్వపరిపాలనాకార్యదర్శిగదిలోకి తీసుకొనివచ్చుననియు, నన్ను రమ్మని ఆయన కోరినాడనియు చెప్పి అచట జరుగు సమావేశములో పాల్గొనుటకు నాకు వీలుకలదాయని అడిగెను. తప్పకుండ వీలుకలదని చెప్పితిని. ఏప్రిల్ 1వ తేదీన చైర్మనుగ నేను, రైలువే చీఫ్ ఇంజనీరు డాన్‌గారు, స్థానికస్వపరిపాలనాకార్యదర్శి హిల్టన్‌బ్రౌనుగారు, ప్రభుత్వపు నీటిసరఫరా కట్టడములశాఖ కార్యదర్శియైన మరియొక యూరోపియను, అందరము హిల్టన్‌బ్రౌనుగారిగదిలో సమావేశమైతిమి. రైలువే చీఫ్ ఇంజనీయరు ఆ ప్లానులన్నిటిని చూపి వాటిని వివరించెను. ఖర్చువిషయములో రైలువే యావత్తు భరించవలెనని నేను చెప్పితిని. రైలువే మూడవవంతు, గవర్నమెంటు మూడవవంతు, మ్యునిసిపాలిటీ మూడవవంతు భరించుట యుక్తమని తక్కినవారు చెప్పినారు. ఆ ఖర్చు రైలువేసగము, గవర్నమెంటు సగము భరించుట సరిగనుండుననియు, మునిసిపాలిటీని ఏ మాత్రము భరించమని అడుగుటయు న్యాయముకాదని నేను చెప్పితిని. ఏ సంగతి మా మునిసిపలుకౌన్సిలులో పెట్టి వారిఅభిప్రాయమును ప్రభుత్వమునకు పంపెదనని చెప్పితిని. ఆ సభాపేశము వాయిదాపడినది. అటుపిమ్మట ఈ విషయము మా కౌన్సిలులో పెట్టగా మనము కొంతైనను భరించుట న్యాయము కాదనియు, రైలువే మా బస్తీని రెండుభాగములుగ చీల్చినపుడు తూర్పు పడమరభాగములకు రాకపోకలు తేలికగజరుగుటకు ఈ క్రిందివంతెనను కూడ నిర్మించుట వారివిధియేయనియు, అవసరమైనచో ఈ పనిచేయుటకు రైలువేవారికి ప్రభుత్వమువారు కొంత సహాయముచేయవచ్చుననియు, బెజవాడ మునిసిపాలిటీమీద ఏమాత్రము బరువుమోపుట న్యాయముకాదనియు తీర్మానించినారు. ఈ సంగతి రైలువేవారికి ఢిల్లీప్రభుత్వమునకు, మదరాసు ప్రభుత్వమునకు వ్రాసితిని. ఇటుల ఉత్తరప్రత్యుత్తరములు జరుపుచుండగా 1930 ఏప్రిలులో నేను జైలుకు పోతిని. ఈ అండర్‌బ్రిడ్జి వ్యవహారము అశ్రద్ధలోపడినది. తుదకు 1937లో

మదరాసులో కాంగ్రెసుగవర్నమెంటు ఏర్పడి రాజగోపాలాచార్యులుగారు ప్రధానమంత్రి, ఆర్థికమంత్రిగను, నేను ఆయనవద్ద ప్రధాన పార్లమెంటరీ కార్యదర్శిగను పనిచేయుచున్నకాలములో, 1948 నుండి బెజవాడ మునిసిపలుకౌన్సిలు కాంగ్రెసుపార్టీ యాజమాన్యముక్రిందికి వచ్చి ప్రముఖ లాయరైన రాజగోపాలాచారిగారు చైర్మనుగ ఎన్నుకొనబడగానే, ఆయన నా సలహాపైన ఈ అండర్ బ్రిడ్జివ్యవహారమును లేవదీసి మూడవవంతుఖర్చును మునిసిపాలిటీభరించుట కొప్పుకొనినటుల తీర్మానము గావింపచేసెను. అటుల మూడవవంతు కొప్పుకోలేకపోయినచో వ్యవహారము అసలే స్థంభించి క్రిందిరోడ్డువంతెనే రాకుండాపోవుననియు, సగమువంతు భరించుటకు రాజగోపాలాచారిగవర్నమెంటు సిద్ధముగ లేదనియు నేను వారితో చెప్పితిని. మొత్తము అయిదులక్షల ఇరవైయొక్కవేలు ఖర్చగును. అందులో మూడవవంతు రైలువేవారు భరించగ మూడవవంతుఖర్చు ప్రభుత్వమువారు భరించునట్లును, కౌన్సిలువారు భరించవలసిన మూడవవంతు ఖర్చుకొరకు మునిసిపలుకౌన్సిలుకు ప్రభుత్వమువారు ఒక లక్ష డెబ్బదివేల రూప్యములను ఋణమునిచ్చునట్లును, నేను శ్రద్ధవహించి ఏర్పాటుచేసితిని, అందుకు స్థానికస్వపరిపాలనామంత్రియగు బెజవాడ గోపాలరెడ్డిగారితోను, ఇర్రిగేషన్ కట్టడములమంత్రియైన యాకూబ్ హుస్సేన్‌గారితోను నేను మాట్లాడి, వారి యుభయులచేత అంగీకారపు యుత్తరువులను వేయించితిని. ఆ కాగితములు మా ఆర్థికశాఖకు ఆఖరుఉత్తరువులనిమిత్తము రాగా, ఏమాత్రము ప్రభుత్వమునకు బాకీయున్నను ఏ మునిసిపాలిటీకి కొత్తఋణము నివ్వగూడదని రాజాగోపాలాచారిప్రభుత్వము చేసిన జి. ఓ. ను చూపి, మా ఆర్థికశాఖ అండర్‌శెక్రటరీ బెజవాడమునిసిపాలిటీ ఇదివరకే కొంత బాకీయున్నదిగాన దానికి ఈ నూతనఋణమునిచ్చుటకు వీలులేదని ఆక్షేపణ తెలిపెను. అపుడు లక్షడెబ్బదివేలు తమ స్వంతబొక్కసమునుండి ఖర్చుపెట్టుస్థితిలో మా మునిసిపాలిటీ లేదు; ఋణము తప్పక కావలెను. ఆంధ్రదేశములోకెల్ల మా మునిసిపాలిటీ యెక్కువ పరపతిగలదనియు, కొత్త అప్పు నిచ్చుటవలన ప్రభుత్వమునకు నష్టమువచ్చుటకు ఎట్టి అవకాశము లేదనియు నేను నా పలుకుబడిని వినియోగించి, అండర్‌శెక్రటరీతో చెప్పి

యొక ప్రత్యేక కేసుగా బెజవాడమునిసిపాలిటీకి ఋణమునివ్వవచ్చునని వ్రాయించితిని. అందుకు ప్రధానమంత్రి రాజగోపాలాచారిగారుకూడ ఒప్పుకొనిరి. వెంటనే పని ప్రారంభమయ్యెను. యుద్ధమేఘములు యూరపులో కమ్ముకొనివచ్చుచుండెను. యుద్ధము వచ్చులోపుననే పని పూర్తికావలెనని తలచి ప్రభుత్వఇంజనీర్లను, కంట్రాక్టర్లను తొందరపెట్టి, నేను, మునిసిపలు చైర్మను రాజగోపాలాచారిగారు ప్రత్యేక శ్రద్ధవహించి అండర్ బ్రిడ్జిని (క్రిందుగాపోవు బ్రిడ్జిని) సకాలములో పూర్తిచేయించినాము. దానికి రాజగోపాలాచారివంతెనయని మునిసిపలుచైర్మనుగారిపేర విలసిల్లునట్లు, కౌన్సిలువారు తీర్మానించిరి. ఆ వంతెనవల్ల బెజవాడబస్తీయొక్క రాకపోకలకు అత్యంతమైన సౌకర్యము కలిగినది. అంతేగాక ఆ రాజగోపాలాచారి వంతెనయొక్క నిర్మాణము, కాశేశ్వరరావుమార్కెటుయొక్క నిర్మాణము బెజవాడబస్తీకి ఎంతయో అలంకారమును చేకూర్చినవి.

1928 లో గవర్నరుపేటలో ఏలూరురోడ్డుప్రక్కనేయున్న మునిసిపాలిటీకిచెందిన యొక ఆవరణ మంచి ఇంటితోసహా ఖాళీయైనది. అదివరకందులోనున్న పశువులఆస్పత్రిని తీసి, బందరురోడ్డుప్రక్కనయున్న పెద్ద ఖాళీస్థలములో ప్రత్యేకభవనమునునిర్మించి అందులో పెట్టినాము. ఏలూరు రోడ్డుప్రక్కనయున్న ఆ ఆవరణను, యింటిని స్త్రీలయుపయోగంనిమిత్తము వారొక గ్రంథాలయమును స్థాపించుకొని, శరీరవ్యాయామము, మనోవికాసములకొరకు ఆటపాటలను జరుపుకొనుటకు, హిందీ మొదలైనవి అభ్యసించుటకు, వారికి ప్రత్యేకముగ ఆర్థిక, మత, సాంఘికాదివిషయములమీద నుపన్యాసములిప్పించుకొనుటకు ఇచ్చుట యుక్తముగనుండునని నేను తలచితిని. మా కౌన్సిలువా రొప్పుకొనిరి. సబుకలెక్టరు చంద్రన్‌గారిభార్య, బారిష్టరు వెంకటేశ్వరరావుగారిభార్య, రైలువేడాక్టరు ఈపెన్‌గారిభార్య మొదలగు కొందరు విద్యావతులైన స్త్రీలు నావద్దకు వచ్చి తమకిప్పించినచో వారు భారతమహిళాసమాజముగా నేర్పడి ఆ పనులు నిర్వర్తించెదమని చెప్పిరి. అయ్యంకి వెంకటరమణయ్యగారు మరికొందరు రామమోహనగ్రంథాలయమును నడుపుచున్న మిత్రులు నన్నుకలసి ఆ యింటిని, ఆవరణమును ఆ గ్రంథాలయమున కిప్పించవలెనని, దాని కొక స్త్రీలశాఖనుపెట్టి వడిపెద

మని నన్ను చాలయొత్తిడిచేసిరి, మా కౌన్సిలర్లలో కొందరిని చూచిరి, ఎవ్వరికివ్వవలెననునది యొక సమస్యగాచేసిరి. గాని పురుషులచే నిర్వర్తింపబడుచున్న రామమోహన గ్రంథాలయపుశాఖగ నిచ్చుట బాగుండదని స్త్రీలనే యొక స్వతంత్రసంఘముగ నేర్పరచి వారికే ఇవ్వవలెనని నేను దృఢనిశ్చయుడనైతిని. అయ్యంకి వెంకటరమణయ్యగారికి నామీద చాల కోపమువచ్చెను. మా కౌన్సిలులో అత్యధికసంఖ్యాకులు నాతో నేకీభవించి ఆ ప్రకారమే తీర్మానముచేసిరి. చంద్రన్‌సతి మొదలైనవారు భారతమహిళా సంఘముగనేర్పడిరి. ఆసంఘముయొక్క నిర్మాణవిధానమును నేనేవారికివ్రాసి యిచ్చితిని. ఆప్రకారము సంఘము రిజిష్టరుచేయబడెను. దానికి ఆ ఇంటిని ఆవరణను స్వాధీనముచేసితిని. ప్రభుత్వమువారు మేమిచ్చిన దానమును అంగీకరించిరి. జిల్లాబోర్డు అధ్యక్షులుగానున్న మీర్జాపురంరాజా, చల్లపల్లి రాజా మొదలైన జమీందార్లను చూచి ఆ సంఘమువారు ఏడెనిమిదివేల రూప్యములను వసూలుచేసుకొని ఆ పాతయింటికి ముందొక మంచిభవనమును నిర్మాణముగావించుకొనిరి. ఆ నూతనభవనములో గ్రంథాలయమును నెల కొల్పిరి. అందులోనే సభలుజరుపుకొనుచున్నారు. ఆటలు పాటలు పండగలు వేడుకలు జరుపుకొనుచున్నారు. టెన్నిసుకోర్టునువేసి బాడ్మింటను, టెన్నిసు ఆడుకొనుచున్నారు. హిందీతరగతులను పెట్టుకొనుచున్నారు. పురాణశ్రవణముకూడ జరుపుకొనుచున్నారు. నా కాలములోనే మునిసిపాలిటీఖర్చుమీద ఆ పాతయింటిలో నొక మాతాశిశుపోషణాలయమును స్థాపించి దానిని ఆ స్త్రీసమాజయాజమాన్యముక్రింద నుంచినాము. వారు దానిని శ్రద్ధగ నిర్వహించిరి. ఆ వెనుకనున్న ఖాళీస్థలము పి. డబ్లియు. డి. వారిదైనందున వారికి ఆ స్త్రీసంఘమువారు దరఖాస్తుపెట్టి, దానిలో నొక పార్కు వేయించుకొనిరి. దానిలోనుంచి వెనుక ప్రక్కన రైవసుకాలవలోనికి దిగుటకు మెట్లను కట్టించుకొనిరి. ఆ కాలములో నొక స్త్రీ సభ్యురాలిని మునిసిపాలిటీకి నామినేషన్ చేయవలసియుండగా ఆ స్త్రీ సమాజమువారి కోరికమీదఈ పెను సతిని ప్రభుత్వముచేత నియమింపచేసితిని. పిమ్మట అనేకమంది అఖిలభారత మహిళాసంఘ ప్రముఖ విదుషీమణులు, కజిన్సుసతి, ముత్తులక్ష్మిరెడ్డి, కమలాదేవి చటోపాధ్యాయ, కామేశ్వరమ్మ, దుర్గాబాయి, సుబ్బరాయన్‌సతి

మొదలైనవా రిచటకు వచ్చి యుపన్యాసములనిచ్చి వెళ్లుచుండిరి. చాలమంది మధ్యతరగతికి చెందిన హిందూ మునల్మాను క్రైస్తవ పారసీక స్త్రీలందులో సభ్యురాండ్రుగ చేరిరి. అది, దినదిన ప్రవర్థమానమైనది. ఆ సంఘమున ప్రముఖ సభ్యురాండ్రుగనుండిన శ్రీమతి తుర్లపాటి రాజరాజేశ్వరమ్మగారు మునిసిపలుకౌన్సిలరుగను శ్రీమతి బొడ్డపాటి సీతాబాయమ్మగారు గౌరవ మేజిస్ట్రేటుగనుండి ప్రజాసేవచేసిరి. ఈ మహిళాసంఘ మిప్పటికిని మంచి స్థితిలో విలసిల్లుచున్నది. అపుడపుడు గొప్ప నాయకులువచ్చినపుడు పురుషులగు వారిచేతకూడ నుపన్యాసములను ఇప్పించుకొనెదరు. ఇటీవల 1958లో చీఫ్ఇంజనీయరు నరసింహారావుగారి తల్లి విదుషీమణియగు శ్రీమతి లక్ష్మీనరసమ్మగా రధ్యక్షురాలుగానున్నకాలములో చాలా శ్రమచేసి చందాలు వసూలుచేసి మరియొక భవనమును నిర్మాణముగావించుకొని దానికి నాచేత ప్రారంభోత్సవము చేయించుకున్నారు. శ్రీమతి లక్ష్మీనరసమ్మగారు కుమారునితోకూడ బెజవాడవదలి హైదరాబాదుకు పోవుచున్నందున ఆమెగారి ఛాయాపటము నా చేతనే ఆ మందిరములో ఆవిష్కరణచేయించినారు. నన్నా సంఘములో యావజ్జీవ గౌరవసభ్యునిగా చేసినారు. అది నాకు నా సోదరీమణులు గావించిన ప్రత్యేక గౌరవమని భావించుచున్నాను.

గాంధీనగరములో మునిసిపాలిటీకిచెందిన షుమారు అయిదుఎకరాల ఖాళీస్థలమును ఆంధ్రదేశములో కేంద్రముగానున్న విజయవాడలో సర్వవిధములైన స్థానిక, రాష్ట్రీయ, అఖిలభారత ఆటల, కుస్తీల, వ్యాయామపోటీల (Tournaments) కొరకుపయోగించుటకుగాను కేటాయించి అందులోని కొంతభాగములో స్థాపించబడిన ఆంధ్ర జింఖానా (రిజిస్టర్డు) సంఘమువారి యాజమాన్యమున నుంచినాము. ఇదికూడ 1928లో జరిగినది. దానికి నాయకులుగనున్న గూడూరు లక్ష్మణరావు, వి. వి. సుబ్బయ్య మొదలైనవారు నన్ను, మా కౌన్సిలువారిని అడుగగా మే మా ప్రకారము తీర్మానముచేసి యిచ్చినాము. ఆ సంఘమువారిక్లబ్బు బాగుగా జరుగుచున్నది. విజయవాడప్రముఖులందరు అందులో సభ్యులుగా నున్నారు. వా రొక ముప్పాతిక యకరమును ప్రత్యేకముగ తమక్రింద నుంచుకొని టెన్నిసు ఆడుకొనుచున్నారు. ఆంధ్రదేశములోకెల్ల సుప్రసిద్ధ నటకులుగానున్న బళ్ళారి రాఘవా

చార్యులుగారిచేత బెజవాడలో నాటకములువేయించి ఆ వచ్చినసొమ్ముతో నొక రాఘవాచారిమందిరమును నిర్మించుకున్నారు. మీర్జాపురంరాజాగా రొక భవనమును కట్టించియిచ్చినారు. గొప్ప గొప్ప అఖిలభారత వ్యాయామ పోటీలు (Tournaments) ఏటేట ఆ ఖాళీస్థలములో జరుగుచున్నవి. పండిత నెహ్రూ, రాజేంద్రప్రసాద్, రాజగోపాలాచారిగార్లవంటి నాయకులు వచ్చినపుడు ఆ ఖాళీస్థ లములోనే బహిరంగసభలు జరిపినాము. ఆ జింఖానా క్లబ్బులో నన్ను. గూడూరు లక్ష్మణరావుగారిని యావజ్జీవ గౌరవసభ్యులుగ చేసియున్నారు.

నేను ప్లీడరుగానున్న కాలములోను పిమ్మట కూడా బెజవాడపట్టణము నాటకరంగమునకు కేంద్రముగనుండెను. మైలవరం రెండవరాజాగా రొక సుప్రసిద్ధ నాటకసమాజమును స్థాపించి చాలసంవత్సరములు చక్కగా నడిపిరి. అందులో యడవల్లి సూర్యనారాయణ, ఉప్పులూరి సంజీవరావు, రామనాథశాస్త్రి, జొన్నవిత్తుల శేషగిరిరావు, నిడుముక్కల సుబ్బారావు, పారుపల్లి సుబ్బారావు, గురజ నాయుడుగార్లు మొదలగు పేరెన్నికగన్న నటులుండిరి. పిమ్మట మోతే నారాయణరావుగారు మారుతీ నాటకశాలను స్థాపించి వీరిలో కొందరిని తీసుకొని మరికొందరు క్రొత్తనటులను చేర్చి చక్కగా నడిపిరి. నేను చైర్మనుగానున్నకాలమందంతటను ఆంధ్రదేశములో ఇతరచోట్ల స్థాపించబడిన నాటకసమాజములు బెజవాడవచ్చి నాటక ప్రదర్శనములిచ్చి పోవుచుండెను. మునిసిపలుఅనుమతి కావలసియున్నందున నా వద్దకువచ్చి అనుమతి తీసుకొనుటయేగాక నన్ను బలవంతపెట్టి కొన్నినాటకములకు తీసుకొనిపోవుచుండిరి. బందరులో డి. వి. సుబ్బారావు గారు క్రొత్తనాటకసమాజమును స్థాపించిరి. రాజమహేంద్రవరము, విజయనగరము, తెనాలి, గుంటూరుబస్తీలలోను పేరుపొందిన నాటకసమాజము లుండెను. తెనాలిలో స్థానం నరసింహారావు, ఊటుకూరు వెంకటేశ్వర్లు, గోవిందరాజుల వెంకటసుబ్బారావుగార్లు మొదలగువారు నటులుగ ప్రసిద్ధి చెందిరి. బళ్ళారిలో కృష్ణమాచార్యులుగారి సరసవినోదినీ సభ, కోలాచలం వారి రామవిలాససభ, ఇటులనే నెల్లూరులో వేదం వెంకటరాయశాస్త్రిగారి నాటకసమాజము, మరియొక నాటకసమాజము నాటకకళాభివృద్ధిలో పోటీ

పడుచుండెను. చిత్తూరులో శ్రీరామవిలాససభవారి నాటకములను చూచి తిని. సురభికంపెనీ రెండుభాగములుగ చీలినట్లు జ్ఞాపకము. ఆకాలములో ఆంధ్రనటకులు చక్కగా అభినయముచేయుటయందు దక్షిణహిందూదేశ ములో కెల్ల అగ్రస్థానమును పొందిరనుట నిస్సంశయము. బళ్ళారి రాఘవా చార్యులుగారు వ్యక్తిగాను, నాటకసమాజములో ఇంగ్లీషు, తెనుగునాటక ములను ఆడుటలోను చాలప్రసిద్ధిచెందిరి. అదివరకు సురభికంపెనీలో తప్ప, మిగిలినచోట్ల పురుషులే స్త్రీపాత్రలనుకూడ ధరించి బహుచక్కగా నిర్వ హించిరి. ఇటీవలవచ్చిన రాజరాజేశ్వరీ నాటకసమాజమలో శ్రీమతి రాజ రాజేశ్వరి మొదలగు స్త్రీలు చక్కగా ప్రదర్శించుచున్నారు. రాఘవాచార్యులు గారే ప్రథమమున మంచికుటుంబములస్త్రీలచే తననాటకములలో స్త్రీవేషములు వేయించెను. వారిలో కొమ్మూరి పద్మావతీదేవి, మాదపాటి శకుంతలాదేవి ముఖ్యులు. కళావంతులస్త్రీలుకూడ నాటకములలో స్త్రీవేష ములు వేయుచుండిరి. బళ్ళారి రాఘవాచార్యులుగారు బెజవాడవచ్చి వారి మిత్రులైన గూడూరి లక్ష్మణరావుగారి కోరికపై అనేకసార్లు నాటకప్రదర్శ నముల నిచ్చిరి. నాకు కూడ స్నేహితులైరి, వాటివల్ల వచ్చిన కొంతడబ్బు నివ్వగా ఆంధ్రజింఖానావా రొక భవనమును ఆయనపేర కట్టించిరి.బెజవాడలో కేంద్రనాటకశాలను కట్టించవలెనని ఆయన సంకల్పించెను. గాని ఆయన అకాలమరణముతో ఆ ప్రయత్నము సాగలేదు. అక్కినేని నాగేశ్వరరావు గారు అట్టిదానిని బెజవాడలో నిర్మాణముగావించెదమని వాగ్దానముచేసిరి. ఆయన సరసుడు, ఉదారుడు. ఆ వాగ్దానమును త్వరలో నెరవేర్చునని ఆశిం చుచున్నాను. సుమారు 1928 నుండి సినిమాలువచ్చి ఆంధ్రదేశమంతట సినిమాహాలులు వెలసినవి. బెజవాడలో మారుతీసినిమా, కాశీనాధుని నాగే శ్వరరావుపంతులుగారి దుర్గాకళామందిరములతో ప్రారంభమై నేడు పదిహేను సినిమాహాలులు ఏర్పడినవి. నాటకకళకు చాల దెబ్బతగిలినది. నటులు నిరుత్సాహమువల్ల తగ్గిపోవుచున్నారు. నాటకములువేయవలెనన్న హాలులు కూడా దొరకుటలేదు. నా చిన్నతనములో వీధినాటకము లుండుట, విద్యార్థి దశనాటికి తెరల నాటకశాలలు వచ్చుట, 1928 నుండి అవికూడ క్షీణించి సినిమాలువచ్చుట ఈ మూడుమార్పులను నేను చూచినాను. నా కెందువల్లనో

గాని ఎప్పుడోతప్ప సినిమాలుచూచే అలవాటు లేదు. నాటకకళ చాల యుత్కృష్టమైనది. ప్రాచీనమైనది. మనదేశ విజ్ఞానములో భాగమైనది. దానిని పునరుద్ధరించుటకు ఆంధ్రప్రదేశప్రభుత్వము, ప్రజలు బాగుగా పూను కోవలెను. ఆంధ్రప్రదేశ ప్రభుత్వ విద్యామంత్రిగారు ఆంధ్రనాటకఎకాడమీని స్థాపించుట ముదావహము. హైదరాబాదులోను, బెజవాడ మొదలగు ముఖ్య పట్టణములలోను వెంటనే నాటకశాలలను నిర్మించుటకు పూనుకోవలెను. నాటకసమాజములను ప్రోత్సహించవలెను.

## (6)

1928 నవంబరునెలలో సైమనుకమిషను మద్రాసుకు, గుంటూరుకు వచ్చినది. ఆ కమిషన్‌ను కాంగ్రెసువాదులు మితవాదులు అందరును బహి ష్కరించిరి "సైమన్ వెనుకకు పోవాలి" అను నినాదములు దేశమంతట ప్రతిధ్వనించెను. వారికి ప్రతిచోట నల్లజెండాలు ప్రదర్శించబడెను. గుంటూ రుకు ప్రత్యేకరైలులో మద్రాసునుంచి సైమనుకమిషనువారు వచ్చుచు త్రోవలో నొక ముప్పావుగంటసేపు బెజవాడస్టేషనులో ఆగిరి. అచట ఇంజనుమార్చుట కమిషన్‌సభ్యులకు ఫలహారములుసమర్పించుట మొదలై నవి జరిగెను. వారు రైల్వేస్టేషనునుండి బయటికి రాలేదు. స్టేషనులో కృష్ణాజిల్లాకలెక్టరు, జిల్లాపోలీసుసూపరింటెండెంటు మొదలగు ఉద్యోగులు వారిని రైల్వేప్లాట్‌ఫారముమీద సన్మానించిరి. వారు కొంతసేపు ప్లాట్‌ఫా రముమీద అటునిటు తిరిగిరి. ఆ ప్లాట్‌ఫారముమీదికి పోలీసువారు ఎవ రినిరాకుండా బందోబస్తుచేసిరి. అయినను ఎటులనో తప్పించుకొని మా ఐచ్ఛికసేవకులు 70-80 మంది ప్లాట్‌ఫారముమీద ప్రవేశించి తమ జేబుల్లో దాచుకొనియున్న నల్లజెండాలను పైకెత్తి ప్రదర్శించిరి. పోలీసువారు కొందరిని వెడలగొట్టి, కొంతమందిని అరెస్టుచేసి స్టేషనులో కూర్చోపెట్టి కమిషనువారి రైలు వెళ్ళగనే విడిచిపెట్టిరి. ఆ క్రిందటిరోజు మా మునిసి పలుకౌన్సిలు సమావేశం జరిపినాము. అందులో సైమనుకమిషనును బెజ వాడ మునిసిపలుకౌన్సిలు బహిష్కరించుచున్నదనియు, సైమనుప్రభృతు లను వెనుకకుపోవలెనని కోరుచున్నదనియు ఏకగ్రీవమైన తీర్మానముచేసి

తిమి. ప్రభుత్వనియమితులైన కౌన్సిలరులుకూడ ఆ తీర్మానమును వ్యతిరే కించలేదు. కొందరు మిన్నకుండిరి. కొందరు రాకపోయిరి. తీర్మానము ఏకగ్రీవముగా అంగీకరింపబడినది. ఆ మరునాడు కమిషనువారు బెజవాడ రైల్వేప్లాటుఫారముమీదికి ప్రత్యేకరైలులో వచ్చి ఆగియుండగా, ఆ తీర్మాన మును టైపుచేయించి నేను దస్కతుపెట్టి సైమనుగారికి ఆ తీర్మానమును పంపుచున్నానని ఉత్తరమువ్రాసి ఒక కవరులోపెట్టి మా మునిసిపలు డఫే దారుచేత పంపితిని. ఆ డఫేదారు డబ్బా డవాలీతో స్టేషనులోకి పోగా రైల్వేఅధికారులు లోపలికి పోనిచ్చిరి. మునిసిపలుచైర్మనునుంచి లేఖ తెచ్చితినని దానిని సైమనుప్రభువుకే యిచ్చెను. వారిచుట్టునున్న తెల్లి సభ్యులు తెల్లఉద్యోగస్తులు అది యేదో స్వాగతపత్రమని తలచిరి. ఆ ఉత్త రమునువిప్పి సైమనుగారు తీర్మానముతోకూడ చదువుకొనిరి. "సైమనుగారు వెనక్కుపొండి" అని ఆ తీర్మానములో వ్రాయబడియున్నదానిని చదువు కొని చిన్నపుచ్చుకొనిరి. దానిని జిల్లాకలెక్టరుగారికివ్వగా వారు చదువుకొని యూరకుండిరి. మా డఫేదారు వారికి సలాముపెట్టి తిరిగివచ్చెను. ఇటుల నేను మునిసిపల్ చైర్మనుగా సైమనుప్రభువుకు ఉత్తరమువ్రాసి పంపితినని పత్రికలన్నింటిలో ప్రచురింపబడెను. జాతీయపత్రికలు సంతసించెను. ఆ ఉద యపు రైలులోనే, గుంటూరులో జరుగనున్న సైమనుకమిషను వ్యతిరేక ప్రదర్శనములలోను, నినాదములలోను, నల్లజెండా ఉత్సవములోను పాల్గొ నుటకు గుంటూరువెళ్ళి కొండా వెంకటప్పయ్య, నడింపల్లి లక్ష్మీనరసింహా రావు, ఉన్నవ లక్ష్మీనారాయణ, గొల్లపూడి సీతారామశాస్త్రి మొదలైన కాంగ్రెసు నాయకులనందరిని కలిసితిని. బెజవాడనుంచి ఆ రోజున గుంటూ రుకు షుమారు రెండువేలమంది కాంగ్రెసువాదులు వెళ్ళిరి. అచట జరిగిన ప్రదర్శనములనుగూర్చి ముందు ముందు తప్సీలుగా తెలిపెదను.

1930 జనవరి 5వ తేదీన నేను లాహోరుకాంగ్రెసు తీర్మానాను సారంగా మద్రాసుశాసనసభా సభ్యత్వమునకు రాజీనామానిచ్చితినని యిది వరకే చెప్పితిని. అటుపిమ్మట షుమారు నెలరోజులకు మద్రాసుప్రభుత్వ స్థానిక స్వపరిపాలనా కార్యదర్శియగు హిల్టన్‌బ్రౌనుగారివద్దనుంచి, నా కొక మెమోరాండం వచ్చినది. దానిమీద వారు 'రహస్యము' అని గుర్తుపెట్టినారు. నేను మ్యునిసిపలుచైర్మనుగా చేసిన కొన్నిపనులకు నన్ను సంజాయిషీ

యివ్వవలసినదని, నామీద ఎందుకు చర్యతీసుకొనకూడదో తెలుపవలసిన దని, అందులో వ్రాసియున్నది. అందలి అంశములు ఏమనగా (1) నేను ఖద్దరును నిర్బంధముగాను, బలాత్కారముగాను మునిసిపలుఉద్యోగస్థుల చేతను, ఉపాధ్యాయులచేతను కట్టించి, నాతో నంగీకరింపని కొంత మంది హైస్కూలుఉపాధ్యాయులను నేను ఇబ్బందులుపెట్టుచున్నానని, (2) జాతీయకీర్తనలనే పేరున ప్రతిరోజు మునిసిపలుస్కూళ్ళలో రాజద్రోహమును బోధించే కీర్తనలను పాడించుచున్నానని, (3) 1927వ సం॥ డిశంబరు నెలలో మద్రాసులో కాంగ్రెసుమహాసభ జరిగినపుడు మునిసిపలుస్కూళ్ళు అన్నియు మూసివేసి కాంగ్రెసుకుపోవుటకు మునిసిపలుఉపాధ్యాయులంద రికీ అయిదురోజులు సెలవులిచ్చినానని, వీటికి సంజాయిషీనివ్వవలెనని ఆ మెమోరాండంలో గలదు. ఎలిమెంటరీపాఠశాలలో ఉపాధ్యాయులు, ఉపా ధ్యాయినులు, సంతోషపూర్వకముగా నాతో సహకరించినారుగాని, మునిసి పలుహైస్కూలు ప్రధానోపాధ్యాయులుగానున్న అత్తిలి గురుమూర్తిగారు ప్రభుత్వవిద్యాశాఖాధికారియైన యూరోపియను నాశ్రయించి నాకు ఆటంక ములు కలిగించసాగెను. ఆయన ఆ విద్యాశాఖాధికారితో చెప్పి ప్రభుత్వ మునకు ఫిర్యాదుచేయించెను. అదివరకే కొన్ని నెలలక్రిందట మా జిల్లా విద్యాధికారి చావలి సూర్యప్రకాశరావుపంతులుగారు నన్ను కలసి రాజభక్తి చూపవలసినదని, బ్రిటిషుప్రభుత్వముయొక్క మేళ్లను వివరించుచు వ్రాయ బడినతెలుగుపుస్తకములను,ఇంగ్లీషుపుస్తకములను నేనవతలపారవైచి,వాటిని పాఠ్యగ్రంథములుగా పెట్టుటను నిషేధించినానని, తనకు అత్తిలి గురుమూర్తి గారే ఫిర్యాదుచేసినారని, అందులో ఏమైన సత్యము ఉన్నదాయని నన్నడిగిరి. వారు నాకు స్నేహితులు. నాఅభిప్రాయములపట్ల సానుభూతి కలవారు. అత్తిలి గురుమూర్తిగారు చెప్పినదంతయునిజమే, బ్రిటిషుప్రభుత్వములో దేశస్వతం త్రముకొఱకు పోరాడుచున్న నేను నా హయాములో అట్టిపుస్తకముల నెట్లుల పాఠ్యగ్రంథములుగా పెట్టనివ్వగలను? అట్టి భావములులేని పుస్తకము లనే ఏరి పాఠ్యగ్రంథములుగా నేర్పాటుచేయుచున్నాను, అది వాస్తవమే నని వారికి జవాబుచెప్పితిని. దానిమీద వారు ఏమీ చర్యపుచ్చుకున్నట్లు కనపడదు. ఆ గురుమూర్తిగారు విద్యాశాఖాధికారితో ఫిర్యాదుచేసిన మీద టనే నా కా మెమోరాండం ప్రభుత్వమునుంచి వచ్చినదని నాకు తెలిసెను.

నేను దానికి రహస్యముగా జవాబునివ్వదలచుకొనలేదు. నన్ను ప్రభుత్వము వారు మునిసిపల్‌చైర్మను పదవినుండి తీసివేసినను బహిరంగముగా ప్రజలకు, పత్రికలకు కారణములు తెలిపియే నేనాపదవినుంచితొలగవలెనుగాని, రహస్యముగా కారణములు తెలియకుండ తొలగుట నా కిష్టములేదు. ప్రభుత్వమువారు నన్ను తొలగించినను అందుకు సిద్ధముగానున్నాను. అది గౌరవమనియే భావించుచుంటిని. అందువల్ల నేను వారికి జవాబువ్రాయుటలో ఈ విషయములలో కొన్ని సిద్ధాంతములు ఇమిడియున్నవి, కనుక, నేను దానికి జవాబు బహిరంగముగనే వ్రాసెదనని ప్రభుత్వశక్రటరీగారికి వ్రాయుచు నా సంజాయిషీ పంపి, దానిని పత్రికలకుకూడ పంపించితిని.

మొదటిది: ఖద్దరు పేదవారికి సహాయముచేయుననునది ముఖ్యమైన ఆర్థికవిషయము. మిల్లుబట్టలు భాగ్యవంతులైన షాహుకార్లకే లాభమును కలుగజేయును. పేదవారైన నూలువడుకువారికిని, బట్టలునేయువారికిని భోజనము కలుజేయునది, వృత్తిని కల్పించునది ఖద్దరు అయియున్నది. అందువల్లనే నేను రాట్నములను మా స్కూళ్ళన్నింటిలో పెట్టించి, ఖద్దరు కట్టవలెనని అందరకు బోధించినాను. ఉపాధ్యాయులకు, మునిసిపలుఉద్యోగస్థులకే గాక ప్రజలందరకుకూడ నేను బహిరంగసభలలో బోధించుచు, మా గృహములో నున్నవారందరము ఖద్దరునే ధరించుచున్నామని మొదటిఆక్షేపణకు జవాబు వ్రాసితిని.

రెండవఆక్షేపణ: నేను రాజద్రోహకరమైనటువంటిగాని, బ్రిటిషు జాతివారిని దూషించునటువంటిగాని కీర్తనలేమియు పాడించుటలేదు. నేనే స్వయముగా కీర్తనలనన్నిటిని ఏరి దైవభక్తిపూరితమైనట్టి దేశాభిమానపూరితమైనట్టి కీర్తనలనే అచ్చువేయించి పాడించుచున్నాను. దైవభక్తి కలిగియుండుట మాతృదేశమును ప్రేమించుట, దేశములో నున్న సమస్తమతములమధ్య, కులములమధ్య సామరస్యము, ఐకమత్యము కలిగియుండుట, ప్రతిపౌరునియొక్క హక్కు, ధర్మము. విద్యార్థులకు విద్యార్థినులకు ఆ ధర్మమును చిన్నతనమునుండియే నేర్పుట అత్యవసరము. ప్రభుత్వమువారు అన్నిపాఠశాలలలో దైవభక్తిని, దేశాభిమానమును, మత, సాంఘిక సామరస్యమును, ఐక్యతను బోధించు పుస్తకములనుపెట్టి కీర్తనలుపాడించి తమధర్మమును నిర్వర్తించకపోగా, నేను

ఆ పని చేసినందుకు నాకు ఆక్షేపణతెలుపుట అక్రమమముగానున్నది. నేను చేయుచున్నది మంచిపని యని వ్రాసితిని,

మూడవఆక్షేపణ: కాంగ్రెసుమహాసభలు జరిగేకాలములో, రాజకీయ, ఆర్థిక, సాంఘిక, ఆధ్యాత్మికవిషయములన్నీ చర్చించబడే వివిధ మహాసభలు జరుగును. దేశములోని వివిధప్రాంతములనుండి పేరుప్రతిష్ఠలుగన్ననాయకులు విచ్చేతురు. వారినందరిని చూచుటవల్ల, వారియుపన్యాసములు అన్నిశాఖలలోను వినుటవల్ల ఉపాధ్యాయులకు గొప్ప విజ్ఞానము కలుగును. బెజవాడఉపాధ్యాయులు పేదవారు. దూరదేశమున జరుగుచున్న కాంగ్రెసు మొదలైన మహాసభలకు పోజాలరు. మద్రాసుకు ఆ సభలన్నీవచ్చి గొప్పవిజ్ఞానాన్ని వెదజల్లుచున్నపుడు వాటికివెళ్ళి వాటివల్ల లాభం పొందు అవకాశం మా ఉపాధ్యాయులకు కలుగజేసినాను. అందువల్ల కాంగ్రెసుమహాసభ జరుగునపుడు మద్రాసుపోవుటకు మా స్కూళ్లు మూసి ఉపాధ్యాయులకు సెలవు లిచ్చినాను. దానివల్ల వారివిజ్ఞానము చాల హెచ్చివుంటుంది. నేను సెలవిచ్చిన అయిదురోజులలోను రెండురోజులు సెలవులే. తక్కిన మూడురోజులు తరువాత వచ్చిన సెలవుదినములలో పాఠశాలలు పెట్టించి భర్తీచేసినాను. నేను బెజవాడపౌరులవల్ల ఎన్నుకోబడ్డ ప్రతినిధిని. ఆ నగర పాలనములో నేను నాగరికమైనటువంటి, విజ్ఞానయుతమైనటువంటి దేశాభిమానపూరితమైనటువంటి పద్ధతులనేఅవలంబించుట నా విద్యుక్తధర్మమని ఆప్రకారము చేసినాను, అని హిల్డన్‌బ్రౌనుగారికి వ్రాసి నా జవాబుయొక్క నకళ్ళను పత్రికల కన్నింటికి పంపినాను. పత్రికలన్నియు నన్ను ప్రశసించి, ప్రభుత్వమును ఖండించినవి. దానిమీద హిల్డన్‌బ్రౌనుగారు **"The Governmet regrets the political bias of the Chairman, but does not propose to take any action"** అనగా "ఈ విషయములన్నింటిలోను చైర్మనుగారు రాజకీయదృష్టితో ప్రవర్తించినందుకు ప్రభుత్వమువారు విచారమును తెలుపుచున్నారు. కాని ఆయనమీద ఎట్టిచర్య తీసుకొనదలచలేదు" అని నాకు ప్రభుత్వమునుంచి జవాబువచ్చెను. ఆ జవాబునుకూడ నేను పత్రికలలో ప్రకటించినాను. ఈ ఉత్తరప్రత్యుత్తరములు జరిగినపిమ్మట కొలదికాలముననే నేను జైలుకు పోయినాను.

# 11 కాంగ్రెసు శాసనసభ్యత్వము

జైలులో మహాత్మా గాంధీగారికి శస్త్రచికిత్స - వారి విడుదల - హిందూ-ముస్లిం ఐక్యతకొరకు ఉపవాసము-గాంధీగారు స్వరాజ్యపార్టీకి శాసనసభాప్రవేశమునకు అనుమతి నిచ్చుట - స్వరాజ్యనిర్వచనము - బంగాళములో స్వరాజ్యపార్టీయొక్క దిగ్విజయములు - సుభాసుచంద్రబోసుగారితో మద్రాసుజైలులో కలయిక - ఆంధ్ర స్వరాజ్యపార్టీ - గాంధీ పూజానిధి - మా కుటుంబ చికాకులు - దేశబంధు చిత్తరంజనదాసుగారి అకాలమరణము - స్వరాజ్యపార్టీ రద్దు - కాన్పూరుకాంగ్రెసు - కాంగ్రెసువారు శాసనసభలకు నిలువవలెను - మంత్రిపదవులను స్వీకరించకూడదు - హిందూస్తానీ జాతీయభాష - అల్లూరి సీతారామరాజు వీరగాథ - 1926 శాసనసభఎన్నికలు - నేను, కొల్లిపర సూరయ్యగారు కృష్ణా జిల్లాకు కాంగ్రెసుఅభ్యర్థులము - మీర్జాపురంరాజా, నేను గెలిచితిమి - ఎన్నికదావాలు - కాంగ్రెసువారము మంత్రివర్గమును నిరాకరించితిమి - డాక్టరు సుబ్బరాయన్ మంత్రివర్గము - కాంగ్రెసువాదులపొలములకు నీరు - భారతీయ వైద్యశాల - సర్జన్ జనరల్ అభిప్రాయము - ఆసుపత్రులను ప్రభుత్వము తీసుకొనుట - జమీందారీరయితులసమస్యానా మునిసిపాలిటీలసవరణచట్టము - ప్రభుత్వచట్టము - కళావంతుల యినాములచట్టము - రీసెటిల్మెంటు విచారణకమిటీ-

ఆచార్య గోగినేని రంగనాయకులుగారు–న్యాపతి సుబ్బారావు పంతులుగారి రాయబారము – గవర్నరు తూలనాడుట – లాహోరుతీర్మానప్రకారము కాంగ్రెసు శాసనసభ్యుల రాజీనామాలు – పులిచింతల, మెట్టూరు ఆనకట్టలు – అరవజిల్లాలకు విద్యుచ్ఛక్తి – ఉన్నవ లక్ష్మీనారాయణగారి మాలపల్లి– బెజవాడవద్ద కృష్ణమీద రోడ్డునంతెన – కృష్ణాజిల్లాబోర్డు – తాలూకాబోర్డులు – తెల్ల క్రైస్తవబోధకుల సామ్రాజ్య తత్వము.

(1)

1924 జనవరి 12 వ తేదీన ఎరవాడజైలులో మహాత్మా గాంధీగారికి ఆకస్మికముగా (అపెండిసైటిస్) కడుపులో కురుపువేసినట్లు కనుగొనబడినది. అది చాలా ప్రమాదకరమైన జబ్బు. తక్షణమే పొట్టకోసి ఆ కురుపును తీసివేసినగాని గాంధీగారు జీవించుట దుర్లభమని తలచి, ఆయనసమ్మతిని పొంది పూనాలోని పెద్ద గవర్నమెంటు ఆస్పత్రిలో అర్ధరాత్రివేళ కల్నల్ మేడక్ అను శస్త్రవైద్యనిపుణుడు ఆయనకు శస్త్రచికిత్స చేయనారంభించెను. ఆ గదిలో మేడక్‌గారు, ఆయనకు సహాయకులైన వైద్యులు, నర్సులు మొదలైనవారందరు గుమిగూడి ఆయనపొట్ట కోయుచుండగా ఆ గదిలోని విద్యుద్దీపములు ఆకస్మికముగా చల్లారినవి. వైద్యులకు ఏమిచేయుటకు తోచలేదు. లాంతర్లు తెప్పించి శస్త్రముచేయ యత్నించుచుండిరి. ఆలశ్యమగుచున్నది. ఆ మహాపురుషుడు అక్కడే మరణించునేమోనను ఆందోళనము కలిగినది. మానవకోటికి రక్షకుడుగావలసియున్న మహాత్మా గాంధీ యపుడే మరణించుటా లేక యనేకసంవత్సరములు జీవించి భారతదేశమునకు స్వరాజ్యమిచ్చి, మానవకోటిని నూతన ధర్మపథములో ప్రవేశపెట్టుటా యను సమస్య భగవదధీనమైనది. ఇంతలో అతిత్వరితముగనే భారతప్రజల, మానవకోటి అదృష్టమువశమున విద్యుద్దీపములు వెలిగినవి. మహాత్మాగాంధీగారికి శస్త్రచికిత్స జయప్రదముగ జరిగినది. ఆయనకు దేహము నెమ్మ

దించుచుండగ ఫిబ్రవరి 5 వతేదీన బ్రిటిషుప్రభుత్వము వారు ఎట్టి షరతులు లేకుండా ఆయనను విడుదలచేసిరి. మహాత్మాగాంధీగారు ఎఱవాడ జైలు నుంచి వచ్చి కొన్నిరోజులు ససూన్‌హాస్పటలులో చికిత్సపొంది, పిమ్మట బొంబాయిదగ్గరనున్న జుహూ అను సముద్రతీరపురేవులో కాలముగడపిరి. ఆకాలములో హిందూ మహమ్మదీయపోరాటములను ప్రతిచోట ప్రభుత్వోద్యోగులు లేవదీయుచుండిరి అందుకై గాంధీగారు 21 దినములు ఉపవాసములు చేసిరి. ఆ ఉపవాసకాలమున దేశనాయకులందరు, అన్నిమతముల వారు ఆయనవద్ద సమావేశమయిరి. కలకత్తా క్రైస్తవబిషప్పుగారుకూడ వచ్చిరి. మతములమధ్య కొట్లాటలు జరుగకుండ నాపుటకు ఒక జాతీయపంచాయితీ ఏర్పడ్డది. గాంధీగారిఉపవాసము ఆపివేయబడినది. ఆకాలమున గాంధీగారికిని స్వరాజ్యపార్టీకిని అభిప్రాయభేదములు తీవ్రముగ గలవనితలచి ప్రభుత్వమువారు బంగాళములో నిర్బంధవిధానములను సాగించుచుండిరి. చిత్తరంజనదాసుగారిని అరెస్టుచేయుసూచనలు కనపడెను. మహాత్మాగాంధీగారు చిత్తరంజనదాసుగారికి సర్వవిధముల బలమునిచ్చుటకు నిశ్చయించి, నవంబరు 23, 24 తారీఖులలో బొంబాయిలో అఖిలభారత కాంగ్రెసుకమిటీని సమావేశపరచి, అక్కడ గాంధీగారు జైలులోనున్నకాలములో జరిగిన అన్నివిషయములు తెలిసికొని శాసనసభాప్రవేశము అంగీకరించబడినట్లు మహాత్మాగాంధీ, దేశబంధు చిత్తరంజనదాసు, పండిత మోతీలాల్ నెహ్రూగారలు సంయుక్త ప్రకటనను గావించిరి. ఆ ప్రకటనప్రకారము శాసనసభలవ్యవహారములు స్వరాజ్యపార్టీవారు చూచుకొనవలెననియు, కాంగ్రెసుసభ్యులందరు నెలకు 2 వేల గజములు చేతితోవడికిననూలును ఇవ్వవలెననియు తీర్మానించబడెను. 1924 డిశంబరులో బెల్గాంలో మహాత్మాగాంధీగారిఅధ్యక్షతను కాంగ్రెసుమహాసభ సమావేశమయినది. దానిలో అన్నిబహిష్కారములు తీసివేయబడినవి. విదేశవస్త్రబహిష్కారము మాత్రము నిలిపియుంచబడినది. స్వరాజ్యనిర్వచనమువిషయములో తాను బ్రిటిషు కామన్‌వెల్తులోపలనే అంతర్భాగముగా స్వరాజ్యము సంపాదించుటకు ప్రయత్నముచేతుననియు, అది సాధ్యముగానిచో బ్రిటిషువారితోగల యావత్తుసంబంధమును వదలుకొని సంపూర్ణ

స్వాతంత్ర్యమునే సంపాదించెదననియు మహాత్మాగాంధీగారు చెప్పిరి. గాంధీ, దాసు, నెహ్రూలమధ్య జరిగిన ఒప్పందము ఖాయపరచబడెను.

1923 వ నవంబరులో జరిగిన ఎన్నికలలో బంగాళములోను, మధ్య పరగణాలలోను స్వరాజ్యపార్టీవారు శాసనసభలను బాగుగా ఆక్రమించుకొనిరి. 1924, 25 సంవత్సరములలో బంగాళాశాసనసభలో దేశబంధు చిత్తరంజన దాసుగారినాయకత్వమున స్వరాజ్యపార్టీవారు ప్రభుత్వమువారి బిల్లులనన్నిటిని, వారు పెట్టిన ఆదాయవ్యయపట్టికలను త్రోసివేసిరి. ఆ బిల్లులు, ఆ ఆదాయ వ్యయపట్టికలు గవర్నరు లిట్టన్‌ప్రభువుచే సర్టిఫైచేయబడి అమలులోపెట్ట బడినవి. స్వరాజ్యపార్టీవారు మంత్రిపదవులను స్వీకరించలేదు. ప్రభుత్వము వారు ఇతరపార్టీలలోనుంచి యిద్దరుమంత్రులను నియమించగా వారిజీతము శాసనసభలోని అధికసంఖ్యాకులచే కొట్టివేయబడినది. మధ్యపరగణాలలో మాత్రము స్వరాజ్యపార్టీవారు ప్రభుత్వమువారు సహకరించినంతవరకే తామున్నూ ప్రభుత్వముతో సహకరించెదమని(Responsive Co-operation) తీర్మానముచేసుకొనిరి. ఢిల్లీశాసనసభలో కూడ మోతీలాలు నెహ్రూగారినాయకత్వముక్రింద స్వరాజ్యపార్టీ బలముగానే ఏర్పడెను.

1923 వేసంగిలో సుభాసుచంద్రబోసుగారిని ప్రభుత్వమువారు అరెస్టు చేసి విచారణలేకుండ జైలులోనుంచిరి. 1927 మేనెలలో విడుదలచేసిరి. ఈ నాలుగుసంవత్సరముల కారావాసములో ఆయనఆరోగ్యము చాల చెడి పోయెను. బయటికివచ్చినపిమ్మట ఆయన ఆరోగ్యము కోలుకొనుటకు చాల కాలము పట్టెను. కొంతకాలము మదరాసులోని పెనిటెన్సరీజైలులో నుంచిరి. నేను అపుడు మద్రాసుజైలులో నా మిత్రులును, కాంగ్రెసుప్రముఖులునైన వి.యల్. శాస్త్రిగారితోకూడ ఆయనవద్దకుపోయి చూచి దేశస్వతంత్రపోరాట మునుగూర్చి మాటలాడి వచ్చుచుండెడివాడను. ఆయన కమ్యూనిజముకు, ఫాసి జముకు వ్యతిరేకి. వీలయినంతవరకు శాంతియుతసాధనములచేతనే స్వరా జ్యము సంపాదించవలెను. అవసరమైనచో కత్తికట్టియైన విదేశప్రభుత్వ మును వెడలగొట్టవలెను, అని నిశ్చయించిన మహా విప్లవకారుడైన జాతీయవాది.

1924 ఆఖరున గాంధీ, దాసు, నెహ్రూల ప్రకటన కాగానే దేశ బంధు చిత్తరంజనదాసుగారి కోరికమీద ఆంధ్రదేశములోగూడ ఆంధ్రరాష్ట్ర స్వరాజ్యపార్టీని ఏర్పాటుచేసితిమి. దానికి నేను అధ్యక్షుడుగను, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, నడింపల్లి లక్ష్మీనరసింహారావుగార్లు కార్యదర్శులుగను ఎన్నుకొనబడితిమి. ఉన్నవ లక్ష్మీనారాయణ, కె. వి. ఆర్. స్వామిగార్లు కూడ మా కమిటీలో నుండిరి. మా కమిటీపక్షమున వెన్నేటి సత్యనారాయణ గారు "చిత్తరంజన్" అను పత్రికను నడిపిరి. గాని దీనివలన మేము కాంగ్రెసులో మామూలుగా పనిచేయుటలో మార్పేమియులేదు. నేను అది వరకువలెనే ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు ప్రధానకార్యదర్శిగ పనిచేయుచుంటిని. ఆంధ్ర స్వరాజ్యపార్టీ కొంతకాలము పనిచేసి 1925 అక్టోబరునెలలో యావ ద్భారత స్వరాజ్యపార్టీ రద్దుకాగానే విచ్ఛిన్నముచేయబడినది. అదివరకే బిక్కిన వెంకటరత్నం, పిల్లలమర్రి ఆంజనేయులు, చింతలపాటి నరసింహ రాజుగార్లు మదరాసు స్వరాజ్యపార్టీ పక్షమున మద్రాసుశాసనసభలో సభ్యు లైరి. పిమ్మట ఆంధ్రస్వరాజ్యపార్టీ పక్షమున కట్టమంచి రామలింగారెడ్డిగారు సభ్యులుగ ఎన్నుకొనబడిరి ఆయన మంత్రి రాజా రామారాయణంగారిమీద విశ్వాసరాహిత్యతీర్మానముపెట్టి గొప్ప యుపన్యాసమునిచ్చెను. ఆ తీర్మానము వీగిపోయెను.

1924 లో గాంధీపూజానిధియనుపేరున నొక కాంగ్రెసునిధిని వసూలుచేయవలెనని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీవారు తీర్మానించినందున దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారు, నేను కలిసి పశ్చిమ గోదావరిజిల్లాలో వసూలుచేయుటకు బయలుదేరితిమి. మేమిద్దరము షుమారు పాతికవేలరూప్యములను వసూలుచేసితిమి. మా సంచారములో ఆత్మకూరి గోవిందాచార్యులుగారు మొదలగు కాంగ్రెసునాయకులు వారి వారి స్థలము లలో సహాయపడినను, పశ్చిమగోదావరిజిల్లా కాంగ్రెసుఅధ్యక్షులగు దండు నారాయణరాజుగారు తుదివరకు మాతో వుండిరి. ఆ సంవత్సరము జూన్ రెండవ తేదీన ఎండ విపరీతముగ నుండెను. భీమవరముసత్రములో మకాముపెట్టి మధ్యాహ్నంవేళ కారులో బయలుదేరి నారాయణరాజుగారి స్వగ్రామమునకు ఆ ప్రక్కయూరికి పోయి అచటి గృహస్థులను చూచి

కొంత నిధిని వసూలుచేసితిమి. నా కపుడే జ్వరము తగిలినందున వెంటనే భీమవరమునకు మరలివచ్చితిమి. ఆ జ్వర మెక్కువయ్యెను. ఆ కారణముచే నేను వారినిద్దరిని విడచి భీమవరములోని నా స్నేహితులగు లాయరు గుండు వెంకటాచలంగారింటికి పోయి మందుపుచ్చుకొని విశ్రమించితిని. పిమ్మట ఆ నిధివసూలుకు పోలేదు. మరునాడు జ్వరము కొంత తగ్గినందున నేను రైలులో బెజవాడకు చేరితిని. అది పెద్దచలిజ్వరముగా పరిణమించినది. ఆరు నెలలు ఆ జ్వరము నన్ను వేధించినది. క్వైనుఇంజక్షనులు ఇవ్వగనే తగ్గుచు మరల వచ్చుచుండెను. ఆ జ్వరమువచ్చుచున్నరోజులలోనే బెజవాడలో మా యింట్లో కానూరు లక్ష్మణరావుకు (కె. ఎల్. రావు) మా మేనగోడలు కుమార్తె వరలక్ష్మమ్మను ఇచ్చి వివాహముచేసినాము. తర్వాత కొద్దినెలలకు నా పెద్ద మేనగోడలు సరస్వతమ్మభర్త పెద్దాడ వెంకటేశ్వరరావు మరణించినాడు. ఆ పిమ్మట నెలరోజులకు నా చెల్లెలిభర్త సూర్యనారాయణ స్వర్గస్థుడైనాడు. ఆ రోజులు మా కుటుంబమునకు చాల చికాకు రోజులుగ నుండెను. ఎలోపతిమందులు తీసుకొనుటచే తాత్కాలిక ఉపశమనముజరిగినదేగాని మరలమరల జ్వరమువచ్చుచునేయుండెను. ఆసంవత్సరము నవంబరులో బెజవాడమునిసిపలుకౌన్సిలుసభ్యత్వమునకునిలబడిపోటీచేసితిని. కొంచెము వార్డులో తిరగగనే చలిజ్వరము వచ్చెను. గాని మునిసిపలుఎన్నికలలో గెలిచితిని. డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారి ఆయుర్వేదమందు రెండు నెలలు పుచ్చుకొన్నమీద జ్వరము పోయినది. అప్పటినుంచి మరల చలిజ్వరము రాలేదు. 1925 ప్రారంభమునుండి ఆరోగ్యము బాగుగనున్నందున ఆ సంవత్సరము ఏప్రిలునెలనుండి మునిసిపలుచైర్మనుపదవి స్వీకరించినాను.

1925 జూన్ 16 వ తేదీన డార్జిలింగులో దేశబంధు చిత్తరంజనదాసుగారు భారతదేశమునంతను దుఃఖములోముంచి పరమపదించిరి. భారతదేశమునకు తీరనినష్టము కలిగెను. ఇండియామంత్రి, రాజప్రతినిధి ఇద్దరు కూడ వారిమరణమునకు సానుభూతిని తెలియపరచిరి. దాసుగారు మరణించిన పదవరోజున కలకత్తాలో దాసుగారిగృహమునందే అఖిలభారత కాంగ్రెసుకమిటీ సమావేశమయ్యెను. నేనుకూడ అందులో పాల్గొంటిని. మే మందరము దుఃఖమును వెలిబుచ్చితిమి. దాసుగారు బ్రతికియుండగనే ఒక ధర్మసంస్థ

నిధిగా నేర్పాటుచేసి తమగృహమును స్త్రీలఆసుపత్రికి యిచ్చివేయిరి. గాంధీగారు 10 లక్షల రూప్యములను వెంటనే వసూలుచేసి ఆ ధర్మసంస్థను బాగుగ నడపుటకు ఏర్పాట్లుచేసిరి బంగాళా శాసనసభ స్వరాజ్యకక్షినాయకుడుగను, కలకత్తా మునిసిపలుకార్పొరేషనుకు మేయరుగను, బంగాళా రాష్ట్రీ కాంగ్రెసుకమిటీకి అధ్యక్షుడుగను కీర్తిశేషులైన దేశబంధు చిత్తరంజనదాసుగారు నిర్వహించుచున్న మూడుహోదాలకు వారికి వారసుడుగ జె. ఎమ్. సేన్‌గుప్తగారిని మహాత్మాగాంధీగారు నియమించిరి. ఇది అప్పటి బంగాళాకాంగ్రెసులో ప్రబలియున్న రెండవపార్టీయైన సుభాస్‌చంద్రబోసుగారి కక్షికి అయిష్టముగానుండెను.సుభాస్‌చంద్రబోస్‌గారు అహింసాతత్వమునందు పూర్తిగ విశ్వాసముకలవాడు కాడని మహాత్మా గాంధీగారి అభిప్రాయము. బంగాళములో అరాజకవాదులుగనున్న యువకులందరును సుభాస్‌చంద్రబోసుగారి అండను చేరిరి. అందువలన గాంధీగారు సేనుగుప్తగారినే నియమించి ఎన్నుకొనచేసిరి.

ఆ సంవత్సరము అక్టోబరు 1 వ తేదీన అఖిలభారత కాంగ్రెసు కమిటీ మరల సమావేశమై స్వరాజ్యపార్టీవారి కోరికప్రకారము మహాత్మా గాంధీగారిసలహా ననుసరించి కాంగ్రెసుసభ్యులు నెలకు రెండువేలగజముల చేతితోవడికినసూలు నివ్వవలెనను నిబంధన తీసివేసి, సభ్యత్వరుసుము 4 అణాలుగా నిర్ణయించిరి. ఇంతటినుండి శాసనసభలఎన్నికలలో స్వరాజ్య పార్టీపేరునగాక కాంగ్రెసుపేరనే పాల్గొనవలెననికూడ తీర్మానించబడెను. ఇంతటితో స్వరాజ్యపార్టీ రద్దయ్యెను. సభ్యులకు ఇష్టమున్నచో 4 అణాలకు బదులు నూలువడకి యివ్వవచ్చును. ఆ సంవత్సరము డిశంబరునెలలో కాంగ్రెసుమహాసభ కాన్పూరునందు సరోజినీదేవిగారి అధ్యక్షతక్రింద జరిగి, ఆ మహాసభలో ఇంతటినుంచి శాసనసభలకు కాంగ్రెసుపార్టీయే అభ్యర్థులనుపెట్టి శాసనసభాప్రవేశముచేయవచ్చుననియు, కాని మంత్రిపదవులను మాత్రము అంగీకరించకూడదనియు తీర్మానముచేయబడెను. హిందూస్తానీ భాష కాంగ్రెసుయొక్క అధికారభాషగ నిర్ణయించబడెను.

## (2)

భారతదేశములోను, ఆంధ్రదేశములోను మహాత్మాగాంధీగారినాయకత్వముక్రింద అహింసాయుత సహాయనిరాకరణోద్యమము విజృంభించుచుండగ ఆంధ్రదేశములో అల్లూరి సీతరామరాజను నొక మహాపురుషుడగు విప్లవకారుడు గోదావరి మన్యప్రాంతములలోని కొండజాతులను సమైక్యపరచి, వారిలో నత్యంత దేశాభిమానమును, విదేశీప్రభుత్వమైన బ్రిటిషుప్రభుత్వమును వెడలగొట్టి మాతృదేశమునకు స్వతంత్రము సమకూర్చవలెనని గాఢమైన స్వతంత్రాభిలాషను కలుగచేసి, ఇరువదినెలలపైకాలము బ్రిటిషుపోలీసులను, సైన్యములను ఎదిరించి, పోరాడి వారిపై కొన్ని జయములను పొంది, తుదకు 1924 మే 7 వ తేదీన తన ప్రాణములను బలిదానమొసంగెను. ఆయన సుభాస్‌చంద్రబోస్‌తోను, ఝాన్సీ లక్ష్మిబాయితోను పోల్చతగిన మహావీరుడు. పశ్చిమగోదావరిజిల్లా భీమవరముతాలూకా మోగల్లు గ్రామములోని ఒక మర్యాదగల క్షత్రియకుటుంబమునందు ఈ మహాపురుషుడు జన్మించెను. ఆయనతండ్రి వెంకట్రామరాజు, తల్లి నారాయణమ్మగార్లు. తండ్రి ఛాయాచిత్రములనుతీయుటలో ప్రఖ్యాతిపొంది మిగుల ఆత్మగౌరవముతో తన కుటుంబమును పోషించుకొనుచుండెను. కాని ఆయన సీతారామరాజుగారి ఎనిమిదేండ్ల ప్రాయముననే కలరావ్యాధివల్ల స్వర్గస్థుడయ్యెను. తండ్రి మరణించినప్పటికి చరస్థిరాస్తులేమియు ఈ కుటుంబమునకు లేవు. పినతండ్రి రామకృష్ణరాజుగారు డెప్యూటీకలెక్టరుఉద్యోగముచేసిరి. ఈ పిల్లవానిని తల్లియే పెంచి కొంత చదువుచెప్పించుటకు ప్రయత్నించినది. పినతండ్రిగారుకూడ ఈయనకు విద్య చెప్పించువిషయమున సహాయము చేసెను. కాని ఈ పిల్లవాడు సరిగ చదువుకొనలేదు. కొన్నిసంవత్సరములు విశాఖపట్టణములోను, పిమ్మట నర్సాపురములోను, ఆటుపిమ్మట తునిలోను చదివి ఐదవఫారమువరకు వచ్చెను. తునిలో పాఠశాల విడచి చెప్పకుండ ఎక్కడికో పోవువాడు. పాఠములు చదివేవాడుకాడు. ఈ పాడువిద్య-దీనితో మనకేమిపని అని చెప్పుచుండెడివాడు. ఒకరోజు ప్రధానోపాధ్యాయునికి కోపమువచ్చి ఇతనిని బెత్తముతో కొట్టెను. అంతటితో ఏ పాఠశాలలోను

తాను చదువనని, చెప్పకుండ పారిపోయెను. పిమ్మట ఎటులనో తెలుగు, ఆంగ్లము, హిందీ, సంస్కృతములయందు కొంత జ్ఞానమును సంపాదించెను. ఆంధ్రములోను, ఆంగ్లములోను కూడ తొట్రుపడకుండ మాట్లాడ గలిగెను. ఆయన కొంతకాలము మన్య ప్రాంతములోనున్న అడవులలో సంచరించుచు కొండజాతులపరిచయము, సాంగత్యము సంపాదించుచు, వారి కష్ట నిష్ఠురములను గ్రహించుచువచ్చెను. పిమ్మట ఉత్తరహిందూస్థానములో కాలినడకపై హిమాలయములవరకు సంచారమొనర్చి మరల బిస్తరుగుండ నాసిక్ చేరెను. అప్పటికే గాంధీగారు నాయకత్వమువహించి, రౌలటుసత్యాగ్రహమునకై ప్రయత్నించుట, వారు ఆంధ్రదేశమునకు వచ్చి పోవుట, పంజాబువధలు మొదలగు విషయములతో భారతదేశరాజకీయవాతావరణము మిగుల ఉద్రేకపూరితముగ నున్నది. తన ఉత్తరహిందూదేశ సంచారములో సీతారామరాజు ఆధ్యాత్మికమహాపురుషులనేగాక కొందరు రాజకీయ విప్లవకారులనుకూడా కలసినటులను, ఆంధ్రదేశములోని మన్య (ఏజన్సీ) ప్రాంతములలో విప్లవమునడుపవలెనను దృఢనిశ్చయముతో మరలివచ్చినటులను తెలియుచున్నది. సీతారామరాజు అంతటితో సన్యాసియయ్యెను. మన్యపు అడవులలో ప్రవేశించెను. అప్పటి కీయనకు ఇరువదినాలుగేండ్లవయస్సు. మిగుల స్ఫురద్రూపి. కొంతకాలము సంబరపర్వతముపై తపస్సుచేసెను. పిమ్మట తననివాసమును గోదావరినదీతీరమునగల పాపికొండలపైకి మార్చెను. వేదాంత జ్యోతిశ్శాస్త్రములతోపాటు క్షాత్రవిద్యను నేర్చెను. ధనుర్విద్యలో విల్లంబులు వేయుటలో నిపుణుడయ్యెను. పిమ్మట విప్లవమును సాగించినకాలములో తుపాకులు, పిస్తోళ్లు విరివిగా లభించినందున వాటిని కాల్చుటలోకూడ ఆయన గొప్ప సమర్థుడయ్యెను. క్షత్రియకులములో పుట్టినందున క్షాత్రవిద్యపై ఆయనకు మక్కువకలదు. మన్యప్రాంతములలో నివసించుచుండగ మన్యప్రజలు బ్రిటిషుప్రభుత్వముక్రింద పొందుచున్న ఘోర కష్టములు అన్యాయములు ఆయనకు బాగుగ తెలిసెను. ఆంధ్రజిల్లాలలో జమీందారీపద్ధతిని ప్రవేశపెట్టినట్లు మన్యప్రాంతములలో బ్రిటిషుసామ్రాజ్యవాదులు ముఠాదారీపద్ధతిని ప్రవేశపెట్టిరి. ఈ ముఠాదారులు తమక్రిందనున్న మన్యప్రజలను పీడించుకొనితినిరి. ఈ మన్యప్రజల దైవదత్తమైన హక్కులన్నీ నశించెను. భూములపై జిరాయితీహక్కు లేదు. వాటిని ఇష్టమువచ్చి

నట్లు ముఠాదారులు లాగుకొనిరి. అడవులలో గడ్డి తెచ్చుకొనుటకు, పశువు లను మేపుకొనుటకు హక్కులు నశించెను. మామూలుచట్టములు ఈ మన్య ప్రజలకు వర్తించవు. అతి నిరంకుశమైన ప్రభుత్వవిధానమే వారిపై మోప బడెను. గడ్డి ఎండిపోయినను సరే వారిపశువులు మేయకూడదు. చెట్లను ఫలించిన ఫలములు రాలిపోయినను, కుళ్ళిపోయినను సరే వారు తెచ్చుకొన కూడదు. ఆంధ్రజిల్లాలనుండి వచ్చిన వర్తకులుకూడ ఆ ప్రజలను మభ్య పరచి చౌకగా మన్యమున ఫలించు ఫలసాయమును వారిచేతకోయించి తెచ్చు కొని, వారికి కావలసినవస్త్రములు మొదలైనవాటిని బహు ప్రియముగ నమ్మిరి. ఈ మన్యప్రజలకు వాగ్దత్తముచేసిన కూలికూడ యివ్వకుండ కంట్రాక్టరులు, ప్రభుత్వోద్యోగులు బహు తక్కువకూలి నిచ్చుచు వెట్టిచాకిరీ చేయించుకొనుచుండిరి. వారికష్టములు దుర్భరముగ నుండెను. ఆకలిబాధ, అధికారులయొత్తిడి, స్వేచ్ఛానిరోధము, ముఠాదారులవల్లను, వర్తకులవల్లను, కంట్రాక్టరులవల్లను మోసము. ఇవేగాక క్రైస్తవమతప్రచారముకూడ వారిలో నిర్బంధముగ కొనసాగించబడినది. అక్కడనున్న బాస్టియను నొక క్రైస్తవ తహసీల్దారు, బహు లంచగొండి. క్రూరస్వభావము గలవాడు. ఈ ప్రజలను నిర్బంధించి అబద్ధపుకేసులు పెట్టించి పోలీసులమద్దతుతో బెదిరించి క్రైస్తవమతబోధకులకు వప్పగించి క్రైస్తవులు కాగానే మతబోధకుల సిఫారసుమీద వారికి అనుకూలము చేయుచుండెను. ఇటుల జరుగుచున్న వాటిని కొన్నిసారులు సీతారామరాజు కనుగొని క్రైస్తవపాదరీలను, పోలీసు లను బెదిరించి వెళ్ళగొట్టెను. ప్రభుత్వోద్యోగులనుండి, క్రైస్తవమతప్రచార కులనుండి ఈ బాలయోగి, ఈ తపశ్శాలి, ఈ సన్యాసి తమను రక్షించగలుగు నని ప్రజలు తలచి ఆయనచుట్టూ చేరిరి. ఆయన వారికి జోస్యముచెప్పుటయే కాక సరియైన మతము, భక్తి, వేదాంతముల గురించి చెప్పుచుండెను. త్రాగుడు మాన్పించెను. త్రాగుడు మానెదమని శపథములు తీసుకొనుచుం డెను. ప్రజలు ఈయనను ఒక మహాత్ముడని పూజించుచుండిరి.

ప్రభుత్వోద్యోగులు ముఠాదారుల మధ్యను, ముఠాదారులకు ప్రజలకు మధ్యను కూడ కలహములుపెట్టి తమ నిరంకుశత్వమును సాగించుచుండిరి. అంతేగాక సీతారామరాజు ముఠాదారులకుకూడ న్యాయమునే చేసెను. వారుకూడ ఆయన గొప్ప మహాత్ముడని నమ్మిరి. ఆయనబోధలకు ముఠా

దారులు, ప్రజలుకూడ లోబడి ఆయనచెప్పినచొప్పున నడచుకొనుటకొప్పు కొనిరి. ఆయన గోదావరి ఏజన్సీ గ్రామములన్నిటిలో గ్రామస్వరాజ్యమును స్థాపించి ఐకమత్యమును కలుగచేసెను. ప్రభుత్వోద్యోగస్థుల శలవులేకుండ అడవులలోకి పోయి కట్టె కలప తెచ్చుకొనుట, పశువులను మేపుట, చెట్ల పండ్లను, చింతచెట్ల కుంకుడుచెట్ల ఫలసాయమును తెచ్చుకొనుట, వెట్టిచాకి రీని తిరస్కరించుట, ప్రభుత్వోద్యోగుల కెట్టి సప్లయిచేయకుండుట మొద లగు సాత్వికనిరోధమును నేర్పెను. ఇందుకు ప్రతిచోటను శాంతిసైనిక దళములను నెలకొల్పెను. విల్లంబులు, బల్లెములు, కత్తులు ధరించి తనతో వచ్చెడు విప్లవ సేనలను తయారుచేసెను. గాము గంటందొర, గాము మల్లుదొర లను శూరులైన యిరువురు సోదరులు ఈయనకు ప్రధమ కప్తాను లైరి. సీతారామరాజుగారు 22-8-1922 తేదీనుండి తన విప్లవసేనలతో బయలుదేరి మూడుదినములలో వరుసగ చింతపల్లి, కృష్ణదేవిపేట, రాజ వొమ్మంగి పోలీసుస్టేషనులను ముట్టడించి అక్కడి పోలీసులను భయభ్రాం తులనుగావించి ఆ స్టేషనులలోనున్న తుపాకులు, కత్తులు, మందుగుండు సామగ్రిని స్వాధీనపర్చుకొనివచ్చెను. తన యనుచరులకు ఆ ఆయుధము లను మందుగుండుసామానును పంచిపెట్టి, వారిని సాయుధ విప్లవసైనికుల గావించెను. ఆంధ్రలోని వివిధజిల్లాలనుండి పోలీసులు, సైనికపోలీసులు ఆంగ్లేయసేనానులక్రింద వచ్చి అరణ్యములో దిగిరి. కాని వారికి ప్రజలెవ రును సహాయముచేయరైరి. త్రోవలు చూపరైరి. విప్లవకారులు పోవు త్రోవలజాడలు చెప్పరైరి. ప్రభుత్వసైనికపోలీసులు వేసుకున్న తంతిమార్గ ములను విప్లవకారులు తెగ్గొంచివైచిరి. వారికివచ్చుచున్న భోజనపదార్థములను విప్లవకారులు స్వాధీనపర్చుకొనిరి. కొండప్రాంతములలో అకస్మాత్తుగా విప్లవకారులు తమపై పడగనే ప్రభుత్వసేనానులు సైన్యములతో పారి పోయిరి. 4-9-22 తేదీన స్కాటుమనుహోర్ సేనానిక్రింద నడచుచున్న సైనిక పోలీసులపైన విప్లవకారులు ఆకస్మికముగవచ్చిపడగా ఆ సేనాని తన సేన లతో పారిపోయెను. ఒకప్పుడు సైనికుల సామానులను ఆయుధసామగ్రిని మోసుకొనిపోవుటకు విప్లవకారులే కూలీలుగ వచ్చి నటించి కొంతదూరము నడచినపిమ్మట యొక వీలైనచోట తటాలున తమ తోటివిప్లవకారులు వారి మీద పడగా, ఆయుధములను తీసుకొని పరారైరి. మామూలుకూలీలు

ప్రభుత్వసైనికపోలీసులకు దొరకకుండిరి. తామే సామానులు మోసుకొని పోవలసివచ్చెను. సాండర్సు, టాల్బర్టు సేనానులు కూడ ఇటులపారిపోయిన వారే. 24-9-22తేదీన స్కాట్, హవర్డుహైటరులను సేనానులు తమ సైనికులతో సీతారామరాజుగారి తలనునరికితెచ్చెదమని ప్రగల్భములుకొట్టి విప్లవకారులను పట్టుకొనుటకు బయలుదేరి వచ్చుచుండగా దమనపల్లిగ్రామసమీపమున ఇరుకుస్థలములో విప్లవకారులు దాగుకొని తుపాకులు మాటుపెట్టి వారిపైన కాల్చిరి. ఆ యిద్దరుసేనానులు మరణించిరి. ఒక భారతీయపోలీసుకూడ మరణించెను. ప్రభుత్వసైన్యములు చెల్లాచెదరయ్యెను. ఆ పిమ్మట నాఫ్ అను సేనానిక్రింద మలబారుదళములు దిగెను. రూథర్‌ఫోర్డు కలెక్టరుగా వచ్చెను. సీతారామరాజును పట్టిఇచ్చినవారికి పదివేలరూప్యముల బహుమతి, ఇతరులను పట్టిఇచ్చినవారికి తక్కువ బహుమతులు ఇచ్చెదమని ప్రకటించిరి. ప్రయోజనము కలుగలేదు. జయపురసంస్థానాధీశులు ప్రభుత్వసహాయార్థము ఏనుగులను పంపిరి. కొన్ని కంచరగాడిదెలుకూడ దిగెను. వీటన్నింటితో పోలీసులు, సైనికులు అడవులలో తిరుగుచుండిరి. సీతారామరాజు 15-10-22 తేదీన అడ్డతీగెల పోలీసుస్టేషనును ముట్టడించగా పోలీసులు పారిపోయిరి. ఆయనకు తుపాకులు మందుగుండు దొరికెను. 19-10-22 తేదీన సీతారామరాజు రంపచోడవరమునకు పోయి తాలూకాఆఫీసును ముట్టడించగా జాన్ సేనాని సైనికులతో పారిపోయెను. అచటి తాలూకాసిబ్బంది ప్రజలతో కలిసి సీతారామరాజుగారికి మంగళహారతులిచ్చిరి. కొన్నిచోట్ల సైనిక పోలీసులలో సీతారామరాజుయందు భక్తి యేర్పడి, ఆయన సమీపించగనే ఆయుధములు పారవైచి పోవుచుండిరి. అట్టివారిని పంపివేసి సేనానులు కొత్తవారిని తెప్పించిరి. ఈ సంగతి హాపెల్‌సేనాని తన రిపోర్టులోనే వ్రాసెను. హాపెల్‌సేనాని ప్రభుత్వమునకు పంపినరిపోర్టులో "సీతారామరాజుకు గూఢచారులద్వారా వార్తలు తెలుసుకొనుటలో మంచి నేర్పు కలదు. మా సేనలు ఒకచోటనుండి బయలుదేరి వేరొకచోటికి వెడలకమునుపే యీ వృత్తాంత మతనికి తెలియుచుండెను" అనికూడ వ్రాసియున్నాడు.

ఇటుల విప్లవము సాగుచుండెను. 1922 సీతాకాలములో మన్యములో మలేరియా ప్రబలెను. ప్రభుత్వసైనికులు ఆస్పత్రులలో చేరుచుండిరి. విప్లవకారు లెట్లులో దానిని బాగుగ తట్టుకొనుచుండిరి. 6-12-22 తేదిన

పెదగడ్డపాలెంవద్ద ప్రభుత్వసైన్యములు సీతారామరాజు వచ్చుచున్నత్రోవను నాలుగువైపులా చుట్టుముట్టి కాల్చసాగిరి. వెనుకనుండి కొన్ని విప్లవసేనలు వచ్చి మీదపడుటచే ప్రభుత్వసేనలు యుద్ధరంగమును విడిచిపోయెను. మరల నారాత్రి వుభయులకు లింగాపురమువద్ద యుద్ధముజరిగెను. విప్లవకారులు ధీరత్వముతో పోరాడి చాలామంది వీరస్వర్గమునలంకరించిరి. సేనాని స్విన్ క్రిందనున్న ప్రభుత్వసేనలలోకూడ చాలమంది మరణించిరి. యుద్ధము చాలించి ఎవరిత్రోవనువారు పోయిరి. అప్పటినుండి ప్రభుత్వమువారు ముఠా దారులపైన ప్రజలపైనమిగుల కఠినచర్యలను అమలుజరుపసాగిరి. గ్రామముల మీద శిక్షార్థపు (ప్యూనిటివ్) పన్నులు విధించిరి. కొంతమంది ముఠాదారీలను ప్రభుత్వములో కలుపుకొనిరి. అమాయకప్రజలను పట్టుకొని రాజద్రోహనేర మున దారుణశిక్షలు విధించిరి. సీతారామరాజును అనుచరులను పట్టివ్వనిచో నింతకన్న ఘోరకార్యములు జరుగునని బెదరించిరి. విప్లవకారులకు సైనికు లకు అక్కడక్కడ పోరాటములు జరుగుచునేయుండెను. 1923వ సంవత్స రారంభమున సీతారామరాజు క్రింకురోడ్డుమీదనున్న అన్నవరమునకుపోయి పోలీసుస్టేషనును దోచుకొనెను. సర్కిలుఇనస్పెక్టరు ఆయనకు లోబడెను. అచ్చటి జనులెల్లరు తండోపతండములుగవచ్చి సీతారామరాజును గొప్ప యుత్సవముతో సత్రముకు తీసుకొనిపోయి, పూలవర్షము కురిపించిరి. భక్తిప్రపూర్ణులై చాలామంది సాష్టాంగపడిరి. హారతులతో పండ్లు, వస్త్ర ములు, కానుకలు సమర్పించిరి. ఆయన చర్మాసీనుడై కొంచెముసేపు సంభాషించెను. భావిలో స్నానముచేసి జపతపములు నిర్వర్తించి ఫలహా రములారగించి పదిగంటలకు బయలుదేరి వెళ్ళెను. చిట్టడవులలో, రాతి నేలలలో పాదరక్షలైన లేకుండ ఇరువదియైదుసంవత్సరముల ఆ బాలయోగి రివ్వురివ్వున నడచుచుండుట ప్రజల కాశ్చర్యముకలుగచేసెను, పిమ్మట శంఖవరగ్రామమును ఆయన సందర్శించెను. అచటిప్రజలు మంగళహారతు లతో పూలదండలతో కానుకలతో ఫలములతో సత్కరించిరి. ఇంతలో రైలులో అనేక సైనికపోలీసులు అన్నవరము రైలుస్టేషనులో దిగిరి. జిల్లాకలె క్టరు రూథర్‌ఫోర్డు అచటికి వచ్చెను. నాలుగువేలరూప్యముల శిక్షార్థపుపన్ను నా గ్రామముమీద విధించెను. గాని కొలదిమైళ్ళదూరముననున్న శంఖవరగ్రామ మునకు పోవుటకు భయపడెను. ఆ దినములలోనే నారాయణరాజును, మరి

యొక క్షత్రియవీరుడు భీమవరమునుంచి వచ్చి విప్లవములో చేరెను. ఆయనను అగ్గిరాజని పిలచిరి. 1923వ సంవత్సరమంతయు విప్లవకారులు గోరిల్లా యుద్ధములు చేయుచునే యుండిరి. ఈలోగా మల్లుదొరను అకస్మాత్తుగా సైనికులు పట్టుకొనిరి. ఆయనను విచారించి యావజ్జీవకారాగారశిక్ష విధించిరి. యావజ్జీవశిక్ష చాలకాలము అనుభవించినపిమ్మట మల్లుదొర వగైరాలందరు విప్లవఖైదీలను 1937 వ సంవత్సరములో రాజగోపాలాచారి ప్రధానమంత్రిగా నేర్పడిన మొదటికాంగ్రెసుప్రభుత్వము విడుదలచేసినది. అటుపిమ్మట 1952 సంవత్సరములో మల్లుదొర పార్లమెంటులో ఏజన్సీప్రజలతరపున సభ్యుడుగా నెన్నుకొనబడి పనిచేసినాడు. గోరిల్లావిప్లవము సాగినకొలది ప్రభుత్వ సైనికులు గ్రామములమీదపడి తగులబెట్టసాగిరి. విప్లవకారులు హతులవుచుండ క్రొత్తవారువచ్చి చేరుటలేదు. ప్రభుత్వపక్షమున తండోపతండములుగ క్రొత్తవారువచ్చి దిగుచుండిరి. ప్రజలలో భీతాహముకలిగినది. నిరుత్సాహమెక్కువైనది. సీతారామరాజు కెంత సహాయముచేసినను బ్రిటిషుప్రభుత్వము పడిపోదనుభావము ప్రజలలో వృద్ధిఅయినది. అందువలన సీతారామరాజు క్రొత్తవిప్లవసైనికులను తెచ్చుటకై పర్లాకిమిడిఅడవులకు పోయెను. కొన్ని నెల లచటయుండి క్రొత్తవ్యాని తెచ్చెను గాని, యీలోపుగ ప్రజలలో ప్రభుత్వపక్ష మొకటి బయలుదేరెను. వారిని అగ్గిరాజు మొదలగు సీతారామరాజుయనుచరులు ఎదిరించి కష్టపెట్టినకొలది ప్రభుత్వపక్షము వృద్ధియయ్యెను. ఇంతలో సీతారామరాజు వచ్చెను. ప్రజలందరు ఎట్టిభేదాభిప్రాయములు లేకుండ ఆయనయందు గౌరవమున్నే చూపిరి, ఆయనను పట్టియిచ్చుటకు ఎవ్వరును సమ్మతించలేదు గాని, చాలమంది విప్లవముతో విసిగినామని ఆయనతో చెప్పిరి. ఆయనతో పనిచేయుటకు ముందుకు రాలేదు. ఇంతలో ప్రభుత్వసైనికులు ఆయనవర్గములో పనిచేసినవారిమీద వారి కుటుంబములమీద అతిక్రూరముగా ప్రవర్తించిరి. వారి ఇండ్లు తగులబెట్టిరి. పురుషులను స్త్రీలను పిల్లలను హత్యచేసిరి. స్త్రీలను మానభంగమొనర్చిరి. ప్రతిచోట ఆర్తనాదములు చెలరేగెను. సీతారామరాజు నిస్సహాయుడయ్యెను. తనవల్లనే వారి కట్టిబాధలు కలుగుచున్నవని మిక్కిలి వగచెను. విప్లవముచాలించి ఆత్మార్పణముగావించుకొనుటకు నిశ్చయించెను. 1924 మే నెలలో ఆయన తన ముఖ్యఅనుచరులను పిలచి ప్రభుత్వసైన్య

ములు నెదుర్కొని వీరస్వర్గ మలంకరింపవలెనని కోరెను. అగ్గిరాజు ఆయుధములతో నెదుర్కొనెను. ప్రభుత్వసైనికులు ఆయనను గాయపరచి పట్టుకొని అండమానుద్వీపమునకు పంపిరి. పడాలు మొద లగు కొందరు అనుచరులను సైనికులు హత్యగావించిరి. అది 1924 మేనెల 7 వ తేదీ ఉదయము. అపుడు మంపగ్రామసమీపముననున్న ఏటియొడ్డున యొక యోగి తపస్సుచేసుకొనుచు నొకలేఖను ఒక కోయ బాలునికిచ్చి దానిని సమీపమున తిరుగుచున్న పోలీసుఉద్యోగికి అందజేయ వలెనని కోరెను. ఆ లేఖను చదువుకొని ఆ పోలీసుఉద్యోగి ఆయనవద్దకు వచ్చి మీ పే రేమిటని అడిగెను. నా పేరు సీతారామరాజు అని చెప్పెను. ఆవెంటనే ఆయనను తీసుకొనిపోయి సేనానియగు మేజరు గుడాలుకు వప్ప గించెను. అతనికికూడ తాను సీతారామరాజునని చెప్పెను. ఈ యోగివద్ద ఆయుధములేమీ లేవు. మేజరు గుడాలు ఆయనను పట్టుకొని గొలుసులతో నొకచెట్టునకు కట్టివేయించెను. ఆవెంటనే కలెక్టరు రూథర్‌ఫోర్డువచ్చి సీతా రామరాజును తుపాకితోకాల్చి చంపవలెనని మేజరు గుడాలుకు ఆజ్ఞనివ్వగా సైనికశాసనమమలులో లేదనియు. ఆయనను విచారించి శిక్షించవలసినదేగాని తుపాకితో కాల్చిచంపుటకు వీలులేదనియు, తాను చంపననియు చెప్పగా రూథర్‌ఫోర్డే స్వయముగ సీతారామరాజు వక్షస్థలముపై తుపాకినికాల్చి హత్యగావించెనని మాకు ఆ దినముననే రాజమహేంద్రవరములో ఆంధ్ర రాష్ట్రి కాంగ్రెసుకమిటీ సమావేశములో తెలిసినది. గాని, పొన్నలూరు రాధా కృష్ణమూర్తిగారువ్రాసిన సీతారామరాజుగారి జీవితచరిత్రలో మేజరు గుడాలే సీతారామరాజుగారిని తుపాకితో కాల్చిచంపెనని వ్రాసినారు. మరియొకరు వ్రాసిన బుర్రకథలో సీతారామరాజు యుద్ధముచేయుచునే శత్రువులచేత చంప బడెనని వ్రాయబడియున్నది. మాకు వెంటనే తెలిసినవార్తనే నేను నమ్ము చున్నాను. శవపరీక్ష చేయించకుండానే సీతారామరాజుగారి కళేబరమును పెట్రోలునూనెతో దహనమొనర్చి బూడిదగావించిరి. అందుచే ఆ ఘట్టము మరింత సంశయాస్పదమైనది. కొంతమందిగ్రామస్థులచేత ఆయనను మేజరు గుడాలుయుద్ధములో పట్టుకొనగ ఆయన పారిపోవుటకు యత్నించినందున పోలీసుతుపాకితోకాల్చగా, ఆయనమరణించెనని యొకపంచాయితీని వ్రాయించి ప్రభుత్వమునకు పంపినారు. ఆ ప్రకారము ప్రకటించినారు. ఆయనను

స్మశానముగావించినప్రదేశము గొప్ప యాత్రాస్థలమైనది. ఆ బూడిదను వేల కొలదిజనులుపంచుకొని మొగమునపూసుకొన్నారు. గంటందొర పదిసంవత్సరములు నానాసాహెబువలెచిక్కకుండతిరుగుచుతుదకు 1934లోపట్టుబడి అండమాను ద్వీపములకు పంపబడినాడు. సీతారామరాజుగారిని ఈవిధముగ హత్య చేసిరనువార్త మా కపుడు రాజమహేంద్రవరములో తెలిసి మేమందరము విశేషముగ దుఃఖపడితిమి. సీతారామరాజు చంపబడనేలేదని, ఎవరినోచంపి సీతారామరాజును చంపినామని ప్రగల్భములాడుచున్నారని, ఆయన ఇంకను బ్రతికియున్నాడని చాలాకాలమువరకు కొందరు మిత్రులు చెప్పుచుండిరి. మా పూజ్యమిత్రులైన బులుసు సాంబమూర్తిగారు అటుల చెప్పుచుండిన వారిలో నొకరు. కాని దాని కేదియు నాధారములేదు. సీతారామరాజుగారు అప్పటికిని, యిప్పటికిని మరల నెచటను కనపడలేదు. సీతారామరాజుగారు పరమపదించినారనియే నమ్ముచున్నాను. సీతారామరాజుగారి అనుచరులలో ప్రభుత్వముచే అరెస్టుచేయబడిన మరికొందరు మన్యపునాయకులు రాజమహేంద్రవరంజైలులోను, కడలూరుజైలులోను, ఏమ్మట రాయవేలూరు జైలులోను మాతో సహజైదీలుగ నుండిరి. అప్పటికి సీతారామరాజుగారు చంపబడలేదు. దేశస్వతంత్రముకొరకు గొప్ప విప్లవమునడిపి తన ప్రాణము లర్పించిన బాలయోగి సీతారామరాజునకు ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువా రొక స్మారకచిహ్నమును ప్రతిష్ఠించతలచినారని వినుట మిగుల ముదావహము.

(౩)

కాన్పూరు కాంగ్రెసుతీర్మానప్రకారమే 1926 నవంబరునెలలో అన్ని రాష్ట్రకాంగ్రెసుకమిటీలు రాష్ట్రశాసనసభలకును, ఢిల్లీశాసనసభకును అభ్యర్థులను నిలబెట్టి ఎన్నికలలో పోటీచేసినవి. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీవారు అభ్యర్థులను నిర్ణయించుటకొరకు ఒక ఉపసంఘమును నియమించిరి. ప్రకాశంపంతులుగారు రాష్ట్రకాంగ్రెసుకమిటీకి అధ్యక్షులుగను, నేను ప్రధానకార్యదర్శిగను నున్న కాల మది. ఆ యుపసంఘములో ప్రకాశం, చింతలపాటి నరసింహరాజు, కాశీనాధుని నాగేశ్వరరావు, బులుసు సాంబమూర్తి, దండు నారాయణరాజు గారలు సభ్యులుగ నుండిరి. అప్పటికి పశ్చిమగోదావరిజిల్లా వేరుచేయబడినది. అందువల్ల మద్రాసుశాసనసభలో

కృష్ణాజిల్లాకు రెండుస్థానములు, పశ్చిమగోదావరిజిల్లాకు రెండుస్థానము లేర్ప రెను. ఈ ఎన్నికలు మాంటేగ్యూ, ఛేమ్సుఫర్డు సంస్కరణముల ఫలితముగ వచ్చినవి. ఆ చట్టప్రకారము 1920 లో వచ్చిన ఎన్నికలను కాంగ్రెసు వారు బహిష్కరించుటయు, 1923 సంవత్సరపు ఎన్నికలలో స్వరాజ్యపార్టీ వారు నిలచినచోట్ల కాంగ్రెసువాదులందరు తోడ్పడవలెనని తీర్మానించు టయు, కొందరు కాంగ్రెసువాదులు స్వరాజ్యపార్టీపేర ఎన్నికలలో నిలిచి గెలుచుటయు జరిగినదని పైన చెప్పియున్నాను. ఆ చట్టప్రకారము మద్రాసురాష్ట్రి బ్రాహ్మణేతరపార్టీయైన జస్టిసుపార్టీవారు బ్రాహ్మణేతరులకు సమిష్టినియోజకవర్గములలో ప్రత్యేకప్రాతినిధ్యము నివ్వవలెనని కోరినందున మద్రాసురాష్ట్రిములోని ప్రతిజిల్లాలోను ఇద్దరుఅభ్యర్థులు నిలుచునట్లును, అందులో ఒకరు బ్రాహ్మణేతరులై యుండితీరవలెననియు నిర్ణయము చేయ బడెను. దానినిబట్టి కృష్ణాజిల్లాకు నిర్ణయించబడిన రెండుస్థానములలో నొకరు బ్రాహ్మణేతరులై యుండవలెను. అపుడు హరిజనులకు ప్రత్యేక ప్రాతినిధ్యము లేదు. వారు నామినేషనులోనే రావలెను. లేదా జనరలు స్థానములలో నిలువవచ్చును. ముసల్మానులకు, క్రైస్తవులకు ప్రత్యేక ప్రాతినిధ్యమిచ్చుచు ఆ యభ్యర్థులకు ఆయామతములకు చెందినవారేఓట్లివ్వ వలెనని కూడ నిర్ణయించబడి ఆ ప్రకారమే ఎన్నికలు జరిగెను. 1926 సంవత్సరపు ఎన్నికలలో అబ్దుల్ హామీదుఖాను, బషీర్ అహమ్మదు సయ్యేదు ఉప్పిసాహెబు గారలు కాంగ్రెసు పార్టీపక్షమున ముసల్మాను సభ్యు లుగ ఎన్నుకొనబడిరి. రాష్ట్రిశాసనసభ ఓటర్లు సాలుకు పదిరూపాయలు శిస్తు చెల్లించువారుగను, కేంద్రశాసనసభ ఓటర్లు ఏబదిరూప్యములు చెల్లించువారుగను నుండవలెను. కృష్ణాజిల్లా కేర్పడిన రెండుస్థానములలో నొక స్థానమునకు నన్ను కాంగ్రెసుఅభ్యర్థిగా నిలబెట్టుటకు కమిటీవారు నిశ్చయించిరి. నేను తప్పకుండ గెలిచెదనని వారిఅభిప్రాయము. అపుడు మీర్జాపురంరాజాగారు కృష్ణాజిల్లాలో జస్టిసుపార్టీనాయకుడు, మంత్రి రాజా రామారాయణింగారి ముఖ్యశిష్యుడు, జిల్లాబోర్డుఅధ్యక్షుడు. ఆయనకు పశ్చిమ కృష్ణాజిల్లాలోని వెలమ జమీందారులు బంధువులు. అందువల్ల రామారాయ ణింగారు కూడ రెండవఅభ్యర్థిని పెట్టినయెడల గెలవడం కష్టమని జస్టిసు

పార్టీతరఫున మీర్జాపురంరాజాగారి నొక్కరినే అభ్యర్థిగా నిలబెట్టినారు. ఆయన ఎంత సొమ్మైనను ఖర్చుచేయుటకు సిద్ధముగా నున్నాడు. ఈ పరిస్థితులలో కాంగ్రెసుపక్షమున నాతోపాటు రెండవ అభ్యర్థిగా బ్రాహ్మణేతరులలో నెవరిని పెట్టవలెనని మా కాంగ్రెసు ఎన్నికలకమిటీవారు తీవ్రముగా ఆలోచించవలసివచ్చినది. మునగాలరాజాగారు తనకుఆప్తులైన కొళందరెడ్డిగారిని నాతోపాటు అభ్యర్థిగా పెట్టవలసినదని కాంగ్రెసుకమిటీవారిని కోరినారు. కడప కోటిరెడ్డిగారు మొదలగు మిత్రులు కొందరు కొళందరెడ్డిగారి పక్షమున వచ్చినారు. కొళందరెడ్డిగారు జస్టిసుపార్టీలో చేరలేదు, కాని స్వతంత్రఅభ్యర్థిగా 1920, 23 సంవత్సరములలో జరిగిన శాసనసభ్యుల ఎన్నికలలో నిలువబడి ఓడిపోయినాడు. కొళందరెడ్డిగారిని పెట్టటానికి మా కమిటీవారికి యిష్టములేదు. మునగాలరాజాగారు ఒక మోటారుకారు, కొంతడబ్బును కూడ యిచ్చెదమన్నారు. దానిని మా కమిటీవారు అంగీకరించలేదు. మునగాలరాజాగారు,కడపకోటిరెడ్డిగారు ఎటులైన కొళందరెడ్డిగారిని నిలబెట్టించాలని చాల ఆత్రతచూపిరి. నావద్దకు వచ్చి నన్నుమానుకొని కొళందరెడ్డిగారికి నా స్థానమిప్పించవలెనని కోరగా నాకభ్యంతరము లేదని చెప్పితిని. జయంతిపురంరాజాగారిని కూడ ఒప్పించిరి. మాగంటి బాపినీడుగారు కొళందరెడ్డిగారితో రెండవఅభ్యర్థిగ నుండెదనని ఒప్పుకొనెను. ఈవిధముగ చెప్పదలచి జయింతిపురంరాజా, మాగంటి బాపినీడుగార్లు కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారివద్దకు పోయి విన్నవించగా ఆయన వారి మీద కోపపడి "కాశేశ్వరరావుంటే ఒక స్థానం నిశ్చయం, రెండవదికూడ రావచ్చును. లేకపోతే రెండుస్థానాలను జస్టిసుపార్టీవారు కొట్టుకొనిపోవుదురు," అని మందలించి నన్ను పిలచి, "మీరు తప్పక నిలబడితీరవలెను. కృష్ణాజిల్లాలో అవసరమైనసహాయమునంతను నేను చేసెదను. బాపినీడుగారిని గాని ఇంకెవరినైనగాని మీతో కలిపి పెట్టుతాము" అని చెప్పి నన్ను వదులుకోనివ్వలేదు. నేను నిలచుట కొప్పుకొంటిని. ఆపైన కొన్నాళ్లమాగంటి బాపినీడుగారిని నాతో రెండవ కాంగ్రెసుఅభ్యర్థిగ నిలబెట్టిన బాగుంటుందని, బహుశః ఆయనకూడ గెలుస్తాడని కమిటీవారు అనుకున్నారు. బాపినీడుగారు అమెరికా వెళ్ళివచ్చిన విద్యాధికుడు. మంచికాంగ్రెసు

కుటుంబము. బెజవాడ, బందరు బస్తీలు రెండు కాంగ్రెసుకు బాగా అను కూలముగ నున్నవి. విద్యాధికులకు బాగుగ ఓట్లుపడతవి. కాని కమిటీవా రిట్లు ఆలోచించుచుండగా అడుసుమిల్లి పార్టీప్రముఖులు ప్రకాశంగారితోను, నాగేశ్వరరావుగారితోను మాట్లాడి కొల్లిపర సూరయ్యగారిని పెట్టేటట్లయితే తమపార్టీఓట్లన్నీ ఇద్దరు కాంగ్రెసుఅభ్యర్థులకు యిప్పించి చాల సహాయపడ తామని చెప్పినారు. కొల్లిపర సూరయ్యగారు కూడ చాల పెద్దమనిషి. నిజ మైన కాంగ్రెసువాదియే; దానిమీద బాపినీడుగారిని విడచిపెట్టి కొల్లిపర సూరయ్యగారిని రెండవ కాంగ్రెసుఅభ్యర్థిగా నిలబెట్టినారు. అది మేనెలలో జరిగినది. ఎన్నికలు నవంబరునెలలో వచ్చెను. కనుక ఆరునెలలు కృష్ణా జిల్లా అంతా వెయ్యిగ్రామములలో ఓట్లమథనము చేయవలసివచ్చెను. కొళందరెడ్డిగారు స్వతంత్ర కాంగ్రెసుఅభ్యర్థినని నిలచినాడు. మునగాలరాజా గారికి మా కాంగ్రెసుమీద కోపమువచ్చి తనపరగణాలో నున్న అన్నిఓట్లను కొళందరెడ్డిగారికి సింగిల్ ఓట్లిప్పించినారు. రెండవఓటును ఎవరికి లేకుండ చేసినారు. అదివరకు నాకు అనేకసంవత్సరములనుంచి మునగాలరాజాగారు స్నేహితులుగా నున్నప్పటికి నాకుకూడ ఓట్లువేయించలేదు. నేను ప్లీడరీ వదలిపెట్టినప్పటినుంచి ఆయనకు కొళందరెడ్డిగారియందు ఎక్కువస్నేహము ఏర్పడినది. ఎన్నికలప్రచారము జరుగుచుండగా అడుసుమిల్లి గోపాల కృష్ణయ్యగారు స్వయముగా తానే అభ్యర్థిగా నిలబడిరి. మా అందరిదగ్గరకు వచ్చి కొల్లిపర సూరయ్యగారిని మానిపించవలసినదనిన్నీ. తను మాతో కలుపుకొని అభ్యర్థిగా పనిచేయవలసినదనిన్ని చెప్పినాడు. మేము ఒప్పుకో లేదు. సూరయ్యగారిని మధ్యలో వదలడం అక్రమమని అందరము భావించి నాము. గోపాలకృష్ణయ్యగారు కులతత్త్వముమీద ప్రచారముచేసినాడు. కాని కమ్మకమ్మ అని ప్రబోధముచేసినకొద్దీ యితరవర్ణములవారికి వారియందు అసూయకలిగి యితరవర్ణములవారిఓట్లు బహుతక్కువగా పడినవి. మా జిల్లాలో కమ్మవారికి ప్రాధాన్యత ఉన్నది గాని, ఇతర వర్ణములంతా ఏకమైన నాడు కమ్మవారికంటె చాలా ఎక్కువగ నుందురు. అంతేగాక గోపాల కృష్ణయ్యగారిని ఏమైనాసరే ఓడించవలెనని ఆయనకు వ్యతిరేకముగానున్న గుడివాడతాలూకాలోని రెండవపార్టీవారైన లింగంపార్టీవారు మీర్జాపురంరాజా

గారి కొకఓటును, నా కొకఓటును యివ్వడానికి నిశ్చయించినారు. పశ్చిమ కృష్ణాజిల్లాలోని వెలమజమీందారులంతా నాకు మిత్రులైనప్పటికి వారు మీర్జాపురంరాజాగారికి బంధువులైనందున వారిపరగణాలలోనిఓట్లన్నియు సింగిల్ ఓట్లుగా మీర్జాపురంరాజాగారికే ఇప్పించినారు. అటులనే తూర్పు కృష్ణాజిల్లాలోని కాపులఓట్లన్నియు నూటికి 90 పాళ్ళు సింగిల్ఓట్లుగా మీర్జాపురంరాజాగారికి పడ్డవి. ఈ విధముగా మీర్జాపురంరాజాగారికి వచ్చిన 16 వేల ఓట్లలో 10 వేల ఓట్లు సింగిల్ఓట్లే. ఓటర్లను రెండవఓటు హక్కును చలాయించనిచ్చినట్లయిన ఇద్దరుకాంగ్రెసు అభ్యర్థులము తేలికగా గెలిచేవారము. కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు స్వయముగా కృష్ణాజిల్లా అంతట సంచారముచేసినారు. మోటారుకారులు మా కాంగ్రెసు అభ్యర్థులకు సప్లయిచేసినారు. వారిపలుకుబడిని, ద్రవ్యమును మా కుపయోగపరచినారు. ఈ మధనములోనుంచి 16 వేలఓట్లతో మొదటివాడుగ మీర్జాపురంరాజాగారు, 14 వేల 4 వందలఓట్లతో రెండవ్వవాడనుగా నేను గెలిచినాము. రెండవకాంగ్రెసుఅభ్యర్థికి 14 వేల ఓట్లు వచ్చెను. మూడవ వాడు అగుటవలన ఓడిపోయినాడు. అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారికి 12 వేలు, కొళందరెడ్డిగారికి 5 వేల ఓట్లును వచ్చి వారిద్దరు ఓడిపోయినారు. ఢిల్లీ శాసనసభకు కృష్ణా, పశ్చిమగోదావరి, తూర్పుగోదావరి జిల్లాలకు కలిసి ఒకే స్థానముండెను. దానికి ప్రకాశంపంతులుగారిని కాంగ్రెసుఅభ్యర్థిగా నిలబెట్టిరి. ఆయనకు వ్యతిరేకముగ మోచర్ల రామచంద్రరావుపంతులుగారు నిలబడిరి. ప్రకాశంపంతులుగారే విజయమొందిరి.

నన్ను, సూరయ్యగారిని కాంగ్రెసుఅభ్యర్థులుగ నిలబెట్టగానే నేను బందరు పోయి ముట్నూరి కృష్ణారావు, డాక్టరు పట్టాభి సీతారామయ్య, చెఱుకువాడ నరసింహం గారలు బందరులోని బొంబాయి అని పిలువబడు కృష్ణకాలువవద్ద కూర్చొనియుండగా వారివద్దకు పోయి మాకు సహాయము చేయవలెనని కోరితిని. "పెట్టించుకున్నావు గదా, గెలు!" అని నన్ను పట్టాభి సీతారామయ్యగా రన్నారు. నన్ను కాంగ్రెసుకమిటీ పెట్టినది గనుక నిలచినాను అన్నాను. విని ఊరుకున్నారు. మాకు ఎట్టి మద్దతు చెయ్యమన్నారు. నేను తిరిగివచ్చినాను. వారింకను శాసనసభాప్రవేశమునకు సుము

ఖులుగలేకుండిరి. అంతేగాక కృష్ణాపత్రికలో దాదాపుగ తుదివరకు నాకు వ్యతిరేకముగను, కొళందరెడ్డిగారికి అనుకూలముగను వ్రాయబడుచుండెను. కృష్ణాపత్రికాధిపతులు నోచేంజరులమని. అనగా శాసనసభాప్రవేశమునకు వ్యతిరేకులమని చెప్పుకొనుటలో తప్పులేదు. కాని కాంగ్రెసుఅభ్యర్థులకు వ్యతిరేకముగను, కాంగ్రెసు వ్యతిరేకఅభ్యర్థులకు అనుకూలముగను సహాయముచేయుట మాత్రము ఎట్టి రాజకీయనీతియో నా కర్థముకాలేదు. తూర్పుకృష్ణాజిల్లా కాంగ్రెసుకమిటీలో ఆ ఎన్నికలలో కాంగ్రెసుపక్షమున ప్రచారముచేయక తూర్పుకృష్ణాజిల్లాలోనైనను నోచేంజరుతత్వమును రుజువుచేతామని ఈ పెద్దలే తీర్మానము పెట్టగా గొట్టిపాటి బ్రహ్మయ్య మొదలగు యువకసభ్యులు అంగీకరించనందున తీర్మాన ముపసంహరించుకొనబడినట్లు తెలిసినది. ఆఖరుదినములలో మాత్రము నాకు వ్యతిరేకముగ వ్రాసినకొలది వారికి ముఖ్యులైన కొల్లిపర సూరయ్యగారికికూడ నష్టముకలుగునని వారి మిత్రులు ముట్నూరి కృష్ణారావుగారికి నచ్చుచెప్పగా మా ఇద్దరికి ఓట్లు ఇవ్వవలసినదని కృష్ణాపత్రికలో వ్రాసినారు. ఆంధ్రపత్రిక మా ఇద్దరు కాంగ్రెసు అభ్యర్థులకు అనుకూలముగ ప్రథమమునుంచి ఆఖరువరకు దృఢముగ వ్రాసినది. పశ్చిమగోదావరిజిల్లాపక్షమున కాంగ్రెసుఅభ్యర్థులైన మోతే నారాయణరావు, దండు నారాయణరాజుగారలు, తూర్పుగోదావరిపక్షమున కాంగ్రెసు అభ్యర్థులైన బిక్కిన వెంకటరత్నం, కె. వి. ఆర్. స్వామిగారు ఎన్నికైనారు. కాకినాడపట్టణనియోజకవర్గమునకు కాంగ్రెస్‌తరపున బులుసు సాంబమూర్తి గారిని నిలుపుటకు మా కమిటీవారు నిర్ణయించినారు. కాని ఆయనయొక్క ప్లీడరీపట్టా హైకోర్టువారిచే కొట్టివేయబడుటచేతనూ, అప్పటిప్రభుత్వం ఆయన నిలవడానికి ప్రత్యేకంగా అనుజ్ఞ ఇవ్వకపోవడంచేతనూ తుదిక్షణంలో చావలి రామసోమయాజులుగారిని అభ్యర్థిగా నిలబెట్టినాము. ఆయనతో దివాన్‌బహదూర్ దురిశేటి శేషగిరిరావుగారు పోటీచేసి ఓడిపోయినారు. మల్లిపూడి పళ్ళంరాజుగారు గ్రామమునసబుగిరికి అదివరకే కొన్ని సంవత్సరములక్రిందట రాజీనామానిచ్చియుండిరి. దానిని అంగీకరించక కలెక్టరు బ్రాకను నిలిపియుంచెను. ఆయనను శాసనసభకు అభ్యర్థిగపెట్టవలెనని మా కమిటీవారు నిర్ణయించిరి. ఆయనపెట్టిన రాజీనామాను అంగీకరింప

చేయుటకు ప్రయత్నించినను కలెక్టరు ఒప్పుకొననందున పళ్ళంరాజుగారిని వదిలిపెట్టి, కె. వి. ఆర్ స్వామినాయుడుగారిని అభ్యర్థిగనిలబెట్టిరి. తరువాతనే వారిరాజీనామాను అంగీకరించిరి. అప్పటినుంచి పళ్ళంరాజుగారు తూర్పుగోదావరి జిల్లాలో కాంగ్రెసుకు ముఖ్యనాయకులలో నొకరైరి. గుంటూరుజిల్లానుంచి జస్టిసుపార్టీ అభ్యర్థియైన యతిరాజులునాయుడుగారును, కాంగ్రెసుఅభ్యర్థియైన పిల్లలమర్రి ఆంజనేయులుగారును ఎన్నుకొనబడిరి. విశాఖపట్టణంజిల్లానుండి పి. సి. వెంకటపతిరాజు, చింతలపాటి నరసింహరాజుగార్లు, బరంపురమునుంచి బాబు విశ్వనాథదాసుగారు కాంగ్రెసు సభ్యులుగ ఎన్నుకొనబడిరి. చిత్తూరుజిల్లానుండి బొల్లిన మునిసామినాయుడుగారు జస్టిసుపార్టీపక్షమున ఎన్నుకొనబడిరి. కడపజిల్లానుండి కడప కోటిరెడ్డి, పరశురామారావుగార్లు, అనంతపురంజిల్లానుండి నారాయణరెడ్డి, ఓబుల్ రెడ్డిగార్లు కర్నూలుజిల్లానుండి హరిసర్వోత్తమరావుగారు, బళ్ళారినుండి శివరావుగారు, కాంగ్రెసుపక్షసభ్యులుగ నెన్నుకొనబడిరి. బళ్లారిజిల్లానుండి జాతీయవాదిగ రంగనాథమొదలియారుగా రెన్నుకొనబడిరి. రంగనాథ మొదలియారుగారు అనిబిసెంటమ్మగారిముఖ్యశిష్యులు. నారాయణరెడ్డిగారు గుత్తి కేశవపిళ్లెగారిని ఎన్నికలోనోడించివచ్చిరి. అనంతపురముజిల్లాలో కల్లూరు సుబ్బారావుగారు మొదలగు నాయకులత్యాగమువల్ల కాంగ్రెసుకు అప్పటికే చాల పలుకుబడి కలిగినది. నారాయణరెడ్డి కేవలము కాంగ్రెసుయువకుడు. కేశవపిళ్లెగారు ప్రముఖనాయకుడైనను ఓడిపోయినాడు. గాని కొన్ని దినములతరువాత నారాయణరెడ్డి శాసనసభ్యత్వమునకు రాజీనామానిచ్చి పుదుచ్చేరికి అరవిందఘోషుగారివద్దకు పోయిరి. అపుడు కేశవపిళ్ళెగారు జాతీయపక్షమున ఏకగ్రీవముగా నెన్నుకొనబడిరి. కాంగ్రెసువారు పోటీపెట్టలేదు.

ఈ ఎన్నికలలో బందరులో నాకు ఎక్కువగా సహాయపడినవారు డాక్టరు కోకా అహోబలరావునాయుడుగారు, పురాణం సూరిశాస్త్రిగారు. నేను బందరు వెళ్ళినపుడల్లా వారిద్దరిలో ఎవరో ఒకరియింటిలో బసచేస్తుండేవాడను. పురాణం సూరిశాస్త్రిగారు ఎం. ఏ. ప్యాసైరి. మంచి పండితులు; పురాణం వెంకటప్పయ్యగారి పుత్రులు. వారు నాకు ఎన్నికఏజెంటుగాకూడ పనిచేసిరి. డాక్టరు అహోబలరావు నాయుడుగారు చాల గొప్ప వైద్యులు,

అతిమంచివారు. ఉదారస్వభావముగలవారు ప్రజానురాగము నెక్కువగ పొందినవారు. గంపలగూడెం కుమారరాజా, జయంతిపురమురాజా వాశిరెడ్డి సదాశివేశ్వరప్రసాదు, గొట్టిపాటి బ్రహ్మయ్య, దుగ్గిరాల రాఘవచంద్రయ్య, కొడాలి ఆంజనేయులు, పింగళి వెంకయ్యగార్లు కూడ చాల కష్టపడి కాంగ్రెసుఅభ్యర్థులకోసము పనిచేసినారు. ఆ ఎన్నికలలో నేను గెలిచినానని బందరులో పురాణం సూరిశాస్త్రిగారియింటిలో నేనుండగా తెలిసినది. నేను కలెక్టరుఆఫీసుకు పోలేదు.సూరిశాస్త్రిగారే ఏజెంటుగా వెళ్ళివచ్చి నేను గెలిచి నానని చెప్పినారు. ఆరునెలలు ఎడతెగకుండ మోటారువాడులలో వెయ్యి గ్రామములను అనేకసార్లు దర్శించుటవల్ల, సకాలములో సరియైన భోజ నములేనందువల్ల నా ఆరోగ్యము బొత్తుగ చెడిపోయినది. ఎన్నికైనానని తెలియగనే నరములదుర్బలతవల్ల లేవలేకపోయినాను. ఎటులనో శ్రమపడి రైలులో రెండవ తరగతిలో యెక్కి బెజవాడ చేరుకుంటిని. కొద్దిరోజులు మందుపుచ్చుకొని చెన్నపట్టణము వెళ్ళి, డాక్టరు లక్ష్మీపతిగారియింటిలో నుంటిని. ఆయన నాకు మంచి ఆయుర్వేదమందు నిచ్చెను. 4, 6 నెల లలో శరీరము బాగుగ స్వస్థపడెను. అయినప్పటికిని నేను ఆ సంవత్సరం డిశంబరు 17 వ తేదీనుంచి ప్రారంభమైన మద్రాసుశాసనసభకు ప్రతిరోజు వెళ్ళి ఓపికఉన్నంతవరకు చర్చలలో పాల్గొంటిని. 1927 మార్చినెలాఖరున ఆదాయవ్యయపట్టిక మంజూరైనపిమ్మట శాసనసభ వాయిదాపడెను.

మా శాసనసభఎన్నికలు పూర్తికాగానే మీర్జాపురంరాజాగారిఎన్నిక చెల్లదని ఆత్మూరి నాగేశ్వరరావు, బొబ్బా వెంకటశేషయ్యగార్లచేత డాక్టరు పట్టాభిసీతారామయ్య. చల్లపల్లి రాజాగార్లు ఎన్నికపిటిషను దాఖలుచేయించి నారు. మీర్జాపురంరాజాగారు జిల్లాబోర్డుఅధ్యక్షుడుగా అనేకపనులు చేసెదనని ఆశలుపెట్టి ఓట్లు సంపాదించెననియు, ఇంకను కొన్ని అక్రమచర్యలు జరిపె ననియు, ఆ పిటిషనులో ఆరోపించబడినది. అన్నిటికన్న ముఖ్యమైన ఆరో పణ మీర్జాపురంరాజాగారు కొంతమంది గ్రామాధికారులను, పైఉద్యోగస్థులను కట్టుకొని ఓటుహక్కులేని కొన్ని వేలమందిని అక్రమముగా ఓటర్లలిస్టులో చేర్పించి ఆ ఓట్లన్నిటిని తాను వేయించుకొనెనని అయ్యుండెను. హైకోర్టు జడ్జి లక్ష్మణరావుగారు బందరు వచ్చి విచారించి మీర్జాపురంరాజాగారిమీద

చార్జిచేసి ఉత్తరసాక్ష్యముకూడ తీసుకొనిరి. 3 వేల 5 వందలఓట్లు హక్కులేనివారికి కల్పించి ఆ ఓట్లన్నీ వాప వేయించుకొనిరని సాక్ష్య మివ్వబడెను. కాని జాక్సనుగారు, జడ్జి లక్ష్మణరావుగారు ఉభయులు మద రాసుహైకోర్టులో కూర్చొని ఓటర్లలిస్టు ఒకసారి ఖాయమైనపుడు దానిని ఆక్షేపించుటకు ఎవరికి హక్కులేదనియు, అందులో పేరు పడగానే ఆ ఓటరుకు అట్లు పేరు పడుటకు హక్కున్నను, లేకున్నను ఓటరుగానే పరిగణింపబడవలెననియు తీర్పుచెప్పిరి. తక్కిన అక్రమచర్యలు రుజువు కాలేదని త్రోసివేసిరి. మీర్జాపురంరాజాగారిమీది ఎన్నికపిటిషన్ కొట్టి వేయబడినది. మీర్జాపురంరాజాగారిమీద ఎన్నికఆక్షేపణఅర్జీ దాఖలు కాగానే నా ఎన్నికలో కూడ కొన్ని అక్రమములు జరిగినవని, నా ఎన్నిక చెల్లదని, మీర్జాపురంరాజాగారి ముఖ్యశిష్యులైన అంకుశరావు తిరుపతిరావు గారు అర్జీ దాఖలుచేసిరి. దానిని జడ్జి లక్ష్మణరావుగారు విచారించి నా తర పున ఉత్తరసాక్ష్యము పిలువకుండగనే కొట్టివేసిరి.

## (4)

ఆ ఎన్నికలలో మద్రాసురాష్ట్రశాసనసభకు కాంగ్రెసువారు 42, జస్టిస్‌పార్టీవారు 16 గురు, జాతీయవాదులు 12 మంది వచ్చిరి. వీరందరు గాక కొందరు స్వతంత్రులు, ఇంకా 32 మంది ప్రభుత్వనియమితులైన సభ్యులుండిరి. అది ద్వంద్వప్రభుత్వము. ముగ్గురు మంత్రులు, ముగ్గురు ఎక్జి క్యూటివ్‌కౌన్సిలర్లుండిరి. ఆ ఎక్జిక్యూటివ్ కౌన్సిలర్లలో సర్ సి. పి. రామ స్వామి అయ్యరుగారు ముఖ్యుడుగ నుండెను. మంత్రిపదవులను పుచ్చు కొనవలసినదని గవర్నరుగారు మా కాంగ్రెసుపార్టీని కోరిరి. మేమందరము ఎస్. శ్రీనివాసయ్యంగారియింటిలో సమావేశమైనపుడు సామి వెంకటాచలం చెట్టి, సత్యమూర్తిగార్లు ఇంక కొందరు మంత్రిపదవులను పుచ్చుకొనవలె ననియే వాదించిరిగాని ఎక్కువమంది అభిప్రాయప్రకారము మంత్రి పదవు లను స్వీకరించుటకు నిరాకరించితిమి. మేము అపుడు నాయకుడుగా ఎన్ను కున్న చింతలపాటి నరసింహరాజుగారు ఈసంగతి గవర్నరుగారికి చెప్పి వచ్చెను. సర్ సి. పి. రామస్వామి అయ్యరుగారికి జస్టిసుపార్టీయందు

చాల కోపము. ఓడిపోయిన జస్టిసుపార్టీవారికి అధికారమివ్వకూడదని గవ ర్నరుగారితో చెప్పి, మూడవ పార్టీ అయిన జాతీయపార్టీవారికి మంత్రిపదవులు నిప్పించెను. డాక్టరు సుబ్బరాయన్ ముఖ్యమంత్రిగను రంగనాథ మొద ల్యారు, ఆరోగ్యస్వామి మొదల్యారుగారలు ఇతరమంత్రులుగను నియమింప బడిరి. మా నాయకుడైన చింతలపాటి నరసింహరాజుగారిని శాసనసభకు అధ్యక్షులుగను, డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారిని ఉపాధ్యక్షులుగను ఏకగ్రీవ ముగా నెన్నుకొంటిమి.

కాంగ్రెసుపద్ధతులమీద డాక్టరు సుబ్బరాయనుమంత్రివర్గము పరి పాలనలోను చట్టములలోను కొన్ని మార్పులు తీసుకొనివచ్చునట్లును, సుబ్బ రాయన్ప్రభుత్వమును కాంగ్రెసుకక్షివారు కాపాడునట్లును, సర్ సి. పి. రామస్వామిఅయ్యరుగారిసలహాపైన యొడంబడికజరిగెను. అదివరకు జస్టిసు పార్టీవారు బ్రిటిషుప్రభుత్వమునకు పూర్తియైన సహాయముచేయుటయే గాక రాజకీయఖైదీలకు జైళ్లలో సౌకర్యములు కలుగజేయకూడదని తీర్మానించి నందున కాంగ్రెసువారికికూడ జస్టిసుపార్టీని అధికారములోకిరాకుండచేయ వలెనని ఎక్కువ పట్టుదల గలదు. గనుక సుబ్బరాయనుమంత్రివర్గమును నిలబెట్టుటకే సమ్మతించిరి. సుబ్బరాయన్మంత్రివర్గ మేర్పడిన కొద్దిదినము లకు సత్యమూర్తిగారు ముగ్గురుమంత్రులను, అధ్యక్షులను చింతలపాటి నర సింహరాజుగారిని, సామి వెంకటాచలంచెట్టిగారిని, నన్ను ఇంకా కొద్దిమంది కాంగ్రెసుకక్షిలోని ముఖ్యులను తన యింటికి భోజనమునకు పిలిచెను. కాంగ్రెసువారము మంత్రివర్గమువారు వెంటనే కొన్ని మార్పులు తీసుకొనిరా వలెనని కోరగా మంత్రు లొప్పుకొనిరి. అందులో మునిసిపాలిటీలలోను జిల్లాబోర్డులలోను, నామినేషనులు పాంతముగ తీసివేసి తక్కువ స్థానములు కూడ కొన్ని అల్పసంఖ్యాకులకు ప్రత్యేకించి ప్రజలఎన్నికలకే పెట్టవలెనని, స్థానికసంస్థల అధికారముల నెక్కువచేయవలెనని, ఏవో రెండుజిల్లాలలో మద్యపాననిషేధముకూడప్రవేశపెట్టవలెనని, రాజకీయనేరములకుశిక్షింపబడిన వారు స్థానికసంస్థలలోను విశ్వవిద్యాలయములలోనుసభ్యులుగనుండగూడదను నిషేధమునుతొలగింపవలెనని, హరిజనులు దేవాలయములలో తప్ప మిగిలిన చెరువులు బావులు మార్కెటులు రోడ్లు,పాఠశాలలు సత్రములుమొదలగుసామ

దాయకసంస్థలన్నింటిని మిగిలినవారితోపాటు ఉపయోగించుకొనుహక్కులను కలుగచేయవలెనని, సహాయనిరాకరణవాదుల భూములకు బ్రిటిషుప్రభుత్వము వారు నీటిసప్లయిని ఆపుచేసిన యుత్తరువును రద్దుపరచి నీళ్ళు ధారాళముగ నివ్వవలెనని మొదలగుపనులు మంత్రులు చేయవలెనని మేము కోరగా వా రంగీకరించిరి. మేము మంత్రులను వెళ్ళగొట్టుటకు బలముచాలక (రెస్పాన్సివ్ కోఆపరేటరులము) మంత్రు లెంత మామాట వింటే అంత వారికి సహాయముచేయుపద్ధతి నవలంబించితిమి. ఇదికూడ కూడదనియే కాంగ్రెసు వర్కింగుకమిటీలో వచ్చెనుగాని మమ్ము ఏమియుచేయక యూరకొనిరి. 1921 మొదలు 1927 లోపల కొంతమంది సహాయనిరాకరణవాదుల భూములకు నీరు ఇవ్వనందున చాల నష్టపడిరి. ఏలూరుతాలూకాలో కరణం బందా వియ్యన్నగారు కరిణీకమునకు రాజీనామానిచ్చినందున ఆయన భూములకు ప్రభుత్వము నీరిచ్చుట మానివేసినది. ఆ పల్లపుపొలములన్నీ మెరకలుగ మార్పబడినవి. బాకీదార్లు వేలముపేయించి స్వల్పధరలకు కొన్నారు. ఆయన ఆర్థికముగ నాశనమైనాడు. గన్నవరంతాలూకా కాను మోలుమునసబు నూకల వీరరాఘవయ్యగారు మునసబుగిరికి రాజీనామా విచ్చినందున ప్రభుత్వమువారు భూములకునీళ్ళుఇచ్చుట మానినారు. అటులనే కైకలూరుతాలూకాలోను,అనేక యితరచోట్లను చాలమందికిరాజకీయకారణము లచే నీరుఇచ్చుట మానినారు. పల్లపుభూములు పాడుపడ్డవి.నేను శాసనసభలో ప్రవేశపెట్టిన మొదటితీర్మానము సహాయనిరాకరణవాదులభూములకు వెంటనే మామూలుగా నీటిసప్లయిచేయవలెనన్నది. దీనిని రామస్వామిఅయ్యర్ ప్రభుత్వ మంగీకరించినది. అందరికి నీరు సప్లయిచేసినారు. హరిజనులపక్ష మున ఆంధ్రులలోనుంచి వేమూరి రాంజీరావు, సుంద్రు వెంకయ్యగార్లను, అరవదేశమునుంచి దివాను బహద్దరు శ్రీనివాసన్, వి. ఐ. మునిసామి పిళ్ళైగార్లను ప్రభుత్వమువారు శాసనసభకు నామినేట్ చేసిరి. నేనుకూడ వారందరితోకలసి హరిజనులకు మార్కెట్టులలో, రోడ్లమీద, పాఠశాలలలో సత్రములలో, తటాకములలో ఇంక నితర సాముదాయకసంస్థలలో ప్రవేశ ముండునట్లు తీర్మానములు పెట్టినాము. ఆదాయవ్యయపట్టికపై చర్చలలో మాట్లాడినాము. మంత్రివర్గమువారు చాలవరకు మా కోరికలను అమలుపర్చిరి.

హరిజనపక్ష నియమితసభ్యులు ప్రతి విషయములోను నన్ను సంప్రతించే వారు. నేను వారిలో నొకడుగ నుంటిని.

బాబు విశ్వనాధదాసుగారు ఒరిస్సారాష్ట్రము ప్రత్యేకింపబడినపిమ్మట 1937 లో ఆ రాష్ట్రమునకు ప్రధమ ప్రధానమంత్రి అయ్యెను. 1927 లో గంజాంజిల్లా మద్రాసురాష్ట్రములో నున్నందున మాతోపాటు మద్రాసుశాసన సభలో కాంగ్రెసుసభ్యుడుగ నుండెను. ఆయన నేను ఆ మూడుసంవత్స రాలు శాసనసభలో ఒకరిపక్కన యొకరము కూర్చునేవారము. ప్రతివిష యములోను ఒకేవిధముగ అభిప్రాయములను వెలిబుచ్చుచు ఓటుచేసేవారము. పిల్లలమర్రి ఆంజనేయులుగారుకూడ మాతోపాటే అన్నివిషయములలో ఉండేవారు. 1927 లో, 1928లో రెండుసార్లు ఆంధ్రరాష్ట్రతీర్మానాన్ని పిల్లల మర్రి ఆంజనేయులు, నేను ప్రవేశపెట్టి అధికసంఖ్యాకులచే అంగీకరింప చేయించినామని ఆంధ్రోద్యమ అధ్యాయములో చెప్పియున్నాను. రాజా రామారాయణంగారు ముఖ్యమంత్రిగానున్న 1924 మొదలు 1926 మధ్యకాల ములో సర్జన్ జనరల్ వ్యతిరేకించినను ఆయుర్వేదమును ప్రభుత్వము శాస్త్రీయ వైద్యమని అంగీకరించి గవర్నమెంటు స్కూలు ఆఫ్ ఇండియన్ మెడిసన్ (భారతీయ వైద్య పాఠశాల)ను మద్రాసులో నెలకొల్పినారు. దానికి శ్రీనివాస మూర్తిబి.ఏ.బి.యల్.యంటి.సి.యం.గారిని ప్రధానాచార్యులుగానియమించిరి. అదివరకు మద్రాసుప్రభుత్వములో ఎగ్జిక్యూటివ్ కౌన్సిలరుగా పనిచేసిన సర్ మహమ్మదుఉస్మానుగారిఅధ్యక్షతను ఒకకమిటీనివేసి విచారణచేయించినారు. ఆ కమిటీవారు భారతీయవైద్యములైన ఆయుర్వేదమును, యునానీని ప్రభు త్వమువారు అంగీకరించి వెంటనే భారతీయవైద్యపాఠశాలను నెలకొల్పవలె ననియు, దేశీయఔషధములు తయారుచేయించి అమ్మే స్థానముల నేర్పరచ వలెననియు, నూతన మూలికలు పరిశోధనచేసి వాటిని మందులుగా వాడుకలోకి తేవలయుననియు, ఇందుకుగాను అయిదులక్షలరూప్యము లను వెంటనే ప్రభుత్వము మంజూరుచేయవలెననియు తమరిపోర్టులో వ్రాసిరి. దాని ప్రకారమే మద్రాసులో భారతీయ వైద్యపాఠశాల స్థాపించ బడెను. నేను 1925 ఏప్రిలు మొదలు 1930 ఏప్రిలువరకు విజయవాడ మ్యునిసిపలుచైర్మనుగా కూడ నుంటినని చెప్పియున్నాను. మంత్రి రాజా

రామారాయణంగారు నన్ను మద్రాసులో తమ బంగళాకు తీసుకొనిపోయి బంగాళామంత్రి సురేంద్రనాథబెనర్జీ. బీహారుమంత్రి మధుసూధనసరస్వతి, ఉత్తరప్రదేశమంత్రి సి. యజ్ఞేశ్వర చింతామణిగార్లు సర్జన్ జనరల్ అభిప్రాయమునకు వ్యతిరేకముగా ఆయుర్వేదమును అంగీకరించుటకు ధైర్యము చాలనికాలములో తాను ఆయుర్వేదమును అంగీకరించి పాఠశాలను నెలకొల్పినానని నాతో చెప్పెను. అది యథార్థమే. రాజా రామారాయణంగారు చాల ధైర్యశాలి.యూరపియనులనులెక్కచేయనిధీశాలి.శాసనసభలో ఆయుర్వేదము, యునాని చర్చకు వచ్చినవి. సర్జను జనరలు ఆయుర్వేదము శాస్త్రీయ (Scientific) వైద్యము కాదనిన్నీ, ఆయుర్వేదమును అంగీకరించుట యనగా నాగరకతయొక్క గడియారమును నూటఏబదిసంవత్సరములవెనుకకు త్రిప్పుటేయన్న అభిప్రాయమును వ్రాసెనని కనుగొంటిమి. దానిని సర్ మహమ్మదు ఉస్మాన్ కమిటీవారు ఖండించవలసివచ్చినది. నేను సర్జను జనరలుకు శాసనసభలో కఠుతీవ్రముగ జవాబుచెప్పినాను. "అవును నిజమే. భారతదేశములో నూటఏబదిసంవత్సరములనుంచి విదేశీపాలన క్రింద ప్రబలిన బానిసత్వము, దరిద్రము, అజ్ఞానము, నిస్సహాయత, దైన్యములనుండి స్వతంత్రమును పొందుటకు ఈ నూతన నాగరికతాగడియారమును నూటఏబదిఏండ్లవెనుకకు త్రిప్పుట అత్యవసరము. ఆ ప్రకారమే వెనుకకు త్రిప్పి అప్పుడున్న వైద్యవిధానమును అవలంబించుటకూడ అత్యావశ్యకము" అని చెప్పినాను. విశ్వనాథదాసు, ఆంజనేయులు, నేను అనేక సార్లు మద్రాసులోని భారతీయవైద్యపాఠశాలకు వెళ్ళి విద్యార్థులకు ప్రోత్సాహము కలుగచేసి వచ్చినాము. నేను మొదటిసంవత్సరమున్నరవరకు డాక్టరు లక్ష్మీపతిగారి ఇంట్లోనే ఉన్నాను. మందుపుచ్చుకుంటున్నాను. పిమ్మట మైసూరు మాడరన్‌కేఫ్‌లో బసచేసినాను. శ్రీమతి రుక్మిణమ్మగారు నన్ను తన స్వంతసోదరునివలె ఆదరించినది. ఆమె ఆకాలమున శ్రీనివాసఅయ్యంగారినాయకత్వముక్రింద కాంగ్రెసులో తీవ్రముగ పనిచేయుచుండెను. శ్రీనివాసఅయ్యంగారే మా మద్రాసుశాసనసభ కాంగ్రెసుపార్టీకి ప్రధాననాయకుడుగ నుండెను. ఆమె అపుడు ముఖ్యముగ యువజనోద్యమమును నడుపుచుండెను. నా సలహా సహాయములు పూర్తిగా తీసుకొనుచుండెను

డాక్టరు లక్ష్మీపతిగారుకూడ భారతీయ వైద్యపాఠశాల యాజమాన్య కమిటీలో నుండిరి. పండిత గోపాలాచార్యులుగారు ఆయుర్వేద కళాశాలను మద్రాసులో నడపిరి. ఆయన మరణించగనే దానిని లక్ష్మీపతి గారు తీసుకొని కొన్నిసంవత్సరములు జయప్రదముగా నడపిరి. మదరాసు ప్రభుత్వమువారీ పాఠశాలను స్థాపించగనే లక్ష్మీపతిగారు దానిని మూసి వేసిరి. నేను మ్యునిసిపలుచైర్మనుగ మా మ్యునిసిపాలిటీచేత విద్యార్థివేతనము నిప్పించి యర్రగుంటపాటి సూర్యనారాయణ అను యువకుని మొదటి సంవత్సరమే మద్రాసు భారతీయ వైద్యకళాశాలకు పంపితిని. అతడు బాగుగ విద్యనభ్యసించి పరీక్షలో కృతార్థుడై బెజవాడలో సమర్థుడైన వైద్యుడుగ పనిచేయుచున్నాడు. భారతీయ పాఠశాలలో యల్.ఐ.యమ్. డిగ్రీలుపొందినవారిని నలుగురిని మా మ్యునిసిపాలిటీవైద్యాలయములలో వైద్యులుగ నేర్పాటుచేసినాము. డాక్టరు సుబ్బరాయన్ప్రభుత్వ మేర్పాటు చేసిన (రూరల్ డిస్పెన్సరీల) పల్లెటూరివైద్యాలయములలో ఎల్.ఐ.ఎమ్. లను వైద్యులుగ నియమింపచేసినారు. ఆ కాలముననే జిల్లాకార్యస్థానముల లోను, డివిజను కార్యస్థానములలోను నున్న వైద్యాలయములనన్నిటిని మ్యునిసిపాలిటీలనుండి ప్రభుత్వమువారుతీసుకొని అభివృద్ధిచేయునట్లు 1928 లో వైద్యమంత్రి ఆరోగ్యస్వామిమొదలియారుగారొక ప్రణాళికను అమలు జరిపిరి. ఆ ప్రకారమే బెజవాడలో మా మునిసిపలుకౌన్సిలు యాజమాన్యముననున్న ఆసుపత్రిని ప్రభుత్వమునకు వశపర్చితిని.ఆ వైద్యాలయమునకు మేము ఖర్చుపెట్టుచుండినసొమ్ము మా పాఠశాలలు మురుగుకాలవలనిర్మాణము కొరకు ఖర్చుపెట్టితిమి.ఇటులనే అన్నితాలూకాకార్యస్థానముల వైద్యాలయము లనుకూడ జిల్లాబోర్డులనుండి ప్రభుత్వముతీసుకొనునట్లేర్పాటు జరిగెను.చాల వరకు తీసుకొనిరి. మా జిల్లాకార్యస్థానము బందరులో నున్నందున బందరు లోని ఆసుపత్రికే జిల్లాస్థాయి కలిగెను. బెజవాడ డివిజనలుకార్యస్థానముగనే యుండినందున బెజవాడలో ఆసుపత్రికి తక్కువస్థాయికలిగి యిప్పటికిని అటులనే యున్నది. బెజవాడపట్టణము అనేకరెట్లు పెరిగినను, గవర్నమెంటు ఆసుపత్రిస్థాయి నేటికిని ముప్పదియేండ్లక్రిందటివలెనే యున్నది. ఎట్టి అభివృద్ధి లేకుండుట మిగుల శోచనీయము.

అపుడు శాసనసభఎదుటనున్న మరియొక ముఖ్యవిషయము జమీం దారీ రైతులసమస్య. 1802 లో ఈస్టిండియాకంపెనీవారు జమీందారీపద్ధతిని ప్రవేశపెట్టిరి. రైతుల కెట్టిహక్కులను నిర్దుష్టముగ కలుగచేయలేదు. జమీందారులు నిరంకుశులై భూములలోనుంచి రైతులను వెడలగొట్టుచు, తమ ఇచ్చవచ్చినంత పన్నులను రైతులమీదవేసి వసూలుచేయుచు, అడ వులలోను, చెరువులలోను, పోరంబోకలలోను రైతుల కెట్టిహక్కులు లేకుండ, తామే సర్వహక్కులను పొందిరి. 1908 లో బ్రిటిషువారే మద్రాసు ఎస్టేట్సు లాండ్ ఆక్టను మంజూరుచేసిరి. భూములపై రైతులకు శాశ్వతజిరాయితీహక్కుండునట్లును, అప్పటికి రైతులు చెల్లించుచున్న శిస్తులను ఖాయపరచునట్లును ఆ చట్టములో కలదు. అడవులలోను, నీటివన రులలోను, డొంకలలోను రైతులకు ఎట్టిహక్కులు కలుగచేయబడనేలేదు. జమీందారులనిరంకుశత్వము పూర్తిగా రైతులమీద సాగినది. అది పనికిరా దని, జమీందారీరైతుల శిస్తులన్నీ 1802 నుంచి పెరిగినవి గనుక, ప్రక్క నున్న గవర్నమెంటు రైతులరేట్లతో సమానముగా చేయవలెనని గ్రామ ములలోని అడవులలో, చెరువులలో, పోరంబోకలలో, డొంకలలో అన్నిటి లోను రైతులకు సంపూర్ణమైనహక్కు లుండవలెనని విశ్వనాథదాసుగారు, నేను మా ఉపన్యాసములలో శాసనసభలో చెప్పుచుంటిమి. అప్పటికి ఇంకా జమీందారీలను రద్దుపరచవలెనని శాసనసభలోచెప్పతగినసమయము రాలేదు.

## (5)

ఎంతకాలము చూసినను డాక్టరు సుబ్బరాయనుగారు స్థానికసంస్థల సవరణబిల్లులను ప్రవేశపెట్టలేదు. ఆయన నెమ్మదిగ కాంగ్రెసుపార్టీమద్దతు నుంచి తప్పించుకొని జస్టిసుపార్టీ ఆశ్రయములోకి పోవునేమో నను గుస గుసలు బయలుదేరెను. మా నాయకులైన యస్. శ్రీనివాసఅయ్యంగారు మునిసిపాలిటీల సవరణబిల్లును, లోకల్ బోర్డుల సవరణబిల్లును తయారుచేసి ప్రవేశపెట్టవలెనని నాకు ఆదేశించిరి. నేను జిల్లాబోర్డులబిల్లుకూడ తయారు చేసితిని. కాని ఒకసారి ఒకే బిల్లు ప్రవేశపెట్టుటకుమాత్రమే అనుద్యోగ సభ్యుడనైన నాకు హక్కుగలదు గావున, జిల్లా, మునిసిపాలిటీల సవరణ

బిల్లును ముందుగా శాసనసభలో ప్రవేశపెట్టితిని. దానిప్రకారము అన్ని నామినేషన్లు పోవలెను. చైర్మను, వైస్‌చైర్మనులు సభ్యులచే ఎన్నుకొనబడవలెను. అల్పసంఖ్యాకులైన ముస్లిములకు, హరిజనులకు, క్రైస్తవులకు, స్త్రీలకు సమిష్టినియోజకవర్గములలో కొన్ని స్థానములు ప్రత్యేకించబడి ఎన్నికలలోనే రావలెను. రాజకీయనేరములకు శిక్షితులైనవారు మునిసిపలు సభ్యులుగా నుండగూడదని అదివరకు చేయబడిన నిషేధము రద్దుకావలెను. ఏమాత్రము పన్ను చెల్లించినను ఓటర్లగుటకు హక్కుండవలెను. ఇవీ ఆ బిల్లులోని ముఖ్యవిషయములు. అంతేకాక ఏ ఒకవ్యక్తియు వరుసగ రెండు సార్లకంటె చైర్మనుగను, వైస్‌చైర్మనుగను వుండకూడదు. తరువాత కొంతకాలమునకు మరల చైర్మనుగా గాని, వైస్‌చైర్మనుగాగాని రావచ్చును. మధ్య కొంత వ్యవధి యుండవలెను. ఈవిధమైన బిల్లును ప్రవేశపెట్టితిని. ప్రవేశమునకు అనుమతిపొందితిని. అది గెజెటులో ప్రచురించబడెను. దానిని ఆలోచనచేసి చర్చించి సెలెక్టుకమిటీకి పంపవలెనని నేను ఉపపాదించితిని. దానిని ముఖ్యమంత్రి డాక్టరు సుబ్బరాయన్‌గారు ప్రతిఘటించిరి. కాని, నేను కాంగ్రెసుపార్టీవారినే కాక ఇతరపార్టీలలోనున్న నా మిత్రులనందరిని, కొంతమంది నామినేటెడ్‌సభ్యులను కూడ చూచి, నా వైపుకు త్రిప్పుకొంటిని. ఒక వోటుతో నేను గెలిచితిని. మంత్రి సుబ్బరాయన్‌గారు వోడిపోయిరి. ఆ బిల్లు చర్చించబడి సెలెక్టుకమిటీకి పంపబడినది. సెలెక్టుకమిటీలో నాతోపాటు సుబ్బరాయన్, సత్యమూర్తి, పిల్లలమర్రి ఆంజనేయులు, విశ్వనాథదాసు, దండు నారాయణరాజు, కే. వి. ఆర్. స్వామి మొదలైనవారుఉండిరి. సెలెక్టుకమిటీలోనుంచి అది బయటపడినది. సెలెక్టుకమిటీరిపోర్టును నేను శాసనసభకు సమర్పించితిని. అట్టిస్థితిలో డాక్టరు సుబ్బరాయనుగారు తామే మునిసిపాలిటీల, జిల్లాబోర్డుల సవరణబిల్లులను తీసుకొనివచ్చెదమని ఆ బిల్లులోని ముఖ్యాంశములనుకూడ వాటిలో చేర్చెదమని శాసనసభలోప్రకటనచేసిరి. అందుమీద నా బిల్లును ముందుకుసాగించకుండ ఆపివేసితిని. వారు వెంటనే మునిసిపాలిటీలకు, జిల్లాబోర్డులకు రెండుసవరణ బిల్లులను తీసుకొనివచ్చిరి. వాటిపై చాలకాలము చర్చజరిగెను. సెలెక్టుకమిటీకి పోయెను. మేమందరము సెలెక్టుకమిటీలో నుంటిమి. మునిసిపాలిటీలలోను,

జిల్లాబోర్డులలోను ఏమాత్రము పన్నుచెల్లించినను ఓటర్లగుటకు హక్కుండు నట్లును, నామినేషన్లు పూర్తిగ రద్దుపరచునట్లును, వాటిరెంటికి కొన్ని అధి కారముల నెక్కువగా నిచ్చునట్లును రాజకీయశిక్షితులు ఎన్నికకు నిలువ కూడదను నిషేధము తొలగునట్లును, అందరుసభ్యులు అధ్యక్షులను ఉపా ధ్యక్షులను ఎన్నుకోవలెననియు, నాలుగవవంతుసభ్యులు మునిములు, హరిజనులు, క్రైస్తవులు, ఆంగ్లో-ఇండియనులు, స్త్రీలు, ఈ అల్ప సంఖ్యా కులనుండి సమిష్టినియోజకవర్గములలో ఎన్నుకొనబడునట్లును, ఆయా మునిసిపాలిటీలలోను, జిల్లాబోర్డులలోను, ఈ అల్పసంఖ్యాకులకు ఎన్నెన్ని స్థానములుండవలెనో ప్రభుత్వము నిర్ణయించునట్లును సెలెక్టుకమిటీలో అంగీకరించబడెను. జిల్లాబోర్డులు అదివరకు తాలూకాబోర్డులచే ఎన్నుకొన బడెను. అది తీసివేసి సరాసరి ఓటర్లే జిల్లాబోర్డుసభ్యులను ఎన్నుకొనునట్లు సవరించబడెను. కలెక్టర్లఅధికారములు తగ్గించుటకు నేను పెట్టిన సవరణ లను సెలెక్టుకమిటీవారు ఒప్పుకొనలేదు. కొంతవరకుమాత్రమే కలెక్టర్ల అధికారము తగ్గించబడెను. రెండుసార్లు వరుసగ చైర్మనుగాను, వైస్ చైర్మనుగాను ఒకేవ్యక్తి ఎన్నుకొనబడకూడదను నా సవరణ అంగీకరింప బడలేదు. అపుడు ఆ సవరణవిషయములో నేను సెలెక్టుకమిటీలో గట్టిగా వాదించితిని. నేను అపుడు రెండవసారి మునిసిపలుచైర్మనుగ నుంటిని, "నీవు రెండుసార్లు వరుసగా ఉన్నావుకదా, ఇంతటితో నీవు మానుకొనె దవా? నీకే ఈ సవరణ వర్తించును" అని సెలెక్టుకమిటీలోనిమిత్రులు ప్రశ్నించగా, నేను అందుకు సిద్ధపడియే ఈ సవరణపెట్టితినని, నేను రెండుసార్లకంటె మునిసిపలుచైర్మనుగా నుండదలచుకోలేదని చెప్పితిని, ఈ చర్యఅంతయు ముగిసి, సెలెక్టుకమిటీరిపోర్టుమీద చెన్నపట్టణములో 1930 జనవరి 5 వ తేదీన దస్కతులుపెట్టితిమి, అంతకుముందే 1929 డిశంబరు 31వ తేదీన సంపూర్ణస్వాతంత్ర్యతీర్మానము లాహోరుకాంగ్రెసులో ఆమోదింపబడి, వెంటనే ఢిల్లీశాసనసభలోను, రాష్ట్రశాసనసభలోను ఉన్న కాంగ్రెసుసభ్యులందరు రాజీనామాలుపెట్టవలెనని తీర్మానింపబడినందున జనవరి 5 వ తేదీననే నాతోటివారము చాలమందిమి రాజీనామాలుపెట్టి బైటికివచ్చితిమి. కొద్దిరోజులలో మిగతా కాంగ్రెసువారంతా రాజీనామా

నిచ్చిరి. మేము వచ్చినతరువాత స్థానికసంస్థలబిల్లులు కాంగ్రెసేతరసభ్యుల చేత ఇంకా కొన్నిసవరణలతో ఆమోదింపబడి 1930 వ సంవత్సరప్రచట్టములుగా మంజూరైనవి. అవియే నేటికిని, దరిమిలా అప్పుడప్పుడు చేయబడిన స్వల్పసవరణలతో నమలులోనున్నవి. అప్పటికి మునిసిపాలిటీలలో కమీషనర్లుండవలెనని మేము అందులో చేర్చలేదు. పిమ్మట బొబ్బిలిరాజాగారు ముఖ్యమంత్రిగా తెచ్చిన సవరణవల్ల 1933 నుంచి మునిసిపలుకమీషనర్లు ఏర్పడినారు.

మేము శాసనసభ్యులుగానున్నకాలములో డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారు దేవాలయములలో కళావంతులు ప్రతిదినము కుంభహారతి నిచ్చుటకును ఉత్సవములలో భోగముమేళములవారందరకు దేవాలయస్థాపకులచే పూర్వమివ్వబడిన కళావంతుల నౌకరీఈనాములను రద్దుచేసి, ఆకళావంతుల కుటుంబములకు క్విట్ రెంటుకట్టి సంపూర్ణహక్కులతో నిచ్చేలాగు,సదరు భోగపునౌకరీనుంచి ఆ కుటుంబములను విముక్తిచేసేలాగు నొక చిత్తుచట్టమును మా శాసనసభ ఎదుట ప్రవేశపెట్టినది. ఆమె స్వతంత్రసభ్యురాలుగా ఎన్నుకొనబడినది. శాసనసభకు ఉపాధ్యక్షురాలుగాకూడ నెన్నుకొనబడినది. ఆమె తండ్రి బ్రాహ్మణ అయ్యరు, తల్లి భోగపుస్త్రీ. ఆమెతండ్రి ఆమెకు, ఆమెచెల్లెలికి విశ్వవిద్యాలయములో ఉన్నతవిద్యను చెప్పించెను. ఆమె బి. ఏ, ఎం. బి. సి. యం. ప్యాసైనది. వైద్యకళాశాలలో ఆచార్యులుగానున్న యొక రెడ్డిగారిని వివాహమాడినది. ఆమెచెల్లెలుకూడ కొంతకాలము మేరీరాణీ కళాశాలకు ప్రధానాచార్యులుగా నున్నది. టి. ఆర్. వెంకట్రామశాస్త్రిగారి కుమారుడు, విద్యావంతుడగు బ్రాహ్మణుని వివాహమాడినది. ప్రస్తుతమామె రాజ్యసభలో సభ్యురాలు. డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారు భోగంకులమును, వ్యభిచారవృత్తినుంచి తప్పించి మగపిల్లలకు, ఆడపిల్లలకు విద్య చెప్పించి, వివాహములుచేయించి, మిగతాకులములవలెనే ఆత్మగౌరవముగల కులముగ చేయుటకై యావజ్జీవము కృషిసలిపినది. ఆమె పరమసాధ్వి, స్త్రీలయొక్క వికాసముకొరకు, స్వతంత్రముకొరకు కూడ యావజ్జీవము పనిచేసినది. తరువాతికాలమున నేను ప్రవేశపెట్టిన బహుభార్యానిషేధపు శాసనమునకు, వరకట్ననిషేధపుశాసనమునకు ఎక్కువగా తోడ్పడినది.

అఖిలభారత మహిళాసంఘములో ప్రముఖపాత్ర వహించినది. ఆమె 1927 లో భోగముస్త్రీలను నిర్బంధనౌకరీలోనుంచి తొలగింపచేయుటకు పైనచెప్పబడిన శాసనము ప్రవేశపెట్టినది. నిర్బంధభోగమునౌకరీ పోయినగాని భోగమువృత్తి మానుకొనుటకు వీలుండదు. దానికి అన్ని పార్టీల, ముఖ్యముగా కాంగ్రెసుపార్టీసభ్యుల సహాయము కావలెను. లేనిచో మంజూరుకానేరదు. అపుడు మా కాంగ్రెసుపార్టీ నాయకులుగానున్న సామి వెంకటాచలంచెట్టి, సత్యమూర్తిగారలు ఆ బిల్లుకు వ్యతిరేకముగానుండిరి. భోగపుజాతియొకటి నిలచియుండవలెననియే వారి అభిప్రాయము. నేను మొదటినుంచీ వీరేశలింగం, వెంకటరత్నంనాయుడుగారల శిష్యుడనుగా భోగపుజాతిని సంస్కరించవలెనని వాంఛించుచున్నాడను. అందువల్ల డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారు నా సహాయము నపేక్షించినది. నేను ఆమె పక్షమున సభ్యులందరితో మాట్లాడితిని. ముఖ్యముగా కాంగ్రెసుపార్టీలో ఆంధ్రసభ్యులమందరము ఆమెకు మద్దతుచేసితిమి. కొందరు ఆంధ్రేతరులుకూడ మద్దతు చేసిరి. ఆమె తెచ్చినబిల్లు ఆమోదింపబడి శాసనమయినది. అప్పటినుంచి నేటివరకు ఆమె, నేను సోదరీసోదరులవలె పరస్పరగౌరవముతో నున్నాము. మహాత్మాగాంధీగారుకూడ భోగంవృత్తిని ఖండించి దానిని మాన్పుటకు సర్వప్రయత్నములు చేయవలెనని కాకినాడవచ్చినపుడు చెప్పియున్నారు.

## (6)

అప్పటికి గవర్నమెంటుగ్రామములలోని రైతులమీద 30 సంవత్సరముల కొకసారి రీసెటిల్మెంటులనుపేర ప్రభుత్వము శిస్తులను, నీటితీరువను పెంచు పద్ధతి యుండెను. తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు — ఈ నాలుగుజిల్లాలకు 1929లో రీసెటిల్మెంటు కావలసియున్నది. మద్రాసుప్రభుత్వము హోల్డ్సువర్త్ అను ఐ.సి.యస్. ఉద్యోగిని విచారణకు నియమించగా ఆయన ఈ నాలుగుజిల్లాలలోని రైతులు చెల్లించుచున్న భూమిశిస్తుపైనను, నీటితీరువపైనను రూపాయికి మూడుఅణాల చొప్పున హెచ్చు చేయవలెనని రిపోర్టువ్రాసెను. ఆ రిపోర్టు శాసనసభఎదుటికి చర్చకువచ్చినది. కాంగ్రెసుపార్టీవారము అందరమును దానిని తీవ్రముగా ఖండించి

రైతులు ఋణగ్రస్తులై యున్నారనియు, వ్యవసాయపుఖర్చు లెక్కువగా నున్నవనియు, శిస్తుకాని, నీటితీరువ కాని ఏమాత్రము హెచ్చుచేయ వీలు లేదనియు ఖండితముగ వాదించితిమి. ఇతరపార్టీలలోని కొందరుసభ్యులు కూడ మాతో నేకీభవించిరి. అందుమీద ఈ నాలుగుజిల్లాలలోని గవర్న మెంటు గ్రామములలోని రైతుల ఆర్థికస్థితిని, వ్యవసాయఖర్చులను, ఋణ గ్రస్తతను విచారించి పన్నులు ఎక్కువ చేయవలెనా, లేదా యని రిపోర్టు చేయుటకు మాజీమంత్రి ఆరోగ్యస్వామిమొదలియారుగారు అధ్యక్షులుగాగల నొకకమిటీని నియమించిరి. ఆ కమిటీలో బిక్కిన వెంకటరత్నం, దండు నారాయణరాజుగారలుకూడ సభ్యులుగా నుండిరి. మేమందరము ఆ కమిటీ వారు విచారణకువచ్చినపుడు మా చుట్టుపట్లనున్న గవర్నమెంటుగ్రామముల లోని మెట్ట, పల్లము భూములవిషయమై సాక్ష్యమును వారిఎదుట సమర్పించు టకు పూనుకొంటిమి. 1928లో సైమనుకమిషను మదరాసు వచ్చినప్డు కాంగ్రెసుపార్టీవారును, మితవాదులును వారిఎదుట సాక్ష్యమివ్వకుండ వారిని బహిష్కరించిరి. ప్రతిచోట కాంగ్రెసు శాంతిసైనికులు 'సైమన్ వెనుకకుపో, వెనుకకుపో' అను నినాదములిచ్చిరి. అట్టిసమయములో జస్టిసుపార్టీవారు సైమనుకమిషనుతో సహకరించిరి. మదరాసు జాతీయపార్టీపక్షమున ముఖ్య మంత్రిగానున్న డాక్టరు సుబ్బరాయన్‌గారిని సర్ సి.పి. రామస్వామిఅయ్యరు గారు ప్రోత్సహించి సైమనుకమిషనుతో సహకరింపచేసిరి. అప్పటినుంచి సుబ్బరాయన్‌గారు కాంగ్రెసు సహాయమును విడిచిపెట్టి, జస్టిస్‌పార్టీ ఆశ్రయ మును పొందెను. తన తోడి జాతీయవాదమంత్రులుగానున్న ఆరోగ్యస్వామి, రంగానాథమొదల్యారులను మంత్రిత్వమునుండి తీసివేసెను. తన యిష్టము వచ్చిన సేతురత్నమయ్యరును, ముత్తయ్యమొదలియారును మంత్రులుగా వేసుకొనెను. వీరిని ఆయన కాంగ్రెసుపార్టీలోనుంచి చేరబట్టెను. అందు వలన హోల్డ్సువర్తురిపోర్టుమీద విచారణచేయుట కేర్పడిన కమిటీకి అధ్య క్షులుగానియమించబడిన ఆరోగ్యస్వామిమొదలియారుగారు అప్పటికే మాజీ మంత్రులుగా నుండిరి. ఆ కాలమున గోగినేని రంగనాయకులుగారు పచ్చయప్పకళాశాలలో ఆర్థికశాస్త్రమునునేర్పు ఆచార్యులుగా పనిచేయు చుండిరి.అప్పటికి కొంతకాలముక్రిందట ఇంగ్లాండునుంచివచ్చి పత్రిక లకు

వ్యాసములు వ్రాయుచుండిరి. ఒకవిధముగ జస్టిస్‌పార్టీకి అనుకూలముగనే వ్రాయుచుండిరి. అందువలననే జస్టిసుపార్టీ ప్రాముఖ్యముఎక్కువగాగల పచ్చయప్ప కళాశాలలో వారిని ఆచార్యులుగా తీసుకొనిరి. కాని కొద్దికాలమునకు ఆయనకు జస్టిసుపార్టీతో భేదాభిప్రాయమేర్పడి అచట ఆచార్యులుగనుండుటకు ఇష్టములేకపోయెను. స్వతంత్రముగానుండవలెనని యుద్దేశించెను. నన్ను, ఇంకా కొంతమంది కాంగ్రెసుప్రముఖులను రంగాగారు వచ్చి చూచిరి. ఆరోగ్యస్వామిమొదలియారు కమిటీకి కార్యదర్శిగా నెలకు 400 రూప్యములజీతముతో ఆచార్య రంగాగారిని నియమించునట్లు నేను గట్టిగా ప్రయత్నముచేసితిని. అటుల సెక్రెటరీగా ఆయన పనిచేసెను. అప్పటి నుంచి ఆచార్య రంగాగారు నేను మిగుల స్నేహితులమైతిమి. ఆయన ఇంగ్లాండులో లేబరుపార్టీలో సభ్యుడై ప్రొఫెసరు లాస్కీశిష్యుడుగనుండెను. మా యిద్దరికి (Socialistic) సాంఘికతత్వభావము లుండెను. ఆ కమిటీ వారు విచారణచేసి ఏమాత్రము శిస్తునుగాని, నీటితీరువనుగాని ఎక్కువ చేయకూడదని తమరిపోర్టులో గట్టిగా వ్రాసిరి. ఆ రిపోర్టు 1930 జనవరి 6వ తారీఖున శాసనసభకు నివేదింపబడెను. ఆ రిపోర్టుప్రకారము 1929, 30 సం॥ లలో పన్నులేమియు నధికముచేయబడలేదు. 1931 వేసంగిలో మద్రాసు గవర్నరు, మొదటిసంవత్సరము ఒక అణా చొప్పున, రెండవ సంవత్సరము రెండుఅణాలు, మూడవసంవత్సరము మూడు అణాల చొప్పున పన్నుల నధికముచేయుటకు నిశ్చయించెను. అటుల చేయకూడదని మనవిచేయుటకు న్యాపతి సుబ్బారావుపంతులుగారి అధ్వర్యమున రాయబారసభ్యులు బెజవాడలో గవర్నరును సందర్శించిరి. ఆ రాయబారపు సభ్యులపేర్లలో దండు నారాయణరాజుగారిపేరుకూడ చేర్చి సుబ్బారావు పంతులుగారు గవర్నరుగారికి పంపియుండిరి. గవర్నరుగారి ఆంతరంగిక కార్యదర్శి అంగీకరించెను. దండు నారాయణరాజుగారితోసహా సభ్యులందరు రాయబారమువెళ్ళుటకు బెజవాడ వచ్చిరి. దండు నారాయణ రాజుగారు 1930 సంవత్సరపు ఉప్పుసత్యాగ్రహములో జైలుకు పోయి యుండినకారణముచే వారిని చూచుటకు గవర్నరు కిష్టములేదని గవర్నరు గారి కార్యదర్శి ఆదినమున సుబ్బారావుపంతులుగారికి తెలియపరచెను. దాని

మీద వారిని విడిచిపెట్టి రాయబారము వెళ్లవలెనా లేదా యని త్రొక్కులాటలు కలిగెను. నా సలహా నడుగగా ముఖ్యముగ ఆ పరిస్థితులలో గవర్నరువద్దకు అసలే రాయబారము పోగూడదని సలహానిచ్చితిని. రాయబారముపోవుట ఆత్మగౌరవమునకు భంగకరమని చెప్పితిని. ఒక్క మారెన నర్సన్నగారుమాత్రము నా సలహానుసరించి రాయబారము వెళ్లుట మానివేసిరి. దండు నారాయణరాజుగారిని, మారెన నర్సన్నగారిని విడచిపెట్టి న్యాపతి సుబ్బారావుపంతులుగారు మాగంటి సీతయ్యా, కానూరు వెంకటచలపతయ్యా మొదలగు మిగతా నలుగురుసభ్యులతో వెళ్ళి గవర్నరుగారిని దర్శించెను. గవర్నరు రాయబారసభ్యులను తూలనాడెను. ఆరోగ్యస్వామి కమిటీరిపోర్టు ఏమాత్రము విలువలేనిదని చెప్పెను.దాని కాగిత మంత ఖరీదు చెయ్యదని తాను పన్ను ఎక్కువచేసితీరెదనని చెప్పెను. అప్పటికప్పుడే దేశములో ఆర్థికమాంద్యము హెచ్చినది. ధాన్యపుబస్తా మూడురూపాయలకు పడిపోయినది. ఆకారణముచే రైతులందరు తల్లక్రిందులైనారు. ఆస్థితిలో రైతుపైన పన్నులభారమును హెచ్చించుట అమానుషమే అయినను, గవర్నరు తనపట్టుదలను వదలలేదు. సుబ్బారావుపంతులుగారికి కోపమువచ్చినది. ప్రజలు అధికపన్నులను చెల్లింప నిరాకరించెదరని గవర్నరుతోచెప్పెను. అటుల నిరాకరించినచో తగిన కఠినచర్యలను జరిపి వసూలుచేసితీరెదమని, పన్నుల నివ్వవద్దని బోధించెడివారిని జైలులోపెట్టుటకుతగిననూతనశాసనములనుచేసెదనని గవర్నరు చెప్పెను. రాయబారసభ్యులు ఆశాభంగముతో మరలివచ్చిరి. ఈ సంగతులన్నియు నాతో చెప్పిరి. 'నేను చెప్పలేదా పంతులుగారు, అందులో మనము స్వతంత్రముకొరకు పోరాడుచున్నాము. ఈసమయములో వాళ్ళవద్దకు రాయబారాలుపోవడమే పొరపాటు' అని పంతులుగారితో చెప్పినాను. వారు నిజమే నన్నారు. వా రా దినము నా కతిధిగనుండి సాయంత్రము రాజమహేంద్రవరము వెళ్ళినారు. మితవాదులలో కెల్ల సుబ్బారావుపంతులుగారు చాల స్వతంత్రులు. ఆయన ప్రభుత్వబిరుదులు పుచ్చుకొనలేదు. అయితే ఇది రైతులవిషయముగదాయని వెళ్ళినారు. గవర్నరు అంత అగౌరవముగ మాట్లాడుతాడని ఆయన అనుకోలేదు. 1930 జనవరి 5 వ తేదీన కాంగ్రెసుపార్టీసభ్యులమగు నేను, కరంతు మొదలైన

వారము రాజీనామాల నిచ్చితిమి. తరువాత పదిహేనురోజులకు సత్యమూర్తి, బషీర్ అహమ్మద్ మొదలైనవారు రాజీనామాలనిచ్చినారు. గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు తాను తిలకుగారి అనుచరుడనని, గాంధీగారి యుద్యమము తనకు నచ్చలేదని, 1920 నుంచి కూడ గాంధీయుద్యమములో పూర్తిగ చేరలేదు. ఐనను 1926 సంవత్సరపు ఎన్నికలలో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుఉపసంఘమువారు ఆయనను కర్నూలు జిల్లాలో కాంగ్రెసుసభ్యుడుగా నిలబెట్టగా ఆయన గెలుపొందెను. శాసనసభలో బాగుగనే పనిచేసెను. కాని లాహోరుకాంగ్రెసుతీర్మానప్రకారము మేమందరము కొంచెము వెనుకగనో ముందుగనో రాజీనామాలనివ్వగా, ఆ తీర్మానప్రకారము తాను నడవనక్కరలేదని ఎదిరించి రాజీనామానిచ్చుటకు నిరాకరించెను. ఒకరోజున మద్రాసులో గోవిందప్పనాయకవీధిలోనున్న సౌందర్యమహాలులో జరిగిన బహిరంగసభలో ప్రజలవల్ల చాల గోలజరిగెను. తుదకు మహాత్మాగాంధీగారు అరెస్టుఅయినపిమ్మట ఆయన తన శాసనసభాసభ్యత్వమునకు రాజీనామానిచ్చెను. గాని అప్పటినుంచి గాంధీఉద్యమముతో ఆయనకు సంబంధములేకపోయెను. గాని ఆంధ్రోద్యమము, సహకారోద్యమము, వయోజన విద్య, గ్రంథరచన, మొదలైనయుద్యమములలో బాగుగా పనిచేయుచు దేశసేవ, భాషాసేవ చేయుచున్నారు.

చాలసంవత్సరముల క్రింద యూరపియను ఇంజనీర్లు కృష్ణానదిమీద పులిచింతలవద్ద ఆనకట్ట, కావేరినదిపైన మెట్టూరువద్ద ఆనకట్ట, ఈ రెంటిలో ఏది లాభదాయకమో విచారణచేసి పులిచింతలవద్ద ఆనకట్టకట్టుటయే యుక్తమని, తక్కువఖర్చుతో ఎక్కువలాభము వచ్చునని రిపోర్టువ్రాసియుండిరి. కాని పులిచింతలఆనకట్టను వెనుకకునెట్టి 1927 లో మెట్టూరువద్ద కావేరీ నదిమీద ఆనకట్టకట్టుటకు మద్రాసుప్రభుత్వ ఎగ్జిక్యూటివ్‌కౌన్సిలరు సర్ సి. పి. రామస్వామిఅయ్యరుగారు నిశ్చయించి పనిప్రారంభించిరి. మంత్రులు ఎగ్జిక్యూటివుకౌన్సిలర్లుకూడ ఆయనపలుకుబడిలో నుండిరి. ఎదురుచెప్పువారు లేరు. అధికారములోలేని రామారాయణంగారి జస్టిసుపార్టీ మాత్రము దానిని ఖండించుచు ఇంజనీర్ల అక్రమలాభములను వివరించుచు (Mettur Scandal) 'మెట్టూరుదురన్యాయము' అను కరపత్రములను విరివిగాపంచి

పెట్టినారు. శాసనసభలో మాట్లాడినారు. ఫలిత మేమియు లేదు. మెట్టూరు వద్ద కావేరిమీద ఆనకట్ట కట్టబడెను. అది లాభదాయకము కానందున దాని క్రింద సాగుచేసే రయితులచేత యకరముఒకటికి రు 15 ల నీటితీరువ చెల్లించునట్లు ఒప్పందంచేయించెను. గాని ఆ ఆనకట్ట తయారైనపిమ్మట ఆ రైతులే ఆందోళనముచేసి రు 7-8-0 లకు నీటితీరువను తరువాతవచ్చిన అరవప్రభుత్వముచేత తగ్గింపచేసుకొనిరి. సి. పి. రామస్వామిఅయ్యరుగారు 1927 లోనే పైకారా నదీపాతమునుండియు, పాపనాశనమునుండియు విద్యుచ్ఛక్తి అరవజిల్లాలకు సరఫరాఅయ్యేటట్లు రెండు గొప్పప్రాజెక్టులను నిర్మింపచేసెను. ఇందువలన మద్రాసులోని అరవజిల్లాలకు ఆ రాష్ట్రములోని తెలుగుజిల్లాలకంటె ఇరవైఅయిదేండ్లు ముందుగ విద్యుచ్ఛక్తి లభించి అరవజిల్లాలు అతిత్వరితముగ ఆర్థికాభివృద్ధి పొందెను.

ఉన్నవ లక్ష్మీనారాయణగారు 1921 లో పల్నాటి అడవిపుల్లరి సత్యాగ్రహసందర్భమున అరెస్టుచేయబడి ఒకసంవత్సరం శిక్ష విధింపబడి రాయవేలూరుజైలుకు కొనిపోబడిరని ఇదివరకే తెలిపియున్నాను. ఆ కాలములో వారు "మాలపల్లి" యను ఉత్కృష్టమైన తెలుగునవలను రచించిరి. వారు విడుదలైనతరువాత దానిని ప్రచురించిరి. ఆ గ్రంథము సాంఘికవిప్లవమును కలుగచేయుచున్నదని, అందులో రాజద్రోహముకూడ కలదని బ్రిటిషుప్రభుత్వమువారు నిషేధించినారు. నేను శాసనసభకు సభ్యుడుగా వెళ్లినపుడు ఆ గ్రంథముమీద నిషేధమును తొలగించవలసినదని యొక తీర్మానమును పెట్టితిని. దానిని సర్ సి. పి. రామస్వామిఅయ్యరుగారు సానుభూతితో ఆలోచించెదమని చెప్పినందున నేను ఆ తీర్మానమును విరమించుకొంటిని. అపుడు టి. ఆర్. వెంకటా్రామశాస్త్రిగారు అడ్వొకేట్ జనరల్‌గా నుండిరి. రామస్వామిఅయ్యరుగారి సలహాపైన నేను వారిని కలిసితిని. ఆ పుస్తకములోని రెండుపేజీలు తీసివేసినయెడల ఆ పుస్తకము మీద నిషేధము తొలగించి దానినంతను పునర్ముద్రణచేయుటకు అంగీకరించెదమని వారు నాతో చెప్పగా నేను అందుకు సమ్మతించితిని. ఆప్రకారమే ఆ రెండుపేజీలు తీసివేయబడి ఆ పుస్తకము లక్ష్మీనారాయణగారిచేత ప్రచురించబడినది.

ఆంధ్రదేశములో సరాసరి రాకపోకలుజరుగుటకును, వర్తక, వ్యాపారములు వృద్ధిచెందుటకును బెజవాడ, గుంటూరునగరములు రెండును క్రమముగ నేకమగుటకును బెజవాడవద్ద కృష్ణానదిమీద రోడ్డువంతెన నిర్మించుట మిగుల యావశ్యకమని తలచి నే నొక తీర్మానమును 1927లో శాసనసభలో ప్రవేశపెట్టితిని. బెజవాడకు గుంటూరుకు ఇరువదిమైళ్ళ దూరమే గలదు. నేనపుడు బెజవాడ మునిసిపలుచైర్మనుగ నున్నందున ఆ వంతెనకయ్యే ఖర్చులో నొక లక్షరూప్యములను బెజవాడ మ్యునిసిపాలిటీ భరించునట్లు మా మునిసిపలుకౌన్సిలుచేత తీర్మానముకూడా చేయించితిని. అటులనే గుంటూరుమునిసిపలుచైర్మనుగనున్న నడింపల్లి లక్ష్మీనరసింహా రావుగారు కూడ తమ మునిసిపాలిటీచేత నొక లక్షరూప్యములను దాని ఖర్చులకుగాను విరాళమిచ్చెదమని నాకు వ్రాసిరి. కృష్ణాజిల్లాబోర్డు అధ్యక్షులు గుంటూరుజిల్లాబోర్డు అధ్యక్షులు చెరియొక లక్షరూప్యములను తమ తమ జిల్లాబోర్డులచేత నిప్పించెదమని నాకు తెలిపిరి. ఈ విషయములన్నియు శాసనసభలో చెప్పితినిగాని, ప్రభుత్వము తీర్మానము నంగీకరించలేదు. నేను పిమ్మటకూడ నపుడపుడు ఈ విషయమై శాసనసభలో ప్రస్తావించుచుంటిని. 1937 నుండి కాంగ్రెసుపార్టీ ప్రభుత్వములోకి వచ్చినపుడు గోదావరినదిమీద రోడ్డువంతెనకు ప్లానులు తయారు చేయుచుండగ హైవేసు ఇంజనీరు అక్కాసప్రగడ లక్ష్మీనారాయణ గారితో చెప్పి కృష్ణానదిమీద బెజవాడవద్ద రోడ్డువంతెనకు ప్లానులు, ఎస్టిమేట్లు తయారుచేయించితిని. అఖిలభారతహైవేసువారు ఈ రెండు నదులమీద వంతెనలు కట్టునట్లు ప్రయత్నించిరిమి. స్థానికస్వపరిపాలనామంత్రి గోపాలరెడ్డిగా రంగీకరించిరి. 1939 లో మా ప్రభుత్వము రాజీనామా ఇచ్చి నందున అంతటితో ఆ ప్రయత్న మాగిపోయినది. అవల యాజమాన్యము క్రిందనున్నన్నాళ్లు కావేరినదిమీద తొమ్మిదివంతెనలుండగ కృష్ణా, గోదావరి నదులమీద నొకవంతెనయైన నిర్మాణముకాలేదు. ఆంధ్రరాష్ట్రమేర్పడగానే కృష్ణానదిమీద బెజవాడవద్ద బారేజిరోడ్డువంతెనలకు ముఖ్యమంత్రి ప్రకాశం గారిచే పునాదులువేయబడి ఆంధ్రప్రదేశ్‌రాష్ట్ర మేర్పడినపిమ్మట వాటినిర్మా ణము పూర్తియై ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డిగారిచే 1957లో తెరువ

బడినది. నా ముప్పదిసంవత్సరముల కల సఫలమైనవి. ఇటువైపు గుంటూరు పట్టణము అటువైపున బెజవాడపట్టణము త్వరితముగ పెరుగుచున్నవి. పది హేనుసంవత్సరములలో రెండుపట్టణములు కలసి ఆంధ్రదేశం మధ్యభాగమం దొక మహానగర మేర్పడుట నిస్సంశయము.

(7)

1927 లో సమిష్టి కృష్ణాజిల్లాబోర్డును పశ్చిమగోదావరి జిల్లాబోర్డుగను, కృష్ణాజిల్లాబోర్డుగను రెండుబోర్డులుగ సుబ్బరాయన్ ప్రభుత్వము విభజించినది. ఈ రెండుబోర్డులకు సభ్యులనందరిని ప్రభుత్వమే ఏర్పాటుచేయుటకును, అటుల నియమితులైనసభ్యులు తమలోనుంచి అధ్యక్షుని, ఉపాధ్యక్షుని ఎన్నుకొనునటులను ఏర్పాటుచేయబడెను. పశ్చిమగోదావరి జిల్లాబోర్డుకు నియమితులైన సభ్యులు పెద్దిరాజుగారిని అధ్యక్షునిగా నెన్నుకొనిరి. కృష్ణాజిల్లాబోర్డుకు డాక్టరు సుబ్బరాయన్‌గారు 26 మంది సభ్యులను నామినేట్‌చేసిరి. మీర్జాపురంరాజాగారు జస్టిస్‌పార్టీపక్షమునను, నేను కాంగ్రెసుపార్టీపక్షమునను కృష్ణాజిల్లానుంచి శాసనసభ్యులము. డాక్టర్ సుబ్బరాయన్‌గారు ఆకాలమున కాంగ్రెసుపక్షముతో నెక్కువ స్నేహముగ నుండిరి. మీర్జాపురంరాజాగారే మరల కృష్ణాజిల్లాబోర్డుఅధ్యక్షుడుగ నెన్నుకొనబడునట్లు 26 మంది సభ్యులలో నెక్కువమందిని మీర్జాపురంరాజాగారికి అనుకూలమైనవారిని నియమించవలెనని వెంకటగిరికుమారరాజాగారు, ఇంకా కొందరు వెలమజమీందారులు డాక్టర్ సుబ్బరాయన్‌గారిని కోరిరి. డాక్టరు సుబ్బరాయన్‌గారు జమీందారులు. తోటి జమీందారైన మీర్జాపురం రాజాగారిని అధ్యక్షునిగచేయవలెనని ఆ వెలమజమీందారులు కోరిరి. ఆయన 'కృష్ణాజిల్లానుంచి శాసనసభకువచ్చిన కాంగ్రెసునాయకులైన కాశీశ్వరరావు అటులచేయుటకు ఒప్పుకొన్నట్లయితే నేను ఆవిధముగనే మీర్జాపురంరాజాగారికి అనుకూలమైనవారి నెక్కువమందిని ఆబోర్డుకు నామినేట్‌చేసెద'నని చెప్పెను. వారందరు నా దగ్గరకువచ్చి న స్నేహితులైన మీర్జాపురంరాజాగారు అధ్యక్షుడగుటకు సమ్మతించవలసినదని ప్రతిమిలాడిరి. నేను వెలమజమీందారు లందరికి స్నేహితుడనని, మీర్జాపురంరాజాగారుకూడ నా కొకప్పుడు కక్షిదారుగనుండెనని, ఆయనమర్యాద నిలుపవలసినదని నన్ను కోరిరి. నే

నందుకు ఒప్పుకొనలేదు. ఈసంగతి డాక్టర్ సుబ్బరాయన్‌గారితో చెప్పి 28 మందిలో 20 మందినైన కాంగ్రెసుకనుకూలురైనవారిని సభ్యులుగ నియమించవలెనని కోరితిని. వా రటులనే చేసిరి. ఆరుగురినిమాత్రము మీర్జాపురం రాజాగారి కిచ్చిరి. అందులో నొకరుగా మీర్జాపురంరాజాగారిని నామినేట్ చేసిరి. తక్కిన 20 మందిలో డాక్టర్ ధన్వాడ రామచంద్రరావు, కొళంద రెడ్డిగారలు ఉండిరి. అందుమీద అధ్యక్షునిఎన్నికలో నేను డాక్టర్ ధన్వాడ రామచంద్రరావుగారిని బలపర్చితిని. బందరుకాంగ్రెసునాయకులు కొళందరెడ్డి గారిని బలపర్చిరి. మీర్జాపురంరాజాగారు 8, 9 మందిని తనవైపునకు త్రిప్పు కొనవలెనని ప్రయత్నించెను. కాని ఆ ప్రయత్నముఫలించలేదు. అందువల్ల ఆయన అధ్యక్షఎన్నికలో నిలువలేదు. డాక్టర్ రామచంద్రరావుగారికి కొళంద రెడ్డిగారికి మధ్యజరిగిన ఎన్నికలో మీర్జాపురంవారిసభ్యులు కొళందరెడ్డిగారికే సహాయముచేసిరి. గాని డాక్టర్ రామచంద్రరావుగారే జయమొంది జిల్లా బోర్డుకు అధ్యక్షులైరి. వారు పదినెలలు అధ్యక్షులుగ పనిచేసిరి. ఆ కాలము లోనే కృష్ణాజిల్లాలోని తాలూకాబోర్డులఎన్నికలు కూడ వచ్చెను. బందరు తాలూకాబోర్డుకు కాంగ్రెసుపక్షమున గొట్టిపాటి బ్రహ్మయ్యగారు, బెజవాడ తాలూకాబోర్డుకు కాంగ్రెసు పక్షమున నల్లూరి పాపయ్యగారు, నూజవీడు తాలూకాబోర్డుకు కాంగ్రెసు పక్షమున గొల్లపల్లి రాజాగారు, నందిగామ తాలూకాబోర్డుకు కాంగ్రెసుపక్షమున కాకుమాని పిచ్చయ్యగారు అధ్యక్షులుగా ఎన్నుకొనబడిరి. ఈ ఎన్నికలన్నిటిలో నేను కాంగ్రెసుజయమునకై తీవ్రముగపనిచేసితిని. గుడివాడతాలూకాబోర్డుకు తాత్కాలిక అధ్యక్షుడుగ కాజవెంకట్రామయ్యగారు నియమింపబడినాడు. దాదాపు సంవత్సరమువరకు కొన్ని తగవులు కలిగిన కారణముచేత ఆ తాలూకాబోర్డుఎన్నికలు ఆగిపోయినవి. ఆ కాలమునందంతయు కాజ వెంకట్రామయ్యగారే అధ్యక్షుడుగ పనిచేసిరి. ఆయనకూడ కాంగ్రెసుసభ్యుడే. ఇటుల ఆ కాలములో జిల్లాబోర్డును, అన్ని తాలూకాబోర్డులను కాంగ్రెసుపక్షమువారము స్వాధీనపరచుకొంటిమి. ఎన్నికలలో కాంగ్రెసుకే ప్రతిచోట జయము కలిగెను. కాని 10 నెలలలోపల సైమనుకమిషను మద్రాసుకు వచ్చినకారణముగ, డాక్టర్ సుబ్బరాయన్‌గారు కాంగ్రెసుపార్టీతో స్నేహమును వదలిపెట్టి జస్టిసుపార్టీ ఆశ్రయమును

పొందిి సైమనుకమిషనుతో సహకరించగా జస్టిసుపార్టీనాయకులైన మీర్జాపురం రాజాగారు, అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారు డాక్టరు సుబ్బారాయన్ గారిని కోరి తమ కనుకూలురైన 13 మంది నూతనసభ్యులను కృష్ణాజిల్లా బోర్డుకు నియమింపచేసుకొనిరి. అందుమీద కృష్ణాజిల్లాబోర్డు వ్యవహారము తలక్రిందులయ్యెను. జస్టిసుపార్టీ సభ్యులు 24 గురు, కాంగ్రెసుపార్టీసభ్యులు 20 మంది యైరి. ఆ వెంటనే జస్టిసుపార్టీవారు డాక్టరు ధన్వాద రామచంద్రరావుగారిమీద విశ్వాసరాహిత్యతీర్మానమునుపెట్టి దానిని మంజూరు చేయించిరి. రామచంద్రరావుగారు జిల్లాబోర్డు అధ్యక్షపదవికి, జిల్లాబోర్డు సభ్యత్వమునకును రాజీనామానిచ్చిరి. వెంటనే అధ్యక్షపదవికి ఎన్నికలు పెట్టుకొని మీర్జాపురంరాజాగారు మరల జిల్లాబోర్డుకు అధ్యక్షులుగ నెన్నుకొనబడెను.

బెజవాడలో రోమనుకేథలిక్ క్రైస్తవసంఘమునకు నాయకులుగ నున్న ఫాదరు పెజ్జోనీగారు నాకు మునిసిపలువ్యవహారములలో చాల స్నేహితులుగ నుండెను. ఆయన ఇటలీదేశీయుడు. ఆయననుకూడ మదరాసు ప్రభుత్వము జిల్లాబోర్డుసభ్యులుగ నియమించిరి. డాక్టరు రామచంద్రరావుగారికి వ్యతిరేకముగ నిలచి అధ్యక్షపదవికి పోటీచేయుటకు మీర్జాపురము రాజాగారు ప్రయత్నించుచున్నసమయములో ఫాదరు పెజ్జోనీగారివద్దకుపోయి రామచంద్రరావుగారికి వారిఓటు నివ్వవలెనని కోరితిని. తాము జమీందారైన మీర్జాపురంరాజాగారికి ఓటునిచ్చెదమేకాని క్రైస్తవుడైన రామచంద్రరావుగారికి ఓటు నివ్వమని, అదియే క్రైస్తవమిషనరీలసమావేశములో నిర్ణయించుకున్నామని చెప్పెను. 'మీరు హిందువులు; మీరు కాంగ్రెసులోచేరి ఆంగ్లప్రభుత్వముతో పోట్లాడితే మీమీద మాకు అంత కోపముండదు, అభిప్రాయభేదముగా నెంచుకుంటాము. రామచంద్రరావుగారు క్రైస్తవుడై యుండియు, క్రైస్తవమతములో కానన్ అయిన అనంతంగారి కుమారుడై యుండియు, క్రైస్తవప్రభుత్వమైన ఆంగ్లేయప్రభుత్వమునకు వ్యతిరేకముగ పనిచేయుట, కాంగ్రెసులో ముఖ్యపాత్రనువహించుటచే క్రైస్తవమతమునకు ద్రోహముచేయుచున్నాడని మేమందరము భావించి నిశ్చయించినాము.' అని ఆయన కల్లా కపటములేకుండ నాతో చెప్పెను. ఇది నా కాశ్చర్యమునుకలుగ

చేయలేదు. క్రైస్తవమిషనరీలందరును ఆంగ్లేయప్రభుత్వపక్షమున నుండిరి. మీర్జాపురంరాజాగారు నిలవనందున పెట్టోనీగారు తమఓటును కొళందరెడ్డి గారి కిచ్చిరి. రామచంద్రరావుగారి కిష్టమేమి. బెజవాడలో నాకు వ్యక్తిగత ముగా యూరోపియనులు, క్రైస్తవమిషనరీలు అంత వ్యతిరేకులుగాలేరు. స్నేహముగానే యుండిరి. వారిసౌకర్యములను నేను బైరెమనుగ మన్నించి, సహాయముచేయుచుంటిని. బెజవాడలోనున్న చర్చ్ ఆఫ్ ఇంగ్లండుకుచెందిన తెల్లమిషనరీ యొకరోజున మాయింటికి వచ్చెను. మా సంభాషణలో నేను కాంగ్రెసులోచేరి స్వతంత్రముకొరకు పనిచేయుట అస్వాభావికముకాదనిన్ని అందువల్ల నామీద తమకందరికి గౌరవమే కలదనిన్ని, కాని నేను నెత్తి మీద తెల్ల (గాంధీ) టోపీ పెట్టుకొనుటమాత్రము తమ కిష్టములేదనిన్ని, అది ప్రభుత్వముచే వైమవిధించబడినవానిటోపీగనుక దానిని పెట్టుకొనుట వలన ప్రభుత్వమును అనుక్షణముసవాలుచేయుటగాభావింపబడుచున్నదనియు నాతోచెప్పినాడు. "దానిని కాంగ్రెసువారమందరము స్వతంత్రవాంఛకు చిహ్న ముగా పెట్టుకుంటున్నాము. దానిమీద మీకు ప్రత్యేక వ్యతిరేకతయుండుటకు కారణములే" దని చెప్పినాను. కాని ఆ గాంధీటోపీతోనే నేను కలెక్టరులను, ప్రభుత్వోద్యోగులైన భారతీయులను, ఆంగ్లేయులను కలసితిని. వారు నన్ను గౌరవముగానేచూచిరి. అదివరకు గాంధీటోపీ పెట్టుకొనినచో అరెస్టుచేసిన రోజులున్నవి. మద్రాసుశాసనసభ ప్రేక్షకులస్థానములోని కొకరు గాంధీటోపీ పెట్టుకొని వెళ్ళి కూర్చొనగా ఆంగ్లేయ ఎగ్జిక్యూటివ్‌కౌన్సిలరు సార్జెంటును పిలచి ఆ టోపీపెట్టుకొనివచ్చినవారిని అచటినుంచి వెళ్లగొట్టించెను. ఆయ నకు ప్రేక్షకటిక్కెట్టునిప్పించినశాసనసభ్యుని మందలించెను. గాని కొందరు కాంగ్రెసు శాసనసభ్యులము శాసనసభలోకి గాంధీటోపీలతో పోగా మమ్ముల నేమీ చెయ్యలేక యూరుకొనిరి.

విదేశ క్రైస్తవ మిషనరీల భావములను గూర్చి మరియొక యుదా హరణము నిచ్చి ముగించెదను. డాక్టరు కుగ్లరు గుంటూరులో స్త్రీల, పిల్లల ఆసుపత్రిని స్థాపించి తన యావజ్జీవము మానవసేవ చేసిన గొప్ప అమెరి కను స్త్రీ. చాల దైవభక్తి గలది. నా చెల్లెలు శ్యామలాంబను ప్రసవము నిమిత్తము కుగ్లరు ఆసుపత్రికి చాలాసార్లు తీసుకొనివెళ్ళినాము. నాతో చాల

గౌరవముగాను స్నేహముగాను ఉండేది. 1924 వ సంవత్సరములో మా మోహనరావు వారి ఆసుపత్రిలో పుట్టినప్పుడు ఆమెను చూడబోగా ఆమె ప్రస్తావనలో స్వరాజ్యమును మేమందరము కోరడము సంగతి తెచ్చి "ఆసుపత్రులను నడిపించుట ఇంకా మీకు తెలియదే. అది ముందు బాగా నేర్చుకొనండి. బాగా నేర్చుకుంటే గాని మీరు స్వరాజ్యమును పొందుటకు అర్హులుకా"రని అన్నది. అందుమీద నేను "మీ అమెరికా వారు 1782 లో ఇంగ్లీషువారితో యుద్ధముచేసి స్వరాజ్యము సంపాదించుకున్నప్పుడు అడవులలో నున్నారు. అనాగరికులుగ నున్నారు. అలాగే మేముకూడ ముందు స్వరాజ్యం సంపాదించినచో పిమ్మట అన్నీ నేర్చుకుంటాము. సర్వవిధముల అభివృద్ధిచెంది మీతో తులతూగుతాము," అని చెప్పినాను. "ఇంగ్లీషువారు లేచిపోతే మీలో మీరు కలహించుకుంటారు. హిందువులు, ముస్లిములు ఇప్పుడే కొట్టుకుంటున్నారు. ఈ కొట్లాటలు ఇంగ్లీషువారు లేచిపోయినచో ఇంక ఎక్కువగును. ఆ అరాజకములో మా చర్చిలను, మా ఆసుపత్రులను కూడ నాశనముచేస్తారు" అని అన్నది, "అటువంటి వేమీ జరగవు. ఇంగ్లీషు వారుండి మాలో మాకు మతముల పేర అంతఃకలహములు పెట్టుతున్నారు. వారు లేచిపోతే మేమందరము ఐకమత్యమునుపొంది దేశాభివృద్ధికోసరము అందరం కలసి పనిచేసుకుంటాము. క్రైస్తవ చర్చిలను, మీ ఆసుపత్రిలను తప్పకుండా కాపాడుతాము. అన్ని మతములను గౌరవిస్తాము'' అని జవాబు చెప్పినాను. బదులు చెప్పకుండా ఊరుకున్నది. గాని ఆమె కేమీ కోపము రాలేదు. మర్యాదగా ఇతర సంగతులు మాట్లాడినది. మా చెల్లెలిని పిల్లవాడిని చూచి బెజవాడ వచ్చినాను. ఆ రోజులలో ఇటువంటి భావములనే విదేశ క్రైస్తవ మిషనరీలు భారతీయక్రైస్తవులలో ఎక్కించి కాంగ్రెసుకు స్వరాజ్య ఉద్యమమునకు వ్యతిరేకముగా నుండునట్లు చేసేవారు.

## 12 పూర్ణస్వరాజ్యము - ఉప్పు సత్యాగ్రహము

1921 లోనే ఆంధ్రులు పూర్ణస్వరాజ్యము కోరుట కాంగ్రెసులో సోషలిస్టుసామాజిక సిద్ధాంతముల విజృంభణము-1935 లో ఆంధ్ర కాంగ్రెసుసోషలిస్టుపక్ష స్థాపనము ఆంధ్రదేశ కాంగ్రెసురాజకీయములు - ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ అవతరణము - 1929 లో సైమనుసంఘమువారి పర్యటనమునాటి సంఘటనలు - మద్రాసులో ప్రకాశంగారి ధైర్యసాహసములు - గుంటూరు విశేషములు - 'నెహ్రూకమిటీ రిపోర్టు' - అధినివేశస్వరాజ్యము - ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస అధ్యక్షత, పట్టాభి సీతారామయ్యగారు - చరఖాసంఘ ఆంధ్రశాఖ - గ్రామపరిశ్రమలు - గొల్లపూడి సీతారామశాస్త్రిగారు - ఖద్దరునిధికై 1929 లో గాంధీమహాత్ముని ఆంధ్రదేశ పర్యటనము - మహాత్ముడు నాతో జరిపిన ప్రత్యేక గోష్ఠి - శాసనసభాధ్యక్షుల కాదర్శప్రాయుడైన విఠల్‌భాయి పటేల్- జితేంద్రనాథ్‌దాసు ప్రాయోపవేశము-లాహోర్ కాంగ్రెస్ పూర్ణస్వాతంత్ర్యతీర్మానము - 1930 జనవరి 26 తేదీ విశేషములు - ఉప్పుసత్యాగ్రహము -ఆంధ్రదేశమున జరిగిన సత్యాగ్రహ కార్యక్రమములు.

(1)

**1921 సం॥ నాటికే భారతకాంగ్రెసులక్ష్యము పూర్ణస్వాతంత్ర్యము అనగా బ్రిటిష్‌వారితో నెట్టిసంబంధములేని స్వతంత్రరాజ్యముగ నుండవలెనని ఆంధ్రనాయకులగు బులుసు సాంబమూర్తి, ఉత్తరప్రదేశ్ నాయకులైన**

మౌలానా హజరత్ మొహానీ ప్రభృతులు కొందరు తీవ్రవాదులు వాదించు చుండేవారు. 1931 లో ప్రకాశంపంతులుగారు బారిష్టరీకి తిలోదకాలిచ్చిన కొద్దికాలమునకు కాకినాడలో జరిగిన తూర్పుగోదావరిజిల్లా మహాసభలో భారత దేశలక్ష్యం పూర్ణస్వాతంత్ర్యమని నిర్వచింపబడవలెనని సాంబమూర్తిగారి ప్రోత్సాహమువలన తీర్మానము చేయబడినది. ఆ సభలోనే ప్రసిద్ధ దేశ భక్తురాలు, దేశబాంధవి దువ్వూరి సుబ్బమ్మగారు ప్రప్రథమంగా వేదికనెక్కి పూర్ణస్వాతంత్ర్యగర్జనముచేసినది. ఆమె ఆంధ్రదేశమంతటా సంచారముచేసి అద్భుతమైన కాంగ్రెసుప్రబోధము గావించినందున 1921 డిశంబరునెలలో ఆమెకు సంవత్సరంశిక్ష విధించబడినది. ఆంధ్రదేశములో జైలుకువెళ్ళిన ప్రథమవనిత ఆమెయే. పిమ్మట 1930 సంవత్సరపు ఉప్పుసత్యాగ్రహములో ఆంధ్రదేశమునుండి షుమారు మూడువందలఏబదిమంది స్త్రీలు జైళ్ళకు పోయినారు. 1921 వ సంవత్సరం డిశంబరులో అహమ్మదాబాదులో జరిగిన కాంగ్రెసుమహాసభలో అలాంటి తీర్మానాన్నే హజరత్ మొహానీ ప్రవేశ పెట్టెను. దానిని బలపర్చేవారెవ్వరూ లేరా అని అనుకునే సమయములో బందరుమిత్రుడు టి. పి. ఆళ్వారు లేచి బలపర్చెను. తీర్మానము వీగిపోయి నది. పిమ్మట 1925 లో ఆంధ్రదేశమునందు బులుసు సాంబమూర్తిగారు హిందూదేశమునకు బ్రిటిషుప్రభుత్వముతో నెట్టిసంబంధములేని సంపూర్ణ స్వాతంత్రము (పూర్ణ స్వరాజ్యము) కావలెనని ప్రకటించి యొక సంపూర్ణ స్వతంత్ర ప్రచారసంఘమును స్థాపించి ఆందోళనముసాగించ ప్రారంభిం చినారు. గాంధీగారితో ఆయన ఈ విషయమై తీవ్రముగ చర్చించుచు ఘర్షణ పడుచు నుండేవారు. ఎంత ఘర్షణపడుచుండినను గాంధీజీ ఆయనను ఆప్యాయతతో 'పూర్ణ స్వతంత్రవాదీ! రా' అని దగ్గరకుపిలచి చర్చించుచు నుండెడివారు. తూర్పుగోదావరిలోని డాక్టర్ సుబ్రహ్మణ్యం, కళా వెంకట రావు, మొసలికంటి తిరుమలరావు, క్రొవ్విడి లింగరాజు, మద్దూరి అన్న పూర్ణయ్య, మండపాక రంగయ్యనాయుడు, తెన్నేటి విశ్వనాథంగార్లు మొద లైన కాంగ్రెసునాయకులంతా అందులో చేరినారు. తెన్నేటి విశ్వనాధంగారు యం. ఏ. బి. ఎల్. ప్యాసై ప్లీడరీలో చేరి దానిని కాంగ్రెసుతీర్మానప్రకారం 1921 లో వదలిపెట్టి గుజరాతు విద్యాపీఠములో ఆచార్యుడుగా పనిచేసి

1925 వ సంవత్సరమునాటికి మరల ఆంధ్రదేశము వచ్చినాడు. కొండా వెంకటప్పయ్య, ప్రకాశం, పట్టాభి సీతారామయ్య, నాగేశ్వరరావు, సీతా రామశాస్త్రి, దండు నారాయణరాజు, నేను మొదలైనవారము గాంధీగారిపక్ష మున నుంటిమి. గాంధీగారింకను స్వరాజ్యమనగ బ్రిటిషువారితో సంధి కుదిరినయెడల డొమినియను ప్రతిపత్తిని పుచ్చుకొనుటయు, కుదరక పోయినచో సంపూర్ణ స్వతంత్రముకొరకు పోరాడుటయు ననెడు సిద్ధాంత ములో నుండిరి. మేము గాంధీగారినే సర్వవిధముల బలపర్చుచు వారి నాయకత్వము క్రిందనే నడచుటకు నిశ్చయించినవారము. ఆ సమ స్యమీద ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసులో కార్యనిర్వాహకవర్గఎన్నికలు జరిగి బులుసు సాంబమూర్తిగారు అధ్యక్షులుగ నెన్నుకొనబడిరి. మండపాక రంగయ్యనాయుడుగారు ప్రధాన కార్యదర్శి యయ్యెను. గాని ఆరు నెలలకు పిమ్మట బందరులో ఆంధ్రరాష్ట్ర రాజకీయ మహాసభ జరిగి నపుడు అందులో వాదోపవాదములు జరిగి సంపూర్ణ స్వతంత్ర తీర్మానము వీగిపోయినది. ఆ కారణముగ ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ అధ్యక్ష పదవికి సాంబమూర్తిగారు రాజీనామానిచ్చినారు. ప్రకాశంగా రపుడు ఇండియాలో లేరు. బర్మా, మలయా వైపుల సంచారములో నున్నారు. అయినను వారినే మరల ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుకమిటీకి అధ్యక్షులుగఎన్నుకొని నేను మరల ప్రధాన కార్యదర్శిగ నేర్పడి కార్యనిర్వాహకవర్గము నేర్పాటు చేసితిమి. సాంబమూర్తిగారు కూడ కార్యనిర్వాహకవర్గములో నుండిరి, గాని సాంబమూర్తిగారు తమ సంపూర్ణ స్వతంత్రమును కోరే పూర్ణ స్వరాజ్యసంఘమును యావద్భారత సంఘముగా విస్తరింపచేసిరి. సుబాసు చంద్రబోసు, యస్. శ్రీనివాసఅయ్యంగారు మొదలగువారు అందులోచేరిరి. జవహర్‌లాలు నెహ్రూగారిని యావద్భారత పూర్ణ స్వరాజ్య సంఘమునకు అధ్యక్షులుగ చేసిరి. సాంబమూర్తి గా రాంధ్ర పూర్ణస్వరాజ్య సంఘమున కధ్యక్షులుగ నుండిరి. అఖిలభారత కాంగ్రెసుసేవాదళము స్థాపించబడినపుడు సాంబమూర్తిగారిని దానికి అధ్యక్షులుగను, హార్డికరుగారిని దానికి ప్రధాన కార్యదర్శిగను ఎన్నుకొనిరి. దానిలో కమలాదేవి చటోపాధ్యాయగారు స్త్రీశాఖకు అధ్యక్షురాలుగా నుండెను. నేను ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు ప్రధాన



1. పండిత జవహర్లాల్ నెహ్రూ, 2. టంగుటూరి ప్రకాశం,
3. పంతా సూరిశాస్త్రి, 4. బులుసు సాంబమూర్తి
5. అయ్యదేవర కాళేశ్వరరావు.

కార్యదర్శిగ వారితో సహకరించితిని. ఆంధ్రరాష్ట్రములో కూడ కాంగ్రెసు సేవాదళము బాగుగ పనిచేసెను. ప్రతి జిల్లాలోను సేవాదళము లేర్పడెను.

1926 డిశంబరు నెలలో అస్సాంరాజధానియైన గౌహతి నగరములో కాంగ్రెసు మహాసభ యస్. శ్రీనివాసయ్యంగారి అధ్యక్షతక్రింద జరిగెను. అపుడు సాంబమూర్తి ప్రభృతులు సంపూర్ణ స్వతంత్ర తీర్మానమును పెట్టింప యత్నించిరి గాని, బలము హెచ్చుగా లేదని యూరకొనిరి. మరునటి సంవత్సరము కాంగ్రెసును మద్రాసుకు దక్షిణాదివారు ఆహ్వానించిరి. 1927 డిశంబరులో డాక్టరు అన్సారీగారి అధ్యక్షతక్రింద మద్రాసులో కాంగ్రెసుమహాసభ జరిగెను. అప్పటికి సంపూర్ణ స్వతంత్రవాదులు చాల పెరిగిరి. అపుడే యూరపును దర్శించి ఇండియాకు తిరిగివచ్చిన పండిత జవహర్‌లాలు నెహూర్రుగారు కూడా సంపూర్ణస్వతంత్రమే కావలెనని ప్రకటించెను. మద్రాసు కాంగ్రెసులో సంపూర్ణ స్వతంత్ర సంపాదనమే భారత జాతీయకాంగ్రెసుయొక్క ఆశయమని సంపూర్ణ స్వతంత్రవాదులు తీర్మానములనుపెట్టి అధికసంఖ్యాకులచేత నెగ్గించుకొనిరి. మహాత్మా గాంధీగారు మద్రాసు వచ్చిరి గాని కాంగ్రెసులో పాల్గొనలేదు. అపుడు జరిగిన అఖిలభారత కాంగ్రెసుకమిటీలో (విషయనిర్ణయసభలో) వెంటనే స్వదేశ సంస్థానాధీశులను, జమీందార్లను రద్దుపరచవలెనని నే నొక తీర్మానము నుపపాదించితిని. దానిని కాంగ్రెసులోని సోషలిస్టులు బలపర్చిరి. గాని దానిని సర్దారు వల్లభాయి పటేలుగారు ప్రతిఘటించి ఓడింపచేసిరి. అప్పటికి కమలాదేవి చటోపాధ్యాయ, ఆచార్య నరేంద్రదేవ్, మెహరాలీ మొదలగువారు కాంగ్రెసులోని సోషలిస్టుబృందమునకు నాయకులుగనుండిరి. పిమ్మట జయప్రకాశనారాయణగారు సోషలిష్టుబృందమునకు నాయకులుగ ఎన్నుకొనబడిరి. వారందరు నాకు మిత్రులుగ నుండిరి. బెజవాడకు వారిలో నెవరువచ్చినను నా కతిథులుగ నుండిరి. నా భావములు వారితో చాల విషయములలో నేకీభవించుచున్నవని వారు కనుగొని నన్ను వారి సోషలిష్టు బృందములో చేరవలసినదని కోరుచుండేవారు. ప్రత్యేక కాంగ్రెసు సోషలిష్టుపార్టీయొక్క అవసరము లేదనియు, కాంగ్రెసులోనేయుండి కాంగ్రెసు పేరనే అభివృద్ధికరమైన, విప్లవకరమైన తీర్మానములు ప్రవేశపెట్టి జయము

పొంద యత్నించవలెనేగాని, ప్రత్యేక పార్టీలో నేను చేరననియు చెప్పితిని. వీరిలో నెవరికిని భారతదేశ స్వాతంత్ర్యపోరాటమును నడుపుటకు శక్తి చాలదు. అందుకు గాంధీగారే కావలెను. జయప్రకాశనారాయణగారి నాయకత్వము తగినంత దృఢమైనది కాదని అప్పటికి ఇప్పటికి నా యభిప్రాయము. నాకు 1922 నుంచియు ( Socialism) సాంఘికతత్వము, (Abolition of feudalism ) ప్రభువులను, జమీందార్లను రద్దుపరచుట, (Nationalisation) రాకపోకల సాధనములు, పెద్దపరిశ్రమల జాతీయకరణము అను ఆశయములపట్ల సంపూర్ణమైన సానుభూతియుండెను. కారలు మార్క్సు, కోల్, బెట్రాండు రసెల్ మొదలైనవారి గ్రంథములు చదువుటయేగాక, సన్యాటుసేను చైనాలోజరిపిన విప్లవమునుగూర్చి ప్రత్యేకముగ చదివి,చైనా జాతీయోద్యమ మను గ్రంథమును వ్రాయుటవలన ( Socialism )సాంఘిక తత్వము కావలెనని గట్టిగా ఆశయము కలిగెను. సన్యట్‌సేను కమ్యూనిజము పనికిరాదని చెప్పెను.( Socialism )సాంఘికతత్వమును పూర్తిగ అవలంబించెను. దేశ స్వాతంత్ర్యము, జాతీయత, సాంఘికన్యాయము అను మూడు ఆయనయొక్క సిద్ధాంతములు. నేను సన్యటుసేనుతో నేకీభవించిన వాడను. మహాత్మా గాంధీయొక్క నిర్మాణకార్యక్రమములోను, బోధల లోను నాకు సాంఘికతత్వమే గోచరించెను. పాశ్చాత్యదేశములలో (Socialism) సాంఘికతత్వముకూడ కారలు మార్క్సుయొక్క భౌతికసిద్ధాంతము (Materialistic interpretation of History) మీదను వర్గపోరాటము మీదను నిర్మింపబడినది. కారలు మార్క్సుయొక్క రెండవ ఇంటరునేషనల్ సాంఘికతత్వము, మూడవ ఇంటరునేషనల్ కమ్యూనిజము అయి వున్నవి. ఇంగ్లాండులోని లేబరుపార్టీ (కార్మిక కక్షి) రెండవ ఇంటర్ నేషనల్ నంగీకరించి సాంఘికతత్వము నవలంబించినదే. హిందూదేశములో వర్గసామరస్యము, సోదరప్రేమతత్వములమీదను, అధ్యాత్మిక పునాదుల మీదను సాంఘికతత్వము ఏర్పడవలెననియే మొదటినుండియు నాఆశయము. ఇది గాంధీ సోషలిజము. యూరపులో ఫ్రెంచివిప్లవము ప్రభువపరంపరను, జమీందారీపద్ధతిని రద్దుపరచెను. దానిని జైలులోవ్రాసి 1923 లో ప్రచురించితిని. నేను 1934 డిశంబరునెలలో విశాఖపట్టణములోజరిగిన ఆంధ్రరాష్ట్రీ

రాజకీయమహాసభ కధ్యక్షతవహించినపుడు, ఆ సభలో పూర్ణస్వరాజ్యము యొక్క రాజ్యాంగము సోషలిస్టుసిద్ధాంతములపైననే ఏర్పడవలెనని క్రొవ్విడి లింగరాజుగారు విషయనిర్ణయసభలో తీర్మానమును ప్రతిపాదించిరి. అల్లూరి సత్యనారాయణరాజుగారు బలపరచిరి. బసవరాజు శ్రీరంగశాయి, డాక్టరు యం. వి. కృష్ణారావు, మల్లెమడుగుల జగన్నాధరావు, పుచ్చలపల్లి సుందరయ్య, వంటా సూరిశాస్త్రి, జొన్నలగడ్డ రామలింగయ్య, కంభంపాటి సత్యనారాయణ వగైరా సోషలిస్టులు ఆ తీర్మానమును సమర్థించిరి. తెన్నేటి విశ్వనాధం, మల్లిపూడి పళ్ళంరాజు, మొసలికంటి తిరుమలరావు ప్రభృతులు కూడ వారితోనే యుండిరి. తెన్నేటి విశ్వనాధంగారు ఆ మహాసభ కాహ్వాన సంఘాధ్యక్షులు. ప్రకాశంపంతులుగారు వగైరాపెద్దలంతా దానిని కాంగ్రెసుకు వ్యతిరేకమని ప్రతిఘటించిరి. కాంగ్రెసుకు వ్యతిరేకముగనుక తీర్మానము చెల్లదని వాదించిరి. కాంగ్రెసుకు వ్యతిరేకముకాదని, చెల్లుతుందని నేను అధ్యక్షుడుగ రూలింగు నిచ్చినాను. తీవ్రమైన వాదోపవాదాలు జరిగినపిమ్మట వోటుకుపెట్టగా ఉభయవర్గములవారికి సమానముగ వోట్లువచ్చినవి. నేను తీర్మానమున కనుకూలముగనే వోటిచ్చినాను. నా కాస్టింగువోటుతో తీర్మానము నెగ్గి మహాసభలో చర్చింపబడి అక్కడ యెక్కువసంఖ్యతోనే ఆమోదింపబడినది. 1929 డిశంబరులో జరిగిన లాహోరు కాంగ్రెసు మహాసభకు అధ్యక్షతవహించిన పండిత జవహర్‌లాల్‌నెహ్రూగారు తన అధ్యక్షోపన్యాసములోతాను(Socialist)సాంఘికవాదినని(Republican) సంపూర్ణప్రజాస్వామ్యవాదినని అదివరకే చెప్పియున్నారు. 1934 మే నెలలో అఖిలభారత కాంగ్రెసు సోషలిస్టుపార్టీ స్థాపితమైనది. విశాఖపట్టణము సభలో నా అధ్యక్షోపన్యాసములో చైనా కమ్యూనిష్టునాయకుడగు డాక్టర్‌సన్యట్‌సేను నెలకొల్పినవిధముల కాంగ్రెసుక్రింద రైతుశాఖను,కార్మికశాఖను, విద్యార్థి శాఖను,యువజన శాఖను స్థాపించి ఆయావర్గములలో కాంగ్రెసు కనుకూలముగ ప్రబోధముగావించవలెనని వ్రాసితిని."కాశేశ్వరరావువ్రాసినది బాగానే వున్నది. అతనే వాటి నన్నింటిని చూచుకుంటాడులే" అని ప్రకాశంపంతులు గారు చెప్పినారు. ఆయన నిష్కల్మష హృదయుడు. 1926 వ సంవత్సర ప్రారంభమున జరిగిన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీ ఎన్నికలలో ప్రకాశం

పంతులుగారిని అధ్యక్షులుగను, బులుసు సాంబమూర్తిగారిని ప్రధాన కార్య దర్శిగను ఎన్నుకుంటిమి. నన్ను రాష్ట్ర వర్కింగుకమిటీ సభ్యునిగ నెన్ను కొనిరి. పైన చెప్పబడిన నా అభిప్రాయము అమలుజరుగలేదు. ఇతర విషయములతోను కొన్ని తగాదాలతోను సరిపోయినది. ముఖ్యముగా 1934 సంవత్సరము ఆఖరు భాగమున కేంద్రశాసనసభ ఎన్నికలలో మా కాంగ్రెసు కమిటీవారము ఆచార్య గోగినేని రంగనాయకులుగారిని, సామి వెంకటాచలంచెట్టిగారిని అభ్యర్థులుగ నిలబెట్టగా, వారిద్దరికి వ్యతిరేకము గను జస్టిసుపార్టీ నాయకులైన బొబ్బిలి రాజాగారు నిలబెట్టిన అభ్యర్థులకు అనుకూలముగను, అప్పటికి తన మ్యునిసిపలు తగాదాలకొరకు మద్రాసు ముఖ్యమంత్రి బొబ్బిలి రాజాగారితో చేరిన నడింపల్లి లక్ష్మీనరసింహారావు గారు ప్రచారముచేసిరని, అందువలన లక్ష్మీనరసింహారావుగారిమీద క్రమ శిక్షణ చర్య జరుపవలెనని మా వర్కింగుకమిటీలో కొండా వెంకటప్పయ్య పంతులుగారు ప్రతిపాదించిన మీదట, ఏల క్రమశిక్షణ తీసుకొనకూడదో సంజాయిషీ ఇవ్వవలెనని లక్ష్మీనరసింహారావుగారికి నోటీసు నిచ్చితిమి. నాతో జాయింటు సెక్రటరీగానున్న కళా వెంకటరావుగారు జాగ్రత్తగా విచారించి లక్ష్మీనరసింహారావుగారు కాంగ్రెసుకు వ్యతిరేకముగ జస్టిసుపార్టీ అభ్యర్థులకు తోడ్పడి ప్రచారముచేసినట్లు తగిన సాక్ష్యము కలదని మా కమిటీకి నివేదికను సమర్పించిరి. ఇట్టి స్థితిలో టంగుటూరు ప్రకాశంగారు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీకి అధ్యక్షుడుగ నెన్నుకొనబడగా నరసింహా రావుగారియెడలగల ప్రత్యేక వాత్సల్యంవల్ల ఈ క్రమశిక్షణచర్యను ముందుకు సాగనివ్వక ప్రకాశం, సాంబమూర్తిగార్లు ఆపివైచిరి. లక్ష్మీనరసింహారావుగారి అనుచరులు గుంటూరు బహిరంగసభలో వెంకటప్పయ్యపంతులుగారిని మాట్లాడకుండ అల్లరిచేసిరి. ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుకమిటీ నాయకులలో వెంక టప్పయ్యపంతులుగారితో నేను,నాగేశ్వరరావుపంతులుగారు నేకీభవించినందున మా ముగ్గురికిని ప్రకాశం, సాంబమూర్తిగార్లకున్ను భేదాభిప్రాయములు కలి గినవి. కల్లూరు చంద్రమౌళిగారు మొదట వెంకటప్పయ్యగారితోనుండి పిమ్మట ప్రకాశంగారివైపుకు మొగ్గెను. సర్దారు వల్లభాయిపటేలు, బాబు రాజేంద్రప్రసాదుగారు మొదలైన కాంగ్రెసు హైకమాండు మా పక్షముననే

సానుభూతి చూపెను. 1936 వ సంవత్సరములో అధ్యక్ష ఎన్నిక వచ్చినప్పుడు ప్రకాశంగారికి ఆచార్య యన్. జి. రంగాగారు పోటీగా నిలచిరి. మేము కొందరము ముఖ్యముగా పశ్చిమకృష్ణాజిల్లావారము రంగాగారికి ఓటునిచ్చితిమి. ప్రకాశంగారే గెలిచిరి. ఆవెంటనే ఉపాధ్యక్షుని ఎన్నిక వచ్చెను. నే నభ్యర్థిగ నిలచితిని. ప్రకాశంగారు నాకు వ్యతిరేకముగ కోటిరెడ్డిగారిని నిలబెట్టిరి. నేనే గెలిచితిని. 1937 లో ఈ తగాదా లుండగనే మద్రాసు రాష్ట్ర శాసనసభల కెన్నికలు జరుగుట, కాంగ్రెసు మంత్రివర్గమును స్వీకరించుట జరిగెను. ప్రకాశంగారు నాయకుడగుటకు ప్రయత్నించినను బలము చాలక, రాజగోపాలాచారిగారు మద్రాసుశాసనసభ కాంగ్రెసుపార్టీకి నాయకుడుగ ఎన్నుకొనబడెను. వా రిద్దరును రాజీపడి ప్రకాశంగారే రాజగోపాలాచారిగారిని నాయకునిగ ప్రతిపాదించి ఏకగ్రీవముగ నెన్నుకొనచేసిరి. రాజగోపాలాచారిగారు ప్రధానమంత్రిగను, ప్రకాశంగారు రెవిన్యూమంత్రిగను పనిచేసిరి. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీలో యువజనవర్గములో సాంఘిక తత్వపు అభిప్రాయములుగలవారే చాలమంది యుండిరి. 1935 వ సంవత్సరములో ఆంధ్రలో కాంగ్రెసు సోషలిస్టుపార్టీ స్థాపింపబడినది. బసవరాజు శ్రీరంగశాయి, పుచ్చలపల్లి సుందరయ్య, క్రొవ్విడి లింగరాజుగార్లు కార్యదర్శులుగ పార్టీప్రారంభమై సోషలిస్టుభావప్రచారము తీవ్రముగ సాగినది. గాని 1935 వ సంవత్సర ఆక్టుప్రకారం 1937 లో జరిగిన మద్రాసుశాసనసభాఎన్నికలలో అన్నివర్గములు ఏకమై ఎన్నికలలో పాల్గొని జమీందారుల పార్టీలను, జస్టిస్‌పార్టీని ఓడించి కాంగ్రెసుకు అఖండమయిన విజయమును సమకూర్చిరి. 1937వ సంవత్సరములో ప్రకాశంగారు రెవిన్యూమంత్రియగుటచేత ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీకి వారిస్థానే పట్టాభి సీతారామయ్యగా రధ్యక్షులై రి. సాంబమూర్తిగారు స్పీకరగుటచేత వారిస్థానే గొట్టిపాటి బ్రహ్మయ్యగారు ప్రధానకార్యదర్శియైరి. 1937 - 38 సంవత్సరములలో కాంగ్రెసులో, ముఖ్యముగా మా పశ్చిమకృష్ణాజిల్లా సోషలిస్టు - కాంగ్రెసు స్పర్థలకు ఆహుతిఅయినది. ఒకవర్గమువారు 29 వేలమంది ప్రాథమిక సభ్యులను చేర్చగా మరొకవర్గమువారు 35 వేలమందిని చేర్చిరి. ముప్పది అయిదువేలమందిని చేర్చిన అన్నే అంజయ్య, పేట బాపయ్య,

రేపాల బుచ్చిరామశేషయ్య, పిడికిటి రామకోటయ్య, కాకాని వెంకటరత్నం గార్లు తమ పేర్లనన్నిటిని సొమ్ముతోసహా కాంగ్రెసు మహాసభ అధ్యక్షులైన సుభాషుచంద్రబోసుగారికి సమర్పించి సొమ్మును వారిపేర బ్యాంకిలో జమకట్టిరి. రెండవపక్షమువారు తమ డబ్బును సభ్యుల జాబితాలను ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులైన డాక్టరు పట్టాభి సీతారామయ్య, ప్రధాన కార్యదర్శి గొట్టిపాటి బ్రహ్మయ్యగార్ల ఆఫీసులో దాఖలుచేసిరి. త్రిపురి కాంగ్రెసులో సుభాషుచంద్రబోసుగారు అధ్యక్షపదవిని గోల్పోయిరి. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీకి పంపబడిన నిరాకరించిన ముప్పది అయిదు వేలమంది సభ్యుల పేర్ల విషయమై అఖిలభారత కాంగ్రెసు వర్కింగు కమిటీ ఎదుటకు విచారణకు వచ్చినప్పుడు అపుడ సభ్యులుగానున్న డాక్టరు పట్టాభి సీతారామయ్యగారి సలహామైన వారు ఆ ముప్పదిఅయిదువేల సభ్యుల ప్రాథమికసభ్యత్వమును కొట్టివేసిరి. నేనపుడు కాంగ్రెసు గవర్నమెంటులో చీఫ్ పార్లమెంటరీ సెక్రటరీగా నుండుటచే అప్పటి నిబంధనల ప్రకారము ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు వర్కింగుకమిటీలో నుండుటకు వీలులేకపోయినది. అటుల కొట్టివేయుట సరియైన పనికాదని నేను తలచినను నేనేమియును చేయజాలకపోతిని. అయిదారుగురు నాయకులే వీరికి చెల్లించక సుభాసు చంద్రబోసుగారిపేర జమకట్టినందున వారిమీదనే క్రమశిక్షణచర్య తీసుకొనవలెనేగాని పావలా చందా చెల్లించిన ముప్పదిఅయిదువేలమందియొక్క సభ్యత్వమును రద్దుపరచుట న్యాయవిరుద్ధమైన నిరంకుశచర్యయని నా అభిప్రాయము. పశ్చిమకృష్ణాజిల్లాయందంతట నిస్పృహ వ్యాపించి కాంగ్రెసుకు గట్టి వ్యతిరేకత ఏర్పడినది. కమ్యూనిస్టు నాయకులు వెంటనే రంగములో ప్రవేశించి ఆ అవకాశము నుపయోగించుకొనిరి. పశ్చిమకృష్ణా జిల్లాలో అసంతృప్తిచెందియున్న యువకులను చాలామందిని తమ కమ్యూనిస్టుపార్టీలో చేర్చుకొనిరి. అదివరకు కాంగ్రెసు సోషలిస్టువర్గము వారుగనున్నవారిలో పుచ్చలపల్లి సుందరయ్య, కంభంపాటి సత్యనారాయణ చండ్ర రాజేశ్వరరావు, కాట్రగడ్డ రాజగోపాలరావు, కడియాల గోపాలరావు, పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగార్లు మొదలగు కొందరికి కమ్యూనిస్టు భావము లుండెను. వారంతా బయటపడి ప్రచారముచేసి సోషలిస్టుబృందంలోని

అత్యధిక సంఖ్యాకులను కమ్యూనిష్టులుగ మార్చిరి. కొద్దిమంది కాంగ్రెసు సోషలిష్టులు అన్నే అంజయ్య, రేపాల బుచ్చిరామశేషయ్య, పేట బాపయ్య, కాకాని వెంకటరత్నం, పిడికిటి రామకోటయ్య, కాట్రగడ్డ మధుసూదనరావు మొదలగువారు కాంగ్రెసులో నిలచియుండిరి. అంతేగాక పశ్చిమ కృష్ణాజిల్లాలో జమీందారీ, మొఖాసా గ్రామము లెక్కువగ నున్నందునను కొన్ని ఎస్టేట్లలో రయితులకును, భూఖామందులకును మధ్య తగవులు తీవ్రముగా జరుగుచున్నందునను, వాటిలో కమ్యూనిష్టులు జోక్యము కలుగజేసుకొని రైతులలో తమపార్టీని బలపప్చుకొనిరి. ముఖ్యముగ మునగాల రాజాగారికిని రైతులకును తగాదాలు బాగుగా హెచ్చి రైతులలో అత్యధికసంఖ్యాకులు కమ్యూనిస్టులతోచేరగా మునగాలపరగణా కమ్యూనిస్టులకు ప్రధానకేంద్రమైనది. బెజవాడ కేంద్రస్థానముగా నొక బలమైన కమ్యూనిస్టుపార్టీ స్థాపితమైనది. అపుడే జోగ్లేకరు అను కమ్యూనిస్టునాయకుడు యీ జిల్లాలో సంచారముచేసి చాలమందిని కమ్యూనిస్టులుగ చేర్చెను. అఖిలభారతదేశపు కమ్యూనిస్టుపార్టీకి బొంబాయినగరము ప్రధాన కార్యస్థానమైనను ఆంధ్రరాష్ట్రమే, అందులో బెజవాడకేంద్రమే యావద్భారతదేశములో కమ్యూనిస్టుపార్టీకి ప్రధానబలముగలభాగ మయ్యెను. ఆ సంగతి వారే చెప్పుకున్నారు. 1933 లో నేను చీఫ్ పార్లమెంటరీ కార్యదర్శిగనున్నకాలములో అఖిలభారత కాంగ్రెసు సోషలిస్టుపార్టీ నాయకుడగు జయప్రకాశనారాయణగారు మద్రాసువచ్చి నా కతిథులుగ నుండిరి. వారికి ఆంధ్రదేశములోగల శిష్యులందరు దాదాపుగా ఒక్కుమ్మడిగా ఒకరాత్రికిరాత్రే కమ్యూనిస్టులైనారని,వారికి శిష్యులెవ్వరూ మిగలలేదని వారితో నవ్వుతూ చెప్పినాను. అప్పుడు వారికి కొంత ద్రవ్యసహాయము కావలెననిరి. నేను యస్. శ్రీనివాసఅయ్యంగారితో సిఫారసుచేయగ అయిదువందలరూప్యముల విరాళమును వారు జయప్రకాశనారాయణగారిపార్టీ కిచ్చిరి. శ్రీ శ్రీనివాసయ్యంగారు వ్యక్తిగతముగ నాకు చాల గౌరవపాత్రులు. మిగుల ఉదార స్వభావముకలవారు. అతి గొప్ప లాయరు. నాతో చాల స్నేహముగ నుండేవారు. మహాత్మా గాంధీగారు తనను కాంగ్రెసునాయకునిచేయక పండిత మోతీలాల్ నెహ్రూగారిని, రాజగోపాలాచార్యులుగారిని నాయకులుగ

చేయుచున్నారని, వారిద్దరికి తగినంత అనూయగలదని అసంతృప్తిని నాతో వెల్లడించేవారు. మీరు లాయరుపనిని వదలి జైలుకుపోనంత కాంగ్రెసు నాయకత్వము రాదని, మీ లాయరుమేధ స్వతంత్రపోరాటములో నెందుకు పనికిరాదని నేను చెప్పుచుండేవాడను. శాసనసభలలో నిలచి కొంత పని చెయ్యండి; అంతేగాని కాంగ్రెసువారు చెప్పరను మీనమేషలను కాంగ్రెసు సంస్థకు నాయకునిగ అంగీకరించరని చెప్పినాను. ఆయన లాయరుపనిని విడచిపెట్టలేదు. జైలుకు పోలేదు. గాని గౌహతికాంగ్రెసు కధ్యక్షుడైనాడు. పూర్ణస్వరాజ్యసంఘములో పనిచేసినాడు. ఢిల్లీ శాసనసభలో కాంగ్రెసు పక్షమున పనిచేసినాడు. 1930 ఉప్పుసత్యాగ్రహాముసుండి వెనుకబడినాడు. అరువదవయేటనే మరణించినాడు. ఆంధ్రదేశములోని ఇతరజిల్లాలలోకూడ కాంగ్రెసు సోషలిస్టులలో కొందరు కమ్యూనిస్టులైనారు. మిగిలినవారు మామూలు కాంగ్రెసువారలైనారు. అంతటితో ఆంధ్రదేశములో కమ్యూనిష్టుపార్టీ బలపడినది. సోషలిస్టుపార్టీ తగ్గిపోయినది. బెజవాడనుండియే కమ్యూనిస్టుపార్టీ పక్కనున్న తెలంగాణమునకు వ్యాపించినది. అదివరకు ఆంధ్రమహాసభకు నాయకులుగనున్న రావి నారాయణరెడ్డి, బద్దం యెల్లా రెడ్డిగార్లు మొదలగువారు కమ్యూనిస్టులుగా మారి ఆంధ్రమహాసభను కమ్యూనిస్టుసభగ చేసిరి.

(౨)

1927 వ సంవత్సరపు మద్రాసుకాంగ్రెసులో ఆమోదింపబడిన మరియొక ముఖ్యతీర్మానము ఇంగ్లాండునుంచి భారతదేశమున కెట్టి రాజకీయ హక్కులనివ్వవలెనను విషయములో విచారణచేయుటకు బ్రిటిషుపార్లమెంటుచే నియమింపబడిన అచ్చతెల్లసభ్యులుగల సైమనుకమిషను ఇండియాకు వచ్చినపుడు దానిని యావద్భారతదేశము పూర్తిగ బహిష్కరించవలెనను తీర్మానమై యున్నది. ఇట్టి బహిష్కారమునకు మితవాదులు, డాక్టరు అనిబిసెంటమ్మగారుకూడ తోడ్పడిరి. 1928 సంవత్సరము ఫిబ్రవరి 3 తేదీన సైమనుకమీషను బొంబాయిలో దిగినది. ఆరోజున యావద్భారతదేశములో హరతాళములు, బహిరంగసభలు జరిపి "(Simon go back)" "సైమనుగారు వెనుకకు పొండి" అను తీర్మానములనుగావించిరి. ఆనెల 16వ తేదీన సైమన్‌కమీషనుతో నెట్టిసహకారమును చేయజాలమని

ఢిల్లీ శాసనసభలో లాలా లజపతిరాయిగారు ప్రతిపాదించిన తీర్మానము అధికసంఖ్యాకులచే ఆమోదింపబడినది. ఆ కమీషనువారు ఫిబ్రవరి, మార్చి నెలలలో ఇండియాలోని కొన్ని ముఖ్యపట్టణములను దర్శించి వెళ్ళిపోయిరి. మరల 1928వ సంవత్సరము నవంబరునెలనుండి కొన్నినెలలు ఇండియాలో సంచారముచేసిరి. ఆ నెలలో వారు ఓడలో మద్రాసునగరము చేరినపుడు అచట గొప్ప హరతాళమును, వ్యతిరేక ప్రదర్శనములను జరిపితిమి. కొందరు ఆంధ్రకాంగ్రెసునాయకులను ఆ ఉదయము పోలీసువారు అరెస్టుచేసి కమిషనువారు మోటారుకార్లలో గిండికి పోగనే విడిచిపెట్టిరి. మా కాంగ్రెసు శాసనసభ్యులమందరము మద్రాసులో హాజరై అనేకవేల మందిజనముగల నల్లజండాల యూరేగింపుతో నేపియరుపార్కు-కు చేరుకుంటిమి. పచ్చయప్ప కళాశాల సమీపమున తెల్లసైనికులు నిలబడి నల్లజండాల ప్రదర్శనముచేయుటకు వచ్చిన యొక ప్రజలతండాపై తుపాకులు కాల్చగా యొకడు నేలమీదపడి మరణించెను. ఇద్దరికి బలమైన గాయములు తగిలెను. సైనికులు ప్రజలను ముందుకుపోనివ్వలేదు. ఇంతలో మరియొక తండాను తీసుకొనివచ్చిన టంగుటూరు ప్రకాశంపంతులుగారు ముందుకు తోసుకొనివచ్చి నిలబడి తన ఛాతీనిచూపి "మేము ముందుకు వెళ్ళి తీరుతాము. చనిపోయినవారి శవములను మేము చూచితీరవలెను. చేతనైతే నన్ను తుపాకులతో కాల్చండి" అని ధైర్యముగా ముందుకువచ్చి నిలబడగానే సైనికులు, సైనికాధికారులు దిగ్భ్రమచెంది, ధైర్యముకోల్పోయి ప్రకాశంగారిని కాల్చజాలక ముందుకు పోనిచ్చిరి. ఆయనతోకూడ జనసమూహములు నల్లజండాలతో "సైమన్ వెనుకకుపొమ్ము" అని నినాదములుచేయుచు, మృతులైనవారినిచూచి ముందుకు సాగిపోయిరి. ఆ రాత్రి మే మందరము రైలుమీద గుంటూరుకువెళ్ళితిమి. ఆ మరునాడు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సభ్యులమందరము గుంటూరులో సమకూడవలెనని కొండా వెంకటప్పయ్యగారు తెలియపరచిరి. "సైమన్ కమీషను"వారు మద్రాసు నుంచి స్పెషల్ రైలులో బెజవాడమీదుగా గుంటూరుకు చేరుకొనగా ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసుసభ్యులము, ఇంక ననేకవేలమంది జనులు కమీషను వారు రైలుస్టేషనునుంచి తమ బంగాళాకు చేరుకొనే త్రోవలో ఇరుప్రక్క-

లను నల్లజండాలతో బారులుతీర్చి నిలుచొని సైమన్ కమీషనువారియొక్క, ఇతర ఆఫీసరులయొక్క ఏదెనిమిది మోటారుకారులు వెళ్లుచుండగా సైమన్ వెనుకకు పో అని నినాదములు చేసితిమి. మమ్ములను పోలీసువారు ఏమియుచేయలేదు. మా మధ్యగుండానే కమీషనువారు విడిదికి వెళ్ళి పోయిరి. ఆ ఉదయమున షుమారు పదిగంటలకు ఆ ప్రదర్శనము ముగిసినది. ఆ సాయంత్రము స్వరాజ్యమైదానములో గొప్ప బహిరంగసభను కాంగ్రెసు మునిసిపలు ఛైర్మను అయిన నడింపల్లి లక్ష్మీనరసింహారావు గారు ఏర్పాటుచేసిరి. అప్పటికి ఆయనయొక్క నాయకత్వము ప్రతిష్ఠ గుంటూరులో చాల ఉచ్ఛదశయందున్నది. అనేక వేలమంది జనులు అచటికి హాజరైరి. కొండా వెంకటప్పయ్య పంతులుగారు అధ్యక్షత వహించిరి. ఆంధ్ర నాయకులలో చాలమంది ఆ సభలో నుపన్యాసములిచ్చిరి. నేను ఉపన్యాసమునిచ్చుటకులేవగా నడింపల్లి లక్ష్మీనరసింహారావుగారునన్ను చూసి "బెజవాడనుంచి మూడువేలమంది శాంతిసైనికులతో ఆంధ్ర పాపయ్య గారు మాకోటబురుజులను సంరక్షించుటకు వచ్చినా"రనిచెప్పగా గొప్ప హర్షధ్వానములు జరిగెను. సభ మిగుల జయప్రదమై ముగిసినది. మరునాడు ఉదయమునకు బెజవాడ వచ్చితిని. సైమన్ కమీషనువారు ఆ మరునాడు తమ కారులో బెజవాడవద్దనున్న ఆనకట్ట చూచుటకు రాగా అచట ఎటులనో ఆ కబురు తెలిసిన బెజవాడ యువజనులు షుమారు ఏడువందలమంది నల్లజండాలతో అక్కడ హాజరై తమ ప్రదర్శనను జరిపిరి. పోలీసువారు వారిని వెడలగొట్టిరి. సైమన్‌కమీషనువారు ఉత్తర హిందూస్థానమునకు వెళ్ళిరి. లాహోరులో గొప్ప నల్లజండాల ప్రదర్శనము జరిగెను. ప్రజలను ముందుకురాకుండ ఆ పోలీసువారు సైనికులు అడ్డముగ నిలచిరి. కొద్దిమంది ముందుకు తోసుకొని వచ్చినవారిని కర్రలతో లాఠీలతో మోదిరి. ఈవిధముగ ముందుకు వచ్చుచుండగా లాలా లజపతిరాయిగారికి సైనికులచే లాఠీదెబ్బలు బాగుగా తగిలినవి. అవి ఛాతీలోని బొమికెలను విరుగగొట్టెను. అందువలననే వారు పిమ్మట కొద్దిరోజులకు స్వర్గస్థులైరి. పిమ్మట సైమను కమీషనువారు ఏప్రిలు నెలలో బొంబాయినుంచి మరల ఇంగ్లాండుకుపోయిరి. హిందూదేశములో తమను కాంగ్రెసువారు మొదలైన జాతీయవాదులు

బహిష్కరించినసంగతి తమ రిపోర్టులో వ్రాసి రౌండుటేబిలు కాన్ఫరెన్సు జరుపవలసినదని బ్రిటిషుప్రభుత్వమునకు సలహానిచ్చిరి.

1928 వ సంవత్సరములో క్షయవ్యాధిచేత ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు సలుబదవయేటనే చీరాలలోని రామనగరులో తమ కుటీరమునందు అకాలమరణమువాతపడి, దేశమునంతను దుఃఖములో ముంచిరి. ఆయన మహాధీరుడు. ఆయన దేశముకొరకు సర్వసంగ పరిత్యాగముచేసి ఎట్టిఆస్తియు లేకుండ స్వర్గస్థుడయ్యెను. ఆయనకు భార్య, ఒక కుమారుడు గలరు.

1928 వ సంవత్సరము ఫిబ్రవరి, మార్చినెలలలో అఖిభారత సర్వపక్ష సమావేశము ఒకటి జరిగి, కాంగ్రెసు కాంగ్రెసేతర సంఘముల ప్రతినిధులు సమావేశమై బాధ్యతాయుత ప్రభుత్వమును పూర్తిగ స్థాపించుట కొరక రాజ్యాంగవిధానమును తయారుచేయవలెననియు. మైనారిటీ మత సంఘముల వారికి తగిన ప్రత్యేక ప్రాతినిధ్యము ఇచ్చుటనుగూర్చి కూడ అందులో నిర్ణయించవలెననియు తీర్మానములుచేసిరి. మే నెల 19 వ తేదీన డాక్టర్ అన్సారీగారియొక్క అధ్యక్షతక్రింద జరిగిన మూడవసమావేశములో ఆ రాజ్యాంగవిధానమును తయారుచేయుటకు పండిత మోతీలాలు నెహ్రూ యొక్క అధ్యక్షతను ఒకకమిటీని నియమించి.వారుతయారుచేసిన రాజ్యాంగ విధానముయొక్క చిత్తుప్రతిని దేశములోనున్న 29 రాజకీయసంఘములకు పంపవలెనని ఆదేశించిరి. ఆ రాజ్యాంగవిధానము తయారై దానినిగురించి లక్నోలోజరిగిన అఖిలపక్షమహాసభలో 1928 వ సంవత్సరము ఆగష్టునెల 28,29,30 తేదులలో దీర్ఘమైన చర్చలుజరిగెను. ఆ రాజ్యాంగవిధానములో డొమినియను ప్రతిపత్తి వెంటనే కావలెనని నిర్ణయింపబడెను.కాని సంపూర్ణ స్వతంత్రము కావలెనని కోరువారి కార్యక్రమమునకు ఎట్టిఅభ్యంతరము కలి గించకూడదనియు తీర్మానింపబడెను. అందులో మహమ్మదాబాదురాజా, రాజా రంపాల్ సింగు, డాక్టరు సర్ ఆలీఇమామ్, శంకరన్ నాయర్, సర్ సి. పి. రామస్వామి అయ్యరు, సచ్చిదానందసిన్హా మొదలైన మితవాద నాయకులుకూడ పాల్గొనిరి. ఆ సంవత్సరము డిసెంబరునెలలో కాంగ్రెసు మహాసభ కలకత్తాలో పండిత మోతీలాల్ నెహ్రూగారి అధ్యక్షతను జరిగినది.

మోతీలాల్ నెహ్రూగారి అఖిలపక్ష తీర్మానముల ప్రకారము ఆయన తయారు చేసిన రాజ్యాంగవిధానము ననుసరించి డొమినియను ప్రతిపత్తిని కోరవలెనా లేక, సంపూర్ణస్వాతంత్ర్యమునే వెంటనే కోరవలెనా అనువిషయమై ఆ కాంగ్రెసుమహాసభలో తీవ్రమైన వాదోపవాదములు జరిగినవి. మద్రాసు కాంగ్రెసులో తీర్మానింపబడిన సంపూర్ణస్వాతంత్ర్యమే భారతదేశముయొక్క గమ్యస్థానమని తెలుపుచు, మోతీలాలు నెహ్రూగారి అధ్యక్షతక్రింద అఖిలపక్ష సమావేశముచే అంగీకరించబడిన రాజ్యాంగవిధానాన్ని ఎట్టిమార్పులు లేకుండ బ్రిటిషుపార్లమెంటువారు 1929 వ సంవత్సరము 31 వ డిశంబరు తేదీన కాని అంతకు ముందుకాని అంగీకరించినయెడల దానినే కాంగ్రెసు అంగీకరించుననియు, అటుల బ్రిటిషుపార్లమెంటువారు ఆ తేదీలోగా దానిని అంగీకరించనిచో సంపూర్ణస్వాతంత్ర్యసంపాదనకొరకు దేశములో అహింసాయుత సహాయనిరాకరణము, పన్నులనిరాకరణము మొదలగు చర్యలను సాగించెదమనియు మహాత్మా గాంధీగారే స్వయముగ తీర్మానము నుపపాదించిరి ఒకసంవత్సరములో సంపూర్ణమైన డొమినియను ప్రతిపత్తిని ఇచ్చితీరవలెనని బ్రిటిషుప్రభుత్వమునకు గడువునిచ్చుట న్యాయమనియు, వారు అటుల డొమినియను ప్రతిపత్తిని ఇచ్చినచో మన స్వతంత్రసమస్య ఎట్టి పోరాటము లేకుండ బహు తేలికగ పరిష్కారమగుననియు, అటుల నివ్వనిచో పూర్ణస్వరాజ్యమునకు మనము తీవ్రముగ పోరాటము సాగింపవచ్చుననియు, ఇటుల చేయుటవల్ల దేశములోని మితవాదులు మొదలైన అన్నివర్గములవారి సానుభూతి మనకుండుననియు గాంధీగారి యుద్దేశ్యము. డొమినియను ప్రతిపత్తి మనకు కలిగినచో వెస్టుమినిస్టరు చట్టప్రకారము ఎప్పుడుపడితే అపుడు సంపూర్ణ స్వతంత్రమును స్థాపించు రాజ్యాంగము నేర్పరచుకొనుటకు మనకు హక్కుకలదు. 1947 వ సంవత్సరములో అటులనే జరిగినది. ఆ సంవత్సరము ఆగస్టునెల 15 వ తేదీన మనకు డొమినియను ప్రతిపత్తిని బ్రిటిషుప్రభుత్వమువారు ఇచ్చినారు, చక్రవర్తి రాజగోపాలాచారిగారిని గవర్నరుజనరలుగ నియమించినారు. కాని మనము 1950 వ సంవత్సరము జనవరి 26 వ తేదీన చేసుకొనిన నూతన రాజ్యాంగములో సంపూర్ణస్వతంత్రమును స్థాపించుకొని ఇంగ్లాండుతో

సంబంధమును వదలుకొనినాము. 1928 కలకత్తా కాంగ్రెసులో గాంధీగారి నాయకత్వము నిలుచుటా, లేదా యను పట్టుదల యుదయించెను. బులుసు సాంబమూర్తి, సుభాసుచంద్రబోసు, శ్రీనివాసఅయ్యంగార్, డాక్టర్ పట్టాభి సీతారామయ్య మొదలైనవారంతా గాంధీగారితీర్మానమును వ్యతిరేకించి వెంటనే సంపూర్ణస్వతంత్రము కావలెనను తీర్మానమును బలపరిచిరి. పండిత మోతీలాలునెహ్రూ, వల్లభాయిపటేలు, రాజగోపాలాచారి, రాజేంద్రప్రసాదు, టంగుటూరి ప్రకాశం, కొండా వెంకటప్పయ్య, కాశీనాధుని నాగేశ్వరరావు, డాక్టరు సుబ్రహ్మణ్యము, మల్లిపూడి పళ్ళంరాజు, కళా వెంకట్రావు, నేను మొదలైనవారమందరము మహాత్మాగాంధీగారు ప్రతిపాదించిన తీర్మానమును బలపరచితిమి. మహాత్మా గాంధీగారు ప్రతిపాదించిన తీర్మానము అధిక సంఖ్యాకులచే ఆమోదింపబడి మంజూరైనది. ఆ సంవత్సరములోపల సంపూర్ణస్వతంత్రవాదులు తమ ప్రచారమును దేశములో సాగించుకొనవచ్చు నని కూడ అనుజ్ఞఇవ్వబడినది. కేంద్ర, రాష్ట్ర శాసనసభలలోనున్న కాంగ్రెసు సభ్యులు నిర్మాణకార్యక్రమమునకు పూనుకొనవలెననియు, కాంగ్రెసువాదులు ఖద్దరును వ్యాపింపచేయవలెననియు, విదేశవస్త్రములను బహిష్కరించవలెననియు, త్రాగుడును మాన్పించవలెననియు, కల్లు సారా దుకాణములవద్ద శాంతియుతమైన పికెటింగులు జరిపించవలెననియు, స్త్రీల యొక్క అభ్యుదయమునకు కృషిసలుపవలెననియు, అస్పృశ్యతను నివారణ చేయవలెననియుకూడ తీర్మానించబడెను. కాంగ్రెసువాదులందరు తమ ఆదాయములో నూటికి కొంతచందుచొప్పున కాంగ్రెసుయొక్క అభివృద్ధికై చెల్లించవలెననియు తీర్మానించబడినది. స్వదేశసంస్థానాధీశ్వరులు వెంటనే తమరాజ్యములలో బాధ్యతాయుత ప్రభుత్వమును,మానవహక్కులను,వాక్స్వాతంత్ర్యము,పత్రికాస్వాతంత్ర్యము,వ్యక్తిస్వతంత్రములనుస్థాపించవలెననియు కూడ తీర్మానింపబడినది. లాలాలజపతిరాయ్, హకీమ్‌అజ్మల్‌ఖాను, ఆంధ్ర రత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, మగన్‌లాల్‌గాంధి, గోపబంధుదాసు మొదలైన నాయకులయొక్క అకాలమరణములకు భేదమునుతెలుపుచు తీర్మానము గావించబడినది.

1928 డిశంబరులో జరిగిన కలకత్తా కాంగ్రెసు అధ్యక్షుడైన పండిత మోతీలాల్ నెహ్రూగారు తన అఖిలభారత కాంగ్రెసు వర్కింగుకమిటీలో సంపూర్ణస్వతంత్రవాదియు, ఆంధ్ర పూర్ణస్వరాజ్యసంఘాధ్యక్షులు నగు బులుసు సాంబమూర్తిగారిని గాంధీజీసలహాతోను సభ్యులుగ చేసుకొనిరి. సత్యమూర్తిగారిని చేసుకోవలెనా? శ్రీనివాసయ్యంగారిని చేసుకోవలెనా అనే సంశయ స్థితి ఏర్పడగా గాంధీజీ సాంబమూర్తిగారిని సమర్థించెను. అప్పటినుంచి ఆయన వర్కింగుకమిటీ సభ్యుడుగ నుండెను. సంపూర్ణస్వతంత్రము కావలెనని, బ్రిటిషుప్రభుత్వము లేచిపోవలెనని, దేశమంతాతిరిగి ఆయన ఉపన్యాసముల నిచ్చుచుండెను. అందుమీద 1929 ఫిబ్రవరినెలలో ఆయనను ప్రభుత్వము వారు అరెస్టుచేసి బందరులో విచారణజరిపి ఒకసంవత్సరము కారాగారశిక్ష విధించిరి. 1930 వ సంవత్సరము మార్చినెలలో ఆయన విడుదలయ్యెను. బులుసు సాంబమూర్తిగారు జైలుకుపోయిన కొలదిరోజులకు మొసలికంటి తిరుమలరావుగారు నావద్దకువచ్చి సాంబమూర్తిగారిస్థానే ఆంధ్రసంపూర్ణ స్వతంత్రసంఘమునకు నే సభ్యుడనుగ నుండవలెనని నన్ను కోరెను. నేను గాంధీగారితోనే యుండెదనుగాని సంపూర్ణస్వతంత్రసంఘములో చేరజాలనని చెప్పితిని. దేశస్వాతంత్రమును సంపాదించుటకు గాంధీగారికంటె మరి యెవరికి శక్తిలేదని నా దృఢాభిప్రాయము. ఇమ్మట నేమిజరిగెనో నాకుతెలియదు. గాని డాక్టరు పట్టాభి సీతారామయ్యగారిని ఆసంఘమునకు అధ్యక్షునిగ ఎన్నుకొనిరి. ఆయన కలకత్తాకాంగ్రెసులో గాంధీగారికి వ్యతిరేకముగ సంపూర్ణ స్వతంత్రపక్షమునకు ఓటుచేసియుండెను. 1929 డిశంబరునెలలో లాహోరు కాంగ్రెసు జరిగినపుడు సాంబమూర్తిగారు జైలులోనుండిరి. కాంగ్రెసు అధ్యక్షులైన జవహర్‌లాలు నెహ్రూగారు గాంధీగారిసలహాపైన ఆంధ్రరాష్ట్ర స్వరాజ్యసంఘ అధ్యక్షులగు డాక్టరు పట్టాభి సీతారామయ్యగారిని తన వర్కింగుకమిటీలో సభ్యులుగ చేసిరి. అప్పటినుండి ఆంధ్రదేశమునుండి డాక్టరు పట్టాభిసీతారామయ్యగారు అఖిలభారత కాంగ్రెసు వర్కింగుకమిటీలో సభ్యుడుగ నియమింపబడుచువచ్చి తుదకు 1949 జయపూరు కాంగ్రెసుకు అధ్యక్షపీఠము నలంకరించిరి. 1930 నుండి ప్రతిసత్యాగ్రహములోను జైలుకు పోయి గొప్ప త్యాగములనుచేసి, 1953 నుండి అయిదు సంవత్సరములు

మధ్యప్రదేశమునకు గవర్నరుగ పనిచేసి, 1957 లో పదవీవిరమణమును గావించిరి. ఆయన కాంగ్రెసుఉద్యమముయొక్క చరిత్రను అతి ప్రతిభావంతముగ రెండు గొప్ప సంపుటములలో ఆంగ్లమున రచించి కాంగ్రెసుకు దేశమునకు అఖండసేవ చేసియున్నారు. అదియే ప్రమాణగ్రంథమై అన్ని భాషలలోకి తర్జుమాచేయబడినది.

1929 వ సంవత్సరములో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘముకొరకు ఒక భవనమును బెజవాడ గవర్నరుపేటలో క్రయముచేసి స్వాధీనపరచుకొంటిమి. దానికి కీర్తిశేషులైన ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి పేర ఆంధ్రరత్నభవనము అని పేరు పెట్టితిమి. అప్పటినుంచి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘముయొక్క కార్యస్థానము ఆ భవనములోనే స్థాపితమైనది. రాష్ట్రకాంగ్రెసు సభలన్నియు అచటనే జరిగెను. మరీ పెద్దసభ అయినచో నాగేశ్వరరావుపంతులుగారి దుర్గా విలాసములో జరిపేవారము. 1926 వ సంవత్సరములోనే దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారు బెజవాడ హనుమానుపేటలో నొక సామాన్య గృహమును, దానిచుట్టు నున్న విశాలమైన స్థలమును కొని ఆ పాతయింటిని తీసివేసి దుర్గావిలాసమను పేరున చాల గొప్ప భవనమును నిర్మించినారు. దానికి సమీపముననే దుర్గాకళామందిరమను నొక గొప్ప సినిమాహాలునుకూడ నిర్మించినారు. అప్పటినుంచి విజయవాడ వచ్చిన కాంగ్రెసు నాయకులందరికి వారు బెజవాడలో నున్నచో వారే తమయింట ఆతిథ్యమిచ్చేవారు. నా బాధ్యత చాల వరకు తగ్గిపోయినది. పెద్ద సభలుకూడ వారింట జరిగేవి. ప్రతినిధులకందరికి వారే భోజనసౌకర్యమును చేసేవారు.

1929వ సంవత్సరములో ఆంధ్రరాష్ట్ర రాజకీయమహాసభ బెజవాడలో దుర్గాకళామందిరములో జరిగినది. చాలమంది నాయకులు నాగేశ్వరరావు పంతులుగారి దుర్గావిలాసములో బసచేసి వారి కతిథులుగనుండిరి. కొందరు మాఇంట్లో దిగిరి జయంతిపురంరాజా దుర్గా సదాశివేశ్వరప్రసాదుగారు ఆహ్వానసంఘాధ్యక్షులుగ నుండిరి. జిల్లా కాంగ్రెసు కమిటీలలో అధిక సంఖ్య నడింపల్లి లక్ష్మీనరసింహారావుగారినే మహాసభకధ్యక్షులుగ నుండవలెనని సిఫారసుచేసినను, అధ్యక్షులుగ నుండనక్కరలేదనియు, సుబ్బారావ్

చంద్రదాసుగారే అధ్యక్షులుగ నుండవలెననియు, ఆహ్వానసంఘములో అధికసంఖ్యాకులు పట్టుపట్టిరి. అఖిల కాంగ్రెసు కమిటీలు సిఫారసుచేసినవారిని వద్దనుటకు ఆహ్వానసంఘమునకు హక్కులేదని ఆంధ్రరాష్ట్రకాంగ్రెస్ ప్రధానకార్యదర్శిగ నేను తీర్పునిచ్చితిని. లక్ష్మీనరసింహారావుగారే అధ్యక్షతవహించిరి. కలకత్తా కాంగ్రెసులో జరిగిన తీర్మానములనే మంజూరుచేసితిమి. దానితోపాటు స్త్రీలమహాసభకూడ జరిగినది. అక్కడ స్త్రీలను కలవరపెట్టినసమస్య విడాకులచట్ట ప్రతిపాదనము. బహుభార్యత్వమును నిషేధించవలెనని వరకట్నములను రూపుమాపవలెనని. స్త్రీలకు పురుషులతో సమాన ఆస్తిహక్కులు వారసత్వహక్కులు కావలెనని ఏకగ్రీవమైన తీర్మానములు జరిగెను. శ్రీమతి పెద్దాడ కామేశ్వరమ్మ అపుడు బి. ఏ. లో నుత్తీర్ణురాలై సికిందరాబాదులో ఉపాధ్యాయినిగ నున్నది. ఆ మహాసభలో ప్రధానపాత్రవహించినది. ఆమె మాయింట బసచేసినది. నన్ను విడాకులచట్టమువిషయములో సలహా అడిగినది. బహుభార్యత్వమును నిషేధించుచుండగ భార్య లేచిపోయినప్పుడు, పెనిమిటి భార్యను విడిచిపెట్టినపుడు, భార్యమీద క్రూరచర్యలు జరుగుచున్నప్పుడు, ఆ వివాహమును రద్దుపర్చుకొని మరియొక వివాహమునుచేసుకొనుటకు హక్కుండితీరవలెననిఆమెతోచెప్పగా ఈ సంగతులన్నీ ఆమె అచట వాదించి ఆ విషయనిర్ణయసభలోను, మహాసభలోను విడాకులచట్టపక్షమున అధికసంఖ్యాకులచేత ఓటుచేయించినది.

(౩)

1925 వ సంవత్సరములో మహాత్మా గాంధీగారు అఖిలభారతచరఖాసంఘమును స్థాపించిరి. ఆ చరఖాసంఘపు ఆంధ్రశాఖకు కొంతకాలము గొల్లపూడి సీతారామశాస్త్రులవారు, పిమ్మట డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు కార్యదర్శిగ పనిచేసి జయప్రదముగ నడిపిరి. యావదాంధ్రదేశములో బెజవాడలోని ఆంధ్రశాఖ చరఖాసంఘపు ఖద్దరువిక్రయశాలయే ఎక్కువ ఖద్దరును విక్రయించు కేంద్రముగ నున్నది. ఈ ఆంధ్రశాఖక్రింద ప్రతి జిల్లాలోను ఉత్పత్తికేంద్రములు, విక్రయశాలలు ఏర్పడినవి. విశాఖపట్టణములో మల్లెమడుగుల కోదండరామస్వామి, యం. ఏ. గారు ఈ యుద్య

మములో యావజ్జీవకృషిసల్పినవారిలో నొకరు. గొల్లపూడి సీతారామ శాస్త్రిలవారు ప్రత్యేకముగ గుంటూరు ఖద్దరుశాలనుపెట్టి ఖద్దరుద్యమమును సాగించుచుండిరి. పిమ్మట కొన్ని సంవత్సరాలకు దమ సుప్రసిద్ధమైన వినయాశ్రమమును స్థాపించి నిర్మాణకార్యక్రమమును పూర్తిగ సాగించి ఆంధ్రదేశములోకెల్ల గాంధీగారికి ప్రధానశిష్యులైరి. గాంధీగారు వారి ఆశ్రమమును దర్శించిరి. సీతారామశాస్త్రిలవారు ఆస్తి ఏమియులేకుండ సర్వసంగపరిత్యాగముగావించి సన్యాసాశ్రమమును స్వీకరించి అందరికి పూజ్యులై యున్నారు. చతుర్వేదములను తెలుగులోకి తర్జుమాచేయించినారు. ఇటీవల వారి ఛాయాపటమును వారి జన్మస్థానమైన రేపల్లెలో ఆవిష్కరణముచేయు గౌరవము నాకు కలిగినది. అపుడు శ్రోవలో వారిదర్శనముచేసినపుడు వారు నన్నాశీర్వదించి తెలుగు వేదగ్రంథములు నాకు దయచేసియున్నారు. ఆంధ్రదేశములో స్థాపింపబడిన గౌతమీ సత్యాగ్రహ ఆశ్రమము, పల్లిపాడ సత్యాగ్రహాశ్రమములనుగూర్చి ఇదివరకే చెప్పియున్నాను. ఇంతేగాక గుడివాడ తాలూకా కొమరవోలులో ఎర్నేని సుబ్రహ్మణ్యంగారు గాంధీ ఆశ్రమమును, పోలవరములో పూసుపాటి కోదండరామయ్యగారు స్వరాజ్య ఆశ్రమమును, చాగల్లులో తల్లాప్రగడ నరసింహశర్మ, ప్రకాశరాయుడుగార్లు ఆనంద నికేతనమను ఆశ్రమమును స్థాపించి నిర్మాణకార్యక్రమమును బహుగొప్పగా సాగించిరి.వీరందరు స్వతంత్రపోరాటములో అఖండత్యాగములుచేసిన ఆంధ్ర నాయకులు. అఖిలభారత చరఖాసంఘమును జయప్రదముగ సాగింపుటకును, ఖద్దరుపుత్పత్తిలో నష్టపడువారికి సాయముచేయుటకును, ఒక గొప్పనిధిని వసూలుచేయుటకు మహాత్మా గాంధీగారు నిశ్చయించి 1923 నుండి ఏటేటా ఏదోరాష్ట్రములో సంచారముచేసి సొమ్ము వసూలుచేయుచుండిరి. అంతేగాక వారు స్వయముగ వెళ్ళి ఖద్దరుయొక్క ఆవశ్యకతను, ప్రాశస్త్యమునుగూర్చి సందేశమిచ్చుటవలన ఖద్దరుపుత్పత్తి, ఖద్దరుధారణము దినదిన వృద్ధి చెందెను. ఖద్దరుయొక్క, గ్రామపరిశ్రమలయొక్క, పునరుద్ధరణము, గ్రామముల పునర్వికాసము, గ్రామముల ఆర్థిక స్వయంసంపూర్ణత, గ్రామ స్వరాజ్యము గాంధీగారి ఆర్థిక సాంఘికతత్వము (Socialism) ల స్థాపనకు ప్రధానపునాదులు. పిమ్మట కొలదికాలములనకే మహాత్మా గాంధీగారు

అఖిలభారత గ్రామపరిశ్రమల సంఘమును స్థాపించిరి. పెద్దపెద్ద యంత్రశాలలు భాగ్యవంతుల నెక్కువభాగ్యవంతులుగ చేయును. పేదవారి నెక్కువ పేదవారిగ చేయును. తమ గృహములను, గ్రామములను వదలి స్త్రీలు, పురుషులు వాటిలో కూలిచేయుటకు పోవలెను. ఇది నీతికికూడ భంగము గావించును. ప్రభుత్వమే పెద్ద యంత్రశాలలు నడిపినను ఇదులనే జరుగును గావున, మానవుల కవసరమైన సరకులనన్నిటిని వీలయినంతవరకు గృహపరిశ్రమలమూలమునను, గ్రామపరిశ్రమలమూలమునను తయారుచేయవలెను. పెద్దయంత్రములు వచ్చినకొలది మానవులు చేతితో స్వయముగ చేయు పని తగ్గిపోవును. గావున మానవులకు చేతినిండ పని కల్పించి నిరుద్యోగసమస్య లేకుండ చేయవలెనన్న గృహపరిశ్రమల, గ్రామ పరిశ్రమల పునరుద్ధరణము చాల అవసరము. అను పరిశ్రమల వికేంద్రీకరణమే ఆయన ముఖ్యసిద్ధాంతము. పశుసంపద వృద్ధిచెందుటకూడ అవసరము. అందువల్ల గోసంరక్షణను ఆయన ప్రబోధించెను. వర్గపోరాటము వలనగాక వర్గములమధ్య సామరస్యమును కలిగించి ప్రేమతత్వమువలనను, సోదరభావముమీదను సాంఘికతత్వమును స్థాపింపవలెనని ఆయన ప్రబోధము గావించెను. త్రాగుడు మానినచో ప్రజలు నైతికముగను, ఆర్థికముగను బాగుపడెదరు. మద్యపాననిషేధమును ఆయన బోధించెను. అస్పృశ్యతను తీసివేయుటకు కొంతకాలమునకు అఖిలభారత హరిజనసేవాసంఘమునుకూడ నాయన స్థాపించెను. ప్రతిరాష్ట్రములోను, ప్రతి జిల్లాలోను ఆయన దానికి శాఖ లేర్పరచెను. నేనుకూడ హరిజనసేవాసంఘములో చేరి పనిచేసితిని. బెజవాడలో అంజనాదేవి హరిజనబాలికల వసతిగృహమును నడుపు బాధ్యతను వేముల కూర్మయ్య తీసుకొనినపుడు నన్ను దానికి అధ్యక్షుని చేసినాడు. కొన్నిసంవత్సరములు నే నధ్యక్షుడుగను, కూర్మయ్య కార్యదర్శిగను, ఆయనభార్య మేనేజరుగను పనిచేసితిమి. నేను 1940 లో జైలుకుపోవుచు దానికి రాజీనామానిచ్చితిని.

1929 వ సంవత్సరములో ఖద్దరునిధికి ద్రవ్యము సేకరించుటకుగాను మహాత్మా గాంధీగారు ఆంధ్ర జిల్లాలన్నిటిలోను సంచారముచేసిరి. వారు ప్రప్రథమమున మా పశ్చిమకృష్ణాజిల్లాకే వచ్చిరి. నేను ఎదురుపోయి, నైజాము

రైల్వేమీద నున్న ఖమ్మంస్టేషనులో వారినికలసి. వారిని, కొండా వెంకటప్పయ్యగారిని వెంటబెట్టుకొని మోటారుకారులో మొట్టమొదట జగ్గయ్యపేటకు తీసుకొనివచ్చితిని. అక్కడ జయంతిపురం జమీందారు వాశిరెడ్డి దుర్గా సదాశివేశ్వరప్రసాదుగారు, వర్తకసంఘమువారు ఆతిథ్యమిచ్చిరి. గొప్ప సభజరిగెను. పదిహేనువందల రూప్యములు వసూలుఅయినవి. అక్కడ నుంచి కారులో మా నందిగామకు తీసుకొనివచ్చితిని. మహాత్మా గాంధీ గారు రహదారిబంగళావద్ద పెద్దతోపులో యేర్పాటుచేసిన సభలో వుపన్యసించిరి. అక్కడ షుమారు వెయ్యిరూప్యములు వసూలుఅయినవి. అక్కడ నుంచి బెజవాడ వెళ్ళితిమి. బెజవాడలో మహాత్ములవారికి కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారి దుర్గావిలాసములో బస నేర్పాటు చేసితిమి. నాగేశ్వరరావుపంతులుగారుకూడ అక్కడనే యుండి మహాత్ములవారికి గొప్ప ఆతిథ్యమునిచ్చిరి. ఖద్దరునిధికి అయిదువేలరూప్యముల విరాళము నిచ్చిరి. వారి స్వంతకారులోనే మహాత్మాగాంధీగారిని, కొండా వెంకటప్పయ్యగారిని, నేను పశ్చిమకృష్ణాజిల్లాలో వివిధగ్రామములకు తీసుకొనిపోతిని. ప్రతిచోట ప్రజలు ఖద్దరునిధికి ద్రవ్యమును,ఆభరణములను ఇచ్చిరి. నూజవీడులో ఉయ్యూరురాజాగారు గొప్ప ఆతిథ్యమునొసంగిరి. ఉయ్యూరురాజాగారగు రాజా మేకా వేంకటాద్రిఅప్పారావుగారు,వారి కుమారులు మేకా రంగయ్యాప్పారావుగారు ఐచ్ఛికసేవకబృందమునకు నాయకులుగ పనిచేసిరి. బహిరంగ సభ జరిగినతరువాత ఆరాత్రి అక్కడే ఉయ్యూరురాజాగారితోటలోని బంగళాలో బసచేసితిమి. అచట కాంగ్రెసునాయకులేగాక జమీందారులు, జమీందారిణులుకూడ మహాత్మాగాంధీగారి దర్శనముచేసి కానుక లర్పించిరి. మరునాడుదయమున కానుమోలు, ఆరుగొలను, వీరవల్లి, ఆతుకూరు, గన్నవరం గ్రామములలో సభలుజరిపి ప్రజలు సమర్పించిన కానుక లందుకొని బెజవాడ వచ్చితిమి. అచట గాంధీనగరములో తూర్పుభాగములోనున్న పెద్ద మైదానములో పందిళ్ళువేసి గొప్పసభ నేర్పాటుచేసితిమి. నేను చైర్మనుగ మునిసిపలు సన్మానపత్రమును చదివితిని. అనేక ప్రజాసంస్థలవారు నూలు దండలు సమర్పించిరి. గాంధీగారు పూలదండ లంగీకరించరు. ఆ సభలోనే వారు మా మునిసిపాలిటీ నిర్మాణముచేయుచున్న హైలెవెల్ రిజర్వాయరుకు

(ఎత్తైన నీటికుండీ) ప్రారంభోత్సవముచేసితినని ప్రకటించిరి. హిందీలో గొప్ప యుపన్యాసమిచ్చిరి. దానిని మోటూరు సత్యనారాయణగారు తెలుగులోకి తర్జుమాచేసిరి. గంపలగూడెంకు మహాత్ములవారిని తీసుకొనివెళ్లుటకు కాలవ్యవధి లేకపోయినది. అందువలన గంపలగూడెం కుమారరాజా వెంకట కృష్ణారావుగారే రు. 1116 లను తెచ్చి బెజవాడలో మహాత్ములవారికి సమర్పించిరి. వారి తండ్రిగారగు జగన్నాథరాయణంగారుకూడ బెజవాడవచ్చి గాంధీగారిదర్శనముచేసిరి. అటుపిమ్మట పశ్చిమకృష్ణాలోని మొగలిరాజపురం కంకిపాడు, కోలవెన్ను, నెప్పల్లి, కందేరు, గొడవర్రు, ఉయ్యూరు మొదలైన గ్రామములను దర్శించి సభలుజరిపి విరాళములను పోగుచేసి సమర్పించితిమి. నాతోకూడ జయంతిపురము జమీందారు, కాకమాను లక్ష్మయ్య, పేట బాపయ్య, కాట్రగడ్డ మధుసూదనరావు మొదలైనవారు సంచారము చేసిరి. పిమ్మట తూర్పుకృష్ణాలోని కపిలేశ్వరపురముచేరి యచటికివచ్చియున్న పట్టాభి సీతారామయ్య, ముట్నూరు కృష్ణారావు, గొట్టిపాటి బ్రహ్మయ్య, కొడాలి ఆంజనేయులు, కొల్లిపర సూరయ్య మొదలైన తూర్పుకృష్ణా కాంగ్రెసునాయకులకు మహాత్మా గాంధీగారిని వప్పగింతచేసితిమి. అచటినుంచి వారు తూర్పు కృష్ణాజిల్లాలో సంచారముచేసిరి. ఆ సాయంత్రము మహాత్మా గాంధీగారు బందరులో గొప్ప యుపన్యాసము నిచ్చిరి. బందరువరకు నేనుకూడ పోయి మరలివచ్చితిని. ఆంధ్రరాష్ట్రము మొత్తముమీద వసూలుచేయవలసిన ఖద్దరునిధిలో 20 వేల రూప్యములు మా పశ్చిమకృష్ణా జిల్లాలలోను, అంతమొత్తమునే తూర్పుకృష్ణాజిల్లాలోను వసూలుచేయవలెనని అదివరకు నిర్ణయించుకొంటిమి. కాని మహాత్మాగాంధీగారు ఈరెండుజిల్లాలలో సంచారముచేయగా ఒక్కొక్క జిల్లాలో దాదాపు 30 వేల రూప్యములు వసూలుఅయినవి. మహాత్మా గాంధీగారి ఆంధ్రదేశ ఖద్దరునిధి సంచారము ఆరువారములు జరిగినది. రెండులక్షలు వసూలుచేయుటకు తీర్మానించుకొనగా రెండులక్షల డెబ్బదివేలు వసూలయినది. ఆంధ్రదేశము గాంధీగారియందు భక్తిని, ఖద్దరునందు అభిమానమును బాగా చూపినదని అందరము తృప్తినొందితిమి. మహాత్మా గాంధీగారుకూడ సంతోషించినారు. ఆంధ్రదేశములో నెక్కడ సంచారముచేసినను ప్రతి ప్రజాసంస్థకు కాశీనాథుని నాగే

శ్వరరావు పంతులుగారి ధనసహాయము లభించినటుల కనపడినందున ఆ సంచారము ముగించినపిమ్మట తమ యంగ్ ఇండియా పత్రికలో ఆయన విశ్వదాత అని మహాత్ములవారు వ్రాసిరి. గాంధీగారు చెన్నపట్టణము వెళ్లినపుడు మరల నాగేశ్వరరావు పంతులుగారు ఇరవై అయిదువేలరూప్యములను ఖద్దరునిధికి విరాళముగ నిచ్చిరి. అది ఆంధ్రరాష్ట్రమొత్తముక్రిందనే చేర్పబడినది.

ఉయ్యూరుమకాములో మహాత్మా గాంధీగారు నాతో ప్రత్యేకముగా మాట్లాడవలెనని సెలవిచ్చిరి. ఆ ప్రకారమే ఇద్దరము కలసి యొంటరిగ మాట్లాడితిమి. నే నపుడు మ్యునిసిపలు ఛైర్మనుగాను, మద్రాసు శాసన సభ్యుడుగాను ఉంటిని. ఆ రెండు పదవులను వదలివేసి నిర్మాణకార్య క్రమమునకు దిగవలెనని నాకు సలహానిచ్చిరి. నాకు వీలుగనుండినచో తమ సబర్మతిలోని ఆశ్రమములో చేయుట వారికి సంతోషముగ నుండునని తెలిపిరి. ఉత్తర హిందూస్థానములోని ఏ ప్రదేశమునకు పోయి నివసించుటకును అచటి అత్యంత ఉష్ణము, అత్యంత శీతలము నాకు సరిపడవని మనవిచేసితిని. ఆంధ్రదేశములోనే నా పరిస్థితులనుబట్టి, ఆరోగ్యమునుబట్టి నన్ను పనిచెయనివ్వవలెనని కోరితిని. వీలయినంత శీఘ్రకాలములోనే శాసనసభ్యత్వమును, మ్యునిసిపలు అధ్యక్షపదవిని వదలిపెట్టుటకు నా కభ్యంతరములేదని, మిగిలిన కాంగ్రెసు కార్యక్రమమునకే నేను నా యావత్కాలము వినియోగించుటకు సిద్ధముగానున్నానని వారికిమనవిచేసితిని. వారు "సరే నీ ఇష్ట" మనిరి. గాంధీగారు ఆ సంభాషణలో సర్దారు వల్లభాయి పటేలు, బాబు రాజేంద్రప్రసాదు, పండిత జవహర్‌లాలునెహ్రూ గార్లు అటులనే మ్యునిసిపలు అధ్యక్షపదవులకు రాజీనామాలిచ్చి కాంగ్రెసు పనిలో పూర్తిగ నిమగ్నులై యుండిన యుదాహరణములను నాకు చెప్పిరి. వారు అప్పటికే మోతీలాలు నెహ్రూగారి సలహామీద శాసనసభ్యులచేత రాజీనామాల నిప్పించవలెనను ఉద్దేశ్యముతో నుండిరి. మ్యునిసిపలు బురదలో నేను ఇరుక్కొనడం వారి కిష్టంలేదు. వారికి నామీద నెపుడును అత్యంతమైన దయ యుండెను. నేను నిర్మాణము చేయించుచున్న విద్యుచ్ఛక్తిదీపములు ప్రారంభింపబడగానే నేను ఛైర్మనుపదవికి రాజీనామా

నిచ్చుటకు సిద్ధపడితిని. అవి 1930 ప్రారంభమున వెలిగించబడ్డవి. అట్లు ఏమ్మట కొలదికాలముసకే నేను [illegible] మున్సిపాలిటీలోకి రాలేను. 1934 లో ఢిల్లీ శాసనసభకు కాంగ్రెసు అభ్యర్థులను నిర్ణయించు కొనుటకు భూలాభాయి దేశాయిగారు బెజవాడకు వచ్చి రాజగోపాలాచారిగారి సలహామీద నన్నే కృష్ణా పశ్చిమగోదావరి తూర్పుగోదావరి జిల్లాల పక్షమున అభ్యర్థిగా నిలబెట్ట నిశ్చయించుకొని వచ్చినానని కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారిని జమీందార్ల నియోజకవర్గమునకు నిలబెట్టెదమని నాతో చెప్పినపుడు నేను ఢిల్లీకి పోవుటకు అంగీకరించలేదు. ఆ పర్యాయము అందరము కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారిని కోరి ఆ స్థానమునకు పంపినాము. జబ్బుపడి వారు మానుకొనినవిమ్మటకూడ ఢిల్లీ శాసనసభకు వెళ్ళవలెనని నన్ను అప్పటి రాష్ట్రకాంగ్రెసు అధ్యక్షులైన డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు కోరినను నేను అంగీకరించలేదు. నేను ఆరోగ్యకారణములచే మద్రాసురాష్ట్రములోను, ఆంధ్రదేశములోను పని చేయుటతో తృప్తిచెందితిని. అందువల్ల మద్రాసురాష్ట్రములోని తెనుగు అరవ, బ్రాహ్మణ బ్రాహ్మణేతర భేదములలోనుంచియే బయటపడవలసి వచ్చినది. 1929 లోనే సబర్మతికిగాని, 1934 లో గాని పిమ్మట గాని ఢిల్లీకి గాని పోయినట్లయిన నా జీవితము మరియొకవిధముగ నుండెడిది. ఆ పర్యటనములోనే మరియొక పుకాములో ప్రసంగవశమున ఆంధ్రదేశములో నాయకులు చాల యెక్కువగ నున్నారని (Andhra has too many leaders) గాంధీగారు నాతో వేళాకోళముగ మాటలాడిరి. అరవదేశములో కొందరు పీఠాధిపతులున్నారనియు, ప్రతి పీఠాధిపతి తన సొంత రాజ్యమునే స్థాపించి మిగిలినవారిని పైకిరాకుండ ప్రయత్నించుననియు చెప్పి ఉదాహరణముగ సి. రాజగోపాలాచార్యులుగా రొకపీఠమును, యస్. శ్రీనివాసయ్యంగా రొకపీఠమును, డాక్టరు వరదరాజులునాయుడుగా రొక పీఠమును, రామస్వామి నాయకరుగా రొకపీఠమును స్థాపించుకొని యొకరితో నొకరు కలవకుండ పనిచేయుచున్నారని చూపితిని. ఆంధ్రదేశములో నటుల గాక పాతతరమువారిని కలుపుకొని కూడగట్టుకొని ప్రతిజిల్లాలో తర్వాత తరమునుండి నాయకులను తయారుచేసి అందరము కలసి కాంగ్రెసుసంస్థ

క్రింద పనిచేయుచున్నామనియు, ప్రతిజిల్లాలోను నాత సమర్థులును, త్యాగశీలు రగు నాయకులు బయలుదేరుట ఆంధ్రదేశమునకు బలమేగాని, బలహీనము కాదనియు, వీరిలో కొంచెము పెద్దలైనవారు ముందు నడచుచుండగ మిగిలిన వారందరము వారితోకలిసి వారిక్రింద పనిచేయుచున్నామనియు, ఇందుకు గాంధీగారు సంతోషించవలసినదేననియు చెప్పగా వారు నవ్వి "ఔను. నీవు నిజమైన ఆంధ్రుడవు. ఆంధ్రులమీద మాటపడనివ్వవు" అని నాతో సరస ముగ మాట్లాడిరి. బులుసు సాంబమూర్తిగారప్పుడు జైలులో నుండిరి. వారిని గూర్చి మహాత్ములవారితో వచ్చిన ప్రసంగములో వారేవిధముగ ఎట్టిఆస్తిని మిగుల్చుకోకుండ సర్వసంగపరిత్యాగముచేసినారో, సంపూర్ణస్వతంత్రము కావలెనని ప్రజలలో ఆందోళనముచేయుటవల్ల, వారి నెటుల ప్రభుత్వము వారు మరల కారాగారమునకు బంపి, కాకినాడ కాంగ్రెసు జరుగుటకు ఏ డెనిమిదిరోజులు ముందుగ, వారు ప్రధానకార్యదర్శిగా దాని ఏర్పాట్లన్నియు చేయుచున్న సమయములో వారి ఏకైక పుత్రుడు మరణించినను ఆ దుఃఖ మును పూర్తిగా మ్రింగుకొని వైరాగ్యముతోను దేశాభిమానముతోను, ఆ ఏర్పాట్లను రాత్రిపగళ్లు అతిశ్రద్ధగా చేసి కాంగ్రెసు నెట్లు జయప్రదముగావించి నాడో ఆ యుదంతమంతయు చెప్పగా మహాత్ములవారు "నిజము, సాంబమూర్తి అతిత్యాగమూర్తి. గొప్ప ధైర్యశాలి, అఖండ దేశాభిమాని" అని ప్రశంసా వాక్యములను పలికిరి.

(4)

శ్రీ విఠల్‌భాయి పటేలుగారు కేంద్రశాసనసభకు అధ్యక్షులుగానున్న కాలములో 1928 వ సంవత్సరము సెప్టెంబరునెలలో దేశరక్షణబిల్లు ప్రవేశ పెట్టబడెను. దానివల్ల సంపూర్ణస్వతంత్రమును కోరువారు విచారణలేకుండా జైలులోపెట్టబడుటకు అవకాశముకలిగించబడుచున్నది. అది విచారణకు వచ్చి నపుడు కాంగ్రెసుపక్షసభ్యులగు మోతీలాల్ నెహ్రూ, లాలా లజపతిరాయ్, శ్రీనివాసఅయ్యంగారు మొదలైనవారు, ఇతర అనుద్యోగసభ్యులు తీవ్రముగా ఖండించిరి. ఓట్లు తీసుకొనబడగా ప్రభుత్వపక్షమునకు, ప్రతిపక్షమునకు సమానముగ సమ్మతులు వచ్చెను. అపుడు శాసనసభాధ్యక్షులైన విఠల్‌భాయ్ పటేలుగారు తనసమ్మతిని ప్రభుత్వమునకు వ్యతిరేకముగ నిచ్చి ఆ బిల్లును

ఓడింపచేసెను. మరల నా బిల్లును ప్రభుత్వమువారు 1929 జనవరినెలలో మరియొక శాసనసభా సెషనులో ప్రవేశపెట్టి ఏప్రెలు 11 వ తేదీన ఆలోచనకు తెచ్చిరి. అప్పటికే కమ్యూనిస్టులని యెంచబడిన పదునారుగురిమీద మీరటు కుట్రకేసు దాఖలై విచారణ సాగుచున్నది. అందువల్ల ఈ బిల్లుయొక్క ఆలోచనవిషయమై చర్చజరిగి ఏవిధముగా శాసనసభవారు తీర్మానించినను దానియొక్క ప్రభావము పూర్తిగ ఆ కేసు తీర్పుమీద నుండక మానదు. కావున ఈ బిల్లుయొక్క విచారణను మానుకొని ఉపసంహరించుకొనవలసినదని విఠల్ భాయి పటేలుగారు శాసనసభాధ్యక్షుడుగ ప్రభుత్వమునకు సలహానిచ్చెను. ఈ బిల్లే ముఖ్యమని యెంచబడినచో ఆ కుట్రకేసు నుపసంహరించుకొని దీని ఆలోచనే సాగించవలెననికూడ సలహానిచ్చెను. వారు ఆయనసలహా వినలేదు. ఆ బిల్లు తమ ప్రభుత్వమునకు చాల అవసరమని వాదించిరి. అందుమీద శాసనసభాధ్యక్షుడు ఆ బిల్లుయొక్క ఆలోచన జరుగకూడదు, విచారణ సాగకూడదు అని తన రూలింగునిచ్చి ఆ బిల్లును ఆపివైచిరి. ప్రభుత్వమువారు శాసనసభాధ్యక్షుని రూలింగును ఏమియు చేయజాలక ఆ బిల్లును ఉపసంహరించుకొని దానినే రెండుమాసములలో గవర్నరు జనరలుగారిచేత ఆర్డినెన్సు రూపమున ప్రకటింపచేసుకొనిరి. కేంద్రప్రభుత్వముయొక్క హోముశాఖవారు శాసనసభాధ్యక్షునిపట్ల అగౌరవముగ ప్రవర్తించినందున బ్రిటిషుప్రభుత్వముచేత ఆయన క్షమాపణ కోరించెను. తనయొక్క శాసనసభ సెక్రెటరీశాఖను ప్రభుత్వ సెక్రెటరీశాఖలనుండి స్వతంత్రము గావించి తన యాజమాన్యముక్రిందకు తెచ్చుకొనెను. తన జీతము రు. 3,656 లలో ప్రతినెల రెండువేలరూప్యములను మాత్రము తన ఖర్చులక్రింద తా నుంచుకొని మిగిలిన 1,656 రూప్యములను ప్రతినెల గుజరాతులోని యొకప్రజాసంస్థకొరకు మహాత్మా గాంధీగారి కిచ్చుచువచ్చెను. శాసనసభాధ్యక్షుడుగ మిగుల ప్రతిభాశాలి, సమర్థుడు, స్వతంత్రుడు నను ఖ్యాతి పొందెను. ఆయనతరువాతవచ్చిన కేంద్ర, రాష్ట్రశాసనసభలస్పీకరుల కందరికిని ఆయనయే ఆదర్శముగ నున్నాడు.

1929 లోనే సేటు జమునాలాల్ బజాజుగారు అస్పృశ్యతానివారణ ప్రచారమునకై విజయవాడ వచ్చి మా యింటనే బసచేసిరి. నా కారులో

కృష్ణాస్నానమునకు తీసికొనిపోతిని. సాయంత్రము బహిరంగసభ జరిపితిమి. ప్రకాశంగారు, నేను కలసి ఆంధ్రదేశమును శాసనసభల స్థానిక సంస్థల ఎన్నికలలోకి దింపి నిర్మాణకార్యక్రమమునకు తక్కువ ప్రాముఖ్యము నిచ్చుచున్నామని తామందరు తలచుచున్నట్లు వారు నాతో చెప్పిరి. మేము సత్యాగ్రహముచేయుట, నిర్మాణకార్యక్రమము, సత్యాగ్రహము లేనపుడు శాసనసభల స్థానికసంస్థల ప్రవేశము మూటినిగూడ చేయుచున్నామనియు, కాంగ్రెసు తీర్మానమైనప్పుడనే శాసన సభలకు పోయినామనియు శాసనసభల స్థానికసంస్థల ప్రవేశమువల్ల నిర్మాణకార్యక్రమమునకు దోహదమిచ్చుచున్నామనియు చెప్పితిని. నేను వార్ధాకు గాంధీగారిని చూచుటకు వెళ్లినపుడల్లా బజాజుగారి అతిథిగనే యుండేవాణ్ని. ఒకసారి నాచేత వార్ధాలో ఉపన్యాసమిప్పించినారు. వారి సతీమణి శ్రీమతి జానకిబాయి బజాజుగా రధ్యక్షతవహించిరి. అప్పటి నుంచి వారి అల్లుడైన శ్రీమన్నారాయణ అగరువాలాగారితో కూడ నాకు పరిచయము స్నేహములుండెను. కాకాసాహెబు కాలేల్కరుగారుకూడ హిందీ ప్రచారమునకై బెజవాడకు వచ్చుచుండిరి. ప్రతిపర్యాయము మా యింటనే దిగి నా కతిథులుగ నుండిరి.

1929వ సంవత్సరము అక్టోబరునెలలో అలహాబాదులో అఖిలభారత కాంగ్రెసుకమిటీ సమావేశమయినపుడు శాసనసభలలో ప్రవేశించుటవలన కాంగ్రెసువాదులలో స్వతంత్రమునకై పోరాడవలెనను యుత్సాహము క్షీణించి, ఎక్కడికక్కడికి సరిపుచ్చుకొని ఏవో కొన్ని సామాన్య ప్రయోజనములకొరకు ప్రాకులాడుట తటస్థించుచున్నందున శాసనసభల నుండి రాజీనామాలిచ్చుట అవసరమని ఢిల్లీ శాసనసభ కాంగ్రెసుపార్టీ నాయకులైన పండిత మోతీలాల్ నెహ్రూగారు, మహాత్మా గాంధీగారితో సంప్రదించి తీర్మానమునుపెట్టి ఆమోదింపచేయ యత్నించిరి. ఆప్రకారమే ఆ సంవత్సరము డిశంబరునెలలో జరుగనున్న లాహోరుకాంగ్రెసులో తీర్మానించవలెననికూడ తలచిరి. గాని సేన్‌గుప్త, సుభాస్‌చంద్రబోస్, సత్యమూర్తి, హరిసర్వోత్తమరావు, నేను, యింకా కొందరము మహాత్మా గాంధీగారివద్దకు పోయి లాహోరుకాంగ్రెసులో తీర్మానము ఆయ్యేవరకు

మమ్ములను శాసనసభలలో నుండనివ్వవలెనని. మేము శాసనసభలలో చేయుచున్నపనిని అప్పటికి ముగించుకొని రాజీనామాలిచ్చుటకు సిద్ధపడుదుమని చెప్పితిమి. అందుకు గాంధీగా రంగీకరించి అప్పుడట్టి తీర్మానము చేయకుండ నాపివైచిరి.

1929వ సంవత్సరము మార్చినెలలో మహాత్మాగాంధీగారు బర్మాదేశమునకు వెళ్లుచు త్రోవలో కలకత్తానగరమునం దాగిరి. అచట జనములు వేలకొలది పోగై ఆయనకు గొప్పస్వాగతమిచ్చిరి. విదేశవస్త్రములగొప్పపోగును జమచేసి బజారువీధులలో తగులబెట్టిరి. అందుమీద మహాత్మాగాంధీగారిని అరెస్టుచేసిరి. ఈ సంగతి భారతదేశమంతయు తెలిసెను. ఆ మధ్యాహ్నము విజయవాడలో మాకుగూడ టెలిగ్రాములువచ్చెను. నేను అపుడు మునిసిపలు ఛైర్మనుగ నుంటిని. వెంటనే అన్నివర్తకములకు, ఫ్యాక్టరీలకు తెలియపరచి మరునాడు హర్తాళము జరుపవలెనని ప్రకటించితిని. ఆ తెల్లవారుఝామున కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు మద్రాసునుంచి మెయిలులో బెజవాడవచ్చి వారియింటినుంచి మహాత్మా గాంధీగారిని ప్రభుత్వమువారు విడుదలచేసిరని నాకు టెలిఫోనులో తెలియపరచిరి. ఆ వెంటనే బెజవాడ బస్తీలోని వర్తకులందరికిని టెలిఫోనుద్వారా ఈ సంగతి తెలియపరచి హర్తాళమును మానిపించితిని. ఈ విషయము నిదివరకే మా బోడివాడి కథలో చెప్పియుంటిని. గాంధీగారిని ప్రభుత్వమువారు కలకత్తాలో విడుదలచేసి న్యూసెన్సుయాక్టుక్రింద కేసుపెట్టి ఒక రూపాయి జురుమానా విధించిరి. గాంధీగారు ఆ రూపాయి చెల్లించలేదు. ఎవరో వారికిగాను చెల్లించిరి. గాంధీగారు బర్మావెళ్ళిరి. కొద్దిరోజులలో మరల హిందూదేశమునకు వచ్చిరి. ఆ వెంటనే ఆంధ్రదేశములో ఖద్దరునిధిని సంపాదించుటకు పైన చెప్పిన సంచారముచేసిరి.

1929 వ సంవత్సరము జూలై నెల 12 వతేదీనుంచి లాహోరు కుట్రకేసులో ముద్దాయిగానున్న జితీంద్రనాథ్‌దాసు అను బంగాళీయువకుడు రాజకీయఖైదీలకు జైళ్ళలో యూరోపియను ఖైదీలతోపాటు భోజనాదిసౌకర్యముల నివ్వవలెనని కోరి ప్రభుత్వమువారు అటులచేయనందున లాహోరు జైలులో నిరాహారదీక్షను ప్రారంభించి అరువదినాలుగు దినములు ఘోర,

కఠోర ఉపవాసమును గావించి. సెప్టెంబరు 13వ తేదీన తనప్రాణములను విడిచెను. అది దేశమునంతను ఆకర్షించినది. కలకత్తానగరమందు జితీంద్రనాధ్‌దాసు గౌరవార్థము గొప్పయుత్సవములు జరిగినవి. సెప్టెంబరు 28 వ తేదీన లక్నోనగరమందు జరిగిన అఖిలభారత కాంగ్రెసుకమిటీలో జితీంద్రనాధ్‌దాసుగారి ఆత్మార్పణమునకు జోహారు లర్పించిరి. ప్రభుత్వమువారు ఆ పిమ్మట రాజకీయఖైదీలకు జైళ్ళలో కొంత సదుపాయమును చేయుటకు తీర్మానించుచు నొక జి. ఓ. ను ప్రకటించిరి. కాని దానిలోకూడ మిత్రభేద ముండెను. రాజకీయఖైదీల నందరిని ఒకేతరగతిగచేర్చి సౌకర్యములనిచ్చుటకు మారుగ 'ఏ. బి. సి.' అను మూడుక్లాసులుగ విభజించి 'ఏ' క్లాసువారికంటె 'బి' క్లాసువారికి తక్కువ సౌకర్యములు, 'బి' క్లాసు వారికంటె 'సి' క్లాసువారి కింకా తక్కువసౌకర్యములు కలుగునట్లు నిర్ణయించిరి. అందువలన సామాన్య రాజకీయఖైదీలందరును 'సి' క్లాసులోనే చేర్చబడుటయు, కొద్దిమంది విద్యావంతులు, స్థితిమంతులు, పలుకుబడికలవారుమాత్రమే 'ఏ,బి' క్లాసులలో చేర్చబడుటయు, వారికి మాత్రమే కొంచెము మంచిసౌకర్యములు కలుగచేయబడుటయు జరిగి,మామూలు 'సి' క్లాసు ఖైదీలలో నసంతృప్తి ఏర్పడి 'ఏ, బి' క్లాసులవారియందు అసూయకూడ కలిగినది. ఇటుల రాజకీయఖైదీల సౌకర్యములకొరకు కఠోర ఉపవాసముచేసి జైలులో ప్రాణములర్పించిన ధీరులు మరి యిద్దరు మాత్రమే గలరు. ఒకరు ఐర్లండులోని స్వాతంత్ర్యవీరుడు, కార్కునగర మేయరునైన టెరెన్సు మాక్‌స్వినీగారు (Terence Mac Swiney). రెండవవారు బర్మాలోని స్వాతంత్ర్య శాంతిసమరవీరుడు, బౌద్ధభిక్షువునైన పూంగి విజయగారు నైయున్నారు.

(౭)

1929 వ సంవత్సరము డిశంబరు ఆఖరున లాహోరు కాంగ్రెసు మహాసభ జరుగబోవుచున్నది. దానికి పండిత జవహర్లాల్‌నెహ్రూగారిని అధ్యక్షుడుగ ఎన్నుకొనిరి. భారతదేశ వైస్రాయియైన ఇర్విన్‌ప్రభువు ఈలోపల అక్టోబరు 31 వ తేదీన భారతదేశమునకు బ్రిటిషు ప్రభుత్వము వారు ఇవ్వదలచిన బాధ్యతాయుత ప్రభుత్వమున కర్థము డొమినియనుప్రతి

పత్తియేనని ప్రకటించి లండనులో రౌండుటేబిలు కాన్ఫరెన్సును అన్నిపార్టీలకు ప్రాతినిధ్యము కలిగినదానిని సమావేశపరచెదనని ప్రకటించెను. అంతవరకు 1917 వ సంవత్సరము 20 వ ఆగస్టు మాంటేగ్యూ ప్రకటనములో చెప్పబడిన బాధ్యతాయుత ప్రభుత్వమను పదము విషయములో అనిశ్చయముగ నుండెను. ఇపుడు దాని కర్థము డొమినియను ప్రతిపత్తియే యని స్పష్టీకరించెను. గాని ఆ వెంటనే బ్రిటిషు పార్లమెంటులోని కన్సర్వేటివు సభ్యులు అప్పుడు అధికారములోనున్న లేబరుపార్టీకిచెందిన ఇండియామంత్రి 'వెడ్జి ఉడ్ బెన్' (Wedgo Wood Benn) గారిని విమర్శించగా ఆయన డొమినియను ప్రతిపత్తి గమ్యస్థానమేగాని వెంటనే ఇచ్చునది కాదని జవాబు చెప్పెను. పండిత మదనమోహన మాలవ్యా, సర్ తేజ్ బహదూర్ సప్రూ, డాక్టరు అనిబిసెంటమ్మగారలు ఆ ప్రకటనము నంగీకరించవలెనని దాని ప్రకారము వెంటనే తగినచర్య తీసుకొనవలెనని ప్రకటనచేసిరి. డిశంబరునెల 23 వ తేదీన ఇర్విను ప్రభువు కోరికమీద నాయనను ఢిల్లీలో గాంధీమహాత్ముడును, మోతీలాల్ నెహ్రూగారును కలిసిరి. అదినరకు కొద్దిరోజులక్రిందట ఇర్విను ప్రభువు ప్రయాణము చేయుచున్న రైలుబండిమీద నొక అరాజకవాది బాంబువేయుటకు ప్రయత్నించి విఫలుడయ్యెను. గాంధీగారు ఆ విషయమున ఇర్విను ప్రభువుకు తన సానుభూతిని తెలిపి కుశలప్రశ్నమును గావించి అసలువిషయమునుగూర్చి సంభాషణకు దిగిరి. ఇర్విను ప్రభువు సంభాషణ మొదలుపెడదాము. రాజకీయఖైదీల విడుదలనుగురించి మొదలుపెడదామా అని గాంధీగారిని అడుగగా, డొమినియను ప్రతిపత్తితోనే మొదలుపెడుదాము అని ఆయన జవాబుచెప్పెను. పూర్తియైన డొమినియను ప్రతిపత్తిని వెంటనే బ్రిటిషు ప్రభుత్వమువారు ఇచ్చుటకు సిద్ధముగనున్నయెడల దాని తబిసీళ్ళనుగురించి మాట్లాడుటకుమాత్రమే లండనులోని రౌండుటేబిలు కాన్ఫరెన్సుకు (ఆలోచనాసమావేశమునకు) తాను అంగీకరించెదనని మహాత్మాగాంధీ చెప్పెను. అటువంటి హామీ తా నివ్వలేనని ఇర్విను ప్రభువు చెప్పెను. డొమినియను ప్రతిపత్తిని గమ్యస్థానముని మాత్రమే తాను భావించుచున్నానని చెప్పెను. వెంటనే మహాత్మా గాంధీగారు, పండిత మోతీలాల్ నెహ్రూగారు వైస్రాయిగారివద్దనుంచి వచ్చివేసిరి.

1929 వ సంవత్సరము డిశంబరు నెలాఖరున లాహోరులో కాంగ్రెసుమహాసభ గొప్ప కోలాహలముగా జరిగెను. బ్రిటిషుప్రభుత్వముతో భరతవర్షము తెగతెంపులు చేసుకొనబోవుచున్నది. నాయకులందరు స్వతంత్ర సంపాదనా దీక్షాపరులై వచ్చిరి. యువకనాయకులైన పండిత జవహర్లాలు నెహ్రూ అధ్యక్షతవహించెను. రావీనది అవతలియొడ్డున బ్రిటిషు సైన్యము లుంచబడెను, గాని కాంగ్రెసును చెదరగొట్టలేదు.అరెస్టులు చెయ్యలేదు. జితీంద్రనాథదాసు, ఫూంగి విజయగారల ఆత్మార్పణమునకు జోహారు లర్పించుటతోను, పరమపదించిన కొందరు కాంగ్రెసు నాయకుల మరణమునకు అశ్రుతర్పణముతోను మహాసభ ప్రారంభమయ్యెను. వైస్రాయి ఆయనసతీమణి ప్రయాణముచేయుచున్న రైలుమీద బాంబు వేసిచర్యను మహాసభవారు ఖండించిరి. వైస్రాయి, ఆయనసతీమణి బాంబునుంచి తప్పించుకొని క్షేమముగనున్నందుకు సంతోషమును ప్రకటించిరి. పిమ్మట అసలు తీర్మానమునకువచ్చిరి. క్రిందటి సంవత్సరము కలకత్తా కాంగ్రెసుమహాసభలో కోరినట్లు డొమినియను ప్రతిపత్తిని బ్రిటిషుప్రభుత్వమువారు హిందూదేశమునకు ఇచ్చి యుండలేదు, గనుక పూర్ణస్వరాజ్యము అనగా బ్రిటిషుప్రభుత్వముతో నెట్టిసంబంధములేని సంపూర్ణ స్వతంత్రమే భారతదేశము స్థాపించుకొనుటకునిశ్చయించినదని,ఆవిధముగనే కాంగ్రెసువిధానముయొక్క మొదటిఆర్టికలులో స్వరాజ్ అను పదమునకు పూర్ణస్వరాజ్యము అనగా సంపూర్ణ స్వతంత్రము అని అర్థము అంతటినుంచి చెప్పవలసియున్నదని ప్రకటించిరి. సంపూర్ణస్వతంత్రమును సంపాదించు టకుగాను కేంద్ర, రాష్ట్ర శాసనసభలలోనున్న కాంగ్రెసుసభ్యు లెల్లరును తమ సభ్యత్వమునకు రాజీనామాలనివ్వవలెనని, ఇకముందుజరిగే శాసనసభల ఎన్నికలలో పాల్గొనకూడదని, నిర్మాణకార్యక్రమమును పట్టుదలతో సాగించ వలెనని తీర్మానము చేయబడ్డది. సంపూర్ణ స్వతంత్రమును స్థాపించుటకు అన్నివిధములైన శాసనోల్లంఘన కార్యక్రమమును, పన్నుల నిరాకరణ మును శాంతియుతముగ దేశములోని కొన్నిభాగములలోకాని, అన్నిభాగము లలోకాని సాగించుటకు అఖిలభారత కాంగ్రెసుకమిటీకి అధికార మివ్వబడి నట్లు తీర్మానముచేయబడినది. ఈ పూర్ణస్వరాజ్య తీర్మానము 1929 వ

సంవత్సరము డిశంబరునెల 31 వ తేదీన అర్థరాత్రివేళ పన్నెండుగంటలకు అత్యంతఉత్సాహముతో కాంగ్రెసుమహాసభచే చేయబడినది. విదేశ ప్రభుత్వమువారు భారతదేశమును పరిపాలించుటలో చేసియున్న ఋణముల నన్నిటిని స్వతంత్రభారతదేశము పూర్తిగ విచారించి అందులో న్యాయమైన వాటినిమాత్రమే చెల్లించుననికూడ యొక తీర్మానము చేయబడ్డది. కాని శాసనసభలలోనుంచి కాంగ్రెసుసభ్యులందరును లేచిరావలెనను తీర్మానమునకు సుభాసుచంద్రబోసు, శ్రీనివాస అయ్యంగారు, టంగుటూరి ప్రకాశం, సత్యమూర్తి మొదలైనవారు వ్యతిరేకించి కాంగ్రెసులోనుంచి బైటికి పోయిరి. కాంగ్రెసుడెమోక్రాటికుపార్టీ అనుదానిని స్థాపించుకున్నామని ప్రకటించిరి. తాము సంపూర్ణస్వతంత్రము కోరుచున్నవారమే, అట్టిసంపూర్ణ స్వాతంత్ర్యసంపాదనలో ఇతరపార్టీలన్నిటితో సహకరించెదము. కాని శాసనసభలనుండిరాజీనామాలనిచ్చి వెంటనేమరల అభ్యర్థులుగనిలచి శాసనసభలలో ప్రవేశించుటయే తమ యుద్దేశ్యమని తమ ప్రకటనములో చెప్పిరి. టంగుటూరి ప్రకాశంగారుమాత్రము డెమోక్రాటికుపార్టీలో చేరలేదు. మరునాడు సాయంత్రము ఆంధ్రదేశమునుండి వెళ్ళిన ప్రతినిధులు దేశభక్త కొండా వెంకటప్పయ్యపంతులుగారి నాయకత్వముక్రింద మహాత్మాగాంధీగారిని దర్శించిరి. ఆయన తాను గుజరాతు, ఆంధ్ర, బీహారురాష్ట్రములమీద తన ఆశలను సంపూర్ణముగ పెట్టుకున్నాననియు, ఈ మూడురాష్ట్రములు ఎట్టిదౌర్జన్యములకు దిగకుండ అత్యుత్సాహముతో తాను నిర్ణయించిన సత్యాగ్రహమును నిర్వర్తించునని తనకు పూర్తియైన నమ్మకము కలదనియు చెప్పి వారిని ఆశీర్వదించి పంపెను. అటుపిమ్మట భారతదేశమంతయు స్వతంత్రసంపాదన కొరకు శాసనోల్లంఘనము చేయుటకు తయారగుచుండెను. ఆంధ్రదేశములోని కాంగ్రెసువారు లందరు తమయొక్క పాత్రను పూర్తిగాను, అత్యుత్సాహముతోను నెరవేర్చుటకు దృఢకంకణులైరి. 1930 వ సంవత్సరము జనవరి నెలలో ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుకమిటీని కాకినాడలో సమావేశపర్చితిమి. అక్కడ లాహోరు కాంగ్రెసుతీర్మానముప్రకారము ఆంధ్రదేశములో శాసనోల్లంఘన కార్యక్రమముకొరకు వేలకొలది ఐచ్ఛికభటులను తయారుచేయవలెనని తీర్మానించితిమి. కాంగ్రెసువర్కింగుకమిటీవారు ప్రతిసంవత్సరము

జనవరినెల 26 వ తేదీన ప్రతిచోట బహిరంగసభలో చదువవలసినదని నిర్ణయించిన సంపూర్ణస్వతంత్ర ప్రతిజ్ఞాపత్రమును తెలుగులోనికి అనువాదము చేసి అన్ని కాంగ్రెసుసంఘములకు పంపితిమి. ఆ ప్రకారమే జనవరి 26 వ తేదీన ఆంధ్రదేశములోని పట్టణములలోను, పల్లెలలోను బహిరంగసభలు చేసి కాంగ్రెసు నిర్ణయించినవిధమున సంపూర్ణస్వతంత్రముకొరకు పోరాటమును సాగించుటకు సిద్ధముగనున్నామని తీర్మానములుచేసి ఆ ప్రతిజ్ఞాపత్రములను చదివిరి. పోలీసులు సభలను జరుపకుండ ఆపుచేయుదురని సందేహము కలిగెను కాని అట్టిదేమియు జరుగలేదు.

ఫిబ్రవరినెల ప్రారంభమున మద్రాసుగవర్నరు బందరుకువచ్చుచుండెను. బందరుమునిసిపలుచైర్మను పౌరసన్మానపత్రమును చదువుటకు తీర్మానింపబడెను. గవర్నరుగారికి వైభవముగ సన్మానముచేయుసభ నేర్పాటుచేసిరి. ప్రజలు ఆ సన్మానమునకు సుముఖులుగ లేరని తెల్పుటకుగాను గవర్నరుగారు బందరువచ్చినపుడు నల్లజెండాల ప్రదర్శనము చేయవలెనని గొట్టిపాటి బ్రహ్మయ్యగారి అధ్యక్షతను తూర్పుకృష్ణాజిల్లా కాంగ్రెసుకమిటీ సమావేశమై తీర్మానముచేసినది. ఆ ప్రకారము నల్లజెండాలు తీసుకొని వందలకొలది కాంగ్రెసువాదులు ఊరేగింపుతో రాబర్ట్సనుపేట కుండివద్దకు రాగా ప్రభుత్వోద్యోగులు ఆ ఉత్సవమును నిషేధించుచు 144 వ సెక్షను ప్రయోగించిరి. అందుమీద వారందరు ఖద్దరునిలయముయొక్క ఆవరణములోనికి పోయి అక్కడినుంచి నల్లజెండాలతో ఇద్దరిద్దరు చొప్పున బజారులోనికి రాసాగిరి. అక్కడ కనిపెట్టుకొనియున్న పోలీసువారు అటుల బజారులోనికి నల్లజెండాలతో వచ్చిన కాంగ్రెసువాదుల నందరిని అరెస్టుచేసిరి. గొట్టిపాటి బ్రహ్మయ్య, వల్లూరి రామారావు, తల్లాప్రగడ రామారావు, కొడాలి ఆంజనేయులు, బొబ్బా వెంకటశేషయ్య, కానూరి చిన వెంకట దాసయ్య, మొదలైన పదకొండుమందిని అరెస్టుచేసి విచారణచేసి తలా ఒక సంవత్సరము శిక్షవిధించిరి. నేను వారినందరిని జైలులో చూచివచ్చితిని. ఈపదకొండుమందిలో గుడ్లవల్లేరువారు ముగ్గురు హైకోర్టువరకు అప్పీలుచేసినందున అప్పీలులో అందరిశిక్ష రద్దయినది. కాని తొమ్మిదినెలలయినపిమ్మటనే వీరందరు విడుదలైనారు. అంతవరకు జైలులో శిక్ష ననుభవించిరి.

1930 వ సంవత్సరము ఫిబ్రవరినెలనాటికి కేంద్రశాసనసభలోను, వివిధ రాష్ట్రశాసనసభలలోనున్న కాంగ్రెసుసభ్యులు దాదాపుగ అందరును రాజీనామాలనిచ్చిరి. మద్రాసు శాసనసభనుండి మేమందరము జనవరినెల లోనే రాజీనామాలనిచ్చినామని ఇదివరకే తెలిపియున్నాను. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుఅధ్యక్షులుగ నున్నప్పటికి టంగుటూరి ప్రకాశంపంతులుగారు కేంద్ర శాసనసభ్యత్వమునకు రాజీనామానిచ్చి మరల దానికే నిలచి ఏకగ్రీవముగ ఎన్నుకొనబడిరి. ఇది కాంగ్రెసు తీర్మానమునకు వ్యతిరేకమే. కాని గాంధీ గారు ఉప్పుసత్యాగ్రహమునకై దండికి నడచివెళ్లుచుండగ ఏప్రిలు ప్రారంభమునందే ప్రకాశంగారును, పండిత మదనమోహనమాలవ్యాగారును శాసన సభనుండి రాజీనామానిచ్చిరి. మరల నిలువలేదు. అందువలన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీలో ప్రకాశంగారిని ప్రశ్నించవలెనని యనుకొంటిమి. ఆయన సత్యాగ్రహమును ఆంధ్రదేశములో నడుపుటకు సిద్ధముగ వచ్చినపుడు ఆయననాయకత్వమును స్వీకరించితిమి.

(6)

ఫిబ్రవరి 14, 15, 16 తేదీలలో కాంగ్రెసువర్కింగుకమిటీ సబర్మతి ఆశ్రమములో గాంధీగారి సమక్షమున సమావేశమై మహాత్మాగాంధీగారికి శాసనోల్లంఘనమును నిర్వహించుటకు అధికారమిచ్చినది. మహాత్మాగాంధీ గారు ఏవిధంగా శాసనోల్లంఘనము ప్రారంభించవలెను అను విషయములో ముఖ్యులైన కాంగ్రెసునాయకులతో సంప్రతించిరి. గాని ఎవరును తగిన సలహాల నివ్వజాలరైరి. తుదకు తన అంతర్వాణి ప్రబోధప్రకారము సము ద్రపు నీటినుంచి, ఇతరచోట్లగల ఉప్పునీటినుంచి ప్రతిచోటను ఉప్పును తయారుచేయవలెనని, ఉప్పును సముద్రపుటొడ్డునుంచి తెచ్చి పంచిపెట్టవలె నని, ఉప్పుకొటారులను దండెత్తి పట్టుకొనవలెనని మహాత్మా గాంధీగారు తామే నిశ్చయించిరి. ఉప్పు తయారుచేయకూడదను, తెచ్చుకొనకూడదను ప్రభుత్వశాసనమును దేశమంతటిచేత ధిక్కరింపచేయుటకు నిశ్చయించిరి. ప్రారంభములో ఉప్పుతెస్తే పప్పుచేస్తే స్వరాజ్యంవస్తుందా అని వేళాకోళం చేసిన కాంగ్రెసువారుకూడ లేకపోలేదు. గాని మహాత్మాగాంధీ ఉపనిష

న్మూర్తి. ఆధ్యాత్మిక మహాపురుషుడు. 'శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో యద్వాచో హ వాచం। స ఉ ప్రాణస్య ప్రాణః। చక్షుషః చక్షురతి ముచ్య ధీరాః।' అను కేనోపనిషత్తులోని మహామంత్రముయొక్క సత్యమును నమ్మి దానిననుసరించినవాడు. దానిఅర్థమేమనగా, 'భగవంతుడు మనయొక్క చెవికి చెవి, మనయొక్క మనస్సునకు మనసు, మనవాక్కునకు వాక్కు, ప్రాణమునకు ప్రాణము, మన చక్షువునకు చక్షువు' అని ధీరులైనవారు, జ్ఞానులైనవారు తెలుసుకొనెదరు. యచ్చక్షుషా న పశ్యతి ఏన చక్షూంషి పశ్యతి తదేవ బ్రహ్మ త్వంవిద్ధి॥ అనగ మననేత్రము లెవనినిచూడజాలవోగాని మననేత్రములు ఎవని శక్తివల్ల చూచుచున్నవో ఆయనయే పరబ్రహ్మ; ఆయనను తెలిసికొనుము అని కేనోపనిషన్మంత్రము. పరమాత్మ మనఅందరిలో నున్నాడు. ఆయనయొక్క శక్తివల్లనే మనము చూచుచున్నాము; మాటలాడుచున్నాము; వినుచున్నాము; బ్రతుకుచున్నాము; ఆలోచనచేయుచున్నాము. తెలిసికొనుచున్నాము. గాని పవిత్ర హృదయులైన గాంధిమహాత్మునివంటివారు తమయొక్క హృదయములలోనున్న ఈశ్వరునివలన ప్రబోధమును పొంది, ఈశ్వరవాణిని విని దానిప్రకారము నడచెదరు. ఈశ్వరవాణి అనగా అంతర్వాణి అట్టి మహాపురుషులకు నడవవలసిన మార్గమును చూపును. తనయొక్క అంతర్వాణి ప్రబోధించినప్రకారమే ప్రతి ముఖ్యవిషయములోను తాను తన జీవితములో నడచితిననియు, తన అంతర్వాణి తన నెప్పుడును సరియైనమార్గముననే నడిపించినది గాని తప్పుత్రోవను పెట్టలేదనియు ఆయన అనేకసారులు వ్రాసియున్నాడు. ఈ పర్యాయము ఉప్పు సత్యాగ్రహము చేయవలెనని అంతర్వాణి ఆయనకు ప్రబోధము గావించినందున దానిని సాగించుటకు నిశ్చయించినాడు. 1942 క్విట్ ఇండియా యుద్యమములోకూడ అంతర్వాణి ప్రబోధములోనే ఆయన దానిని సాగించెను. ఆ కథ రెండవ సంపుటములో చెప్పెదను. తాను సబర్మతి ఆశ్రమములో నున్నవారిని మాత్రమే వెంట తీసుకొని సబర్మతి ఆశ్రమమునుండి కాలినడకను త్రోవలోనున్న గ్రామములలో నాగుచు అక్కడికివచ్చిన ప్రజలకు ప్రబోధముచేయుచు ఏప్రిలు 6 వ తేదీనాటికి దండి గ్రామమువద్ద సముద్రతీరమునకు చేరి అక్కడి ఉప్పును ఏరుకొని సత్యాగ్రహమును సాగించుటకు బయలుదేరెను. ఈ

సంగతి ముందుగనే ఆయన రాజప్రతినిధియైన ఇర్విన్‌ప్రభువుకు ఉత్తరము ద్వారా తెలియజేసెను. ఆ ఉత్తరము రైనాల్డ్సు అను గాంధీ ఆశ్రమములో శిక్షణనొందుచున్న నొక యాంగ్లేయ యువకుని చేతికిచ్చి ఢిల్లీకి ఇర్విన్‌ప్రభువుకు పంపెను. "మహాత్మా గాంధి అటువంటి తీర్మానమును చేసినందుకు తన విచారమును తెలుపుచున్నా"నని ఇర్విన్‌ప్రభువు మరల జవాబు వ్రాసెను. "నేను రొట్టె నడిగితే మీరు రాతి నిచ్చినారు కనుక శాసనోల్లంఘనము చేయవలసిన విధి నాకు కలిగిన"దని గాంధీగారు మరల జవాబు వ్రాసెను. సబర్మతి ఆశ్రమమునుంచే గాంధీగారు ఊతగానుండుటకై యొకకర్రను చేతపుచ్చుకొని డెబ్బదిరెండుమందిమంది అనుచరులతో "రఘుపతి రాఘవ రాజారాం పతిత పావన సీతారాం" కీర్తనను పాడుచు రెండువందల మైళ్ళ దూరమునమున్న దండి గ్రామమునకు కాలినడకను ప్రయాణము సాగించిన 1930వ సంవత్సరము మార్చినెల 12 వ తేదీ మానవ చరిత్రలో ముఖ్యమైనదినము. ఆయనయొక్క ప్రయాణమునకు ముందుగ గ్రామస్థులను తయారుచేయుచు వల్లభాయి పటేలుగారు వెళ్ళుచుండగ మార్చినెల మొదటి వారములోనే రాస్ అను గ్రామమువద్ద ఆయనను అరెస్టుచేసి మూడునెలల శిక్షవిధించి జైలుకుపంపినారు. గాంధీగారు తమయొక్క కాలినడక ప్రయాణమును 24 దినములు సాగించిరి. ఆయనను సాగనంపుటకు కాంగ్రెసుమహా నాయకులు, వేలకువేలజనము సబర్మతి ఆశ్రమమునవద్ద బారులుతీర్చి నిలచి 'జై జై' ధ్వానములతో ఆయనకు వీడ్కోలు నిచ్చిరి. అన్ని దేశముల యొక్క పత్రికా ప్రతినిధులు ఈ భారత స్వతంత్రపోరాట మహాయజ్ఞమును చూచి తమ పత్రికలకు వార్తలను పంపుటకై వచ్చిరి. మహాత్మాగాంధీగారి ప్రయాణము సాగినకొద్ది వందలాది గ్రామోద్యోగస్థులు రాజీనామాలనిచ్చు చుండిరి. భారతభూమియంతయు నొక నూతనశక్తియొక్క అవిర్భావమున వణకినది. ఆకసము దద్దరిల్లినది. ప్రపంచములోకెల్ల బలవత్తరమయిన సామ్రాజ్యమును కూలద్రోయుట కొరకు ఋషిపుంగవుడు జరుపుచున్న యాత్ర అది. మార్చి 21 తేదీన అహమ్మదాబాదులో అఖిలభారత కాంగ్రెసు పార్టీ సమావేశమైనది. నేను, కొండా వెంకటప్పయ్య, పట్టాభి సీతారామయ్య, కాశీనాథుని నాగేశ్వరరావు, అచంట రుక్మిణి లక్ష్మిపతి, దండు నారాయణ

రాజు, బులుసు సాంబమూర్తి, తెన్నేటి విశ్వనాధం, కళా వెంకట్రావు, ఆత్మకూరి గోవిందాచారి, నడింపల్లి లక్ష్మీనరసింహారావు, గుళ్ళపల్లి వున్నయ్యశాస్త్రి, శీరం సుబ్బారావుగార్లు మొదలైనఅఖిలభారత కాంగ్రెసుకమిటీ సభ్యుల మందరము ఆ చరిత్రాత్మకసభలో పాల్గొంటిమి. మహాత్మాగాంధీగారు నిర్ణయించిన ఉప్పుసత్యాగ్రహమును సాగించుటకు ఏకగ్రీవమైన తీర్మానమును చేసితిమి. ఆయన తన అనుచరులతో కాలినడకను అహమ్మదాబాదు నగరములో ప్రవేశించగా కని విని ఎరుగని జనసమూహము రెండుమైళ్ళపొడుగున నిలచి ఆయనకు జోహారులర్పించెను. "గాంధీకి జై" అను నినాదములు మిన్నుముట్టెను. ఈ విధముగ ఆయనవచ్చిన త్రోవపొడుగున వేలకువేల జనములు ఆయనరాకకై నిరీక్షించి ఆయనదర్శనమును చేసుకొని పునీతుల మైతిమని, తమ మాతృదేశమునకు స్వతంత్రము సిద్ధించుట నిశ్చయమని తలచిరి. ఖద్దరు అస్పృశ్యతానివారణము, హిందూ ముస్లిము ఐక్యత, మద్యపాననిషేధము - వీటికొరకు ప్రజలు శపథములను గావించిరి. అందరు సత్యాగ్రహములో కృతనిశ్చయులైరి.

అహమ్మదాబాదులో అఖిలభారత కాంగ్రెసుకమిటీ ముగియగానే ఆంధ్రప్రతినిధులలో డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు తప్ప మిగిలిన వారమందరమును దండియాత్రలో నున్న మహాత్మా గాంధీగారి దర్శనము చేయుటకు బయలుదేరినాము. డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు వర్కింగు కమిటీసభ్యులై అహమ్మదాబాదులో కొంతపనియుండి ఆగిపోయి ఆ పని పూర్తిచేసుకొని అహమ్మదాబాదునుంచి సరాసరి బందరు వెళ్ళినారు. మిగతా వారము అహమ్మదాబాదునుంచి సాయంత్రము బయలుదేరి త్రోవమీదుగా మరునాడు ఉదయము 8 గంటలకు జంబూసరుగ్రామమునకు చేరినాము. మాతో శ్రీమతి అవంతి రుక్మిణమ్మగారు కూడ వచ్చినది. ఆమె 1926 లో ప్రపంచ స్త్రీలసభకు భారతదేశ ప్రతినిధిగా పారిసుకు పోయి యూరపులో సంచారముచేసివచ్చినప్పటినుంచి కాంగ్రెసులోచేరి ముఖ్యముగ యువజనోద్యమమును మద్రాసులో నడుపుచున్నది. ఆమె చాల ధీశాలి, వీరవనిత, బెజవాడ వచ్చి నాతోకలసి సత్యాగ్రహములో పాల్గొనవలెనని ఆమెకు వ్రాసియుంటిని. ఆమె సత్యాగ్రహముచేసి జైలుకుపోవుటకు సిద్ధముగనున్నానని

నాకు జవాబువ్రాసినది. ఆమెభర్త డాక్టరు లక్ష్మీపతిగారుకూడ అటులనే నాకు వ్రాసినారు. గాని మద్రాసులో సి. రాజగోపాలాచార్యులుగారామెను తమిళనాడు కాంగ్రెసుకమిటీవారిచే అఖిలభారత కాంగ్రెసుకమిటీకి సభ్యురాలుగ ఎన్నుకొనజేసి మరికొందరు తమిళనాడువారితోపాటు వేదారణ్యములో సత్యాగ్రహముచేయునట్లొడంబరచినారు. ఆమె ఆంధ్రస్త్రీయైనను తమిళములో ధారాళముగా నుపన్యాసము నివ్వగలిగెను. ఆమె అఖిలభారత కాంగ్రెసు కమిటీ సభ్యురాలుగ అహమ్మదాబాదునకు, జంబూసరునకు మాతోవచ్చినది. మేము జంబూసరు చేరిన కొంతసేపటికి మహాత్మా గాంధీగారు తన డెబ్బదితొమ్మిదిమంది అనుచరులతో [illegible] అచటికి విచ్చేసిరి. అదివరకే కాంగ్రెసు అధ్యక్షులైన పండిత జవహర్‌లాల్ నెహ్రూ, పండిత మోతీలాల్ నెహ్రూ, అబ్బాసు త్యాబ్జీగార్లు అక్కడికి వచ్చియుండిరి. మేమందరము గాంధీగారివిడిదిలోనే భోజనముచేసి మధ్యాహ్నం గాంధీగారు బసచేసిన మేడమీద వారిదర్శనముచేసితిమి. అచట జరిగినసమావేశములో జవహర్‌లాల్ నెహ్రూగారు సత్యాగ్రహ ప్రతిజ్ఞాపత్రికయొక్క నమూనాను గాంధీగారితో సంప్రదించి స్థిరపరచిరి. ఆంధ్రప్రతినిధులము దేశభక్త కొండా వెంకటప్పయ్యగారి నాయకత్వముక్రింద గాంధీగారితో మాట్లాడి ఆంధ్రదేశములో జరుగవలసిన సత్యాగ్రహ కార్యక్రమమును గూర్చి వారిసలహాలను తీసుకున్నాము. ప్రతిజిల్లాలోను, ప్రతితాలూకాలోను, ప్రతిచోటను శిబిరములనుపెట్టి సత్యాగ్రహమును సాగించవలెనని వారు సలహానిచ్చిరి. ఆంధ్రులు ఎట్టిత్యాగములకు వెనుదీయక దౌర్జన్యచర్యలను జరుపక సత్యాగ్రహమును మిగుల జయప్రదముగ సాగింతురను నమ్మకము తమకు పూర్తిగ గలదని మహాత్ములవారు శలవిచ్చి మమ్ములాశీర్వదించి పంపిరి. ఆంధ్ర కాంగ్రెసుప్రముఖులు సబర్మతీ ఆశ్రమవాసియునగు యెర్నేని సుబ్రహ్మణ్యంగారు దండియాత్రలో మహాత్మా గాంధీగారితోకూడ పోవుచుండినవారిలో నొకరు. ఆయన మావద్దకు వచ్చి వివరములన్నీ తెలిపెను. ఆ సాయంత్రము అయిదుగంటలకు గాంధీగారు మరల తన యనుచరులతో ఆ గ్రామమునుండి తమ యాత్రలో ముందుకు పోసాగిరి. వేలకు వేల జనులు బారులుతీర్చి ఇరువైపుల నిలచి మహాత్మా గాంధీకి జై యని జయ



దండియాత్రలో జంబుసారువద్ద ఆంధ్రప్రతినిధులు దర్శించిన మహాత్మాగాంధీ

జయ ధ్వానములు సలిపిరి. నానాదేశముల పత్రికా ప్రతినిధులు వారివెంట వెళ్ళిరి. మహాత్ములవారితో నొకప్రక్కన దేశభక్త కొండా వెంకటప్పయ్య, అబ్బాసు త్యాబ్జీగార్లును రెండవప్రక్కన పండిత మోతీలాలు నెహ్రూ, పండిత జవహర్‌లాల్ నెహ్రూగార్లును, వారివెనుక మేమందరమును నడచి ఒక మైలున్నరదూరము పోగా నచట నొకపొలములో మహాత్ములవారు తనతోనున్న మమ్ములనందరను కూర్చొనజేసి ప్రార్థనసలిపిరి. అది పూర్తి కాగానే మహాత్ములవారివద్ద సెలవుతీసుకొని ఆంధ్ర ప్రతినిధులము వెనుకకు రాగా, మహాత్ములవారు తమ అనుచరులతో ముందుకు సాగిపోయిరి. పండిత మోతీలాల్‌నెహ్రూ, పండిత జవహర్‌లాల్‌నెహ్రూ, అబ్బాసు త్యాబ్జీ గార్లుకూడ వారివద్ద సెలవుతీసుకొని మోటారుకారులలో వెళ్ళిపోయిరి.

ఆంధ్రప్రతినిధు లందరము బ్రోచి రైలుస్టేషనుకు వచ్చి అచట రైలెక్కి బొంబాయిలో దిగితిమి. బొంబాయిలో కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి విల్లియం అండుకో అమృతాంజనము ఆఫీసు మేడమీద వారి అతిధులుగనుండి అక్కడనుంచి చీలిపోయి ఆంధ్రదేశము చేరితిమి. నేను, నడింపల్లి లక్ష్మీనరసింహారావుగారు లక్ష్మీనరసింహారావుగారి పనిమీద, త్రోవలో హైదరాబాదులో దిగితిమి, మాడపాటి హనుమంతరావుగారింటికి పోదలచితిమి. స్టేషనువద్ద నొక పోలీసుద్యోగి మమ్ములకలసి మా పేరు లడిగి ఎక్కడినుంచి వచ్చుచున్నారు? హైదరాబాదులో ఎక్కడికి పోవుచు న్నారు చెప్పు మనెను. మేము చెప్పుటకు నిరాకరించితిమి. తాను సి. ఐ.డి. సబుఇన్స్పెక్టరునని చెప్పెను. సి. ఐ. డి. వారు మాకు తెలియకుండా పేర్లు తెలుసుకోవలెనేగాని మమ్ముల పేర్లడుగుట తప్పని, అలా అడుగుటవలన మీరు సి. ఐ. డి. యుద్యోగమునకు అనర్హులని నేను చెప్పితిని. ఆయన మమ్ముల నిద్దరిని మా సామానులతో ప్రక్కనున్న పోలీసుస్టేషనులోకి తీసు కొనిపోయి కూర్చుండమనెను. సరే, ఎంతసేపు కూర్చొనబెట్టుతావో చూతాము అనిచెప్పి మేము కూర్చుంటిమి. అటుల కొంచెముసేపు కూర్చొని నినపిమ్మట, బారిస్టరుయస్. యస్. రెడ్డిగారు మునగాలరాజాగారి అల్లుడు, నాకు మిత్రులైనవారు హైదరాబాదులోనే అసిస్టెంటు పోలీసు కమీషనరుగా నున్నారు. నేను వారికి టెలిఫోను చేస్తాను, నీసంగతి కనుక్కుంటాను.

మమ్ముల నక్రమముగ అరెస్టుచేసినందుకు నిన్ను బర్తరఫ్‌చేయిస్తాను అని పోలీసుసబుఇనస్పెక్టరును బెదిరించి చెప్పినట్టు చెప్పితిని. అందుమీద ఆ పోలీసుద్యోగి భయపడి మమ్ము వదలిపెట్టెను. మేము టాంగాలో వెళ్ళుచుండగా మాతోకూడ వచ్చి మమ్ము మా సమాచారము చెప్పవలసినదని బ్రతిమిలాడెను. 'మేము మాడపాటి హనుమంతరావుపంతులుగారింటికి వెళ్ళచున్నాము. ఇంతవరకే చెప్పరాదు. మా పేర్లు వారినడిగి తెలుసుకోవలసిన'దని చెప్పి హనుమంతరావుపంతులుగారింటికి వచ్చితిమి. తర్వాత అతను వచ్చి వారినడిగి మా సమాచారము తెలుసుకొనెను. మే మిద్దరము రెండురోజులు హైదరాబాదులో నున్నాము. హనుమంతరావు పంతులుగారితోను, వామన నాయకుగారితోను మాట్లాడి రైలుమీద బెజవాడ వెళ్ళినాము. నడింపల్లి లక్ష్మి నరసింహారావుగారు అక్కడినుంచి గుంటూరు వెళ్ళెను.

తాను దండి చేరి సత్యాగ్రహము ప్రారంభించువరకు మరెవ్వరును సత్యాగ్రహము చేయవద్దని మహాత్మాగాంధీ గారు ఆజ్ఞాపించెను. ప్రతి రాష్ట్రములోను ఉప్పుసత్యాగ్రహము మొదలైన అన్ని సత్యాగ్రహములను నడపుటకు రాష్ట్ర కాంగ్రెసుకమిటీలకు అధికార మివ్వబడెను. ఏప్రిలు 5 వ తేదీ ఉదయమున మహాత్మాగాంధీ తన 79 మంది సత్యాగ్రహ అనుచరులతో దండికి చేరెను. ఆయనను దర్శించుటకు సరోజినీదేవికూడ అచటికి వచ్చెను. మరునాడు ఉదయమున ప్రార్థనజరిపి తన అనుచరులతో సముద్రతీరముచేరి అచటి ఉప్పును ప్రోగుచేసుకొనిరి. ఇపుడు ఉప్పుసత్యాగ్రహమును నేను చేసినాను, కనుక ఎక్కడపడితే అక్కడ ఉప్పు నేరుకొనవచ్చునని, ఉప్పును తయారుచేయవచ్చునని, వివిధములైన సత్యాగ్రహము చేయవచ్చునని నేను ఆదేశించుచున్నానని ఆయన పత్రికాప్రతినిధులతో చెప్పెను. విద్యార్థులు ప్రభుత్వకళాశాలలనుంచి, స్కూళ్ళనుంచి బైటికి వచ్చి సత్యాగ్రహములో పాల్గొనవలెనని ఆయన కోరెను. ఏప్రిలు 6 వ తేదీ జాతీయవారప్రారంభదినము, ఆ దినమున గాంధీగారు సత్యాగ్రహముచేసినారనువార్త దేశమంతటనువ్యాపించెను. అన్నిరాష్ట్రములలోను, బస్తీలలోను, పల్లెలలోను ఉత్సవములు, వేలకొలది జనము పోగైన బహిరంగసభలు జరిగెను. కొన్నిచోట్ల పోలీసులు ప్రజలమీద

కాల్చిరి. కొన్నిచోట్ల మీటింగులను చెదరగొట్టిరి. ఆ దినము గాంధీగారిని అరెస్టు చెయ్యలేదు. అక్కడనుంచి తాను దర్సన, చెరసాద గ్రామములలో నున్న ఉప్పుకొఠారులను ముట్టడించబోవుచున్నానని రాజప్రతినిధికి మరియొక లేఖ వ్రాసెను. ప్రథమమున దర్సన కొఠారుకు బయలు దేరెను. అది సూరతుజిల్లాలో నున్నది. ఆ జిల్లాలో తన అనుచరులతో కాలినడకను సంచారముచేయసాగెను. భారతదేశమంతయు స్వతంత్ర విప్లవజ్వాలలతో ప్రజ్వరిల్లసాగెను. ఇదకు మేనెల 4 వ తేదీ రాత్రి 1 గంట 10 నిమిషములకు పోలీసు అధికారులు ఆయనను అరెస్టుచేసి రైలులో తీసికొనిపోయి బోరివాలు స్టేషనులో దింపి అక్కడనుంచి మోటారుకారులో ఎఱవాడ జైలుకు తీసుకొనివెళ్లి జైలులోపెట్టిరి. గాంధిగారు జైలుకు వెళ్లకముందే తాడిచెట్లను కొట్టివేయ వచ్చునని అనుజ్ఞనిచ్చిరి. గాంధీజీకి పిమ్మట దండిలో సత్యాగ్రహమునకు నాయకత్వమువహించి నడపసాగిన అబ్బాస్ త్యాబ్జీగారిని ప్రభుత్వమువారు ఏప్రిలు 12 వ తేదీన అరెస్టుచేసి జైలుకు పంపిరి. ఏప్రిలు 14 వ తేదీన జవహర్‌లాల్ నెహ్రూగారిని అరెస్టుచేసి రెండు సంవత్సరములు శిక్ష విధించిరి. ఏప్రిలు రెండవవారములో సేనుగుప్తగారిని కూడ పట్టుకొని జైలుకు పంపిరి. అదివరకే మార్చినెలలో సుభాసుచంద్రబోసుగారికి రాజద్రోహ నేరముక్రింద ఒక సంవత్సర శిక్ష విధించిరి.

(7)

ఆంధ్ర ప్రతినిధులము అఖిలభారత కాంగ్రెసుకమిటీకి అహమ్మదాబాదుకు పోకముందే ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీని మార్చినెలలో గుంటూరులో సమావేశపరచితిమి. ప్రకాశంగారు అప్పుడు ఢిల్లీలో శాసన సభలో నున్నందున వెంకటప్పయ్య పంతులుగారి అధ్యక్షతక్రింద సభ జరిపితిమి. అంతకుముందు రెండు రోజులక్రిందట సాంబమూర్తిగారు బళ్లారి జైలునుంచి విడుదలైరి. బళ్లారిలో చాల పెద్ద సభ జరిగి, వారిని గొప్పగ సన్మానించిరి. వేలకొలది జనులు అచ్చట సమకూడిరి. వా రుపన్యసించిన మైదానమునకు సాంబమూర్తిమైదానమని పేరుపెట్టిరి. అక్కడినుంచి సాంబమూర్తిగారు మా కమిటీ సమావేశమునాటికి గుంటూ

రులో దిగగా, వారికి గొప్ప యూరేగింపు, సన్మానము జరిపితిమి. మా సభలో వారుకూడ పాల్గొనిరి. అందులో సాంబమూర్తిగారు తాను ఐచ్ఛికభటులను తీసుకొని కాలినడకను గుంటూరునుండి కాకినాడవరకు పోయెదనని చెప్పిన దానిని అంగీకరింపవలెనా యను విషయముపై కొంత చర్చ జరిగి అఖిల ఆయన కాలినడకను పోనక్కరలేదనియు, ప్రతిజిల్లాలోను వెంటనే సత్యాగ్రహులశిబిరములను స్థాపించి ఏప్రిలు 6 వ తేదీనుంచి ఉప్పు సత్యాగ్రహము చేయవలెననియు తీర్మానించితిమి. అటుపిమ్మట కొలదిరోజులలో అహమ్మదాబాదుకు, జంబూసరుకు వెళ్లి వచ్చితిమి. మేము అక్కడికి వెళ్ళి యున్న రోజులలోనే డాక్టరు సుబ్రహ్మణ్యముగారు తమ గౌతమీసత్యాగ్రహ ఆశ్రమములో వివిధ జిల్లాలనుండి వచ్చిన సత్యాగ్రహ కార్యకర్తలకు కొన్ని దినములు తరిఫీదు నిచ్చిరి. అవి ముగిసినపిమ్మట తెలుగుసంవత్సరాది నాడు తూర్పుగోదావరిజిల్లాకు చెందిన సుమారు మూడువందలమంది సత్యాగ్రహులతో బులుసు సాంబమూర్తి, డాక్టరు సుబ్రహ్మణ్యము, వెన్నేటి సత్యనారాయణ, కళా వెంకట్రావుగారలు కాలినడకను బయలుదేరి తూర్పు గోదావరిజిల్లాలో కొంతవరకు సంచారముచేసి, పిమ్మట రెండుజట్లుగ చీలి సాంబమూర్తి, వెన్నేటి సత్యనారాయణగార్లు కాకినాడకు రెండుమైళ్ళదూరములోనున్న చొల్లంగి గ్రామమువద్ద సముద్రతీరమున సత్యాగ్రహశిబిరము నేర్పాటుచేసి ఏప్రిలు 6 వ తేదీన ఉప్పును తయారుచేసిరి. కళా వెంకట్రావు, డాక్టరు సుబ్రహ్మణ్యంగారలు వందలకొలది సత్యాగ్రహులతో మరికొన్ని గ్రామములలో సంచారముచేసి అప్పటికి చొల్లంగివద్ద స్థాపింపబడిన శిబిరమును చేరిరి. వెంటనే పోలీసులు సాంబమూర్తి, కళా వెంకట్రావు, వెన్నేటి సత్యనారాయణ, డాక్టరు సుబ్రహ్మణ్యంగార్లను నలుగురిని అరెస్టు చేసి కాకినాడకు తీసుకొనిపోయి తలా ఒక్కొక్క సంవత్సరము శిక్ష వేయించి రాజమహేంద్రవరము జైలుకు పంపిరి.

ఏప్రిలు 4వ తేదీన పశ్చిమగోదావరిజిల్లా రాజకీయమహాసభ భీమవరములో అత్యంత ఉత్సాహముతో జరిగెను. దానికి నే నధ్యక్షత వహించితిని. రైలుదిగగానే నాయకులు, సత్యాగ్రహ కార్యకర్తలు, వాలంటీరులు, జోగయ్యశర్మగారు రచించిన వీరరసపూరితమైన జాతీయకీర్తనలతో నన్ను

గొప్పఉత్సవముతో గ్రామములోని విడిదికి గొనిపోయిరి. భోజనమునకు పిమ్మట మహాసభ జరిగెను. వేలకొలది జనులు హాజరైరి. వందలకొలది శాంతిసైనికులు సత్యాగ్రహముచేయుటకు తయారై సిద్ధముగనుండిరి. దంతు నారాయణరాజు, ఆత్మకూరి గోవిందాచార్యులు, మాగంటి బాపినీడుగారలు సత్యాగ్రహనాయకులుగ నుండిరి. అల్లూరి సత్యనారాయణరాజు, సుమారు 17 సంవత్సరముల బాలుడై సత్యాగ్రహసైనికుడుగ చేరెను. బసవరాజు శ్రీరంగశాయి, కొవ్వలి గోపాలరావు, వంకా సూరిశాస్త్రి, ముదిగంటి జగ్గన్న శాస్త్రి, వెంకటనారాయణ, వల్లపట్ల గంగరాజు మొదలైన కాంగ్రెసుప్రముఖు లెందరో అందులో నుండిరి. అచట జరిగిన సమావేశములో సంపూర్ణ స్వరాజ్యస్థాపనకొరకు, ఉప్పుసత్యాగ్రహము, కల్లు - సారాయికొట్లముల పికె టింగు, తాడిచెట్లు కొట్టడము మొదలైన సత్యాగ్రహ కార్యములను పూర్తిగ సాగించుటకు తీర్మానములు చేయబడెను. పోలీసుఅధికారులు తమదళముతో వచ్చి సిద్ధముగనుండిరి. కాని అరెస్టులేమీ చేయలేదు. ఆ సాయంత్రము శాంతిసైనికులు తమ నాయకులక్రింద మూడుజట్టులుగా బయలుదేరి జిల్లాలోని గ్రామములలో సంచారముచేసి మట్లపాలెం సముద్రరేవులో సత్యా గ్రహముచేయుటకు వెళ్లిరి. నన్ను రైలులో బెజవాడకు సాగనంపిరి. నేను మరునాడు ఉదయమున బందరులో దిగితిని. బందరులో పట్టాభి సీతా రామయ్య, ముట్నూరి కృష్ణారావు, చెరుకువాడ నరశింహం మొదలైన కాంగ్రెసు నాయకులను చూచితిని. పశ్చిమ, తూర్పు కృష్ణాజిల్లాలు కలిపి ఒకే సత్యాగ్రహుల శిబిరమును బందరులోనే ఏర్పాటుచేయవలెననియు, దానికయ్యే ఖర్చులో సగము పశ్చిమ కృష్ణాజిల్లావారము భరించెదమనియు, అచటినుంచియే సమీపముననున్న సముద్రతీరమునకు పోయి ఉప్పు సత్యా గ్రహము చేయవలెననియు చెప్పి యొప్పించితిని. పిమ్మట నేను మోటారు కారులో ఆ సముద్రతీరమునకు పోయి ఉప్పు ఏరుకొని మూటకట్టుకొని తీసుకొనివచ్చి ఆ సాయంత్రము రాబర్ట్సన్‌పేటలోని మార్కెటు స్థలములో జరిగిన పెద్ద బహిరంగసభలో నుపన్యసించితిని. ముట్నూరి కృష్ణారావుగా రధ్యక్షతవహించిరి. ఈ ఉప్పు స్వరాజ్యమును తెచ్చుటకు దివ్యౌషధమని చెప్పి సభలో అందరికిని పంచిపెట్టితిని. కృష్ణారావుగారు కూడ సత్యాగ్

హాముచేయవలెనని తీవ్రముగ ప్రబోధించిరి. ఆ రోజున మమ్ముల నరెస్టు చేయలేదు. మరునాడు ఉదయమునకు (ఏప్రిలు 6 వ తేదీ) నేను బెజవాడ వచ్చితిని. ఆ యుదయముననే టంగుటూరి ప్రకాశం పంతులుగారు కూడ శాసనసభ్యత్వాన్ని వదులుకొని ఢిల్లీనుండి బెజవాడ చేరిరి. ఆ ఉదయము 8 గంటలకు బెజవాడలోని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీ కార్యస్థానమైన ఆంధ్రరత్నభవనమునుండి మొదటి సత్యాగ్రహబట్టు 120 మంది గంపల గూడెం కుమారరాజా కోటగిరి వెంకటకృష్ణారావుగారి నాయకత్వముక్రింద కాలినడకను త్రోవలోని గ్రామములలో నాగుచు బందరులోని సత్యాగ్రహ శిబిరమును చేరుటకు బయలుదేరి వెళ్ళిరి. ఆ వెళ్ళినవారిలో పేట బాపయ్య, అన్నె అంజయ్య, వేలూరి యజ్ఞనారాయణశాస్త్రి, స్వామి నారాయణానంద, పింగళి లక్ష్మీనారాయణ, కాకుమాను లక్ష్మయ్య, కాట్రగడ్డ మధుసూదనరావు, పిడికిటి రామకోటయ్య, పిడకిటి మాధవరావు, నూకల వీరరాఘవయ్య, వల్లభనేని వెంకటరావు, మానికొండ సత్యనారాయణశాస్త్రి, దశిక సూర్య ప్రకాశరావు, కాకాని వెంకటరత్నం మొదలగు పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసు ప్రముఖు లుండిరి. అపుడు కొన్ని వేలమందిజనులు సమావేశమైరి. రాష్ట్ర కాంగ్రెసుకమిటీ అధ్యక్షులైన టంగుటూరి ప్రకాశంపంతులుగారు, ప్రధాన కార్యదర్శినైన నేను వారికి ప్రోత్సాహవచనములు చెప్పి ఆశీర్వదించి సాగ నంపితిమి. ఆ వెంటనే మేమిద్దరము మోటారుకారుమీద గుంటూరు వెళ్ళితిమి. అక్కడ కొండా వెంకటప్పయ్యగారిఇంటిఆవరణములో ఒక యజ్ఞవాటిక అమర్చబడి వేదమంత్రములు చదువబడినపిమ్మట ఉప్పునీటితో ఉప్పు తయారుచేయబడెను. కొండా వెంకటప్పయ్యగారు, గొల్లపూడి సీతారామ శాస్త్రి, ఉన్నవ లక్ష్మీనారాయణ, నడింపల్లి లక్ష్మీనరసింహారావు, జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు — మల్లాది యజ్ఞనారాయణ, గౌసుబేగుసాహెబు, గుళ్లపల్లి పున్నయ్యశాస్త్రి, మద్ది వెంకటరంగయ్య, శిరం సుబ్బారావు, నేతి వెంకటాచలపతి, డాక్టరు చలపతిరావు మొదలైన గుంటూరు నాయకులంతా ఆ యజ్ఞములో పాల్గొనిరి. పల్లెటూళ్లనుంచి వందలకొలది రైతునాయకులు వచ్చిరి. వందలకొలది శాంతిసైనికులను పోగుచేసి తమజిల్లాలోని వాడ్రేవు ధగ్గరను, ఇతరచోట్లను సముద్రతీరమున ఉప్పుసత్యాగ్రహము చేయు

టకు సన్నాహములు చేసిరి. ఆ యజ్ఞములో నేను, ప్రకాశంగారుకూడ పాల్గొని మరల బెజవాడ వచ్చితిమి.

మూడవదినమున బెజవాడలో ఆంధ్రరత్నభవనమునుండి రెండవ సత్యాగ్రహులజట్టు 100 మంది డాక్టరు వెలిదండ్ల హనుమంతరావు, డాక్టరు ఘంటసాల సీతారామశర్మ, పోతిన గణపతిరావుగార్ల నాయకత్వముక్రింద కాలినడకను పోయి గ్రామములలో ఆగుచు బందరులోని సత్యాగ్రహశిబిరమును చేరుటకు బయలుదేరగా, వారికి వీడ్కోలునిచ్చి పంపితిమి. పిమ్మట ప్రకాశంగారు చెన్నపట్టణమునకు వెళ్ళిరి. అక్కడ ఉదయవనములో నాగేశ్వరరావుపంతులుగారితోను, శ్రీమతి గుమ్మడిదల దుర్గాబాయమ్మగారితోను కలసి సత్యాగ్రహశిబిరమును ఏర్పాటుచేసి మదరాసులోని సముద్రతీరమున ఉప్పుసత్యాగ్రహమును సాగించిరి. బళ్ళారినుండి డాక్టరు లక్ష్మీదేవి వచ్చి ఆ సత్యాగ్రహములో పాల్గొనెను. సి. రాజగోపాలాచారిగారు ఇతర తమిళ నాయకులు వేదారణ్యములో సత్యాగ్రహశిబిరము నేర్పాటుచేసి ఉప్పుసత్యాగ్రహమును సాగించిరి. శ్రీమతి ఆచంట రుక్మిణిలక్ష్మీపతిగా రచటికి వెళ్ళిరి. ఆమె మే నెల 15 వ తేదీన అరెస్టుఅయి ఒక సంవత్సరము శిక్ష విధింపబడి, రాయవేలూరులోని స్త్రీలజైలుకు పంపబడినది. 1930 ఉప్పుసత్యాగ్రహములో యావత్తుభారతదేశములోకూడ ప్రథమమున జైలుకుపంపబడిన వీరవనిత ఆమెయే. రాయలసీమ కాంగ్రెసువారు కల్లూరు సుబ్బారావుగారి నాయకత్వముక్రింద బళ్ళారిలో సత్యాగ్రహశిబిరము నేర్పాటుచేసి అక్కడి నుంచి సత్యాగ్రహమును సాగించిరి. ఇటులనే సత్యాగ్రహశిబిరము నేర్పాటు చేసి ఏప్రిలు రెండవవారములో విశాఖపట్టణములో ఉప్పుసత్యాగ్రహము చేసినందుకు తెన్నేటి విశ్వనాథం, మారేపల్లి రామచంద్రశాస్త్రిగారలను అరెస్టుచేసి ఒకసంవత్సరంశిక్షతో బరంపురముజైలుకు పంపిరి. నెల్లూరు జిల్లాలోని పల్లిపాడు ఆశ్రమములో వెన్నెలగంటి రాఘవయ్య, బెజవాడ గోపాలరెడ్డి, ఓరుగంటి వెంకటసుబ్బయ్య, బొమ్మా శేషరెడ్డి మొదలైన నాయకులక్రింద సత్యాగ్రహశిబిర మేర్పాటుగావింపబడెను. గోపాలరెడ్డిగారు అదివరకే రవీంద్రనాథటాగూరుగారి శాంతినికేతనమునందు తమ విద్యను పూర్తిచేసుకొని వచ్చియుండిరి. గంజాంజిల్లాలోని నవుపడావద్ద ఉన్నవ

రామలింగం, తాడూరు రామకృష్ణారావు, పుల్లెల శ్యామసుందరరావు, గొత్తు లచ్చన్న మొదలగు కాంగ్రెసువాదులు సత్యాగ్రహశిబిరముల నేర్పాటు చేసిరి.

(8)

నేను బెజవాడనుండి నందిగామ వచ్చి నందిగామతాలూకాలోని కొన్ని ముఖ్యమైనగ్రామములను సందర్శించితిని. నడచుటకు నాకు శక్తి చాలక బండిమీదనే వెళ్ళితిని. నాతోకూడ సత్యాగ్రహసైనికులు నడచి వచ్చిరి. వెళ్ళినగ్రామూ అన్నిటిలో ఉత్సవములతో మమ్ము సత్కరించిరి. ప్రతిచోట సత్యాగ్రహముచేయు శాంతిసైనికులు నాకు దొరికిరి. ఇప్పుడు పశ్చిమగోదావరి జిల్లాకలెక్టరుగానున్న రావులపాటి మధుసూదనరావు ఐ. ఎ. ఎస్. గా రపుడు నందిగామలో విద్యార్థిగనుండి నాక్రింద సత్యాగ్రహిగా చేరి బందరు వచ్చెను. రేపాల బుచ్చిరామశేషయ్యశ్రేష్ఠి, రామగోవిందశర్మ, వేదాంతం శంభుశాస్త్రి, డాక్టరు సుంకర సుబ్బారావు, డాక్టరు బసవరాజు, సాధు రామకృష్ణయ్య, దర్భా కృష్ణమూర్తి, మునగాల మునల్మాను యువకుడు, మొదలైన షుమారు అరువైమంది ధీరులు నాక్రింద సత్యాగ్రహులుగా చేరిరి. జగ్గయ్యపేట, నందిగామ గ్రామములలో గొప్ప బహిరంగసభలు, ఊరేగింపులుజరిపి, మోటారుబస్సులలో బెజవాడచేరితిమి. నందిగామనుంచి తీసుకొచ్చినటువంటిన్ని, బెజవాడలో నావద్దకు వచ్చినటు వంటిన్ని ఎనుబదిమంది సత్యాగ్రహులను బెజవాడనుంచి ఏప్రిలు 19వ తేదీ సాయంత్రం రైలులో తీసుకొని బందరుకు బయలుదేరితిమి. నేనపుడింకను మునిసిపలుచైర్మనుగ నుంటిని. రైలువేవారు నాకొక పెద్ద మూడవ క్లాసు బోగీ నిచ్చిరి. అందులో ఈ ఎనుబదిమంది సత్యాగ్రహులును కూర్చొని పాటలుపాడుచుండిరి, వాయిద్యములు వాయించుచుండిరి. మా బండికి జాతీయజెండాలను అన్నికిటికీలవద్ద తగిలించితిమి. మేము ప్రయాణముచేయుచుండగా ప్రతిస్టేషనులోను వందలకొలది జనులు మావద్దకువచ్చి విజయధ్వానములుచేసి వెళ్ళిరి. ఇంకా కొంతమంది సత్యాగ్రహులు త్రోవలో మాతో చేరిరి. అటుల వందమంది సత్యాగ్రహులతో ఆ రాత్రి బందరులో రైలుదిగగానే బందరువారు మాకు చక్కని అతిథ్యమునిచ్చిరి.

అచట సత్యాగ్రహులశిబిరములో బసచేసితిమి. బందరులో పురాణం సూరిశాస్త్రిగారిఇంటి కెదురుగనున్న వారిపాకలలో పెద్దపాకలో అయిదు వందలమంది సత్యాగ్రహులు నివసించి భోజనముచేయుచుండిరి. అక్కడనుంచి బయలుదేరి బందరుకు సమీపమున సముద్రతీరములోనుంచి ఉప్పును తీసుకొనివచ్చి ప్రజలకు పంచిపెట్టుటకు ఏర్పాట్లను కృష్ణాజిల్లా కాంగ్రెసుకమిటీవారు చేసిరి. ఒక పండితునిచేత ఉదయమున సాయంత్రము భగవద్గీతను బోధింపచేయుచుండిరి. గుంటూరుజిల్లా సత్యాగ్రహులుకూడ అచటనే చేరిరి. ఇతుల తూర్పుకృష్ణానుండి, పశ్చిమకృష్ణానుంచివచ్చిన సత్యాగ్రహులము మొత్తము నాలుగువందలమందిమిగా నున్నాము. అది వరకే 13వ తేదీన గంపలగూడెం కుమారరాజాగారితోవచ్చిన సత్యాగ్రహులు బందరుచేరి అక్కడనుంచి అయిదుమైళ్ల దూరమునయున్న చిన్నాపురంబోయి అచటిసముద్రతీరమున ఉప్పుఏరుకొనివచ్చి బందరులో గొప్ప బహిరంగ సభలో పంచిపెట్టిరి. వారిని అచట రెండు మూడు సభలుచేసినను జాతీయ జండాలతో కీర్తనలతో ఊరేగింపులు జరిపినను పోలీసువారు అరెస్టుచేయ నందున మూడు జట్లుగా చీలి కొన్ని రోజులు పల్లెలలోని గ్రామములలో సంచారముచేసి 17 వ తేదీకి బెజవాడ ఆంధ్రరత్నభవనమునకు చేరుకున్నారు. డాక్టరు వెలిదండ్ల హనుమంతరావుగారిజట్టు మేము బందరు వెళ్లువరకు బందరులోనే సభలు, ఊరేగింపులు చేయుచుండిరి. మేము బందరుచేరిన రాత్రి ఆ శిబిరములో భోజనముచేసి పరుండినాము. ఆ మరునాడు ఉదయమున కొంచెము ఫలహారముచేసి భగవద్గీత వినుటకు అందరు సత్యాగ్రహులము అచటి పందిరిలో సమావేశమైనాము. భగవద్గీతను వినుచుండగా పోలీసువారువచ్చి మాలో మొదటివారైయున్న చెరుకువాడ నరసింహంగారిని అరెస్టుచేసి బందరు సబుజైలుకు తీసుకొనిపోయిరి. నాడు ఆదివారము. క్రిందటి రాత్రి బెజవాడలో స్వామి నారాయణానంద సరస్వతిని (పింగళి లక్ష్మీనారాయణగారిని) అరెస్టుచేసి బందరు తీసుకొనివచ్చినట్లు వారు చెప్పిరి. పట్టాభి సీతారామయ్యగారు, ముడుమ్బూరి కృష్ణారావుగారు, నేనుకూడ కొంచెముసేపటికి వారిద్దరిని జైలులో చూచి వారికి కావలసిన సదుపాయములను కలుగచేయుటకై సబుజైలుకు పోతిమి. సబుజైలువద్ద అపుడున్న

మేజిస్ట్రేటు నాకు చాల పరిచయుడు. ఆయన నన్ను ఇవతలికి పిలిచి 'అన్నగారు, మిమ్ములను, పట్టాభి సీతారామయ్యగారిని రేపు ఉదయము అరెస్టుచేయుటకు కలెక్టరుగారు నిశ్చయించినారు. మీ వంట్లో బాగా వున్నదా ? మీరిద్దరు సిద్ధముగనున్నారని నమ్ముచున్నాను' అని నాతో చెప్పెను. మేమిద్దరము సిద్ధముగానే ఉన్నాము. జైలుకు పోవుటకే గత రాత్రి శాంతిపై నిరులను తీసుకొనివచ్చితినని నేను చెప్పినాను. ఈ సంగతి పట్టాభి సీతారామయ్యగారికి వెంటనే చెప్పినాను. ఆ సబుజైలులోనున్న ఇద్దరిని చూచి మేము కొంచెము ఇవతలికి వచ్చుచుండగా జిల్లాకలెక్టరు ఉజిలీగారు సబుజైలుకు వచ్చిరి. వారిని చూడకుండ తప్పించుకొని పోవలెనని నేను ప్రయత్నించితిని, కాని వారు నా కెదురువచ్చి "కాశేశ్వర రావుగారు ! బాగా ఉన్నారా ? మీ ఆరోగ్యము బాగుగా ఉన్నదా ?" అని కుశలప్రశ్నములనడుగగా, "బాగానే ఉన్నాను," అని చెపితిని. ఎప్పుడు వచ్చినారని వారు అడిగిరి. "క్రిందటి రాత్రి వచ్చినా"నని చెపితిని, "సరే మంచిది, సెలవు, రేపు మళ్ళీ మనము కలుసుకుందా"మని ఆయన నాతో చెప్పి వెళ్ళిపోయెను. నేను పట్టాభి సీతారామయ్యగారితో, "రేపు మనలను పట్టుకొని కలెక్టరుగారి ఎదుట హాజరుచేస్తారు. అందుకే కలెక్టరు గారు రేపు మరల కలుసుకుందాము అని అన్నారు." అని చెపితిని. ఆ రోజంతా సత్యాగ్రహశిబిరములోనే యుంటిమి. ఆ సాయంత్రము బందరులో జరిగిన గొప్ప బహిరంగసభలో పాల్గొంటిమి. భోజనముచేసి రాత్రి శాంతముగ నిద్రపోతిమి. మరునాడు ఉదయమున కాలినడకను సత్యాగ్రహు లనందరిని సముద్రతీరమునకుపోయి ఉప్పును తీసుకొనిరమ్మని పంపితిని. నేను, పట్టాభి సీతారామయ్యగారు చెరియొక కారులోనెక్కి సముద్రతీరమునకు పోయి ఉప్పును వసూలుచేసితిమి. పట్టాభి సీతారామయ్యగారు సముద్రతీర మునుంచి ఉప్పుతీసుకొని నాకంటె ముందుగ బయలుదేరి తమయింటికి వచ్చిరి. నేను వెనుక నా కారులో ఉప్పుతీసుకొని వచ్చుచుంటిని. కొందరు కాంగ్రెసుమిత్రులు చింతగుంటపాలెమువద్ద నన్ను కలిసి పట్టాభి సీతారా మయ్యగారిని పోలీసువారు అరెస్టుచేసినారని నాతో చెప్పిరి ఆవెంటనే నేనువచ్చి పట్టాభి సీతారామయ్యగారిఇంటివద్ద విచారించగా వారిని అరెస్టు

చేసి పోలీసువారు జైలుకు తీసుకొనిపోయిరని తెలిసినది. నేను శిబిరము వద్దకురాగానే అక్కడ నాకొరకు కనిపెట్టుకొనియున్న పోలీసుఇన్‌స్పెక్టరు, సబుఇన్‌స్పెక్టరు, కొంతమంది కానిస్టేబిలులు నన్ను కలిసిరి. నేను స్నానముచేసి భోజనముచేసి జైలుకువచ్చెదనని వారితో చెప్పగా వారు అంతవరకు నిరీక్షించిరి. నేను తొందరగా స్నానముచేసి, భోజనముచేసి కారులో ఎక్కి పోలీసువారితోకూడ తాలూకా కచేరీవద్దకు పోయినాను. అచట నొక డిప్యూటీకలెక్టరు ఆచార్యులుగారు పట్టాభి సీతారామయ్యగారికేసు విచారణ చేయుచుండిరి. నేను వచ్చినానని చెప్పగా నన్ను లోపలికి తీసుకొనివచ్చి కుర్చీమీద కూర్చుండబెట్టుమని ఆజ్ఞాపించిరి. నన్ను పోలీసువారు పట్టాభి సీతారామయ్యగారిప్రక్కన కుర్చీలో కూర్చొనబెట్టిరి. పట్టాభిగారికేసు విచారణ పూర్తియైనపిమ్మట నాకేసుకూడ విచారణచేసిరి. మే మిద్దరము క్రాసు పరీక్ష చేయలేదు. నేరమును ఒప్పుకున్నాము. ఇద్దరికి చెరియొకసంవత్సరము విడిజైదుశిక్ష విధించినామని మేజిస్ట్రీటు తీర్పుచెప్పెను. 'ఏ' క్లాసు నిచ్చినానని చెప్పెను. ఆరోజు బందరులోను, బెజవాడలోను పూర్తియైన హరతాళములు గొప్ప బహిరంగసభలు జరిగెను. నాకారుమీద మిత్రులను బెజవాడకుపంపి నా భార్య, మా అక్క, చెల్లెలు మొదలైన మా కుటుంబమువారిని బందరుకు పిలిపించితిమి. వారందరు కొన్ని ఊరగాయలు తీసుకొని ఆ సాయంత్రమునకు వచ్చిరి. నే నదివరకు నాతోకూడ జైలుకు తీసుకొనిపోదలచుకొన్న లాంతరును పళ్ళెమును చెంబును పుస్తకముల నన్నింటిని కూడానే తెచ్చుకొంటిని. జైలుమీద మావాళ్లున్నూ పట్టాభి సీతారామయ్యగారిభార్య, కూతురు, కుమాళ్ళు, పిల్లలందరుకూడ మమ్ములను సాగనంపిరి. మేజిస్ట్రీటుకచ్చేరివద్ద గుమిగూడియున్న వేలకొలది జనులతో శాంతియుతముగ సత్యాగ్రహముచెయ్యండి అని సందేశమునిచ్చి వెళ్ళినాము. మమ్ముల నిద్దరిని పోలీసులతో రాజమహేంద్రవరమునకు పంపినారు. అర్ధరాత్రివేళ రాజమహేంద్రవరము జైలుకు పోయినాము. అచట మమ్ములను క్వారంటైనులో పెట్టినారు. మరునాడుదయముననే మమ్ముల నిద్దరిని జైలులోపలికి తీసుకొనిపోయి ప్రవేశపెట్టినారు. అప్పటికే బులుసు సాంబమూర్తి, వెన్నేటి సత్యనారాయణ,

డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం, కళా వెంకట్రావుగార్లు రాజమహేంద్రవరముజైలులో పెట్టబడియుండిరి. చెరుకువాడ నరసింహంగారిని, నారాయణానందస్వాములవారిని కలెక్టరుగారు తామే విచారించి ఒకసంవత్సరము శిక్షవేసి మరునాడు రాజమహేంద్రవరము జైలుకు పంపిరి. అప్పటికి ఆంధ్రదేశమంతయు నొక గొప్ప స్వతంత్రసమర శిబిరముగ నున్నది. ఇకముందు చరిత్ర రెండవసంపుటములో వ్రాసెదను.

జై హింద్ !